# శతక వాఙ్మయ సర్వస్వము

## (ప్రథమ సంపుటము)

(౧౧౬౦–౧౮౬౦)

"శతకాలల్లినవారు క్షుద్రులనుచుఁ శాస్త్రజ్ఞులందురదిరా!
శతకాలల్లని యట్టికోవిదులహో! క్ష్మామండలిం గల్గిరే?
శతకాలల్లినవారు కారె? కన, 'ధూర్జట్యా'దు, లవ్వారి యా
యతకీర్తిం గొనియేమి కల్గినది దక్షారామ భీమేశ్వరా!"

('తెలుంగు నాటి కృతుల' నుండి).


గ్రంథకర్త:
విద్వత్కవిభూషణ
విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ

# గ్రంథోద్ధారకులు

"ద్యుమణి పద్మాకరము వికసముగఁ జేయుఁ,
గుముదహర్షంబుఁ గావించు నమృతసూతి,
యర్థితుఁడుగాక జలమిచ్చు నంబుధరుఁడు,
సజ్జనులు దారె పరహితాచరణమతులు"

విద్వాన్ శ్రీ మంకాల శ్రీపతిశాస్త్రిగారు, బి. ఏ., ఆంధ్రాధ్యాపకులు ఋషి.వాలీగురుకులము, బహుళగ్రంథ రచయితలు.

శ్రీ మోటుపల్లి రామానుజరావుగారు, ఎం. ఏ., రిజిస్ట్రారు, శ్రీ వేంకటేశ్వర స్థానికవిశ్వవిద్యాలయము, తిరుపతి.

పండిత—శ్రీ సామవేదము వేంకటశార్ఙ్గపాణిఅయ్యంగారువారు, శ్రీకృష్ణగాథాలహర్యాది గ్రంథకర్తలు, శ్రోత్రియందారులు, పామూరు.

శ్రీ కోసంగి సిద్ధేశ్వరప్రసాదుగారు, ఈశ్వరస్తుత్యాది గ్రంథకర్తలు, భూస్వాములు, కోడూరు—కడపజిల్లా.

అభినవతిక్కన—శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు, 'ఆత్మకథ'-పఱిగపంట—మున్నగు గ్రంథస్రష్టలు.

విద్వాన్ శ్రీ దాసరాజు రామరాజుగారు, ప్రధానాంధ్రాధ్యాపకులు, (ఉభయభాషాప్రవీణులు) — కోడూరు ఉన్నతపాఠశాల, కోడూరు—కడపజిల్లా.

విద్వాన్ శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారు B.O.L., లీలావత్యాద్యుద్గ్రంథ నిర్మాతలు, వావిళ్ల నిఘంటుసంకలనకర్తలు, ప్రధానాంధ్రాచార్యులు (థియొలాజికల్ హైస్కూలు)—, మదరాసు.

శ్రీ చమర్తి చెంగల్రాజుగారు, ప్రముఖ కాంగ్రెసునాయకులు, సారస్వత జిజ్ఞాసువులు, కోడూరు, కడపజిల్లా.

పండిత—సాహిత్యసరస్వతి—శ్రీ సీరిపి ఆంజనేయులుగారు (బహుళ గ్రంథకర్తలు : పత్రికా సంపాదకులు)—అనంతపురము.

quite scientific and throughout this work he brings into play his great erudition, critical acumen and balanced judgment. Sri Venkatakrishna Sarma's Sarvasvam is unique in several ways embodying as it does the results of his study of the texts of the Satakams in print and manuscript, parallelisms in thought and expression and local variations of language and idiom. The Sarvasvam in fact delights the mind and edifies the intellect.

In dealing with chronological problems Sri Venkatakrishna Sarma is not always quite happy. Though his conclusions are mostly acceptable, several misstatements of facts have crept into his work due mainly to his lack of acquintance with recent historical investigations. He follows for instance the late Kandukuri Viresalingam Pantulu in assigning Tenali Ramkrihna to the last quarter of the sixteenth and the beginning of the seventeenth centuries; but it has been recently shown by the late V. Prabhakara Sastri and others that he flourished at Vijayanagara in the time of Krishnadevaraya. Similarly his statement that due to the indifference of Achyutaraya that poets and men of learning abandoned the Vijayanagara court is effectively contradicted by contemporary evidence. More serious than these is his account of the three mythical kingdoms of Udayagiri, Srisaila, and Tundira. No such kingdoms ever existed, and the source from which Sri Venkatakrishna Sarma obtained this information is not known. Another mistake which appears to be the result of a misunderstanding of the introductory verses in the Gavi Ranganatha Satakam of Konda Rama Kavi, where the author declares that he composed the Satakam during the reign of Arviti Tirumalaraju ruling at Vijayanagara must also be noted. This Tirumalaraju has been identified with Tirumala, the younger brother of Aliya Ramaraju; and on the basis of this identification he has assigned Konda Rama Kavi to A.D. 1560-75. This date is untenable; for it is clearly stated in the title page of the Sataka that it was printed by the author himself in the Vyavaharatarangini press at Madras on 20th January 1878. The Tirumalaraju mentioned in the intro-

ductory verses of the Sataka could not have been Tirumala (A.D. 1570) but a much later prince of the family, very probably the father or the grand-father of the present zamindar of Anegundi. Errors such as these are few and far between; they do not materially affect Sri Venkatakrishna Sarma's chronological scheme and can be easily rectified in the next edition.

N. VENKATARAMANIAH.

# సమీక్ష

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు తేనెసోనలు, కుందమాల, భామినీవిలాసము, ఊరుభంగము మొదలయిన మేలికృతులు రచించి ఆంధ్రపాఠకలోకమున కిదివఱకే సుపరిచితులైనవారు. ఈ శతకవాఙ్మయ సర్వస్వము వారిప్పుడు ఆంధ్ర పాఠకలోకమునకు నూతనముగా సమర్పించు సమూల్యమైన కానుక.

తెలుగు వాఙ్మయములో మొన్నమొన్నటి వఱకు నిరాదృతి పాలయినది శతకము. రాజాదరణమునకు పాత్రమై గౌరవస్థానమును సంపాదించుకొన్నది కావ్యవాఙ్మయమే. ఈ కావ్యవాఙ్మయమునను అధికాదరగౌరవములకు పాత్రమయినది. ఒక్క చంపూకావ్యమే. గద్య పద్యాత్మకమయిన చంపూకావ్యమునకుగల గౌరవము ద్విపదకావ్యము నకుగాని, వచన కావ్యమునకుగాని లేకపోయినది. నాటకము, అనగా దృశ్యకావ్యమును ప్రాచీనాంధ్రకవులు దరికి చేరనీయలేదు. వారు సంస్కృత సాహిత్య మర్యాదలనే పాటించి సంస్కృత సాహిత్యమునే యొరవడిగా పెట్టుకొని తెలుగు సాహిత్యమును తీర్చి దిద్దుచు వచ్చినను సుప్రసిద్ధములైన సంస్కృతనాటకముల ననువదింపలేదు సరికదా, వాటినిగూడ రూపముమార్చి ఆంధ్రప్రబంధములుగనే వెలయించినారు. వారు సంస్కృత నాటకములను తెలుగులోని కేందువలన అనువదింప లేదో కారణము తెలియదు. సంస్కృత నాటకముల భాషాంతరీకరణ ములు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థములో కాని తెలుగులోనికి రాలేదు. ప్రాచీనాంధ్రకవులు ఏకారణముననయిననేమి సంస్కృత దృశ్యకావ్యములను ఆదరింపలేదు. ఆంధ్ర పద్య ప్రబంధకవికిగల గౌర వమునకు ద్విపద ప్రబంధకవికాని వచన ప్రబంధకవికాని నోచుకొన డయ్యెను. అందునను పద్యకావ్యమునకు తరువాత, ఇంకను ద్విపద కావ్యమునకయినను అంతో ఇంతో గౌరవ ముండెను కాని వచన కావ్య నిర్మాత కదియును శూన్యమే. ఈ కారణముచేతనే వచనకావ్యము ప్రథమాంధ్రకావ్యముగ తెలియవచ్చుచున్న ఆంధ్రమహాభారత మవత రించిన పిదప ఎన్నోవందల సంవత్సరములకుగాని తెలుగులో రూపొంద లేదు. పద్య ప్రబంధము కానీ, ద్విపద ప్రబంధము కానీ, గద్య ప్రబంధము కానీ—ప్రబంధకారుడే గొప్పవాడు. అందునను పద్య, ద్విపద ప్రబంధ ములు రచయించినవాడే కవి బిరుదమున కర్హత కలవాడు. ఏతత్ప్రబం

ధేతర ఆంధ్రరచనములు రచనములే కావు. పూర్వాంధ్రకవులలో ఇట్టి యభిప్రాయములు వ్యాపించుటవలననే శతకము కొందరైన శతక కృతులు చెప్పినప్పటికి వాటినిగురించి వారు ముఖ్యముగా చెప్పుకొని యుండలేదు సరికదా, వాటిని తమ ప్రబంధములలో ఉదాహరింపనైన నుదాహరింపలేదు, ఇదికూడ చెప్పుకోదగిన కృతులేనాయని. జక్కనకవి తన కృతిభర్త తండ్రియైన జన్నమంత్రి

> "పరమహృద్యంబైన పద్యశతంబున
> దేవకీతనయు విధేయుఁ జేసె"

యని చెప్పినాడు. ఈవిషయమైనను జక్కన తన కృతిపతిని ఆనందింపజేయుటకును, తన కృతిపతి వంశము ఘనతను తెలుపుటకును మాత్రమే చెప్పెను కాని అతనికయినను శతకముమీద ఆదరగౌరవము లుండి కాదు; ప్రబంధమునకే కాని శతకరచన కంతటి గణ్యతలేని కాలములో ఈశతకవిషయము నెత్తుకొని యుండడు. ఇంతకు ఆసిద్ధయ జన్నమంత్రి చేసిన శతకము కృష్ణునిమీద చెప్పినదని మాత్రమే తెలియును కాని యది కృష్ణశతకమో దేవకీనందన శతకమో తెలియదు. దేవకీనందన శతకమని మనకు తెలిసిన శతకము జన్నయ రచించినదే అని బల్లగ్రుద్ది చెప్పుట కవకాశము లేదు. ఈవిషయ మ టుండనిండు. చెప్ప వచ్చిన దేమన శతకమునకు తొలుతటి పూర్వాంధ్రకవులు ప్రాధాన్య మియ్యలే దనునదే. పదునాలుగవ శతాబ్దమువఱకు గల ఆంధ్ర ప్రబంధ కవులు శతకములు వ్రాయనే లేదో, వ్రాసినను అవి చెప్పుకోదగినవి కావని వాటి పేరయిన నెత్తలేదో తెలియదు. తుదకు కాళహస్తీశ్వర శతకమును రచించిన ట్లనుకొనుచున్న కాళహస్తీశ్వర మాహాత్మ్య కృతికర్త ధూర్జటికవికూడ తాను పైనుడివిన శతకమును రచించినట్లు చెప్పుకొనలేదు. దీని ననుసరించి చూడగా శతకకృతి చెప్పుకొనదగినంత ఘనమైనదిగా ప్రాచీన ప్రబంధకవు లెంచకుండనైన నుండవలెను; లేదా చేసిన కృతులు—అవి కొద్దివయిననేమి గొప్పవయిననేమి— అన్నిటిని పేర్కొను ఆచారమయిన లేకుండవలెను. ఆంధ్రలాక్షణికులు కూడ శతకమునకు తగిన గౌరవస్థానము నొసగలేదు. వారు దీనిని తక్కువతరగతి చాటు ప్రబంధములో జమకట్టిరి. ఈకారణముననే కావచ్చును, అర్వాచీన ప్రబంధకవులలోకూడ అనేకులు తాము రచిం

చిన శతకకృతులను స్వయముగ చెప్పుకొన్నవారు కాని, తమ కృతి పతులనోట చెప్పించినవారు కాని చాల అరుదు.

పూర్వాంధ్ర ప్రబంధకవుల దృష్టిలో శతకము పేరుపెట్టి పేర్కొనదగిన కృతి కాకపోయినను శతకవాఙ్మయము సంఖ్యలోను, కావ్యగుణములలోను, భావనాపటిమలోను, వైదుష్యసంపదలోను పద్య, ద్విపద ప్రబంధవాఙ్మయమున కేవిధమునను తీసిపోదు—ఇంకను ఒక్కింతి మొగ్గు చూపునేమో కాని. పద్యకావ్యము, ద్విపదకావ్యము చెప్పినవాడే కవిశబ్దవాచ్యత కర్హుడను అభిప్రాయము ఆంధ్ర గ్రంథకర్తల, పాఠకుల హృదయాలలో బాగుగా నాటుకొనిపోవుటవలన సాహిత్యవిమర్శకులు శతకములవంక తమ దృష్టి బరపలేదు ; ఆంధ్రకవి చరిత్రకారులుకూడ శతకకవులు—పేరు కాలము తెలిసిన వారినయినను—తమ చరిత్రలలోనికి ఎక్కింపలేదు. పండిత శ్రీ వంగూరి సుబ్బారావుగారు తమ శతకకవుల చరిత్రమును ప్రకటించువఱకు ఆంధ్రశతకకవులు, వారి చరిత్రములు ఆంధ్రపాఠకలోకమున కజ్ఞాతవిషయములే. సుమతి శతకము, భాస్కర శతకము, కృష్ణ శతకము, దాశరథీ శతకము, కాళహస్తీశ్వరశతకమువంటి ఏవో కొన్ని శతకములు ప్రజాదరమును చూఱగొన్నవ్వవి ; కాని వాటి కర్తలనుగుఱించి తెలిసినవారు కాని, చర్చించినవారు కాని అరుదే ; సుబ్బారావుగారికి పూర్వము లేరన్న నతిశయోక్తికాదు. శతకకవుల చరిత్రను వారు ప్రకటించువఱకు తెలుగు శతకకవు లంద ఱుండినట్లు కాని, ఆంధ్ర శతకవాఙ్మయము అంతటి విస్తృతమయినదని కాని చాలమందికి — పాఠకలోకమున కంతకు అన్నను తప్పులేదు— తెలియదు. ఏవో కొన్ని భక్తి శతకములును, శృంగార శతకములును, నీతిశతకములును మాత్రమే పూర్వమునుండి ప్రచారములో నుండెను. ఇవియైనను కడుపరిమితములు. పూర్వము తెలుగు దేశములోని వీథిబడులలో సుమతిశతకము, భాస్కరశతకము, దాశరథీశతకమువంటివి విద్యార్థులచేత కంఠస్థము చేయించువారు. ఈపద్ధతి చాల ప్రాచీనకాలమునుండి వచ్చుచుండెను. రాత్రి పరుండబోవునపుడు, ఉదయమున నిద్రనుండి లేచునపుడు ప్రదోషసమయమున దేవాలయముల కరిగినపుడు భక్తిశతకములలోని పద్యములను గ్రామీణులు—వృద్ధులు, యువతులుకూడ—పఠించుట ఆచారముగా ఉం

డెను. బ్రిటీషు ప్రభుత్వము దేశములో వేరు తన్నుకొన్న నాటినుండి విద్యావిధానపు మార్పుతో విద్యార్థులలో శతకములు కంఠస్థము చేయుటకు మొదలైనవి పోయినవి. అంతటితో అదివరకులో వాడుకలోనుండిన శతకములకుసయితము ఆదర, ప్రచారములు సన్నగిల్లినవి పాశ్చాత్యనాగరికతా విజృంభణముతో, బ్రిటీషు విద్యావిధాన ప్రాబల్యముతో. పరిస్థితుల మార్పుతో శతక మహాద్భుత వాఙ్మయములో చే పోయినది. మరల తెలుగు సాహితీపరుల, విమర్శకుల దృష్టి శతకముపై బడుటకు శతకకవిచరిత్ర ప్రకటన కాలమునుండియే మొదలు. శతకమునకు శిశిరర్తువనదగిన ఆ పాడుకాలములో శతకములను కొన్నో గొప్పో కాచి వాటి నాదరించుచు వచ్చినవారు ఆంగ్ల విద్యాగంధములేని గ్రామీణులే.

సాహిత్యమనగా ఒక్క కావ్యములే అను అభిప్రాయము మాఱి పోవుచున్న ఇటీవలి కాలములోనే, అంతా ఒక పాతికేండ్లనుండి, శతకములు, పదములు, పాటలు, యక్షగానములు మొదలైనవికూడ మనకున్న సాహితీసంపదలో గణింపదగినవేయని వాటినిగూడ వెలికి దీసి వాటి ప్రశస్తిని వెల్లడింపవలెనను ఆవేదన యువకతరములో బయలు దేరినది. పూర్వోక్త సాహిత్యరూపములను గుఱించి వెనుకటికంటె ఎక్కువగ కృషిజరుగుచుండుట సంతోషింపదగిన విషయము. వాఙ్మయమనగా ఒక్క ప్రబంధములే కాదనియు, వాఙ్మయ వృక్షమున ప్రబంధ మొక్కశాఖమాత్రమే యనియు, అందలి ఇతర శాఖలుకూడ సంపూర్ణశోభతో గోచరించినప్పుడే ఆంధ్రవాఙ్మయ కల్పవృక్షసౌందర్యము పూర్తిగా గోచరము కాగలదనియు ఇప్పుడిప్పుడు సాహితీపరులు, విమర్శకులు, చరిత్రకారులు గుర్తించుచున్నారు. ఈ గుర్తింపునకు ఫలితముగ వచ్చినదే ఈ శతకవాఙ్మయ సర్వస్వము.

సత్యమరసి చూడగా ప్రబంధముకంటెను శతకమే ఒకవిధముగా మేలికృతి అనవచ్చును ; ఏలన పద్య ద్విపద ప్రబంధములలో కథావస్తు వొక టుండుటచేత కవి స్వేచ్ఛగా, ధారాళముగా తన సొంతభావములను వెల్లడించుట కవకాశము లేదు ; కవికిని కృతికిని మధ్య కథ అడ్డుండును; శతకములలో అట్టిదేదియు నుండదు. శతకము ఆత్మకవితారీతికి చెందినది. ప్రబంధకవిత వస్తుపరమయినది. శతకము

లోని ప్రతిపద్యమును ఒకచాటువే; ఒక ఖండకృతే; వేరు వేరు విషయములమీద కవి చెప్పిన విడిపద్యముల సంచయము శతకము. మకుటబంధము కారణముగా ఈ వివిక్త పద్యసముచ్చయము శతకమయినది. అందువలన ప్రసిద్ధమయిన అడ్డమాకులులేని స్వాభిప్రాయ ప్రకటనమునకు శతక మాటపట్టు; కాని రసపరిపుష్టమైన కథాచిత్రణము లేని. మకుటబద్ధమయిన చాటుపద్యసంగ్రహ మగుటచేతనేమో సాహిత్యరంగమున శతకమునకు గణ్యస్థానము లేకపోయినది.

ఇంతవరకు మనకు తెలియవచ్చిన శతకముల ననుసరించి చూడగా భక్తిప్రధానమయిన శైవసంప్రదాయముతోనే శతక మాంధ్ర వాఙ్మయరంగమున నవతరించినట్లు కనిపించుచున్నది. శతకము నొక వాఙ్మయశాఖగా తెలుగులో పాదుకట్టిన విఖ్యాతి శివకవులది. నిజము చెప్పవలసి వచ్చినట్టయిన మొట్టమొదటి శతకము యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వరశతకమనే చెప్పవలెను. అయినను చరిత్రకారులు మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారమును శతకముగనే పరిగణించి శతకకవిత్వ ప్రాథమికగౌరవమును ఆయనకే ఇచ్చుచున్నారు. కానైతే 'శతకమన నొప్పు మఱి పద్యశతముగూడ'' అని తన కావ్యాలంకారచూడామణిలో విన్నకోట పెద్దన చెప్పెను కాని వెనుకటినుంచి వేమన శతకమువలె శతాధికపద్యములు కలదైనను అది శతకముగనే జమకట్టబడుచున్నది. శివతత్త్వసారమున శతకసామాన్యమై నిరాఘాతమయిన ఏకైకమకుట మేదియు లేదు—రుద్రా, అజా, మహేశా అను నేకార్థక సంబోధనలే కాని. దీనిని పరిష్కరించి ప్రకటించిన శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు ఇది శతకమనే చెప్పినారు. దీనికి కారణము పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోని

శతకంబు శివతత్త్వసార మాదిగను
గద్యపద్యంబు లాకాంక్షఁ జదువుచును

అన్న చరణములే. ఈచరణములలో చెప్పిన శతకము వేఱు, శివతత్త్వసారము వేఱు అనువారును ఉన్నారు. కాని మల్లికార్జున పండితారాధ్యులు రచియించిన వేఱు శతకము పేరు తెలియనందున శివతత్త్వసారమే యాశతకమని యూహించుటయే భావ్యమని తోచుచున్నది. పాల్కురికి

సోమనాథుని శతకము పేరు వేఱుగా చెప్పినచో ఈ పేరికి అవకాశమే లేకపోయెడిది. మల్లికార్జున పండిత విరచితమైన వేఱొకశతకము నాటినుంతవఱకు శివతత్త్వసారమే అయ్యె రచించిన శతకమని పొరబడుట అసంగతము కాదు. శతక మనాదృతిపాలయిన కాలములో శివతత్త్వసారము సమూల్యమయిన టీకతో ప్రకటించి శతకమునకును విలువగలదని మొట్టమొదట నిరూపించి చెప్పినవారు శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు.

శివతత్త్వసారముమాట ఎటు లున్నను సర్వేశ్వరశతకము తరువాతి చెప్పవలసినది పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకము. సోమనాథుడు యథావాక్కుల అన్నమయ్య తరువాతివాడు కాని కొందఱు భావించునట్లు పూర్వుడుకాడు. ఈవిషయమును గుఱించి యిచట చర్చించుటకాని, రాద్ధాంత సిద్ధాంతములు చేయుటకాని అనవసరము. ఏతద్గ్రంథకర్తలయిన శ్రీ వేంకట కృష్ణశర్మగారు ఈగ్రంథములో తగినంత చర్చ చేసియేయున్నారు. ఇంతకంటెను ఎక్కువగా మన్మిత్రులు డాక్టరు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు ఇంతవరకు వచ్చిన వాదప్రతివాదములను ఇంతవఱకు దొరకిన యాధారములతో కూలంకషముగ చర్చించి పాల్కురికి సోమనాథుని కాలమునుగురించి యొక చిన్న పుస్తకమును వ్రాసియున్నారు. అది యిప్పు డచ్చులో నున్నది. దానిని నేను చదివితిని. దానిలో వారు సోమనాథుడు క్రీ. శ. 1200 లు. అంతకు తరువాతివాడు అని సహేతుకముగా ఖండనదుస్సాధములైన ప్రమాణములతో రుజువుచేసియున్నారు. వారి హేతువులను కాని, వారు చూపిన ప్రమాణములను కాని ఇట నుటంకించుట పాడికాదు.

కొందఱు భక్తుల చరిత్రములు వర్ణించు సందర్భమున మల్లికార్జున పండితారాధ్యులు కొమారపాల ఘూర్జరు నిట్లు వర్ణించియున్నారు :

తన గుజ్జము సతులును బరి
జనులునుఁ దనతోడ రాఁగ శాశ్వతభక్తిన్
జనియె భవత్పురమునకు(ను)
గొనకొనఁగఁ గొమారపాల ఘూర్జరుఁడు శివా.

కొమారపాలుడు ఘూర్జర దేశాధిపతి. ఘూర్జరము నిప్పుడు గుజరాత్ అందురు. కొమారపాలునికి కుమారపాల ఘూర్జరుడనియు పేరు. ఇతడు కొంతకాలము జైనుడుగా నుండి జైనమును, మరికొంతకాలము శైవుడుగా నుండి శైవమును ఆదరించెను. ఈతని సోదర తనయుడైన అజయపాలు డీ కుమారపాలునికి విక్రమశకము 1229 లో, అనగా క్రీ. శ. 1172-73 లో విషముపెట్టి చంపించెను. పై పద్యములో పేర్కొనబడిన కొమారపాల ఘూర్జరు డితడే. ఈతనినిగురించి ఆవిధమయిన పద్యప్రథ కథ వ్యాప్తమగుటకు అతని మరణానంతరము కొంచెము కాలమయినను పట్టవలెనుకదా. ఇక మల్లికార్జున పండితారాధ్యునిచే శప్తుడయిన ధనదపురాధిపతి రెండవ వెలనాటిచోడ నృపతి శాసనములు క్రీ. శ. 1181 వఱకు కాన్పించుచున్నవి. ఈతని మరణానంతరమే పండితారాధ్యుడు తెలంగానాలోని పానుగంటికి వెళ్లెను. వీటినిబట్టి చూడగా పండితారాధ్యుడు 1181 కి ఇంకను కొన్ని సంవత్సరముల తరువాత వరకు, అనగా పండ్రెండవ శతాబ్దము చివరివరకు జీవించియుండినట్లు నిస్సంశయముగా చెప్పవచ్చును. మల్లికార్జున పండితారాధ్యునికి చాల కాలము తరువాత నుండినవాడు పాల్కురికి సోమనాథుడు. పాల్కురికి సోమనాథుని క్రీస్తుశకము 1190, 1260 సంవత్సరముల మధ్యకాలమున కెవ్వరెంత బలవంతముగ ఈడ్చుకొనిపోవ ప్రయత్నించినను అతడు రాడు; ఆ ప్రయత్నము వృథాప్రయాస.

ఇక బద్దెన అను భద్రభూపాలుని కాలమును, అతని సుమతిశతక కర్తృత్వవిషయమును వివాదాస్పదములయినవే. ఈబద్దెన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పినట్లు క్రీ.శ. 1070 నాటివాడని కాని, శ్రీ వంగూరి సుబ్బారావుగారు చెప్పినట్లు క్రీ. శ. 1003-1015 నాటివాడని కాని, శ్రీజయంతి రామయ్యపంతులుగారు వ్రాసినట్లు క్రీ.శ. 1261 నాటివాడని కాని నేను విశ్వసింపలేను. బద్దెననుగురించిన కాలనిర్ణయమునకు కొట్టివేయరాని సునిర్దిష్టప్రమాణ మేదియు నింతవరకు దొరకలేదు. సుమతిశతకము బద్దెన కృతియన్న విషయమునను నాకు సందేహమే.

అట్లే వేమన కాలమునుగురించి శ్రీ వేంకట కృష్ణశర్మగారితో నే నేకీభవింపలేనన్నవారు నన్ను మన్నింతురుగాక! వేమన క్రీస్తుశకము పదునేనవ శతాబ్దమువాడని విశ్వసించువాడను నేను.

మొత్తముమీద పదునాలుగవ శతాబ్దమునాటికే శతకము తెలుగుకవుల ఆదరాభిమానముల నందుకొనకపోయినను తెలుగు వాఙ్మయమున నిలద్రొక్కుకొని క్రమముగా అంతటినుండి వర్ధిల్లినది.

తెలుగులోని శతకవాఙ్మయము బండ్లకెత్తదగినంత అపారమయినది. భక్తిసంప్రదాయము తెలుగునాట ముమ్మరముగ వ్యాపించిన కాలములో అవతరించుటచేత శతకము ప్రప్రథమమున భక్తిరస ప్రధానమైనది. శివకవులు శతకమునుగూడ ద్విపదవలెనే భక్తి, మత ప్రచారముల కుపయోగించుకొన్నారు. తరువాత తదితరులు దీనిని చేపట్టినారు. మధురభక్తి మధుభరితములయిన చక్కని శతకములు క్రీస్తుశకము పదునాఱవ శతాబ్దములోను, అటుతరువాతను ఎన్నియో వచ్చినవి. కాలక్రమమున విషయవైవిధ్యాతివృత్తబహుళమై, రసాభ్యుదంచితమైన శతకసాహిత్యము ఆంధ్రవాఙ్మయ నందనారామములో నేత్రపర్వమొనరించు నొక మనోహర పుష్పవాటికా ఖండముగ భాసించినది.

శాపానుగ్రహశక్తియుక్తులగు పూర్వకవులు తమయధిపతులను, తమ కాశ్రయ మిచ్చినవారిని శపించుచు చెప్పిన శతకములు నున్నవి; అనుగ్రహించి వారిపై నాదరముతో చెప్పిన శతకములు నున్నవి. తెలుగు శతకములలో నీతు లున్నవి; బూతు లున్నవి. యోగ మున్నది; భోగ మున్నది ; భక్తి యున్నది. రక్తి యున్నది ; ఉపదేశ మున్నది, అపహాస్య మున్నది; ఇక రసములలో శృంగారమున్నది, కరుణమున్నది, హాస్య మున్నది, అద్భుత శాంతము లున్నవి. శబ్దార్థాలంకారములకు కొదవలేదు. అవి కొల్లలు. వ్యాజస్తుతి, వ్యాజనిందలతో గూడుకొన్న భక్తిశతకములు నున్నవి. వేదాంతము బోధించు శతకములు నున్నవి. శతకవాఙ్మయ మొకప్రత్యేక స్వతంత్రప్రపంచమే. దానిలో దొరకని సరకు లేదు ; లభించని రత్నములును లేవు. చిత్రకథా కల్పనము మినహాగా కావ్యలక్షణము లన్నియు తెలుగు శతకమున కుదురుకొన్నవి. శతకము కావ్యలక్షణములతో గూడిన చిన్న ప్రబంధము—నిజముగా చాటుప్రబంధమే యైనది. అది మహాప్రబంధలక్షణములను పుణికి పుచ్చుకొని మూడుమూర్తుల దాని ప్రతిబింబమయినది. క్రీస్తుశకము పదునారు, పదునేడు, పదునెన్మిది శతాబ్దములలోని ప్రబంధకవితా

లక్షణము లన్నియు శతకకవితకును పట్టినవి. తుదకు కొన్ని శతకములలో గర్భ, బంధకవిత్వములు సయితము కానవచ్చుచున్నవి.

శతకకవులుకూడ ప్రబంధకవులవలెనే కొన్ని సమయాచారములను పాటించినారు. సాధారణముగా విష్ణుపరములైన కృష్ణ రామ నృసింహాది శతకములలో దశావతారములు వర్ణించనివి లేవు ; ఆవిధముగానే త్రిపురాసుర సంహారమును వర్ణించని శైవపరములయిన శతకములును లేవు. భారత, భాగవత, రామాయణ, పురాణగాధలీశతకములద్వారా జనసామాన్యమున కందజేయబడినవి. ఇక శృంగారవర్ణనమున శతకకవులకు ప్రబంధకవులు పెట్టినదే భిక్ష. అయినను పదునారు, పదునేడు, పదునెన్మిది, పందొమ్మిది శతాబ్దములలో పాడినదే పాటగా, రోసినదే రోతగా ప్రబంధకవులు చేసిన అష్టాదశవర్ణనలతోను, అందునను మితిమీరిన సంభోగ శృంగారవర్ణనలతోను నిండిన సకల ప్రబంధములు చదివి చదివి విసువెత్తిన తెలుగు పాఠకులకు శతకములు కొంత మార్పు చూపి యానందానుభవమును కలిగించినవేమో మరి ఆకాలములోనే తెలుగులో శతకరచన విస్తరిల్లినది. పదునేడు, పదునెన్మిది, పందొమ్మిది శతాబ్దములలో వచ్చిన శతకములలో ఆ కాలమునాటి దేశస్థితిని, సంఘస్థితిని, సంస్థానాధీశులచర్యలను వర్ణించునవనేకములు. ఇవి చరిత్రకారునికి తెలుగు ప్రబంధములకంటెను అధిక ప్రయోజనకారులైనవి. శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు రచించిన ఆంధ్రుల సాంఘిక చరిత్రలో క్రీస్తుశకము 1600 ల నుండి 1857 వరకుగల తెలుగు సాంఘిక చరిత్రమును దెలుపుటకు ఈశతకములే చాలవఱకు ముఖ్యాధారములైనవి. ప్రాచీన రాజ్యవైభవము తొలగిపోయి సంస్థాన విస్తృతి సన్నగిల్లి దేశప్రభువుల అధికారము పరిమితమయిన పిదపకాలములో జమీాందారులు కొందఱు కవులవలననుండి ప్రబంధములకు బదులుగా శతకకృతులనే అర్థించినవారును గలరు. ఆకాలములో వారికి ప్రబంధముకంటెను తల్లక్షణములను సేకరించుకొన్న శతకమే వరణీయమైన సత్కృతియైనది.

శతకకవిత్వము శ్రీ వేంకటకృష్ణశర్మగారన్నట్లు ప్రబంధకవితకేవిధమునను తీసిపోదు. శతకములు రచించినవారిలో ప్రబంధనిర్మాతలునున్నారు. ప్రబంధములు రచియించని శతకకవులు వాటిని రచింపక

పోవుట కావ్యరచనా సామర్థ్యము లేక కాదు; వారికి ఆ ప్రవచనముపై అంత మోజు లేక పోవుటచే అనుకొనవలెను. అంతే ప్రబంధకవు లందఱు గట్టివారు కానట్లే శతకకవులలోను పిల్లకవులు, నీరసకవిత్వము చెప్పిన వారు కొందఱు లేకపోలేదు. అట్లని ప్రబంధకవుల నందరిని మెచ్చుకొనలేని విధముననే శతకకవు లందరిని పనికిరానివారని త్రోసిపార వేయలేము. ఈ గ్రంథములో శ్రీ వేంకటకృష్ణశర్మగారే శతకరచనా పరిశీలన చేసి ఎవరు సమర్థులైనవారో ఎవరికవిత్వము బాగున్నదో నిర్ణయించి చెప్పుచువచ్చినారు.

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు రచించిన ఈశతకవాఙ్మయ సర్వస్వము సర్వవిధముల శతకవాఙ్మయ సర్వస్వమే అని నిస్సందేహముగా నుడువవచ్చును. ఇటువంటి గ్రంథ మింతవఱకు తెలుగులో రాలేదన్న అది సత్యదూరము కాదు. శతకముల పేర్లతో కాక శతక కవి నామధాముల శీర్షికలతోనే విరచింపబడినప్పటికి ఇది కేవలము శతకకవుల చరిత్రము కాదు. శ్రీ వేంకటకృష్ణశర్మగారు శతకమును రచించిన కవికాలమునే కాక పాఠకునికి ఆశతకములోని కావ్య విశేషములను విడదీసి చూపి చూఱలిచ్చినారు; విశేషపరిశ్రమ చేసి శతకములోని పద్యములు ప్రసిద్ధకవికృతి సంస్కృతగ్రంథములలోని శ్లోకముల కెక్కడనైన అనువాదములుకాని, వాటి ఛాయలుకాని ఉన్నచో వాటిని చూపినారు; రచనలో శతకకవులు ప్రబంధకవుల ననుకరించిన అనుకరణములను చూపినారు; శతకకవులు శతకకవులనే అనుకరించిన పట్లు చూపినారు; ఒక్కొక్క శతకములో కవి తెలిపిన విషయములను విడదీసి సూచించినారు; ఆ యా శతకములలో ఆయాకవులు వాడిన తెలుగు పలుకుబళ్లు, జాతీయములు, సామెతలు, నుడికారపు సొంపులు, అన్యదేశ్యములు, విశిష్టపద ప్రయోగములు మొదలైనవి కొంతవఱకేరి విశదీకరించినారు; గర్భకవిత్వ చిత్రకవిత్వములకు ఉదాహరణము లిచ్చినారు; శతకగుణావగుణములను చక్కగ చర్చించినారు; శైలీ శబ్దార్థాలంకారములకు అనేకోదాహరణము లిచ్చినారు; ఇంతేందుకు, శతకము మనము చదువకుండగనే శతకస్వరూపము పూర్తిగా మన హృదయమునకు గోచరింపజేసినారు; అట్టిచో ఇది శతకవాఙ్మయ సర్వస్వ మనుటకు సందేహ మేమున్నది? ఈగ్రంథము సార్థకనామము.

ఒకొక్క శతకకవిని గురించి చదువుచున్నపుడు తత్కవి రచించిన శతక సౌందర్యావ సౌందర్యములు, ప్రాశస్త్యాప్రాశస్త్యములు మన మనస్సునకు తట్టి ఆకవిమీద. ఆ శతకముమీద ఇష్టమో అనిష్టమో, సుముఖతో విముఖతో కలుగుచుండును.

ఇంతవఱకు వచ్చిన ధూర్జటికృత కాళహస్తీశ్వర శతకము ప్రతులలోని పద్యములలోగల పాఠభేదములను విశేషశ్రమ చేసి శ్రీ వేంకటకృష్ణశర్మగారు చూపియున్నారు. ఇది గొప్పవిషయము. ఇట్లొక్క కాళహస్తీశ్వరశతకము విషయమున మాత్రమే కాదు. ఇంకను మఱి కొన్నిటివిషయమున జేసియున్నారు.

ధూర్జటి వేశ్యాలోలుడను విషయమును ఖండించుచు శ్రీ వేంకటకృష్ణశర్మగారు చాల వ్రాసియున్నారు. అంత ఎక్కువగ వ్రాయ వలసిన అవసరములేదేమో. ఎంతటి మహాభక్తులయినను ఎంతటి విద్వత్తిలకులయినను చిన్ననాటినుండి అట్లే యుండియుందురనియూహించ నక్కఱలేదు. ఇందుకు లీలాశుక, ఒడయనంబి చరిత్రములే తార్కాణము. అయితే కృష్ణదేవరాయల నిండోలగమున ఈవిధమయిన ప్రసంగము వచ్చియుండునాయన్నది వేఱువిషయము. ఇంతకు నిది గాథయే. తెలుగు కవులనుగుఱించి తలతోకలేని గాథ లిట్టి వనేకములున్నవి. అదియునుగాక ధూర్జటి ప్రవర్తనమును సమర్థించుటకు అల్లసాని పెద్దనను అగడుపఱుచుట అనవసరము. ఈసందర్భమున తెనాలి రామకృష్ణకవి శ్రీ వేంకటపతిరాయల (చంద్రగిరి) సమకాలికుడని వారు వ్రాసియున్నారు. ఇది సరికాదు. అతడును పదునారవశతాబ్ది ఉత్తరార్థమువాడే ; పెద్దనకు సమీపమువాడే ; ఇంచుమించుగ సమ కాలమువాడే.

కవిచౌడప్పను గుఱించి వ్రాయుచు శ్రీ వేంకటకృష్ణశర్మగారు 158 వ పుటలో చౌడప్ప తన కందపద్యములలో చెప్పిన మట్లు కుమారానంతభూపాలుడు కకుత్స్థ విజయకృతికర్తయైన మట్లు అనంతభూపాలుడే యని వ్రాసినారు ; ఇది సరికాదు. కకుత్స్థ విజయకృతికర్త అనంతభూపాలుడు వేఱు, కుమారానంత భూపాలుడు వేఱు. అనంత భూపాలునికి కుమారానంతభూపాలుడు మనుమడు ; తిరువెంగళనాథుని కుమారుడు. కుమారానంత భూపాలుడుకూడ తన తాతవలెనే గొప్ప పరాక్రమవంతుడు, బహుయుద్ధవిజేత. ఇతడును కవియే ; కుముద్వతీ

కల్యాణ ప్రబంధకర్త, అయితే ఈదోసగును శ్రీవేంకటకృష్ణశర్మగారే 174 వ పుటలో చిట్టచివర అథోజ్ఞాపికలో సవరించుకొన్నారు. పాఠకులు ముందు దానిని గమనించరని వారిదృష్టి నిటు త్రిప్పుటకే ఈవిషయము నిటు నుటంకించినాను.

శ్రీ వేంకటకృష్ణశర్మగారు ఆ యా సందర్భముల భాష, శృంగారము మొదలైన విషయములనుగుఱించి తమ యభిప్రాయములను దెలిపియున్నారు. అవి యమూల్యములయినవి ; ఏతద్గ్రంథమున కలంకారప్రాయములయినవి.

ఈశతకవాఙ్మయసర్వస్వమున నా కొక్కటే లోటు కనిపించుచున్నది. శ్రీశర్మగారీసర్వస్వమున శ్రీగోగులపాటి కూర్మకవి, ఏనుగు లక్ష్మణకవి, కాసుల పురుషోత్తమకవి మొదలైన ప్రశస్త శతకకర్తలను గుఱించి వ్రాయలే దెందువల్లనో. వీరి నీగ్రంథమున చేర్పకపోవుట విచారకరము. నీరసకవిత్వము చెప్పిన శతకకవుల నిందు చేర్చినపుడు చక్కని రసవత్కవిత్వము చెప్పిన అట్టి కవివర్యులను విడిచిపెట్టుట అంత సమంజసముగ కానరాదు. తెలుగు శతకము లన్నిటినిగుఱించి వ్రాసినప్పుడే ఇది నిజముగా శతకసర్వస్వ మనిపించుకొనును. పండిత శ్రీ వంగూరి సుబ్బారావుగారి శతకకవుల చరిత్రలోని కెక్కని శతక కవులనుగురించి మాత్రమే ఈసర్వస్వమున వ్రాసియున్నారేమో యన్న వారు పరామర్శించిన కవులనుగుఱించికూడ వీరు వ్రాసియున్నారు. లేదా ప్రశస్తశతకములు రచించిన వారినిగుఱించి వ్రాసినను అదొకతీరుగా నుండెడిది. అట్లునుగాక ఇట్లునుగాక ఎవరో కొందఱిని గుఱించి మాత్రమే వ్రాయుట సబబుకాదు ; శతకవాఙ్మయసర్వస్వమునకు సంపూర్ణతయు లేదు.

అచ్చుతప్పులు లేకుండ ఇంతటి పెద్దగ్రంథము నింత నిర్దుష్టముగ ప్రకటించుట గొప్పవిషయము. గ్రంథ మంతట వెదకి చూచినచో వ్రేళ్ల మీాద లెక్కపెట్ట దగినన్నికంటె ఎక్కువ తప్పులు లేవు. అవియైనను కడు సామాన్యమయినవి. ముఖ్యముగా సవరింపవలసినవి రెండే కలవు. పుట 215 లో "గుమిలి" అనుటకు "గూలిమి" అని పడినది ; పుట 160 లో "మాడుగుల" అనుటకు "మాడుగల్లు" అని పడినది.

శ్రీ వేంకటకృష్ణశర్మగారు ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయులుగా నుండి, చరిత్రపరిశోధనాత్మకమయిన, విమర్శనాత్మకమయిన ఇటువంటి గొప్ప గ్రంథమును రచించిరన్న, అది మెచ్చుకొనదగిన విషయము. ఇది వారి భాషాభిమానమునకు తార్కాణ ; వారి చరిత్ర పరిశోధనాదక్షతకు, విమర్శనాకౌశలమునకు గీటురాయి. వారుచెప్పిన చారిత్రక విషయములలోకూడ పొరపాటు లేవియు లేవు. ఎక్కడనైన నే యొకటి రెండయిన నున్నచో, అట్టి వంత గణింపదగినవి కావు; వాటివల్ల గ్రంథప్రశస్తికి భంగము వాటిల్లదు. ఇటువంటి ఉత్తమగ్రంథమును ఆంధ్రపాఠకలోకమునకు సమర్పించినందుకు వారు ఎంతయు అభినందనీయులు. వా రింకను ఇట్టి కృతులు రచించి సుకృతులు కావలెనని నాకోరిక.

పురశవాకం, మద్రాసు,<br>జయ, మార్గశీర్షము.

మల్లంపల్లి సోమశేఖరశర్మ.

# అవతారిక

శ్రీపతిశాస్త్రి రూపమున
 శ్రీపతియే యరుదెంచి "లెమ్ము నై
మిత్తపని కుద్యమింపు, తడ
 వేల యొనర్చెద"వంచు నన్నుఁ బ్రే
రేఁపుచు ముద్రణార్థమయి
 ప్రేమను బత్రములం గొనంగ సా
మ్మ్రపున నప్పుడే యొసఁగ
 నే నిటు గ్రంథము వెల్వరించితిన్ ॥

తొలి నా చేసిన పుణ్యకర్మ ఫలమో,
 తోరంపు భాగ్యప్రభా
వ లసత్ శ్రీకరుణాకటాక్షమొ యిటుల్
 భాషామహాదేవి నేఁ
గొలువం బూనితి, నీప్రయత్నము 'మహా
 కూపార మేతంబు నె
త్తి' లలిం దోఁచెడు, నైన మానుదునె య
 స్తోకస్వధర్మాదృతిన్ ?॥

మున్ను తెలుఁగు కావ్యములు సృజించినవారి
వ్రేళ్లమీఁద లెక్కపెట్టవచ్చుఁ
గాని, నూర్లకొలఁదిగా శతకముల ర
చించినట్టి కవుల నెంచఁదరమె ?॥

కావ్యములుం, బురాణము ల
 ఖండమతి ప్రతిభాతిరేక సం
స్తవ్య విపశ్చిదగ్రణుల
 స్వాంతము రంజిల వ్రాసినట్టి స
త్కావ్యములప్రసిద్ధ చరి
 తంబులుఁ వాకొనవచ్చుఁ గాని, సం
భావ్యమె యట్టు లీశతక
 వర్గ కవీంద్రులఁగూర్చి చెప్పఁగన్ ?॥

ఒండా ? రెండా ? మూఁడా ?
బండెడు శతకములు దెనుఁగుబాసఁ గలవయా !
పండితులదృష్టి కందొ
క్కండేనియు నెక్కలేని కారణమేమో ?॥

నను మించంగల పండితాగ్రణులు పూ
నం బాత్రిమహాకార్య, మే
ననుమానింపక సల్పనెంచు, టపహా
స్యంబే యటం చెంచియున్,
'మనముం జేయుద మేదియో యొకటి' యన్,
భావంబు ప్రేరేప, నా
సను జేపట్టితి, నిట్టు లీశతక వా
క్చారిత్ర నిర్మాణమున్ ॥

సాహిత్యమ్ము మహాశక్తి, ప్రాక్చరిత వి
జ్ఞానమ్ము శూన్యంబు, ప్ర
త్యూహానీకము మెండు, దైవబల మెం
దు న్నాస్తి, ప్రాప్తార్థ సం
దోహమ్మల్పము, శారదాంబ యడుగుం
దోయిం బ్రసేవింప నె
ట్లోహాం గాంతు మదిం, గృతార్థజను, వే
నేరీతిం గందుం గటా !

ధీమసము, పట్టుదల, గుణి, తెగువ, సత్తి,
యనెడు నైషును. దోడులై యమర, రక్తిఁ
బూనితి శతకశోధన మేను, శక్తి
కొలఁది సలుపఁగఁ బండితు ల్గానముఁ గొనుఁడు.



# ప్రార్థనము

కోటివచ్చునుగాక, మోమోటలేని,
సరసతయెలేని. యౌదార్యసరణిలేని
వాక్సతిం బ్రీతిఁగనని దౌర్భాగ్యులిండ్ల
నన్ను పడిగాపు సేయకు కన్నతల్లి !

## కృతి సమర్పణము

శ్రీధర ! నీకృపామృత ని
రీక్షణ రోచుల కర్హుఁడైన దు
ర్మేధసుఁడేని భారతికిఁ
బ్రీతిని గూర్చెడు బిడ్డఁడై, బుధా
రాధితకావ్యనిర్మితి ని
రంతరముం బచరించి, పేర్మి వి
ద్యాధనగౌరవంబు లజ
రామర సద్యశమంది రాజిలుర్ ॥

శతక వాఙ్మయరమను నాసుతను, దీని,
నతులితప్రేమ, నైదవసతిగ నొసఁగి
యతికృతార్థుఁడనైతి, నీప్రతినరుండు
వెతికినను నెందుదొరకునే ? వేంకటేశ !॥

'భామినీవిలాస' బహువిధసంచారి,
'కుందమాల'ధారి, కుత్సితారి
గణ మ'దోరుభంగ'కారి. మధువిసారి
'సోన' లాను శౌరి, సుఖవిహారి ॥

హరిగుణాలంకారా !
మారమణీచిత్తచోర ! మహిమోదారా !
కారుణ్యరసాసారా !
కూరిమి నానతులతోడఁ గొను మీకృతిన్ ॥

# కృతజ్ఞత

నా శతకవాఙ్మయసముద్ధరణాభిలాష యీనాఁటిదికాదు. దాదాపు పదేండ్ల నాఁటిది. తదాశయసాఫల్యమునకు నేనెంత యుబలాటపడుచుండినను ఇంతదనుక సదవకాశము లభించినదికాదు. యత్నించునప్పుడెల్ల నేదియోయొక యాటంకము. అంతతో నిరుత్సాహము. అప్పటి కుద్యమవిరమణము. తుదకు నాజీవితమున నీమనోరథము నెఱవేఱకయేపోవునో యని శంకాకుల మానసుఁడనగుచుండిన దినములు లేకపోలేదు. ఎట్లో యాంధ్రభారతీదేవి నాపై ననుగ్రహించినది. నావరివస్య నంగీకరించినది. శ్రీధరరావుగారి బాసట గల్పించినది. 'మాతృసేవ'ను జూపినది. ఇఁకేమి ? కొండంతబలము చేకూరినది. కార్యమున కుపక్రమించితిని. తెప్పున ప్రతివారము "శతకవాఙ్మయ" వ్యాసములు మా పత్రికామతల్లి ప్రచురింప దొరకొన్నది. నాయుత్సాహము మిన్నుముట్టినది.

ప్రాచీనార్వాచీనశతకములు సేకరింపఁగడంగి నాయభిప్రాయమును—'స్వతంత్ర'—'కిన్నెర'—'త్రిలిఙ్గ'—'గృహలక్ష్మి'—మున్నగు పెక్కుపత్రికలలోఁ బ్రకటింపఁ జేసితిని. తెలుఁగునాఁటి నాలుగుచెఱఁగులనుండి పుంఖానుపుంఖములుగ శతకములు వచ్చినవి. ఇంకను వచ్చుచున్నవి. ఇవన్నియు 'సర్వస్వ' సంపుటములకెక్కఁ దగినవిగనే తోఁచుచున్నవి.

దిని 'సర్వస్వ' మనుటలో విశేషములేకపోలేదు. తెలుఁగునాఁటి సంప్రదాయములు, సాంఘికవ్యవస్థలు, రాచఱికములు, నాగరికతావైఖరులు, సారస్వతమార్గములు క్రమక్రమముగ నెప్పటికప్పుడే యేతీరున మాఱుపాటులు పొందుచుండినవో తెలియఁజేయునట్టి శతకములలో—ఆ యా దేశకాలపాత్రానుగుణములగు తెలుఁగునాఁటి పలుకుబళ్లు, నానుడులు, సామెతలు, జాతీయములు, సాంకేతికములు, అన్యదేశ్యములు—తిక్కన్నలెట్లుపయోగించిరో, తెలుఁగుజాతి ప్రత్యేక వ్యక్తిత్వమున కవి యేరీతిఁ దార్కాణములగుచున్నవో, సాధ్యమయినంతవఱకిందు దర్పణమునందుంబలెఁ బ్రతిఫలింపఁజేయఁ బ్రయత్నించితి.

శ్రీవంగూరు సుబ్బారావుగారు నిర్మించిన శతకకవుల చరిత్రమను కాలిబాటయే, నాయీ 'సర్వస్వ'మను రహదారికాధారము. వారు క్రీ. శ. 1150–1500 వఱకుఁ బదిమంది కవులయు, 1500–1600 వఱకుఁ బదునెనిమిదిగురు కవులయు, 1600–1800 వఱకు నలుబదియేడుగురు కవులయు, 1800–1900 వఱకు నూటిరువదియైదుగురు కవులయుఁ జరిత్రములు సంగ్రహముగ వ్రాసిరి. వారాగ్రంథము రచియించునాఁటి కుపలబ్ధములయిన శతకకర్తల చరిత్రములవియే యని యూహింపఁ దగియున్నది. కాని, 1800 నుండి 1900 వందలవఱకు 250 శతకములకుఁబైఁగనే యుప్పతిల్లినవి. ఇఁక 1900–1950 మధ్యను 300 శతకములు బయలువెడలినట్లు, నాకు లభించిన—లభించుచున్న శతకములంబట్టి యూహించుచున్నాను. ప్రతికవి కందుబాటులో అనుకొన్నదే తడవుగ, ఆశువుగఁ జెప్పవీలయిన కృతి శతకమేయగుట యందులకుఁ గారణమనవచ్చును.

శతకకవుల చరిత్రములో :—(1) సంగ్రహములని తోఁచిన యొక కొందఱు కవులచరిత్రములు విపులీకరించితిని. (2) అసంబద్ధములని యెంచిన కొందఱిచరిత్రాంశములు (కాలక్రమాదికములలోనేగాక తక్కిన విషయములలోను) సకారణములుగ విమర్శించితిని. (3) సుబ్బారావుగారి కక్కాలమున దొరకిన బహుళ శతకకర్తృశతక మొండుమాత్రమే సూచింపఁబడ, తక్కినవానింగూడ సంపాదించి యిందు వానింగూడ సమీక్షించితి. (4) చాలవఱకుఁ గొందఱిచరిత్రములు సమగ్రములని తోఁచినవి. అట్టివాని చర్వితచర్వణములుగఁ జెప్పనిచ్చలేక మానితిని. ఇంకను, ఈరెంటికి (శతకకవులచరిత్రమునకును, సర్వస్వమునకును) గల తారతమ్యములకుఁ జదువరులే ప్రమాణము.

ప్రకృతమాంధ్రచారిత్రక గగనాంగణ వీథిం బ్రకాశించు లోకబాంధవసుధాంశులు, పూజ్యులు, శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు; శ్రీడాక్టరు నేలటూరు వేంకటరమణయ్య ఎం. ఏ. గారు, నాకీసర్వస్వనిర్మాణ ప్రయత్నమునఁ జాలవఱకుఁ బ్రామాణికులు. అందుఁ బ్రథములు ప్రత్యక్షముగ, మఱి ద్వితీయులు పరోక్షముగ. ఏసంశయమేని, ఏ సమయమున నేనడిగినంతనే విసుగు విరామమనునది యెఱుంగక నిష్కపటముగ హృదయమున నున్నవిషయమును విప్పిచెప్పఁగల శ్రీశర్మగారి సుహృద్భావము నేనెన్నఁటికిని మఱువఁజాలను. ఈశ్రేణిని జేరినవారే, నాకాప్తమిత్రులగు శ్రీ ఆండ్ర శేషగిరిరావు (బి. ఏ.) గారును. శ్రీడాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారితోడి పరిచయము నాకుఁ బ్రత్యక్షముగ లేమి, వార వెల్గోటివారి వంశచరిత్రాదులు, భారత్యాది సంచికలలోని యపూర్వవ్యాసములు, మున్నగు వానినుండి నేనెన్నియో విషయములు గ్రహించితి; అబ్బో ! అవెక్కడివ్యాసములు ? చారిత్రకనిధులుగాని !

పూర్వాంధ్ర చరిత్రకారులకును, నేఁడు మనభాగధేయాధిక్యమున మనమధ్య వెలయు మహాశయులకును మనయాంధ్రప్రపంచమెంతయు ఋణపడియున్నది. చారిత్రక పరిశోధనాస్థగల యువకులు పెక్కురు నేఁడు బయలువెడలుచున్నారు. కాని, వారు తమ్మాశ్రయించినపుడు వారిసంశయములు నివారింపఁదగు సరకు తమకడనుండియు, వారిని బ్రోత్సహింతమను నుద్దేశములేక యేరవంత తాము బయటపెట్టినను దమకాణాచిముల్లెలు కొల్లవోవు ననుకొనువారు, పుటలకుఁ బుటలువ్రాసి దాఁచుకొన్న విషయములు తుదకుఁ జెత్తదిబ్బలపాలగుటకయిన నోర్తురు ; కాని, ఏపత్రికాముఖముననైన బయలు పెట్టుదమను మహదాశయము, విశాలహృదయము వారి కుండదనుట మనమెఱుంగనిది కాదు. ఈవిషయమున మనమింకను పాశ్చాత్య పరిశోధకులకడ నేర్వఁదగు విషయములు పెక్కులుగలవు.

'మాతృసేవ'—లోని నాశతకవాఙ్మయ వ్యాసములన్నియుఁ దొలుదొల్త వ్యావహారికముననే సాగించితిని. వానినన్నింటిని నట్లే ప్రచురింతమా, లేక, సలక్షణభాషలోని కెత్తివ్రాయుదమా, యను జిజ్ఞాస ఒకరాగాన నాకుఁ దీఱినదికాదు. గొప్ప విద్వాంసులను భాషాభిజ్ఞుల ననేకులను సంప్రతించితిని. పెక్కురు సలక్షణభాషకుఁ, గొం

దఱుమాత్రము వ్యవహారభాషను సమ్మతిం జూపిరి. బహుళవిద్వదంగీకృత మార్గమే గ్రాహ్యమని, తుదకు సలక్షణభాషలోనే వ్రాయుట సమంజసమని తోఁచినది. కాని, యీపనికించుక బద్ధకించితిని. పిష్టపేషణము నాస్వభావమునకు దూరమయినదగుట, నా సహాంధ్రోపాధ్యాయుఁడు చిరంజీవి విద్వాన్ శ్రీహనుమనగుప్తి రాధాకృష్ణయ్య కాపని యప్పగించితిని. అతఁడు ఓపికమెయి నీకార్యభారము బయివేసికొనెను. కాని, అతని వ్రాఁత, పునఃపరిశీలనశ్రమ మొండొకటి నాకధికముగఁ గల్పించెను. అయిన, నది నా దోషమే. వ్యావహారికమున నేనుపయోగించిన శబ్దము సలక్షణమో, కాదో నిర్ణయించు సామర్థ్యమతనికిఁ జాలకుండెను. అట్లును దెలిసికొనుచు వేమనచరిత్రమువఱ కతఁడు సాగించి, సెలవులకు స్వగ్రామమున కరిగెను. అట్టియెడ, నాకనిష్ఠసోదరుఁడు చి॥ విద్వాన్ చంద్రశేఖరయ్య తానిది పూర్తిచేసి యిచ్చెదనని దాదాపు వ్రాఁతలో 500 పుటలవఱకు (అనఁగా) ఇంతదనుక సలక్షణభాషలో వ్రాసి, యేనాఁటి కానాఁడు ముద్రణమున కందిచ్చుచువచ్చెను. ఇంకను అతని యీలేఖనభారము కొఱవడలేదు. ఈ చిరంజీవు లిరువురకును బరమేశ్వరుఁడాయురారోగ్యభాగ్యములు చిర మొసంగుఁగాక !

సుప్రసిద్ధ చిత్రకారుఁడును నాబావమఱఁదియునగు చి॥ శ్రీ కోడూరు రామమూర్తి గ్రంథమున కలంకారప్రాయములుగ రెండు కళాఖండముల నభ్యర్థించిన వెంటనే చిత్రించి యొసంగినందులకు అతనికి కృతజ్ఞతతో నా హృదయపూర్వ కాశీశ్శతములు చెల్లింతును.

నారచనా సందర్భములలో నెప్పుడే యపూర్వగ్రంథము గావలసినను అదియెందున్నను సాధించి తెచ్చి యొసంగుచుండిన నా చిరమిత్రులును, లీలావత్యాది గ్రంథ రచయితలును వావిళ్లనిఘంటు నిర్మాతలునగు శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రి గారికిని ఈగ్రంథమును సాంతముగఁ జూచి, గుణదోషములు రెంటింగూడఁ నిష్పాక్షికముగఁ జర్చించుచు, విపులముగ పీఠికాదులు వ్రాసియొసంగిన మాననీయులు శ్రీడాక్టరు నేలటూరు వేంకటరమణయ్య, ఎం. ఏ. గారికి, చారిత్రక పితామహులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారికిని నాహృదయపూర్వకకృతజ్ఞతాభివందనములు సమర్పించుచున్నాఁడను. వీరందు సూచించిన చారిత్రక పరిశోధనాంశములలోని విభిన్నాభిప్రాయములం గూర్చిన 'తబ్దీలు'—ఇంకను బరిశోధనావశ్యకములయినను, ఆరంగమున నిరంతరకృషి యొనర్చుచున్న చరిత్రజ్ఞుల స్థిరసిద్ధాంతములు సప్రామాణికములగుట నాకు శిరోధార్యములే; కావున, మున్ముందు వెలువడఁబోవు సంపుటములలో—అనుబంధముక్రింద వానింగూర్చి పాఠకమహాశయులకుఁ దెలిపికొందును.

మదరాసు,
జయ. విజయదశమి.

ఇట్లు,
వేదము. వేంకటకృష్ణశర్మ.

# శతకవాఙ్మయ సర్వస్వము

విషయానుక్రమణిక

# మల్లికార్జున పండితారాధ్యులు

(ప్రథమాంధ్రశతక స్వరూప నిర్మాత)

(క్రీ. శ. —1160 ప్రాంతము)

—॥—

పండితారాధ్యుల జీవితము

ఆంధ్రదేశమున — 'వీరశైవాచారము'ను బ్రచారమునకుఁ దెచ్చినవారిలోఁ బండితారాధ్యులే మొదటివాఁడని చెప్పఁదగును. ఇతనికిఁ బూర్వమే, కొందఱు శైవాచారము నవలంబించియుండినను, అది విశేషప్రాబల్యము నందినది, ఈమహనీయుని మూలముననే. కావున నితని 'శివతత్త్వసారము' ను గూర్చి విమర్శించుటకుముందు, ఇతని జీవితవిశేషముల నొక్కింత తెలిసికొను టవసరము గాకపోదు.

గోదావరీమండలమందలి దక్షారామ భీమేశ్వర సన్నిధిని బురోహితుఁడును, ఋగ్వేదియు నయిన భీమనపండితునకును గౌరాంబకును మన పండితారాధ్యులు వరప్రసాది యగు కుమారుఁడు. వీరిది 'గౌతమగోత్ర' మని శ్రీలక్ష్మణరావుగారును, 'వానసవంశ'—మని శ్రీ చిలుకూరి నారాయణరావుగారును నిర్ణయించినారు. భీమన పుత్రార్థియై శ్రీశైల మల్లికార్జునదేవుని సన్నిధానమున శివపంచాక్షరీ మంత్రము పురశ్చరణ మొనర్చుటచేఁ, దత్ఫలితముగఁ బండితారాధ్యులు జన్మించెననియు, నేతత్కారణముననే యతనికి 'మల్లికార్జునుఁ' డని తలిదండ్రులు నామకరణము చేసిరనియుఁ, దెలియుచున్నది. పండితుఁడు చిన్నతనమునఁ దనగ్రామమున కనతి దూరమందలి 'కోటిపల్లి' లో నుండిన 'యారాధ్యదేవుఁ'డను వీరశైవాచార పరాయణు నాశ్రయించి, సమస్తవిద్యలలోఁ బ్రావీణ్య మునార్జించుటయ గాక, యాతని యనుగ్రహముచే శైవదీక్షవహించెను. అప్పటి నుండి పండితారాధ్యులు శైవాగమరహస్యములను బూర్తిగ గ్రహించి, తదనుసారము వర్తించుచుండ, నచటిబ్రాహ్మణులు విభూతి రుద్రాక్ష లింగధారణములతో 'బూడిదెబుస్సన' వలె నున్న యీ ప్రతిభావంతుని వాలకము నాక్షేపించిరఁట! వారి కపుడు మనపండి

తుఁడు, విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, లింగార్చనామహిమ, ప్రసాదస్వీకారమహిమ, గురుపాదోదకమహిమ — మున్నగువానిం గూర్చి బోధించి, ఘంటాకర్ణాది భక్తులకథలు వివరించి, నోరెత్తకుండఁ జేసెనఁట!

ఈపండితుని ప్రభావము విని చూడవచ్చిన పోరండ్ల సురసానమ్మ, బెడ్దేవి వేమనారాధ్యుఁడు మొదలగువారిరాక విని, తాఁ జేయుచున్న శివపూజ చాలించి, వచ్చి 'జంగములు లింగరూపులు; వారి నర్చించుట లింగార్చనముకంటె శ్రేష్ఠమయిన'—దని వారిని సత్కరించెను. అట్టియెడ సురసానమ్మ పండితారాధ్యులకు బసవేశ్వరుని మహిమంగూర్చియు, నతని భక్తజనప్రభావమును గూర్చియు నివేదించెను.

పండితారాధ్యులు తన శిష్యవర్గముతోఁ గూడ యాత్రార్థము శ్రీశైలమున కేఁగుచు, మార్గమధ్యమున 'ధనదుప్రోలు' [1] (చందవోలు)—అను గ్రామమును జేరెను. అది వెలనాటి రాజుల రాజధాని. ఆకాలమున వెలనాటి (రెండవ) చోడరాజు రాజ్యముచేయుచుండెను. పండితుఁ డాగ్రామమందలి ప్రజలకు శైవమతమునుగూర్చి బోధించుచుండ, రాజగురువగు బౌద్ధపద పదాచార్యుఁడు సహింపక, రాజుతోఁ జెప్పి, గొప్పసభచేసి పండితారాధ్యులను వాదమునకుఁ బిలిపించెను. అతఁ డపుడు బౌద్ధమతము నేకాక, తక్కిన మతములనుగూడఁ, దన పాండిత్య ప్రతిభా ప్రభావమున ఖండించి, శైవమతమును స్థాపించెను. పైఁగా, దానింగూర్చి విపులముగ నుపన్యసించి, 'శివుని మించిన దేవుఁ డున్నాఁ'—డని నుడువు 'పాపాత్ముని శిరస్సును దనకాలితోఁ దన్నెద'—నని—ప్రతిజ్ఞఁ గావించెను. పండితారాధ్యుల వాదమునకు సభ్యు లెంతయు హర్షించిరి. బౌద్ధపరివ్రాజకుఁడు, మాఱునలుక నేరమి దురాగ్రహ పిశాచ గ్రస్తుఁడై యసహనమునఁ దన నోటి కసి దీఱ, నతని నిందించుచు సభవిడిచి లేచిపోయెను.

---

1. ఇది గుంటూరుజిల్లా తెనాలితాలూకాలోనిదని శ్రీ లక్ష్మణరావుగా రన్నారు. కాని, విశాఖపట్టణ మండలములోనిదని—తగిన యాధారములతో శ్రీ నేలటూరు వేంకటరమణయ్య—మల్లంపల్లి సోమశేఖరశర్మ 'భారతి'—లోఁ బ్రకటించిరి.

తమగురువును బౌద్ధుఁడట్లు నిందింప, విని పండితునిశిష్యులు సైఁపఁజాలకుండిరి. వారిలో రేమయ్య, దేవయ్య—యను వార లాబౌద్ధభిక్షువును వధింపఁ గృతనిశ్చయులయి, యతఁ డేకాంతముగఁ బూజించు బౌద్ధవిగ్రహముగల సముద్రపులంకలోని దేవాలయమున కొకనాఁటి సాయంతనము (అతఁడక్కడకు వచ్చుటకు ముందే) పోయి, విగ్రహమునకు వెనుక దాఁగియుండిరి. సాయంసమయ పూజార్థము—బౌద్ధగురువు దేవాలయముం బ్రవేశింపఁగనే, వారిరువు రతనిపైఁ బడి చంపివైచిరి. ఈవిషయమును రాజెఱింగి, మండిపడి, పండితారాధ్యులను బిలిచి యడుగఁగా, "నేనే యాబౌద్ధుఁ జంపించితిని. ఆదోషము నాదే"—యని యానేరముఁ దనపయి మోపుకొనెను.

అంతట, రాజాతని నయనగోళముల నూడఁబెఱికించెను. పండితారాధ్యు లప్పుడాఱేనికి శాపంబిడి, యటనుండి శిష్యవర్గముతోఁ గూడ నమరావతికిఁ దఱలిపోయెను. [1] ఇందలి సత్యాసత్యము లెట్లున్నను, వెలనాటి రెండవచోడరాజునకుఁ దరువాత, నతనివంశమువారు, 25, 30 ఏండ్లకంటె నెక్కువకాలము రాజ్య మొనర్పలేదనుటకుఁ జరిత్రాధారములు గలవు.

పై కథనే మఱొకవిధముగా చందవోలు కైఫియత్తు చెప్పుచున్నదని శ్రీ లక్ష్మణరావుగారు 'శివతత్త్వసార' పీఠికలో నిట్లు వ్రాసొనుచున్నారు :—

"పండితారాధ్యులు శ్రీశైలమునకుఁ బోవుచు, చందవోలునకు వెడలి, పాండీశ్వరస్వామి గుడిలో దిగెను. కొండపడమట, బుద్ధరాజు (చోడుని బావమఱఁది) గురువైన బౌద్ధుఁడు, 'బుద్ధాం'—అను గ్రామమం దుండెను. వాఁడు పండితుని మహిమను జూచి, యోర్వలేక పోయెను. పండితుని ప్రతిదిన శివపూజలోఁ గావలసిన యొకపూజాపాత్రను, బౌద్ధుని శిష్యుఁడయిన 'బెజుఁ' డనువాఁడు ఎత్తుకొని పోయెను. పండితుని శిష్యులు వానిం బట్టుకొనిచంపిరి. ఈవిషయమును

1. ఇది వాస్తవమయి యుండవచ్చునని శ్రీ సోమశేఖరశర్మగారు సమర్థించిరి. దానిని శ్రీ వేంకటరమణయ్యగారు బలపఱచుచు (తారణ—మాఘ) 'భారతి'—లో వ్రాసిరి.

వారు తమగురువునకుఁ దెలుపలేదు. అంత, బుద్ధరాజు పండితునియొద్దకు మనుష్యుల నంపి, నరహంతకునికి ఏమి శిక్ష శాస్త్రీయమని అడుగఁగా, కనులు తీయుటయే తగిన శిక్ష యని పండితుఁడు చెప్పెనఁట! దానిపై బుద్ధరాజు పండితునికనులు తీయించెను. పండితుఁ డాతనికి శాపమిచ్చి, యిఁకమీఁద శైవులెవరును చందవోలులో తీర్థము పుచ్చుకొనఁగూడదని శాసించి వెడలిపోయెను."

పండితుఁ డమరావతిఁ జేరి, చోడునితోఁ బ్రసంగించిన పాపమునకుఁ బ్రాయశ్చిత్తముగ సమరేశ్వరాష్టకమును బఠించెను. అతఁ డక్కడ నుండు కాలముననే, బసవేశ్వరుఁ డతనికి శివప్రసాదమగు భస్మమును బంపెను. తన్మహిమాతిశయమునఁ బండితారాధ్యులు కన్నడములోఁ గూడ కవిత్వము చెప్పుటకు మొదలిడెనఁట! తరువాత బసవేశ్వర దర్శనార్థము పండితుఁడు కల్యాణపురమునకు బయలుదేఱి పోవుచుఁ, ద్రోవను "నిడుగుడుముల" —[1] 'పానుగల్లు' —అను ప్రదేశములకు వెడలి, శివప్రభావముంగూర్చి బోధించి జాలమందిని దనశిష్యులను జేసికొనెను. పిదప 'వనిపురము'మీఁదుగా, కల్యాణపురమునకుఁ బోవుచుండ, నంతకు వారముదినములముందే బసవేశ్వరుఁడు లింగైక్య మందెనని తెలిసి, చాల దుఃఖముతో ఆయననుగూర్చి వాపోయెను.

అనంతరము కల్యాణపుర ప్రయాణము నుజ్జగించి, శ్రీశైల యాత్రకు దారిఁ దీసెను. అక్కడికి సమీపమున నున్న 'వెల్లటూరు' గ్రామమున సకుటుంబశిష్యపరివారముగ నిలిచి, తన ముఖ్యశిష్యుఁ డయిన దోనమయ్యను, శ్రీశైలప్రదక్షిణ మొనర్చి, తనమాఱుగా వ్రతసమాప్తిఁ జేయుమని నియోగించి పంపెను. అతఁ డట్లేచేసి, వచ్చి, శ్రీశైలమాహాత్మ్యమును బండితునకు వర్ణించి చెప్పఁగా నతఁడు పరమానందభరితుఁడై, ఆగ్రామముననే శివునిగుఱించి ప్రార్థించుచు లింగైక్యము నందెను.

---

1. 'పానుగల్లు' లు తెలంగాణములో రెండున్నవి. చిత్తూరుజిల్లాయం దొండున్నది. తెలంగాణములోనివి:— నల్గొండజిల్లాలో నొకటియు, మహబూబు జిల్లాలో నొకటియుఁ—గలవు. పండితుఁడు వెడలిన దిందు రెండవదానికే.

అతనియనంతరము, దోనమయ్యా మొదలగు శిష్యబృందము ఆతని పెద్దకొడుకయిన కేదారయ్యకు, "ఆరాధ్య" పట్టమిచ్చి, యతని భక్తి సామ్రాజ్యమున కధిపతిఁగాఁ జేసిరి. ఈవిషయమును కీ॥ శే॥ శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిగారు తగిన నిదర్శనములతో దృఢపఱచిరి.

ఇది పండితారాధ్యుల సంగ్రహచరిత్రము. ఇఁక బసవేశ్వరునికిఁ బండితారాధ్యులకు—ఏ యే సిద్ధాంతములలో భిన్నాభిప్రాయములు గలిగినవో యించుక పరిశీలింతము.

శివదీక్షావిధులలోఁ బండితారాధ్య బసవేశ్వరుల కంతగా భేదాభిప్రాయములు లేవు ; కాని, ఆచరణ విధానములలో మాత్ర మొక్కింత వేఱుపాటులు తోఁచుచున్నవి.

బసవేశ్వరుఁడు :—(1) వేదాలే ప్రమాణము లని యనఁడు. (2) వర్ణవిభేదముల నంగీకరింపఁడు. (3) యజ్ఞోపవీతధారణమును సమ్మతింపఁడు. (4) లింగధారణమునకుఁ బ్రాధాన్య మొసంగును. (5) భస్మస్నానమును బరమపవిత్రముగా గణించును. (6) ఇతని సిద్ధాంతముల ననుసరించువాఁ డేజాతికిఁ జెందినవాఁడయినను — 'జంగముఁడు' (లింగాయతి) యగును.

పండితారాధ్యులు :—(1) వేదములతోఁబాటు శైవాగమము లనుగూడఁ బ్రమాణములుగ నంగీకరించును. (2) వర్ణవిభేదములను బాటించును. (3) లింగభస్మధారణము లెంత ముఖ్యములో, యజ్ఞోపవీతధారణముగూడ నంత ముఖ్యమయినదిగ భావించును. ఇతని సిద్ధాంతముల ననుసరించు బ్రాహ్మణులు ఆరాధ్యులు. తక్కిన వర్ణములవారు శివదీక్షాపరులు.

వీరిరువురకు నిట్టి స్వల్పభేదములున్నను, బరమ వీరశైవాచార ప్రధాన సిద్ధాంతములలో భేదము లేమాత్రము గనఁబడుట లేదు. పైఁగాఁ, దనకంటె ముందు దేశమున వీరశైవమతమును బ్రచారమునకుఁ దెచ్చిన బసవేశ్వరునియందుఁ, బండితారాధ్యుల కపరిమిత భక్తి యుండెడిదని తెలియుచున్నది. ఇంతకును బసవేశ్వరుఁ డేవర్ణమునకుఁ జెందినవాఁడో స్పష్టమగుట లేదు. కాని, కల్యాణపురమున రాజ్య మొనర్చిన బిజ్జలుని కతఁడు మంత్రి యని చరిత్రలు వెల్లడించు

చున్నవి. అతఁడు పండితారాధ్యులను దన మతములోనికి వచ్చి (జంగములు) లింగాయతులలోఁ గలసి పోవలసినదని కోరఁగా, నతఁడు :— "భక్తిమీఁదవలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయ లేను నేను బసవలింగ"—యని యుత్తరమిచ్చినట్లు చెప్పుచున్నారు. దీనింబట్టి, పండితారాధ్యులు తన బ్రాహ్మ్యమును గాపాడుకొనుచు, వీరశైవాచారదీక్ష నవలంబించి యుండెననుటయందు సందియ మిసుమంతయు లేదు.

వీరి మతసిద్ధాంతము లనుసరించు ద్విజుల నారాధ్యులందురు. కాని, వారు మనయాంధ్రదేశమునఁ దప్ప మఱెక్కడను గానరారు. వారందఱు లింగధారులే. అఱవదేశమునఁగూడ నిట్టి వీరశైవాచార దీక్షగల బ్రాహ్మణులు లేకపోలేదు. వారిని "గురుక్కళ్"— "దీక్షితర్" అని యందురు. కాని వీరికి లింగధారణము లేదు. వీరే యక్కడి శివాలయములలో నర్చకులుగూడ. శివనిర్మాల్యము ననుభ వించు కారణమున—వీరు తక్కిన బ్రాహ్మణవర్గములకుఁ బంక్తి బాహ్యు లయిరి.

తక్కిన బ్రాహ్మణేతర జాతులలోని వీరశైవమతావలంబుల యందు వర్ణవిభేదము లంతగాఁ గనిపించవు. తెలుఁగుదేశము నందలి వీరి తెగవారికి జంగములనియుఁ, గన్నడదేశమున నుండువారికి 'లింగాయతు'—లనియుఁ, దమిళదేశమున వసించువారికి 'పండారు'— లనియుఁ బేరులు వాడుకలో నున్నవి. వీరిలో పండారులకు లింగధార ణము లేదు. తక్కినవారి కున్నది. ఆంధ్రదేశమున (సాధారణముగా —కృష్ణ, గోదావరి, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు మండలములలో) ఈజంగములు విశేషముగాఁ గనిపించుచున్నారు. కన్నడప్రాంతమున (బళ్లారి, చిత్తూరు, ఉత్తరార్కాడు—లలోని తెలుఁగురాజ్యపు సరి హద్దు ప్రదేశాలలోను, మైసూరురాజ్యమునను) లింగాయతు లెక్కు వగ నున్నారు. ద్రావిడదేశమునఁ జెదురుచెదురుగఁ గనఁబడు చున్నారు. అయిన, వీరందఱు నొక్క వర్ణమునకే చెందినవారని చెప్పఁదగును. వీరిలోఁ (బెంగుళూరు, ఆరణి, కంచి మున్నగుచోట్లలో) జాలమందికి పట్టు (చీరెలు వగైరా) వస్త్రములనేత ప్రధాన జీవన వృత్తి. వీరందఱకు 'సెట్లు'—అను బిరుదముగూడఁ గలదు. బసవే

శ్వరుండు 'కన్నడి'—అయినందున, నతనిమతము కర్ణాటదేశమున మిక్కుటముగ వ్యాపించినట్లు కనఁబడుచున్నది. బెంగుళూరు ప్రాంతమందలి 'బసవనగుడి'—అను పురము బసవేశ్వరుని పేరితోనే యేర్పడియుండవచ్చును. చిత్తూరు మండలమందలి 'పుంగనూరు' జమీందారులు గూడ లింగధారులే. వారి బిరుదగద్యలో 'బసవ'—శబ్దమున్నది.

ఇఁక పండారులు ద్రావిడదేశమున నధికముగ నివసించుచున్నారు. వీరి గురువులు — శ్రీజగద్గురువగు ఆదిశంకరులవలె నక్కడక్కడఁ బెద్ద బెద్ద మఠములను స్థాపించిరి. వారి మఠములు సర్వసంపదలతోఁ దులఁదూఁగుచుండును. ఆమఠాధిపతులును రాజభోగము లనుభవించుచుందురు.

ఆంధ్రదేశములోని యారాధ్యబ్రాహ్మణులును విద్యావంతులు, శాస్త్రవేత్తలు, వేదవేదాంగనిష్ణాతులు, పాండితీమండితులు. వీరు బసవేశ్వరుని సిద్ధాంతములలోఁ బెక్కింటి ననుసరించువారయినను—ఇటీవల,—అనఁగా—(శ్రీ) వీరేశలింగముగారి కాలమునుండి తమ మతవిషయములలో దేశకాలపాత్రముల ననుసరించి, చాలవఱకు సంస్కృతి నందిరి. అందుచున్నారు. లింగధారణాదుల కిపుడు వారిలోఁ బ్రాముఖ్యమిచ్చువారు చాల కొలఁదిమంది యనియే చెప్పఁదగును. దీనికి, వారిలో ఈనాఁటి విద్యావ్యాసంగముచేఁ గలిగిన మనస్సంస్కారమును, నాగరికతచేఁ గలిగిన నవనవోన్మేషభావమును గారణములు.

శివదీక్షాచారులయిన జంగములకు ముఖ్యముగా జీవనవృత్తి తమ మతకర్మాదిక నిర్వాహణముగఁ గన్పట్టుచున్నది. శివాలయములలోఁ బరిచారకత్వము, శివదీక్షాపరుల యిండ్లలోని శుభాశుభకర్మల నిర్వాహణము మొదలైనవియు వీరితోడ్పాటుననే జరుగుచున్నవి. కాని, యీజంగములు దేశద్రిమ్మరుల విధమున పూర్వము కుటుంబములతో నక్కడక్కడ శివనామ కీర్తనములు చేసికొనుచు జేగంటలు వాయించుకొనుచు సంకువులూఁదుకొనుచుఁ దిరుగువారని యూహించవలసి యున్నది. వారితోఁ గొంద ఱీనాఁడు గ్రామములలో స్థిరపడి వ్యవసాయాదికవృత్తులు చేసికొనుచుఁ దమ మతస్థుల

యిండ్లలో కార్యకలాపములప్పుడు సహాయపడుచున్నారు. ఈ వీరశైవ వ్రతులైన జంగము లాకాలమున నెంతటి యవినీతిపరులో శ్రీ వేమన యోగి "లింగధార్లవంటి దొంగలు లేరయా" యను వాక్యమున వెల్లడించెను. వీరిలో స్త్రీలుగూడ లింగధారిణులని వీరి ప్రవర్తనము గూడ నంతచక్కనిది గాదని శ్రీనాథమహాకవి పద్యములు తెలుపుచున్నవి :—

1. "అంగడివీధి పల్లవుల కాసగ మామిడిపండు లమ్ముచున్
జంగమువారి చిన్నది పిసాళితనంబునఁ జూచెఁ బో"

2. "శంకరునివంటి మహాత్ముఁడు లింగరూపియై
కులికెడు దాని గబ్బిచనుగుబ్బలసందున నాట్యమాడఁగన్"

3. "సంకుమదము లేదో, యశుభంకరమగు భస్మమేల బాలా
నీకున్"

## పండితారాధ్యుల కాలము

ఈవిషయమున పాల్కురికి సోమన "పండితారాధ్యచరిత్రమే" —చరిత్రకారులకుఁ బరమ ప్రమాణము. అందుఁ బండితారాధ్యుల సమకాలికులు పెక్కురు పేర్కొనఁబడిరి. వారిలో బసవేశ్వరుఁడు (కల్యాణపురాధీశుఁడయిన బిజ్జలుని మంత్రి,) వెలనాటి (కులోత్తుంగ రాజేంద్ర) రెండవ చోడుఁడు (చందవోలున కధిపతి,)—ఉదయావనీశ చోడుఁడు. (పానుగంటి ప్రభువు) ముఖ్యులు.

(1) తన ప్రాశస్త్యమును భూలోకమునఁ జాటుటకయి శివుఁడు నందీశ్వరుని మర్త్యజగమున నవతరింపుమని యాజ్ఞాపింప, నతఁడు "బసవేశ్వరుఁడు"గ నవతరించెనని యైతిహ్యము. అతఁడు, ఆ తెలుఁగుననే పండితారాధ్యులు జన్మించుటకు ముందవతరించెను. కావున ప్రాయమున బసవేశ్వరుఁడే పండితారాధ్యులకంటెఁ బెద్దయనుట నిర్వివాదాంశము. పండితారాధ్యు లమరావతిలో నుండుకాలమున బసవేశ్వరుని దూత లతనియొద్దకు వచ్చిరనియు వారి ప్రోత్సాహముననే యతఁడు బసవేశ్వరుని దర్శనార్థము బయలుదేఱి, తెలంగాణములోని

"వనిపుర" మను గ్రామమునకుఁ జేరుకొనుసరికి, బసవేశ్వరుఁడు లింగైక్య మందినట్లు విని మిక్కుల దుఃఖించెననియుఁ దెలియుచున్నది. బసవేశ్వరుని శిష్యులు బిజ్జలదేవుని క్రీ. శ. 1167 సం॥న వధింపఁగాఁ, దర్వాతి రాజ్యమునకు వచ్చిన యతనికుమారుఁడు క్రీ. శ. 1168 సం॥న చంపినట్లు చరిత్రాధారము లున్నవి.

(2) చందవోలు ప్రభువైన రెండవ వెలనాఁటి చోడుని కాలమును నిర్ణయించుటలో, నాకాలపు శాసనముల నాధారపఱచుకొనిన శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు, ఈచోడుని శాసనములు క్రీ. శ. 1181 సం॥కుఁ దరువాత కనిపించుట లేదనియు, 1186 సం॥నుండి చోడుని మనుమఁడైన ప్రథివీశభూపతి రాజ్యమును పాలించెననియు దృఢపఱచుచు, నందుల కుపబలకముగ శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి వాక్యముల నుదాహరించిరి. ఈ వెలనాఁటి రెండవ చోడుని సభలోనే పండితారాధ్యులు శివప్రాశస్త్యమును గుఱించి వాదించి గెలిచినట్లు చెప్పఁబడినది. కనుక ఈభూపతి క్రీ. శ. 1163 సం॥నుండి, క్రీ. శ. 1180 వఱకు రాజ్యపాలన మొనర్చినట్లు శ్రీకొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు "శివతత్త్వసారము" యొక్క యుపోద్ఘాతమున వెల్లడించిరి.

(3) తెలంగాణములోని "మహబూబునగర" మండలమునఁ గల పానుగంటి రాజ్యమును చోడవంశస్థుఁడయిన "ఉదయావనీశుఁ" డను రాజు జడచర్లలో వేయించిన శాసనము మూలకముగా (అతఁడు) క్రీ. శ. 1162 వ సం॥ ప్రాంతమున జీవించియుండినట్లు ఋజువగుచున్నది.

ఇంతవఱకు నిశ్చయముగఁ దెలిసిన ప్రమాణములనుబట్టి, పండితారాధ్యులు క్రీ. శ. 1160—80 సం॥ల ప్రాంతములవాఁడని నిర్ణయించుట సాహసముకాదు.

పండితారాధ్యుల కృతులు :—శివతత్త్వసారము : ఇతఁ డనేక కృతులను రచియించినట్లు "పండితారాధ్యచరిత్ర" కర్తయైన పాల్కుఱికి సోమనాథుఁడు సూచించెను :—

(1) హరలీల (2) మహిమ్న స్తవము (3) మలహరణము (4) అనామయము (5) హలాయుధము (6) పంచగద్యములు (7) శివతత్త్వసారము (8) రుద్రమహిమ (9) సంసారమాయా స్తవము (10) శంకరగీత (11) ఆనందగీతములు (12) బసవగీతములు (13) దక్షాధ్వరము (14) న్యాసాష్టకము (15) గణాడంబరము (16) శారభము (17) తుమ్మెదపదములు (18) ప్రభాతపదములు (19) పర్వతపదములు (20) ఆనందపదములు (21) శంకరపదములు (22) నివాళిపదములు (23) వాలేశుపదములు (24) గొబ్బిపదములు (25) వెన్నెలపదములు (26) సంజవర్ణన (27) గణవర్ణనపదములు (28) బాణగద్య (29) అక్షరగద్య (30) వర్ణాడంబరము (31) నీలకంఠ స్తవము (32) మయూర స్తవము (33) మలయరాజీయము (34) మానిదండకము (35) మహాస్తోత్రసూత్రములు (36) శతకము (37) దీపకళిక (38) మహానాటకము (39) ఉదాహరణములు (40) ముక్తకములు (41) గీతసూక్తములు (42) భృంగీ స్తవము (43) రుద్రసహస్రనామములు.

ఇన్ని గ్రంథములలోను—ఇప్పటివఱకు లభించినది "శివతత్త్వసార" మొక్కటే. తక్కిన గ్రంథములలో—ఏ కొన్ని దొరికినను, వీరశైవాచారదీక్షితుఁడగు నీపండితుని ప్రతిభయు, శైవాగమ రహస్యము లింకనుం గొన్నియు లోకమునకు విదితములు కాఁగలవు.

"శివతత్త్వసార" మును "ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయము" వారు, క్రీ. శ. 1922 సం॥నఁ బ్రకటించిరి. కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుపంతులుగారు దానికి సమగ్రమైన పీఠికోపోద్ఘాతములను వ్రాసిరి.

ఈగ్రంథమున 489 కందపద్యము లున్నవి. ఏపద్యమున కాపద్యము స్వతంత్రభావస్ఫోరకముగా నున్నది. పద్యములకడపట—మకుటముగా "శివా" అనిగాని, తత్పర్యాయ శబ్దము మఱొకటిగాని ప్రయోగింపఁబడియున్నది. కొన్ని పద్యములకు మకుటములు లేవు. అట్టివి, బహుశః—భావదారిద్ర్యము గలిగింపఁగూడదను ఉద్దేశముతో వదలివేయఁబడియుండును. మొత్తముమీఁద శతకలక్షణములు చాలవఱకు నీగ్రంథమున నుండుటవలనఁ దరువాతి గ్రంథముల కీ "శివతత్త్వసారమే" మార్గదర్శకమైనది.

ఆ యీ కారణములనుబట్టి, ఈపండితారాధ్య కృతిప్రథమాంధ్ర శతకస్వరూపమును నిర్ణయించుట కొరవడిగను,—తత్కర్తను "ప్రథమాంధ్రశతక" స్వరూప నిర్మాతగను బేర్కొనవలసి వచ్చినది.

"శివతత్త్వసారము"న నుండు 489 కంద్యములలోను 134 కి "శివా"—అనియు; 62 కి "రుద్రా"—అనియు; 26 కి "అజా" యనియు మకుటములున్నవి. 192 పద్యములకు మకుటములు లేవు. తక్కిన వానికి—"మహేశా" "ఈశానా"—"సర్వానందా"—"నిత్యానందా" — "పరమానందా" — "పురసంహారా"—"కరుణాంబునిధీ" — "రాజాభరణా" — "ఉరగాభరణా" — "అంబారమణా"—"కపర్ది" అనియు మకుటము లున్నవి. 170, 266, 310, 352, 356, 358, 489,—పద్యములలో పదములు లోపించినవి.

ముద్రిత గ్రంథమునందలి పై పద్యసంఖ్య కొఱంతగాఁ దోఁచును. కవి యెన్నివందల పద్యములు చెప్పెనో తెలియదు. నేను వినుటలో—1000 పద్యములకుఁ దక్కువగా నుండవని తెలిసినది. ప్రకృతము ప్రసక్తమైన "శివతత్త్వసారము" నందలి 489 అను పద్యసంఖ్య—ఒకనియతిని సూచింపదు. కాన, కవి నిర్దిష్టసంఖ్య యేవో కొన్నివంద లుండునని మనమూహింపవచ్చును. ముద్రితప్రతియందలి పద్యసంఖ్య పంచాశతికిఁ గొంచెము తక్కువగ నుండుటచేఁ, గవి యెన్నూవందల పద్యములు వ్రాసియుండునని నిశ్చయించుట సముచితమే. ఏమయినను సంపూర్ణముగఁ బ్రాచీనగ్రంథము లభించిననేగాని యిదమిత్థమని తేల్చుటకు సాధ్యపడదు.

## శివతత్త్వసారము శతకమే

ఇది శతకమని కవి స్వయముగా చెప్పకున్నను దీనిలక్షణము లన్నియు శతకలక్షణములే (పూర్తిగా). కాన శతకముగనే పూర్వపరిశోధకు లంగీకరించిరి.

శివతత్త్వసార పీఠికలోని యీక్రింది (శ్రీ) లక్ష్మణరావుగారి వాక్యములు గమనింపుఁడు :—

"ఇయ్యది చాలవఱకు "శివా" యను మకుటము గల శతకము" కొన్ని పద్యములచివర "రుద్రా"—"అజా"—"మహేశా" యను

సంబోధనములుగూడ గలవు. కొన్నిటికిఁ దుద నేసంబుద్ధియునుండదు. ఇట్లిందుఁ గొన్ని చోటుల శతకలక్షణములు గానరాకున్నను మొత్తము మీఁద నియ్యది శతకమనియే చెప్పవచ్చును. పూర్వశైవులలో నిది శతకమనియే చెప్పఁబడుచుండెను. పండితారాధ్య చరిత్రమునందు పాలకుఱికి సోమనాథుఁడు దీనిని "శతకమే" యనెను.

పాలకుఱికి సోమనాథుఁడేమని పండితారాధ్యచరిత్రలో చెప్పెనో చూడుఁడు :—

"శతకంబు శివతత్త్వ సార మాదిగను
గద్యపద్యంబు లాకాంక్షఁ జదువుచును"

(దీక్షాప్రకరణము)

"శతకము శివతత్త్వ సారము దీప
కళిక మహానాటకము నుదాహరణ"

(పర్వతప్రకరణము)

ఈవిధముగ శ్రీలక్ష్మణరాయాద్యాధునికుల యభిప్రాయము లట్లుండ, సోమనాథుఁడే శివతత్త్వసారమును శతకమని రెండుచోటుల నుద్ఘాటించెను. కాని, నిడుదవోలు వేంకటరావుగారు దీనికి భిన్నముగ తారణ ఫాల్గుణమాస భారతిలో నివ్విధముగాఁ బ్రకటించిరి :—

"శివతత్త్వసారము శతకములలోఁ జేర్పఁబడినది. అది పండితారాధ్యచరిత్రమున "శతకంబు శివతత్త్వసారము" — అను పాదమున శతకంబన్నది శివతత్త్వసారమునకు విశేషణముగఁ జేయుటచేఁ గలిగిన పొరపాటు. ఈపట్టున, సంస్కృతాంధ్ర శైవస్తోత్రములు గ్రంథములు పెక్కులు పేర్కొనఁబడినవి. ఇందు "శతకము" — "శివతత్త్వసారము"— వేఱువేఱు గ్రంథములు. "శతకము" — మల్లికార్జున పండితుని "శ్రీగిరిమల్లికార్జున శతకము"—కావచ్చును. శివతత్త్వసారము ననుసరించి—శతక కవుల చరిత్రమునను, ఇంకను రెండుమూఁడు వ్యాసములందును "శివతత్త్వసారము"—శతకమను పొరపాటు దొరలినది."

ఈసందర్భములో, నిజముగ పొరపాటెవరిదో తెలిసికొనవలసి యున్నది :—

పూర్వవిమర్శకులందఱు చక్కఁగాఁ బరిశోధించి, శివతత్త్వసారము "శతకమే" యని లాక్షణికముగ సమర్థించియుండఁగా — శ్రీ వేంకటరావుగారు, కారణములెవ్వియుఁ జూపకయే "ఆవిధముగా చెప్పుట పొరపాటు" అని 'తుండూ తుపాకీ' లేకయే కొట్టివేయుట కాధారము —సోమనాథుఁడు, శతకమును వేఱుగా, శివతత్త్వసారమును వేఱుగ తన ద్విపదలోఁ జెప్పుటయే. నిజమునకు సోమనాథుఁడు "శతకంబు శివతత్త్వసార"మని నుడువుటలో నాగ్రంథమునకది విశేషణముగ నుపయోగించెనని దృష్టియందుంచుకొన్న యెడల సందియమునకుఁ దావొసఁగదు. ఆప్రకారముగాఁగాక, శ్రీ వేంకటరావుగారు "శతకమ"ని సోమనాథుఁడు చెప్పినది. — పండితారాధ్యులు రచించిన "శ్రీగిరి మల్లికార్జున శతకము" నుద్దేశించినదేగాని, శివతత్త్వసారము నుద్దేశించినది గాదని చెప్పుటలో నిది పెద్దపొరపాటు.

ఏమన:—ద్విపదకవిమండలమండనుఁడై యుద్దండుఁడుగాఁ బ్రకాశించిన సోమనాథుఁడు—తాను చెప్పిన రెండుస్థలములందును "శతక" —పదమును, శివతత్త్వసారమునకు విశేషణముగనే వాడెను. నిజముగా, నది "శ్రీగిరిమల్లికార్జున శతకము"ను గూర్చియే యైనయెడల నొక్కస్థలమందైనను పూర్తిగా నాశతకమును బేర్కొనని (చేతగాని) కవి కాఁజాలఁడుగదా! మఱి, పండితారాధ్యచరిత్రకు విపులమైన పీఠిక వ్రాసిన డాక్టరు. శ్రీచిలుకూరి నారాయణరావుగూడ, పండితారాధ్యుల గ్రంథములను బేర్కొనిన వరుసలో, "శతక" మని వేఱుఁగాఁ జెప్పిరేగాని, అది "ఫలానా" శతకమని చెప్పలేదు. కాఁగా "శతకంబు శివతత్త్వసార'మను సోమనాథుని ద్విపదకు "శివతత్త్వసారశతక" మనియే యర్థము.

మఱి, ప్రసక్తానుప్రసక్తముగ వచ్చుచున్న "శ్రీగిరిమల్లికార్జున శతక"ము గతియేమి ?—పండితారాధ్యులా పేరిటి శతకమును వ్రాసినటులే తెలియుచున్నది. ఇటీవల "పండితారాధ్య కృతమగు శ్రీగిరి మల్లికార్జునశతకము"ను గుఱించి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రసంగించుచు నది లభ్యమైన బాగుండుననిరి. కాని, ఆరాధ్యుల (శివతత్త్వసారముతప్ప) తక్కిన కృతులకుఁ బట్టిన దురవస్థయే దానికిఁ గూడఁ బట్టియుండును.

ఇంతకుఁ జెప్పున దేమన ?:—నేఁటికైనను, మన మెఱిఁగిన "శ్రీగిరి మల్లికార్జునశతకము"ను గూర్చి—పండితారాధ్యులకుఁ దరువాత నంతటి ప్రఖ్యాతినార్జించిన సోమనాథుఁ డెఱిఁగియుండిన, దాని పూర్తి నామమును దన గ్రంథమున బొనిపి యేయుండును. కాని, అతఁడు దానిని గూర్చి తెలియఁడనుట సమంజసము. కారణమేమన ?—పండితారాధ్యులు వార్ధకమున శ్రీశైలప్రాంతముల కరుగుటయు,—వృద్ధత్వము వలన నేత్రావరోధమగుటయు, శిష్యుఁడగు దోనమయ్యను శ్రీశైల ప్రదక్షిణ మాచరింపుమని యాజ్ఞాపించుటయు నాతఁ డట్లే యాచరించి శ్రీశైలమహిమను గురువుగారికి వర్ణించి చెప్పుటయు చరిత్రప్రసిద్ధములు గదా ! ఇది జరిగిన కొంతకాలమునకు—(వారి కవసానము సమీపించుననఁగా)—నీశతకమును జెప్పి యుండవచ్చును. ఆ వెనుకఁ బెక్కేండ్లకు వెలసి యంతటిఖ్యాతి గడించిన తచ్చరిత్రకారుఁడు సోమనాథునికాలమునకు విశేషప్రచారమున నున్న పండితారాధ్యుల గ్రంథములు కొన్ని దొరకియుండవచ్చును ; కాని—అవసానకాలమున శ్రీశైల యాత్రకు ఫలితముగాఁ జెప్పిన—'శ్రీగిరిమల్లికార్జున శతకము'—అతని ముఖ్యశిష్యులపరమై—యాతనికి లభింపకపోయి యుండవచ్చునని నిశ్చయించుట సహేతుకము.

ఆ యీ కారణముల ననుసరించి, శ్రీసోమనాథునిచేత నుటంకింపఁబడిన "శతక" శబ్దము,—"శివతత్త్వసారమునకే" చెందినదిగా నిశ్చయించుటలో, నేమాత్రము పొరపాటులేదు.

అయిన, పండితారాధ్యుఁడు "శివతత్త్వసారమును"—"శతక" మని చెప్పలేదు. మనమవ్విధముగా ననుట న్యాయమా ? అను ప్రశ్నకాధారములేదు. "సౌందర్యలహరి"—"శివానందలహరి"—"అమరుకకావ్యము"—ఇట్టివి తత్కర్తలచే "శతకములు"గాఁ జేర్కొనఁబడకపోయినను, (ఒక్కమకుటముతప్ప) శతకలక్షణములన్నియు వానియందుండుటచే శతకములుగనే పరిగణింపఁబడినవి. "శతకము"లని గ్రంథకర్తలు చెప్పని శతకములను, శతకకవుల చరిత్రమున గొన్నిఁటిని శ్రీవంగూరి సుబ్బారావుగారు చేర్చియుండుట పరిశోధకలోకమునకు విదితమైనదే.

మఱి, పండితారాధ్యునిచే ప్రణీతమైనదిగా చెప్పఁబడు "శ్రీగిరి మల్లికార్జునశతకము" లభ్యమైన,—అవసానదశయందాతని మనస్తత్వమును—పండఁబాఱిన యాతని శైవాచారదీక్షాప్రభావమును, మల్లికార్జున దేవుని సాక్షాన్మహాత్వమును దెలిసికొనుట కెంతైన నుపకరింపఁగలదు. బహుశః—దాని మకుటము "శ్రీగిరిమల్లికార్జునా" యనియైనచో చంపకోత్పలములలో నది చెప్పఁబడియుండవలెను. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకాగారమున నది కనుపించుట లేదు. ఎవరికడనైనను, ప్రాచీనవ్రాఁతప్రతి యున్నచోఁ బంపి పండితారాధ్యుల చరిత్రకు నింకను గొంచెము దోహదముఁ గల్గించవలెనని మనవి.

## శివతత్త్వసారవిమర్శ

ప్రకృతము "శివతత్త్వసారశతకమును"గూర్చి కొంచెము పరిశీలింతము :—

ఇందలి కందములన్నియు నొడుదుడుకు లేమాత్రము లేని మందాకినీస్రవంతివలె ననర్గళధారతో నడచినది. ఎంతటి దుష్కరప్రాస పద్యమైనను, సాఫుసంతనలతో—సరసపదజాలముతో సరళముగా సాగినది. శ్రుత్యుక్తులును, లోకోక్తులును, ఉక్కిరిబిక్కిరిగాక, ఇమిడికతో పద్యములం దదుకునట్లు చొప్పించుటలో కవి చాకచక్యమసామాన్యమైనది. మొదటినుండి—తుదివఱకు, ప్రసాదగుణమును బోషించుటయందు కవియొక్క శక్తి యసాధారణమైనది. పరమశివతత్త్వోత్కృష్టతను, ఇంత మాధుర్యముగా,—రమణీయముగా—చిక్కనగా—సమగ్రముగాఁ జిన్ని గ్రంథమున వన్నెచిన్నెలతోఁ జిత్రించి, కవి తనశిల్పకళాచాతుర్యమును, పాండిత్యప్రతిభను మహోన్నతముగా భాసింపఁ జేసెనని చెప్పుట యతిశయోక్తిగాదు.

శివతత్త్వసార ప్రకటనకర్తలు చూపిన విషయవిభాగముల ననుసరించి, ఇందలి 489 పద్యములు—ఈక్రింది విధముగా విభజింపఁబడినవి :—

| విషయములు | | పద్యసంఖ్యలు |
|---|---|---|
| 1. ఉపోద్ఘాతము. | ... | 1— 20 |
| 2. పశుపాశుపత జ్ఞానము. | ... | 21— 30 |

| విషయములు | | పద్యసంఖ్యలు |
|---|---|---|
| 3. అద్వైతమత ఖండనము. | ... | 31— 36 |
| 4. జగత్కర్తృత్వ విచారము. | ... | 67— 80 |
| 5. భవాదిశబ్ద వివృతి. | ... | 81— 84 |
| 6. జగత్కర్తృ లక్షణము. | ... | 85— 98 |
| 7. శివభక్తివివరణము. | ... | 99—114 |
| 8. భక్తుల మహిమ. | ... | 115—215 |
| 9. శివనిర్మాల్యము. | ... | 216—223 |
| 10. శివదీక్షితుఁడు. | ... | 224—230 |
| 11. శివభక్తుఁడు కాని పతి. | ... | 231—242 |
| 12. భక్తి లేక ముక్తి లేదు. | ... | 243—259 |
| 13. బాహ్యపూజ. | ... | 260—274 |
| 14. శివనిందకులు వధ్యులు. | ... | 275—281 |
| 15. చచ్చిన శివభక్తునకు పరలోక విధులు లేవు. | ... | 282—285 |
| 16. శివాపచారులకు శిక్ష. | ... | 286—299 |
| 17. దక్షాధ్వర ధ్వంసము. | ... | 300—319 |
| 18. ప్రళయ వర్ణనము. | ... | 320—347 |
| 19. శివగణ వర్ణనము. | ... | 348—381 |
| 20. సద్భక్తుల మహిమ. | ... | 382—385 |
| 21. కవిప్రార్థన. | ... | 386—390 |
| 22. కొందఱుభక్తులు. | ... | 391—446 |
| 23. భక్తిమహిమ. | ... | 447—489 |

ఆంధ్ర పరిషత్కార్యాలయమువారు ప్రకటించిన (శ్రీలక్ష్మణరాయసంపాదిత) "శివతత్త్వసార"మున—489 పద్యములు మాత్రమే యున్నవనియు, నవి 23 విషయవిభాగములుగా ప్రచురింపఁబడినవనియు

నిదివఱకు వివరించితిని. ఆగ్రంథము వెలువడినపిమ్మట మదరాసు విశ్వ విద్యాలయమువారు ముద్రించిన కన్నడ "శివతత్త్వసారము"—ప్రతి. (ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోనిది) లో దాదాపు 760 వఱకు పద్యములున్నవి. కాని, ఆ వ్రాఁతప్రతి సమగ్రముగాదు. పద్య సంఖ్య క్రమముగా లేదు. దీనినిబట్టి, నేనూహించినట్లే యందలి కంద ములు కొంచెమెచ్చుతక్కువగా 1000 వఱకుండుననుట స్పష్టమైనది. —ఆకన్నడప్రతి— తెలుఁగు "శివతత్త్వసారమునకు" "తూ— చా—" తప్పని భాషాంతరీకరణముగాఁ గనఁబడును. ఈవిషయమును గుఱించి మున్ముందు మనవిచేసెదను. ప్రకృతము తెలుఁగుప్రతిలోని విశేషము లించుక పరిశీలింతము :—

చక్కని సలక్షణభాషలో "శివతత్త్వసారము" లోని కంద ములు దొరలినవి. నన్నయ్యకుఁ దరువాత గ్రాంథికభాషలో లలితము గాఁ గవిత్వముఁ జెప్పిన రెండవవాఁడు శ్రీపండితారాధ్యులని శ్రీలక్ష్మణ రావుగారు తెలిపిన యభిప్రాయము సర్వథా యంగీకరించఁదగినది.— ఈగ్రంథమునం దనేకవిచిత్రప్రయోగములు, పెక్కు మాఱుమూల పదములు వాడఁబడినవి :—(1) ప్రమితి (2) బ్రమడియిల్లు (3) వహి త్రంబు (4) నిరాణ (5) వక్కండు (6) బత్తళి (7) మొరయలు (8) రట్టళ్లు (9) మంద్రడేయేనిఁ (10) అతగులు (11) దేవలకుఁడు (12) ఎయితఁడు (13) పినుగులు (14) బతెరుండు (15) అన్నఁడు (16) పాదఱి (17) ఆలాపు (18) ముద్దటులు (19) బిలబిలి (20) వాచి కొను (21) అతకడచిన (22) దుస్సికొను (23) ప్రాొబ్బని (24) గడి కాఁడు (25) సూడుపట్టె (26) వఱుగ (27) త్రిప్పటము (28) వడ్డ ణము (29) కోలెమ్మ (30) బసబములు (31) అకజుఁడు (32) పరి మాల్చుఁడు (33) ఆశ్చర్యులు (34) గొరలఁడే (35) పొసపరి (36) మడఁది (37) బదసిన (38) మిడిచి—ఇవి కొన్నిమాత్రమే !—

ఈకృతియందు—శివపరముగా "విష్ణువరేణ్యా" (ప–45)— "గోవిందవరేణ్యా" (ప–450)—ఇట్టివి విష్ణుపరముగా రూఢమైన పద ములు ప్రయోగింపఁబడియున్నవి. కవి, యేయభిప్రాయముతో నట్టి

వాని నుపయోగించెనో బోధపడకున్నది. కాని వేఱర్థములతో వానిని శివపరముగాఁ గూడ చెప్పనగును.

శ్రుతిస్మృతిశాస్త్రోక్తి లీకృతియందలి పద్యములలో నిమిడ్చిన విధము ప్రశంసాపాత్రము :—

1. నకర్మణా, నతపసా, నజపైర్నసమాధిభిః.
2. మద్భక్తశ్చ శుచీ.
3. సచ పూజ్యో యథాహ్యాహమ్.
4. తేనసహ సంవసేత్.
5. యోగ్యదైవః స్మరణం సకృత్.
6. లింగద్వయం సమాఖ్యాతమ్.
7. మద్భక్తా నవినశ్యంతి.
8. నమే భక్తా ప్రణశ్యంతి.
9. మద్భక్తా విగత కల్మషా.
10. సుదూరమపి గంతవ్యమ్.
11. రజ్జుః కూపా ద్ఘటం యథా.
12. తే శీఘ్రం హంతవ్యా.
13. పథవర్తిని తేషాయమ యథాతథా.

తెలుఁగు జాతీయోపమాన ప్రయోగముల (సందర్భానుసారముగ) నీకవి యెఱిఁగినట్లు మఱియొక రెఱుఁగరు. మచ్చునకు గొన్నిఁటిని దెలిపెదను :—

1. కత్తిఁగొనికోసి, దేహము, జొత్తిల్లఁగఁ గడిగినను విశుద్ధంబగునే ?
2. కుమ్మరి దరికొల్పిన చిచ్చిమ్ముల నావంబు కడవలెల్ల దరికొనం గ్రమ్మగతి.
3. గోకులమును గోపాలకుఁ డాకులను ద్రోలునట్టులు.
4. కలియుగమునఁ జోరులచే బలిమిఁ గులస్త్రీలు వడ్డభంగిన.
5. ముక్కులేని కాంతయు పోలెక.

6. గజశాస్త్ర మెఱిఁగినంతనె గజాధిరోహణము సేయఁగా వచ్చునె?
7. జడనిధి వెడల్పు లోఁతును గనునెఱుఁగునె నూతిలోని కప్పలు.
8. ఎఱుఁగునె వంటకములచవి యెఱపుగ మఱి యంద మొలఁగు చుండెడి దర్వుల్.
9. మేదిని జూచియుఁ బూర్వదిశాదిస్ఫురిఁ గౌశికంబు లను నవి గనునే?
10. పువ్వులకతమున నారలు దలకెక్కునట్లు.
11. పలమెను ప్రవృత్తికి నైనను గులమమ్మను వోవునట్లు.
12. పువ్వులలోఁ బుట్టినట్టి పురుగులు కొఱయే.
13. పిండకూడు పెట్టిన మెరయులక్రియ మెరచు మీస మెను కుల మెఱపుల్.
14. మంటఁగని సీతువాసిన కంటెను.
15. ఓడునఁ బోసిన జలంబుయుక్తి.
16. పరిమళములేని కుసుమము గరమొప్పని భంగి.
17. రొంపిఁ బుట్టియుఁ బద్మంబు సాలఁ బూజ్యముకాదే.
18. మసికప్పడమునఁ బొదివిన యసదృశమాణిక్య మొట్టు లట్టులు.
19. వెలగలదె పసిఁడి గమ్మగ వలచిన విధమున.
20. ముందటి పసిఁడిన పోలును సుందరముగఁ బరుసవేది సోఁకిన యినుము.

ఎంతటి దుష్కరప్రాసమైనను మిక్కిలి మెలఁకువతో సులభముగా పద్యమునందు ప్రయోగించుటయం దీతఁ డఖండుఁడు. ఈక్రిందిపదములు మొదట గల పద్యములు చూడుఁడు.

(1) సర్వేశ్వర (2) ప్రత్యక్షజగద్భేదము (3) అద్వైతమ్మ (4) ప్రాజ్ఞులు (5) స్వేచ్ఛాచారులు (6) స్వర్గాపవర్గసుఖము (7) రుద్రాక్షభూతిభూషణ (8) నిర్మలపదార్థమగుటను (9) స్వార్థ

పరార్థశివార్చన (10) అష్టాంగయోగభక్తి (11) సంహృతశివ (12) పృథువిధినిషేధ (13) అధ్యాత్మజులకు (14) నిష్ఠురభక్తి.

అద్భుతమైన సమాసములు గుదిగ్రుచ్చుటయందు నన్నయకుఁ దరువాత, పండితారాధ్యులనే పేర్కొనవలసియున్నది :—

1. దురితారి భవచ్చరణాబ్జ భక్తి లలనా పరవశభావము.

2. షట్త్రింశత్తత్త్వోపరిగత జగత్ప్రభవ హేతు జగన్నిర్వాణ సోమరూపము.

3. త్రిమలకృత దుఃఖసంసార మహాబ్ధి నిమగ్న జీవరాసులు.

4. పాతక యథేష్ట వ్రాత జగద్విప్రలంభ వాదము.

5. విఖ్యాత మృగ వ్యాధ రుద్ర కర శర నిహతిక.

6. కమలజ కమలోదర రుద్ర మహేశ్వర శాంత్యతీత తత్త్వాధిపతి.

7. ఖరకర పద్మజ రుద్రాంబురుహోదర ముఖ్య దివిజపుంగవ సచరాచరభూత నికర పంచావరణంబులు.

8. పతిసదృశాధిక తాపత్రితయ గుణత్రితయ జన్మమృతి సుఖ దుఃఖ క్షుతవృత బంధన మోక్ష స్తుతి నిందాదులు.

9. అవిద్యా కాల కళానియతి వికృతి కార్యాకార్యాభీలా బాంధవ మాలా బంధములు.

10. నర తిర్యగ్గర్భ యౌవనస్థాది పశూత్కరములు.

11. వివిధాధ్వర ముఖ్య సకల వేదపురాణాది విహితకర్మ వితానములు.

12. స్వారాజ్య ప్రముఖ నిఖిల సంభూత భవాపార సుఖంబులు.

13. భవాంధ తమస పటల విఘటనోద్భావితనిజ మహిమార్క విభావములు.

14. మహేశ్వర నిర్మాల్యోప భోగ సంస్పర్శన తద్ధరణ సమాలోకన పద పరిలంఘనవిధులు.

15. నిరంతరాభ్యాస పక్వ నిర్ణీతాంతఃకరణ విశుద్ధ శివైక్య స్ఫురణత.

16. అవికల దేవాసుర నర నివహ సదా పూజనీయ నిత్యో త్సవ సచ్ఛివలింగ పరాఙ్ముఖ మానవ సంభాషణములు.
17. భవదుద్భట నిటలేక్షణ భవ జృంభిత నిటలవహ్ని.
18. మందర హిమవత్ప్రధాన మహిత మహీభృత్సందోహ ములు.
19. లాలా సురవక్షస్స్థల కీలాల జలప్రవాహ కేళీలోలాభీల త్రిశూలహస్తులు.
20. పింగళ కపర్ద డమరుక గంగా భసితాంగరాగ ఖట్వాంగ ధరుల్.
21. శుంభత్ఫాలాభీలాక్షి దహన భస్మీకృత దుశ్శీల త్రిపుర మహాసుర క్రోలాహలులు.
22. నారాయణాది సురదనుజోరగ ముని మానవేంద్రయూథ సదా లోకారాధ్యమాన చరణాంభోరుహులు. ఇట్టివి పర శ్శతములు.

ఈకవి లాక్షణికుఁడనని క్రిందిపద్యములో సూచించుకొనెను :—

"పూని, యతద్గుణ సం వి
జ్ఞాన బహువ్రీహి మాన్పఁ జనుదెంచిన యణ్,
మానిత షష్ఠీతత్పురుషా
నూన సమాస మెఱుఁగ రజ్ఞులు రుద్రా"

మఱియు, నితఁడు "వలపలగిలక" ప్రాసమును సమ్మతించినట్లు గనఁబడుచున్నది :—

320 వ పద్యమున :—కర్మ, నిర్మల, తమ్ముల, నిర్మింతు— అనియు,—444 వ పద్యమున :—నమ్మిన, బమ్మయు, (లో)కమ్ముల, ధర్మంబు—అనియుఁ బ్రయోగించెను. దీనిఁబట్టి, యొక్క పాదమున సంయుక్తాక్షరమును, తక్కినమూఁడుపాదములందు, సంయుక్తాక్షరము లందలి యొకహల్లునకు రేఫమును ;—అట్లే, రేఫతోఁగూడిన హల్లొక పాదములోను—రేఫలేని యాహల్లే సంయుక్తముగ తక్కినపాదము లందుఁ బ్రయోగింపవచ్చునని పూర్వ లాక్షణికుల మతమయినట్లు తెలియుచున్నది.

"ద్యూతక్రీడకుఁ గొండొక నేర్తున్"—అని తిక్కనయు నీప్రాస మును సమ్మతించినట్లు విరాటపర్వమునం దుదాహరణమున్నది. కాని దానిని నేఁటిపండితులు "నేతున్" అని దిద్దిరి. నన్నయప్రయోగములు. పై విధముగ లేవు గాని, నన్నెచోడుఁడు కూడ (భర్గ, తర్గ, నుగ్గాడు, మ్రగ్గింతు—అని యొకపద్యమునఁ బ్రయోగించుటవలన) యంగీకరించెను. పాల్కుఱికి సోమనాథుఁడుకూడ నీప్రాసము నొప్పుకొనెను. మధ్య యుగమునందలి కవులనుండి (శ్రీనాథునికాలమునుండి బహుశః) యిది నిషిద్ధమైనది.

ఇఁక "శివతత్త్వసార" మొక మతవిషయిక గ్రంథము గనుక—నందలి యంశములనుఁగూర్చిన పరిశీలన కొంతవఱ కవసరము కాకపోదు. మఱి కన్నడ "శివతత్త్వసారము"నకు, తెలుఁగు తత్త్వసారమునకుఁ గల వ్యత్యాసమునుగూర్చికూడ కొంతవఱకు చర్చింప వలసియున్నది.

## "శివతత్త్వసారము"నందలి మత విషయములు

మల్లికార్జున పండితారాధ్యుల యొక్కయు, బసవేశ్వరుని యొక్కయు సంప్రదాయములందు భేదములేదని మున్ను మనవిచేసితిని. శ్రుతిస్మృత్యాదుల ప్రమాణములను పండితారాధ్యుల సంప్రదాయజ్ఞు లంగీకరింతురు. కాని బసవేశ్వర మతస్థు లంగీకరింపరు. మొదటివారికిఁ గర్మ ప్రధానముగను, రెండవవారికి భక్తిప్రధానముగను నుండునట్లు తోఁచును.

"శివతత్త్వసార"మున పరమ శివ మహిమనుగూర్చి పండితారాధ్యు లత్యుత్కృష్టముగను సంగ్రహముగను వర్ణించెను :—

1. పశు పాశుపత జ్ఞానము నీక్రింది పద్యమునం దెంత సూక్ష్మముగాఁ గవి వెలువఱించెనో చూడుఁడు :—

> "జీవుల నేకులు పశువులు
> భావింపఁగ ప్రకృతి వికృతి బంధము పాశం
> బావృతము, లనం బశువులు
> నీవా రెంటికిని పతివి నిరుపమ మహిమా !"

దీనికి శ్రుతిప్రమాణమును గలదు.

2. అద్వైతమతము నీతఁడు తీవ్రముగ ఖండించెను. జీవునికి బంధమోక్షదశావస్థ లుండుటవలన నతఁడు పరమాత్మతో నైక్య మగుట కవి ప్రతిబంధకములనియు;—'పరమేశ్వరునికి, పరమక్లేశాత్ము లైన పశు, జీవుల కుండెడి యంతరము, ధాత్రీధర పరమాణువులకుఁ గల యంతరమువంటి'దనియు;—'కలదననోపక లేదని పలుకఁగ నేర కయు, మూకబధిరులక్రియ నిమ్మల నద్వైతులు తమ లోపల వగతు' రనియు;—'ఆరాధ్యుం డారాధకుఁ డారాధకమనఁగ లేని యద్వైత దురాచార కృత సర్వశూన్యాకారస్థితి'—యనియు;—'సర్వసంకర మాత్మాద్వైతంబు'—అనియు; 'ప్రత్యక్షాదిప్రమాణ బాధాబాహ్యం బత్యనుచిత మద్వైతం, బనియు;—పాతక యథేష్ట దుష్ట వ్రాత జగద్వి ప్రలంభ వాదమ కా కద్వైతము శిష్టవ్రాత గృహీతమె' యనియు నీసడించెను.

3. అద్వైతులను కసిదీర దూషించెను:—

i. పాతకు లాత్మాద్వైతులు నీతియెఱుంగుదురె?

ii. అద్వైత విమూఢునకును లోకాయతునకు భేదమ్ము గలదె.

iii. గతశిఖా గాయత్రీ యజ్ఞోపవీత నాస్తికు లజ్ఞులు.

iv. స్వేచ్ఛాచారులు మిథ్యావిచ్ఛేదన వేద శాస్త్ర విప్లవవాదుల్, ప్రచ్ఛన్నదోషు, లజ్ఞానాచ్ఛాదిత దుష్టచిత్తు, లద్వైతులు.

v. దుర్మదులగు మాయావాదులు.

vi. ఆత్మాద్వైతులు విమోహితాత్ములు.

4. శివభక్తుఁడు కాని భర్తను భార్య వదలవచ్చునఁట:—

"శివభక్తుఁడవగుమని పతి
కవిరతమును బుద్ధిచెప్పనగు శివభక్తిం
దవిలినసతి, కతఁ డొడఁబడఁ
డవునేనియు నతని మీఱనగు భక్తిమెయిన్"

5. శివుని గొలువనివారు మానిసి గాడ్దియలు!

"..........నిన్ను గొలువని
మానసిగాడ్దియలు భువి నమాన్యులుగారే!

6. శివనిందకులు వధార్హులు.

"శివనిందకులగు పాపుల
నవిచారితవృత్తిఁ జంపనగు నీశానా"

7. శివనిందచేయు గ్రంథములు కాల్పవలెనఁట!

"శివనిందావిషయంబగు
నవమానము సెప్పునట్టి యప్పుస్తకముల్
అవిచారంబునఁ గాల్పఁగ
నవు"

ఇట్టి పరమశైవాచారవ్రతమునకు సంబంధించిన విశేషము లనేకములు. "శివతత్త్వసారమునఁ" గనిపించుచున్నవి :—

శివుని విషయమై మృతి నందినవానికి, ఔర్ధ్వదైహికక్రియ లక్కఱలేదు. వానివంశస్థులకు మృతాశౌచముగూడ లేదు. అట్టివాని మృతికి సంతసించుటయేగాక, పండువులుగూడ చేసికొనవలెను. శివనిర్మాల్యము శివదీక్షితుఁడు తప్పఁ దక్కినవా రనుభవింపఁగూడదు. —ఇన్ని విషయము లెఱిఁగించిన యీగ్రంథమున "లింగధారణ"ను గూర్చి యొక్కమాటగూడ లేకుండుట ఆశ్చర్యకరమే!—

## తెలుఁగు. కన్నడ— శివతత్త్వసారములు

తెలుఁగు "శివతత్త్వసారమున" మొదటినుండి 489 పద్యములున్నవి. ఆతరువాతివి లేవు. కాని 1949 సం॥న ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమువారు ప్రచురించిన (సం II సంచి : 1, 2 సంఖ్యలు గల) బుల్లెటినులలో—184 నుండి 491 వఱకును, 725 నుండి 740 వఱకును, పద్యములున్నవి. దీనిని సమకూర్చి ప్రచురించి శ్రీ. వి. హనుమంతరావు; ఎం.ఏ., యల్.టి., గారుకూడ—నేనన్నవిధముగా "శివతత్త్వసారము" లోని పద్యములు 1000 వఱ కుండవచ్చునని యభిప్రాయ పడిరి.

కన్నడ గ్రంథమునందలి కందములన్నియు దాదాఁపు తెలుఁగు ప్రతిలోనివాని ననుసరించిన భావములు, సమాసములు—తుదకు "ప్రాస" శబ్దములు గూడ కలిగియుండుటవలన నిది "మక్కికిమక్కి" కన్నడీకరణమని చెప్పుట కేమాత్రము సంశయము లేదు. కనఁబడినంత

వఱకు రెండిటిలోని పద్యము (దొరకినంతవఱకు) లన్నియు విషయము లందు సరిపోలుచున్నవి.

No. 11046

తెలుఁగు "శివతత్త్వసారము" నందు లేనివి (725-వ పద్యము మొదలు 740-వ పద్యమువఱకు) కన్నడ ప్రతియందు శిథిలాశిథిలము లుగాఁ గనఁబడుచున్నవి. వానిలో 731, 732, 733, 73[illegible] గల పద్యములు పూర్తిగా శిథిలములైనవి. తక్కినవాని నీక్రింద పొందు పఱతును :—

మృడనినగె భక్తియిందం
నిడిదాగియె బిద్దన మిగువ వనపాపంగ
ళ్కెడ దప వాత ను మేళ
ల్కొడ నేళవు తొలఁగిపోవ వనితరొళీసా ॥ 726

కృతమది వర్ణాశ్రమగళ్
శ్రుతిమహిత ముమాధభూతిరుద్రాక్షె గళం
సతతం ధరి సల్వేళ్కుం
ప్రతిదిన కృత కర్మతతి సఫలమాగలజా ॥ 727

ఉపమిసలు రుద్రాక్ష
త్రిపుండ్రధారణ విరహిత విప్రవర్గం
జప దాన వ్రత...... ధ
ర్మపురోగమ కవ...... విధిగళ ఫలమిళె యొళ్ ॥ 728

రెడ్డం దాదొడ వణి క దొ
ళడ్డం ధరిసల్ త్రిపుండ్రమంధల వేత ?
కడ్డం బత్పటె పితృపతి
యొడ్డి ద సంతతి గళిని తు గిరిజారమణా ॥ 729

విస్మయమిరతి ప్రియ దిం
భస్మవను ఔ ధరిపనరనపాప సమూహం
భస్మీకృత ముక్కుం ద
గ్ధస్మర నిన్న ప్రతాప దింద మహేశా ॥ 730

.......................

......తహాశిన భక్తి మహిమయుం విభవం మ

త్తిం తప్ప విచిత్రమని ద
నెంతెం .........ర్వశుభకర రుద్రా ॥ 735

విలసద్భక్తియ నర్చిప
దలసి దతను మిప్పదిహాకె పొతెయాగల్కం
సలెపరద గతి నరకం
గ ళోళవనం మణ్ణిసల్క మురగాభరణా ॥ 736

శివభక్తిబోధె

యమలు గడా తననగర
ద్రుమం గళిదిరల్లి దొతెదు......ర్వార
భ్రమెయిందె వెడదె భక్తి యి
దుమేళవు జి సప్పు దిష్టార్థ పలం ॥ 737

అవని యొళతి దుర్లభ మా
నవజన్మం బడె దు విశ్వనాథన నొలవిం
శివనం పూజిసదిహ మా
నవరు వృథా జన్మ జీవనవ్యాపారర్ ॥ 738

విదిత శుభాశుభ బోధా
స్పద, మానవనాగి పుట్టి హరనంభజిసల్
ముదమిల్లదొ రవె హసుగళ
గుదివజే యల్కెం దు బగదు భజసీశ్వదనం ॥ 739

శిష్టాచారమమళియ ......
.......................గర్వా
వష్టంభవతి చుందిరదమతి యిం
దిష్టదె నీభజసుభక్తి యింశ కరనం ॥ 740

తెలుఁగు కన్నడ "శివతత్త్వసారము"లలోని పన్నియు సమన్వయు పరచవలెననుకొనినను—రెంటిలోఁ గనఁబడు పద్యముల మధ్య కొలఁది హెచ్చుతక్కువలుగా 230 పద్యములు లోపించుచున్నవి. మల్లికార్జున పండితారాధ్యుల యీామహత్తర కృతి సంపూర్ణముగా నాంధ్రలోకమునకు సంప్రాప్తించు పుణ్యకాలమెప్పుడో!

——♦♦——

# శతక కవి సార్వభౌముఁడు

# యథావాక్కుల అన్నమయ్య

(క్రీ. శ. 1218—1285)

"ధాత్రీ న్నక్తజనానురంజనముగాఁ, దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థోచిత శబ్దబంధురముగా, సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా, శుభాంచితముగా, శోధించి సర్వేశ్వర
స్తోత్రం బన్నయ చెప్పె నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా!"

ఈపద్యమందలి ప్రతివాక్యముకూడ సార్థకమే యని "సర్వేశ్వర శతక"మును సవిమర్శముగాఁ జదువు ప్రాజ్ఞులకు గోచరించును. ఈశతకముయొక్క గొప్పఁదనమునుగూర్చి శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారు "భారతి" తారణ ఫాల్గుణసంచికయందు విపులముగాఁ జర్చించిరి.—దీని నిదివఱకే, సాహిత్యపరిషత్తువారు, శైవసిద్ధాంతముద్రాక్షరశాలవారు, వావిళ్లరామస్వామిశాస్త్రిలు "అండు" సన్నవారు, కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ప్రకటించిరి. ఇవన్నియుఁ గూడ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమందలి వ్రాఁతప్రతి కించుమించుగా సరిపోవుచున్నవి.—ఈశతకము "సర్వేశ్వరా"—యను మకుటముతో 142 మత్తేభ శార్దూలవృత్తములతో నొప్పుచున్నది.

ఈ కృతికర్త తన్నుగూర్చియు, తన శతకరచనాకాలమును గూర్చియు, నీక్రింది 142, 130 పద్యములం దీవిధముగా వివరించెను :—

"జయశక్తి న్రవిచంద్రతారకముగాఁ జల్పెన్ యథావాక్కులా
న్వయ సంజాతుఁడు నన్నమార్యుఁ డవని న్వర్ణించి నీసత్కథా
క్రియసంబోధన నీదుభక్తిని, మహానిర్ణీత విశ్రాంతిగా
భయవిభ్రాంతులు లేక, యీశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా".

"శాకాబ్దంబుల వార్ధి షట్క పురజి
త్సంఖ్యం బ్రవర్తింప, సు
శ్లోకానందకరంబుగా, మహిమతో
శోభిల్ల సర్వేశ్వర

ప్రాకామ్యస్థవ మొప్పఁ జెప్పె, శుభకృ
త్పరివ్యక్త వర్షంబునన్
శ్రీకంఠార్పితమై వసుంధరపయిం
జెన్నొంద సర్వేశ్వరా !”

పరమేశ్వర భక్తి రస ప్రపూరితమగు నీశతకమును రచించిన మహాకవి యథావాక్కుల అన్నమయ్య “ఆరాధ్య బ్రాహ్మణుఁడు”; ఆత్రేయ గోత్రుఁడు; యజుశ్శాఖీయుఁడు. “అభిరమ్యంబగు దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర ప్రభుకారుణ్య వసంత సంజనిత మద్వాక్య ప్రసూనావళిన్” అని చెప్పుకొనుటచే నితఁడు కర్నూలుజిల్లా, ప్రత్తికొండ తాలూకాలో ప్రత్తికొండకు సమీపమునందలి “దూదికొండ” గ్రామవాస్తవ్యుండగు నారాధ్యసోమేశ్వరుని శిష్యుఁడని తెలియుచున్నది. అన్నమయ్య మొదటివాసస్థలము గోదావరీతీరమందలి పట్టిసము. తరువాత నితఁడు శ్రీశైలయాత్ర కేఁగి తిరిగివచ్చుచు, పల్నాటి తాలూకాయందలి సత్రశాలలో నివాసమేర్పఱచుకొని, యక్కడనే “సర్వేశ్వరశతకము”ను రచించి కొన్నినాళ్లకు సిద్ధిఁబొందెను.—ఇతని వంశీయులలో “సోమరాజు” అను నతఁడు మిక్కిలి ప్రసిద్ధిపొందినందువలన నింటిపేరు “సోమరాజు” వారుగా మాఱినది. ఇప్పటికిని, ఈయింటిపేరివారు పల్నాడుప్రాంతములం దున్నారు. ఈవిషయము సాహిత్య పరిషత్తువారి “సర్వేశ్వరశతక” పీఠికవలనఁ దెలియుచున్నది.

ఈకవి కాలనిర్ణయమునుగూర్చి శ్రమ నందవలసిన పని లేక శతకమునందే “శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్య” యను పద్యమునందు కవి స్పష్టపఱచెను. అనఁగా శాలివాహనశతము 1164 శుభకృత్సంవత్సరము (క్రీ. శ. 1242)లో శతకరచన జరిగినది. అప్పటి కన్నమయ్యకు “30” యేండ్లని తలఁచినను, అతఁడు (క్రీ. శ. 1212—15,ల ప్రాంతమున జననమంది యుండవలెను. అప్పటి యాయుర్దాయము ననుసరించి, 65—70, యేండ్లైనను నితఁడు జీవించియుండినయెడల—నతని జీవితకాలము క్రీ. శ. 1215—1285 వఱకైన నుండునని యూహించుట కవకాశమున్నది. ఇచ్చట మఱియొక యంశముగూడ ముఖ్యముగా గమనింపవలసినది లేకపోలేదు. ఇతఁడు పాల్కురికి సోమన

శిష్యుఁడని కొందఱి మతము. కాని, అదియెట్లును పొసఁగదు. * "అన్నమయ్య, సర్వేశ్వరశతకమున పాల్కుఱికి సోమన భావములను గొన్నిఁటి ననుకరించి యున్నాఁడు. ఆకారణము ననుసరించి యిర్వురు సమకాలికులుమాత్రమే గాక సమవయస్కులుగ (మూఁడునాలు గేండ్లు హెచ్చుతక్కువగ) నుండవలెను. అయిన, పాండిత్యమునందు, ప్రతిభయందు,—పరమతవాదఖండనయందు — బహుళ విషయజ్ఞతయందు —ప్రజ్ఞాప్రాభవములందు—పాల్కుఱికి సోమనారాధ్యుఁడే—ఇతని కన్న నెన్నియో రెట్లెక్కువవాఁడనిపించును. ఆ యీ కారణములవలన సోమన "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునకుముందే, తన యుద్గ్రంథములను దేశికవిత యగు ద్విపదలో వ్రాసి—ఉడుకు నెత్తుటి ప్రాయమునఁ దనకున్న బసవేశ్వరభక్తి — పండితారాధ్యాభిమానము—వీరశైవదీక్ష—వెల్లడించెను. కనుక, అన్నమయ్య—భక్తిప్రతిపాదకమైన తన "సర్వేశ్వరశతకమునకుఁ" గావలసిన సరుకు నాతని బసవపురాణ పండితారాధ్య చరిత్రానుభవసారములనుండి గ్రహించుటయం దాశ్చర్యములేదు." — అన్నమయ్య పాల్కుఱికి సోమనశిష్యుఁడను వారి వాదధోరణియిది. కాని, తదాధారములంత బలవత్తరములు కావు.

ఈసందర్భమున — "సోమన యభిప్రాయములకు — అన్నమయ్య యభిప్రాయములకు నెంతవఱకు పొత్తుకుదురు?"యన్నది విచారణీయాంశము. "భక్తిని బలపఱచు పట్టులయం దన్నమయ్య కొన్నిఁట—సోమన ననుకరించినాఁడు. దానికిఁ గారణ మదివఱకే యతని గొప్పతనమునుగూర్చి, అతని వీరమాహేశ్వరవ్రతమునుగూర్చి—పాండిత్యప్రతిభలనుగూర్చి విని యతనిపై నెనలేని గౌరవభావము గలిగియుండును. అంతియగాని, యణుమాత్రమైనను, అతనిబసవభక్తి, అన్యమత నిరాసము. స్వమతపక్షపాతము, నితనికి లేదని సర్వేశ్వరశతకపద్యములు ఘంటాపథముగా నొడువుచున్నవి." ఇందలి యథార్థ్యము ముస్ముందు చర్చింతము.

ఇది యిట్లుండ — "దూదికొండ" — నివాసియైన ఆరాధ్య సోమేశ్వరునిశిష్యుఁడగు నీయన్నమయ్యకుఁ బాల్కుఱికిసోమనాథుఁడే

* "భారతి"—తారణ సం॥ర ఫాల్గుణసంచికలోని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి "శివకవి యథావాక్కుల అన్నమయ్య యను వ్యాసమును జూడుఁడు."

గురువని యీ క్రిందివాక్యములలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెలిపిరి :—

"అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర ప్రభు కారుణ్యా వసంత సంజనిత మత్పద్యప్రసూనావళిన్"—

(అన్నమయ్యకృతియందలి చివరిపద్యములలో) నొక సోమనారాధ్యుని బేర్కొనినాఁడు.

"పై పద్యమున నారాధ్యసోమేశ్వరుఁ డన్నమయ్యగురువని యిది వఱకు విమర్శకులు నిర్ణయించిరి. ఈతఁడు పాల్కుఱికి సోమనాథుఁడే కాఁదగునని నేనూహింతును. సోమనాథుని సోమనారాధ్యులనికూడ, ఆంధ్ర వీరశైవకవులును, సోమేశ్వరుఁడని కర్ణాటకకవులును బేర్కొనిరి."

ఈవాద మేవిధముగను సమర్థనీయముగాఁ గనఁబడుట లేదు.

1. పాల్కుఱికి సోమనాథుఁడు—పాల్కుఱికి, ఓరుగల్లు, * దోకిపఱ్ఱు, కర్ణాటక దేశములోని "కలిగ" మొదలైన స్థలములలోఁ గొంత కాలము గడిపినట్లు తెలియుచున్నది. కాని దూదికొండలో నతఁడు నివసించినటు లాధారములు లేవు. కాకున్న, శ్రీశైలయాత్రాసందర్భమున గొన్నినాళ్లక్కడ "మకాము" పెట్టెనేమో!—కాని, ఎన్నఁడు దూదికొండ నివాసి మాత్రము కాఁడు. ఈవిషయమున శ్రీవేంకటరావుగారు జూపిన యథోజ్ఞాపికయందలి పుక్కిటిపురాణకథ విశ్వాసార్హముగాదు. మఱి, బలవత్తరమగు హేతువునుగాదు.

2. పాల్కుఱికి సోమనాథుఁడు—"ఆరాధ్యసోమేశ్వరుఁడా ?" శివకవు లతనిని సోమన—సోమనాథుఁడు — సోమనారాధ్యుఁడు— అని పేర్కొనిరి — కాని "సోమేశ్వరుఁడని" కాదు. దూరముగా నున్న కర్ణాటక కవులెవ్వరో యతనిని గూర్చి విన్నవారు పలువిధములఁ బేర్కొనుట ప్రామాణ్యముగాఁజాలదు.

3. సోమనాథుని నామాంతమందైన "ఆరాధ్య" యనునది బిరుదముగాఁ జేర్చుచువచ్చిరి. కాని, ఇంటిపేరువలె నామము మొదట గాదు. "ఆరాధ్య సోమేశ్వరుఁ"డనినపుడు—"ఆరాధ్య" యనునది

* ఇది గుంటూరు మండలములోనిదని తెలియుచున్నది.

"ఇంటిపే"రగును కాని, బిరుదముగాదు. ఆపక్షమున "ఆరాధ్యసోమేశ్వరుఁడు"—పాల్కుఱికికి సోమనాథుఁడు కాఁడు.

4. అన్నమయ్య నిజముగా పాల్కుఱికికి సోమనాథుని శిష్యుఁడైన—ఇందులూరి అన్నయ్య—శివరాత్రి కొప్పయ్యల విధముగా సహజవీరశైవదీక్ష నవలంబించి జంగముముగా నుండియుండును. కాని యతఁడు "బ్రాహ్మణ్యంబుఁ" బాయని యజుశ్శాఖీయుఁడగు నారాధ్యుఁడు.

5. పాల్కుఱికికి సోమనాథుని గురువుగా నంగీకరించినవాఁడైనచో, అన్నమయ్య—తనశతకమున బసవేశ్వరమహిమనుగాని, తనగురువు ప్రభావమునుగాని తడవకుండఁజాలఁడు. కాని, ఈకృతియందు (సర్వేశ్వరశతకమున) అట్టి దెచ్చటను గనఁబడదు.

6. ఎంత శివభక్తి పరములైనను—ఇతని పద్యములం దక్కడక్కడ—అద్వైత భావములు స్పష్టముగా తొంగిచూచుచున్నవి. సోమనాథుని శిష్యు లిట్లు వ్రాయుట అసహజము.

"ఏతావాతా" తేలిన దేమన ;—పాల్కుఱికికి సోమనాథుఁ డన్నమయ్యగురువుగాఁడనియు, దూదికొండవాస్తవ్యుఁడగు "ఆరాధ్యసోమేశ్వరుఁడే"—యగుననియు.

ఇఁక నీతని విద్వత్కవితాశక్తులను గూర్చి ఇంచుక పరామర్శింతము :—

అన్నమయ్య, కృష్ణాతీరమునందలి సత్రశాలలో—మల్లికేశ్వరుని సేవించుచు నీశతకమును వ్రాసెనఁట! ఆవిధముగా వ్రాసినప్పుడొక్కొక్క తాళపత్రముమీఁద నొక్కొక్క పద్యము వ్రాసి, కృష్ణానదీ ప్రవాహమున వేయుటయు, అది యెదురీఁది వచ్చునెడల దానిని పరిగ్రహించుటయు, ఆప్రకారము రానియెడల గండకత్తెర వేసికొనుటకు ప్రతిజ్ఞచేయుటయు జరిగెనఁట !—అప్పుడు :—

"తరులం బువ్వులు పిందెలై యొదవి,
తత్తజ్జాతితోఁ బండ్లగుఁ
హగ ! మీపాదపయోజ పూజితములై
యత్యద్భుతం బవ్విరుల్

కరులా, నశ్వములా, నవర్ఘ్యమణులా,
గర్పూరమా, హారిమా,
దరుణీరత్నములా, బటీరతరులా?
దథ్యంబు సర్వేశ్వరా !"

యను పద్యముగల తాటియాకెదురేఁది రాకపోఁగా, తనశప థము ననుసరించి యన్నమయ్య గండకత్తెర వైచికొనుటకు సిద్ధపడెను. ఇంతలో పసులకాపరి యాపత్రమును దెచ్చి యియ్యఁగా, నందు :—

"ఒకపుష్పంబు భవత్పదద్వయముపై
నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ, బున
ర్జన్మంబు లేదన్నఁ, బా
యక కాలత్రితయోపచారముల ని
న్నర్చించుచుం, బెద్దనై
ష్ఠికుఁడై యుండెడివాఁడు, నీవగుట, దాఁ
జిత్రంబె సర్వేశ్వరా"

అని యుండుటచే దాని నన్నమయ్య తీసికొనెనఁట !—ఈగాథ యొంతవరకు సత్యమో, కాని శివార్చనకు ఫలితములు రెండుపద్యము లందును రెండురకములుగాఁ గనిపించుచున్నవి. మొదటిది సకా మార్చనగను, రెండవది నిష్కామార్చనగను రూఢి యగుచున్నది. అందు రెండవది మేలైనందున—పసులకాపరివలన దొరికినది. ఈశతక శైలి పరిశీలించినకొలఁది—అన్నమయ్య దీనికంటె నుద్గ్రంథమును చేసినైనను—రచించియుండిన, భాషకెంతేని నుపకారముగ నుండు టయేగాక. యతనికీర్తిగూడ నినుమిక్కిలిగ వ్యాపించియుండెడిది. ఈ కృతియందలి కవిత్వము చాలప్రౌఢమైనది. సంస్కృతశబ్దములతో— జటిలసమాసములను గూర్చుటయం దితఁడు నన్నయ, నాచనసోమన, శ్రీనాథాదుల కెంతమాత్రము తీసిపోవఁడు కుంటువోని సరళమైనధార. కమనీయమైన "బారాహజారి" కదమునడకలకు నడక దిద్దునవి. ఈతని పద్యముల నడక యెగుడుదిగుడులేని సాపుసంతనలుగల పదముల వరుస—తూఁచి, ఏర్చి, కూర్చిన ముత్తెములకోవ. భక్తిరస సుధా వాహినియందుఁ బాఠకులను బరవశులనుఁ జేయు మృదుమధుర భావ

వ్యక్తీకరణ సమర్థతయం దన్నమారాధ్య — పోతనామాత్యులలోఁ గుడియెడమలు నిర్ణయించుట యరిది.

అన్నమయ్య శతకపద్యములన్నియు — భక్తిప్రబోధకములు ; అయినను నవి యద్వైతభావములతో నాత్మానాత్మ విచారవిషయములతో వేదాంతరహస్యబోధనలతోఁ బెనవైచికొని, పరమశివునివంక కెట్టిసాపండునైనఁ ద్రిప్పఁజాలినవి. ఈక్రిందిపద్యములు చూడుఁడు :—

"ఉరుసంసారగజేంద్రదర్పదళన వ్యాఘ్రప్రతాపోగ్రకే
సరి, దుష్పాపశరీరబంధవిపుల క్ష్మాజవ్రజచ్ఛేద వి
స్ఫురితక్రూరకుఠారధార, దురిత ప్రోద్భూతజీమూతస
స్తతిసంఘాత విఘాతమారుతము, నీ సద్భక్తి సర్వేశ్వరా !"

"ఆకాశానల చంద్ర సూర్య పవమానాత్మాంబు విశ్వంభరా
ప్రాకామ్యాంచితమూర్తి భేదముల నీ బ్రహ్మాండ నానాఘటా
నీక ప్రాకట జీవిభావ విలసన్నిర్మాణ కర్మాద్భుతా
స్తోక శ్రీకరమూర్తియై నెగడు నీ స్థూలంబు సర్వేశ్వరా ॥"

ఈశతకమునందలి భావములు చాలవఱకు "మహిమ్నము" "మల్హాణము," "అనామయము," "హాలాయుధము" మున్నగు సంస్కృతగ్రంథములనుండియు, "శివతత్త్వసారము" మున్నగు నాంధ్ర గ్రంథములనుండియు గ్రహింపఁబడినవి.

ఇతని తరువాతివారగు సోమనాథాదు లితని భావముల ననుకరింపకపోలేదు.

"కల్పిత లింగజంగము సుఖస్ఫురణాయ నమోనమో, యసం
కల్ప వికల్ప మార్గ కథితప్రథితాయ నమోనమో, గుణా
కల్ప వరాయ తే యనుచు గౌరవ లీల నుతింతు నిన్ను, న
స్వల్పతరప్రభావ, బసవా, బసవా, బసవా, వృషాధిపా !"

అనుపద్యము—సర్వేశ్వర శతకమునం దీక్రింది పద్యమున కరణము—

"శ్రీకంఠాయ నమోనమో, నతసుర జ్యేష్ఠాయ రుద్రాయ లిం
గాకారాయ నమోనమో, విగతసంసారాయ, శాంతాయ, చం
ద్రాకల్పాయనమోనమో, దురితసంహారాయ తేయంచు ని
న్నాకాంక్షం బ్రణుతించు మానవుఁడు నీవైయుండు సర్వేశ్వరా !"—

ఈకృతియందలి యుపమానములు, అర్థాంతరన్యాసములు— నిర్దిష్టభావముల కతుకు నంత సన్నిహితములుగా నున్నవి :—

1. నిర్మలగంగా పృథులప్రవాహ మరయం బ్రస్ఫూర్తిఁ దా నెన్నివంకలుగాఁ జారిన, దాని నొందువలుకంగాఁజన్నె ?

2. ఘటదుగ్ధంబులు పేరుఁగాక, వెలయంగా నెంత తోడంటిన న్నటదుగ్ధాంబుధి పేరునే ?

3. భ్రమరధ్యానముఁ దాల్చి కీటకము సద్భావాది సంయుక్తిఁ దా భ్రమరంబై ఖగవీథి నాడుననిన౯.

4. సతి వేడ్కం దనప్రాణవల్లభునితో సంయోగ మర్థించుఁగా, కతనిం బ్రార్థన సేసి సొమ్ముఁ గొనిపో నర్హుండునే ?

5. కమలాప్తుం డుదయింపఁగా, నవల నక్షత్ర క్షపాధీశ తేజములెల్లం బెడఁబాసి పోవుగతి౯.

6. చీఁకటికిం దిగ్మమరీచికిం గలదె సాంగత్యంబు ?

7. ఉరుపక్షంబులు వచ్చునంతకు నిరుద్యోగంబున న్వృక్ష కోటరమధ్యంబున నుండు పక్షిగతి౯.

8. కనకంబందు ఘనీభవించిన కళంకంబెల్ల సువ్యక్తిగా నన లాస్యంబునఁ గ్రాఁగిపోవుగతి౯.

9. కసవుం బెంచిన చేనియట్ల.

10. జ్వరసంతాన విశోషితాంగుఁడు సుధాసంకాశ దివ్యాన్న పాన రసశ్రేణి భుజింప రోయుగతి౯.

11. చకోర పోతము మహీయజ్యోత్స్నయం దుత్సవశ్రీ రం జిల్లుచు వేడ్క నుండుగతి౯.

12. ఉదకం బింకిన లావుదూలి వడిఁదా నుష్ణింపఁగా రొంపిలోఁ గదలంజాలని మీను వానగురియం గ్రమ్మెక్కి పెన్నీటిలోఁ బొదలంగన్న విధంబున౯.

13. శూలస్థాపితుఁడైన మానవునకున్ శూలంబు దుర్వార వాత్యాలిం గంపమునొందకుండుట సుఖంబై తోఁచు మాడ్కిన్.— ఇట్టివి పెక్కులు.

ఉద్దండుఁడగు నీకవి కొన్ని లక్షణవిరుద్ధప్రయోగములు చేసినను, అవి యంతఁగాఁ బాటింపఁదగినవి కావు.

గణభంగము :—

అభ్యంగార్చనజంగ మాహితకరుండై చేసినం, దాశవశృంగా రంబంగు.— మొదటిపాదాంత్య వర్ణము లఘువు. "ఉష్ణింపఁగా"— "పగే, (పగ + ఏ) — "భీతే" (భీతి + ఏ) — 'తోఁడంటెనన్నట'— (తోఁడంటెనన్ + అట)— ఇట్టిప్రయోగముల కానాస్కారము గనఁబడదు.

హస్తామలకము, శవశృంగారము, సిగ్గువిరియు. వజ్రపంజరము, బక వేషి, గీవెట్టు, గింజుకొను,— వాడుకలో నుండు నిట్టి జాతీయము లక్కడక్కడ నీతనిశతకమున సందర్భానుసారముగా పొందుపరచఁ బడినవి.— ఈశతకమును మొత్తముమీఁద ప్రౌఢశైలియం దత్యద్భుతముగా నన్నమయ్య సాగించెను. ఇది తెలుఁగుభాషారమ శతకహార మున మణిపూసవంటిదని నాయభిప్రాయము. (ఉదాహరణము) మఱి రెండుపద్యములు పాఠకుల కుపాయనముగా సమర్పింతును.

> "సత్యం బెప్పుడుఁ దప్పఁడే, మహి దురాచారుండు గాఁడేని, యా
> చిత్యం బేమఱఁడేని, దుర్జనులగోష్ఠిం బొందఁడే భక్తసాం
> గత్యం బాదటఁ బాయఁడేని, మదనగ్రస్తుండు గాఁడేని, నీ
> భృత్యుం డాతఁడు మూఁడులోకములలోఁ బెంపొందు సర్వేశ్వరా"

> "కాయంబన్నది వారిబుద్బుద సదృక్షం బంచు రూపింప లేఁ
> బ్రాయం బన్నది శారదాంబుద తటిత్ప్రాయంబగున్ దత్సుఖ
> శ్రేయం బన్నది మాయ యిట్లెఱిఁగియున్ శీఘ్రంబె నీధ్యానసం
> స్థాయీభావనఁ బొందఁ డేమిటి కయో సంసారి సర్వేశ్వరా"



# శతకకవిబ్రహ్మ

## పాల్కురికి సోమనాథకవి : వృషాధిపశతకము

కవితాకన్యకు ద్విపదపదవిన్యాసముతో నానావిధనాట్యభంగిమ లనర్గళముగా నలవరించి, తెలుఁగుకావ్యవాఙ్మయరంగము క్రొంగ్రొత్త పోకడలు, పొలుపారునట్లు చిందులుత్రొక్కించి, ఆంధ్రవిద్వత్కవిలోక ప్రశంస లందిన పాల్కురికి సోమనాథకవి — "శతకకవిబ్రహ్మ". ఇతఁడు సకలశతక లక్షణ సముదాయ సమలంకృతముగాఁ దన "వృషాధిపశతక"మును — సృష్టించి, — తన వెనుకటిశతకకవులకుఁ జక్కని రహదారి దిద్ది తీర్చినాఁడు.

ఈమహాకవి పెక్కు గ్రంథములు రచించినట్లు పద్యబసవపురాణ కర్త యైన పిడుపర్తి సోమనాథుఁడు, తనకావ్యమున ;—

> "(1) బసవపురాణంబు (2) పండితారాధ్యులచరితంబు (3) ననుభవసారమును (4) చతుర్వేదసూక్తులు (5) సోమనాథభాష్యమ్ము (6) శ్రీరుద్రభాష్యము (7) బసవరగడ (8) గంగోత్పత్తిరగడ (9) శ్రీబసవాద్యరగడయు (10) సద్గురురగడ (11) చెన్నమల్లుసీసమాల (12) నమస్కారగద్య (13) వృషాధిపశతకంబు (14) నక్షరాంకగద్యపద్యములు (15) పంచప్రకారగద్య (16) అష్టకము (17) పంచకము (18) నుదాహరణయుగము, నాదియగుకృతులు"—అని వివరించెను.

ఇందులో, 1, 2, 3, 4, 11, 13, 18 లో నొకటియు— తెలుఁగు కృతులు. 5, 6, 7, 12, 14, 15, 16, 17, 18, లోని మఱొకటియు సంస్కృతములో తక్కినవి (7, 8, 9, 10) — అనఁగా, రగడ లన్నియు కన్నడములు. ప్రకృతము, మన కవసరమైన (ఈకవికృతుల లోని) "వృషాధిపశతకమునుఁ" గూర్చి చర్చించుటకు మున్ను, కవి జీవితమును సంగ్రహముగాఁ దెలిసికొనుట సమంజసము.

పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణమున పాల్కురికి సోమనాథకవికి సంబంధించినకథ నీక్రిందివిధముగా నుటంకించబడినది :—

ఒకనాఁడు పరమేశ్వరుఁడు భృంగిని చూచి 'ఓయీ, మాయాజ్ఞమేరకు బసవఁడు మర్త్యలోకమున బిజ్జల రాజ్యరమాధురంధురుఁడుగా నవతరించి, మామహిమను ప్రకటించుచు, దుర్వాదము లాడువారి మతములను ఖండించి గెలుచుచున్నాఁడు. కనుక నాబసవని మహామహిమ "ఆరవితారకము"గను, సకలభక్తకథామణిసూత్రరీతిగను, భూలోకమున ప్రకాశించునట్లు, (అచటికి వెడలి) నీవాతని చరిత్ర రచించవలసినదని యాజ్ఞాపింపఁగా, భృంగి, పాల్కురికిలో సోమనాథుఁడను నామముతో జన్మించెను.—

అతఁడన్నిలిపులు, శబ్దశాస్త్రాదులు, ఛందోధికరణాదిసరణులు, భాష్యసంతతులు, తర్కమీమాంసాదులు చక్కగా నభ్యసించి, "జైన మస్తకవిన్యస్తశాతశూలకలిత బిజ్జలతలగుండుగండ" బిరుదశోభితుఁడుగా వెలసెను. "భక్తిహితార్థబుద్ధి, భక్తసభలలోఁ జెల్లు" కృతులెన్నియో రచించెను. ఇతని ఖ్యాతి నలుదెసలు వ్యాపించినది.

ఒకనాఁ డోరుగంటిలోని స్వయంభూదేవుని మంటపమున శివభక్తులెల్లరు చేరి (పాల్కురికి సోమనాథుని) బసవపురాణమును వినుచుండఁగా, ఈశ్వరారాధనకై యచట కరుదెంచిన ప్రతాపరుద్రుఁడు వారిని జూచి "అదేమి" గ్రంథమని యడిగెను. అప్పు డొకధూర్తవిప్రుఁడు "పాల్కురికి సోమన పతితుఁ డీనడుమను పెనిచె మధ్య వళ్లుపెట్టి, ద్విపద, యప్రమాణమిది, యనాద్యం" బనఁగా, రాజక్కడ నిలువక వెడలెను. భక్తులపుడు రెండుచెవులు "శివశివా" యని మూసికొని, యా "బ్రహ్మబంధువు" (ధూర్తవిప్రు) చంపయత్నించి, ఆవిషయమును పాల్కురికిలోని తమగురువగు సోమనాథునికిఁ దెలుపఁగా, నతఁడతనిని జంపిన ప్రయోజనములేదని :—

> "భవిగానివానితోఁ దక్క
> వివాదమొనరింపఁ జూడ విధిలేఁ, దైనక్
> శివభక్తిశక్తిఁ దృణమా
> నవుచేఁ గెలిపింతు దూషణ పరుంబాఱుఁక్"

అనిప్రతిజ్ఞ చేసి, లింగముద్రచిహ్నలుగల యెద్దుగట్టిన గుడారుబండిలో నోరుగంటికి బయలుదేరెను.

సోమనాథకవి వచ్చువార్తను ముందుగనే తెలిసికొని, ప్రతిపక్షులు,—అతని నెదుర్కొనుటకుఁ గొందఱు వెఱ్ఱివాండ్రను, ముక్కిడులను, అంగహీనులను — శివచిహ్నాలంకృతులనుగాఁ జేసి పంపిరి. వారెదురువచ్చి, యతనికి మ్రొక్కఁగనే వారి శరీరములు ముందటివిధముగాఁ జక్కఁబడి—శివచిహ్నములు సహజములై హత్తికొనఁగా నతనినిఁ గొలిచి రాఁదొడఁగిరి.

అతఁ డట్లు వారిని వెన్నంటి వచ్చుచుండ నతనిబండియెక్కు చోరుటకు వీలులేని గవనిమీఁది లక్ష్మీప్రతిమ, ఏనుఁగుచిత్రములు రెండు నడ్డుపడుట చూచి, సోమనాథకవి వానిని "తొలఁగు"మని యాజ్ఞాపింపఁగనే యవి తునిఁగి నేలఁబడినవి.

అది విని యతని దూషించినవారును, ప్రతాపుఁడును భయపడినవారై వచ్చి యతనికి మ్రొక్కఁగా వారి నాదరించి, కొన్నిదినములు వారు సేవించుచుండ నోరుగంటియందుండెను.

సోమనాథకవి త్రికాలవేది. కావున నొక్కదినము తన శిష్యులైన పిడుపర్తి శివరాత్రి, కొప్పయ్య మొదలగువారిని పిలిచి "ఈదేశమింక శీఘ్రకాలమున తురుష్కు లాక్రమింతురు. మాకోఁటి నియమస్థ లిక్కడ నిలువవీలుగాదు. మీకీరాజ్యమునందుండుట కనువైన యూరి నిప్పింతును. అచటికేఁగి నివసించు"డని, తన శిష్యుఁడు, ప్రతాపునిమంత్రి యగు "ఇందులూరి అన్నయ్యను" పిలిచి "ఓయీ! నీవు, అరువత్తుమూగుర నర్చించు పరమశైవభక్తుఁడవు. కనుక తత్ప్రీతిగా మావ్రతస్థులకందఱకుఁ బ్రభువుతోఁ జెప్పి యొకగ్రామము నిప్పించు" మన నాతఁ డవ్విషయ మారాజునకెఱిఁగించి సోమనాథ శిష్యులగు కొప్పయాదులకు "దొంకిపర్తి"—యను గ్రామమిప్పించెను. అచటికి శిష్యులతోఁ గూడి పోయి కొంతకాలము నివసించి, వార్ధక్యము సమీపించుటచేత సమాధిస్థుఁడుగాఁ గోరెను.

తనకోరిక నతఁడు శిష్యులకుఁ దెల్పి, ఆయూరు వదల శివగంగకు సమీపమునందలి "కలిగె" యను గ్రామమున, సమాధి కట్టించుకొని, దానియందు విభూతి దట్టముగాఁబోయించి—అందు దిగి శివధ్యానపరాయణుఁడై నిశ్చలముగాఁ గూర్చుండెను.

అపుడు పరమశివుఁడు ప్రత్యక్షమై "నిన్ను కైలాసమునకుఁ దీసికొని వెడలెదను" —— రమ్మనగా సోమనాథుఁడు "స్వామీ! సమాధి తెఱచి, నీవు నన్ను తీసికొనిపోయిన జనులు "సోమనాథుఁడు సమాధిని దెఱచుకొని వెడలెనందురు. తెఱవకయే, నీవు తీసికొని వెడలిన "ఇందే యతఁడు క్రుళ్లె"నని యందురు. కనుక నట్టి యపవాదములు రాక, భవులను చూడరాదను నియమముఁ దప్పించక —— నీస్వరూపమందే నాస్వరూపము గనఁబడునట్లు, స్ఫటిక నందిరూపము ధరించి దాని గర్భమందునన్నునిచి, చూపరులకు సందియము గలుగని రీతిగా నీసమాధిని గాన్పింపఁ జేసి —— నన్ను నీలోకమునకుఁ దీసికొని పొ"మ్మని ప్రార్థించెను. శివుఁ డవ్విధముగనే చేసెను.——

ఇది సోమనాథకవి సంగ్రహ జీవితవృత్తాంతము.——

పై సందర్భములను బురస్కరించికొని పరిశీలించిన సోమనాథకవి (చాల) వయస్సు ముదురువఱకుఁ బాల్కుఱికి యందే యుండినట్లు స్పష్టమగుచున్నది. మధ్యమధ్య శ్రీశైలాదిక్షేత్రములకు యాత్రలు చేయువాఁడేమో కాని, స్థావరముగ (ధూర్తవిప్రవృత్తాంతము జరుగు వఱకు), అథవా, బసవపురాణము రచించిన కొన్ని సంవత్సరములకుఁ దరువాతివఱకు —— నతఁడు తన జన్మస్థలమగు పాలకుఱికి యందే నియమనిష్ఠలతో శైవాచారవ్రతమును నడపుచున్నట్లు తెలియుచున్నది.—— ఈపాలకుఱికి యోరుగంటికి సమీపమునందలి దగుటవలన నితఁడు తెలంగాణము వాఁడనుటయందు సందియము లేదు.

## సోమనాథుని కులగోత్రాదికములు

ఈవిషయములఁగూర్చి చారిత్రకపరిశోధకులలోఁ జాలభిన్నాభిప్రాయములు గలవు. కొందఱు సోమనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడనియు, మఱికొందఱు జంగముఁడనియు వాదించుచుఁ దమ వాదమును బలపఱచుకొని నిలువఁబెట్టుటకుఁ దగినయుపపత్తులను జూపుటకు భగీరథప్రయత్నము లొనర్చిరి. అట్టివారియందు —— శ్రీవేంటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారు, శ్రీడాక్టరు చిలుకూరి నారాయణరావుగారు, శ్రీబండారు తమ్మయ్యగారు ముఖ్యులు. ఇందు మొదటిముగ్గురివి చాలినంత సహేతుకములుగాఁ గనిపించును. శ్రీబం

డారు తమ్మయ్యగారివాదమునకు దొరకిన కారణములు బలహీనములని తోఁచును. ముందుగ శ్రీశాస్త్రిగారి బసవపురాణ పీఠికావాక్యములు పరిశీలింతము :—

"పండితారాధ్యచరిత్రము, చతుర్వేదసారము, బసవరాజీయము, మొదలగు సోమనాథుని గ్రంథములను బరిశీలించిన సోమనాథుని బ్రాహ్మణత్వము సందేహింపరానిదిగ గోచరించును. మంచి శిష్టాచారసంపత్తిగల బ్రాహ్మణునకే యెఱుకవడఁదగిన విషయము లెన్నియో పైగ్రంథములందుఁ గలవు. వానిలో వేదమంత్రము లుదాహృతములైనవి. వేదభాష్యము లుద్ధృతములైనవి. వైశ్వదేవాదిశ్రౌత కర్మల రహస్యము లెన్నియో విమర్శింపఁబడినవి. ఆనాఁడిట్టి విషయములబ్రాహ్మణుల కందరానివిగా నుండెడివి. పండితారాధ్యచరిత్ర మున "సలిఁ బాల్కుఱికిసోమనాథుఁ డనంగ వెలయువాఁడను జతుర్వేదపారగుఁడ" ననుట యాతని బ్రాహ్మణత్వము నుద్ఘోషించుచున్నవి. బ్రాహ్మణేతరుఁడు వేదమును జదువరాదనుటకుఁ బ్రమాణములను, సోమనాథభాష్యమున సోమనాథుఁడే యుదాహరించి యుండెను."

శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారుగూడ ప్రకటించిన శతక మంజరి భక్తి శతక సంపుటమునం దీవిషయమునుగూర్చి పీఠికలోఁ దెలిపిన విషయములుగూడ గమనింపఁ దగినవి :—

"సోమనాథుని గ్రంథములందుఁగల వేదార్థపరిచయమును సోమనాథుని సంబంధ బాంధవ్యములును బ్రాహ్మణ కులసంభవమును దెల్పుచున్నవి. "పాలకుఱికి సోమపతితుఁడ"ని ధూర్తవిప్రుని నిందయే బ్రాహ్మణ కులజననమును దెలుపుచున్నది. సోమనాథుఁడారాధ్య బ్రాహ్మణ కులజుఁడుగఁ బుట్టినను, కాలక్రమమున ననుభవసారమును వ్రాసిన కాలమునకు బ్రాహ్మణ కులగోత్ర మోహామువీడి, శివభక్తుఁడై, బసవకులమును, బసవగోత్రమును స్వీకరించి, ప్రమథగణపరమైన భృంగిరిట గోత్రమును స్వీకరించినటు లూహింపఁదగియున్నది."

"పండితారాధ్యచరిత్ర"—కుపోద్ఘాతము వ్రాసిన చిలుకూరి నారాయణరావుగారి యభిప్రాయముగూడ పరిశీలింతము :—

"సోమనాథుని కాలమునం దేకాక, అంతకు పూర్వమందును, తరువాతను గూడ శైవులయందు చాతుర్వర్ణ్యము లుండెడివని, జంగములనువారు గృహస్థాశ్రమమును వీడి సన్న్యాసులవలె శైవధర్మ ప్రచారముకోసము దేశసంచారము చేయువారని, వారియందు వర్ణధర్మము పాటింపఁబడెడిది కాదని, జంగములుగాని, శైవగృహస్థులు తమ తమ వర్ణాచారములను యథావిధిగా పరిపాలించుచుండెడి వారని, వారిలో శైవబ్రాహ్మణులు సాధారణ బ్రాహ్మణులవలెనే వేదవేదాంగాది విద్యల కధికారముగలిగి, వానికి శైవపరముగా నర్థముఁ జెప్పుచునుండెడి వారనియుఁ దేలుచున్నది. సోమనాథుఁడు జంగమమగుటవలన తన పూర్వాశ్రమ గోత్రమును ప్రశంసించుకొనలేదు. అట్లు ప్రశంసించుట పాతకమని యతని యభిప్రాయము." ఈ యభిప్రాయమును స్పష్టముగా సోమనాథుఁడే, తన "అనుభవసార"మున వాకొనెను.

"భువిలో శివదీక్షితులగు శివభక్తుల పూర్వజాతిఁ జింతించుట రౌరవనరక భాజనంబు."—

ఇత్యాది సర్వసామాన్యముగ శివదీక్షితు లెల్లరకుఁ జెందినను, తనవిషయము (ప్రత్యేకముగ) మనస్సున నుంచుకొని సోమనాథుఁడు చెప్పియుండుననుటలో సందియము లేదు.

పిడుపర్తి సోమనాథకవి, తన పద్య బసవపురాణమున "పాల కుఱికి సోమపతితుఁడీ నడుమను, బెనిచె మధ్యవళ్లు బెట్టి ద్విపద" యని ధూర్తబ్రాహ్మణుని చేతఁ దిట్టించెను. మనకంటె సోమనాథుని కాలమునకు సమీపస్థుఁడును, వీరశైవాచార దీక్షితుఁడును, సోమనాథారాధకుఁడునైన పిడుపర్తి సోమనకు, తానంకిత మొనర్చిన పాల్కురికి సోమనాథునిఁ గూర్చిన విషయము లన్నియు నామూలాగ్రముగఁ దెలిసియుండును. కనుక "నతఁడు (పా. సో) మొదట బ్రాహ్మణుఁడుగ నుండి, తరువాత పతితుఁడయ్యెననెడి యంశమును (తానై చెప్పక) ధూర్తబ్రాహ్మణుని చేతఁ జెప్పించెను. ఆపట్టున సందర్భశుద్ధి గూడ చక్కఁగాఁ గుదిరినది. వేదవేదాంగపారంగతుఁడై తమ వర్ణమునకుఁ జెందిన యొకానొక ప్రతిభాశాలి యన్యధర్మావలంబకుఁడైనపు డావర్ణస్థు లతనిని "పతితుఁ" డని యీసడించుటయందు తమ యాక్రోశ

మును వెల్లడించుట, లోకవ్యవహారవేదు లందఱకుఁ దెలిసినదే. "పతితుఁ" డన "భ్రష్టుఁ" డని యేరవంత భావయందుఁ బరిచయ మున్న వాఁడైనను చెప్పఁగలుగును, అట్లుండ శ్రీబండారు తమ్మయ్య గారు, తమవాద సమర్థన కొఱకు "పతిత" శబ్దమునకు లేనిపోని (పిడుప ర్తి సోమనగూడ ఊహించని) యర్థములు, భావములు లాగుటకు పూనుకొనుటయందు చాల తికమకలు పడిరి.

మఱి, బసవపురాణమున "త్రాటిమాలలు; పచ్చిమాలలు; కర్మచండాలురు" — అని సోమనాథుఁడు బ్రాహ్మణనింద చేసెను. అతఁడు బ్రాహ్మణకులజుఁడైన యెడల నవ్విధముగా నిందించఁడు గదా అని. ఆనింద, బ్రాహ్మణబ్రువులనుగుఱించినది. కాని యుత్తమబ్రాహ్మణుల నతఁడు నిందించలేదు.—సరికదా—పెక్కుచోట్ల (పండితారాధ్య చరిత్రలో) వారిని బ్రశంసించినాఁడు. స్వాధ్యాయపరులై, వేదభాష్యములఁ జెప్పుచు, (శైవాగమములను శివదీక్షాపరులను ద్వేషించని) విప్రుల నతఁడు (సోమనాథుఁడు) పండితారాధ్య చరిత్రయం దేమనెనో చూడుఁడు :—

> "పరమలింగార్చనాపరులు, స్వాధ్యాయ
> పరులునైచను మహాబ్రాహ్మణోత్తములు
> సదువుచు వేదభాష్యములు సెప్పుచును"

"మహాబ్రాహ్మణులఁట," స్వాధ్యాయపరులు—వారి "మహాబ్రాహ్మణత్వమునకు" — "లింగార్చన" మర్హతగా, సోమనాథుఁడు నిర్ణయించినాఁడు. తక్కినవారినే, అతఁడు "త్రాటిమాల"లని,—"పచ్చిమాల"—లని యీసడించినాఁడు. విషయమిట్లుండ, శ్రీతమ్మయ్య గారు, "లింగధారిబ్రాహ్మణులే" "శైవబ్రాహ్మణు"లని యదిలేని వారు "శివద్విజు"లని—"శివబ్రాహ్మణు"లని ప్రయోగింతురుగాక!— అవి ప్రామాణ్యములగు టెట్లు? సోమనాథుఁడు స్పష్టముగ—స్వాధ్యాయపరులు, వేదభాష్య పాఠకులుమాత్రమే—"మహాబ్రాహ్మణులు"—అనుచుండ, దాని గాదను టెట్లు?—"లింగార్చనాపరు"—లన్నపుడు "లింగధారణ" మనుకొనుట కేవలమపోహము.—కావున లింగార్చన తమనిత్యకృత్యముగను, తద్ధారణము దీక్షాసూచనముగను, —అంగీకరించిన ("శివద్విజులు" కానిండు "శివబ్రాహ్మణులు"

కొనినను) వర్ణప్రధానులగు—ఆరాధ్యులకు — వేదాధ్యయనముకం టెను — యజ్ఞోపవీతధారణము కంటెను — అవి ముఖ్యములని యూహించుటకు వీలులేకున్నది.

"అన్యవాదకోలాహల"మను శతకమున—"ఈహితానుషంగ, ఏకామ్రగురుచిత్త, నలినభృంగ, సోమనాథలింగ"—అని తద్గ్రంథకర్త సోమనాథునిఁగూర్చి చెప్పెననియు,—ఆ "ఏకామ్ర" — శబ్దమే — "ఏకోరామ" శబ్దముగా మాఱెననియు, వీరశైవపంచాచార్యులలో "నేకోరాముఁడు" ఒకఁడు ; కాన, అతనిశిష్యుఁడే సోమనాథుఁడనియు శ్రీతమ్మయ్యగారి వాదము. — ఈపట్టున మనమొక విషయమును గమనింపవలసి యున్నది. సోమనాథుఁడు సహజవీరశైవాచారపరుఁ డని నిరూపించుటకు—వారి (జంగమువారి) యాచార్య పీఠములం దొక్కటైన "ఏకోరామ" పీఠమున నతఁడు శివదీక్షవహించెనని, "ఏకామ్ర"యే "ఏకోరామ" యైనదని, — ద్రావిడప్రాణాయామము లెందులకు ? — "ఏక+ఆమ్ర"— యను శబ్దము, "ఏకః+రామ" యని యెంతగింజుకొనినను కాఁగలదా ? అర్థభేదములేదా ?— "శివ ద్విజ"—"శివబ్రాహ్మణ" "మహాబ్రాహ్మణ" శబ్దములకు విపరీత విభేదముచూపిన పరిశోధకులు ; "రెంద్రడేవుల" — "రెంటాల" — కాదని నిరూపింపఁబూనిన మేధావులు ; "పతిత" శబ్దార్థమును తాఱు మాఱుచేయ సిద్ధపడిన ప్రతిభావంతులు "ఏకామ్ర" "ఏకోరామ"— శబ్దార్థములను గుర్తింపకపోవుట వింతలలో వింత !—శ్రీతమ్మయ్యగారు తమవాదన కాధారముగ దొరకు పక్షమున, గడ్డిపఱకనైనను, బంగారు కడ్డివలె నుపయోగింపఁగలరు. ఇతరుల వాదమున కాధారమైన మేరు గిరినైన, దూదిపింజల నెగురఁగొట్టిన ట్లెగురఁగొట్టుటకుఁ బ్రయత్నించఁ గలరు—కనుక, సోమనాథుఁడు సహజవీరశైవుఁడనుట (జంగము) కీయేకోరామ (కల్పనము) శిష్యత్వ మాధారముగ నిలువఁజాలదు. మఱి, యతఁడు "బెలిదేవ వేమనారాధ్యుని మనుమని శిష్యుఁడ"నని విస్పష్టముగ చెప్పికొనుచుండ, "ఏకోరాముఁ"డెట్లు గురువగును ?— ఈ "వేమనారాధ్య"—వంశము శైవబ్రాహ్మణ (ఆరాధ్య) వంశము, కాన శ్రీతమ్మయ్యగారి వాదము పరాస్తమైనది.

అసలు సోమనాథుఁడు స్మార్తుఁడని, తరువాతనే యతఁడు వెలిదేవ వేమనారాధ్యుని శిష్యుఁడయ్యెనని యూహించుటకుఁగూడ నవకాశములు లేకపోలేదు. బసవపురాణమున తనయాభిజాత్యమునుగూర్చి సోమనాథుఁడే :—

"........కేవల భక్తిగోత్రుండ,
భ్రాజిష్ణుఁడగు విష్ణురామిదేవుండు
దేజిష్ణువగు శ్రియాదేవి యమ్మయును,
గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ"

నని చెప్పుకొనెను. దీనినిబట్టి—యతనిని గన్న జననీజనకులు (సాఁకినవారైనను గావచ్చును) వైష్ణవసంప్రదాయము ప్రకారము పేరులు గలవారుగ కనఁబడుచున్నారు. స్మార్తులకు నట్టిపేర్లుండుట సహజమే! సోమన యప్పటికే వీరశైవదీక్షనుబొంది, క్రమముగా సహజ వీరశైవము నవలంబించుటవలన, తన మొదటిగ్రంథమైన యనుభవసారమునఁ దెలిపినట్లు "శివభక్తుల పూర్వజాతిఁ జింతించుట రౌరవనరక భాజనం"బను సిద్ధాంతమునకువచ్చి "గోత్రము" స్పష్టముగాఁ జెప్పలేదు—కాని యతఁడు తలిదండ్రులను పేర్కొనరాదని చెప్పలేదు. ఆప్రకారము చెప్పకుండిన కృతఘ్నతయగుననెడి వివేకి ; కనుకనే బసవపురాణమున చెప్పక విడువనులేదు. పండితారాధ్యచరిత్ర వ్రాయు నాఁటికి వీరశైవముముదిరి — జంగమ మత విధులను బూర్తిగ నవలంబించుటవలన—"బసవగోత్రుండను, బసవనికరుణ, బసవేశుశ్రీపాద, పద్మసేవకుఁడ ; నే బసవన్నదూత, నే బసవనిబంట, బసవన్న బంట, నేబసవన్న లెంగి" అనుచు నారంభించెను.

ఇచ్చట మఱియొక విషయము గమనించుట ముఖ్యము. సోమనాథుఁడు సహజవీరశైవాచార మవలంబించి జంగములతోఁ గల్సిన తరువాత, తనగోత్రమైన,—(పాపహేతువని) చెప్పికొనలేదు.—కాని, తనవిద్యావైదుష్యముమీఁదను, పాండిత్యముమీఁదను, ప్రభావముమీఁదను మితిలేని భక్తిగలిగి—వీరమాహేశ్వరవ్రతమును నిష్ఠతో నాచరించు బంధుజాలముమీఁద నతని యనురాగ మతివేలమైనది. వారీతని విధముగ జంగములందుఁగలసి గోత్రాదులు పోగొట్టుకొనక—

శైవబ్రాహ్మణులుగానున్నను, ఇతనిని గౌరవముతో సంభావించెడి వారు. కనుక నే—తన "పండితారాధ్యచరిత్ర"కు శ్రోతఁగాఁ దనముద్దు మఱఁదినే సోమనాథుఁ డెన్నుకొనెను. వారు తనవిధముగా "సహజ శైవవ్రతదీక్షితులు" కాలేదని—వారి నెన్నఁడు సోమనాథుఁడు తెగడ లేదు. సరిగదా!—అట్టివారి నతఁడు "మహాబ్రాహ్మణు"లని చెప్పెను. కానిచో "బ్రాహ్మణ్యంబుపై భక్తి బాయలేని" పండితారాధ్యుల చరిత్ర మాతఁడు వ్రాయునా?—అట్టి గ్రంథమునకుఁ దన దగ్గరిచుట్ట మగు పాల్కురికి సూరనామాత్యుని శ్రోతనుగాఁ జేయునా?— ఈక్రింది పండితారాధ్యచరిత్రలోని వాక్యములుచూడుఁడు :—

"హారితసగోత్ర విద్యాపుణ్యయాత్ర,
బసవాంతరంగ, శుంభద్గుణోత్తుంగ,
(విను, సూరనామాత్య, వినమితామాత్య)
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
అసదృశశీల మాకనుగులంబనియు
మచ్చిక నాముద్దుమఱఁది వీవనియు
నెచ్చెలికాఁడవు నీవ కాకనియు
చాతుర్య సాహిత్య శాలివీవనియు
శ్రోతృత్వమునకుఁ బాత్రుండవీవనియు,
రచియింతుఁ బండితారాధ్యచరిత్ర"

పై వాక్యములవలన, సూరనామాత్యుఁడు హారితసగోత్రుఁడని, —సోమనాథుని (చిన్న) ముద్దుమఱఁదియని—శైవబ్రాహ్మణుఁడని —జంగములతోఁ గలియలేదని స్పష్టముగాఁ దెలియును. "ముద్దు మఱఁది" యనుటచేత—సోమనాథుని మఱఁదులలో నతఁడు చిన్న వాఁడని—"నెచ్చెలికాఁడ" యనుటవలన నిర్వురన్యోన్యముగా నుండు సమవయస్కులని యూహించుటయందు పొరపాటులేదు. కాని, శ్రీ తమ్మయ్యగారికీసూరనసోమనల సంబంధము గళబద్ధమై—ఎటులైనను సూరనను సోమనాథునుండి వేఱుగావించుటకు విశ్వప్రయత్నము లను చేసిరి. అవి చూచినవారలకు "విమర్శకులకు లోకవృత్తముకూడ తెలియదా! ఏమి?" యని యక్కజమందునట్లు వ్రాసిరి. వారుచూపు కారణములివి :—

1. ఇద్దఱియింటిపేరులొక్కటి. అట్టివారికి బావమఱఁదులసంబంధమసంభవము — వేర్వేఱు కులములవా రొక్కయింటిపేరి వారుండవచ్చును.

2. అట్టి వరుసయే యుండిన, తనకుమాత్రము "భృంగి" గోత్రమని చెప్పుకొని—సూరనను "హారితసగోత్రజుఁడని" సోమనాథుఁ డని యుండుట పొసఁగదు.

3. ఈ బావమఱఁదులవరుస—"తిక్కనమనుమసిద్ధుల" మామయల్లుండ్ర వరుసవంటిదగుటచే నిజముకాదు. ఈవిషయమున శ్రీతమ్మయ్యగారింకను పరిశీలించియుండవలసినది. అట్లు పరిశీలింపకపోవుట శోచనీయము—ఇఁక వారిసందేహములకు సమాధానములు.

1. ఇంటిపేరు లొకటైనను (బ్రాహ్మణులలో) భిన్నగోత్రముల వారుండుట తమ్మయ్యగా రెఱుఁగరు. నేలటూరివారు వైష్ణవులలోను, పుదూరు ద్రావిడులలోను, గలరు. అవధానమువారు ములకనాడులలోను, వెలనాడులలోను గలరు. వేదమువారు పుదూరు ద్రావిడులలోను, ములకనాడులలోను గలరు. (శాఖల భేదములేగాని వీరందఱిది బ్రాహ్మణకులమే.) ఇఁక భిన్నగోత్రీకులు—వేదమువారియందు,—అవధానమువారియందు, — పిడతలవారియందు, నుండుట నేనెఱిఁగినదియ. భిన్నగోత్రజులైన యొక్కయింటిపేరివారికి సంబంధము లుండుటగూడ నాకు చక్కఁగా తెలియును—కనుక, "పాలకుఱికి" యనునింటిపేరు సోమన, సూరనల కిచ్చిపుచ్చుకొను బాంధవ్యమునకు బాధకముగాదు.

2. "శివభక్తుల పూర్వజాతి చింతించుట" నరకహేతువని, సోమన తనగోత్రము చెప్పికొననంత మాత్రమున — నింకను బ్రాహ్మణుఁ డాయని తన బావమఱఁదిగోత్రము చెప్పఁగూడదని యెచ్చట నున్నది ?—

3. సోమన సూరనలవరుసను, తిక్కన మనుమసిద్ధివరుసలతో బోల్చుట విమర్శనాకౌశలాభాసమునకుఁ బరమావధి. — సాధారణముగా, పూర్వము గ్రామములందొకరి నొకరు వేదో వరుసతోఁ బిలిచి

కొనుట యుండెడిది. నేఁటికిని కొన్నిచోటులం దాయాచారము గని పించును. కాని యెంతయనురాగమున్నను—సారస్వతమున శాశ్వత ముగా నిలిచిపోవు గ్రంథములలో నవ్విధమగు (అబద్ధముల) వానివరు సల నుటంకింతురనుట సాహసమేయగును. * అంతటి మహాభారతము వ్రాసిన తిక్కన—ఎచ్చటనైనను, మనుమసిద్ధిని దనయల్లుఁడని తెలిపి కొనెనా ? ఉండిన—సోమన తన "ముద్దుమఱఁది"—యని సూరన్న ననుట యంగీకరింపఁదగినదే—పైగా "ముద్దు" — అనుటయందు "చిన్న"—తనమును సూచించుటవలన నతని (సూరన) యన్నలు కొందఱుండువారని, వారారాధ్యులైనందున—సహజవీరశైవదీక్షార తుఁడైన సోమనయందు భక్తిభావము గలిగియుండియుందురు—కాని ; సూరనవిధముగా నాంతరంగికులుగా నుండకపోవచ్చును ; — అందు వలన "ముద్దు"—అని ప్రయోగించుటయందౌచిత్యము శ్లాఘా పాత్రము. లేకున్న (తనవయస్సుగల) యెదిగిన మగవాని విషయమున "ముద్దు"—ఏమిటి ?—కాన హారితసగోత్రుఁడగు సూరన — సోమ నకు ముద్దుమఱఁది యనుట అక్షరశః సత్యము.

ఇంకను నిశితముగ విమర్శించుకొలఁది,—పాల్కురికి సోమ నారాధ్యుఁడు వీరశైవబ్రాహ్మణుఁడుగనే, (జన్మతః) యుండెననియు, బసవభక్తి పాదుకొనినతరువాత సహజవీరశైవుఁడయి (జంగము) వారితో సర్వవిధముల కలసిపోయెనని, రుజువుచేయుటకు—బలవత్తర కారణము లగపడుచున్నవి. పుట్టుకతో సోమన వీరశైవబ్రాహ్మ ణుఁడే ! అతనిని శైవద్విజుఁడనుఁడు— శైవబ్రాహ్మణుఁడనుఁడు— మహాబ్రాహ్మణుఁడనుఁడు ? — నిజమును — నిప్పును దాఁచుట కెవరి తరము ?

---

* గ్రంథసందర్భములలో కృతికర్తృభర్తలమధ్య మామ యల్లుండ్ర వరుస సహ జముగా ఔపచారికమే అగుట విద్వత్కవిజనసమ్మతమయినదే. కాని బావమఱఁదుల వరుస అట్టిదికాదు. ఉండినను కృతులలో చెప్పుట ఎక్కడ నింతవఱకుఁ గనఁబడదు. దీనింబట్టి, సూరనసోమనల బాంధవ్యము ఔపచారికముగాక, నిశ్చయముగ ఆనుషంగికమే యనుట సిద్ధాంతము.

## సోమనాథుని కాలము

సోమనాథునికాలమునుగూర్చి, పూర్వవిమర్శకులు, సమగ్రపరిశోధనలు చేసినపిమ్మట, సోమనాథుఁడు పదుమూఁడవశతాబ్దము— ఉత్తరార్థమున జీవించియుండినట్లు తేల్చిరి. అందులకు వారు చూపు కారణములు :—

1. క్రీ. శ. 1222 న నుండిన కర్ణాటకవి సోమరాజు—తన "ఉద్భటకావ్యమున"—లో, "సముదంచద్భ్రుపభ స్తవామరమహీంజా రామనం, సోమనం"—అని పాల్కురికి సోమనను స్తుతించెను ; కాన, నతఁ డంతకు (1222 సం॥నకు) ముందుగనే జీవించియుండవలెననియు.

2. తన "బసవపురాణము"న సోమనాథుఁడు "విలసిత పరమ సంవిత్సుఖాంభోధి, నలిఁ గరస్థలి సోమనాథయ్యగారు"—అని పేర్కొనిన "పండితారాధ్య కృపాసముద్ధతుఁ"—డతనికి సమకాలికుఁడు. ఈ యిరువురుసోమనాథులు, మల్లికార్జున పండితనిర్యాణానంతరము (క్రీ. శ. 1170 కి తరువాత) జీవించియుండినవారని,— అందుచే సోమనకాలము క్రీ. శ. 123 సం॥ కావచ్చుననియు,

3. పిడుపర్తి సోమన తన పద్యబసవపురాణమున నుటంకించిన సోమనాథచరిత్రమున :—

> "ఒకనాఁడు శివభక్తు లోరుగంటను స్వయం
> భూదేవు మంటపమున వసించి
> బసవపురాణంబు పాటించి వను వేళ
> హారుణిఁ గొల్వఁ బ్రతాపుఁ డచటికేఁగి"—

యనుటచే నిందు పేర్కొనఁబడిన "ప్రతాపుఁడు"—క్రీ. శ. 1158—1195 వఱకు పరిపాలించిన (కాకతీయ సామ్రాజ్యాధీశుఁడగు) "రుద్రదేవుఁడే" యనియు,—నతనికాలముననే పాల్కురికి సోమన యోరుగంటికి వెడలి, తనప్రభావముచూపి, శివరాత్రి కొప్పయ్య మొదలగువారిని శిష్యులనుగాఁ జేసికొని, వారికి చక్రవర్తి మూలముగ "దొంకిపర్తి" యగ్రహారము నిప్పించెననియు, ఆకారణమువలన, సోమనాథుఁడు రుద్రదేవుని కాలము—1158—1195 ప్రాంతమువాఁడు కావచ్చునని యభిప్రాయపడుచున్నారు. ఈవిధముగ, పాల్కురికి సోమనాథుని జీవితకాలమున, పూర్వపరిశోధకు లందఱు పండ్రెండవ శతా

బ్రికిఁ గొంచె మిటునటు లూఁపీ యూఁపక, సందిగ్ధావస్థలో నుంచి మేము చెప్పినదే సిద్ధాంతమనిరి.

ప్రకృతము, వారుచూపిన పై మూఁడు ఆధారముల యాథార్థ్యమును గొంచెము పరిశీలింతము :—

1. కర్ణాట కవియైన సోమరాజు—సోమనతోఁ బాటు మఱి యిద్దఱు కవులనుగూడ పేర్కొనెను—వారు,

"ప్రమథానీక కథార్ణవేందు హరి దేవాచార్యనం, ధైర్యనం,
సముదంచ ద్వృషభ స్తవామర మహీజారామనం, సోమనం,
విమలజ్ఞాన సుదీపికా స్ఫురిత చేతస్సద్మనం, పద్మనం"

ఇందు, "హరిదేవాచార్యుఁడు"—"పద్మరసు"—(1-3 పాదములలోవారు) కర్ణాట శైవకవులు. రెండవపాదమున నిఱికింపఁబడిన సోమన,—మన పాల్కురికిసోమన యఁట! (ఇతనిపేరు, కర్ణాటకవి చరిత్ర ప్రథమభాగ పునర్ముద్రణమందలి సోమరాజు చరిత్రమున మూఁడవపాదముననే గలదని శ్రీతమ్మయ్యగారు చెప్పుచు, నేను దానిం దార్మాఱుగఁ జూపితిననుచున్నారు) ఒకవేళ పాదముల తార్మాఱు లెట్లుండినను, దదనుగుణముగ సోమనపేరు, ఆపద్యమున నెట నుండినను—ఇరువురు కన్నడకవులను బేర్కొనిన సోమరాజు, మూఁడవ కర్ణాటశైవకవి దొరకక, తెలుఁగుశైవకవిని బేర్కొనుటెందులకు?— ఇది మొదటిశంక. పాల్కురికి సోమన "సముదంచద్వృషభ స్తవామరమహీజారామనుఁ" డఁట! బసవ పురాణ పండితారాధ్య చరిత్రాద్యుద్గ్రంథములను తడవక, సోమన వ్రాసిన "వృషభ స్తవము"నే ప్రధానముగ, తన పద్యమున, సోమరాజు తెలుపుటలో నాధిక్యమేమి? ఇది మఱియొకశంక!— * "వృషభ స్తవామర" — యనుచోట— "బసవ స్తవామర"—అనుముక్క యిముడదా?—అసలు 1222 లో

* "వృషభ స్తవ" అను సాంస్కృతికసమాసమున వృషభ శబ్దమునకు బదులు 'బసవ' శబ్దమునే సోమరాజెందులకు వాడలేదని శ్రీ కృష్ణశర్మగారు తర్కించుట వింత గాక మఱేమగును?"—అని శ్రీ తమ్మయ్యగారు.—సమాసములలో సంభావనాపూర్వకములైన వానివిషయమున సాంస్కృతికాచ్ఛికము లను వివక్షయే పొసఁగదు. (బసవపురాణము, అప్పకవీయము, రావణదమ్మీయము, కృష్ణరాయబారము) ఇట్టివి శతాధి

జీవించియుండిన నా (కర్ణాట) సోమరాజు పేర్కొన్న సోమన — మన పాల్కుఱికిసోమనగాక, ఎవఁడో కన్నడశైవకవి సోమన కావచ్చునని నాయభిప్రాయము. అయిన మనసోమన కన్నడమునఁగూడ విద్వత్కవియే గదా, అనిన—అది విషయాంతరము. ఆయన రగడలన్నియు కర్ణాటకములే.—పైఁగా, ఈవీరశైవుల పేరులందు "సోమన" యనునది సర్వసాధారణనామముగాఁ గనిపించును. కాన, "వృషభస్తవ" —సోమన పాల్కుఱికి సోమనగాఁడు. "వృషభస్తవము" — వృషాధిపశతకమును గాదు.

2. ఇఁక పండితారాధ్య కృపా సముద్గతుఁడగు—"కరస్థలి సోమనాథయ్య"—నిజముగా మల్లికార్జునపండితుని శిష్యుఁడైన, అతని వార్ధక్యదశయందు (దాదాపు 70 ఏండ్లపుడు) ఉండవలెను. బసవపురాణకర్త, దానిని వ్రాయుకాలమునకు ఈ కరస్థలి సోమనాథయ్య బహుశః చాల వృద్ధుఁడగునేమో ? అగుచో మన పాల్కుఱికి సోమన (25 ఏండ్ల) నిండుజవ్వనముననుండి, తరువాత—మఱి 45—50 ఏండ్లకు చనిపోయినాఁడనుట సహేతుకమే.—అయిన, నీకరస్థలిసోమన —మల్లికార్జునుని శిష్యుఁడగునా ? అతని కుమారుఁడైన "కేదారార్య శిష్యుఁడని యెందుల కూహింపఁగూడదు—"పండితారాధ్య కృపా సముద్గతుఁ"డని మాత్రము చెప్పఁబడినది ; కాని యాపండితుఁ డెవఁడు? "పండితారాధ్యుఁ" డనునది కేవలము బిరుదమే గాని పేరుకాదు. అది మల్లికార్జున పండితవంశమువారి కానువాయితిగా సంక్రమించునది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "పండితారాధ్యుఁ"డనిన—"మల్లికార్జునపండితారాధ్యుఁడే" యని, "తాలూ, తగాదా" లేని సిద్ధాంతమును (బసవపురాణపీఠికయందు) చేయుట, యుక్తమనిపించదు.— ఈవిధముఁగా "కరస్థలి సోమనాథయ్యకాలము స్థిరపఱచు నాధారములు సందిగ్ధములయినప్పుడు వానితో ముడిపెట్టి — పాల్కుఱికి సోమనకాలమును నిర్ణయించుట దుస్సాధ్యము.

---

కములం. అసలు పాల్కుఱికి సోమనకూడ నిట్టిసమాసములెన్నియో చేసెను. ఇది శ్రీ తమ్మయ్యగారెఱుఁగమి వింతకాక మఱేమగును ?—ఇంతకు, "వృషాధిప స్తవము" అన్నచో, ఏరవంతో "వృషాధిపశతకము"నకు సన్నిహితమగునేమో !—కాని, స్తవమన్న—ఒక్కటిమొదలెన్ని శ్లోకములయిన ఉండవచ్చును. ఎటుచూచినను 'స్తవము' —శతకము కాదు ; కానేరదు. మఱి "వృషభ"కు "వృషాధిప"కు—పోలికేలేదు.

3. పిడుపర్తి సోమన పద్యబసవపురాణము—ఈ కాలనిర్ణయ విషయమున కొలఁదిగ వెలుఁగు చూపుచున్నది :—ఈక్రిందిపద్యములు గమనింపుఁడు :—

"ఒకనాఁడు శివభక్తు లోరుగంటను స్వయంభూదేవునుంటపమున వసించి,
బసవపురాణము పాటించి వినువేళ వారినిఁ గొల్వఁ బ్రతాపుఁ డచటికేఁగి,
యాసంభ్రమం బేమి యనుఁడు భక్తులు బసవనిపురాణం బర్థి వినెద రనిన,
విన నాపురాణంబు విధమెట్లొకో యన్న ధూర్తవిప్రుండొక కర్త చేరి,
పాలకుఱికి సోమపతితుఁ డీనడుమను జెనిచె మధ్యవళ్లు పెట్టి ద్విపద,
యప్రమాణ మిది యనాద్యంబు పదమన నరిగె రాజు భక్తు లది యెఱింగి ||"

*　　*　　*　　*　　*

"చని పాలకుఱికి సోమేశునితో నప్పాలుపలుకు చొప్పడఁజెప్పఁగా
విని యూగకున్న భక్తులకును దలవంపౌ నటంచుఁ గుపితాత్ముండై"

ఓరుగంటికిపోయి, తనమహిమలు వెలయించి, చాలమందిని (ప్రతాపుని మంత్రి ఇందులూరి అన్నయ్య మొదలగువారిని) తన శిష్యులనుగా చేసికొని, కొంతకాల మక్కడనే ఉండి, — ఆగామికార్యజ్ఞుఁడై నందున—ఒకనాఁడు శివరాత్రి కొప్పయ్య మొదలైన వారిని బిలిపించి, 'ఇఁక త్వరలోనే, ఈరాజ్యము తురుష్కాక్రాంతమగును. కాన మాఁబోటి నియమస్థు లిక్కడ నుండము. మీకును ప్రభువుమూలముగ నొకయగ్రహార మిప్పించెద'నని "దోకిపఱ్ఱు"ను నగ్రహార మిప్పించెనఁట.

పై వృత్తాంతము జరుగుకాలమునకు "నోరుగల్లు"—కాకతీయులకు రాజధానిగా నేర్పడినదా? ఏర్పడిన, దాని పరిపాలకుఁడు—విమర్శకులు చెప్పు "రుద్రదేవుఁడా"?—(లేక ప్రతాపరుద్రుఁడా?) అను ప్రశ్నకు సమాధానము "లేదు"—"కాద"ని చెప్పవలసి వచ్చును.—అయిన పద్యబసవపురాణమునందలి కథ—యసత్యమందమా? అంతటి సాహసమేరికుండును?

పూర్వవిమర్శకులు చెప్పినట్లు—క్రీ. శ. 1158 మొదలు 1195 వఱకుఁ గాకతీయరాజ్యమును పాలించిన రుద్రదేవుఁడే—ప్రతాపరుద్రుఁడై పాల్కుఱికి సోమన యతనివలననే యగ్రహార మార్జించి యుండిన, నతని కాలము తప్పక 1190 సం॥ర ప్రాంతమగుట యం

దాక్షేపణ లేదు. కాని రుద్రదేవుఁడు "ప్రతాపరుద్రుఁడు" కాఁడని శాసనములు వేనోళ్ల శంఖారావము చేయుచున్నవి చూడుఁడు :—

"శ్రీమద్రుద్రదనరేశ్వరస్య సుమతే ర్వంశావలిం"
—(కాకతి రుద్రుని హనుమకొండశాసనము)

"నిర్దిష్ట మంబునిధి వేష్టితాం, తాం
పృథ్వీ మిమాం శాసతి రుద్రదేవే" —(పిల్లలమఱ్ఱి శాసనము)

దీనినిబట్టి, "రుద్రదేవుఁడు" — "ప్రతాపరుద్రుఁ" డెంత మాత్రము కాఁడని తెలుచున్నది. నిజముగ—"ప్రతాప" యనువిశేషణము—క్రీ. శ. 1190 ప్రాంతమున నుండిన "రుద్రదేవునకే" యుండిన, కీర్తిపతాకలైన శాసనములందు దానిని పేర్కొ_నకుండరుగదా! పైఁగా, పూర్వపరిశోధకులు చెప్పినట్లు "రుద్రదేవుఁడు" సోమనకు సమకాలికుఁడైన—పై పద్యబసవపురాణమున చెప్పంబడిన కథ యోరుగంటిలో గాక "అనుమకొండలో" జరిగియుండవలెను. ఏలన :— రుద్రదేవుని కాలమునకుఁ గాకతీయులరాజధాని "అనుమకొండ"గాని —"ఓరుగల్లు"—కాదు. అట్టిసందర్భమున :—

"ఒకనాఁడు శివభక్తు లోరుగంటను స్వయంభూదేవుమంటపమున వసించి
బసవపురాణము పాటించి విను వేళ హరునిఁ గొల్వఁ బ్రతాపుఁ డచటికేఁగి"—

యుండుట పొసఁగదు. అప్పుడు కథయే తప్పు గావలసివచ్చును. తెలంగాణము వాఁడైన పిడుపర్తి సోమనాథుఁడు చెప్పువిషయములు ప్రామాణికములు గానప్పుడు—ఊహాలమీఁద నూహాలనల్లి—బుద్ధికి సరిపడినవే, నిజమైన సిద్ధాంతములుగ భావించు పరిశోధకుల యభిప్రాయములుమాత్ర మెట్లు ప్రమాణములగును. ఇంతకును పిడుపర్తి సోమన "ప్రతాపుఁ" డనియెనేగాని, "రుద్రుఁడ"ని చెప్పలేదు. ఆ రెండు పేరులు గల వ్యక్తులు భిన్నులని యతఁడు బాగుగ నెఱిఁగియుండును. మనపరిశోధకులన్న "ప్రతాపుఁ" డనునది నామమను భావము లేక, కాకతిరాజులకందఱకు, నది యొకబిరుదముగ నెంచినట్లున్నది. కనుకనే, మొదటిప్రతాపుఁడు—రెండవప్రతాపుఁ డనుచు చిందులుత్రొక్కుటకు—మొదలిడిరి.

శ్రీతమ్మయ్యగారు "బద్దెన నీతిసారముక్తావళి" —యందలిదని యొకపద్యము నుదహరించిరి. కాని, యది కవితనుబట్టిచూడ నతని దని

పించదు. బద్దెనకాలమే యింతవఱకు స్థిరపడలేదు. దీనింబట్టి పాల్కుఱికి సోమనకాలమునుగాని, అందుఁ బేర్కొనఁబడ్డ ప్రతాపరుద్రుఁడు మొదటి ప్రతాపరుద్రుఁడని కాని చెప్పుటకు ఎంతమాత్రమును వీలుపడదు. "పరఁగఁ బ్రతాపరుద్రనరపాలునిఁ జేసి" యనువాక్యముంబట్టి "రుద్రదేవుఁడే ప్రతాపరుద్రుఁడనుట పరిహాసాస్పదము. ఇంతకు నాపద్యము శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచే సంపాదితమయిన "నీతిసారముక్తావళి" లోనిది. దానివిషయమున ఆకవిగారికే సంపూర్ణవిశ్వాసము లేదు. శ్రీ తమ్మయ్యగారు—శాసనములనుగాని, తక్కినకావ్యములనుగాని ప్రమాణములనుగా అంగీకరింపరు. ఆధారములెట్లున్నను, దమయూహయే పరమ ప్రమాణముగ గ్రహించువారు. కనుకఁ దాము శ్రమించి వెదకి కని పెట్టిన యీ "నీతిసారముక్తావళి" పద్యము తమ యభిప్రాయమునకు భిన్నముకానప్పుడు—పైఁగా, నది తమవాదమున కుపబలకమయి నప్పుడు, ఏల యంగీకరింపరాదు ? కాన, నీపట్టుఁగొమ్మ నాశ్రయించిరి. సరియే. మఱి, బద్దెన యెప్పటివాఁ డనునది యెందులకు చెప్పరైరి?— ఇంకను ఏతద్విషయమునఁ బరిశోధకులు కృషి సలుపుచునేయున్నారు. అది తేలినను, అతనిచేతఁ బేర్కొనఁబడిన "ప్రతాపరుద్రుఁడే రుద్రదేవుఁ"డని యెట్లు నమ్మనగును ?

ఇది యిట్లుండ, పిడుపర్తిసోమన, పేర్కొన్నవారిలో, నిందులూరి అన్నయామాత్యుఁడొకఁడు.—ఇతఁడు పాల్కుఱికి సోమనకు శిష్యుఁడయినందున—నతని యానతి ననుసరించి ప్రతాపరుద్రునితోఁ జెప్పి, "దోకిపఱ్ఱు"—ను నగ్రహారమును శివరాత్రి కొప్పయాది శివభక్తుల కిప్పించెను :—

> "తనశిష్యుఁడును, నాప్రతాపునిమంత్రియు నగు నిందులూరి యన్నయ్యఁ బిల్వఁ
> బంచి నీవెప్పుడు భక్తితో నరువత్తుమువుర నర్చింతువు ముఖ్యవృత్తిఁ
> దృప్తిప్రీతిగా మాప్రతిస్థల కొకగ్రామ మిప్పించుమి ధరాధీశుచేత
> ననవుఁడు నతఁడు మహాప్రసాదంబని యిప్పించె నోకిపఱ్ఱిద్ధభక్తి"

ఇందు పేర్కొనఁబడిన "ఇందులూరి అన్నయ్య" — ప్రతాపరుద్రునిమంత్రిగాని, రుద్రదేవునిమంత్రి గాఁడు.—ఈవిషయమునుగూర్చి కాకతీయ సంచికలో—శ్రీమాఁ రేమండ రామారావు ఎం. ఏ; బి. ఇ. డి. గారు "కాకతీయులచరిత్ర" మను వ్యాసమునం దిట్లు తెలిపిరి.

"ఇందులూరి అన్నయ్య: — ఇతఁడు ప్రతాపరుద్ర చక్రవర్తి యధికారవర్గమునం దగ్రగణ్యుఁడు. శివయోగసారమునం దీతని కీర్తి శౌర్యము లభివర్ణింపఁబడినవి. గణపతిదేవ రుద్రాంబికలకు మంత్రియు, దండనాథుఁడునై యుండిన కొలని సోమయమంత్రి తనయుఁడగు గన్నమంత్రికిని గౌరమకు నీతఁడు జన్మించెను......తురకలతోడి యుద్ధములయం దద్వితీయపరాక్రమమును జూపి చక్రవర్తిమన్ననలను బడసెను. అదియునుగాఁక, నాబ్రాహ్మణమంత్రి రుద్రాంబ ద్వితీయపుత్రిక యగు రుయ్యాంబను పెండ్లాడెను."

ఈయన్నయ్యయే సోమనాథుని శిష్యుఁడు. శివభక్తులకు "దోకిపట్టు"నిప్పించినవాఁడు—కావున, పాల్కుఱికి సోమనాథుని కాలము తప్పకుండ నిందులూరి యన్నయ్యామంత్రిత్వమున రాజ్యముచేయుచుండిన ప్రతాపరుద్రుని జీవితకాలము.—అనఁగా—క్రీ. శ. 1290—1326 అని దృఢముగాఁ దెలియుచున్నది. పైఁగా, తురుష్కుల దండయాత్రలయం దన్నయ తనపరాక్రమము చూపినట్లు తెలియుటవలన నట్టి దండయాత్రలు ప్రతాపరుద్రుని కాలమున జరిగినవేగాని, రుద్రదేవుని కాలమునఁగాదు. మఱొక విశేషముగూడ గమనింపఁదగును. తాను బ్రాహ్మణుఁడై యుండియు కమ్మవనితను (రుయ్యమ్మను) బెండ్లియాడుటవలన బ్రాహ్మణసంఘ దూషణమునకుఁ దట్టుకొనఁజాలక పాల్కుఱికి సోమన నాశ్రయించి—శిష్యుఁడై సహజవీరశైవులతోఁ (జాతి, మత, భేదములు లేనివారలతోఁ) జేరియుండును.— తేలిన సారాంశమేమన:—ప్రతాపరుద్రునిమంత్రియైన ఇందులూరి యన్నయ్యకు వీరశైవమిచ్చిన పాల్కుఱికి సోమన పదుమూఁడవ శతాబ్దాంతము—పదునాల్గవ శతాబ్దాది కాలము వాఁడు గాని—రుద్రదేవుని (1158—1195) కాలమువాఁడెంతమాత్రమును గాఁడనునదే! — ఇంతకు మించిన ప్రమాణమేమి కావలయును?

దీని నింకను బలపఱచు నాధారము మఱొక్కటిగూడ లేకపోలేదు. పాల్కుఱికి సోమనాథుఁడు—బసవపురాణమున, తనకు సమకాలికులనుగ, పేర్కొన్న శ్రోతలలో 'రెంటాలమల్లినాథుఁడు', 'దోచమాంబ' అనువారిని వరుసగా, సూచించెను. అందు వారి శివకైంకర్యములు వెవ్వేలుగఁ దెలుపఁబడినవి. నీలగంగవరపు మొల్లకల్లూరు

దాన శాసనమునఁగూడ ఈభక్తులపేరులు క్రమముగ నుటంకింపఁ బడినవి. కాని, *'రెంటాల' — యనుటకు 'రెండ్రేవుల' — 'దోచ మాంబ'—యనుటకు, 'దోచయ'—యని యించుక మాఱుపాటులు గోచరించుచున్నవి. ఇట్టివి శాసనపరిశోధకుల కనుభవసిద్ధములే. తమ సిద్ధాంతముల కనుగుణములగుచో శాసనప్రమాణములు మహాకవుల గ్రంథోదాహరణములు గైకొనుచుఁ, గానిచోఁ (దరువాతివారిచేఁ) గల్పితములనుసాకుతో దాట్లువేయు పరిశోధకులతోఁ దర్కించుట వ్యర్థశ్రమము. అస్తు. 'దోచమాంబ' పేరితో, (ముందునిలిచి) సోపాన ములు గట్టించినవాఁ డీ "రెండ్రేవుల (రెంటాల) మల్లినాథుఁ"డని, శాసనము నించుక నిశితముగ నిష్పాక్షికముగఁ బరిశీలించువారికి స్పష్ట పడఁగలదు. 'దోచమాంబ' అతని తోడ్పాటున నట్టి ఘనకార్యము నెఱవేర్చినను, త్రిపురాంతకక్షేత్రవాసియై, త్రిపురాంతకేశ్వరమహా భక్తాగ్రణియై వెలసిన మల్లినాథుని పేరనే యాధర్మము చెల్లుచుండె నని తోఁచుచున్నది. ఆకారణముననే అంబదేవమహారాజు మొల్ల కల్లూరు మల్లినాథునకు దానమొనర్చెనని తెలియుచున్నది. పాల్కు ఱికి సోమనాథున కీయిరువురును సమకాలికులే. వీరిశివభక్తి మహిమయు నతనికిఁ జక్కఁగఁ దెలిసినదే.

ఇఁక 'దోచమాంబ' యెవ్వతె? యనునది మిగిలియున్నది. శాసన శ్లోకమున యచ్ఛబ్దమే, కాని తచ్ఛబ్దము లేకపోవుటచే విమర్శకాగ్రే సరుల కామె దాతృగృహీతలతో నెట్టిసంబంధముగలదియో తెలియ దనిరి. కాని, మొదటివారితోఁ గాక, రెండవవారితోనే యామెకు సంబంధముండునని శాసనమే చెప్పుచున్నది. అది గురుశిష్యాసంబంధము వంటి దేదైనఁగావచ్చును. అంబయదేవమహారాజు దేవియే యగుచో,

---

* శాసనపరిశోధన సందర్భములలో నూళ్లపేరులు మాఱుట సహజమే. కాని, కట్టకడపట నిలుచు పేరేదియో (పరిణామవాదము ననుసరించి) అదియే నిలిచిపోవును. దక్షారామము, దాక్షారామము, ద్రాక్షారామము, (రేఫము సర్వసాధారణముగ సంశ్లే షించుటయుఁ దొలఁగుటయుఁ గలదు.) దాక్షారామ, దాక్షారాం, ద్రాక్షారాం, దాక్షా రం.—శ్రీకాళహస్తి, కాళహస్తి, కాళహస్త్రి, కాళాస్త్రి, కాళాస్తి.—కందెన ప్రోలు, కందనవోలు, కందనోలు, కందనూలు, కరునూలు, కర్నూలు, పా.సో.— కాలమునకు 'రెండ్రేవుల'—'రెంటాల'—గా స్థిరపడినదనుట అసంగతముకాదు.

నతని పేరితోఁబాటు ఆమె పేరుండఁదగును గాని, కడపట నుండదు. మఱి మల్లినాథునివలె సహజవీరశైవారాధన మొనర్చు భక్తురాలై త్రిపురాంతక దేవుని సన్నిధిలో వసించు సాధ్వీగావచ్చును.—శాసనములో "దేవి" యనుట పూజ్యవాచకమేకాని, మఱొకటిగాదు. సహజవీర శైవాచార పరాయణులగు జంగములకు 'దేవర'—యను కులబిరుద మున్నదిగదా! జంగమలింగధారులయిన శివప్రతినిధులు "దేవర" లగుచో, వారి కుటుంబినులు దేవులగుట సహజమే. తచ్ఛబ్దరహిత ముగఁ గొండొకచోఁ జెప్పుట కవులకుఁ బరిపాటియయినను,—ఇట శ్లోకమసమగ్రమో, శిథిలమో యయియుండును.

కాన. శాసనానుసారము, పాల్కుఱికి సోమన—వారిని వరుసగఁ బేర్కొనుచు "కుమారాద్రికిఁ దూర్పుదెసను సోపానముల్దీర్చి పొల్పార మహితసద్భక్తి — సమంచితవృత్తి మహిఁజను రెంటాల మల్లినాథుఁడును"—అని బసవపురాణమునఁ దెలిపిన—మల్లినాథుఁడు 'రెంద్రేవుల మల్లినాథుఁడే.' శాసనవాక్యమిది :—

> "స్వస్తి శ్రీ మతు గండపెండార అంబదేవ మహారాజులు శ్రీ త్రిపురాంతకంక్షేత్రవాసులైన రెంద్రేవుల మల్లినాథయంగారికి పొల్లకల్లూరు సర్వధా పరిహారము ఆచంద్రార్కస్థాయిగాను ఇచ్చిన శివపురము మంగళమహాశ్రీ, శ్రీ, శ్రీ"

ఇతఁడే కుమారాద్రికిఁ దూర్పుదెసను సోపానములు గట్టించిన వాఁడు.

ఈ (రెంటాల) రెంద్రేవుల మల్లినాథుఁడు క్రీ. శ. 1290 లో నుండినట్లు శాసనాధారములు గనుపించుచున్నవి.—కనుక నితనికి, సమకాలికుఁడగు పాల్కుఱికిసోమనాథునికాలము పదునాల్గవశతాబ్దము ప్రథమపాద మను నిశ్చయమును దృఢపఱచుచున్నది. ఈవిషయమున చాలపరిశ్రమచేసి, సోమనాథునికాలము 1320 వఱకని బలవత్తర కారణములతోను — శాసనాధారములతోను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 1945 ఫిబ్రవరి "భారతి"లోఁ బ్రకటించిరి. అది చూచినపిదప డాక్టరు చిలుకూరి నారాయణరావుగారుకూడ తమయభిప్రాయమును మార్చుకొని శ్రీ శర్మగారి నిర్ణయమే సమంజసమని

సమర్థించుచు 1945 "సెప్టంబరు" "భారతి"యం దుద్ఘాటించిరి. *మరల 1948 నవంబరు భారతిలో మఱొక వ్యాసమునుగూడఁ బ్రకటించిరి. శ్రీ శర్మగారి వ్యాసము వెలువడుటకుమున్నే, శ్రీ వీరేశలింగంగారు గతించి నందునను శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మఱియొకవంకకు తమ మహత్తర పరిశోధనశక్తిని త్రిప్పి పనిచేయుచుండినందునను, తమయభిప్రాయములను మార్చుకొను నవకాశము గలుగలేదు. సత్యపక్షపాతులగు పరిశోధకులగువారెల్ల—శ్రీ బండారు తమ్మయ్యగారొక్కరే. వారు (ఎంతనిరాధారమైనను, ఎంతదుర్బలమైనను) తాము చెప్పినదే వేదమందురు. నిశితముగా పరిశోధించు నేఁటిచరిత్రకారులందు శ్రీ తమ్మయ్యగారెవ్వరికిని దీసిపోరు; కాని తమ పరిశోధనాంశముల నెదుటిపరిశోధకుల సహేతుకాధారములవలన ఖండింపఁబడి యపాస్తములైనపుడుగూడ—తెలిసి తెలిసి—ఆత్మసాక్ష్యమునకు విరుద్ధముగా—తమవానినే, నిలువఁబెట్టుకొనవలెననెడి యుబలాటముతోఁ బెనఁగులాడుచు,—"శేషం కోపేన పూరయే" త్తను ధోరణిలో—స్వసిద్ధాంత విమర్శకుల నధిక్షేపణలతో నిరసించుచు, వాదముసాగించుట హర్షింపఁదగినది గాదు. వీరి (శివధర్మమాలికాబిల్వమైన) "పాల్కురికిసోమనాథకవి"

---

* "ఎవరెంత ప్రాకులాడినా సోమనాథుఁడు క్రీ. శ. ౧౨౪౦ సం॥రమునకు పూర్వము పుట్టినవాడు కాడనడము సిద్ధాంతము. అతడు మొదటి ప్రతాపరుద్రుని కాలమున ఉండడము సుతరాం అసంగతము, అతనికి బసవనిగురించిగాని, పండితారాధ్యునిగురించిగాని ఏమిన్నీ స్వయముగా తెలియదన్న మాటను తమ్మయ్యగారొప్పుకొన్నారు గదా! మొదటి ప్రతాపరుద్రుని రాజ్యాభిషేకకాలము క్రీ. శ. ౧౧౬౩ సం॥రము. బసవేశ్వరుఁడు ౧౧౬౭ సం॥ ప్రాంతమువాడు. అప్పటి కితడు బాలుడు. ఎంత వయసువాడో చెప్పలేము. ౨౫ ఏండ్లలోపలి వయస్సువాడనుకోవచ్చును. అందుచేత అప్పటికే ప్రసిద్ధుడయిన సోమనాథు డతనికంటె పెద్దవాడయి ఉండవలెనుగదా. "బసవగోత్రుండ" అని బసవనికాలములో ఉన్న సోమనాథుడు చెప్పుకొనడము అసంగతమే కదా! బెలిదేవి వేమనారాధ్యుడు పండితారాధ్యునికి సమానమయిన వయస్సు గలవానివలె కనబడుతాడు. అతడున్ను పండితారాధ్యుడున్ను బసవనికి సమకాలికులు; అతనికంటె పెద్దవారు. బెల్దేవి వేమనారాధ్యుని మనుమని శిష్యుడే సోమనాథుడని ఒప్పుకొన్న మొదటి ప్రతాపరుద్రుని కాలములో ఉంటే వేమనారాధ్యునికంటె ౧౫, ౨౦ ఏండ్లు మాత్రము చిన్నవాడయినట్లు కనబడే పాల్కురికి సోమనాథుడు వేమనారాధ్యుని మనుమని శిష్యుడు కావడము తటస్థింపదు గదా. ఇదిగాక క్రీ. శ. ౧౧౪౦ నుంచి ౧౧౯౦ వరకు గల ౫౦ ఏండ్లలో సోమనాథుఁడు తన గ్రంథములలో పేర్కొన్న చారిత్రకపురుషులనందరినీ ఇరికించ సాధ్యముకాని పని. అట్లా ఇరికించడాని కంతటి

—యను గ్రంథము చూచువారి కిందలి సత్యము బోధపడును. "దుందుభి" "కాకతీయ" "విభూతి"—"భారతి"—సంచికలన్నింటియందును, ఎదుగుబొదుగులు లేని వీరి వాదధోరణి—తమ పంతము నెగ్గించుకొనవలెనను పట్టుదలతో నొక్కవిధముగా వ్రాసినట్లు తోఁచును. విషయములన్నియు—పిష్టపేషణములు; ఊకదంపుడులు; Harping over the Points.—ఆపథము వీడి యెన్నటికైనను సత్యాన్వేషణబుద్ధిని శ్రీ తమ్మయ్యాగారివంటి యుద్దండ పరిశోధకులు పూనుకొనిన—సోమనాథునికాలము స్పష్టముగాఁ దేలిపోవును. సత్యసాధకులెన్నటికి చలపాదులు కారాదుగదా!—

## సోమనాథకవి—వృషాధిపశతకము

సోమనాథకవి, సర్వతోముఖప్రజ్ఞాప్రభావసంపన్నుఁడు. వేద వేదాంగపారంగతుఁడు. స్మృతిశాస్త్రపురాణాగమ సమగ్ర పరిశీలకుఁడు. షట్శాస్త్ర, వైద్య కొక్కోక, భరత, సంగీతాది శాస్త్ర పారీణుఁడు. ఆంధ్ర, తమిళ, కర్ణాటమహారాష్ట్ర సంస్కృత సమభిజ్ఞుఁడు. వివిధ మతగ్రంథ పరిశోధకుఁడు. నన్నయవలె "మత్యమరాచార్యుఁడు"; —తిక్కనవలె "కవిబ్రహ్మ"; నాచనసోమనవలె "సర్వజ్ఞుఁడు";—

---

తంటాలుపడి, ఉన్నమాటలను మార్చి, లేనిమాటలను దూర్చి, ఉన్నమాటల కపార్థను లనుకల్పించి సాధించే దేమయినా ఉన్నదా?

(౧) పిడుపర్తి సోమనాథుడు చెప్పినమాట కాదనడానికి కారణము కనబడదు. అతడు క్రీ. శ. ౧౪౮౦ సం॥రమునకు తరువాతివాడు. పాల్కురికికి సోమనాథుని శిష్యుడయిన శివరాత్రికొప్పయ్యకు పిడుపర్తిసోమన్న ఆరోతరమువాడు. కాబట్టి తరమునకు ౧౫౦ ఏండ్లచొప్పున లెక్కవేస్తే కొప్పయ్య కాలము ౧౪౮౦—౧౫౦ = ౧౩౩౦ ప్రాంతమవుతుంది. అది రెండో ప్రతాపరుద్రుని కాలము.

(౨) పాల్కురికి సోమనాథుడు బెలిదేవి వేమనారాధ్యుని మనుమనిశిష్యుడనని చెప్పుకొన్నాడు. ఈ వేమనారాధ్యుడు పండితారాధ్యుని సమకాలికుడయిన వేమనారాధ్యునికి మనుమడయి ఉంటాడు. అంటే సోమనాథుడు పండితారాధ్యునికి సమకాలికుడయిన వేమనారాధ్యుని మనుమడయిన వేమనారాధ్యుని మనుమని శిష్యుడు. ఇట్లాలోచించినా పాల్కురికి సోమనాథుని కాలము రెండో ప్రతాపరుద్రుని కాలమవుతుంది.

(3) సోమరాజు రచించిన కన్నడ. ఉద్భట చరిత్రములోని "సాసిరదనానూర్" అనేపాఠమే అన్ని వ్రాతప్రతులలోను ఉన్నది. "సాసిరదనూతిఱె" అనేపాఠముగల ఒక్క ప్రతి అయినా కనబడేవరకున్ను సోమనాథుని కాలము శాలివాహన శకము ౧౪౪౪ + ౭౮ = క్రీ. శ. ౧౫౨౨ సం॥ర మవుతుంది. ౧౧౪౪ + ౭౮ = క్రీ. శ. ౧౨౨౨

శ్రీనాథునివలె "సకలవిద్యాసనాథుఁడు"; బౌద్ధజైనాద్వైతమతధ్వాంత భాస్కరుఁడు.—

ఈమహాకవిలోకగురు ప్రణీత గ్రంథముల నిదివఱకే పేర్కొంటిని. వానియందెల్ల నుత్కృష్టములైన "బసవపురాణము"—"పండితారాధ్యచరిత్రము" — ఈరెండును, జాను తెనుఁగుపలుకుల చెలువు వీనుల కొక వింతసోయగ మొనగూర్చు (దేశికవితయగు) ద్విపదరత్న విరాజిత తాటంకయుగళము. ఈతని వెనుకటి కవుల కొఱవడి దిద్దిన యీద్విపదకావ్యాల యపూర్వ కవితాసౌభాగ్యము సులభముగ నెల్లర కలవడ లేదనుట అతిశయోక్తి కానేరదు! సోమనాథకవి ద్విపద కవితతో "ఖుస్తు" కలుపుకొనఁజూచిన కోనబుద్ధారెడ్డి, శ్రీనాథుల రచనముల గీర్వాణము పెచ్చరిల్లినది. వానిమీఁద గౌరవముతోఁ గాఁబోలు.

---

ఎంతమాత్రమున్ను కాదు. క్రీ. శ. ౧౨౨౨ అయితే పాల్కురికి సోమనాథుని కాలము బసవని కాలముకంటె పూర్వము కావలసివస్తుంది. ఇది అసంభవముగదా.

(౪) సోమనాథుడు బసవపురాణమును రచించిన అనతికాలముననే భీమకవి క్రీ. శ. ౧౩౬౯ లో కన్నడించినాడు. దీనినిబట్టి ఆలోచించినా సోమనాథుడు రెండో ప్రతాపరుద్రుని కాలమునాడే అవుతాడు.

(౫) సోమనాథుని పండితారాధ్యచరిత్రరచన కనతికాలముననే శ్రీనాథుడు క్రీ. శ. ౧౩౯౫ ప్రాంతమున పద్యకావ్యముగా వ్రాసినాడు. శ్రీనాథునికంటె సోముడు. ౭౦, ౮౦ ఏండ్లు పూర్వుడయినా రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతాడు. కన్నడ భీమకవి తెనుగు శ్రీనాథుల కాలమునాటికే బసవపురాణ పండితారాధ్యచరిత్రములు ప్రసిద్ధి కెక్కియుండ వనడము ఆగ్రంథముల ప్రాశస్త్యమును గుర్తింపకుండడమే అవుతుంది.

(౬) కన్నడములో పద్మణాంకకవి సోమనాథుని కించుమించు సమకాలికుడయిన కెరెయపద్మరసును గూర్చిన కన్నడగ్రంథమును క్రీ. శ. ౧౩౮౫ లో వ్రాయడాని కాతనియెడల గల పరిచితభక్తియే కారణము. కాబట్టి పద్మణాంకునికి పద్మరసు ౫౦, ౬౦ సం||రములకు పూర్వుడు కాజాలడు. అట్లు చూచినా పాల్కురికి సోమనాథుడు రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతాడు.

(౭) కరస్థలి విశ్వనాథయ్య విశ్వేశ్వరాచార్యుడు కాడనిన్ని, సోమాచార్యుడు సోమనాథుడు కాడనిన్ని తమ్మయ్యగారు వ్రాసిన వ్రాత సమంజసముగ లేదు. ఆశాసనము లున్న ప్రదేశము, ఆ శాసనముల కాలము, ఆ నామముల సాదృశ్యము, విషయ సాదృశ్యము వీటి నన్నిటినిబట్టీ ఆలోచిస్తే నేనూహించినది కేవలము పొరపాటు కాదని సహృదయులు గ్రహింపగలరు. నాయూహ సరియైనదయితే నేను చూపిన తక్కిన కారణముల కిది ఉపబలకముగా ఉంటుంది. కాకతీయరాజులకు ఇష్టలింగార్చకులయిన

గాన తనగౌరవమును నిలఁబెట్టుకొనెను, కొంతవఱకు. తక్కినవారు "ఎవరికివారే! యమునాతీరే." ఈతని "వృషాధిపశతకమును" గాంచినచో, నీతని యనర్గళ కవితా ధారా విశేషము స్పష్టముగ మనకు గోచరింపఁగలదు. ఇఁక నతని బసవేశ్వర భక్తి కీశతక మొకగొప్ప తార్కాణ మనఁదగును. ఇందుఁ గల పద్యములన్నియు చంపకోత్పల వృత్తములు. "బసవా, బసవా, బసవా, వృషాధిపా" యనున దీశతక మకుటము. తక్కిన (శతక) లక్షణములన్నియు నిందుఁ బొసఁగియున్నవి. మల్లికార్జునపండితుని "శివతత్త్వసార"ముతో, నొకస్వరూప మల వఱచుకొనిన శతకకావ్యరమ—ఈవృషాధిపశతకముతో—సర్వాలంకారశోభితయై వెలుఁగొందినది.

ఇందలి శైలికిని, ఈతని తక్కిన ద్విపదకావ్యముల శైలికిని పోలికయే లేదు. బసవపురాణ పండితారాధ్యచరిత్రలలోని భాష దేశీయ సంప్రదాయమున కనుగుణమై పండితపామరులకుఁ గూడ

---

వీరశైవులే గురువులుగా ఉన్నారని పెద్ద అక్షరములతో ప్రకటించిన తమ్మయ్యగారు గణపతిదేవుని గురువయిన విశ్వేశ్వరాచార్యుడు వీరశైవుడు కాక శుద్ధశైవుడని యెట్లంగీకరించినారో తెలియదు. విశ్వేశ్వరాచార్యుడు శుద్ధశైవుడు కాడు గోళకిమఠము వీర శైవమఠమే; గోడగి అన్నా గోళకి అన్నా ఒక్కటే. గోడగి త్రిపురారి అమరమునకు సంబంధించినవాడే. కోణంగి ఆట లాడడముచేత గోడగి అనే యింటిపేరాతనికి కలిగిందని సోమనాథుడు చెప్పడ మొక కవిత్వమే కాని వాస్తవము కాదు. కోడగ మాడితే 'కోడగి' కావలెనుగాని 'గోడగి' కాజాలదు. ఏదయినా యిట్టి చిలిపికారణములు చరిత్రను త్రోసిపుచ్చ జాలవు.

(౨) "పరిచితగురుపరంపర దేజరిల్లు"; "ప్రభుతరగురుపరంపర దేజరిల్లు" అన్నప్పుడు "తేజరిల్లుతున్నది" అని వర్తమానార్థబోధక మవుతుందిగాని అది ఆశీరర్థక మెంతమాత్రమును గాదు. ఈవిషయమై తమ్మయ్యగారు వ్రాసినవ్రాత నాకు నచ్చలేదు.

(౩) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించిన కాకతీయచక్రవర్తుల సామంతుడయిన అంబయదేవమహారాజు క్రీ. శ. ౧౨౯౦ సం॥ర శాసనములో నుదాహృతులయిన రెంటాల మల్లినాథ దోచమాంబలు పాల్కుఱికి సోమనాథుడు తనకు సమకాలికులని చెప్పుకొన్న అవే పేళ్లు గలవారు కారనడానికి తమయిష్టము తప్ప తమ్మయ్యగారు మరొక కారణము చూపలేదు. కాలనిర్ణయము మన యిష్టానిష్టముల ననుసరించి చేయరాదుకదా! సోమశేఖరశర్మగారు చేసిన నిర్ణయమునుబట్టిన్ని సోమనాథుడు రెండో ప్రతాపరుద్రుని కాలమువాడే అవుతున్నాడు."

—(భారతి 1948 నవంబరు.)

సులభగ్రాహ్యముగ నడచినది. ఛందస్సు సహితము స్త్రీ బాల బాలికలు పాడుట కనువగు ద్విపదగాఁ గుదిరినది. ఇఁక నీ "వృషాధిపశతక"మన్న, జటిల సంస్కృతసమాసపటిష్ఠమై, సరసవిద్వత్కవిజన హృదయంగమమగు ధారాళమగు శైలి నలవఱచుకొన్నది. ముక్తపదగ్రస్తాంత్యనియమాద్యలంకారములే గాక నానాభాషాధోరణులు రసికలోకానంద సంధాయకములుగఁ జెలువొందినవి.

ఇందుఁగల పద్యములు 109. కడపటిదానియందు కవినామసూచనము గలదు. మొదటిపద్యము నుండి నలువదితొమ్మిదవ పద్యము వఱకు నంత్యప్రాసనియమాలంకారము లీశతకమున విరాజిల్లుచున్నది. బసవపురాణ, పండితారాధ్యచరిత్రములందు, కవి యీ యలంకారమును జాలవఱకుఁ బాటించెను. పోతనాదు లీయలంకారముపై నెక్కువగ మోజుపడుటకు పాల్కురికిసోమన కృతులే కారణములు గావలయు. ఇండటనట వృత్త్యనుప్రాసములును గనఁబడుచున్నవి. ఆఱు పద్యములు పూర్తిగ సంస్కృతములే ; ఐదు, పలుబాసలలో వ్రాయఁబడిన పద్యములు ; మణిప్రవాళపద్యములు నాలుగు ; భక్తులప్రభావములను దెలుపునవి ఇరువదితొమ్మిది ; తక్కినవి బసవేశ్వర మహిమాప్రతిపాదకములు.

సోమనాథుని తక్కినగ్రంథములయందు వలె నీశతకమునందును గొన్ని యపూర్వశబ్దములు గానవచ్చెడిని :—

వసిగొను ;— తేరసులు ;— ఘంటవ్రేయు ; కొఱట ;— చేగప్రసాదము (ఇట "చేవ" యనునర్థము పొసఁగదు);— మొఱటదవంక దేవుఁడు (శివుఁడు)— కక్కయ ; — మడియాలు (మడి వేలు) ఈశతకమున "అక్షయబండరు"వను వింతసమాసము లక్షణవిరుద్ధమని తోఁచుచున్నది. కాని, సోమనాథుని బసవపురాణపండితారాధ్యచరిత్రలలో నిట్టివి కోకొల్లలు. ఇట్టి ప్రయోగములు నన్నెచోడ, శ్రీనాథులకృతులలోను గనిపించుచున్నవి. (శారద నీరద సమూహిచాడ్పున : నన్నెచోడ—కోపగాఁడు : కాశీఖండము : శ్రీనాథ)—ఈ కవికఖండయతులు సమ్మతములని యీతని కావ్యములఁ దిలకించిన తేఁటపడఁగలదు.

ఇఁక నీతని కవితావైచిత్రిఁ దెలుపుటకు వృషాధిపశతకమునం దుండి కొన్ని పద్యము లీక్రింద నుదాహృతములు :—

1. ఒకటే సంస్కృతశబ్దసమాసము :—

"విరచితశుద్ధసాళగ నవీనమృదుస్వర మంద్రమధ్యతా
ర రుచిరదేశిమార్గ మధురస్వరగీత సుధాతరంగిణీ
తరళతరంగజాల సముదంచితకేళివిలోల, సంగమే
శ్వర శరణయ్య నాకు బసవా, బసవా, బసవా, వృషాధిపా ||"

2. సంస్కృతభాషా పద్యము :—

"హృన్నళినే స్మరామి, భవదీయపదద్వితయం, భవాటవ
స్విన్న తనుశ్రమాపహ, మశేష జగత్ప్రణుతం, మదీశ, ని
ష్పన్నదయానిధే యనుచు, సంస్కృతభాష నుతింతు నిన్ను వి
ద్వన్నుతనామధేయ, బసవా, బసవా, బసవా, వృషాధిపా! ||"

3. ద్రావిడభాషాపద్యము :—

"పరమనె, యన్నెయాండవనె, పన్నగతానె, యనాథనాథనే,
పెరియవనే, పుళిందవనె, పేరుడయానె, పిరానె, యప్పనే,
తిరిమురియయ్యనే, యనుచు ద్రావిడభాష నుతింతు మన్మనో
వర కరుణావిధేయ, బసవా, బసవా, బసవా, వృషాధిపా ||"

4. కర్ణాటభాషాపద్యము :—

"హాను శరయ న్నరక్షిసువు దాగయాలెన్నవనీత నెందు మ
న్నిసువుదె నిమ్మడింగెరగ నిమ్మ ప్రసాదియె, నిమ్మ దాత్మనే
కసిగతి యంచు భక్తి నిను గన్నడబాష నుతింతు షడ్గుణా
శ్వసన పురాతనాత్మ బసవా, బసవా, బసవా, వృషాధిపా ||"

5. అరెబాసలో పద్యము :—

"దేవ పరీతుష్ఠా చ గురుదేవమణూనుత కీతుష్ఠాచ గో
సావితకీతుష్ఠాచ మచాచప్రసాదష్ఠాచ కృపాకరా
హేవరదా యటంచు నుతియించెద నిన్నను నారెబాస, దే
వా, వినుతార్యలీల బసవా, బసవా, బసవా, వృషాధిపా! ||"

6. జానుదెనుంగుపద్యము :—

"బలుపొశతోంబ, చీరెయును, పాపపెసల్, గిలుపారు కన్ను పె
న్నెలతలఁ, జేమకుత్తుకయు, నిండిన వేలుపుటేఱు, పల్గర పూ
సలుగల కేలితోకవని జానుదెనుంగున విన్నవించెదఁ
వలపు మదిందలిర్ప, బసవా, బసవా, బసవా, వృషాధిపా! ||"

7. పలుభాషలపద్యము :—

"తిరువడి నెమ్మనంబునను నేహృదయేశ్వర, కింపకియతా
బరికరితంబురాణినిను బాహిరిఁ బోలుట కాసితాహతా
వరదనె గిల్లెయుంచు నినుఁ బ్రస్తుతి సేయుదు, బెక్కుభాషలన్
వరద వివేకశీల బసవా, బసవా, బసవా, వృషాధిపా ॥ !"

8. మణిప్రవాళరచనములు :—

"అనయమునుఁ జేతులందు భవదంఘ్రియుగం నమామి, నె
మ్మనమున సంస్మరామి యను మాటల నిన్ వరివస్కగోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున నంకన సేయుదు భక్తలోకహృ
ద్వనజవిహారలోల బసవా, బసవా, బసవా, వృషాధిపా"

"అరుళగిరి ప్రసాద ముడయానె, భవద్గుణ వర్ణనల్వినా యనా
కౌనువనిసే స్మరామి సురసత్తమ యోగణవర్యయంచు ని
ట్లురుమ మణిప్రవాళమున నంకన సేయుదు నిన్ను మన్మనో
వర కరుణావిధేయ బసవా, బసవా, బసవా, వృషాధిపా ! ॥"

"పాయుదె ఒందుచేటుగతి పాప అమా పరమన్నమామి భో
న్యాయవిధేయ మీవతెరి యన్యునజాణ కృతార్థయంచు, వా
గ్ధ్యేయమణిప్రవాళమునఁ దెల్లము నిన్ను నలంకరింతు, దే
వాయమిబృందివంద్య బసవా, బసవా, బసవా, వృషాధిపా ॥"

"హాడువె నామహారసన నంఘ్రియుగ భ్రమ గొండు సద్గుణా
మాడువె యర్చనం బిడె సమగ్ర నుతిత్వము సత్క్రియన్ దగన్
గూడ మణిప్రవాళమునఁ గోరి నుతింతును సంచితార్థముల్
పాడిగ నివ్వటిల్ల బసవా, బసవా, బసవా, వృషాధిపా ॥"

ఈశతకమునందలి శబ్దాలంకార వైచిత్రిం జూప మఱి రెండు మూఁడు పద్యము లుదాహరింతును :—

అంత్యప్రాస నియమము :—

"ఆద్యా, సమర్చితాఖిల పురాతన భక్తగణానుసేద్యా, సం
పాద్యా, గుణానవద్యా, యనుభావ శివాంకితగద్యపద్యా, ని
ర్భేద్యా, గణైకవేద్యా, యురరీకృతవాద్యా భవానిరోగస
ద్వైద్యా, శరణ్యమయ్యా, బసవా, బసవా, బసవా, వృషాధిపా ॥"

వృత్త్యనుప్రాసము :—

"భువనహితార్థతీర్థ, భవభూరుహశాతకుఠారధార, గౌ
రవసముదాత్తవృత్త, యనురాగ రసామృత సారపూర, శాం
భవమయ వేదబోధ, శివభక్తహృదబ్జవికాసభాస, దే
వ వరద కావుమయ్యా, బసవా, బసవా, బసవా, వృషాధిపా ॥"

ముక్తపదగ్రస్తము :—

"సురవరమల్ల! మల్లలితసూత్రపదాంబుధఖేల! ఖేలసం
గగకలకంఠ! కంఠమణినాయకభీమభుజంగ జంగమ
స్థిరతరనాథ! నాథకనిధీకృతరూప, విరూపసమ్మతా!
వరకరుణాబ్ధి! ప్రోవు, బసవా, బసవా, బసవా, కృపాధిపా ||"

సోమనాథుఁ డీశతకమున జాలమంది భక్తులఁ బేర్కొనెను. కాని, కొందఱిమహిమ లుటంకించి, పేరులు తెలుపకూరుకొనెను. ఇతఁడు సూచించిన భక్తులనామములు :—

(1) బసవేశ్వరుఁడు (2) సంగయదేవుఁడు (3) మడివాలు మాచన (4) శంకరదాసదేవుఁడు (5) మాదిరాజు (6) కిన్నరయ్య (7) సోఢలదేవరబాచిరాజు (8) మాదరచెన్నలింగయ (9) మోళిగ మారయ (10) కలికేత బ్రహ్మయ (11) ముసిడిగ చౌడరాయఁడు (12) కన్నడ బ్రహ్మసంయమి (13) బిచ్చిబాచయలు (14) సుంకర బంకిదేవుఁడు (15) తెన్గు బొమ్మయ (16) సురయ చౌడయ (17) సింగి బొప్పయ (18) మొఱటదవంక దేవుఁడు (19) హాలిసహాళ్లికళ్లి దేవుఁడు (20) చిరుతొండనంబి (21) అరియమరాజు (22) పండితమల్లికార్జునుఁడు :—

సోమనాథుని బసవేశ్వర భక్తికి హద్దులు లేవు :—

"బసవనిధానమా! బసవభవ్యనిధీ! బసవామృతాంబుధీ.
బసవమహానిధీ బసవధర్మగిరీ! బసవామరద్రుమా!
బసవమహాబలీ! బసవబంధురవా! బసవోల్లసన్మణీ
వసిఁ గని ప్రోవుమయ్య, బసవా, బసవా, బసవా, వృషాధిపా ||"

"నాయొకయుండ! నావిభుఁడ! నాహృదయేశ్వర! నామనోరమా
నాయిలవేల్పు! నావరద! నాగురులింగమ! నామజంగమా
నాయధినాథ! నావరుఁడ! నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య, దే
వా, యమిబృందవంద్య, బసవా, బసవా, బసవా, వృషాధిపా ||"

ఇటు లెన్నిటినైనను జూపనగును. ఇతని తరువాతి కవులెందఱో—ఇతని శబ్దప్రయోగముల ననుకరించినవారు గలరు. బసవపురాణ పండితారాధ్యచరిత్ర ప్రయోగానుకరణములను గూర్చి శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిగారును, శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణ

రావుగా రా మహా గ్రంథపీఠికలయందు విపులముగఁ జర్చించియున్నారు.

ఈశతకమునందలి—తంగేటిజున్ను, ముంగటినిధానము, పందిటి కల్పవల్లి, కొంగునము త్తియము,—ఇట్టివి, చిఱుతమార్పులతో నల్లసాని పెద్దనగారును గైకొనలేదా?—ఆంధ్రకవితాభ్రవీథిని రాకాశశాంకునివలె ప్రకాశించు నీకవిలోకగురునకు—జేజేలు.

---

మన్మిత్రులు, భాషోద్ధారకులు, బ్రహ్మశ్రీ "వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు" వారు—"బసవపురాణము"ను—విమర్శకాగ్రేసరులు—విద్వద్వరులు నగు శ్రీబండారు తమ్మయ్యగారిచేఁ బరిష్కరింపించి, వారి విపులపీఠికతోఁ బూర్వముద్రణములకంటె సత్యుత్తమమయినదానిగాఁ బ్రకటించి, యొకప్రతి నాకనుగ్రహించుచు, 'మాతృసేవ' లోని పా. సో. నాథునికి సంబంధించిన నావ్యాసాంశములను గొన్నింటి ఖండించిరని తెలిపిరి. నేనందులకు సంగ్రహముగ సమాధానములను వారి 'త్రిలింగ'—(16-2-1953) లోఁ బ్రచురింపఁగా, శ్రీతమ్మయ్యగారు—(23-2-1954 నుండి 10-5-1954 వఱకు) అందే పందొమ్మిది వ్యాసములు (ఇప్పటికి) నావ్యాసమును విమర్శించుచు వెలువఱించిరి. ఇంకెన్ని యున్నవో? కాని, అన్నిటను బాతపాటయే. క్రొత్తది లేకపోఁగా, నుల్లంఘనము లధికమయినవి :—

(౧) నేనొప్పుకొన్న కటూక్తులనునవి—విషయసంబంధులు; కాని వ్యక్తిసంబంధులుగావు. (అట్టివి లేవుకూడ).

(౨) విద్యాజ్ఞానవయోవృద్ధులయిన శ్రీతమ్మయ్యగా రవకాశము దొరకినపుడెల్ల నాయెడఁ బ్రయోగించిన (వ్యక్తిపరములగు) తిట్లన్నియు దీవెనలుగనే పరిగణింతును.

(3) నేను (అవకాశము లభించుచో), మరల వ్రాయుదునన్న నావ్యాసము కొఱకు వారయిదాఱు మాసములు నిరీక్షించినట్లు, తమ 12-వ వ్యాసమున తెలిపిరి. వైతండికులకు సమాధానము లిచ్చుటలోఁ బ్రయోజనముండదని, వారి వ్యాసముల ధోరణిం జూచి గ్రహించి మానితి.

"నభేతవ్యం నబోద్ధవ్యం, నశ్రావ్యం వాదినోవచః
ఝడితి ప్రతివక్తవ్యం, సభాసు విజిగీషుభిః"

అన్నట్లు శ్రీతమ్మయ్యగారు విజిగీషువులు. నేను సత్యవిషయజిజ్ఞాసువును. పొత్తు కుదురునా? ఇదివఱకుఁ గుదిరెనా? సత్యము చెదరునా? లోఁగడ చెదరెనా?

(౪) "వీరశైవమనఁగా, నన్ని సాంకర్యములకు నిలయమని కాఁబోలు వీరి (నా) యభిప్రాయము! రుద్రాంబకూతురును వలచి యామెను బరిణయమగుటకు సాధనాంతరములేకయేనా, అన్నయ సోమనాథునిచే వీరశైవదీక్షనందినది? ఇట్టి వాక్యములానాఁడు వ్రాసియున్న గణపతిదేవచక్రవర్తి రుద్రమాంబ హర్షించి భూరిసంభావనలతో గారవించియుందురేమోకదా" (శ్రీతమ్మయ్యగారి 19-వ వ్యాసము.)

ఎదుటి వారి యభిప్రాయములను దోషభూయిష్ఠములుగాఁ జిత్రించి చూపుటలోను, వారిభావముల కపార్థములు కల్పించి వివరించుటలోను శ్రీతమ్మయ్యగారు గడుంగడు నిపుణులని రూపించుట కింతకంటె నిదర్శనమేమి కావలయు?—

వర్ణాశ్రమాచారములఁ బాటించువారు వీరశైవులు; వానిఁ బాటింపనివారు సహజవీరశైవులనుట నెల్లరెఱుంగుదురు. మొదటివారికిఁ దమ కులక్రమాగత గోత్ర సూత్రాదికము లుండుటయు, రెండవవారికి సర్వము శివమయమగుటయు నంద ఱెఱింగి నదియ. ఇది సాంకర్యమెట్లగును?—అగుచో—హిందూమతాంతర్గతములే యగు జైన—బౌద్ధ, చార్వాక, లోకాయతాదులు, ఇటీవలివగు—(బ్రాహ్మ) బ్రహ్మసమాజ ఆర్యసమాజాదులేకాక, తుదకు 'సర్వంఖల్విదంబ్రహ్మ'—మను నద్వైతమతమును—సంకరమతములే యగును. కనుక సహజవీరశైవమతమును సంకరమతమని నేననియున్నచో, నద్వైతుఁడ నగు నేను మొదల సంకరమతస్థుఁడను గావలెను.

మత నియమ బద్ధమయిన యొకానొక సంఘమున న్యూనతాధిక్యతలను బ్రకటించు వర్ణధర్మములు పాటింపఁబడనంతమాత్రమున, దానిని సంకరమతమని చెప్పునంతటి మతిమాలినవాఁడనని విమర్శకాగ్రేసరు లూహించుట పొరపాటు. తమ ధర్మములు త్యజించని పలువురు వర్ణస్థు లొకటిగఁ గూడుసంఘము—అనఁగా, "తండ్రి మధ్వాచారి తనయుఁ డారాధ్యుండు, తల్లి రామానుజమతస్థురాలు" గాఁ గూడిన సంఘములే సాంకర్యములకు నిలయములు. వర్ణవివక్షలేని మత మంగీకార్యము. మతవివక్షలేని పతితవర్ణము అంగీకార్యము గాదు. కాన వర్ణములు పాటింపకున్నను సహజవీరశైవమతనియమబద్ధులు అత్యంతము పూజ్యులు. నియమముల నుల్లంఘించువారిని జంగములసంఘము మన్నింపదు. జలగలవలె పట్టుకొని పీల్చి పిప్పిచేయుదురు. సిరియాళునికథ చూచినవారికి వీరశైవులలో సెట్లు మొదలగు వర్ణాలున్నవని—వారికిని జంగములు (సహజవీరశైవాచారదీక్షితులు) మిక్కిలి ఆరాధనీయులని తెలియును.

ఇఁక వెనుకటివాక్యము :—'రుద్రాంబకూఁతురును వలచి యామెను బరిణయమగుటకు సాధనాంతరము లేకయేనా, అన్నయ సోమనాథునిచే వీరశైవదీక్ష నందినది?' అని శ్రీతమ్మయ్యగారు. నేను వ్రాసినదేమియో చక్కఁగఁ జూడకయ యడుగుట వింతగనున్నది. నావాక్యమిది :—'తాను (అన్నయ) బ్రాహ్మణుఁడైయుండిన్ని, కమ్మవనితను (రుయ్యమ్మను పెండ్లాడడము మూలాన బ్రాహ్మణసంఘదూషణమునకు తట్టుకోలేక పాలుకుఱికి సోమనాథుని ఆశ్రయించి శిష్యుఁడై సహజవీరశైవులతోఁ జాతి మతభేదాలులేనివారితో) చేరిపోయివుంటాడు.'—శ్రీతమ్మయ్యగారు "మతస్వీకారానంతరము పరిణయమాడినట్లు నావాక్యమునకు భిన్నముగ నర్థము గ్రహించిరి.

అన్నయ్య అసలే వీరశైవుఁడు. కాకతీయ సామ్రాజ్యాధీశులును వీరశైవులనియే వారిపేర్లు చాటుచున్నవి. ఆకాలమున వర్ణధర్మములు పాటించు బ్రాహ్మణులకును, కమ్మలకును పరిణయ మసంభవము. కాని, అన్నయ్య ఎట్లో రుయ్యమ్మను బెండ్లాడుటచే బ్రాహ్మణసంఘమతనిఁ బతితునిగనే—ఎంచుటచే, దానికిఁ దట్టుకొనఁజాలక సహజవీరశైవదీక్ష నాతఁడు సోమనాథునిచేఁ బొందెననుటలో విప్రతిపత్తి యేమియు లేదు.

ఈవాక్యముల నే నానాఁడు వ్రాసియున్న గణపతిదేవచక్రవర్తి రుద్రమాంబ హర్షించి భూరిసంభావనలతో (నన్ను) గారవించియుందురఁట! మంచిదే; 'కాకతీయులు క్షత్రియులా శూద్రులా'—అని సంశయించుచు వ్రాయువారికిఁగూడ నట్టి భూరిసంభావనలో భాగముండునని శ్రీతమ్మయ్యగా రూహింపరైరి.—

దుగ్గ్యాంబ—అన్నయ్యల వివాహసంబంధముచేఁ బౌరాణికయుగధర్మములను, కన్యాకతియగు విప్రవార్యుని తండ్రికృత్తాంతమును దెచ్చి సమర్థింపఁజూచుట అసంగతము. పరాశర యాజ్ఞవల్క్య హేమాద్ర్యాది ధర్మశాస్త్రముల ప్రకారము నను ముందటివలెను కొంతకాలము అమలులోనుండిన అనులోమవిలోమవివాహము లన్నయ్యనాఁటికి అంతరించినవి. జైన బౌద్ధాది మతముల వలనఁ గట్టుబడు వర్ణాచారములు కట్టుదిట్టములలో నుంచఁబడినవి. అది అన్నయకు తెలియకపోలేదు; కావుననే—రాజబంధువయి, క్షత్రియధర్మ మవలంబించిన అన్నయ మొదట కులస్త్రీని నిరువుర వరించియే, తరువాత 'దుగ్గ్యాంబ'ను బరిగ్రహించినట్లు—"అద్రిజ లనవమాంబలని విలసిల్లెడు కులభామినులను ముక్కువ వరించె"—అని "శివయోగసారము"—తెలుపుచున్నది. అన్నయ్య అధర్మ మెప్పుడును చెల్లునని, (శ్రీతమ్మయ్యగారివలెనే) తలంచి యట్లు చేసెను. తుదకు పాటుల వాడి తప్పనందున పాల్కురికి సోమనాథునికడ సహజవీర శైవదీక్ష నందెను. అది లాంఛనప్రాయమే. నిజమునకు వీరశైవులకుఁగూడ సహజవీర శైవులు మిగులఁ బూజ్యులు. మల్లికార్జునపండితుఁడు శివపూజాసమయమున వచ్చిన పరమ మాహేశ్వరభక్తులను (పూజవదలి) సత్కరింపలేదా?—సహజవీరశైవలోకగురుఁడగు బసవని దర్శనార్థము పయనముగాలేదా?—కావున ఈసందర్భమున, మహాదండనాయకుఁడు, ప్రతాపవంతుఁడు, రాజకార్యధురీణుఁడు—నగు—అన్నయ్యను దమవానినిగాఁ జేసికొన రాజకుల ముత్సహించుటచేతను, రాజబంధుత్వము, తనపదవికి మించిన గౌరవము నాపాదించునని యతఁడూహించుటచేతను దుగ్గ్యమ్మ సంబంధము అతని కేర్పడినది—సంఘమాపణకు వెఱచియే—అతఁడు సహజవీరశైవదీక్ష నందెను. కాని, బ్రాహ్మణ్యము వదలి సంకరుఁడు కావలెనని కాదు. ఏతత్కారణముననే అతఁడు, తన కౌండిన్యగోత్రమును, ఆపస్తంబసూత్రమును వదలలేదని చరిత్రమే చెప్పుచున్నది.

ఇఁక కాకతీయుల కులమునుగూర్చి యించుక చూతము :—

గణపతిదేవుని శాసనాలలో—కాకతీయులు "సూర్యవంశ్యులు"గాఁ దెలుపఁబడిరి. బస్తరుసంస్థానమునందలి శాసనములు కొన్ని వీరిని "చంద్రవంశ్యులు"గాఁ జెప్పుచున్నవి. కాని, కాకతీయుల సామంతుల శాసనములలో మాత్రము వారుచతుర్థవంశజనితులుగాఁ జెప్పబడిరి.—మల్కాపురం గణపతిదేవుని శాసనమున ఇట్లున్నది :—

"దేవస్య తస్యాస్ఫురన్నాభీ పంకజభవస్య భుజతో భూవల్లభా జజ్ఞిరే
తేషాం తిగ్మమరీచి సంతతిభువో యేదుర్జయాః క్షత్రియా స్తేషా
మస్తికులం కలంకరహితం శ్రీకాకతీ భూభుజాం ‖"

ఇది కాకతీయులను క్షత్రియులనుగాఁ దెలుపునది.

మల్యాల గుండయదండనాథుని శాసనములో ఇట్లున్నది :—(వర్ధమానపురం)

"అథ స్వీకృత వర్ణోక్తధర్మ నిర్మలచేతసః
జాతాః ద్విజాతయః పశ్చాచ్చతుర్థకుల ముజ్జ్వలం"
"తత్రానేక నృపాలఫాల లిఖితాం వీరాంకవర్ణావళిం
దర్పం దర్శ మనర్గళం నమచర త్తీవ్రః ప్రతాపానలః

యస్యోదంచిత కాకతీశ్వరకుల క్షీరాబ్ధి సంవర్ధన
ప్రౌఢాహంకృతి చంద్రమాస్సముభవ త్రోవిలాభిధానోనృపః”

ఇతనిదే యగు భూతపుర శాసనంలోను—“మహితస్తుకీయో, ...... కాకతీయం కులంమహత్”—అనియున్నది. — ఆకాలమునఁ గాకతీయ ప్రభు పరివారవర్గము, సేనానీకము పూర్తిగా, కమ్మవీర జనాకీర్ణము.—కానఁ ప్రభువులు క్షత్రధర్మావలంబులు ; గనుక శాసనాలలోఁ దమ్ముఁగూర్చి గొప్పగా చెప్పకొన్నారు ; కాని సామంతులు ‘శూద్రుల’ని సత్యాన్ని బయటపెట్టినందున నిదియే విశ్వాస్యా మనుట సమంజసము. అంతేగాక, ఆనాఁడు కమ్మ, వెలమ, రెడ్డికొలముల కంతగా భేదములులేకపోవుట పరస్పర మిచ్చిపుచ్చుకొనుటలు, పంక్తిభోజనములు సామాన్యసాంఘిక మర్యాదలుకూడ ఉండునవి. వీనినన్నింటిని బట్టి—కాకతీయులు కమ్మలే యనిచరిత్రకారులెల్ల నైకకంఠ్యముగ నిదివఱకే యుద్ఘోషించిరి.—దానినే అభినవతిక్కన పద్యరూపమునఁ దనకావ్యమున స్థిరీకరించెను. నానోటికివచ్చిన ఆపద్యమిది :—

‘తెలుఁగుంబుడమికి వెల్గుఁగుం గలిగించిన వీరు, లోరుగంటి మహీశా
థులు శ్రీప్రతాపరుద్రాదులు వెలసిరి కమ్మవంశ తోయధివిధులై’
లోకము కోడియైకూయు నీవిషయము శ్రీతమ్మయ్యగారికి శంకాస్పదము!!!

ఈ 1954—మే నెల భారతిలోని వీరివ్యాసమునఁగూడఁ గ్రొత్తవిషయములు మృగ్యములు.

(కొన్నిసవరణములు :— (1) 36 పుట—శీర్షికలోని కవిపేరిక్రింద— క్రీ. శ. 1290—1320 అనియు,— (2) 48 పుట — మూఁడవపేరా కడపటిపంక్తిలో — క్రీ. శ. 123 నకు బదులు 1230 అనియు—నుండవలెను).



# (బద్దెన): భద్రభూపాలుఁడు

(క్రీ. శ. 13-14 శతాబ్దప్రాంతము)

ఆంధ్రదేశమున నాబాలవృద్ధ మెఱిఁగిన 'సుమతిశతకము'— వలెఁ బ్రచారమునందిన గ్రంథము మఱియొక్కటి లేదు. అందలి పద్దెములు గొన్నియేని నోటికిరాని తెలుఁగువాఁడు ఉండఁడు. కాని, యేతద్గ్రంథకర్తృత్వ కాలాదికములంగూర్చి యింతదనుక బహుళ ప్రయత్నములొనర్చిన పరిశోధకులలో నొక్కరేని కచ్చితముగ నిదమిత్థమని నిర్ణయింపఁజాలకపోవుట ఆశ్చర్యకరము.

శతకకారునిఁగూర్చి పూర్వవిమర్శకులకుఁ గలిగిన భిన్నాభిప్రాయములు :—

1. కూచిమంచి తిమ్మకవి, భీమకవిదని యొకపద్యమును దృష్టాంతముగాఁ దన సర్వలక్షణసారసంగ్రమున నుదాహరించెనని పీఠికలోఁ దెలుపుటయేకాక, శతకమునఁ గట్టకడపటి పద్యముగా :—

"శ్రీకరముగ భీమనమును, లోకమునకుఁ బొగడఁగా విలోకించిమదిన్
బ్రాకటముగ సుమతికి, మతిచేకూడఁగ సుమతి నీతి చెప్పఁదొడంగెన్"

అనుపద్యము వావిళ్లవారి నీతిశతకసంపుటము (౧) లోఁ బ్రకటింపఁబడినది.

2. 'సుమతి' నామాంచితుఁడగు జైనభిక్షుఁడెవఁడో—ఆత్మనామసంబోధనముతో నిట్టినీతులను వెలువరించెనని వెండియుం గొందఱుచే నూహింపఁబడినది.

3. భద్రభూపాలవిరచితమని ప్రఖ్యాతినందిన—తనకు దొరకిన "నీతిశాస్త్రముక్తావళి" ప్రతులయం దొక్కదానిలో :—

"శ్రీవిభుఁడ, గర్వితారిక్ష్మావర దళనోపలబ్ధ జయలక్ష్మీక సం
భావితుఁడ, సుమతిశతకముఁగావించిన ప్రౌఢఁ గావ్యకమలాసనుఁడన్"

అనుపద్యమున్నదనియు, నందుచే నది (సుమతిశతకము) గూడ భద్రభూపాల ప్రణీతమనియు—శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 'నీతిశాస్త్రముక్తావళి' పీఠికలోఁ దెలిపిరి.—ఈమాఁటిలోని యాథార్థ్యము ఇంచుక పరిశీలింతము :—

1. కూచిమంచి తిమ్మకవినాఁటికి, ఇప్పుడు మనకు లభ్యములయినన్ని గ్రంథములు దొరికియుండలేదు. అతఁడు తనలక్షణముల కుచిత

ములగు లక్ష్యములను—వినికిడివలన సంగ్రహించినవియు, తనధారణమునందున్నవియు నెక్కువగా నుపయోగించుకొనెను. ఉపలబ్ధము లయిన కతిపయగ్రంథోదాహరణములు గొలఁదిగనే కైకొనెను. అట్టి యెడ కవులయొక్కయు, వారి కృతులయొక్కయు పేరులు తారుమారు లగుట అనివార్యము.—"పదిదినములైదుపొద్దులు" అనుపద్యము 'అథర్వణభారతము'నందలిదిగా తిమ్మకవి యుదాహరించెను. కాని, కొన్ని కవిత్రయ (భారతముద్రిత) ప్రతులలోను ఈ పద్యము కనఁబడుచున్నది. వాస్తవముగా, తిమ్మకవి అథర్వణ భారతమునుండియే దానిని గ్రహించియున్నచో, అవఱకే వాని వ్రాఁతప్రతులు పెక్కులటనట తెలుఁగు నాఁట వ్యాపించియుండెడివి కదా!—మఱి 'ఏఱుట'—'ఱ'కారమని తెలుపుటకు, రేఫద్వయ సాంకర్యముగల పద్యము లెన్నో యున్న 'సుమతిశతకము'లోని 'ఏఱకుమీకసుగాయలు'—అనుపద్య ముదాహరించి, అది భీమనదనుటయు నట్టిదే. కనుక 'సుమతిశతకము'—భీమన కృతము అనుట విశ్వాసార్హ మెంతమాత్రముకాదు. "దాక్షారామ భీమేశనందనుఁడ"—నని చెప్పుకొన్న భీమన,—"శంభువరప్రసాదకవి సంఘవరేణ్యుఁడ"—నని పొగడికొన్న భీమన—"శ్రీరాముని దయచేతను"—అని తాను చేయఁబూనిన శతకమునకు మంగళాచరణ పద్యము వ్రాయఁజాలఁడు.

మఱొకవిషయముగూడ నీపట్టున గమనింపఁదగును.

"ఆనీతాభ్యుపదాన శృంఖల పదాభ్యాలంబిత స్తంభమా!"
"భూనవ్యాపిత పల్లవోద్భవ మహాపుష్పోపగుచ్ఛంబులన్"
"దివ్యవిషామృత ప్రకట నానాకావ్యధుర్యుండ"—

ఇట్టి సాంస్కృతిక జటిలసమాసభూయిష్ఠమగు శైలికి జతపడిన భీమకవి—ఇంపయిన జాను తెనుఁగు పదములతోఁ గూర్పంబడిన సరళభావసముపేతములగు చిన్న కందపద్యములతో ఆబాలగోపాల మర్థములగు నీతులను హృదయంగమములుగ రచించుట అసంభవము.

ఇంతకును నిగ్రహానుగ్రహశక్తిగల వేములవాడ భీమకవికాక, మఱొక భీమకవి ఆకాలమున 'కవిజనాశ్రయ'కర్తప్ప గ్రంథరచయితగా ఖ్యాతిఁగన్న వాఁ డగపడఁడు.

2. 'సుమతి'యను జైనభిక్షువునకును, ఈశతకమునకును సంబంధము కించిత్తుగూడ లేదని, మంగళాచరణపద్యమే చెప్పుచున్నది. సుమతీశతక నీతులలోఁ గొన్ని జైనమత విరుద్ధాంశములు — ఈ యూహను బలపఱచుచున్నవి.

3. నీతిశాస్త్రముక్తావళిని క్రీ. శ. 1910 లో ప్రచురించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు—బద్దెన ఆగ్రంథమును రచించినట్లు తెలుపుచు, సుమతీశతకముగూడ ఆతఁడు వ్రాసెననియుఁ, గాని రెంటికిని శైలిలో నించుక భేదము కనఁబడుచున్నదనియు వచియించిరి.

పై రెండు గ్రంథములవలెనే, క్రీ. శ. 1150 లో నుండిన రుద్రదేవుఁడు 'నీతిసారము' అను గ్రంథమును వ్రాసెననియు, అందు నీతిశాస్త్రముక్తావళి, సుమతిశతకములలోని ఛాయలుండుటచే, బద్దెన, రుద్రదేవునకుఁ బూర్వుఁడనియు, దాదాఁపు క్రీ. శ. 1070 సం॥రము వాఁడు కావచ్చుననియు (అనఁగా పదునొకండవ శతాబ్దమువాఁడనియు) శ్రీరామకృష్ణకవిగారు వక్కాణించిరి.

బద్దెన భువనైకమల్లుని సామంతుఁడగుటచే 12 వ శతాబ్దమువాఁడని, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రమున వివరించిరి.

శాసనాధారములతో శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, ఈ బద్దెభూపాలుఁడు కాకతీయరుద్రమదేవి సామంతుఁడుగా, క్రీ. శ. 1261 సం॥న నొకచిన్న మండలేంద్రుఁడయి యుండినందున—నంతకుముందువాఁడని నిర్ణయింపఁజాలమనియు, కనుక నతఁడు పదుమూఁడవ శతాబ్దమునకుఁ జెందినవాఁడనియుఁ జెప్పిరి.

'శతకకవులచరిత్ర' వ్రాసిన శ్రీ వంగూరి సుబ్బారావుగారు నిర్హేతుక సందేహములకు లోనయి, పైవారి వాదములనుగాని, శాసనాధారములనుగాని పూర్తిగ విమర్శింపకయే, "12, 15 శతాబ్దముల నడుమ నిది శతకము పుట్టియుండవచ్చు"నని యొకవంకఁ జెప్పుచు,— "వ్యతిరేక నిదర్శనములు లేనంతవఱకు శ్రీకవిగారి పద్యానుసారము నమ్మవలసివచ్చుచున్నది"—అని తేల్చిరి.—మఱి శ్రీకవిగారి కాలనిర్ణయమే సరియైనదని తోఁచుచోఁ బండ్రెండవశతాబ్ద పూర్వార్ధమే

నిశ్చయమగును ; అట్టియెడ '12—15 శతాబ్దముల నడుమ'—అని చెప్పనేల ?—అయినను ఒకానొక కవికాలనిర్ణయమునకు మూఁడు శతాబ్దముల మధ్యగల సారస్వత పరిణామములు, శాసనాదికములు పర్యాలోకన మొనర్చుటయన్న సుసాధ్యమా ?

ఇఁక ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహకర్త—"ప్రతాపరుద్రునిఁ దడవుటలో మహామండలేశ్వరుల బద్దె (భద్ర) భూపతి స్మృతికిఁ దట్టినాఁడు. కాలమున నెట్లో, కాని కవితలో నీయిరువురు నొకేశాఖలోనికిఁ జేరినవారు" అని వచించెను. కాని, ఆపుటలోనే అధోజ్ఞాపికలో:— "శాసనమున్నది. దానిలో (క్రీ. శ.) 1261 లో బద్దెన యున్నట్లు నిశ్చితమయినది. బిరుదావళి సరిపోయినది. ఇది భద్రభూపతి యవసానకాలము గావచ్చును. కవిత్వము సహజముగ యౌవనప్రౌఢవయస్సులలోనిదగుట ప్రతాపరుద్రునితర్వాత 13-వ శతాబ్ది యాదిని గ్రంథము రచితమయి యుండనగును"—అని స్పష్టపఱచెను.

రుద్రదేవుని నీతిసారములోనేకాక, క్రీ. శ. 1340 ప్రాంతముననున్న మడికిసింగన కృతులలోను ఈ 'సుమతిశతక' చ్ఛాయలు కనఁబడుచున్నవి. కాని, యీశతకపద్యము లారెంటను నెక్కడఁగాని యుదాహరింపనికారణమునను, వారికాలమునందు వాడుకలో నుండిన పదములు చాలవఱకు 'సుమతి'—లో లేనందునను, అది మడికిసింగనకుఁ దరువాతిదే యని (1950 డిసంబరు 15 తారీఖుగల) 'సుజాత' పత్రికలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తెలిపిరి.

పైఁ జూపిన అంశముల పరిశీలించుచో — (1) శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి నీతిశాస్త్రముక్తావళి వెలువడునంతవఱకు, సుమతిశతక కర్తృత్వవిషయముననే పరిశోధకులలో భిన్నాభిప్రాయములుండుట,—(2) సుమతిశతక నీతిశాస్త్రముక్తావళులలోని శైలి ఒండొంటికి సంబంధింపకపోయినను భావములలో నంతగా భేదములు లేకుండుట, (3) ముక్తావళికర్త "శ్రీవిభుఁడ"—అనుపద్యమునఁ దానే సుమతిశతక కర్త—నని చెప్పుకొనుట, (4) ఇంకను బలవత్తరములయిన హేతువులు—ఆధారములు దొరకిననేతప్ప, సుమతిశతకమునకు బద్దెన కర్త

త్వము తొలఁగింప వీలుకాదనుట— తెలుఁగువారికెల్లఁ జక్కఁగఁ దెలిసిన యంశములే.

ప్రకృతము శ్రీప్రతాపరెడ్డిగారు—కర్తృత్వమును గూర్చిన పరిశోధనకుఁ జొరక, — శతకస్థ శబ్దాదిక సాధనములతో, తద్రచనాకాలము క్రీ. శ. 1500—1600 కు మధ్యగా నుండవలెనని నిర్ణయించుట —నేల విడిచి సాముచేయుటయే యగును. ఏలయన :—కాలము ననుసరించి పదములు—వానియర్థములు మాఱవచ్చును. అట్లే, కవి ననుసరించి భావములు, అందలి నీతిబోధనములు పరివర్తన మందవచ్చును. కనుక, ముందుగఁ గవి నిర్ణయము కర్తవ్యము. అది సుకరము గూడ. కాలానుగుణ శబ్దార్థనిర్ణయ మొకపాటి పండితునికి సాధ్యమగునది గాదు. శబ్దపరిణామములు సమగ్రభాషాచరిత్ర నెఱిఁగిన శాబ్దికులకుఁగాని వీలుగాదు.

ఇపుడీ సుమతిశతక కాలనిర్ణయము క్రీ. శ. 1500–1600 మధ్యగా తీర్మానించిన శ్రీ ప్రతాపరెడ్డిగారికి ఆధారము లివి :—

1. సంస్కృతమున కేరళదేశస్థుఁడయిన కొక్కోకుఁడను కవి వ్రాసిన 'రతిరహస్యమును' తెనుఁగున ఎఱ్ఱనయనుకవి 'కొక్కోక'—మను పేరితో అనువదించెను. అతనికాలము, క్రీ. శ. 1600. 'సుమతిశతక' కారుఁడు—కొక్కోకుని పేరి నెఱుఁగఁడు. అతని గ్రంథము (రతిరహస్యము) నెఱుఁగఁడు. ఎఱ్ఱన వ్రాసిన 'కొక్కోక' మను తెనుఁగు రతిశాస్త్రమునే అతఁడు చూచినది. కాన, ఎఱ్ఱనకాలమునకుఁ బూర్వ మతఁడుండెననుట అసంభవము.

2. రాయనిభాస్కరుని కాలమునకు ముందు గ్రామకరణములు కమసాలులు. భాస్కరుఁడు వారిని తొలఁగించి నియోగులకు ఆపదవుల నిచ్చెనని ప్రతీతి. అగుచో అట్టి నియోగికరణాలనే సుమతిశతకకారుఁడు పలుతడవలు విమర్శించినాఁడు. పై భాస్కరునికాలము ననుసరించి సుమతిశతకకారునిది—క్రీ. శ. 1600 సం॥ ప్రాంతమే యగును.

3. 'కొని' కి—'క' కారాదేశము వైయాకరణులమతమున దుష్టము. శ్రీనాథుని తరువాతికవులే దానిని వాడినట్లు తెలియుచున్నది. ("ఎద్దులఁగట్టుక"—"మడిదున్నుక"). కనుక సుమతిశతకకారుఁడు 15 శతాబ్దికి తరువాతివాఁడే యగును.

4. రేఫద్వయ సాంకర్యము ప్రాచీను లంగీకరింపలేదు. సుమతి శతకకర్త ప్రాసములలో—ఆ రెంటినిగూర్చుటచే, నతఁడు ప్రాచీనుఁడు గాఁడు.

ఇట్టివే యింకనుంగొన్ని గ్రంథస్థములగు కవికృతప్రయోగముల నాధారపఱచుకొని తత్కాల నిర్ణయ మొనర్చుటలోఁ బ్రతాపరెడ్డిగా రెంతేని పరిశ్రమించిరి ; కాని, కవినిగాని, అతని సమకాలికులగు యశఃకాయులనుగాని తెలిసికొనుట కాధారములు దొరకనపు డా గ్రంథకర్తృప్రయుక్త శబ్దసాధనములతో, నందులకు (కవినిగూర్చి తెలిసికొనుటకు) నెల్లవిధములఁ యత్నించుటలో నర్థమున్నది. కేవలము గ్రంథకాలనిర్ణయమాత్రమున కట్టిపాటు వ్యర్థమే యగునేమో !—

ఇంతకు, నిది బద్దెన కృతమే యనియు, నతఁడు పదుమూఁడవ శతాబ్దాదిపాదమువఱకు జీవించియుండెననియు శాసనాధారములతో నిర్ణయింపఁబడిన సిద్ధాంతమును బెక్కురు పరిశోధకు లంగీకరించియే యున్నారు. ఇతనికి ముందు శతకరచనము చేసిన శైవకవులయొరవడిలోనే, యితఁడును (బద్దెనయు) సుమతిశతకము నిర్మించెననుటయందును, ఎటుతిరిగియుఁ బదునాలుగవ శతాబ్దములోపలనే యితఁడు జీవించియుండె ననుటయందును సందేహము లేదు. ఆతనికిముందుండిన శైవకవులు రచించిన *శతకములన్నియుఁ గేవలము—భక్తిరసము వెల్లివిరియునట్లును, మతవ్యాప్తికి దోహదమగునట్లును విలసిల్లినవి. కావున, నీతిప్రబోధకముగ నొకశతకము రచింప దొరకొన్న బద్దెన—, మొదట నీతిశాస్త్రముక్తావళిని, ఆతరువాత సుమతిశతకమును వ్రాసియుండునను టయం దించుకయు సంశయింపఁ బనిలేదు.

సుమతిశతకము, నీతిశాస్త్రముక్తావళివలె నంతప్రౌఢముగాదు. ఇందలి కందములను లలితశబ్దములతో హృదయంగమమగు శైలిలో సరళముగా సాగించి, సులభముగా భావములు పఠితలమనస్సులకు నచ్చునట్లు చేయుటయందీతఁ డఖండుఁడు. ఇతని తరువాత, కందములలో శత

* శివకవులు 11-వ శతాబ్దినుండి—శతకములు రచించుచువచ్చిరని,—ఉదాహరణముగా :—(1) శ్రీగిరీశ, (2) గిరిజాధినాయక, (3) విరూపాక్షలింగ, (4) చెన్నమల్లేశాది శతకములఁ జేర్కొనుచు, శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ.—గారొకవ్యాసమును, 'భారతి'—రజతోత్సవసంచికలోఁ గాఁబోలు బ్రకటించియుండిరి.

కము వ్రాసిన "కవిచౌడప్ప"—"గువ్వలచెన్నఁడు"—మొదలగువా
కీర్తిని పోకడల ననుసరించి రచన సాగించిరి. కొన్నిస్థలములం దభిప్రాయ
ములుగూడ గ్రహించి, తమగ్రంథములందు మఱొకవిధముగా మార్పుల
తోను చేర్పులతోను ఉపయోగించుకొనిరి.

లలితములగు నీతని పద్యములలో—కుంటుపోనినడక—మొక్క
వోనికమ్మఁదనము జాలువాఱుచుండును. భావముల ననుసరించి పద
ములు పరుగిడి వచ్చుచుండును. పాండితీప్రకర్షకన్నను—అద్భుతజాతీ
యములు, తెలుఁగుపలుకుఁబళ్లు విశేషముగా దొరలివచ్చుచుండును.
మచ్చునకుఁగొన్ని :—

(1) చేపుణికిళ్లు (2) పాడుబొంద (3) పులిపాలు (4) పేటెత్తు
(5) నడపీనుఁగు (6) కించిత్తు (7) కకవికలు (8) తెల్లనికాకులు
(9) మేఁకలపాఁడి (10) మిడిమేలము (11) అడియాస (12) గుడిమణి
యము (13) దాసికొడుకు (14) పిలువనిపేరంటము (15) తలతోఁక
యనక (16) తలదడవిబాస (17) అడిచిపడు (18) ఇంద్రభోగము
(19) జలప్రళయము (20) కొఱగానికొడుకు (21) అడుగులకు మడుఁ
గులు (22) తిన్నతిండి (23) కసుగాయ (24) వెనుకటిగుణము (25) ఏటి
కెదురీఁదు (26) తలపోఁడుగుధనము (27) పెరటిచెట్టుమందు (28) చెవి
టికి సంకూఁదు.

ఈ క్రింది యుపమానము లెంత ముచ్చటగ నున్నవో పరి
కింపుఁడు :—

(1) కరిమ్రింగిన వెలగపండుకరణి (2) జంత్రపు కీలూడినట్లు
(3) బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుట (4) చెఱకుపిప్పికి చీమలు
మూఁగినట్లు (5) కుమ్మరి మన్నుద్రవ్వినట్టి గుంట (6) ఇత్తడి బంగార
మగునె (7) కొండంత మదపుటేనుఁగు తొండము లేకుండినట్లు (8) మా
నెఁడు జలములలో నేనుఁగు మెయిఁ దాఁచినట్లు (9) తేలగ్నిఁ బడఁ
గఁబట్టిన, మేలెఱుఁగునె, మీటుఁగాక (10) కానల నీఁగలు గూర్చిన
తేనియ యొరుఁ జేరునట్లు, (11) నల్లికుట్టిన మంచమునకుఁ బెట్లు వచ్చు,
(11) సప్పంబు పడగ నీడన్న గప్ప వసించినవిధంబు—

ఇట్టి వెన్నియో గలవు. ప్రతిపద్యమునం దిట్టి విశేషము లేవో
కొన్ని గోచరించుచుండును :—

ఈ "సుమతిశతక" ప్రాముఖ్యత మన తెలుఁగుదేశమున పుట్టుకతోనే గుర్తింపఁబడుట కిందలి నీతిబోధక వైలక్షణ్యము—విచిత్ర దేశీయ శబ్ద సౌలభ్యము—ముఖ్యకారణములు.

లోకోక్తులవంటి సామాన్యనీతులు కొన్నిచోట్ల కవి హృదయంగమములుగాఁ బ్రయోగించెను. చిత్తగింపుఁడు :—

1. ఓడలఁ బండ్లును వచ్చును, ఓడలు నాబండ్లమీఁద నొప్పుగ వచ్చున్.
2. చెఱకుతుద వెన్నుపుట్టినఁ, జెఱకునఁ దీపెల్లఁ జెఱచు.
3. గడనుడుగు మగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చెననుచు నగుదురు.
4. తనకలిమి యింద్రభోగము, తనదుఃఖమె సర్వలోకదారిద్ర్యంబుల్.
5. తనవారి కెంతగల్గిన, దనభాగ్యమె తనకు.
6. నయమునఁ బాలుం ద్రావరు, భయమున విషమ్మునైన భక్షింతురుగా.
7. పెట్టిన దినములలోపల, నట్టడవులకైన వచ్చు నానార్థంబుల్.
8. బలవంతమైనసర్పము, చలిచీమలచేతఁ జిక్కి చావదె.
9. రా పొమ్మని పిలువని యా, భూపాలునిఁ గొలువ భుక్తిముక్తులు గలవే ?
10. దాసికొడుకైనఁగానీ, కాసులు గలవాఁడె రాజు.

ఈ శతకమునందలి పెక్కు నీతులు, సంస్కృతనీతిశ్లోకాలకు అనువాదాలుగాఁ గనఁబడుచున్నవి.

1. పనిసేయునెడల దాసియు, ననుభవమున రంభ, మంత్రియాలోచనలన్
వన భుక్తియెడలఁ దల్లియు, ననఁ దనకులకాంత యుండవలెరా సుమతీ !
కార్యేషుమంత్రీ, కరణేషుదాసీ, భోజ్యేషుమాతా, శయనేషురంభా ॥

2. సిరి దా వచ్చిన వచ్చును సరిపోల్పఁగ నారికేళ సలిలముభంగిన్
సిరి దాఁ బోయినఁ బోవును కరి మ్రింగిన వెలగపండుకరణిని సుమతీ !

సమాయాతి యదా లక్ష్మీః నారికేల ఫలాంబువత్
వినిర్యాతి యదా లక్ష్మీః * గజభుక్త కపిత్థవత్ ॥

3. అధరము గదలీకదలక మధురములగు భాషలుడిగి మానవ్రతుఁడౌ
నధికార రోగపూరిత బధిరాంధకశవముఁజూడఁ బాపము సుమతీ !
బధిరయతి కర్ణవివరం, వాచం మూకయతి, నయన మంధయతి,
వికృతయతి గాత్రయష్టిం సంపద్రోగోయ మద్భుతో రాజన్ ॥

4. తల నుండు విషము ఫణికిని వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకున్
దలతోఁక యనక యుండును ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ !
వృశ్చికస్య విషం పుచ్ఛం మక్షికస్య విషం శిరః
తక్షకస్య విషం దంష్ట్రా సర్వాంగం దుర్జనే విషం ॥

5. బలవంతుఁడ నాకేమని పలువురతో నిగ్రహించి పలుకుట మేలా ?
బలవంతమైన సర్పము చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ ॥
బాహుభి ర్న విరోద్ధవ్యం దుర్జనై స్స్వజనైరపి
స్ఫురంతమపి నాగేంద్రం భక్షయంతి పిపీలికాః ॥

6. పతికడకుఁ, దన్నుఁ గూర్చిన సతికడకును, వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల మతిమంతులుం చనరు, నీతిమార్గము సుమతీ !
అగ్నిహోత్రగృహం క్షేత్రం గర్భిణీ వృద్ధ బాలకా
రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్ ॥

ఈక్రిందివి ఛాయానువాదములు :—

7. పాలసునకైన యాపద జాలింబడి తీర్పవలదు, సర్వజ్ఞునకున్
దేలగ్నిఁబడఁగఁ బట్టిన మేలెఱుఁగునె మీటుగాక, మేదిని సుమతీ !
ఉపకారేణ నీచానా మపకారోహి జాయతే
పయఃపానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్ ॥

8. తనవారు లేనిచోటను జనవించుక లేనిచోట, జగడముచోటన్
అనుమానమైనచోటను మనుజునకును నిలువఁదగదు మహిలో సుమతీ !
యస్మిన్ దేశే నసన్మానో నప్రీతి ర్నచబాంధవాః
నవిద్యా నాస్తిధనికో నతత్ర దివసంవసేత్ ॥

9. అప్పిచ్చువాఁడు వైద్యుఁడు నెప్పుడు నెడతెగకపాఱు నేరును ద్విజుఁడున్
జొప్పడినయూర నుండుము, చొప్పడకున్నట్టియూరు చొఱకుము సుమతీ !
ఋణదాతాచ వైద్యశ్చ శ్రోత్రియ స్సుజలా నదీ
యత్రహ్యేతేన విద్యంతే నతత్ర దివసం వసేత్ ॥

* 'గజ'—మన వెలగకాయలోనే పుట్టి, దానిలోపలిగుజ్జును దిను కీటకము ; కాని 'కరి' యని కాదు. ఏనుఁగు దిన్న వెలగలోనిగుజ్జు మటుమాయ మగుననుట అంధ విశ్వాసము.

బద్దైన లోకానుభవ మసామాన్యమైనది. క్రిందిపద్యములు నీతుల పుట్టలు :—

1. అప్పుగొని చేయువిభవము ముప్పునఁ బ్రాయంపుటాలు, మూర్ఖునితపముం
దెప్పరయని నృపురాజ్యము దెప్పరమై మీఁదఁ గీడు దెచ్చుర సుమతీ ||

2. ఆఁకలి యుడుఁగని కడుపును వేఁకటి యగు లంజపడుపు విడువనిబ్రతుకున్
బ్రాఁకొన్న నూతియుదకము మేఁకలపాఁడియును రోఁత మేదిని సుమతీ ||

3. వరిపంట లేనియూరును దొరయుండనియూరు, తోడు దొరకని తెరువున్
ధరను బతిలేనిగృహమును నరయంగా రుద్రభూమి యనఁదగు సుమతీ ||

4. ఇచ్చునదె విద్య, రణమునఁ జొచ్చునదే మగతనంబు, సుకవీశ్వరులన్
మెచ్చునదె నేర్పు, వాదుకు వచ్చునదే కీడుసుమ్ము వసుధను సుమతీ ||

ఎంతటి స్తబ్ధజీవితమునకైనను చైతన్యమును రేకెత్తించు నుపదేశములివి.

ఈకవి నెవ్వరో స్త్రీలు గికురించినట్లు తోఁచుచున్నది. "ససేమిరా" వనితాలోకమును, వారివలపును, నమ్మవలదని (పునరుక్తి యని తలఁపక) పెక్కుచోటుల నుద్ఘాటించెను :—

1. లేదుసుమీ సతులవలపు లేశము.
2. కోమలి విశ్వాసంబును .........బొంకుర.
3. ఇంతులు వలతురని నమ్మకు.
4. మగువకు మనసీయవలదు.
5. కలయని సతి రతి ......... సేయవలదు.

వెలయాండ్రనినను, అగసాలులనినను, ఇతనికి బొత్తిగా గిట్టదు :—

1. "వెలయాలి"వలన కూరిమి కలుగదు, మఱి కలిగెనేని కడ తేఱదు,
2. "వెలయాలు" సేయు బాసలు...నమ్మరాదు.
3. నమ్మకు "మగసాలెవాని"నటు "వెలయాలిన్".
4. పులిపాలు దెచ్చియిచ్చిన
నలవడఁగా గుండెగోసి యఱచే నిడినన్.

జలపోఁడుగు ధనముపోసిన
"వెలయాలికిఁ" గూర్మి లేదు॥

5. తలదడిపి బాసచేసిన "వెలయాలిని" నమ్మరాదు.

6. "అగసాలివాని" (మంగలి) హితుగా నేలిన నరపతిరా
జ్యము నేలఁగలియు.

7. వెలయఁగ నగసాలిపొందు వెలమలచెలిమిన్........
నమ్మరాదు.

కవి, నియోగియో — నియోగివర్గపక్షపాతియో యై యుండ
వలెను. కరణములసామర్థ్యమున—చక్కఁగాఁ బొగడెను.

(వైదికులను—కుంచించెను).

1. "కరణముఁ గరణమునమ్మిన, మరణాంతకమౌనుగాని మన
లేఁడుసుమీ"

2. "కరణముల ననుసరింపక, విరసంబునఁ దిన్నతిండి వికటిం
చుఁజుమీ".

3. "కరణము సాధై యున్నను, కరి మదముడిగినను......
లెక్కఁగొనరు.

4. "కరణము వైదికుఁడైనను, మరణాంతకము".

5. "మండలపతిసముఖంబున—మెండైన ప్రధాని (నియోగి)"
యుండవలెనఁట.

విద్యార్థిలోకమునకేగాక, పెద్దలకుఁగూడ నుపకరించునీతులందుఁ
గోకొల్లలుగా నున్నవి. శృంగారరసభావములుసహితము మనసున
కెక్కునట్లు అమృతగుళికలవలె నాజూకుగ, తక్కినసీతులతోఁగూడ మిళి
తము జేసి, రసవత్తరముగ నక్కడక్కడ నుటంకించుటయందు బద్దిన
సిద్ధహస్తుఁడు.

1. వలపింత సతికిఁ బుట్టక, బలిమిని దమకించి విటుఁడు
పైకొనరాదు.

2. పీడెముసేయనినోరును, చేడెలయధరామృతంబు చెందని
నోరున్—పాడుపొందర.

3. తములము సేయనినోరును, రమణుల చను మొనలమీఁద రాయని మేనుఁ.

4. "కాముకుఁడు దనిసివిడచిన, కోమలిఁ బరపిటుఁడు గవయఁ" గోర రాదు.

5. వ్రేఁకటియగు లంజపడుపు "విడువ"వలె.

నూఱుపద్యములైనను పిల్లలకు, పెద్దలకుఁగూడ మహత్తరములైన నీతు లసంఖ్యాకములుగ బోధించు నీశతకమున వ్యాకరణదోషము లక్కడక్కడ లేకపోలేదు—కాని, పాటింపఁదగినవి కావేమో!

1. "కొని"కి కకారాదేశములు :—

కట్టుక, దున్నుక, తప్పించుక,—ఇత్యాదులు :—

2. "నశికా" అను సూత్రము ననుసరించి షష్ఠి—"కు" వర్ణకమునకుముందు — నగాగమము లేమి :— "వాదుకు" మొదలైనవి.

3. "కదలీకదలిక"—స్వార్థకమునకు దీర్ఘము.

4. ప్రాసదోషము :—

ఆఁకొన్నకూడె యమృతము,
తాఁగొంకక నిచ్చువాఁడె దాత ॥

కడపటిరెండు "కదలియుఁగదలక" — "తాఁకొందక"—అని వావిళ్లవారి ప్రతియందు దిద్దఁబడినది. "కదలీకదలక" అనుటలో నున్నంత భావపరిపుష్టి "కదలియుఁగదలక"—అనుటలో చచ్చినది. ఆవిధముగనే "తాఁగొంకక యిచ్చువాఁడె" యను దానిలో నుండు నర్థగాంభీర్యము "తాఁకొందక" యను మార్పునందు రూపుమాసినది. అసలు "తాఁక"ను పదమునకుఁగల నర్థములలో నేదియు ప్రకరణానుకూలముగాదు. తమ పాండిత్యప్రకర్షను చాటుకొనుట కిట్టి యవకతవకసవరణలు చేయు పండితులు సారస్వతమునకుఁ జేయు సేవకన్నను గీడే యెక్కువగాఁ గనిపించును. ఇంకొకస్థలమునం దీశతకముననే—"ర—ల"ప్రాసము నీపండితుల కది మెదగకపోవుటవలనఁ గాఁబోలు నావిధముగనే దానినుంచి బద్దెనఖ్యాతిని గాపాడిరి.

బద్దెన—తాను పండితుఁడనని యెచ్చటను చెప్పికొనలేదు. ఒక శ్లోకమాత్రము "కవిగాని వాని వ్రాఁత...వృథ శ్రా" యనుచు, తాను కవిపదవాచ్యుఁడనని చాటుకొనెను. మఱి, మనపండితులచేతి కేగ్రంథము దొరకినను, ఆగ్రంథకర్తల భావములకు భిన్నముగా, శబ్దములను తాఱుమాఱుచేయు దురభ్యాసము నశింపవలయును. ఉద్గ్రంథము లెన్నియో వీరిచేతులలోఁబడి తమ మొదటిస్వరూపమును బోఁగొట్టుకొన్నవి.

ఇవి విమర్శకులుసయితము, సమగ్రముగఁ బరిశోధింపక, యే విషయమునుగూర్చి కాని, యొకనిర్ణయమునకు వచ్చుటయు, దానిం బ్రకటించుటయుఁ బ్రమాదకరము. సాహిత్యమునకు సంబంధించినంత వఱకుఁ జరిత్రకారుల కుపలభ్యమానములగు సాధనము లెన్నియేని నిశితముగఁ బరిశీలించుట అత్యంతావశ్యకము. తన్మూలమున నచంచల సత్యోద్ఘాటనమున కవకాశ మేర్పడును.

* బద్దెననుగూర్చి—1948 సం॥న శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవ చిహ్నముగఁ బ్రకటింపఁబడిన సంచికలో నాసూచించిన యంశము లీసందర్భమున గమనింపఁదగినవి.

---

* 'బద్దిభూపాలుం' గూర్చి యెఱుంగనివారు పండితులందే కొందరు గలరు; కాని 'సుమతిశతకముం' గూర్చి యెఱుంగని పామరులే యరుదు. పూర్వమీశతక పద్యములన్నియు వీధిబడులలో విధిగా నేర్పఁబడెడివి. ప్రాథమిక విద్యార్థుల కాకాలమున 'సుమతిశతక' 'బాలరామాయణము'లు కంఠస్థములై యుండెడివి. పది పండ్రెండేండ్ల క్రిందటివఱకును బ్రతివాచకపుస్తకమునను సుమతిశతకపద్యము లగపడెడివి. నేటి పాఠ్యగ్రంథములలో బొబ్బిలికథలకు, తక్కినజంగముకథలకు గలస్థానముగూడ సుమతిశతక పద్యములకు లేకుండుట శోచనీయము. మఱి యాకతలు దెలుపుపరమార్థముకంటె సుమతి శతకపద్యములలోని నీతులు దీసిపోయినవా? సులభగ్రాహ్యములు కావా? చూడుఁడు:—

"మాటకు బ్రాణము సత్యము, కోటకు బ్రాణంబు సుభటకోటిధరిత్రిన్
బోఁటికి బ్రాణము మానము, చీటికిఁ బ్రాణంబు వ్రాలు"—

వ్యాఖ్యాపూర్వకముగ నొజ్జలుపదేశించుచో, బాలుఁ డీపద్యమున నెంతేని నీతి గ్రహించి మనమున నుంచుకొని, యేతన్మార్గమున జీవితము నడుపుకొనఁగలఁడు. విద్యార్థి భావి గృహస్థజీవితమున క్రిందిపద్య మెంత యుపకరించునో కనుఁడు :—

'నమ్మకు సుంకరి జూదరి, నమ్మకు మగసాలెవాని నటు వెలయాలిన్
నమ్మకు మంగడివానిని నమ్మకుమీ వామహస్తు'—

అస్వాదించుకొన నత్యంతసులభములగు నిట్టి యనేక పద్యరత్నములకు 'సుమతిశతక' మొకగని. నేఁడాగ్రంథము మనబాలవిద్యార్థిబృందమునకు దూరమగుట దురదృష్టముగాక మఱేమి?

# తాళ్లపాక అన్నమాచార్యుఁడు

(క్రీ. శ. 1408—1503)

ఈ తాళ్లపాకవంశమువారందఱు సంగీత సాహిత్యములలోఁ బ్రవీణులు. శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి సన్నిధిలో సంకీర్తన రూపక భగవత్సేవా కైంకర్యమును వంశపరంపరగా నెఱవేర్చుచుండిన భగవద్భక్తులు. అందు ఈయన్నమాచార్యుఁడే ప్రప్రథముఁడు.

ఇతఁడు మొదట నందవరీక బ్రాహ్మణుఁడు. స్మార్తుఁడు. భారద్వాజసగోత్రుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు. కడపజిల్లా రాజంపేట తాలూకాలోని తాళ్లపాక ఇతడిస్వగ్రామం. స్వామిసన్నిధిలో సంకీర్తనాచార్యుఁడగుటకు ముందు ఇతఁడు వైష్ణవమును స్వీకరించెను. ఈ యన్నమాచార్యుఁడు ఏనాఁటికానాఁడు — ఎప్పటికప్పుడు ఆశువుగా వేంకటేశ్వరస్వామిమీఁద రసవంతముగాఁ గీర్తనలను ఆలపించువాఁడు. ఈయంశమున శ్రీరామభక్తుఁడైన త్యాగయ్య ఒకఁడే ఇతనికి సాటి చేయఁదగినవాఁడు. వీరిరువురు తమయిష్టదైవములమీఁదఁ బాడినకీర్తనలు అసంఖ్యాకములు. త్యాగయ్యకీర్తనలవలెనే యీ యన్నమాచార్యుని కీర్తనలును—ఇంకను బరిశోధకులకు క్రొత్తవి దొరకుచునేయున్నవి. ఈ యన్నమాచార్యుల వంశవృక్షము నిదివఱకుఁ జరిత్రకారులు వెలువఱిచియున్నారు. ఈక్రింద తద్వంశక్రమము నరయఁదగును :—

తాళ్లపాక అన్నమాచార్యులు.



‘శతకకవులచరిత్ర’—కర్త, అన్నమయ్య అన్నమాచార్యులను వేర్వేఱువ్యక్తులనుగ భావించెను కాఁబోలు ;—ప్రథమసంపుటము లోని ౧౩౬—౧౩౭ పుటలలో పై వారి చరిత్రములను ప్రత్యేకశీర్షికల క్రింద వ్రాసి, శ్రీవేంకటేశ్వర (శృంగార) శతకపద్యములనే రెంటను ఉదాహరించెను. పైఁగా, తాళ్లపాకకవులనుగూర్చి తెలుపుటలో కాలక్రమము ననుసరింపక, మొదట మనుమఁడయిన చిన్నన్న (చిన తిరుమలయ్య)ను గూర్చియుఁ, దరువాత నతని పితామహుఁడగు అన్నమాచార్యులనుగూర్చియు, కడపట అతనికొడుకగు తిమ్మనార్యుని (పెద తిరుమలాచార్యునిఁ) గూర్చియుఁ బ్రకటించెను.

ఆంధ్రకవులచరిత్రమునఁ (మొదటి ముద్రణమున) గూడ, తాళ్లపాక చిన్నన్నను వేఱుగాను, చిన తిరువేంగళనాథుని వేఱుగాను భ్రమించి, మొదటియతఁడు “అష్టమహిషీకల్యాణము”ను, రెండవ యతడు “పరమయోగివిలాసము”ను రచించినవారని పంతులవారు తెలిపిరి. కాని, చిన్నన్నయే తిరువేంగళనాథుఁడనియు, అతఁడే ఆగ్రంథద్వయరచయిత యనియు నూహింపలేకపోయిరి.

ఇటీవలి పరిశోధకులయిన—వేటూరి రాళ్లపల్లి మున్నగు పండితుల నిర్ణయముప్రకారము, అన్నమాచార్యులు—శ్రీకృష్ణదేవరాయలు రాజ్యమునకు రాకముందే గతించినట్లు తెలియుచున్నది. అనఁగా, పదునైదవశతాబ్ద మారంభించిన కొలఁదికాలమునకు (క్రీ. శ. 1505 సం॥ లోపల) దేహము చాలించియుండును. విషయమిట్లుండ,—శ్రీ వీరేశలింగముపంతులుగారీతఁడు శ్రీకృష్ణదేవరాయని కాలమునఁ గొన్ని యగ్రహారములను అందెనని వ్రాయుట కాధారమేమియో తెలియకున్నది.

ఈ యన్నమాచార్యుని ‘శ్రీవేంకటేశ్వరశతకము’ను క్రీ.శ. 1947 సం॥లో భాషోద్ధారకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారు ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయ పుస్తకభాండాగారమునుండి వ్యయప్రయాసలకోర్చి సంపాదించి, సాధ్యమయినంతవఱకు సంస్కరించి, ముద్రించి ప్రకటించిరి. అటనట గ్రంథపాతములును, శబ్దదోషములును గలవు. ఈగ్రంథలిఖితప్రతులు తిరుపతిలోను, తత్పరిసరప్రాంతములలోను—

ముఖ్యముగా దేవస్థానములోను ప్రయత్నించుచో లభింపవచ్చును. ఈకవిసంకీర్తనముల సేకరింప శ్రద్ధగైకొన్నట్లే — ఈశతకప్రతులను గూడ సంపాదించుటకుఁ బూనుకొనుట భాషాభిమానులకెల్లఁ గర్తవ్యము.

ప్రకృతము ఈవావిళ్ల వారి ముద్రిత వేంకటేశ్వరశతకమునకుఁ బీఠిక వ్రాసిన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు—అన్నమాచార్యుని కాలనిర్ణయముచేయుటలో ముందుఁ బేర్కొన్న పరిశోధకుల అభిప్రాయముతో నేకీభవించిరి. "అన్నమాచార్యుఁడు, క్రీ. శ. 1408 జన్మించి తన పదునాఱవయేట, ననఁగా క్రీ. శ. 1424 నుండి, క్రీ. శ. 1503 వఱకు, ననఁగా 80 యేండ్లు శ్రీ వేంకటేశ్వరస్వామిసన్నిధానమున సేవయొనరించి, పూర్ణపురుషాయుష్యజీవియైన పుణ్యపురుషుఁడు. కాఁబట్టి యీవేంకటేశ్వరశతకము ఇప్పటికి 450 ఏండ్లక్రిందట రచియింపఁబడినది."—ఇదివఱకు నేను సూచించినకాలమున కిది యించుమించుగ (ఒకటి రెండేండ్ల వ్యత్యాసముతో) సరిపోవుచున్నదున, విశ్వాసార్హమయినదే.

ఈ వేంకటేశ్వరశతకమున సరిగా వందచంపకోత్పల వృత్తములున్నవి. 'వేంకటేశ్వరా'—అనునది మకుటము.—ఇది, అలిమేలుమంగా వేంకటేశ్వరుల రహఃక్రీడను వర్ణించుశతకము. ఈసందర్భమున శతకకవుల చరిత్రకారుఁడు వ్రాసిన వాక్యములు గమనింపఁదగినవి :—

"ఈశతకము చాలమనోహరమైనదియే కాని, పితృసములగు దంపతుల శృంగారవర్ణన మనువారుందురు కాఁబోలు."

ఇదెట్లు సమర్థనీయమో యించుక చూతము :—

మనవారికి ఈశృంగారరసమునెడ నింతటివిరక్తి కలుగుటకుఁ గారణము గోచరించుటలేదు. మఱి, కావ్యలక్షణకారులెల్ల శృంగారమునే ప్రధానరసముగ నంగీకరించియున్నారు. రసాలంకారములకు సంబంధించిన శాస్త్రములెల్ల శృంగారరసమునకేర్పఱిచిన * యంగో

* నాయక, తత్సచివ, నాయికా, తద్దూతికాదిభేదములు, కన్యా నవోఢాదిక లక్షణములు, స్వీయాపరకీయాద్యంతరములు ఆలంబనోద్దీపనానుభావములు, సాత్త్వికావ్యభిచారిసంచార్యాదివైలక్షణ్యములు, నానావిధ మన్మథావస్థలు—ఇవిగాక తదవాంతర భేదములు.

పాంగములఁ బరిశీలించుచో—నట్టి శాస్త్రములన్నియు, శృంగార రసోత్కృష్టమునిమిత్తమే జనించినట్లు సహితము కన్పట్టును. నవరసములలోనెల్ల ఈరసము స్థాయీభావముం జెందువఱకు పొందు పరివర్తనములను సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనముతో నిర్ణయించుటచేతనే వారి కళాప్రియత్వము రసికత్వము ప్రపంచమునఁ బ్రఖ్యాతినందినది.

శృంగారము—మిథునప్రస్తావము వీనితోనే సంస్కృతాంధ్ర కవులలో 100 కి 98 మంది స్వరచిత కావ్యనాటక మంగళాది, మంగళ మధ్య, మంగళాంతములు సాగించినపుడు దాని నీసడింపవలసినపనియే లేదు. (1) వాగర్థావివ సంపృక్తౌ, (2) శ్రీవాణీగిరిజాశ్చిరాయ, (3) శ్రీయనగౌరి నాఁ బరఁగు, (4) శ్రీవక్షోజ కురంగనాభము—ఇట్టి వాని లోని పరస్పర భిన్నస్వభావప్రవర్తనములు గల ప్రకృతిపురుషుల ప్రశంసయే—శృంగారరస పోషకమగు కామకళాకలాపమును వ్యంగ్యరీతిని సూచించుట యెల్ల రెఱిఁగినదియ. మఱి కామము చతుర్విధపురుషార్థములలో నొకటికదా! కాని, అది ధర్మార్థబద్ధము కానినాఁడు, హంస వింశతి మున్నగు కృతులు పుట్టుటకు కారణమగును. అవియు నొకవిధముగ సంఘములోని క్రుళ్లును బయటపెట్టునవే యగుట వాని యవసరమును ద్రోసివేయఁజాలము.

అచ్చరలకు, అచ్చటి దేవతలకే లేని దోషము మానవుల కెక్కడిది?—ఇట్లనుటచే అవినీతి ప్రోత్సహింపఁదగినదని నాయుద్దేశమయినట్లు భావింపకుందురుగాక!

అస్తు. మనకవులు దేవతలగుచోఁ బాదాదికేశాంతవర్ణనము, తక్కిన వర్గములకు సంబంధించిన వారగుచోఁ గేశాది పాదాంత వర్ణనము చేయఁదగునని శాసించిరి. ఆశాసనము ననుసరించి, ప్రతికవి తప్పకుండ వర్గశుద్ధిగాఁ దమకావ్యములలో — అంగప్రత్యంగవర్ణనములు చేయుచున్నారు. అట్లుచేయుటలో వారు ఎవ్వరిని విడువలేదు, దేవతలు, (వంగూరు సుబ్బారావుగారన్నట్లు) మాతృసములు, మాననీయులు,—అందఱు—సిగ్గువిడిచి దిగంబరులై (చిత్రకారుని యెదుట Pose ఇచ్చు వారివలె) నిలుతురు కాఁబోలు!

అంగవర్ణనమునకుఁ బైమెట్టు సురతవర్ణనము. ఇదియు వారి రచనాధోరణి ననుసరించి, లేత ముదురు పాకములలో నుండును.

ఇందులో మితవాదులు, అతివాదులు, అమితవాదులు—అని ముత్తెఱంగులయిన కవులు గలరు.

ఒకకవి గంభీరముగా సంస్కృతమునఁ జెప్పును ; మఱియొకఁడు దానినే స్పష్టాస్పష్టభాషలో వెలువరించును ; ఇంకొకఁడు ఆబురఖా లేవియు లేని తేఁట తెనుఁగు పదాలతోఁ జాటును.

ఇట్టి బూతులన్నవి, జుగుప్సలన్నవి, అశ్లీలములన్నవి—మహాభక్తుల * స్తోత్రములలోనే కనఁబడుచున్నప్పుడు—తక్కిన వానిం గూర్చి తడవనేల ?

ఇంతకును జెప్పవచ్చిన దేమన :—శృంగారరసము నవరసములలోఁ బ్రధానస్థానమాక్రమించినదగుటఁ దక్కిన, కవులవలెనే అన్నమాచార్యుఁడును శ్రీమంగాంబికా వేంకటేశ్వరుల లీలలను అభివర్ణించుట దూష్యముకాదు. అందును శ్రీమంగాదేవి తాళ్ల పాకవారింటి యాఁడుఁబడుచను ప్రతీతి గలదు. తమ యాఁడుబిడ్డ భోగపురుషుఁడయిన వేంకటేశ్వర దేవుని చెట్టవట్టి యనుభవించు వైభవములు మనసున కాహ్లాదమునింప నుప్పొంగి అన్నమయ్య ఈశతకమును సృష్టించుట భక్తులును భాషాభిజ్ఞులు నెంతేని కొనియాడఁదగినది.

---

* "చతుర్భుజే, చంద్రకళావతంసే, కుచోన్నతే, కుంకుమరాగశోణే, పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే, నమస్తే, జగదేకమాతః"

జగదేకమాత ! కుచోన్నతి ! ఇతఁడు భక్తుఁడా ? కాముకుఁడా ?

"వక్షోజమండల వివల్గి వళక్షహారే
పాశాఙ్కుశాఙ్గచల సద్భుజశోభితాఙ్గి ॥" (శ్రీ మహాలక్ష్మీ తన్త్రము)

"కుచౌ సద్యస్స్విద్యత్తట ఘటితకూర్పాగభిదురౌ
కషన్తౌ దోర్మూలే కనకకలశాభౌ కలయతః
తవ త్రాతుం భంగా దలమితి వలగ్నం తనుభువా
త్రిధా నద్ధం దేవి ! త్రివళిలవలీవల్లిభిరివ"

"ముఖం బిన్దుం కృత్వా కుచయుగమధ స్తస్య తదధో
హరార్ధం ధ్యాయేద్యో హరమహిషి ! తే మన్మథకలాం
స సద్యస్సంక్షోభం నయతి వనితా ఇత్యతిలఘు
త్రిలోకీమప్యాశు భ్రమయతి రవీన్దుస్తనయుగాం"

ఇవి జన్మసిద్ధమయిన బ్రహ్మచర్యము గలిగి లోకోద్ధరణార్థము సన్న్యసించిన శ్రీజగద్గురుని సౌందర్యలహరిలోనివి — "గోపీపీనపయోధరమర్దన చంచలకరయుగశాలీ"—జయదేవభక్తుఁడు.

అదేమి కర్మమోకాని, శ్రీ వంగూరి సుబ్బారావుగారే కాదు; శ్రీ—కం. వీ. పంతులుగారును దమ కవులచరిత్రములో, శృంగారరసమును బాహాటముగఁ (దమకావ్యములలోఁ) బ్రదిమ్మరించిన ప్రాక్తన కవులను దుయ్యఁబట్టుట, ఎంతమాత్రమును యుక్తముగాదు. అభిరుచులు—ఆశయములు—అనుభవములు—అభిప్రాయములు భిన్నరూపములుగ నున్నప్పుడు, కృతులలో అవి ప్రతిఫలించి తీఱును. ఆ భిన్నత్వమే లేకున్న మంచిచెడ్డల వివేచనగాని, మానవహృదయ తత్త్వజ్ఞత (Human Psychology) గాని యెఱుకపడదు. మఱి మన నడక ముందుకు సాగదు. ఱాతియుగమునకు (Stone-age) దారి తీయును.

ఇఁక ఈ (శృంగార) వేంకటేశ్వరశతకములోని విశేషముల నొక్కింత పరిశీలింతము. ఇందు ప్రకృతము ప్రయోగమున లేని యనేక పదము లున్నవి. కొన్నిచోటుల నవి యేయర్థములతో వాడఁబడి నవియోఁ దెలిసికొనుట మిక్కుల దుర్ఘటముగ నున్నవి :—

(1) కెలవులు, (2) అలసంబులు, (3) సువాళములు, (4) జంకెల నందలించు, (5) అంకన మించు, (6) పెడమర, (7) బిబ్బిలి కాయలు, (8) ముత్తియపుజల్లి, (9) బచ్చెనమాటలు, (10) ఉప్పన బట్టెలు, (11) పిల్లవీపులు, (12) బల్లకోటులు, (13) జంకెననద్దలింపు, (14) బగటులు, (15) బచ్చిమాటలు, (16) బచ్చెనయెచ్చరిక, (17) కెరజంబులు, (18) పోపాడవు, (19) కోరమేరపము, (20) గిరవులపుచ్చె, (21) చిమ్మనిదొంతరలు, (22) జాతుదురు, (23) కలవంత, (24) సఖువులు, (25) సెంబళము.—

తెలుఁగుఁ బలుకుబడులు, జాతీయములు, ఇందులో అక్కడక్కడ పొంకముగాఁ జేర్పఁబడినవి :—

(1) తెఱ దిగనేయు, (2) పులకింతలు, (3) అరిగాపు, (4) దిగఁబోసిన ముత్తెములు, (5) గుజ్జనగూళ్లు, (6) ఉప్పవడము, (7) పసిఁడి కిన్నరకాయలు, (8) పైఁడి మట్టియలు, (9) తెప్పలఁదేలు (10) గంద పొడిధూళి, (11) పైఁడిపొళ్లు, (12) బొమ్మరిల్లు, (13) బోనపుదొంతులు, (14) బిబ్బీ యెలపువ్వు, (15) చదురాలు, (16) మూసిన ముత్యము, (17) పలుకుల తేనెలు (18) సానపట్టిన చకోరపుఁ గన్నుఁ

గొన,—ఇట్టి మృదుమధురములయిన జానుఁదెనుఁగుఁ బదములు ప్రతి పద్యమునం దండముగఁ గూర్పఁబడినవి.

రసవంతములయిన యిందలి పద్యాలను గొన్నింటిని మచ్చునకుఁ గ్రింద సూచింతును :—

"చెదరిన చిన్ని లేఁగురులుం జెక్కున జాఱఁగ ముద్దుమోముతో,
వదలిన కొప్పుతోడ, నిడువాలిక కన్నులు నిగ్గుదేఱఁగా
నుదుటున నిన్నుఁ గూడి మహిమోన్నతితో నలిమేలుమంగ నీ
యెదుట మనోజసంపదల నేగతి నుండెనొ ?—వేంకటేశ్వరా !"

"తలఁచుఁ, గరంగు, మైమఱచుఁ దన్మయమందును జిత్తజాగ్ని, ని
న్నలయుచు దూఱు, నుస్సురను నర్మిలితో నలమేలుమంగ, నీ
వలిగిన యంతనే కడుఁ బ్రియం బిఁక నేమనిచెప్ప ? నేఁడువో
కలిగిన ప్రేమ మింతయుఁ బ్రకాశము తోఁచెడు వేంకటేశ్వరా !"

"అందవు, కోసియిమ్ము విరులంచును జేరలమేలుమంగ ని
న్నుం దగఁ గోరఁ జెక్కులటు నొక్కిన నాకును నందవంచు, న
య్యిందుముఖిం బ్రియంబలర నెత్తుచుఁ బువ్వులు కోయఁజేయు, ని
ష్యంద మరంద ఘర్మ రస సంగతు లబ్బెను, వేంకటేశ్వరా !"

"పెనఁగకుమమ్మ, చిమ్ము జళిపించిన చూపుల గర్వరేఖ రాఁ
జెనకకు మమ్మ, లేఁజెమట చెక్కుల నోయలమేలుమంగ, నీ
ఘనుఁడు కళావినోది రతికాంత విలాస సహస్రమూర్తి, వ
ద్దని పొలయల్క దీర్తురు లతాంగులు నీసతి వేంకటేశ్వరా !"

"కులుకకుమమ్మ, చిమ్ము జిలుకుం గొనచూపుల బిత్తరంబుగా ;
నులుచకుమమ్మ, బొమ్మముడి నూల్కొనఁ గోపము లేఁతనవ్వుగా ;
సొలయకుమమ్మ, కల్కి, నునుసోఁగల నోయలమేలుమంగ, నీ
చెలువున నంచు నెచ్చెలులు చేర్తురు నీసతి వేంకటేశ్వరా !"

తొలఁకెడు కొప్పులో నెరులో, తుమ్మెదదాఁటులో చూపువంపులో,
గులుకులో మంచివెన్నెలల గుంపులో, శ్రీయలమేలుమంగకుఁ
బలుకులు పచ్చకప్పురపుఁ బల్కులు, తావులె దివ్యగంధముల్
పలుచని నవ్వు లేవిరుల పాన్పుల నీకును వేంకటేశ్వరా !"

"తుఱుముఱవీడెఁ, బయ్యెదయుఁ దోడనె జాఱె, మెఱుంగు ఱెప్పలకుఁ
బరవశభావ మేర్పడియెఁ, బాయక నీవలిమేలుమంగ, నీ
వరునిఁ దలంచితో ? యనుచు వాసన మేనుల దేవకామినుల్
సరగున నీలతాంగి కుపచారము సేతురు వేంకటేశ్వరా !"

ఈ క్రిందిపద్యమువలన—ఆకాలమున నే దేవస్థానమున స్వామి నివేదనమునకయి చేయఁబడు పిండివంటలు గొన్ని తెలియవచ్చెడు:—

"అఁసెలు, నూనెబూరెయలు నాఁగులుఁ, జక్కెరమండిగెల్, ఇడల్
బుఱడలు, పాలమండిగ లపూపము లయ్యలమేలుమంగ నీ
కెరుదుగ విందువెట్టు పరమాన్న చయంబులు, సూపకోటియుఙ్
నిగతి వినిర్మలాన్నములు నేతుల సోనలు వేంకటేశ్వరా!"

"అట్లు" — "గారెలు"—అను కోస్తా జిల్లాల పదాలు, ఆ కాలమునకే రాయలసీమలో—"దోసెలు,"—"వడలు" అని వాడఁబడుచుండినవి. ఇవి సరిహద్దుజిల్లాలలోని ద్రావిడుల "దోసెయ్"— "వడై"—అను పదాలనుండి వచ్చినవి.

ఆకాలపు స్త్రీలు ధరించు నగలును గొన్ని యీశతకమునఁ బేర్కొనఁబడినవి :—

(1) బిబ్బిలికాయలు, (2) మట్టియలు—(మట్టెలు, మెట్టెలు), (3) సందిదండలు, (4) మణినూపురంబులు, (5) బాహుపురులు, (6) మచ్చరికంబులు ?

ఈశతకమునకు మకుటముగ శ్రీవేంకటేశ్వరుని దివ్యనామముం గూర్చిన యిమ్మహాకవి — "శ్రీ అలిమేలుమంగాంబ" — పేరినిగూడ తొంబదియేఁడు పద్యములలో వచ్చునట్లు చేర్చుట మెచ్చఁదగిన విషయము. అందు, మొదటిపాదాంతమున నిరువదింటను, రెండవచరణము కడపట నలువదింటను, మూఁడవయడుగు తుద పదుమూఁడింటను ఆమె దివ్యాభిధానము ప్రకాశించుచున్నది. శతకరచనమున నిది యొక నూతన విధానము.

ఇందుఁ గొన్ని అసాధుప్రయోగములును క్వాచిత్కముగఁ గనఁబడుచున్నవి :—

(1) 'అదలించు' అనుటకు, "అందలించు — అద్దలించు"— (2) 'జంకెన'కు బహువచనముగ — 'జంకెలు' (3) గర్వితనము, (4) క్రుమ్మడి (క్రొమ్ముడి), (5) చేతురు (చేయుదురు), (6) భూమెల్ల (భూమి + ఎల్ల), (7) కలుహార నేత్రి (కల్హారనేత్రి ?), (8) బగడల మేలు (?) (9) భ్రూజంకెలు, (10) చేరలమేలుమంగ (చేరు + అలమేలు).

సంకీర్తనాచార్య పదవీ విభ్రాజమానుఁడైన యీరాయలసీమ కవీంద్రుఁడు పోతనవంటి మహాభక్తకవి యని—ఈశృంగారశతకము లోని చివరిపద్యమే చాటుచున్నది :—

"అమ్మకుఁ, దాళ్లపాకఘనుఁడన్నఁడు పద్యశతంబుఁజెప్పెఁ, గో
కొమ్మని, వాక్ప్రసూనములఁ గూరిమితో నలమేలుమంగకున్
నెమ్మది నీవు చేకొని యనేకయుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మదమంది వర్ధిలను జవ్వన లీలల వేంకటేశ్వరా !"

ఈ యమూల్యశతకమును సంపాదించిన వా రాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమువారే యయినను, దానిని బ్రప్రథమమున నాంధ్రప్రపంచమునఁ బ్రకాశింపఁ జేసిన కీర్తి బ్రహ్మశ్రీ॥ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారికే దక్కినది. దీనికి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి పీఠిక లభించుట పసిఁడికిఁ దావి యబ్బినట్లయినది. కాని, ప్రాచీన శబ్దశాస్త్రపారంగతులగు శ్రీరావుగారు దీనిని చక్కఁగఁ బరిష్కరించి—మాఱుమూల పదములకు సరియైన యర్థములనుగూడఁ జూపియుండినచో, నెంతయుఁ బాఠకుల కనుకూలముగ నుండియుండెడిది. ఇప్పుడేని శ్రీ॥ వా. వేం. శాస్త్రిగా రట్టి యాంధ్రలోకోపకారము వారిచేఁ జేయించి—తెలుఁగువారి కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక !

(సవరణములు :—పుట 82—2-వ పేరా 3-వ పంక్తి : 'ఇతడి'—అనునది—'అతని' అనియు ;—పుట 84—పంక్తి 14 : 'చున్న దున'—అనునది—'చున్నందున' —అనియు ;—పుట 86 — అధోజ్ఞాపిక పంక్తి 14 : 'లోకగోద్ధరణ'—అనునది—'లోకోద్ధరణ'—అనియుఁ జదువకొనవలెను.)



# ధూర్జటికవి

(క్రీ. శ. 1520 : 30 ప్రాంతము)

ఇతనింగూర్చి "—ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహ" కారుండిట్లు తెలిపెను :—

"—'గంగాప్రవాహధారావేగము'—గల శతకరచయిత, ధూర్జటి సలక్షణ మధురశైలితోఁ గాళహస్తిమాహాత్మ్యమును వర్ణించెను.

పరిచితబంధనైపుణీ, నపారకళానుభవప్రసక్తి, నా
దరస వివేకసంపద, సదాశుకవాక్యసుధానుభూతి మో
హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగ రహస్య విచారబుద్ధి, న
ప్పురమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబు పోలికన్

అని రచించిన యితనియందు శృంగార వేదాంతములు సమన్వయంబు నొందినవి. యమకాద్యలంకార మనోహరంబై, ఒక్కొక్కచోఁ గన్నడపద సమ్మిశ్రమును జూపుచు, పాల్కురికి సోమనాథుని నన్నెచోడుని స్మృతి కితని ధార తెచ్చుచున్నది."

ఇది సర్వథా సత్యము.

అప్రతిమాన విద్వత్కవితావిలాసములకుఁ దోడితని లోకానుభవ మసామాన్యమయినది. ఈతఁడు రచించిన శ్రీ కాళహస్తిమహాత్మ్య, శ్రీ కాళహస్తీశ్వరశతకముల రెంటను బ్రతిపద్య మందులకు మచ్చుతునుక యనఁదగును.

ఈ—"ధూర్జటి పాకనాటి యాఱువేల నియోగి. భారద్వాజసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాళహస్తినివాసుఁడు. శివభక్తుఁడు" —అని ఆంధ్రకవులచరిత్రమున శ్రీ. కం. వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. కవినిగూర్చిన యీవివరములకు, "శ్రీకాళహస్తి మాహాత్మ్యములోని యాధారములే ప్రామాణ్యములు. కాని "శ్రీకాళహస్తి శతకము''నకు ఇతఁడే కర్త యని నిర్ణయింపఁదగు నాధారము లేవియు నింతదనుక లభింపలేదు.—అంతమాత్రముచే నిది ధూర్జటికృతము గాదని చెప్ప వలనుపడదు.—ఏలయన, ఇష్టదైవమునుగూర్చి అప్పుడప్పుడు—ఆశువుగఁ గవులు దమకష్టసుఖములు నివేదించుకొనుట

పరిపాటియే. అది శతకముతో నిలుపుట కవియిష్టము. అంతకు మిం చుటయుఁ గొఱవడుటయు నతని జీవితకాల పరిమితినిబట్టి యుండును.

కాళహస్తిమాహాత్మ్యమునకును శతకమునకును శైలిలోను లక్ష ణానుసరణములోను భేదమున్నదనియుఁ; గాన—శతకము ధూర్జటి కృతముఁ గాదనియు నను పండితులు లేకపోలేదు. కాని ప్రశాంతముగ నోపికమెయిఁ గావ్యలక్షణముల సమన్వయించుకొనుచుఁ బ్రబంధ నిర్మా ణము చేయుటవేఱు; మనోగతి ననుసరించి యెప్పుడేని లేకెత్తు నుద్రే కముతోఁ దోఁచినవిధమున నెప్పటికప్పు డాశువుగఁ జెప్పు కవితా వైఖరి వేఱు. కావున, శైలిలోను, లక్షణములలోను నవి భిన్నము లగుట అనుభవజ్ఞులగు కవులకెల్లరకు విదితము. శ్రీ తిరుపతి వేంకట కవుల కావ్యధోరణిని — ఆసుధారాఫక్కిని బరిశీలించుచో — నిది తేటపడఁగలదు.

పైఁగా, ఈశతకము ధూర్జటికవి విరచితమయినదనియే అతని యనంతరముగూడ రెండున్నఱ శతాబ్దములకాలము అనఁగా, క్రీ. శ. 1790 ప్రాంతమున జీవించియుండిన కస్తూరి రంగకవి తన రంగరాట్ఛం దమున నితని 'కాళహస్తిశతకము' లోనిదని :—

"నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్,
జేకొంటిం బిరుదంబు, కంకణము ముంజేఁ గట్టితిం, బట్టితిన్
లోకుల్మెచ్చ వ్రతంబు, నాతనువు కీలు న్నేర్పులుం గావు ఛీ!
ఛీ! కాలంబులరీతిఁ దప్పెడుఁ జుమీ శ్రీకాళహస్తీశ్వరా"

అనుపద్యము నభేదయతి కుదాహరణముగ నిచ్చెను.—అప్పటి నుండి మరల—ఈ యొకటిన్నఱ శతాబ్దకాలముగ, నది ధూర్జటి ప్రణీతమనియే పండిత కవి ప్రకాండుల విశ్వాసము. మఱి సామాన్య జనవాక్యమును.—అగుట శతకకర్తృత్వవిషయమున శంకలేకపోఁగా ప్రకృత ముపలబ్ధములగు—కాళహస్తీశ్వర శతక ప్రతులనుగూర్చి యించుక వివరించుట అవసరము గాకపోదు.

నాకు దొరకిన శతకములు నాలుగైదింటిలోను గల పద్య సంఖ్యలు ఒకదాని కొకటి సరిపడకున్నవి. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము (Govt. Oriental Manuscripts Library) లోని యొకానొక త్రైవార్షిక గ్రంథపట్టిక (Triennial Catalogue)

లో R. No. 396 గా సూచింపఁబడిన శ్రీకాళహస్తీశ్వర శతక మొకటి కలదు. ఇందులో 128 పద్యములున్నవి. క్రీ. శ. 1901 లో రాజమహేంద్రవరము 'కళావతీ' పత్రిక—ప్రచురణమున 108 పద్యములున్నవి. క్రీ. శ. 1925 లో వావిళ్ల వారు వెలువఱచిన భక్తిరస శతక సంపుటము 3-వ దానిలో 116 పద్యములు గలవు. క్రీ. శ. 1926—లో ముద్రింపఁబడిన శ్రీకాశీనాథుని నాగేశ్వర రావుగారి 'శతకమంజరి'—లో 141 పద్యము లొప్పుచున్నవి. శ్రీగుంటూరు వీరరాఘవశాస్త్రి పరిష్కృతముతో విజయవాడలోని శ్రీ వేంకటేశ్వర బుక్కుడిపో వారు ప్రకటించిన (క్రీ. శ. 1930 సం॥గల) శతకరత్నాకరము (ప్రథమసంపుటము) న 116 పద్యములు వెలయుచున్నవి. వీనింబట్టి 1901 సం॥నుండి యింతవఱకు దాదాపు 33 పద్యములు క్రొత్తగా శతకమునఁ బ్రవేశించినవి.

వావిళ్ల వారి ప్రతిలోను, విజయవాడవారి ప్రతిలోను—106, 107 సంఖ్యలుగల పద్యములు, కాశీనాథునివారిప్రతిలో తాఱుమాఱుగాఁ బడినవి. అంతియ గాక,— మొదటి రెంటిలో (పద్య పాద క్రమములు తప్ప)—ఒక్కపొల్లయినను బోకుండ— పద మధ్యముల యందలి యెడములేనియుఁ (Spaces) తప్పకుండ నుంటుటంబట్టి—మొదటిది—రెండవదానికి మాతృకయనుట నిస్సంశయము. కాని, తల తిక్కగల పండితమ్మన్యుల వెఱ్ఱిమొఱ్ఱి సవరణలకుఁ బాల్పడిన యిటీవలి ప్రచురణములకును, "కళావతీ" పత్రికా ప్రచురణమునకుఁ గలభేద మజగజాంతరము. కాశీనాథునివారి ప్రతిలోని 141 పద్యములును ధూర్జటివిరచితములు కావేమో యని వారే శంకించుచున్నారు. *

"కళావతీ" ప్రచురణమునకును, దానితరువాతిప్రచురణములకుఁ గల భేదములలోఁ గొన్నింటినేని చూపుట యుక్తమని, అట్లొనర్చుచున్నాఁడను.

---

* "శతకమునందుఁ గల ౧౪౧ పద్యములసంఖ్య స్థాలిత్యమును సూచించుచున్నది. పద్యములు ౪౬, ౯౭ సమానార్థమును దెలుపుచున్నవి. ఇట్టిపద్యములు మఱికొన్ని గలవు. కాలక్రమమున, ననుకరణపద్యములు క్రొత్తవి గ్రంథమునందుఁ బ్రవేశమును బొందినవిధమును గ్రంథపరిశీలనము విశదీకరించుచున్నది." (శతకమంజరి)

1. 'కళావతి' ప్రచురణమందలి పాఠములు సాధారణముగ వ్రాఁతప్రతులను అనుసరించినవే యగుట—కవి హృదయా విష్కరణమునకుఁ గొంతవఱ కాదర్శము లనఁదగియున్నవి.

2. కాశీనాథునివారి ప్రతికిఁ గొంతవఱకు వావిళ్లవారిది ఆధార మయినను,—(తాము గొంత కృషిచేసిన ప్రగల్భుల మని—చాటుకొన నుబలాటపడిన) పరిష్కర్తలవలనఁ గొంతవఱ కసంగతములగు సవరణాలతో నది మూలమునకు దూరమయినది.

3. ఉన్నవానిలోఁ జాలవఱకు శతకకర్తృ భావముల కనుగుణము లగు పరిష్కరణములతో నిర్దుష్టముగఁ బ్రచురింపఁబడినది—ఒక వావిళ్ల వారిదిమాత్రమే.

ప్రకృత మీమూఁటిలోను — గొన్ని భేదములు గానవచ్చుచున్నవి. ఈక్రిందఁ గొన్ని చూపుదును :— (—క = కళావతి ;— వా = వావిళ్ల ;—కా = కాశీనాథుని—అని సంకేతములు :—)

1. చేసితిపుడో (క) ;—చేసిదెపుడో (వా) ;—చేసి తెపుడో (కా).—(2–పద్యము).

2. అల్లొలెటింగిక (క—వా) ;—అల్లొలెటింగే (కా).—(3–వ పద్యము).

3. పాపాత్ముఁడై నన్ను పీంద్రు వివేకింపరటంచు మేము (క); —పాపాత్ముఁడై వీఁడు నన్ను వివేకింపఁడటంచు నేను (వా ; కా) ;—(5–వ పద్యము).

4. వీచీమధ్యంబున ముంచియుంప (క—వా) ;—వీచీమధ్యంబున నుంచియుంప (కా).—(6–వ పద్యము).

5. తప్పందొలను (క) ;—తప్పక దవ్వుల (వా) ; — తప్పం దాలను (కా).—(10–వ పద్యము).

6. స్త్రీవిలాసములు పైకొన్నప్పుడు (క) ;—శ్రీవిలాసములు పైకొన్నప్పుడు (వా ; కా).—(11–వ పద్యము).

7. చేపట్టం దయగల్గెనేని మదిలో (క) ;—చేపట్టఁదగుఁ బట్టి మానదగదో (వా) ;—చేపట్టందగుఁ బెట్టి మానఁదగదా (కా).—(26-వ పద్యము).

8. రోసిన్రోయదు, పాసిన్పాయదు, కోసిన్గోయదు, చేసిన్జేయదు (క) ;—రోసీరోయదు,—పాసీపాయదు; —కోసీకోయదు; చేసీచేయదు (వా; కా).—(32-వ పద్యము).—

9. కొండలం ద్రిప్పఁగా (క ;వా)—కొండలెల్లం ద్రిడింపఁగా (కా). —(36-వ పద్యము).

10. ఇఁక నేల పొమ్మనుచు (క) ;—ఇఁక లేదు నమ్మమని (వా ; కా).—(43-వ పద్యము).

11. నేఁ బ్రార్థించినం బోవునే (క) ;—నేఁ బ్రార్థించినం బాయునే ? (వా) ;—సంప్రార్థించినం బాయునే (కా). —(44-వ పద్యము).

12. కల శబ్దధ్వనులు (క—వా) ;—కలశధ్వానములు (కా). —(50-వ పద్యము).

13. కవిత్వమున్నిలుచునే సత్యంబు వర్ణించుచో (క—వా) ; కవిత్వముల్ నిను యథేచ్ఛారూఢి వర్ణింపుచో (కా). —(51-వ పద్యము.)

14. శాస్త్రములు సంశోధించి (క) ;—శాస్త్రగరిమల్శోధించి (వా) ; — శాస్త్రమహిమల్శోధించి (కా).—(58-వ పద్యము).

15. గోరాజాశ్వ (క ; వా)—గోరాజేశ్వ (కా).—(60-వ పద్యము).

16. కృపాపారీణ యవ్వారి చారిత్రం బెన్నఁడు మెచ్చవచ్చు (క); ఇదియుక్తభావ్యం బెవ్వారిచారిత్రం బెన్నఁడు మెచ్చ నెంచ (వా ; కా).—(63-వ పద్యము).

17. ఆనంద దావగ దుర్గాటవిలో (క) ;—ఆనంద తారక దుర్గాటవిలో (వా) ;—ఆనంద దావక దుర్గాటవిలో

(కా).—(64-వ పద్యము) — ఇందు మొదటిదానిలోఁ ప్రాసభంగము.

18. చేతః క్రోధము (క ; వా)—జ్ఞాతి క్రోధము (కాశీనాథుని : యతిభంగము) ;—ఒండొకప్రతిలో 'చేతోదుఃఖ' —మనియున్నది.—ఇది సందర్భమున కనుగుణమయినది—కాన సరియగు పాఠమేమో! (69-వ పద్యము).

19. రోసిందెట్టివి? రోఁతలెట్టివి? (క) ; — రోసిందేటివి? రోఁతలేటివి? (వా) ;—రోసిందేమిటి? రోఁతలేమిటి? (వా).—(71-వ పద్యము).

20. చవిఁగోఁక జూడ వినంగ (క) ;—చవిగాఁ జూడ వినంగ (వా ; కా).—(75-వ పద్యము) మొదటిదే సరియగు పాఠము.

21. చేసిన ఘోర దుష్కృతులు (క) ;—చేసిన ఘోర దుర్దశలు (వా ;—కా).—(76-వ పద్యము) మొదటిదే సరియైనది. కృతులు చేయునవి ; దశలు సంభవించునవి.

22. గుమ్మడికాయలోన నవగింజంతైన (క);—గుమ్మడికాయలోను యవగింజంతైన (వా); — గుమ్మడికాయలోని యల యాగింజంత (కా).—(77-వ పద్యము).'—ఆవ'—అనుటకు హ్రస్వరూపమును—'అవ'—(ఆఱుపు, అఱుపు—వంటివి) సమ్మతమే; అదియే యిట కవిప్రయుక్తము. "గుమ్మడికాయలు దొర్లుకుపోతుంటే ఆవగింజల దగ్గఱ గట్టిపట్టు పట్టుతున్నాడు"—అని సామెతకూడ. "యనగింజ"—కానేకాదు. సమాసముతప్పు.—ఇఁకఁ గాశీనాథుని వారి ప్రతిలోని పాఠ మాపరిష్కర్తకుఁ దప్ప నితరుల కర్థము గాదు. "గుమ్మడికాయలోని" — అనుటలో—లోపలి అని.—మఱి "అల" ఏమి?—వెనుకనే "ఆ" ఉన్నది కదా! "అల"ను సముద్రమునఁ ద్రోయుచో—"గుమ్మడికాయలోని ఆగింజ" అని మిగులును. గుమ్మడిగింజ కెంత ప్రసిద్ధి!—'ఆగింజ'—ఆవగింజ—గింజుకొన్నను గాదు.

—అగునన్నచో "ఆలు" కూడ నొప్పుకొందుము. ఆవుల (అల) దొడ్డికిఁ గూడ ఆశబ్దము పనికిరాదు.—ఈచిన్నశతకము ననే వాగ్దేవి, నిన్ని త్రిప్పులఁ బెట్టు పరిష్కర్తలు ఉచ్చిష్ట ముల నామె కుచ్చాటనము చెప్పరా ?

23. ఇప్పటివారి ధర్మములొనర్పఁ—(క);—ఇప్పుడు వారె ధర్మములొనర్పఁగా (వా); — ఇప్పుడు వారధర్మము లొనర్పఁ (కా);—(78-వ పద్యము).

24. ఆక్షేపించి (క) ;—సంక్షేపించి (వా);—నిక్షేపించి (కా); —(87-వ పద్యము).

25. కొల్వరేలా? (క);—కొల్వరేమో! (వా);—కొల్వరో? (కా);—(89-వ పద్యము).

26. పిండెంతో యంతియకా నిప్పటి (క);—పిండెంతో యంతి యకా యెప్పటి (వా;—కా)—(93-వ పద్యము.)— పూర్తిపద్యము :—

"దయసేయుండని కొందఱాడుదురు, నిత్యంబు న్నినుం గొల్చుచుఁ,
నియమంబెంతో, ఫలంబు నంతియకదా, నీవీయఁ; బిండెంతో యంతియకా నిప్పటి"

"నీవు దయసేయవని యందురు ; కాని, (నినుఁ గొల్చువారికేని) నియమము ననుసరించియే ఫలము ; పిండి యెంతయో నిప్పటియు నంతియ"—అని భావము.—మొదటిదే సరియగుపాఠము. (నిప్పట్టు) అనునది, పైన ఆకులుగప్పి నిప్పులపై వైచి పచన మొనర్చు ఒకానొక భక్ష్యము. ఎంతపిండియో, యద్దానికిఁ దగినంత భక్ష్యమే లభించునని యభిప్రాయము. ఇది తెలుఁగునాఁటి సామెతగూడ.

"పిండెంతో, నిప్పటంతే, మండలపతి రాజ్యమెంతో మంత్రియునంతే."
(పూర్వకవి ప్రయోగము)

ఈ లోకోక్తి దెలియనివారు కూడఁ "దగుదుమమ్మా"—యని గ్రంథపరిష్కరణమునకుఁ బూనుకొనుట దేశదౌర్భాగ్యముగదా! ఇట్టివి ప్రతిపద్యమునను గలవనుచో, నాశ్చర్యపడ వలసిన పనిలేదు.

ఈవిషయ మిఁక నింతతోఁ జాలించి, యిమ్మహాకవి జారుఁడ నుట కీతని కృతులలో ననేకోదాహరణము లున్నవని నిరూపించు విమర్శకులు నాఁటికిని నేఁటికిని మన తెనుఁగునాటఁ గానవచ్చు టెంతయు శోచ్యము. కావున నిందలి సత్యము నించుక తెలిసికొను టెంతయు నవసరము.

అట్టి యపప్రథకుఁ గారణమయినది, కుమారధూర్జటిప్రణీతమగు కృష్ణరాయవిజయములోని — యీక్రిందిపద్యము. (అతని కీశతకకర్త పెదతాత యఁట!).

“స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గె? నీ
యతులిత మాధురీమహిమ నా, ను, మీ పెదతాత, చాలస
న్నుతిఁగనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ, న్వెను మీవు నట్ల మ
త్కృత బహుమాన వైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్”

సామాన్యముగఁ గవు లంతకుమున్నెవరేని రాజసన్మానము లంది ఖ్యాతిఁగన్న తమవంశస్థులైన యుద్దండ పండిత కవులుండిరేని, వారి నత్యంత మతిశయోక్తులతోఁ దమకావ్యములలో వర్ణించుట అనుభవజ్ఞుల కెఱుకయే. అట్టిచో, మనుమఁడగు నీ వేంకటార్యుఁడు (కుమారధూర్జటి) తన తాతను—ఆంధ్రసామ్రాజ్యాధీశుని యష్టదిగ్గజములలో నొక్కఁడై “శ్రీకాళహస్తిమాహాత్మ్యము”—వంటి కావ్యమును రచించిన విద్వత్కవీంద్రుని—ఆమాత్రము స్తుతించుట సమంజసమే; కాని—దానిం దొరకఁబుచ్చుకొని, కల్లబొల్లి కతలల్లినవారి పలుకులనే సత్యములని నమ్మి ఆమహాకవి నెత్తిపై యపవాదములను రుద్దు పండితుల నేమనవలెను?—

వాస్తవమునకు శ్రీకృష్ణదేవరాయని — భువనవిజయాఖ్యాస్థానమందలి యష్టదిగ్గజములలో సాధారణముగఁ గవితాప్రశంసలలో మనకు ముఖ్యముగ వినవచ్చువారు (తఱచుగా) — అల్లసాని పెద్దనగారు; నందితిమ్మనగారు. తక్కినవారందఱు బాల్గొన్నను, వారి ప్రస్తావములు చరిత్రల కెక్కలేదు. అట్లగుట వారిప్రతిభాదికములను దద్గ్రంథములే యించుక తెలివిడి సేయుచున్నవి.

ఇట మఱొకవిశేషము వింతగొల్పునది లేకపోలేదు — అట్టి విద్వత్కవితాప్రసంగములందెల్ల—ఎవరిప్రసక్తియున్నను — లేకపోయి

నను. తెనాలి రామకృష్ణకవిగారి 'జోక్యము'—మాత్రము సహ్యకయుండి లేకుండును.— ఇతఁడు రామలింగమో, రామకృష్ణుఁడో! — ఎవఁడైన నేమి? ఇతఁడు హేళనమొనర్పని కవితలేదు; అవమానింపని కవిలేఁడు; గేలిపట్టింపని పాండిత్యములేదు; తిరస్కరింపని పండితుఁడులేఁడు. — ఇంతికంటె విస్తారమేమున్నది?— విదూషకుఁడే యగుఁగాక! పరిహాసకుఁడే యగుఁగాక! వికటకవియే యగుఁగాక!—అంతటి యాంధ్ర సామ్రాజ్యాధీశుని విద్వత్కవితా రసికతా సమలంకృతాఖిల దిగ్దిగంత విశ్రాంత యశోవిరాజిత సమస్తకళాపూర్ణులచే సమాకీర్ణమగు సభామండమున — నాతఁడు సముచితశాస్త్రీయాంశముల ధిక్కరించుచుండ, సమధిగతాఖిలకళావిదుల దిసంతులు గొట్టుచుండ—గ్రుడ్డప్పగించి చూచుచుఁ గూరుచుండువాఁడు సార్వభౌముఁడా? చచ్చు పెద్దమ్మయా?—

శృంగారాదులట్లు హాస్యము రసము కాదనము.—కాని, దానిని దేశ కాల పాత్రోచితముగ విద్వదామోదప్రదముగ, అపగత పూజ్య జన ప్రతికూలముగ, సరసలోక హృదయానంద సంధాయకముగఁ బ్రయోగింపఁదగును; గాని—పెద్దల నడతలలేని తప్పులు పట్టునవి,— విద్వాంసుల కపఖ్యాతిని గలిగించునవి, — జుగుప్సాశ్లీలాది దోషభూయిష్ఠములయినవి — అగునట్టి వెట్టిమొట్టికూఁతలెల్ల హాస్యరస పోషకములని భావించువా రానాఁడు గాదు గదా,—నేఁడును లేరు.— ఇఁకేనాఁడు నుండరు. వారిని మెచ్చురాజులు తమపదవులకుఁ దగరు. మహిషములకు మహిషాసురుఁడే మహామహీశుఁడు!

భవతు! ప్రకృతమనుసరామః! కుమారధూర్జటి తనపెదతాత గారి ప్రాభవప్రకటనకై చెప్పినపద్య మెట్లుతనికి అప్రతిష్ఠాకరమయినదో చూతము:—

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో యతులితమాధురీమహిమ!"

అని—శ్రీకృష్ణదేవరాయలు సభలో నున్నకవులఁ బ్రశ్నించినట్లును, వెంటనే ఈ తెనాలికవి ఒకపక్షముదినములు గడువుదీసికొని— ధూర్జటికవిని (సి.-ఐ. డి—గా) అపరాధ పరిశోధకుఁడుగా వెంబడించినట్లును;— పక్షముదినములుముగియఁగానే, — సార్వభౌముని సభకు

వచ్చినట్లును ; — అంతకంటెఁ బనిలేని ఆ ఱేఁడు, నిండినసభలో — "స్తు......ధూర్జటి పలుకులకేల గల్గె...మాధురీమహిమ ?"—అని అడిగినట్లును ; తటాలున రామకృష్ణకవి లేచి—"హా !" అన్నట్లును ; "హా !" అన్నాఁడఁట ! "హా !" ఎందుకో ? అంత ఆశ్చర్యము !!! ఆ "హా" నామాంచిత యతిగారికి (తనకుఁగాదు) "తెలిసెఁ." — ఏమి తెలిసె ?—"భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా ఘనతా జన తాపహారి సంతత మధురాధరోదిత సుధారసధారలు (గ్రుక్క నిలుపకుండఁ) గ్రోలుట !"

మహాశివభక్తుఁడు, విద్వత్తిలకుఁడు, కవిలోకచూడామణి యగు ధూర్జటికే యిట్టి యవమాన మానాఁటి రాజసభలో జరిగియుండెన, నతఁ డేమొగము పెట్టికొని తల పైకెత్తికొని తిరుగఁగలఁడు ?—ఆ సార్వభౌముఁడయిన నెట్లు సహించియుండఁగలఁడు ?

ఇంతకుఁ జిలిపితనమున నేకవియో యాకత నల్లి గాలిపడగ విడువ, నది వాయుపథమున స్వేచ్ఛగఁ దిరుగుచుండుటకుఁ దెనుఁగు గడ్డను బుట్టినవాఁడెల్లఁ దలవంచుకొనవలదా ?

ఎక్కడిధూర్జటి! ఎక్కడిరామకృష్ణకవి! ధూర్జటియంతటి యవినీతికిఁ బాల్పడునా ? పడెనుపో ; మాంసముదినువాఁ డెమ్ములు మెడకుఁ గట్టుకొనునా ? మహావిష్ణుభక్తుఁడగు పాండురంగమాహాత్మ్యకర్త— దురంతమగు నపఖ్యాతి నామహనీయున కాపాదించునా ? ఆపాదించెను, పో; వెక్కిరింపఁబోయి వెలికిలఁ బడకుండునా ? ఒకవంక చారిత్రకముగ —నిది, యసంబద్ధమయిన పుక్కిటిపురాణమగుట విశ్వాసార్హము కాదు. ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల నాఁటివాఁడు (క్రీ. శ. 1520—30 ప్రాంతము). రామకృష్ణకవి వేంకటపతిరాయల (చంద్రగిరి) సమకాలికుఁడు (క్రీ. శ. 1590—1600 ప్రాంతము). ప్రసక్తమయిన పద్యమా ? సదాశివదేవరాయల పరిపాలనా దినములది (క్రీ. శ. 1560–75 ప్రాంతము). ఒకదానికొకటి పొసఁగదు.—పైఁగా—ఈ "స్తుతిమతియైన ......మహిమ" అనువాక్యమే "తు—చ—తప్పకుండ శ్రీకృష్ణరాయలు పలికినట్లు రుజువేమి ?—కాదేని, ఆదియే, ప్రభుని పల్కని కుమారుం ధూర్జటి కలఁగనెనా ?

* శ్రీ కం. వీ. పంతులుగారివంటి పూర్వాంధ్రకవులచరిత్రకారులే, ఈ కట్టుకతలోని యసందర్భములెల్లను స్పష్టముగఁ బొడమెఱిఁగియుండియు, —మరల దానియాధారముతోనే, ఇమ్మహాకవి జారుఁడని విశ్వసించి, తన్మూలమున హిందూమతమున నే విశుద్ధచారిత్రము లేనిదని వ్రాయ సాహసించిరి. అప్పుడప్పుడే వ్రేళ్లూనయత్నించుచున్న ఖండాంతరనాగరికత తమ్మాకర్షింప, — (దాని లోఁతుపాఁతులరయక) పై మెఱుఁగలకే భ్రమసి దానినే మెచ్చుకొనుచు, భారత జాతీయతా ప్రభావమును, హైందవ మత విశుద్ధతను గుర్తింపక — కేవలము కతిపయ వ్యక్తిగత బాహ్యప్రవర్తనముల దృష్టిలో నుంచుకొని (సంస్కర్త యనిపించుకొను నూహాతో) సంఘదోషముల నిర్ణయించు — శ్రీపంతులవారు నాఁడు విదేశసంచారములు చేసియైన నుండవలెను. ఈ నాఁడు జీవించియైన నుండవలెను. "పొరుగింటి పుల్లగూరకు లొట్టలు వేయు" — స్వభావముగల మనవారు వంగదేశీయుల ననుకరింపఁ జూతురు ; యశోలబ్ధికి! రామమోహనుఁ డితరుల దౌర్జన్యములు సహించుచు సంఘమును బాగుపఱుప యత్నింపఁ—బంతులవారితరులపై దౌర్జన్యములు జరిపి పేరుగాంచఁ జూచిరి. — తన దేశమున రామమోహనునికి బ్రదుకులేదు. పరదేశమునఁ బ్రాణములు త్యజించెను. అతఁడొందిన కష్టములలోఁ బంతులవారివి గణించుచో— నేపాటివి ?—పంతులవారు కవులచరిత్రమున—ఈవిషయము నెపము గాఁగొని తమ నూత్నసంస్కారప్రచారము సేయకున్న నింతిదూరమిట వారింగూర్చి తడవవలసిన యవసర ముండియుండదు. పంతులవారి కవులచరిత్రములోని యీయసంగత ప్రసంగమునుగూర్చి † వంగూరి సుబ్బారావుగారును పూర్తిగ ఖండించిరి.

---

* "ధూర్జటికవి సంతత వేశ్యాప్రియుఁడయిన రసికపురుషుఁ డయినట్టు కనుపట్టుచున్నాఁడు. అట్టి యఖండ శివపూజాధురంధరుఁడైన భక్తాగ్రేసరుని నిట్టి జారత్వదోషమేల విడువకుండెనో యూహింపఁజాలకున్నాము. మనదేశముయొక్క దౌర్భాగ్యముచేతఁ జిరకాలమునుండి ఇచ్చట విశుద్ధచరిత్రము మతమునుండి విడిపోయినది. ఎట్టి దుశ్చరిత్రము గలవాఁడయినను విభూతి రుద్రాక్షలు మొదలైన బాహ్యచిహ్నములను ధరించినమాత్రమున భక్తాగ్రేసరుఁడుగాఁ బరిగణింపఁబడుచున్నాఁడు."

(ఆంధ్ర కవుల చరిత్రము).

† చూడుఁడు :—శతకకవులచరిత్రము—ప్రథమసంపుటము : 117-వ పుట.

పంతులు వారివలెనే—నామిత్రులు—శ్రీ రాపూరి దొరస్వామి శర్మగారును ఈవిషయమున ధూర్జటిని "స్తుతమతి"గాఁ గాక— "గతమతిఁ"గా—శ్రీ వా. వేం. శా. గారి షష్టిపూర్తి సంచికలోఁ జిత్రించి చూపుటను దురదృష్టవశమునఁ—జూడఁ దటస్థించి మిగుల వగలఁ బొగిలితి.

ఆప్రబంధయుగ వాతావరణమునకు ఆనాఁటి కవులందఱు పను పడినవా రనువిషయమొండు గుర్తించితిమేని, — అలంకార శాస్త్రి దేశానుసారము శృంగారము ప్రధానరస మనుటను గ్రహించితిమేని, బహుమాన్యులగు ఆపుంభావ సరస్వతులయెడ నిట్టి యపోహములు చెల రేఁగుట కవకాశముండెడిది కాదు. దేశ కాల పరివర్తనములు తదను గుణ సాహిత్యపరిణామములు స్వాభావసిద్ధములనుట విజ్ఞులకుఁ దెలి యనిది కాదు. అట్టి పరామర్శకుఁ జొఱక శ్రీశర్మగారు :—

"ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీథి న్మహా
కారోకారమకారయుక్తమయి యోంకారాభిధానంబె చె
న్నారు న్విశ్వమనంగఁ దన్మహిమచే నానాద బిందు ల్సుఖ
శ్రీ రంజిల్లఁ, గడంగు నీవదె సుమీ"

యన్న పరతత్త్వసాక్షాత్కార బ్రహ్మానంద పరవశుఁడగు మహా భక్తునికృతులలోఁ గొన్ని పద్యము లేఱి, యవి యతని పరకాంతా పరా యణతకుఁ దార్కాణములనుట తగునా?—"శ్రీ వక్షోజ కురంగనాభ మెదపైఁ జెన్నొందు రాజీవాక్షునితో మొదలిడిన శృంగారరసాధి దేవత ప్రబంధయుగమును నిరంకుశముగఁ బాలించుచో—నప్పుడు పుట్టిన మాహాత్మ్యము లేకావు, స్థలపురాణము లేకావు,—తద్విభాగ పురవర్ణన — సుర(జ్యేష్ఠ) శ్రేష్ఠ సురతవర్ణనలన్నిట నామె ప్రసక్తి లేకుండ ఎట్లుండఁగలదు? ఆకాలమున వెలువడిన కృతులన్నియు నట్టివే యయినపుడు, పాపము! ధూర్జటిగారినిమాత్ర మాడిపోసికొను టేల? —(ఆ) "కవికి శృంగారవర్ణనయం దిష్ట మత్యంత"మఁట. అగుఁగాక! ప్రధానరసమగుటయు,—అతఁడు ప్రౌఢవయస్కుఁడుగ నుండుటయు కొంచెము 'మోతాదు'—మించిన దేమో!—తక్కినవారుమాత్రము

తక్కువదిన్నవారా ? * ఆంధ్రకవితాపితామహులుగదా తక్కినవారికెల్ల మార్గదర్శకులు ! ధూర్జటికి 'మధురాధర' మిష్టము ! పెద్దనకు 'వక్షోజ'ములమీఁద అమితప్రియము ! అవియు ఒకపాటివి పనికిరావు (వీణియ) కాయ లత్తమిల్లునంత యుత్తుంగములుగ నుండవలెను. అంతతో ఆఁగునా ? ఊఁహూ ! ప్రాంచద్భూషణబాహామూలరుచితోఁ బొంగారవలెను. పైఁగా, అంచులు నిక్కి (ప్రియుల) యక్కులు ద్రొక్కవలెను. ఆ చనుదోయి సంకుమద నిర్భర వాసన ; దానివఖింపచ స్థితి ! ఆహా ! హాయిహాయి ! ఆనందోబ్రహ్మ !—

"భాషాపరశేషభోగియు, వివిధాధ్వర నిర్మలధర్మకర్మ దీక్షా పరతంత్రుఁడైన ప్రవరునికి, కామశాస్త్రోపాధ్యాయినియట్లు—వరూధిని "ఎందే నింద్రియముల్ సుఖంబుఁగను, నాయింపె పరబ్రహ్మ" మని—పరతత్త్వజ్ఞతనుగూర్చి బోధించినదఁట !—ఇఁక మాణిక్యవల్లి ఉగ్గుఁ బాలతోఁ దొట్లబెట్టి, తనబిడ్డలకు వారధర్మవిద్యాకుశలత్వము జోల పాటగాఁ బాడుట—సందర్భశుద్ధికిఁ గొంత గలిగించుననుకొనుట వింతకదా !

మాశర్మగారు కాళహస్తిమాహాత్మ్యమునుండి ధూర్జటిధూర్తతకు ఉదాహరణముగ నిచ్చిన జంగమలింగమూర్తి దాసీ రతిక్రీడా పద్యమే, ఆమహాకవి పలుకులమహిమను జాటెను :—చూడుఁడు :— ఆతని కృతులలో :—

"ఎక్కడఁబట్టినం—కళలయిక్కువ, లెక్కడ నోరుసోఁకినన్
జక్కెరలప్పలేమనిన, సారసుధారస మెట్టులుండినన్
జక్కఁదనంబు పెన్నిధులు సంభ్రమమొప్పఁగ నేమిచేసినన్
మక్కువ చెయ్యులై వెలయు మాకవి ధూర్జటి కావ్యమంతటన్"

---

* 1. మనుచరిత్ర : తృతీయాశ్వాసములోని :—(2వ వచనమున) సాంద్రచంద్రికా తుహినబాష్పములు గురియువేళ పితామహుని సింగారపుఁజిందులు.

(56) రతిశ్రాంతాంగనా నయన దీప్తులు.

(82) పికీపిక చుంబనములు.—పంచమాశ్వాసమున (65) రాజును జూచినలేమ తను పుష్పాంగి—కంచెలపిగిలిపడి, చన్నులు వెలివడుట.

2. ఆముక్తలో—(అ౧) ఉద్యానములలో నడుచు ద్రావిడాంగనలు, (ఆ.౨) 'తరుణు ల్తల్లియొబి స్తనచమ్ము'—ఇట్టి కథాక్రమనిరోధములగు వర్ణనములు తక్కినవారి కృతులలోను ఉన్నవి :—

కాన :—ఇట్టి త్రాడు బొంగరము లేని పిల్లలాటలకు మనపండితు లిఁక నేని చొరకుందురనియుఁ; గీర్తికాయుల పేరు చెడమాపకుందుర నియుఁ; దమవిషయమున నెవ్వరేని, అట్టి నిరాధారపు టపనిందలు ప్రచా రము సేయఁ బూనుచోఁ దమ కెట్టులుండునో సుంత యోజించుకొనుట యుక్తమనియు నా హెచ్చరిక !

ఈపని లేని—పనికి — భరతవాక్యముపలికి — ప్రకృతవిషయ మున—కిఁకనరుదెంతును.

మహాశివభక్తుఁడగు ధూర్జటి తననిండుజవ్వనమున, అనఁగా 30–35 ప్రాయమున విద్యానగరప్రఖ్యాతి విని అటకు వెడలియుండును. అప్పటి కింకను నరసరాయల పరిపాలనమగుట, విద్యావ్యసనపరాయ ణుఁడగు నీతఁడు అక్కడి విద్యావంతులకడఁ బెద్దలకడఁ జేరి,—అప్పు డప్పుడు వారితోఁగూడ రాజదర్శనముఁ జేయుచుండియుండును. నరస రాయలయొక్కయు—వీరనరసింహరాయలయొక్కయు మరణానంత రము శ్రీకృష్ణదేవరాయల రాజ్యారంభకాలమునఁ జేరిన పెద్దనాదు లతోఁ దఱచు పరిచయము కలిగించుకొనుచు వారియనుగ్రహమునకుఁ బాత్రుఁడగుటవలనఁ దననలుబదియవయేటి (దాదాఁపు) ప్రాంతమున అష్టదిగ్గజకవులలో స్థానము నడసియుండును.

అతనియందు పెద్దలగు పెద్దనాదులకుఁగల గౌరవముంజూచియు, నతని కవితామాధుర్యమునకుఁ బరవశత్వమునొందియు నతనియెడఁ గూడఁ దక్కినవారియందుంబలె నెనలేని యాదరాభిమానములను ప్రభువు చూపెడివాఁడనియే తెలియుచున్నది. రాయలు తా నత్యంత వైష్ణవమతాభిమాని యయ్యు నన్యమతద్వేషము గల దురభిమాని కాఁడని—యాతని శాసనములేకాక, చరిత్రయు వేనోళ్లఁ జాటుచున్నది. కాని, 'రాజానుమతో ధర్మః' — యనునీతి ననుసరించి యొకకొంద ఱాతనిప్రీతికై వైష్ణవమును (తిమ్మరుసు, పెద్దన, మున్నగువారివలె) స్వీకరించినను, దానిమూలమున ఆతనికి వారియెడఁ గల గౌరవ మతి శయించినట్లు నిదర్శనము లించుకేని కానరావు. అతనితమ్ములలోఁ గడ పటివాని పేరు సదాశివదేవరాయలు, భార్యలలో నొకతె యన్నపూర్ణ. స్వకుటుంబముననే యిట్టినామములుగల శ్రీకృష్ణదేవరాయలు (వైష్ణ

పుఁడయినను) వీరవైష్ణవుఁడుమాత్రము గాఁడు. ఆరాధ్యుఁడైన సూరాయగారిమల్లన యెంతపండితుఁడయినను, రాయలు వీరవైష్ణవుఁడగుచోఁ దన యష్టదిగ్గజములలోఁ జేర నంగీకరించునా ?—కాన, పరమతాసహనమాతని కెప్పుడును లేదు. స్వమతాభిమానమున్నదందురా ? ఉన్ననుండుఁగాక! ఆముక్తమాల్యద వ్రాయుఁగాక! అదిసహజమే.—కావున నతని కాలమునఁ దక్కిన కవులతోఁబాటు ధూర్జటియు సమస్తగౌరవములు భోగములు పుష్కలముగ ననుభవించినవాఁడే. కాని, కవుల దౌర్భాగ్యవశమున ఆసార్వభౌముని కాలము కబళింపఁ గవితాపితామహునంతటివాఁడే—"బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు"—ననుచు వాపోవఁ దక్కినవారి మాటేల ?—అచ్యుతదేవరాయలు మహాభోగి. అంతఃపురమే వల్మీకాంతరము. బావమఱఁదుల పలుకులే నాగస్వర మధురనాదములు. కవులగోడవ లాతనికిఁ బట్టినదికాదు. కవులు పూర్వవాసనతో విద్యానగరము నంటిపట్టుకొని యున్నవారుండిరి. బద్దలైన కుండలోని గచ్చకాయలవలె మూలకొకరు వెడలినవారు వెడలిరి. అట్లు వెడలినవారిలో ధూర్జటికూడ నొకఁడు.

దాదాపు తనయేఁబదఱువదేండ్ల నడిమిప్రాయమున స్వస్థలమగు కాళహస్తిం జేరుకొనెను.

అతఁడు వేదవేదాంగములు, ఉపనిషత్తులు, సాంఖ్యాదియోగములు, వేదాంతరహస్యములు, శైవాగమములు సమగ్రముగ నెఱిఁగిన మహాజ్ఞాని. పెద్దన రాయలయనంతరము చెప్పుకొన్నరీతి * జీవచ్ఛవముగ జీవితశేషమును గడపినందులకుఁ దార్కాణ మీతఁడొక్కఁడే యనుటను ఇతని 'శ్రీకాళహస్తీశ్వరశతకము' బహుముఖములఁ జాటుచున్నది.

తనశతకమున ఇతఁడు రాజులను నిందించుటకుఁ గారణము, కృష్ణరాయనిపిదపఁ, దన్ను దగ్గఱఁజేర్చి పోషించు ప్రభువులు మృగ్యులగుటచేతనే; కాని, శతకకవులచరిత్రకారుఁ డూహించినట్లు కృష్ణదేవరాయల నిరాదరణముకాదు. †

---

* రాయలయనంతరము కొలఁదికాలమునకే పెద్దనయుఁ దన దుర్భరజీవితముఁ గడపలేక మరణించియుండును.

† ఈతఁడు శైవుఁడగుట, నీతనికిఁ గృష్ణరాయఁడు సంపూర్ణదయ చూపనందునఁ గాఁబోలు నీతఁడు ధ్వనిప్రధానముగఁ గొన్నిట—తెగఁబడి కొన్నిట పరోక్షముగను—రాజుల నిందించెను. (శతకకవుల చరిత్రము : పుట ౧౧౯).

అతులితమాధురీసంపదతోఁ బొంపిరివోవు నీతని కవితారామణీయకత "శ్రీకాళహస్తీశ్వరశతకము"న, మిన్నుముట్టినది. ఈతని యనుభవజ్ఞానమునకు—"మం చెలమీఁదనెక్కి" అను (శ్రీ కా. మా.) పద్యము ఒక్కటే చాలును. ఇఁక అన్యదేశ్యాలయిన ద్రావిడకర్ణాటశబ్దములను గూడ నితఁడు తన కవిత్వమున నిరాఘాటముగా ఉపయోగించెను. కాళహస్తిలో నున్నపుడు సరిహద్దులోనున్న అఱవభాషయు, విజయనగరవాసిగనున్నప్పుడు కర్ణాటభాషయు నితనికిఁ జక్కఁగ వచ్చియుండును:—

(1) మణ్ణాసయు, పొణ్ణాసయుఁ బెణ్ణాసయు లేనివారి పెన్నిధులగుటకా.

(2) బిజమాడుదేవర నిజకృపామహిమఁ జెన్నారు గాయిల్లు బిడాయ నీకు,
నాకు నీపాదార్చనము సేయ నడలింగమూర్తి చేకుఱె వచ్చి, మూర్తిమాడి
యొడయ చిత్తేశ నాయునికి నీమజ్జనమాడు, శివార్చన మాడ బేకు
విచ్చేయుఁ డిదెబూది, వీడియంబందుకో జంగమస్వామి నాసదనమునకు
నోగిరంబులు, మంచిమేలోగిరములు నావటించెదఁ బదుఁడు మీరారగింపఁ
బ్రతిదినంబును జంగమూర్చనములేక దనివి వడనొల్ల రూపకందర్ప యనఁగ ||
(—శ్రీ—కా—మా.)

ఇతని కవితలో అచ్చతెలుఁగు జాతీయములు, నానుడులు, నామెతలు ప్రతిపద్యమునను సందర్భానుసారముగఁ బ్రయోగింపఁబడినవి. జానుఁదెనుఁగుఁబదములతో నింతముచ్చటగ శతకరచన (వృత్తములలో) సాగించగలవారిలోఁ బ్రథముఁడు అన్నమాచార్యుఁడు. ద్వితీయుఁడు ధూర్జటి కవీంద్రుఁడు.

౧. కొన్ని తెనుఁగుఁబలుకుబళ్లు : జాతీయములు :—

(1) అంతా మిథ్య (2) నీ నా సం దొడఁబాటు మాట, (3) చేత జీతంబు నే, కానిం బట్టక, (4) ఏలా నామెడఁ గట్టినాఁడవు, (5) తిను, తింటేగాని కాదు, (6) ఆశాపాశంబులఁగట్టు, (7) నే బిడ్డఁడై నాఁడ, (8) బెట్టు మానఁదగదా ?, (9) చేసీచేయదు, (10) దీని త్రుళ్లణఁపవే, (11) ఎన్నేళ్లుంటిని ఏమి గంటిని?, (12) ఆలంచు నెమ్మెడఁగట్టితి, (13) చలిం జడిసి కుంపట్లెత్తుకోఁ జూచు, (14) ఇండ్లిండ్లును దూఱు, (15) పాలుం బువ్వాయుఁ బెట్టెదం గుడువరా, (16) అరంటిపండ్లు గొని తే, తేకున్న నేనొల్ల (17) అంతా సంశయమే, (18) అయవార్లై చరియింపవచ్చు, (19) జీవశ్రాద్ధము, (20) చీకాకు, (21) పీసంబైన (22) మాతండ్రాన, (23) మాలఱ్ఱము (24) సీలామూలము, (25) తప్పందాల, (26) సీల

స్సిల, (27) కాలాకాలముల, (28) మేఁకమెడచన్ను, (29) ముక్తి వారణాసి, (30) కడపే కైలాస శైలము, (31) చేసిన గులాము, (32) ఆక[illegible] దైనములు (33) మాఱాకులు, (34) దంపుల్వోట్లు, (35) చెంపలు వేయు. (36) నిన్నుంజూడరొ, మొన్నఁజూడరొ. (37) ముదియంగా ముదియంగఁ బుట్టె ఘనమా మోహంబు, (38) నీ శ్రీభాండాగారములోఁ గొఱంతె యగునా ?, (39) ఈ శ్రీ తా నెన్ని యుగంబు లుండఁగలదో ?, (40) గడియ ల్రెంటికొ మూఁటికో, గడియకో, (41) క్రితమే చూచెను, (42) కంకణము ముంజేఁ గట్టితిక్, (43) కాసంచు మీఁదె త్రితిక్, (44) బదినీసి కాంట్లు. (45) మిగులం జౌకయ్యెఁ గా పద్యముల్, (46) తాపసతంపర (47) దొప్పెం డెంగిలి, (48) తోప్పందోఁగు, (49) చెప్పఁగాలు, (50) శ్రీమంతైన, (51) పొట్టకుఁగాదే, కొనిపోము నీము వెనువెంటక్ (52) చేదోడై, (53) నా కీయర్థము నేలయిచ్చెదవు, నాకా. లేదుగా (54) తాకట్టంబడనోప, (55) చిన్నంబంతయు, (56) నీచిత్తంబు—నా భాగ్యము.

౨. సామెతలు : ఉపమానాలు.

(1) నీరమ్ముంపుము పాలముంపుము, (2) దహనుం గప్పఁగఁ జాలునే శలభ సంతానంబు, (3) గవయుం బాఁబోఁతునుం దాఁకి యుగ్రతఁ బోరాడఁగనున్న యన్నడిమి లేఁగల్, (4) గుమ్మడికాయలోన నవగింజంత, (5) పిండెంతో యంతియకా నిప్పటి, (6) ఇల్వ్రాడలంద్రోచినఁ జూరుపట్టుకొని నే వ్రేలాడుదు, (7) మంచినీళ్లు గలవా చట్రాతిలో ? వెలివాడ న్మఱి బాపనిల్లు కలదా ? (8) బుధుండార్తుఁడై, చిచ్చారంజము రేల చల్లుకొనునో ? (9) ఏనుఁగుపై నెక్కి దిడ్డిదూరుదురె ? (10) బాలుం డొకచోట నాటతమి తోడ న్మూఁతిఁ గూలంగఁ, దండ్రి విచారింపక యుండునా ?

3. సంప్రార్థనములు.

(1) నావిన్నప మేల గైకొనవయా ? (2) వినోదించుట కేమి కారణమయా ? (3) సిలుగుల్ ప్రాణుల కెన్ని చేసితివయా ? (4) శ్రీలెవ్వారికిఁ గూడఁ బెట్టెదవయా ? (5) నేఁడేమయా, పుట్టె ఘనమా మోహంబు.

ఇవి, దేవునిమీఁద భక్తులకుగల చనువుచేత చెప్పఁబడుమాటలు :—

ఇతని సంస్కృతసమాసాలలోని లాలిత్య మత్యంత మనోహరము. నిరంకుశ, నిరర్గళ, నిస్సీమ ధారాధోరణి కలిగి యుఱకలు వేయుచుండును. నిర్మల మానసకాసార విహారి హంసావతంసము, చిఱుకెరటముల తూఁగుటుయ్యాలలో నానందముగ నూఁగులాడుచున్నట్లితని కవితాకుమారి, కవితామృతవాహినీ శబ్దతరంగములఁ దూఁగియాడుచుండును. ఈ క్రింది సమాసములు పరిశీలింపుఁడు.

(1) శ్రీవిద్యుత్కలితాజవంజవ మహాజీమూత పాపాంబుధారావేగము, (2) దివిజక్ష్మారుహ ధేనురత్న ఘనభూతి ప్రస్ఫురద్రత్నసానువు, (3) అంభోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదులు, (4) సువర్ణముఖరీ తీరప్రదేశాశ్రమకానన మధ్యోపల వేదికాగ్రము, (5) కీట ఫణీంద్రపోత మదవేదండోగ్ర హింసావిచారి, (6) మషాకల ప్రమాణ క్రియా లీలాజాలక చిత్రగుప్తముఖ వల్మికోగ్ర జిహ్వోద్భుత వ్యాళవ్యాళవిరోధి మృత్యుముఖ దంష్ట్రాహార్యవజ్రంబు, (7) సత్యాభాషణ సముద్యద్రత్న రుద్రాక్ష రాజి సమేతుల్, (8) విలాసినీజన సువస్త్రవ్రాత భూషాకలాప తనూజాదికము, (9) కమలాపర్యంక వక్షఃస్థలీ రమణీయస్థితి, (10) పటవ, ద్రజ్జుభుజంగవ, ద్రజతవిభ్రాంతిస్ఫురచ్ఛుక్తివ, ద్ఘటవ, చ్చంద్రశిలా జపాకుసుమ రుక్సాంగత్యవత్.

శ్రీకృష్ణదేవరాయ నిర్యాణానంతరము, విద్వత్కవితాభిమానములులేని జేండ్లకడ నెక్కడను దనకుఁ బ్రవేశములేమి నిరాశజనించుటచేతను—తాను విద్యానగరమున ననుభవించిన భోగములతోఁ దలబట్టకట్టుటచేతను — నిర్వేదముచెందిన మనస్సుతో, రాజులను, రాజసన్మానములను, రాజభోగములను ఈసడించి చెప్పిన పద్యము లీశతకమునఁ బెక్కులున్నవి :—

ఆ మహాసామ్రాజ్యమునఁ బండితులు, కవులు, కళాప్రియులు సార్వభౌమునితోఁబాటు సార్వభౌములే. ప్రభువున కెన్ని భోగవైభవము లుండెడివో వీరికిని అన్నియుండెడివి.—

ఈయంశమును స్థిరపఱచుట కానాఁటి నిదర్శనములే ఎన్నియో చూపవచ్చును :—

1. ఒకనాడు కృష్ణదేవరాయలతోఁ గూడ నేనుఁగంబారిలో వాహ్యాళివెడలుచుండఁ బ్రసంగవశమున రాయ లాతనింజూచి యప్పటి

[illegible] వాహ్యాళింబోర్చి యేదేనొక పద్యముఁ జెప్పుమనఁ :—పెద్దన :—

"నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన. ముయ్యెలమంచ మొప్పు త
ప్పనియు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరికినఁగాక, యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?"

అనెనఁట!

2. మఱియొకప్పుడు కవిత యెట్లుండఁదగునని రాయలు నిండు కొలువునఁ బ్రశ్నింప—ఈకవితాపితామహుఁడే :—

"ఘనతర ఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక. ద్రావిడ
స్తనగతిఁ దేట గాక, యఱచాటగు నాంధ్రవధూటి పయ్యెదం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుతనంబును లేకయుండఁ జె
ప్పిన యదెపో కవిత్వ మనిపించు నగించుట గాక యుండినన్"

అని దృఢపఱచెనఁట!

"చేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్ని మే
ల్పూఁతల చన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టిచూచినన్
రాతొడనున్న మిన్నులమిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱదొండపండువలె వాచవి గావలెఁ బంటనూఁదినన్"

నిరుపహతిస్థలమును, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు (వట్టివిడెముకాదు) కప్పురపువిడెమును, ఆత్మ కింపయిన భోజనమును, ఉయ్యెలమంచమును—ఇన్ని 'హంగులు' ఉండినఁగాని కవిత కల్లసాని వారు ముందంజ వేయరు. పైఁగా నా యీ దేశస్థాంగనామణుల స్తనముల లగువుబిగులను జక్కఁగ నెఱింగినవారు. ఇఁక (తనకుస్వాధీన యయిన) కవితాతన్వంగి కన్యయఁట! చిన్ని పొన్ని మేల్పూఁతల చన్నుదోయి గలదియఁట! ఆమె వాతెఱయో, దొండపంటివంటిచవి గలదఁట?—పై రెంటిని క్రమముగా పట్టిచూచినారు. పంటనూఁదినారు! వహవ్వా!

3. మఱి తిమ్మనార్యుని మోహించిన యొకానొక వారవనిత బహిరంగముగ వీథిలోనే కవుంగలించుకొనినదఁట!—అప్పుడు "హా! శ్రీహరీ" యంచున్ "బ్రాహ్మణుఁ డోరమోమిడ" — "ఏమండీ! మీరు రసికులుకారా? ఇట్లు చేయఁదగునా?" అని యడుగ—"ఆఁ, దానికా!—నేనేమి చాదస్తపు ప్రవరుఁడ ననుకొన్నావా?"—"అబ్బో!

బంగరుతలుపుగుబ్బలవంటి నీగుబ్బల—అంచులు (బిచువాలవిధముగా) నాఱోమ్ముగ్రు దూసికొనిపోయి, వీఁపుఁగోనికి వచ్చెనేమో ? — అని మొగము నావలకుఁ ద్రిప్పిచూచికొన్నాఁడను" — అనెనఁట !— ఇతనికిఁగూడఁ—గవితారచన కుయ్యాలమంచ ముండినవేగాని సరి పడదు. రామకృష్ణు నడుగుఁడు :—

4. ధూర్జటిని రచ్చకీడ్చినవాఁడని చెప్పఁబడిన రామకృష్ణకవి మాత్రము సామాన్యుఁడా ?—ఆయనను వేశ్యాప్రియుఁడని చాటసాహ సించిన వానికి వారాంగనావాటికలో నేమిపని ?—దొంగను పట్టుకొన వలెనన్న దొంగయేకావలెను. చూడుఁడు :—ఇతఁడు (రామకృష్ణకవి) ఒకానొక పణ్యాంగనాగారమునకుఁబోవఁ దటస్థింప—నటఁబాన్పుపైఁ బవ్వళించియున్న గణికాకుమారి ఇతనిఁ జూచి మోమావలకుఁ ద్రిప్పు కొన్నదఁట !— వెంటనే యీవికటకవి :—ఇట్లనెను :—

> "వరబింబాధరముం బయోరుహముఖక్ వక్రాలకంబుల్ వునో
> హర లోలాక్షులు సూప కవ్వలిమొగంబైనంత నేమాయె ? నీ
> గురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు మాకుం జాలవే ? గంగ క
> ద్దరిమే, లిద్దరిఁగీడునుం గలదె యుద్యద్రాజబింబాననా !"

యువతుల పూర్వ పశ్చాద్భాగముల రెంటనుగూడ సార స్యము గ్రహించు మహావిటాగ్రేసరుఁ డీమహాకవి !

వీరెల్ల వసించుటయా, రాజధానీనగరమున !—జీవనమా, నిర్వి చారమగు తెలుఁగున !—భోగములా, ఆంధ్రభోజ తుల్యములు ! ఏమటఁ గొఱఁత !—అయినఁ దక్కినవారు ధూర్జటివలె (బోళాబా యీలు) నిష్కపటులు గారు. అందువలననే అతఁడు రచ్చకెక్కెను ! ఇంతకుఁ దా నెలప్రాయమున ననుభవించిన యాభోగములపై నేవ గలిగి బశ్చాత్తప్తుఁడయి, శ్రీకాళహస్తీశ్వరానుగ్రహముం గోరి — యీశతకపద్యములు (మనోవిచారము గలిగినప్పుడెల్ల) రచించుచు వచ్చెను :—అంతమాత్రమున నతఁడు కేవలము ఊరి బసవఁడయినాఁ డనుట ! అనుచితము, అఘప్రదమును.—ధనకాంతా సాంగత్యముఁ జేసిన తక్కిన (ఆనాఁటి) కవుల కది దూష్యము కానందున, వారు ధూర్జటికంటెను అవినీతిపరులగుటచేతనే—తమ కావ్యములలో ఎక్కడ ఏరవంత పొల్లువోయినఁ దాము బయలుపడిపోవుదుమేమో యని,

౦భీరముగఁ (దమ్మ్రుక్కుల్లు వెలికిరాకుండఁ) బ్రవర్తించెను. — ధూర్జటి పాపభీతిగలవాఁడు; పరమశివభక్తుఁడు. వైదికమతనిష్ఠుఁడు. భక్తి, జ్ఞాన, కర్మ, సాంఖ్య రాజ యోగాదుల పారమెఱింగిన తత్త్వవేత్త.

మానసస్వభావముం గుర్తించు పరిజ్ఞానములేని — వారి తత్త్వజ్ఞానమసలేలేని—వారి మాటల కేమిలెండు ?

ధూర్జటి వైరాగ్యమును భక్తిని ప్రకటించు పద్యములలో నాతని హృదయావేదన మెట్టిదో యెఱుంగనగును :—

1. "భవకేళీ మదిరామదంబున, మహాపాపాత్ముఁడై వీఁడు నన్ను మనేకింపఁ డటంచు, నేను నరకార్ణోరాశిపాలైనఁ బట్టవు"
2. "ఆలుంబిడ్డలు దల్లిదండ్రులు ధనం బంచు న్మహాబంధనం బేలా నా మెడఁ గట్టి నాఁడవు ?"
3. * కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ, గాయంబు, వక్షోజముల్ రాయ వ్రాపడె రొమ్ము, మన్మథ విహారక్లేశ విభ్రాంతిచేఁ, బోయె న్బ్రాయముఁ, బట్టగట్టెఁ దల, చెప్పన్రోఁత సంసారమే"—
4. నిను సేవింపఁగ నాపదల్పొడమనీ, నిత్యోత్సవం బబ్బనీ, జనమాత్రుండననీ, మహాత్ముండననీ, సంసారమోహంబు పైకొననీ,... అవి నాకు భూషణములు."
5. అన్నా, ఎన్నఁడు నన్ను సంసృతి విషాదాంభోధి దాఁటించి యచ్ఛిన్నానంద సుఖాబ్ధిఁ దేల్చెదో కదే.
6. ఆశాపాశంబులఁ జుట్టి త్రిప్పెదము సంసారార్థమై బంటుగా.
7. నీపల్లింబు ప్రసాదముం దినికదా, నేబిడ్డఁడైనాఁడ.
8. తల్లిఁ దండ్రియుఁ గురుఁడ వీవేకాక సంసారపుం జిమ్మంజీఁకటిఁ గప్పింపఁ గడవు నన్.
9. ఆలంచు న్మెడఁగట్టి దానికి నపత్యశ్రేణికల్పించి, తద్బాల వ్రాతము నిచ్చి పుచ్చుకొను సంబంధము గావించి యామాలర్కంబున బాంధవం బనెడి ప్రేమం గొందఱింద్రించిపఁగా, సీల నీలల యమర్చిన ట్లొనఁగితి.
10. సీ ! సంసారదురాశ యేలుడుపవో.
11. కైవల్యమొందింపనేర్చిన వైరాగ్యముకంటె ఘనమా.
12. కపటీజవంజవ మహాకూపార మేపారఁగా చిన్నంబంతియు దాఁటఁగాను.

---

* ఇందలి 'వధూ' శబ్దమునకు "ఆఁడుది" యను నర్థమున్నంతమాత్రమున, ఏ గణికయో, జారయో యనుట పొరపాటు. "సంసారము" రోఁత యన్నప్పుడు సాధారణముగఁ దన గార్హస్థ్యజీవితమని. అగుచో, 'వధు' వన ఆయింటి కోడలని, అనఁగాఁ, దనభార్యయని గ్రహింపవలె—ఇట 'వధూ' శబ్దము సమాసగత మగుట బహువచనమే యని యనఁ గాదు. ఆరీతి గ్రహించి, 'ధూర్జటి'ని దుర్వ్యసనిఁ జేయఁజూచు పండితుల కొకనమస్కారము.

ఈక్రిందివి దుష్పరిపాలకులనుగూర్చి ఈకవి నిందించుచుఁ జెప్పినవి :—

(1) నాకీయర్థము నేలయిచ్చెదవు, నాకా, లేదుగా, యీవృథాశోకంబంతయుఁ దీరు నెంతట, నతిక్షుద్రదక్షమానాఘులే తాకట్లం బడనోపు, (2) పదివేలైనను లోకకంటకులచేఁ బ్రాపించు సౌఖ్యంబు నామదికిం బథ్యముగాదు, (3) రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరం జేరఁగా సౌఖ్యమో, (4) ద్వారద్వారములందుఁ గంచుకిజనవ్రాతంబు దండంబులం దోరంతస్థలి బగ్గనం బొడుచుచుం, దుర్భాషలాడ న్మతిక్, వారిం బ్రార్థనచేసి రాజులకు సేవల్ సేయ, (5) ప్రోవంగ నీవోపవో, చేరం బోవుదు రేల? రాజుల జనుల్, (6) వేధం దిట్టఁగ రాదుగాక, భువిలో విద్వాంసులం జేయ నేలా? ధీచాతురిఁ జేసి, చేసిన గులా మాపాటనే పోక, క్షుద్బాధాదు ల్గలిగింప నేల? యది కృత్యంబైన దుర్మార్గుల్, ఛీ! ధాత్రీశులఁ జేయనేల? యకటా!, (7) సంతోషించితిఁ జాలుఁ జాలురతిరాజద్వార సౌఖ్యంబులక్, శ్రాంతింబొందితిఁ జాలుఁజాలు బహురాజద్వార సౌఖ్యంబులక్, (8) పుత్రీపుత్ర కళత్ర రక్షణ కళాబుద్ధిక్, నృపాలాధముక్ బాత్రంబంచు భజింపఁబోదురు, (9) సులభములూర్మార్గులు, సుత్తమోత్తములు, రాజుల్గల్గి యేవేళ నన్నలఁతంబెట్టిన నీపదాబ్జములు బాయంజాల, (10). భవదుఃఖంబులు రాజకీటముల సంప్రార్థించినం బాయునే? భవదంఘ్రిస్తుతిచేతఁగాక, (11) లేవో నీవు విరక్తుల న్మనుప, జాలింబొంది భూపాలురక్ సేవల్సేయఁగఁ బోదురే లోక జనుల్, (12) పదునాల్గేలె మహాయుగంబు లోకభూపాలుండు, చెల్లించె నయ్యుదయాస్తాచలసంధి నాజ్ఞ నొకఁడాయుష్మంతుఁడై, వీరి యభ్యుదయం బెవ్వరుఁ జెప్పఁగా వినరో, యల్పు ల్మత్తులై యేల చచ్చెదరో, రాజులమంచు నక్కటకటా, (13) రాజన్నంతనె, పోవునా కృపయు ధర్మం బాభిజాత్యంబు విద్యా జాతక్షమ, సత్యభాషణము, విద్వన్మిత్రసంరక్షయుక్, సౌజన్యంబు, కృతంబెఱుంగుటయు, విశ్వాసంబు గాకున్న దుర్బిజశ్రేష్ఠులు గాఁగతంబు గలదే, (14) నృపధామద్వార దేశంబుఁ గాచి దినంబుల్ వృథబుత్తు రజ్ఞులకటా.

ఈతని వేదాంతశాస్త్ర పరిజ్ఞానమునకును—అనుభవమునకుఁ గొన్ని మచ్చుతునుకలు :—

ఈక్రింది పద్యమున మోహాంధులైన యోగినామధారులకు చక్కని బోధనము గఱపెను :—

"మలభూయిష్ఠమనోజధామము సుషుమ్నా ద్వారమో ?, యోని
కుండలియో ?, పాదకరాక్షియుగ్మములు షట్కంజంబులో ?, మో
ము దా జలజంబో ?, నిటలంబు చంద్రకలయో ?, సంగంబు
యోగంబో ?, గాసిలి సేవింతురు కాంతలన్ భువిజనుల్"

"ఊరూరం జనులెల్ల భిక్షమిడరో, యుండంగుహల్లేవో,
చీరానీకము వీథులం దొరకదో, శీతామృతస్వచ్ఛ వాఃపూరం
బేరులఁ బాఱదో, తపసులం బ్రోవంగ నీవోపవో"

"పటవ, ద్రజ్జుభుజంగవ, ద్రజతవిభ్రాంతిస్ఫురచ్ఛుక్తివ, ద్ఘటవ, చ్చం
ద్రశిలా, జపాకుసుమరుక్సాంగత్యవ, త్తంచు, వాక్పటిమన్నే
ర్తురు, చిత్సుఖం, బనుభవింపన్లేక దుర్మేధసుల్"

ఎట్టికార్యములు సాధించుచో మహాఫలములను—లేనిచో, గొప్ప ముప్పులను దెచ్చిపెట్టునో—కవి యీక్రిందిపద్యమున వివరించెను :—

"దురము ద్దుర్గము రాజభావము మతిన్ దొంగర్కము వైద్యమున్
నరనాథాశ్రయ మోడబేరము మహామంత్రంబు సిద్ధించినన్
అరయం దొడ్డఫలంబు గల్గు నదిగా కాకార్యమే తప్పినన్
సిరియుంబోవును బ్రాణహానియునగున్, శ్రీ కాళహస్తీశ్వరా"

శ్రీకాళహస్తీశుని సేవాఫలమునకు సప్తసంతానని ర్మాణజనిత ఫలములు గూడ నీడుగావు :—

"తనయున్వ్వాడి, ధనంబుఁగాంచి, దివిజస్థానంబు గట్టించి, వి
ప్రున కుద్వాహముచేసి, సత్కృతికిఁ బాత్రుఁడై, తటాకంబు నే
ర్పునఁ ద్రవ్వించి, వనంబువెట్టి, మననీ పోలేఁడు, నీసేవచే
సిన పుణ్యాత్ముఁడు పోవులోకమునకున్ శ్రీకాళహస్తీశ్వరా !"

ఈక్రిందివి మరణభీతిని నిరసించుచున్నవి :—

"తాతల్ దల్లియుఁ దండ్రియు న్మృతిగనుఁబెద్దల్నవఁగాఁ జూడరో ?
భీతింబొందఁగనేల చావునకుఁగాఁ బెండ్లాము బిడ్డల్ హిత
వ్రాతంబుం బలవింప జంతువులకున్ వాలాయమైయుండఁగాఁ
జేతోవీథి నరుండు నిన్గొలువఁడో, శ్రీకాళహస్తీశ్వరా !"

"నిన్నం జూడరొ ? మొన్నఁ జూడరొ జనుల్ నిత్యంబుఁ జావంగ, నా
పన్నుల్గన్నవిధాన, మయ్యోడి, ధనభ్రాంతి న్వ్యసజ్జింపతే
కున్నారెన్నడు నిన్నుఁ గందు, రిఁక మర్త్యుల్ గొల్వరేమో నిను
న్విన్నంబోవక యన్యదైవరతులన్ శ్రీకాళహస్తీశ్వరా !"

"చనువారిం గని యేడ్చువారు, జముఁడా సత్యంబుగా వత్తు నే
మనుమానంబిఁక లేదు, నమ్ముమని, తారావేళ నారెవ్వరున్
మనుఁగంబోవుట, బాససేయుట సుమీ మమ్మాటికిం జూడఁగా,
చెనటుల్గానరు దీనిభావ మిదివో, శ్రీకాళహస్తీశ్వరా !"

"చావం గాలము చేరువౌటెఱిఁగియుం జాలింపఁగాలేక, త
న్నే వైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో ? యేమందు రక్షించునో
యే వేల్పుల్ కృపఁజూతురో, యనుచు నిన్నింతైనఁ జింతింపఁడా
జీవశ్రాద్ధము చేసికొన్నయతియున్ శ్రీకాళహస్తీశ్వరా !"

మానవునకు సహజముగాఁ గాక, ఆయాపరిస్థితుల ననుసరించి డంబఫుటేవి యీదిగువ పద్యములోఁగవి యభిశంసించుట గమనింపఁదగినది:—

"వీడెంబబ్బినయప్పుడుం, దమనుతుల్విన్నప్పుడుం, బొట్టలోఁ
గూడున్నప్పుడు, స్త్రీవిలాసములు పైకొన్నప్పుడుం, గాయకుల్
పాడంగా వినునప్పుడుం జెలఁగు దంభప్రాయవిశ్రాణన
క్రీడాసక్తుల నేమి చెప్పవలెనో ? శ్రీకాళహస్తీశ్వరా !"

అనుకరణములు కొన్ని :—

"రోషమయమహాతరువు సుయోధనుఁ, డురుస్కంధ మందులోనఁ గర్ణుఁడలగుఁ
గొమ్మ సౌబలుండు గుసుమఫలములు దుశ్శాసనుండు, మూలశక్తి తండ్రి"

"ధర్మజుండు ధర్మతరు వర్జునుఁడు ఘనస్కంధ మనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము లేను, భూసురులును, వేదములు తదీయమైన మూలచయము"

(మహాభారతము : ఉద్యోగ—౧ అశ్వా) తిక్కనగారి పై పద్యాలకు ఈక్రిందిపద్యము ఛాయానుకరణము.

"విత్తజ్ఞానముపాదు, చిత్తముభవావేశంబు రక్షాంబు, వు
న్మత్తత్వంబు తదంకురం, బనృతముల్మాకు, లత్యంతదు
ర్వృత్తుల్ పువ్వులు పండ్లు మన్మథముఖావిర్భూత దోషంబులుం
జిత్తాభ్యున్నత నింబభూజమునకున్ శ్రీకాళహస్తీశ్వరా !"

పోతనగారి :—

"అంధేదూదయముల్ మహాబధిరశంఖారావముల్, మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్, నపుంసకవధూకాంక్షల్, కృతఘ్నావలీ
బంధుత్వంబులు, భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్"

అనుపద్యమునకు ఛాయ :—

"తరఁగల్ పిప్పలపత్రముల్ మెఱుఁగుటద్దంబుల్ మరుద్దీపముల్,
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతకీటప్రభల్,
సురవీథీలిఖితాక్షరంబు, లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్
సిరులందేల మదాంధులౌదురు జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!"

"ధనమదాంధులకొలు వేల? తాపసులకు"—అను పాదముతో నంతమగు భాగవతపద్యమునకు—ఈశతకములోని—"భూపాలురన్ సేవల్సేయఁగఁబోదు రేలొకో జనుల్"—అను వాక్యముతో ముగియు—రశివ పద్యము ఛాయ. కాని, దీనికి ఇంచుమించుగా—ఈ క్రింది భర్తృహరిశ్లోకము మాతృక.—కనుక ఆమాతృకను — శతకములోని పుత్రికనుగూడ దిగువ చూడఁదగును :—

కింకందాఃకందరేభ్యః, ప్రళయముపగతా నిర్ఝరా వాగిరిభ్యః
ప్రధ్వస్తా వా తరుభ్య స్సరసఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః
వీక్ష్యంతే యన్ముఖాని ప్రసభముపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్త స్మయపవనవశా నర్తిత భ్రూలతాని ॥"

"లేవో కానలఁ గందమూలఫలముల్, లేవో గుహల్, తోయముల్
లేవో యేఱులఁ, బల్లవాస్తరనముల్ లేవో సదా యాత్మలో
లేవో నీవు, విరక్తులన్మనుప, జాలింబొంది, భూపాలురన్
సేవల్ సేయఁగఁ బోదు రేలొకొ జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!"

సుభాషితాలలోని మఱొకశ్లోకమునకుఁగూడఁ బోలిక గల పద్యమును (సమూలముగా) గమనింపనగును :—

"వహ్ని స్తస్య జలాయతే, జలనిధిః కుల్యాయతే తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే మృగపతి స్సద్యః కురంగాయతే
వ్యాళో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే
యస్యాంగేఖిల లోకవల్లభతమం శీలం సమున్మీలతి"

'శీలము' మహిమనుగూర్చి భర్తృహరి చెప్పిన పయిశ్లోకమునకు—ఈకవి 'శివ' ప్రభావపరముగాఁ జేసిన ఛాయానువాద మీక్రింది పద్యము ; (కొన్ని మార్పులును లేకపోలేదు.)

"పవి పుష్పంబగు, నగ్ని మంచగు నకూపారంబు భూమీస్థలం
బగు, శత్రుం డతిమిత్రుఁడౌ, విషము దివ్యాహారమౌ నెన్నఁ గా
నవనీమండలిలోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్
శివ, నీనామ మె సర్వవశ్యకరమౌ, శ్రీకాళహస్తీశ్వరా!"

* శతకమునందలి ౯-వ పద్యమువలన—ఇతనికి బిడ్డలును, దల్లిదండ్రులు నున్నట్లు తేలుచున్నది. ఈమహాకవి విజయనగరమునకు వెడలునాఁటికే యీశతకములోని ౧౬—౧౭ పద్యములవఱకు కాఁబోవులుగాఁ దనమనోగతి ననుసరించి, దేశకాలపాత్రోచితముగ రచించి యుండవలెను. శతకములోని ౧౮-వ పద్యమునుండియే, యితనిరాజదూషణము ప్రారంభమగుట—ఆనాఁటి కితఁడు (శ్రీరాయలు స్వర్గతుఁడగుట) మరలఁ శ్రీకాళహస్తిని జేరుకొని యుండవలెను.—అప్పటికి, ఇతనికి ఏఁబదియైదేండ్ల (దాదాఁపు) ప్రాయము. కాన, ఇతనితలిదండ్రులు మరణించియుందురు. మఱి బిడ్డలుగూడ నున్నట్లు చెప్పుటచే, వారు కుమారులో, కొమరితలో చెప్పుట కీశతకమునఁ దగిన యాధారములు గాన్పింపవు. మొత్తమునకుఁ గొడుకులు లేరనియే తోఁచుచున్నది. కావుననే,—ఆకొఱంతనుగూర్చిన యావేదన మితనికి మిక్కుటముగ నున్నను—ఎట్లో, మనస్సున సమాధానమొందినట్లు—శతకములోని † ౫౮-వ పద్యము తెలుపుచున్నది.

ఈశతకము ధూర్జటి యవసానకాలమునకుఁ బూర్తికాలేదు. ఏదో తోఁచినప్పు డెప్పటికప్పు డందుఁ బద్యములుమాత్రము చేరుచుండెను. అట్లు దాదాపు 140 వఱకు రచియింపఁబడినవి.

రాయలయాస్థానమున నప్పుడపుడు (తఱచుగా) జరుగుచుండిన విద్వద్గోష్ఠులలోను — నానావిధ విషయములంగూర్చి జరుగుచుండిన చర్చలలోను—ధూర్జటి పాల్గొనుచు సాహిత్యవ్యాసంగము చేయుచుండినందున—ఈశతక మాతనిదృష్టి నాకర్షింపకుండెను. పైఁగాఁ బెద్దనాదులవలెఁ దాను నొకకావ్యకర్త గావలయునను నూహ గలవాఁడగుటచే, రాయలు రాజ్యాంగవ్యవహారములలోను—దండయాత్రలలోను నిమగ్నుఁడయి, కవితావ్యాసంగములకు ఇంచుక దూరగుఁడై—యుండు కాలమున—శ్రీకాళహస్తి మాహాత్మ్యమును రచియించు

---

* "ఆలుంబిడ్డలుఁ, దల్లిదండ్రులు, ధనంబేలా నా మెడఁ గట్టినాఁడవు ?"

† "కొడుకుల్ పుట్టరటంచు నేడ్తురవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్, వారిచే నేగతుల్
వడసెన్, బుత్రులులేని యాశుకునకున్ బాటిల్లె నేదుర్గతుల్,
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా !"

నుండియుండును. ధూర్జటి శ్రీకాళహస్తీశ్వరుం గూర్చిన విషయములకు దప్పఁ—దక్కిన యెట్టికథావస్తువునకును బ్రాధాన్యమొసంగ నిచ్చగింపని వాఁడగుటచేత నట్టి మాహాత్మ్యములనే, తన కావ్యనిర్మాణమునకు ఆధారము చేసికొనెను. అంతియగాక, పోతనవలె నతఁడు నరాంకితముగఁ గృతి చెప్ప 'ససేమిరా' సమ్మతింపని వాఁడగుటఁ, దన యిష్టదైవమునకే తన రెండుగ్రంథములను గృతియిచ్చెను.

ఇతఁడు "శ్రీకృష్ణరాయవిజయ" — కర్తయగు వేంకటరాయనకుఁ (కుమారధూర్జటికిఁ) బెదతాత యని యాగ్రంథము మూలముననే తెలియుచున్నది. కాన, ధూర్జటికిఁ బుత్రసంతతి లేదనుట సుస్పష్టము. మఱి "ఆలుంబిడ్డలు తల్లిదండ్రులు ధనంబంచు న్మహాబంధనం బేలా నామెడఁ గట్టినాఁడ" వని యతఁడే చెప్పికొన్నందున స్త్రీసంతాన మేదైన నుండియుండుననుటలో సందియము లేదు. దీని కుపబలకముగ 'శృంగారరాఘవ, వామదేవ' చరిత్రాదులకుఁ గర్తయగు చెఱుకుమూఁడి కృష్ణకవి, తాను 'ధూర్జటిదౌహిత్రు దురితదూరు' అని వచించెను.

ధూర్జటికవి కాఱవతరమువాఁడును — కుమారధూర్జటిమనుమఁడు నగు—ధూర్జటి వేంకటరాయకవి—మనశతకకర్తను, రత్నావళీపరిణయమున నిట్లు స్తుతించెను :—

"పటుగంగాలహరీ తరంగసమ శుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనుం, బాదవినమ్రకృష్ణనరరా డ్గంభీర కోటీర వి
స్ఫుట రత్నద్యుతి పాటలీకృత పదాంభోజాతు, సర్వజ్ఞు, ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయ కులకర్తన్ భక్తి రంజిల్లఁగన్"

అని కులకర్తగఁ జేసుకొనెను—కాని సూటిగఁ దనప్రపితామహుఁడని వాకొనలేదు. కావున ధూర్జటికిఁ గొడుకులు లేరనుటయే నిశ్చయము. ఆకారణముననే—అతనికి జ్ఞాతిబాధ మిక్కుటమయి, శతకమున దానిఁగూర్చి వాపోవునంతటి కష్టములు గలిగియుండును.*

"నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్, జేకొంటిం
బిరుదంబు, కంకణము ముందేఁ గట్టితిం బట్టితిన్ లోకుల్ మెచ్చ వ్రతంబు"

---

* "జ్ఞాతుల్, ద్రోహులు, వాండ్రుసేయు కపటేర్ష్యాది క్రియాదోషముల్
మాతండ్రాన సహింపరాదు, ప్రతికర్మంబించుకేఁ జేయఁగాఁ
బోతే దోషము గాన మాని యతినై పోఁగోరినన్ సర్వదా
జ్ఞాతిక్రోధము మాన దెట్లునడుతున్ శ్రీకాళహస్తీశ్వరా!" (కా. శ. ౬౯)

అని చాటిన యీపరమమాహేశ్వరవ్రతదీక్షాగురుని—విద్వత్కవిజనపూజ్యుని యజరామరమగు కీర్తిమూర్తికి భక్తిపూర్వక ప్రణామసహస్రములు.

---

"ఆధివ్యాధులు, దీపనాదులు, కళత్రాపత్యముల్, చాలవా ?
బాధం బెట్టఁగ, నన్నదమ్ములను బాపస్వాంతులం దోడుగా
నేఁ గర్మంబని కల్గఁజేసితివి, నన్నీరీతిఁ బీడించువా
రే, ధీరుల్, నినుఁ గొల్వకుండఁగలనా? శ్రీకాళహస్తీశ్వరా !" (కా. శ. ౧౩౪)

---

సవరణములు :—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 91 | 14 | మహాత్మ్య | మాహాత్మ్య |
| 100 | 6-7 | ఘనతాజన | జనతాఘన |
| 103 | 7 | వఖంపచ | నఖంపచ |
| ,, | 13 | కుశత్వము | కుశలత్వము |
| 111 | 17. | సంస్కృతి | సంస్కృతి |
| ,, | 28 | కపటీ | కపటా |
| 112 | 21 | లాక | లాక్షా |



# తాళ్లపాక తిరుమలాచార్యుఁడు

(క్రీ. శ. 1505—1545 ప్రాంతము)

శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలోఁ బ్రథమసంకీర్తనాచార్యుఁడుగఁ బ్రఖ్యాతినందిన తాళ్లపాక అన్నమాచార్యున కితఁడు రెండవ కుమారుఁడు. *

ఈకవీంద్రుఁడు, తన శ్రీవేంకటేశ్వర నీతిసీసశతకములోని కడపటిపద్యమునఁ దన్నుఁగూర్చి యిట్లు వివరించెను :—

"శౌరిహృషీకేశ నారాయణోపేంద్ర తాలాంకముఖనామ తాళ్లపాక
యన్నయాచార్యసుత తిమ్మయాహ్వయుండఁ బ్రణుతిఁజేసితి నహిగిరీశ్వరు
పద్యశతకను"

అని. ఇతనికిఁ బెక్కునామాంతరములున్నట్లు కన్పట్టెడు. †

ఇతఁడు ఈక్రిందిగ్రంథములు రచించినట్లు తెలియుచున్నది.

(1) శృంగారసంకీర్తనములు; (2) శృంగారదండకము; (3) వైరాగ్యవచనమాలికాగీతములు; (4) చక్రవాళమంజరి; (5) శృంగారవృత్తపద్యశతకము; (6) వేంకటేశోదాహరణము; (7) నీతిసీసపద్యశతకము; (8) సుదర్శనరగడ; (9) రేఫరకారనిర్ణయము; (10) ఆంధ్రవేదాంతము (ద్విపద); (11) హరివంశము; (12) ఆంధ్రభగవద్గీత.

పైఁబేర్కొన్నవానిలో—ఐదవది శ్రీవేంకటేశ్వరస్వామి శృంగారచేష్టలను వర్ణించుచు, వివిధవృత్తములలోఁ జెప్పఁబడిన శతకము. ఎనిమిదవది శ్రీమహావిష్ణుసుదర్శనచక్రము నభివర్ణించుచు రచింపఁబడిన రగడ.

ఈ పెదతిరుమలయ్య (తిమ్మయాహ్వయుఁడు) — శ్రీకృష్ణదేవరాయ, అచ్యుతదేవరాయ, సదాశివదేవరాయల సమకాలికుఁడు. ఇతఁడు శ్రీవేంకటేశ్వరస్వామియందుఁ బరమభక్తిగలవాఁడు. స్వామి

---

* జ్యేష్ఠుఁడు నరసింహాచార్యుఁడు. కాని, యితని సంతానముంగూర్చి యేమియుఁ దెలియవచ్చుటలేదు.

† 1. అన్నయతిమ్మనార్యుఁడు; 2. తిమ్మయ్య; 3. తిరుమలార్యుఁడు; 4. తిరుమలాచార్యుఁడు; 5. పెదతిరుమలాచార్యుఁడు; 6. పెదతిమ్మయ్య; 7. తిరుమలయ్యంగారు; 8. పెదతిరుమలయ్యంగారు.

కైంకర్యము నిమిత్తమనేక దానము లొనర్చెను. తిరుమలలోఁ బెక్కు నిర్మాణములు గావించెను. ఇతని దానధర్మాదిక శాసనములు క్రీ. శ. 1517 మొదలు, క్రీ. శ. 1546 వఱకుఁ గాన్పించుచున్నవి.

ఇతని గ్రంథములలో రెండు శతకములు (1. శృంగార వృత్తి పద్యశతకము — 2. నీతిసీసపద్యశతకము) ఉన్నట్లు తెలియుచున్నది. అందు మొదటిది దొరకలేదు. * రెండవశతకమునుగూర్చిమాత్ర మింఁచుక పరిశీలింతము :—

ఇందు సరిగా వందపద్యములున్నవి. "కలితలక్ష్మీశ, సర్వజగన్నివేశ, విమలరవికోటి సంకాశ వేంకటేశ"—అని యెత్తుగతిలోని కడపటి రెండుచరణములును మకుటముగా గ్రహింపఁబడినది. ఇదియే నీతిని బోధించు మొదటి సీసపద్యశతకమని తోఁచుచున్నది. దీని యొరవడి మీఁదనే తరువాతి సీసశతకములు ('రామలింగేశ',—'కుక్కుటేశ', —'వేణుగోపాల'—మొదలగునవి) వెలువడినవి.

ఈశతకమునందలి పెక్కుపద్యములు రాజనీతి ప్రబోధకములు. కవితావిషయమున తినతండ్రిగారి యడుగుజాడలలో, ఈశతకకర్త మెలఁగెనని రచనాపాటవము తెలుపుచున్నది. జానుఁదెనుఁగు పదములతో ముచ్చటగఁ గూర్పఁబడిన—యలఁతియలంతి మాటలలో సుగమముగఁ బద్యములు సాగిపోవుచుండును. భావానుగుణమైన పాదాంతమందలి విఱుపులు గడుంగడు సొంపునింపుచుండును.—మొత్తమున కీకవితాస్రవంతి నడ్డుకొను సుడిగుండములు. తాతిప్పలు, ముండ్లకంచెల దీవులు ఎక్కడనుగాన రావు. సందర్భానుసారముగ లోకోక్తులు జాతీయములు—మున్నగువాని ప్రయోగములయందీ తిరుమలాచార్యుఁడఖండుఁడు.

అన్నమాచార్యుని శతకములోవలెనే, యితని శతకములోను, కొన్ని నూత్న దేశ్యశబ్దములు కనఁబడుచున్నవి :—

(1) జాటుఁడు, (2) వేలాటము, (3) దూఱుముట్టు, (4) జాజర కాఁడు (మోసకాఁడు), (5) జంజరింపక, (6) ఉపమరి (ఉపాయశాలి),

* అన్నమాచార్యుని శతకమితని విరచితమే యని పూర్వపరిశోధకులు భ్రమించిరేమో !

(7) కాలది (పదాతి), (8) సుసరాన ?, (9) పెనపెట్టు, (10) కడెసంపము (కాటకము), (11) మణివము (మణిగము) [రూ]—(అధికారము), (12) జూబులు, (13) జీలువు (జీలుగు), (14) తాళిగోణము, (16) వెంగెము (వ్యంగ్యము ?),—(16) బచ్చెనగచ్చు, (17) దంచనపుగుండు (ఫిరంగిగుండు), (18) ప్రాంతపంచారము, (19) తుంగపోఁచ, (20) మాతెకంబము, (21) తుట్ట (ట్టె)లుగట్టు, (22) వాకట్టు, (23) వక్షితొడుగు, (24) నడుమంత్రము, (25) పిక్కన, (26) బడిగంట, (27) పోటజ్జ, (28) పొదపెట్టు, (19) * సంతబసివి, (30) మురియగోట్టు, (31) వహ

* 'బసివి'—ని చేయుట యనునాచారము, మైసూరు రాజ్యమునందలి పశ్చిమోత్తర మండలములలోను—, బొంబాయి రాష్ట్రమందలి కన్నడ జిల్లాలలోను, తెలుఁగునాఁటి, కర్నూలు—బళ్లారి, అనంతపురము ప్రాంతములలోను, శుద్రియవర్ణస్థులగు కొన్ని కులములలో—అనఁగా, బోయ, కురుబ, మున్నగువారిలోను, పంచమజాతులలోను బహుళముగానున్నది.

పుత్రసంతానములేనివారు అన్నదమ్ముల బిడ్డలనో, రక్తసంబంధమున్న ఆప్తబంధువుల బిడ్డలనో దత్తుచేసికొనుట హిందువులలో సాధారణముగ నుండు సనాతనాచారము. కావున ఆదత్తుఁడు తన పెంపుడుతండ్రి యాస్తికంతటికి వారసు (హక్కు) దారుఁడయి, ఆతని యంత్యక్రియలు చేయుట కధికారము గలవాఁడగును. ఆవిధముగ, ఆస్తి ఇతరుల బిడ్డలకు పోవకుండునట్లును,—తన సంతతికే చెందునట్లును—సొంతకూఁతులకే ఆహక్కు సంక్రమింపఁజేయు నిమిత్తము—ఆఁడుపిల్లను 'బసివి'ని చేయు—ఆచారము ఏర్పడినది. పుత్రసంతతి లేనివారు, పుత్రిని బసివిగాచేసి, ఆమెకు (పుత్రునకుండు) హక్కులు. అధికారములు సంక్రమింపఁ జేయుదురు.

పుత్రికాసంతానమమాత్రమే కలతండ్రి, తన కొమరితను దేవాలయమున కంకిత మొనర్చును. రజస్వలకాకముందే—కన్యగా ఉన్నప్పుడే, బాలికను బసివినిగావించుట పరిపాటి. దీనికొక తంతుగలదు. అకీతి, దేవాలయమున కంకితయగుకన్యకు 'బసివి' యను పేరు. ఇది కొన్ని కులములలో బాహాటముగా వాడుకయందున్న యాచారమయినందున, సాంఘికులు దీనిని దోషముగాఁ బరిగణింపరు, సరికదా; వారందఱువచ్చి, దగ్గఱనుండి, దీనిని జరుపుదురు.

బసివిగాఁ జేయఁబడినకన్యకు కులమున గౌరవహాని లేదు. అప్రతిష్ఠలేదు. ఆకన్య కులమును దక్కువదికాదు.

రజస్వలానంతరము మఱియొకతంతు జరుగును. ఇదియు, ముందు చెప్పినదియుఁ గూడ, దేవాలయమున దేవునిసన్నిధిలో నడుచును. ఈరెండవతంతు నెఱవేఱఁగనే, ఆచిన్నది దేవదాసివలె నిత్యసుమంగలి. వైధవ్యమనునది లేదు. రెండవతంతునకగు వ్యయమెల్ల — ఆమెనువలచిన — ఆమె వరించిన స్వకులజుఁడుగాని, ఉన్నతకులస్థుఁడుగాని—భరించును. అప్పటినుండి యొక సంవత్సరమువఱకామె యతని యధీనమున నుండును. ఉభయులకిష్టమగుచో, ఎప్పటియట్లు వారు కలిసియేయుందురు. లేనిచో

మానము, (32) గగ్గోలు, (33) గట్టితాళెము (తాళము ?), (34) ఉూట్కి, (35) అదువ.

ఈక్రిందివి సూత్రప్రాయములైన కొన్ని నీతులు :—

(1) సాలీనిపోఁగులా సంసారపాశంబులు ?—(2) నీటిపైవ్రాఁతలు, (3) తాఁజేసిన ధర్మంబు తలనుగాచు, (4) ఆసలువిడిచిన నటమటలే లేవు, (5) ఏమిచేయఁగవచ్చు సర్వేశ్వరాజ్ఞ, (6) దైవికంబేదియుఁదప్పింపఁగారాదు, (7) ప్రాయంబుగలనాఁడే పంతంబులీడేఱు, (8) బుద్ధిఁబదరక యెప్పుడు భూవిభుండు మెల్లనే బాహుశౌర్యంబు మెఱయుటొప్పు, (9) ఎంతమాత్రంబు తనశక్తియంతమాత్ర మరసియొనరించునాతండె యర్హుఁడెందు, (10) దుష్టబుద్ధులు మెలఁగెడిత్రోవ వలదు, (11) జ్ఞానంబు గలవానిజన్మంబు సఫలంబు, (12) చాడికాఁడగువాఁడు నటలెల్లబోధించు, (13) మత్తుఁడైయున్నఁ గార్యంబు మట్టువడదు, (14) అధముని మెఱయైన నాలకించుటయొప్పు, (15) చలముసాధింపనొల్లదు సభలలోన.

ఇట్టి బంగరుచక్కట్లు—ప్రతిపద్యమునఁ—బ్రతిపాదమునఁ బ్రకాశించుచున్నవి. చూపుటకోపిక లేమి నింతతో విరమింపఁబడినవి.

నానుడులకు సామెతలకుఁ గొన్ని మచ్చుతునుకలు :—

(1) జీలువు పెరిగిన మాలెకంబముగాదు, (2) కప్పకాటెంద్రైనఁ గలదని వింటిమే, (3) గాడిద యెఱుఁగదు గందంపువాసన, (4) చెద

---

ఆపదఁతి యింకొకని చేపట్టును. బసివి తనతండ్రియింటనే రెండవతింతు జరిగినపిమ్మటఁ గూడ వసించును. తన పోషకునిగృహమునకు వెడలనక్కఱలేదు. పోషకుఁడే యామె నివాసమునకు వచ్చుచుఁబోవుచు నుండును. అట నెవ్వరాతెని నడ్డుపెట్టరు. అది యగౌరవమనియు, ఎగ్గనియుఁ దలంపరు. బసివి, తనతండ్రి యింటనేయుండి, యతనికుటుంబాభివృద్ధికిఁ గొడుకువలెనే పాటుపడును. బసివికి బిడ్డలుగలుగుచో, ఆమెతండ్రి సంతతివారుగనే పరిగణింపఁబడుదురు—ఆమెకుఁ గుమారుఁడుదయించునెడల—ఆమెతండ్రి సంతతిని నిలిపినవాఁడయి, యాతనియాస్తికి వారసుఁడగును. అతనికిని, (అతనిఁ) గన్నతండ్రికి నేమాత్రము సంబంధము లేదు. బసివికిఁ గూఁతులుదప్పఁ గొడుకులుదయింపరేని, ఉదయించువఱకు—ఆకుటుంబపుఁ బెద్దకూఁతుండ్రను—బసువులనుగాఁ జేయుచుందురు. తనకుఁ గొడుకులు లేకున్నను, దన తనయాసంతానమునఁ గొడుకుజనించి, తన సంతతి నవిచ్ఛిన్నముగ నిలుపుటకొఱకే, తండ్రి తనకూఁతును బసివిని జేయుట. (తన కొమరితను) బసివిని జేసినపిదప—అతనికిఁ కుమారుఁడుద్భవమందునేని, ఆ—తిమ్మని

ంటునే నిప్పు సీమలోన, (5) పండునకేటికి సతులపొందు, (6) కల్ప వృక్షము నెంచి కలివెచ్చెట్టెంచుట, (7) కోరి దవ్వులఁ జూడఁ గొండలు నున్నన, చేరిదగ్గఱిసను జెట్లురాళ్ళు, (8) చేతఁబట్టినయట్టి జిప్ప లెక్కకు రాదు, (9) కొండతోఁ దగరు ఢీకొని మొంతతాఁకినఁ, దల్లనక్కలగుఁ గాక దానికేమి?, (10) కఱవదే యొకదోమ గంధగజము—కోరలదే విరులలోఁ దుంగపోఁచ.

కొన్ని అనుకరణాలు :—

1. "పదుగురాడినమాట పాటియై ధరఁజెల్లు, నొక్కఁడాడిన మాట యెక్కదెందు, నుఱక యుండినవాని నూరెల్లనోపదు"—

(ఆడిన, ఉండిన—అనునవి—ఆడు, ఉండు—అనుమార్పులతో వేమన పద్యములలోఁ గాన్పించెడు.)

2. "గాడిద యెఱుఁగదు గంధంబువాసన"

(ఇదియు వేమన పద్యాలలో నున్నది.)

3. "బలుమాలవాడలో బాపనిల్లుండునే"

("వెలివాడ నృటి బాపనిల్లు గలదా?" ధూర్జటి — శతక పద్యాని కనుకరణము.)

---

తోఁబాటు బసివియు — (తండ్రియాస్తికి వాటాదారయి — పంచుకొనును). తండ్రి మరణించిన, బసివిరే తండ్రికిఁ గొడుకువలె దహనాదిక్రియలు చేసి, యతని యాస్తికి భాగస్థురాలగును.

సాధారణముగ—ఆఁడుపిల్లలను బసువులుచేయు నాచారము వైష్ణవము స్వీక రించిన చతుర్థకులములలో విశేషముగనున్నది. ఈకులములవారు, కూఁతులను హనుమ ద్దేవాలయములకో, విష్ణ్వాలయములకో—తీసికొనిపోయి వానికంకితమొనర్తురు. ఈ తంతు జరిపినపిదప బసివికిఁ దప్తశంఖచక్రాంకితాలు చేయుదురు.

ఈయాచారము శైవులయిన లింగాయతులలోను గలదు; కాని చాలతక్కువ. వారు తమకూఁతులను మైలారులింగప్ప, బసవప్పదేవాలయములకు అంకితము సల్పుదురు. బసువులను గ్రామదేవతాలయాలకుఁగూడ సంకితముగానింతురు.

లింగాయతులలో, ఒకపెద్ద గ్రామాని కొక్కతే బసివియుండును. ఆమెను— 'పేఁటబసివి'—యందురు. 'పేఁటబసివి'—'సంతబసివి'—ఒకటే యగుదురేమో! పేఁటబసివి సంతలో దుకాణదారులయొద్దనుండి కొన్ని 'రుసుములు' వసూలు చేసికొను నలవాటుగలదు.

మొత్తముమీఁద—ఏబసివియైన నది యెవ్వరికిని జెందదు.

ఇట్టి యనుకరణములు శతకములన్నింటిలో సర్వసాధారణములుగాఁ గన్పట్టుచున్నవి.

ఈ తిరుమలాచార్యుఁడు తండ్రికంటెఁ గవితాప్రౌఢిమయందు మిన్నయని చెప్పఁదగును. ఇతని పుత్రులైదుగురలోను, నాలవయతఁడు—చిన్నన్న యనునామాంతరముగల—చినతిరువెంగళయ్య 'అష్టమహిషీకల్యాణము' — 'పరమయోగివిలాసము'—మున్నగు పెక్కు కృతులు రచించిన విఖ్యాతకవి. ఇతఁడా కాలములోని కవులకెల్ల మేలుబంతిగా నుండినట్లు ఆధారములున్నవి :—

తాళ్ళపాక చిన్నన్న దండెమీటులు గాచు గోమాంసభుగ్గను గ్గుణాగమములు

అని 18-వశతాబ్దిలో జీవించి—యుండి "శత్రుసంహారశతకము రచియించిన గోగులపాటి కూర్మనాథకవి యితనిఁ బేర్కొనుటచే —ఈచిన్నన్న మూఁడవసంకీర్తనాచార్యుఁడుగ శ్రీ వేంకటేశ్వరసన్నిధానమున భగవత్కైంకర్యము చేసినవాఁడని తెలియుచున్నది.

తరువాత 19-వశతాబ్ద పూర్వార్థమునఁ గార్వేటినగరసంస్థానాస్థానమున వెలసి, 'వేణుగోపాల' 'లావణ్య'—శతకములు వ్రాసిన పోలిపెద్ది వేంకటరాయకవియు—ఈ చిన్నన్ననుగూర్చి :—

"అల తాళ్లపాక చిన్నన్న గోముమైన తంబురదండెమఁ దంత్రులో నె"—

అని వాకొనుటచే, తాళ్లపాకవంశములో నితఁడు సుప్రసిద్ధవిద్వద్వతంసుఁడుగఁ బేరెన్నిక గన్నవాఁడనుట సుస్పష్టము.

కాని, పైకవులిరువురును — అతని సంగీతకళానైపుణ్యమును సూచించు (దండెమీటులు, తంబురదండె) విషయములనే తడవుటచే, నతని గానకళావైదగ్ధ్యము కూడఁ గవితకుఁ దీసిపోయినది కాదని యూహింప ననువగుచున్నది.

ఇఁక ఈతాళ్లపాక తిమ్మనార్యుని శతకములోని పద్యములు కొన్ని ఈక్రింద మచ్చునకుఁ బరిశీలింపఁదగును :—

"మాంధాత గొనిపోఁడు, మహిఁ జేరెఁడైనను, గొనిపోఁడు రారాజు కోలుంచు కొన్ని
నరుఁడు గొంపోవఁడు నవరత్నమొకటైన శిబి గొనిపోఁ డొక్క చిన్నమైనఁ
గొనిపోఁడు ఖచరుండు కొవునొక్కటియైన వస్త్రంబు గొనుచుఁ బోవఁడు యయాతి
గుడ్డిమొక్కటినైనఁ గొనిపోఁడు నహుషుండు గజము గొంపోవఁ డొక్కటినిసగరుఁ
డింక నేరికి సతములౌ, నేల సిరులు, తానొనర్చిన ధర్మంబె దక్కుఁగాక !"

"గడుసరిఁ బాటోటుఁ గష్టు వేడుకకానిఁ గలహాక్రియుఁడి హాస్యఁ గపటచిత్తు
ఘుంకరి జూదరి జూటు వనాచారి మునిముచ్చుఁ జలపాది ముడియవిడుపు
చిచ్చితు నపకారిఁ గుటిలాత్ము నవివేకిఁ గైలాటకానిఁ దక్కరిఁ దుటారి
వేఁటకానిఁ బిసాళి వెట్టి నప్పులపోతు మాయదారిని జారు మద్యపానిఁ
జేరవలవదు మఱి పొందు సేయఁదగదు మానవుఁడు కర్థితోఁ గలనాఁడు నైన ॥"

"ఏనుఁగు లావెంత, యిలమావటీఁ డెంత, తిమిరంబుబల మెంత, దీప మెంత,
ఘనసముద్రం బెంత, కర్ణధారకుఁ డెంత, బహుకాననం బెంత, పరశు వెంత,
పాలెను నీ రెంత, పర్వతంబని యెంత, హాయుఁ డెంత, మృదులపుష్పాస్త్ర మెంత,
భీకరఫణియెంత, వాకట్టువే రెంత, బహురాజ్య మెంత, భూపాలుఁ డెంత
యెవ్వరికి దొడ్డుకొంచెంబు లెంచరాదు, నడచు నిటువంటి వెల్ల నీనాటకములు"

"పెంచంగఁ బెరిగెనా పృథివిపైఁ గొండలు? విత్తిరా యడవుల వివిధగతులఁ?
గాలువ ల్వెట్టిరా ఘనసముద్రములకు? నేతంబు లెత్తిరా యేఱులకును?
మేఁతలు వెట్టిరా? మృగముల కెందైన? మఱి యీఁత నేర్పిరా మత్స్యములకు
బెండ్లిండ్లు సేసిరా బెరియంగఁ బక్షులఁ బూసిరా వాసన పుష్పములకు
నెవ్వ రెవ్వరిఁ బోషించి రెంచిచూడఁ దలఁప నీదైన రక్షకత్వమునఁ గాక"

"పరకాంతకై సింహబలుఁ డట్లు మృతుఁడయ్యె, రాజ్యలోభమునఁ గౌరవుఁడు పొలిసెఁ
బరుషోక్తులను శిశుపాలుఁడు హతుఁడయ్యె మహిని జూదమున ధర్మజుఁడు నొగిలె,
నలపాండురాజు వేఁటాడి శాపమునొందె, మును రావణుఁడు చలముననె సమసెఁ
గ్రూరదండంబునఁ గూలెను వేనుండు, చదిసెఁ బానమున రాక్షసగురుండు,
ఘనవివేకులు వీరల గతులు దెలిసి వ్యసనమును మాని నడువంగవలయు నిలను"

"ఆచారవంతుఁడౌ నతఁడె విప్రోత్తముం, డఖిలంబు రక్షించు నతఁడు రాజు,
వరుసతోఁ గార్యనిర్వాహకుఁడే మంత్రి, రుచిరవర్తనుఁడె పురోహితుండు,
గడుఁ బిట్టు దీవింపఁ గలవాఁడె సత్కవి, యమృతహస్తుఁడు వైద్యుఁ డఖిలదిశలఁ,
బోటజ్జ యెఱిఁగిన పురుషుండు దళవాయి, గణితజ్ఞుఁడగువాఁడు కరణ మరయఁ
బుధమరత్నంబులని యంద్రు బుధులు వీరి నితరులెల్లను సామాన్యు లెంచిచూడ"

"ధరలోన నావులు తమదూడలకు నెల్లఁ బెట్టెనా వాములు ప్రియముతోడ
బొక్కలు త్రవ్విచ్చి పోయెనా నక్కలు, తమపిల్లలకు నిరంతరమునుండ
దలఁచి దప్పికి నీళ్లు త్రావఁగూనలకును గట్టెనా చెరువులు గప్పలెల్లఁ
బ్రియముతో రతిసల్పి బిడ్డలఁగనుమని చెప్పెనా సింహంబు శిశువులకును
వట్టి భ్రమతలఁ దమ పుత్రవర్గమునకుఁ దల్లిదండ్రులు దలతురు ధనముఁ గూర్ప
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ విమలరవికోటి సంకాశ, వేంకటేశ ॥"

# కొండ రామకవి

(క్రీ. శ. 1550—75)

కొండరామకవి భారద్వాజస గోత్రుఁడు; కాత్యాయనసూత్రుఁడు. అప్పయామాత్యపుత్రుఁడు. (అమాత్యశబ్దమువలన నీతఁడు నియోగియై యుండవలెను). ఇతని కవితాగురువు నాగవేంకటరంగనాథుఁడు.

ఇతనిరచితమైన శ్రీ గవి రంగనాథశతకము క్రీ॥ శ॥ 1878 సం॥ లో వ్యవహారతరంగిణీ ముద్రాక్షరశాల (మదరాసు)లో ముద్రింపఁబడినది. అనఁగా డెబ్బదియైదేండ్లనాఁటి యచ్చుకూర్పు. ప్రత్యంతరము (లిఖితముద్రితములు) ఎంతప్రయత్నించినను దొరకినదికాదు. అందులకుఁ గారణ, మిది కేవలము వేదాంతవిషయములను బోధించుటచేతనేమో, ప్రజాబాహుళ్యమ్ములో నెక్కువ ప్రచారమునందియుండదు.

ఈరామకవి శతకారంభమును గావ్యలక్షణములతోఁ జేయుట శతకవాఙ్మయమున నే యొక నూతనమార్గముగాఁ గనఁబడుచున్నది. మొట్టమొదటి పద్య మిష్టదేవతావందనము :—

"శ్రీగణనాథునిఁ జిత్తాబ్జముననిల్పి ప్రణమిల్లి, బ్రహ్మను బ్రస్తుతించి,
శివవిష్ణుమూర్తులఁ జింతనగావించి భారతీ పద్మార్య భజనచేసి,
వ్యాసవాల్మీక్యాది వందన మొనరించి, శుక వామదేవుల స్తుతులొనర్చి
నాగవేంకటనాథనామ సద్గురువుల పాదపద్మములకుఁ బ్రణతిచేసి
కాళిదాసాది సత్కవి ఘనులఁ బొగడి శతక మొనరింపఁ బూనితి సరసమతిని"

"అని యిష్టదేవవందన మొప్పగాఁజేసి కుకవులనందఱఁ గొల్లఁదోలి
యే రచియించెడు నీకృతి నాలింపు"

ఈశతకమును దా నార్వీటితిరుమలరాయల ప్రోత్సాహముచేత రచియించిన ట్లీకవి చెప్పుకొన్నాఁడు.

"ఆర్వీటి వంశాబ్ధి యమృతకిరణుఁడయి శ్రీవిష్ణుకరుణచేఁ జెన్నుమీఱు
తిరుమలదేవాఖ్య నరపతివర్యుండు సుగుణుండు మన్మథసుందరుండు
హరిభక్తిప్రహ్లాదుఁడనవచ్చు, ధరణిని ఘనదానగుణమునఁ గర్ణుఁబోలు
విలువిద్య నేర్పున విజయుఁ డనవచ్చు నిరసించు, భూసురపూజలఁ బోలు ధర్మ,
భూమి దేవేంద్రుఁడనమించు పురుషవర్యుఁ డప్పురంబును బాలించు నమరలీల"

"శ్రీరంగధాముని సేవ కీర్తనములు మంగహారతుల్ రంగుమీఱఁ,
వనస్థేఁ బంచాత్నంబులు మఱియును శ్రీకరంబులు నైన సీసములను

రచియించి వేగమే రంగనాథోత్సవంబునఁ జదివి సాహసా సంతసించి
గావించి మన్నించి గాయకవిశ్రేష్ఠ రంగనాథుని చేత గద్యముగను
శతక మొక్కటి రచియింపు సాంద్రమతిని నవఁగ రచియింపఁబూనితి సత్ఘ రీతి"

ఈ తిరుమల దేవరాయలు—అళియరామరాయలతమ్ముఁడు. ఏరు శ్రీకృష్ణదేవరాయల యల్లుండ్రు. అతని కుమార్తెలలో తిరుమలాంబ యను మొదటియామె నళియరామరాయలును రెండవకుమార్తె యయిన వేంగళాంబను తిరుమలదేవరాయలును పెండ్లియాడిరి.

శ్రీకృష్ణదేవరాయలు క్రీ॥ శ॥ 1530 సం॥ లో మరణింపగానే యతని (సవతి) తమ్ముఁడయిన యచ్యుతదేవరాయలు సింహాసన మెక్కి 1542 వఱకు రాజ్యముచేసెను. అతనికుమారుఁడు వేంకట రాయలు—ముఖ్యమంత్రి యయిన సలకము తిమ్మయ కుట్రచేఁ జని పోయెను. ఆవల అచ్యుతరాయలతమ్ముఁడయిన సదాశివరాయలు—అళియ రామరాయని ప్రోద్బలసహాయములచే రాజయ్యెను. పేరునకు మాత్రము సదాశివరాయలు సార్వభౌముఁడు. కాని, సామ్రాజ్య వ్యవహారములన్నియుఁ దానే చూచుకొనువాఁడు. తుద కతఁడు సదాశివ రాయలను ఖైదుచేసి, తానే రాజయిపరిపాలించుచు, క్రీ॥ శ॥ 1565 లో జరిగిన తాళికోట యుద్ధమున మరణించెను. ఇతని తమ్ముఁడు (ఈశతక ములోఁ బేర్కొనబడిన వాఁడు) తిరుమలదేవరాయలుకూడ నీయుద్ధములో నొకకన్ను పోఁగొట్టుకొనెను. ఈవిషయము నొకకవి చమత్కార ముగా వర్ణించుచు నొక చాటువు చెప్పినాఁడు.

"అన్నాతిఁ గూడ హరుఁడగు, నన్నాతిని గూడకున్న నసురగురుండౌ,
నన్నా ! తిరుమలరాయఁడు కన్నొక్కటి లేదు కాని కంతుఁడు గాడే"

సదాశివరాయలీతిరుమలరాయల సాయముతో రామరాయల తరువాత మూడేండ్లు (1565—1568) పాలించెను. కాని తిరుమలరాయఁ డతనిని చంపి తానే రాజయినాఁడు.

విజయనగర వినాశనము కాఁగానే తిరుమలదేవరాయలు పెను గొండకు సదాశివరాయలతోఁ గూడ వచ్చి దానిని ప్రధాననగర ముగాఁ జేసికొన్నట్లు తెలియుచున్నది. సదాశివదేవరాయలతోఁ దుళువవంశ మంతరించి తిరుమలదేవరాయలతో నార్వీటివంశపరిపాలన మారంభమైనది.

అయినను విజయనగరము శిథిలమైన యొకరేండాదినలకైన నక్కడనే సదాశివరాయల పాలన సాగుచువచ్చిన సూచనలు కనబడు చున్నవి. ఈశతకకాలమునకు రాజవంశీయులందఱు పెనుగొండకు వచ్చి చేరినను వారికి 'విజయనగరసామ్రాజ్యాధీశు'లను పట్టము మాత్రము తొలఁగిపోలేదు. సదాశివరాయల మరణానంతరమే యీశతకము వ్రాయఁబడినట్లు.

"భూమి దేవేంద్రుఁడనమించు పురుషవర్యుఁ డప్పురంబును బాలించు నమలమతిని"

అని తిరుమలరాయఁడే దానిని పాలించుచుండిన ట్లేర్పడు చున్నది.

ఇంకొక విశేషమేమనఁ బెనుగొండ క్రొత్తగా ముఖ్యనగర మయినను దానిని వర్ణింపక యీకవి విజయనగరమునే తనశతకమునఁ బొగడినాఁడు. ఈశతకకవికాలమునకు—ననఁగా—16-వశతాబ్ద ముత్త రార్ధమునకు (మహమ్మదీయులదండగములకుఁ బాలుపడినప్పటికిని) ఆమహానగరము వన్నెతఱుగని స్థితిలోనే యుండినట్లు తెలియుచున్నది. ఈక్రిందిపద్యములు గమనింపుఁడు.

"ఏరచియించెదు నీకృతి నాలింపు, ఘనమగు కర్ణాటకాఖ్యదేశ
ప్రాంతపు శ్రీవిరూపాక్షుంబుచేరువ ధరణీలలామకు దర్పణంబో
యనఁగ విద్యానగర మను పురంబుండు, నద్దానిచెంతను సిద్ధమైన
తోయసంయుతమగునట్టి తుంగభద్ర వెలయు, న త్త్రిగవాహిని విమలచరిత"
"అప్పట్టణముచుట్టు నగడితకోటలభంగి పర్వతములు ప్రబలియుండు,
వాలి భండారంబు, మేలిమా మేగోట, తారపర్వతమును దనరుచుండు,
చింతామణిస్వామి సిద్ధాశ్రమంబును గపిలాశ్రమంబును గాంతి నమరు,
నవవిధ బృందావనంబులు విలసిల్లు, ప్రత్యక్షమహిమలు ప్రజలెఱుంగ,
నిట్టి పుణ్యాశ్రమంబుల నెలమిగాంచి, దక్షిణపుఁగాశి యని యది ధరణి నెగడు"
విను మప్పురమ్ముండు విధమెల్ల వివరింతు వివిధశృంగారముల్ వెలయునట్టి
కోటలు పేటలు నాటకశాలలు వాటంబులైన కవాటములును
వేదపారగులగు విప్రజనంబులు, పండితాళియుఁ గవుల్, పాఠకులును,
విలువిద్య లాఘవ వివిధ లక్ష్యంబులఁ బనుపడ సాధించు బాహుజులును,
హరునిసఖుమించువైశ్యులు, సరసజనులు వెలయ, విభవోన్నతిని మించు వేడ్కతోడ"

ఈశతకములో 101 సీసపద్యములున్నవి. ఎత్తుగీతిలోని కడపటి రెండుపాదములు మకుటము :—

"గజపురంధామ శృంగారకలితసోమ మంగళోద్దామ శ్రీగవిరంగధామ!"

ఇందుఁ జెప్పఁబడిన గజపుర మేదో తెలియుట లేదు. కాని గవి రంగధామునిగూర్చిమాత్రము కొంతవఱకు బోధపడుచున్నది.

ఈగవిరంగధాముని, గవిరంగస్వామి—గవిరంగవిఠలుఁడు—అనియు నందురు. ఈ 'గవి' యను ప్రదేశ ముత్తమపుణ్యక్షేత్రమని పెద్దలు చెప్పుదురు. అనంతపురంజిల్లా, హిందూపురం తాలూకా, 'చలి వేందల' యను గ్రామ సమీపములో నొక గుట్ట యున్నది. దానికే మత్స్యగిరి యను మఱియొక పేరు కూడ కలదఁట. ఆపర్వతిమందలి యొక గుహలో 'రంగనాథస్వామి' విగ్రహమున్నది. అక్కడనే శ్రీ సుబ్రహ్మణ్యస్వామి సన్నిధికూడ కలదు. యాత్రికు లహరహ మక్కడికి వచ్చుచుందురు. బహుశా యిదే కవి స్థల దైవతములు కావచ్చును. పైఁగా రాజధానియైన పెనుగొండ, (ఇదియు ననంతపురము జిల్లా లోనిదే) ఈక్షేత్రమునకు సమీపములో నున్నదని తెలియుచున్నది.

ఇఁక "గజపురంధామ"—యని కవిచెప్పిన గజపురమునుగూర్చి యించుక యాలోచింతము. తిరుమలదేవరాయల వంశీయులు కొంద ఱతని యనంతరము పెనుగొండను విడిచిపెట్టి చంద్రగిరి చేరి, దానినే తమ ముఖ్యపట్టణముగాఁ జేసికొనిరి. మహమ్మదీయుల విజృంభణము పెనుగొండప్రాంతములలో, నసఁగా దత్తమండలములలో సహింపరాని దయినది. అట్టియెడ రాయలవంశస్థులకు దాని నరికట్టునంత సమర్థత లేకపోవుటయే యందులకుఁ గారణము. ఆతరువాత విదేశీయులు వ్యాపారార్థము వచ్చి దేశములో విస్తరించిరి. అట్టి సమయములో చంద్రగిరి పాలకులయిన రాయల వంశస్థులు 'ఆనెగొంది' చేరి యక్కడ తమ పాలన సాగింపఁ బూనుకొనిరి. ఈయానెగొంది యనునది కన్నడ పదముగాఁ దోఁచుచున్నది. ఆపక్షమున 'ఆనె' అనునది 'గజ' శబ్దమునకు 'గొంది' అనునది 'గవి' పదమునకుఁ గన్నడమగునా? ఇది యరవమున 'ఆనెగవని' యగును. చెన్నపురిలోని "ఎలిఫెంట్ గేట్" 'Elephant gate' అను నింగ్లీషుపదమునకు 'ఆనెగవని' యని యఱవమునఁ బ్రచారముండుట మన మెఱుఁగుదుము.

శతకమకుటములో మొదట 'గజపురంధామ' యని, కడపట శ్రీ 'గవిరంగధామ' యని కవిచెప్పినాఁడు. ఈవిషయములో నింకను సమగ్రమయిన పరిశోధనలు జరుగవలసియున్నవి.

ఏది యెట్లయినను, కవికాలమునకు జీవించి, యతనిని ప్రోత్సాహ పఱచిన తిరుమలరాయఁడు పెనుగొండనే ముఖ్యనగరముగా నేలుచుండెను. కాని, చంద్రగిరి, ఆనెగొందులలో నతఁడుండినట్లు కాని, అక్కడ నుండి తన సార్వభౌమత్వము సాగించినట్లుగాని చరిత్రాధారములు కనఁబడుటలేదు. కనుక పూర్వోక్తమయిన గవి రంగధాముని క్షేత్రము పెనుగొండ ప్రాంతము (అనంతపురముజిల్లా) లోనిదే. అప్పటి కింకను విజయనగర సామ్రాజ్యాధిపత్యము తిరుమలరాయనికి (నామమాత్రముగ) నుండి యుండును. కనుక నే కవి యతఁడు వసించుచుండిన పెనుగొండ రాజనివాసస్థానమయినను బ్రఖ్యాతి చెందిన విజయనగర వైభవమునే తనపద్యములలో వర్ణించియున్నాఁడు.

ఇఁక శతకమునుగూర్చి, యందలి విశేషములనుగూర్చి కొంత పరిశీలింతము.

ఈశతక మంత ప్రౌఢమైనది కాదని ముందే చెప్పియున్నాను. అచ్చుతప్పులకంటె రచయిత చేసిన తప్పులే విశేషముగాఁ గనఁబడుచున్నవి. అవి వ్యాకరణమునకు సంబంధించినవి; కాని కవిభావము లద్భుతములుగా నున్నవి. మఱియు నరసింహశతకము (శేషప్ప కృతము) లో నీశతకపద్యముల యనుకరణము లున్నవి.

"సరసిజాపతి నీదుచరితంబు వర్ణింప నలినగర్భునకైన నలవికాదు,
నరుఁడ నేనిన్నెన్న దరమౌనె నాకును బంచకావ్యంబుల పఠనలేదు
అమరినైషధముల నభ్యసింపఁగలేదు ఆంధ్రగీర్వాణంబు లరయలేదు
గణ లక్షణ ప్రాసక్రమము తెలియఁగలేదు వేదపురాణము ల్వెదుకలేదు
గురుకృపాలబ్ధ వగముచే గూఢభక్తి నిన్ను నుతిచేయఁ బూనితి నీరజాక్ష!!"
—(గవిరంగ)

"పద్మలోచన సీసపద్యముల్ నీమీఁదఁ జెప్పఁబూనితినయ్య చిత్తగింపు
గణయతిప్రాసలక్షణము చూడఁగలేదు పంచకావ్యశ్లోక పఠనలేదు
అమరకాండ త్రయం బమరఁ జూడఁగలేదు శాస్త్రీయగ్రంథముల్ చదువలేదు
నీకటాక్షంబున నేరచించెదఁగాని ప్రజ్ఞ నాయదికాదు ప్రస్తుతింప"
—(నరసింహ)

"నేనెంత వేఁడిన నీకేలదయరాదు పలుకకుండెద వీవు పంతమటర
పంతగించుటకు నేఁబగనేమిచేసితి పాటించినాతోడఁ బలుకరాదె
పలికినంతనె నీకు భాగ్యంబుపోవునా పరఁగ నన్నేలుట భాగ్యమటగ"
—(గవిరంగ)

"నే నెంత వేడిన నీ వేల దయరాదు పలుమారు పిలిచిన పలుక వేమి
పలికిన నీకున్న పదవేమి పోవు, నీ మోమైన పొడచూప వేమి స్వామి" —(నరసింహ)

"నేత్రము ల్నీమూర్తి నెమ్మిఁ జూడఁగఁ గోరు వీనులు నీకథల్ వినఁగఁ గోరు
ఘ్రాణంబు వనమాల గంధమబ్బఁగఁ గోరు జిహ్వ నీభజనంబు చేయఁ గోరు
కరములు నీపాదకమలపూజలు గోరు దనువు నీసంస్పర్శఁ దవులఁ గోరు
చరణము ల్నీచుట్టు దిరుగఁ గాఁ గోరును మనసు నీధ్యానంబు మరగఁ గోరు"
—(గవిరంగ)

"వదనంబు నీనామభజనఁ గోరుచునుండు జిహ్వ నీకీర్తనల్ సేయఁ గోరు
హస్తయుగ్మంబు నిన్నర్చింపఁ గోరును గర్ణము ల్నీమీఁది కథలుగోరు
తనువు నీసేవయే ఘనముగాఁ గోరును నయనము ల్నీదర్శనంబుఁ గోరు
మూర్ధంబు నీపాదములు మ్రొక్కఁగాఁ గోరు ఆత్మ నీదై యుండు నరసిచూడ"
—(నరసింహ)

"నీ మేనికాంతికి నీడుగా గర్వించి సరిగాక మేఘంబు సనియెదివికి,
నీ నెమ్మొగంబున కేను నీడనిపొంగి సరిగాక పద్మారి సన్నమయ్యె
నీగళంబునకును నేను సాటినటంచు సరిగాక చిందంబుకరధిచేరె
నీలోచనములకు నీడని జలజముల్ సరిగాక వేగను సరసిఁ జొచ్చె"

"నీశ్రోత్రముల మేము నిరసింతుమని మించి శ్రీకారములు వ్రాఁతఁ జిక్కువడియె
నీఘ్రాణమున కేము నెతి సమంబనివచ్చి చెదరి చంపకములు చెట్లకెక్కె
నీదు చెక్కిళ్లకు నీడుగా నేరక దారువు జొచ్చెను దర్పణంబు" —(గవిరంగ)

విష్ణుదేవుని శరీరావయవ వర్ణనములు పైరీతి నీకవి రెండు పద్యములలోఁ జేసియున్నాఁడు. వాని ననుకరించుచు నరసింహశతక కర్త బహులౌక్యముగా నొక్క పద్యములో నిమిడ్చినాఁడు.

"జీమూతవర్ణ నీమోముతో సరిరాక కమలారి యతికళంకమునఁ బడియె
సొగసైన నీనేత్రయుగముతో సరిరాక నళినబృందము నీళ్లనడుమఁ జేరె
కరిరాజవరద, నీగళముతో సరిరాక పెద్దశంఖము బొబ్బపెట్టఁ దొడఁగె
శ్రీపతి నీదివ్యరూపుతో సరిరాక పుష్పబాణుఁడు నీకుఁ బుత్రుఁడయ్యె"
—(నరసింహ)

"దండంబు నీకును చండపరాక్రమ దండంబు నీకు నుద్దండభీమ" —(గవిరంగ)

"దనుజసంహార చక్రధర నీకుదండంబు నిందిరాపతి నీకు వందనంబు"
—(నరసింహ)

"రాతి నాతిగఁ జేయు రమణి నీకేమిచ్చె, కుబ్జ నీకేపాటి గుబ్బలిడె,
నంబరీషుం డెట్టి యధికారమొసఁగెను, గుహుఁడు నీకేపాటి గొడుగులిచ్చె,
మద్దులు నీకెంత మాన్యంబొసంగెను గజరాజు నీకేటి కట్నమిచ్చె" —(గవిరంగ)

ఇట్టి పద్యము మఱియొకటియుఁ గలదు. దీని ననుసరించిన నరసింహ శతకపద్యము :—

"ప్రహ్లాదుఁ డేపాటి పైఁడికానుకలిచ్చె మదగజం బెన్నిచ్చె మౌక్తికములు
నారదుం డెన్నిచ్చె నగలు రత్నంబు లహల్య నీకేయగ్రహారమిచ్చె
పంచపాండవు లేమి లంచమిచ్చిరి నీకు ద్రౌపది నీకెంత ద్రవ్యమిచ్చె"

—(నరసింహ)

ఇట్టి భావసాదృశ్యయుతపద్యములు రెండుశతకములలోను చాల కనఁబడుచున్నవి. అంతియకాక యుడిదమునూరకవి రామలింగేశశతకమునుండియు, నరసింహశతకకవి కొన్ని యనుకరణములను గ్రహించి యున్నాఁడు. నరసింహశతకకవిచరిత్ర విమర్శనములో నీవిషయమును విపులముగాఁ జర్చించియున్నాను. కనుక నీముగ్గురు కవుల జీవితకాలముల ననుసరించి, గవి రంగనాథశతకము మొదటిదిగను, రామలింగేశ శతకము రెండవదిగను, నరసింహశతకము మూడవదిగను స్పష్టమగుచున్నది.

ఈ 'గవిరంగనాథ' శతకములోని 101 పద్యములను విషయ విభాగములక్రింద వేఱుపఱచిన నీదిగువ సూచించినరీతిగా పద్యసంఖ్య లేర్పడఁగలవు :—

| | | | |
|---|---|---|---|
| 1. | పీఠికాపద్యములు | ... | 1—6 |
| 2. | విష్ణు స్వరూప వర్ణనము | ... | 7—11 |
| 3. | దశావతారవర్ణనము ఇందు 14-వ పద్యము నుండి 21-వ పద్యమువఱకు రామాయణకథ | ... | 12—22 |
| 4. | కేశవాది చతుర్వింశతి నామములు క్రమముగాఁగలవి | ... | 23—28 |
| 5. | శిరాది పాదాంత విష్ణువర్ణనము | ... | 29—33 |
| 6. | విష్ణు ప్రభావవర్ణనము | ... | 34—39 |
| 7. | భక్త రక్షణము | ... | 40 |
| 8. | శ్రీరామచరిత్ర | ... | 41 |
| 9. | శ్రీకృష్ణచరిత్ర | ... | 42—48 |
| 10. | (దశావతారేతర) దత్తాత్రేయాద్యవతారవర్ణనము | | 49—50 |
| 11. | కవీంద్ర హృదయని వేదనము | ... | 51—64 |

12. వేదాంతము—ఇందచలస్వరూపము. పాంచ భౌతికవివరణము, సాంఖ్యము, శుశ్రూషావిధానము, హృదయహంసనటనఫలితము, నాద బిందుకళాస్వరూపములు, గురుప్రభావము, మాయాస్వరూపము, ఇంద్రియస్వభావము, అచలయోగము, అద్వైత సిద్ధాంతము, మొదలగునవి. ... 65—101

ఈశతకములో కవి వివరించిన చతుర్విధశుశ్రూషలు గమనింపఁదగినవి :—

"నాల్గుశుశ్రూషల నయముగ వేర్వేఱ వివరించి తెల్పెద విమలహృదయ
కోరినద్రవ్యంబుఁ గూర్చియొసంగుట యాత్మశుశ్రూషనా నార్యులంద్రు
పరఁగ నభ్యంగన పాదసేవలొనర్ప నది యంగశుశ్రూష యనఁగఁ బరఁగు
పదపడి వనమరపాలనంబొనరింప నది స్థానశుశ్రూష యంద్రు బుధులు
తల్లిదండ్రియు దైవంబు దాత ధనము పరమగురుఁడంచు సేవింప భావమంద్రు"

కవియొక్క వేదాంత పరిజ్ఞానమున కొక్కపద్యము మచ్చుకుఁజూపుదును.

"ఒండవలంబించి యొనరి రెంటిని నిల్పి మూఁటిని విడనాడి ముదముఁజెంది
నాల్గింటి గుదియించి నయముగా నేనిఁటి బాఱనీయక లోనఁ బదిలపఱచి
నాఱిఁటి నడఁగించి యేఁడు పాఱఁగఁద్రోలి యాఱిటిపై నెక్కి యవలఁజేరి
ఏటిని గేడించి, యెనిమిది తెగటార్చి తొమ్మిది వాకిండ్లఁ ద్వారగదాఁటి,
పదిటి నడఁగించి, పదునొకం డెడను దెలిసి పరఁగ ద్వాదశమెఱుఁగ సిధ్ధుఁడగును॥"

ఇతని శబ్దాలంకారప్రియత్వమున కొక్క పద్యముదాహరణము.

జ్ఞానరా, ముక్తినిధానరా యాత్మసంధానరా యమల ప్రధానరార,
కాంతిరా కమలాలదొంతిరా పువ్వులబంతిరా ఘననీలకాంతిరార
సొమ్మురా యాణిముత్యమ్మురా మూర్తివంతమ్మురా మునులపదమ్మురార,
ముద్దురా, మానులపద్దురా, పాపాలహద్దురా, హంతకజిద్దు (త్తు) రార,
సద్దుసేయక నన్నేలు మొద్దికగను కద్దులేదనవలవ దీప్రొద్దునీవు"

కవిత్వము లాక్షణికముగా లేకపోయినను, ధార ధారాళమైనది. వ్యాకరణ దోషములు ఛందోదోషములు కనబడుచున్నవి. ఇతని కఖండయతులు సమ్మతమైనవే, కొన్నిచోట్ల గణభంగములున్నను, నవి కవికృతములుగాక, ప్రతులు వ్రాసికొనినవారి వని చెప్పుటకు సందేహము లేదు. వేదాంత జిజ్ఞాసువులు, సాంఖ్యయోగప్రియులు చదువఁదగిన శతకమియ్యది.

—◆◆—

# వేమన

(క్రీ. శ. 1565—1625)

"విశ్వదాభిరామ వినురవేమ" అని పద్యాలకు మకుటముఁ జేర్చుకొనుటచేత,—కర్తృత్వమును గూర్చినశంక యుపాస్తమయినది. కాని, యతని కుల, స్థల కాలాదులనుగూర్చి కొంచెము చర్చింపవలసిన యవసరము లేకపోలేదు.

"వేమన రెడ్డివంశీయుఁడని, దత్తమండలములలోని కటారుపల్లెలో మరణించెననియుఁ, గొండసీమనివాసియనియుఁ జరిత్రకారుల యభిప్రాయము. ఈకవి క్రీ॥ శ॥ 1540 మొదలు 1600 లోగా నుండియుండెను"—అని వావిళ్లవారి శతకపీఠిక. కాని, పైవానికిఁ దగిన యాధారములు చూపలేదు.

ఈసందర్భమున మన తెలుఁగుభాషలోఁ బరిచితి గడించి — వేమనపద్యముల నాంగ్లములో ననువదించి ప్రకటించిన సి. పి. బ్రౌనుదొరగారు—అతని దేశకాలాదులం గూర్చి—వ్రాసిన యంశములు సహితమించుక పరిశీలించుట యుక్తము.*

ఇతనికులమునుగూర్చి చారిత్రకవిమర్శకులలో భేదాభిప్రాయములు ఏమాత్రములేవు. కాలమునుగూర్చికూడ, దరిదాఁపుగా నందఱు నేకీభవింతురు. ఎటుతిరిగి, స్థలమునుగూర్చి భేదములు కనిపించుచున్నవి.

ఇతని జన్మస్థలముగా బ్రౌనుదొర పేర్కొన్న 'చిత్వేలి' — నిర్యాణస్థలముగా వావిళ్లవారు పేర్కొన్న 'కటారుపల్లె'—ఈరెండును

---

* "He was by birth a 'Capu' or farmer. Some assert that he belonged to the family of Anavema Reddy, a chief in the Candarnul (or Curnool) country; and the brother of the Poet is said to have commanded the fort of Gandicota. Some believe him to have been a native of Cristipadu in Candarnul: others of Inaconda in Guntur; and I have also heard that he was born at Chitvel; but I have had opportunities of enquiring at all these places and have, afterall, gained no information whatever. Yet his dialect in a few passages renders it probable that Vemana was a native of the South Western Parts of Telingana, and it is believed that he lived about the beginning of the seventeenth century of our era.

కడపమండలమునకుఁ జెందినవే. కనుక నితఁడు కడపజిల్లావాఁడనుట సమంజసము. కాని, యితని నివాసస్థలము నాపిల్లవారు పేర్కొన్న "కొండసీమ" యనునది యెక్కడనున్నదో. కొండవీడుగా నైనను చూపలేదు.

వేమన—యోగియైన తరువాత "గ్రామైకరాత్రం, దినమేక భుక్తం"—గా దేశసంచారము చేసి యుండవచ్చును. అప్పుడు, తెలంగాణములోను, దత్తమండలములలోను నతని యుపదేశప్రచారము బాగుగా సాగియుండవచ్చును. దాని ఫలితముగా నతనిశిష్యవర్గము. బ్రౌనుదొర చెప్పిన క్రిష్టిపాడు, వినుకొండ గ్రామాలలో విస్తరించి "వేమనమఠములను స్థాపించియుండును. అట్టి స్థలములలో వేమన నెలల కొలఁది శిష్యజనోద్ధరణార్థము వసించినంతమాత్రాన—నవి వాసస్థలములని చెప్పుటకు వీలుండదు.

"కటారుపల్లె"లో నేఁటికిఁగూడ వేమనసమాధి, యతనిమఠము ఉన్నవి. కాని, యీకటారుపల్లె వేమన అసలువేమన కాఁడని శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.*

కాని జనవాక్యముమాత్రి మాద్వైవిధ్యమునకు భిన్నముగ నున్నది. ఏఁటేట వేమన సమాధియయిన దినమునఁ గటారుపల్లెలోఁ బెద్దయుత్సవము జరుగుట — యాత్రికులు వచ్చుట — మొక్కులు చెల్లించుట—సంప్రదాయముగా వచ్చుచున్న యాచారము. చిత్తూరి ప్రాంతాలలోఁగూడ వేమనశిష్యపరంపరలోనివా రిప్పటికి నున్నారు.

విషయ మిట్లుండ సామాన్యుఁడగు వేమన నామాంచితుఁ డెవఁడో. కటారుపల్లె వాఁడేయయి, యతనికే యింతటి మహోత్సవ మేఁటేట జరుగుచోఁ, గేవలము దన సిద్ధాంతప్రచారము నిమిత్తము, విసుగువిరామములేక — తెలంగాణా, దత్తమండల ప్రాంతాలలో సంచారము సేయుచుండిన వేమనపద్యకర్త—గతి ఏమయియుండవలెను. అతనికిఁగూడ నిట్టిసమాధియుఁ, బూజాపురస్కారము లెక్కడనేని ఉండవలెనుగదా! అట్టిది యున్నట్లింతవఱ కేపరిశోధకులును

* చూడుఁడు :—

శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి— వేమన (రెండవప్రచురణము)—పుటలు:— 36 నుండి 42 వఱకు.

సూచనగానైనను దెలుపలేదు. ప్రఖ్యాతుఁడగు (అసలు) వేమనకు లేనిమర్యాదలు, ఈకృతక వేమనకుఁ గలిగినవనుట వింతలలోవింత!

కేవలము తలతోఁక లేని పుక్కిటిపురాణము చూపుచుఁ బ్రాంతీయాభిమానముతో—నెల్లూరు (కొండపేట) రెడ్లవంశమునకుఁ జెందిన వేమనపద్యకర్తకాక మఱియొక వేమన (కటారుపల్లెలోని యతఁడు) కడపమండలమునఁ బ్రఖ్యాతివహించిన యతఁడుండెననుట (నల్లచెఱువు పూజారి చెప్పినను, కటారుపల్లె ధర్మకర్త చెప్పినను) విశ్వాసార్హము గాదనియే నాయభిప్రాయము. వారుచూపు తాటాకులగ్రంథము అంతకంటె నమ్మఁదగినదికాదు. ఈవిషయమును శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారును సమ్మతించుచున్నారు.

ఇప్పటికిని నెల్లూరులోను—దత్తమండలములలోను తెలంగాణా ప్రాంతములలోను నివసించు వేమన శిష్యులెల్లరు కటారుపల్లె వేమయ్యయన్న—(వేమనపద్యాలు వ్రాసిన) వేమన్న అనియే భావించువారు. కావున వేమనభక్తులైన వీరెల్లఁ దమతమ యూళ్లలోఁ దమగురువుపేర మఠములు (శ్రీరామభజన మందిరములవలె) నిర్మించికొని వసించుచు, ఎక్కువకాలము గ్రామసంచారములతోఁ గడపుచుఁ బొట్టపోసికొనుచుందురు.

అట్లు వీరేఁగుగ్రామములలో వీరి కుత్సవములు ఊరేగింపులు జరుగుటయుఁగలదు. వీరు తమ ప్రభావమును అగ్గిత్రొక్కుట మొదలగు నసామాన్యకార్యములతోఁ జూపుట సర్వసాధారణము.

రాత్రికాఁగానే దివ్వటీలిరువంకల బారులుతీరి నడుచుచుండ, తుడుములు తప్పెటలు మొదలగువానిరణగుణధ్వనులతో వేమనమెఱవణి, యూరి చివరి యేదేని దేవాలయమునుండి బయలుదేఱును. ఆవెనుక ఇత్తడి కట్ల చోపుదారులు, నెమలికుంచెలు పట్టుకొనినవారు, ధూపములు వేయువారు, నడుతురు, చివర నొక బక్కగుఱ్ఱముమీఁద—పచ్చనిఅంగరఖా, పెద్దతలగుడ్డ—కొన్నిపూసలదండలు—విభూతి ధరించిన పురుషవిగ్రహము కనఁబడును. అది యూరుచుట్టుకొని, మరల దేవాలయముచేరఁగానే—అంతకుపుందే — యక్కడ సిద్ధము చేయఁబడిన యగ్నిగుండమున వేమయ్యగారి బక్కగుఱ్ఱము వాద్య

శబ్దములకుఁ దగినట్లు లయతప్పకుండ 'కదం' త్రొక్కుటతో నుత్సవము సమాప్తమగును.

ఇట్టి 'వేమయ్య'లు— వేమన శిష్యపరంపరలోనివారు చాల మంది యిప్పటికిని కడప కర్నూలు మండల గ్రామములలో సంచారములు చేయుచు యాచనతో జీవించుచున్నారు. తప్పక పీఠలో నొక్కొక్కరికి నొక్కొక్క బ్రక్క గుఱ్ఱముండును. వానికి గడ్డి, తామే మైదానములకు వెడలి— వేమయ్యలు— సేకరించుకొనివచ్చి— తెనాలి రామలింగనివలె— వానిని పెంచుచుందురు— అవి పండుకొనిన లేనవు: లేచిన నడువవు; నడచినను నాలుగడుగులు నాగవు; మరల పండుకొనును. వేమయ్య దిగివచ్చి, తోఁకపట్టుకొని, యదలించి లేపునప్పటికి బ్రహ్మప్రళయము. మఱి దానిమీఁద స్వారిచేసికొనుచు, గ్రామములో ప్రవేశించకున్న వేమయ్య ప్రతిష్ఠకు లోపము. ఈకథ చాలదూరము ఇట్లు పెంచుట దేనికని విసుగొందుదురేమో పాఠకులు. ఇదిగో— "ప్రకృత మనుసరామః"

నాప్రత్యక్షానుభవమునుబట్టి— కడపమండలవాసుల జనశ్రుతిని బట్టి— కతారు పల్లె మఠమునుబట్టి — వేమన్న కడపమండలస్థుఁడే యనుటలోను; నతని శిష్యవర్గము నేఁటికిని పరంపరగా గురువాక్యమును బాటించుచున్నారనుటలోను నెవ్వరికిని సంశయ ముంపనక్కఱ లేదు. వేమన మఠములకు (త్రిమతస్థుల మఠములవలె) ఆస్తిపాస్తులు లేవు. శిష్యులు "కరతల భిక్షు స్తరుతలవాసః" అను గురువుగారి జీవిత విధానము నక్షరాలా అనుసరించుచున్నారు.

కొండవీడు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యములు పదునైదవ శతాబ్ద ప్రథమపాదముననే యస్తమించినవి. కొండవీటి యన వేమారెడ్డి వంశము వాఁడగు రాచవేమారెడ్డి యనంతర మారాజవంశమువారు పడమటిసీమకు వలసివచ్చినారనుట కాధారములుగలవు.

అట్లు వచ్చిన యీరాజకుటుంబములోనివాఁడే మన వేమన. కాని రాజ్యభ్రష్టులైన కారణమున— వారిప్రఖ్యాతి వేమననాఁటికి అడుగంటి నది. కావున వేమనతండ్రి యెవఁడో చెప్పఁజాలము. కాని రాచవేమన తమ్ముఁడుమాత్రము గాఁడు. అతని జ్ఞాతులలో నెవనికేని ప్రపౌత్రుఁడు

కావచ్చును. రాచవేమనకును యోగివేమనకు నడుమ మూఁడుతరముల అంతరమున్నది.

ఈసందర్భమున, బ్రౌనుదొరగారి వాక్యములు, కటారుపల్లెలోని నిదర్శనములు, వేమనశిష్యుల ప్రచారములు కూడ వేమన నివాసస్థలము దత్తమండలములలో—తత్రాపి—కడపమండలములో నిశ్చయముగా నుండియుండవలయునన్న వాదమునకే యుపబలకములుగా నున్నవి.

అసలువిషయము లిట్లుండగా, వావిళ్లవారి "వేమనపద్యములు" అనుగ్రంథములోని శ్రీశేషాద్రిరమణకవుల "వేమనజీవితము"—అను నుపోద్ఘాతమున నీక్రిందివిధముగా వ్రాసిరి.

"ఊరు కొండవీడు నునికి పశ్చిమవీధి మూఁగచింతపల్లె మొదటియిల్లు
ఎడ్డె రెడ్డి కులమదేమని తెలుపుమ"

ఈపద్యమునవలన వేమన జన్మస్థానము వంగవోలు తాలూకాలోని మూఁగచింతపల్లి యనియుఁ, గొండవీడు పిదప నివాసస్థలమనియుఁ దెలియుచున్నది—అని యొకవంక వ్రాయుచు నొకపుట దాఁటగనే—"వేమనకవి దత్తమండలములోనిదగు కదిరి చెంతఁ గల కటారుపల్లెలోఁ బుట్టి, యచటనే మరణించెనని తెలియుచున్నది." అని మఱియొకవంక లిఖించిరి. ఈయభిప్రాయ ద్వైవిధ్య ప్రకటనచే స్వవచన వ్యాఘాత మేర్పడినది. వీనిలో నేదినిజము?—

ఇది యిట్లుండగా వేమన కొండవీటిరెడ్లవంశమునకు సంబంధించినవాఁడు కాఁడనుటకు శ్రీశేషాద్రిరమణకవులీ "వేమనజీవితము" లోనే యొకవింతవాదమును లేవదీసిరి—చూడుఁడు :—

"ఈకవి వంశీయులమని చెప్పుకొను కటారిపల్లె ప్రాంతస్థులు పాకనాటిరెడ్లగుటవలన వేమనయుఁ బాకనాటిరెడ్డియనియు, నుత్తరవయస్సులోఁ గటారుపల్లెలో ప్రసిద్ధిపొందెననియు నిశ్చయింపవీలగుచున్నది. . . వేమన కొండవీటిరెడ్డిరాజులకుటుంబములోనివాఁడు కాఁడు. కొండవీటిరెడ్డిరాజులు పంటరెడ్లు. వేమనకవిపాకనాటిరెడ్డి. కాన బాంధవ్యసంబంధముండఁజాలదు."

ఇందలి సత్యాసత్యములనుగూర్చి యించుక చర్చింతము — లోకములో మహాపురుషుఁడుగా గణుతికెక్కినవాఁ డెవఁడైన నుండినఁ

నమువాఁడుగాఁ బ్రకటించుకొనుట ప్రతిమానవునికి సహజము. కవులు కూడఁ బ్రసిద్ధిపొందినవారైన నీయవస్థ తప్పదు. శ్రీవేమకూర వేంకట కవి రామరాజభూషణుఁడు మొదలగువారి కులములవిషయములో నిట్టిరగడ లిదివఱకు జరిగినవికదా! కులములకు కులముఁజే మార్పు విమర్శకుల కొకకులములో నుండు నవాంతర శాఖాభేదములకు మార్పు తెచ్చి, తమయభిప్రాయమున కభిన్నముగ వ్రాయుట దోషమనిపించ దేమో! కనుక దీనినిఁబట్టి కటారుపల్లెప్రాంతీయులైన పాకనాటిరెడ్లు "వేమన్న"ను దమవాఁడనుకొనుట న్యాయమే!—వేమన పంటరెడ్డి ప్రభువులవంశమునకుఁ జెందినవాఁడని పరిశోధకులలోఁ జాలమంది చెప్పిన విషయము సత్యమే. సత్యదూరమైన స్వాభిమానజనితప్రవాదము ప్రమాణము కాదు ; కాఁజాలదు.

ఇఁక "శతకకవులచరిత్ర"లో వంగూరుసుబ్బారావుగారు వేమన స్థలవిషయమునుగూర్చి చర్చించుచు పై "ఊరుకొండవీడు" అను పద్యమునే యుదాహరించి, దానికిఁ బాఠాంతరముగా నుండుపద్యమింకొకటికూడ నీక్రింది విధముగా నుటంకించిరి.

"ఊరుకొండవీడు నునికిపశ్చిమవీధి మూగచింతపల్లె మొదటియూరు
అరసి చూడవలయు నదె ముక్తి శివుఁడయా"

ఈపద్యము నాధారముగాఁ జేసికొని శ్రీసుబ్బారావుగారిచ్చిన యభిప్రాయఁగూడ గమనింపఁదగినదే :—"వేమన్న స్పష్టముగఁ దనది కొండవీడని చెప్పుకొనినను, సమాధి కటారుపల్లెలో నుండుటచే నీతఁడు కడపటిదినములు కటారుపల్లెలో గడపెనని కొందఱూహించుచున్నారు. ఇది సత్యమే కావచ్చును."

శ్రీసుబ్బారావుగారిచ్చిన పాఠాంతరపద్యమే వేమనది. శ్రీశేషాద్రిరమణకవులు చెప్పినది పండితులు పరిష్కరించిన కృతకపద్యము. చాలప్రతులలో (అముద్రితములలోఁగూడ)—"ఎడ్డెరెడ్డికుల మదేమని తెలుపుదు"—అనుపాదమునకు బదులుగా "అరసిచూడవలయు నదె ముక్తి శివుఁడయా"—యను పాఠమే కనిపించుచున్నది. దీనినిఁ బట్టి శ్రీ సుబ్బారావుగారు "వేమన్న స్పష్టముగఁ దనది కొండవీడని చెప్పికొనినను"—అని యెట్లు వ్రాయఁగలిగిరో వారికే యెఱుక.

ఏలయనఁగా, పైపద్యమున వేమన తనవాసస్థలమునుగూర్చి కాక, యేదో గుప్తభావమును సాంకేతికముగా నిమిడ్చియున్నాఁడు. నాకు చూడగా—దాని భావ మీక్రిందిదని తోఁచుచున్నది.

వేమన (శివ) యోగిగా చాలపద్యములవలన తెలియుచుండుట చేత :—'కొండవీడు' — అనఁగా కైలాసమని ; అది తన్నిర్దిష్టమైన "ఊరు"—అని ; ప్రస్తుతము తన "ఉనికి" దానికి (వెనుకటి—గోచరింపని) "పశ్చిమవీధి" (నరలోకము) అని ; ఆయూరిని పొందుటకు మొదట మూగచింత (మౌనధ్యానములు) అను పల్లెనుండి పోవలెనని యతని యభిప్రాయమైయుండును. తక్కిన మూఁడవపాదములోని ముక్తిని తరువాత కనుగొనవలెనట. — సులభగ్రాహ్యము. ఊళ్ల పేర్లతోఁ దనగుప్తభావమును గూర్చి యేదియో వేమన్న చెప్పగా, దానిని పట్టుకొని, వేమన్నయే స్పష్టముగాఁ దనది కొండవీడని చెప్పెననుట భ్రమప్రమాదజనితము. "స్వదేశం భువనత్రయం" అను స్థితిలో నుండు యోగికి 'కొండవీడు' — మూగచింతపల్లె — జ్ఞప్తిలోనున్న నగ్గరి ప్రాంతములైనఁ గావచ్చునుగాని, వానిమీఁద (తనజన్మస్థానము లైనా) అభిమానముమాత్ర ముండదు.

మఱి మతికిఁదోఁచినట్లంతయు మన మర్థములు లాగవచ్చును. కాని వేమన భావమదే యని నిర్ధారణ మేమున్నది? యన్న, సమాధానము:—వేమనపద్యములకుఁ బీఠిక వ్రాసిన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి వంటి విద్వదగ్రగణ్యుల వాక్యములఁ జూచిన తెలియఁగలదు.*

ఇఁక వేమనకాలమునుగూర్చి యించుక పరిశీలింతము. ఈ విషయమందు శ్రీవంగూరిసుబ్బారావుగారు, శ్రీశేషాద్రిరమణకవులు చాలతికమకలుపడిరి. కవిస్తుతి పద్యములలో నితరకవులు కొందఱు వేమనను బేర్కొనిరని, యాపద్యముల నుదాహరించి, వారికి ముందు వానినిగా వేమనను నిర్ధారణచేయుచు నతనికాలమును క్రీ॥ శ॥ 1540 ప్రాంతమునకుఁ దీసికొనివెళ్లిరి. బ్రౌనుదొరగారు వేమన 17 వ శతా

* "ఇతని పద్యములలోఁ గూటములనఁబడు భావగుప్తము లనేకములు గలవు. ఏ యుద్దేశములతో నివి వ్రాసినాఁడో వచింపలేము... అతని కూటపద్యముల కనేకముల కతఁడే యర్థము వచింపవలసి యున్నది. తొంబదిపాళ్లు నాకర్థము దుర్గ్రాహ్యమని నాయొక్కని యశక్తియైన నంగీకరింపక తప్పదు." —(రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు)

ద్ధమువాఁడని, క్యాంబెల్ దొరగారు 16 వ శతాబ్దమువాఁడని, స్థిరీకరించిరి. ఈరెండింటిలోఁ గొంతసత్యము లేకపోలేదు. 15 వ శతాబ్ద పూర్వార్థమునకు రెడ్డిరాజ్యములు చాలవఱకు క్షీణించిపోయినవి. అక్కడక్కడ కొన్నియుండినను, నేదియో సామ్రాజ్యమునకు సామంత మండలముగా నుండినవి. కనుక 16 వ శతాబ్దములో క్రీ॥ శ॥ 1565–70 ప్రాంతములలో వేమన బాల్యయౌవన మధ్యస్థదశలో నుండియుండును. బ్రౌనుదొరగారు చెప్పినట్లతఁడు 17 వ శతాబ్దమున, ననఁగా 1620–30 వఱకు జీవించియుండియుండుననుట యుక్తియుక్తము. దీనికి బ్రోద్బలకముగా, వేమన తనపద్యములలో గుంటుపల్లి ముత్తన్నను పేర్కొనియున్నాఁడు. ఈ గుంటుపల్లిముత్తన్నను వేమన బాగుగా నెఱిఁగియుండును. ఆపద్యమునుబట్టి చూడఁగా ముత్తనామాత్యునియందు వేమనకుఁ జాల గౌరవముకూడ నుండునట్లు తోఁచుచున్నది. అతఁడు క్రీ॥ శ॥ 1622 సం॥రం చనిపోయినట్లు చరిత్రపరిశోధకులు తేల్చిరి. పై చెప్పిన వేమనకాలమునకు (1620–30) ఇంచుమించు సరిపోవుచున్నది.

వేమన శ్రీకృష్ణదేవరాయలకు ముందువాఁడని శ్రీవంగూరి సుబ్బారావుగారును క్రీ॥ శ॥ 1520 ప్రాంతమువాఁడని శ్రీ శేషాద్రిరమణకవులును జూపిన యన్యకవిస్తుత్యాదులు ప్రామాణికములుకావు. ఆకవులు 'వేమ' శబ్దమును (ఒకదానిని) కవి స్తుతిపద్యములలోఁ జేర్చిరేకాని; యేవేమన యేవేమనయో దృఢముగాఁ దెలియుటలేదు. ప్రసిద్ధిపొందిన ప్రభువులు, విద్వత్కవులు (సంస్కృతాంధ్రములలో) అయిన వేమనలు రెడ్డిరాజులకాలములో ననేకులు మనకుఁ జరిత్రలోఁ గనిపింతురు :—
(1) కాటయవేమన, (2) కోమటివేమన, (3) అనవేమన, (4) చిన వేమన, (5) రాచవేమన. ఇట్లైందఱోయున్నారు. కోమటివేమన నుద్దండ పండితునిగా మనము వినుచున్నాము. అట్టిచో పండితకవుల దృష్టికే మాత్రమెక్కని మనయోగివేమననే కవులు స్తుతించిరనుట సహేతుకము గాదు. సమంజసమునుగాదు. కాఁగా వేమన జీవితకాలము క్రీ॥ శ॥ 1565—1625 వఱకని సంకోచములేకుండ నిర్ణయింపవచ్చును.

## వేమనవైరాగ్యము

ఇల్లువిడిచిన వేమన దేశదేశములు సంచారము చేసినాఁడు. ఆయా ప్రదేశములలోని వింతలు విశేషములు బాగుఁగా గ్రహించి,

నాఁడు. బైరాగులు సాధువులు మొదలగు వారితోఁ గలసిమెలసి తిరిగి నాఁడు. వారివలన యోగాసనము లభ్యసించినాఁడు. బైరాగి చిట్కాలే కాక, 'హేమకార' విద్యకూడ నేర్చుటకు యోగులనాశ్రయించినాఁడు.

లంబికాశివయోగికి శిష్యుఁడై యాంతరదృష్టి నలవరచుకొని, యైహికము నేవగించుకొన్నాఁడు. క్రమముగా సంగవర్జితుఁడగుటకు ప్రయత్నములు చేసినను నక్కడక్కడఁ బలువురు శిష్యులుపదేశార్థ మాతనిచుట్టును జేర సాగిరి. కేవల మవధూతవలెఁ గౌపీనమాత్రధారియై —ద్వంద్వాతీతుఁడై కాలము గడుపఁబూనినాడు.

వేమన కులమునుగూర్చి యొకమాట :—బ్రౌను దొరగారు ఇతనిని వేమారెడ్డి వంశములోని వానినిగా నంగీకరించినను 'జంగము' కులములోఁ గలసినట్లు వచించిరి. *కాని, దీనికాధారము కనఁబడుట లేదు. వేమన తనకాపు (రెడ్డి) కులమునుగూర్చి చాల పొగడుకొనియున్నాడు. "కలియుగమునను్న కాఁపుకులానకు వేమన తనకీర్తి విక్రయించె"— అని యన్నాఁడు. స్వకులాభిమానియయిన యీయోగి తక్కిన కులముల నన్నిటిని కడిగిపోసినాఁడు. అందు జంగముకులమును జేరియున్నది. ఈక్రింది పలుకులు వేమనవే.

"లింగధార్ల (జంగాల) కన్న దొంగలు లేరయా", "శివలింగంబు నిష్ఠనీఁజ మెడను నీల్గగట్టి, కష్టపడుటెగాని కలుగదు మోక్షంబు", "బండె్రతాడు తెచ్చి బంధించికట్టంగ", "లింగఁడేమి దొంగలించినాఁడొ", "ఆత్మలింగమునకు నర్పింప నేరరో", "సంతబసివికొడుకు జంగమదేవర"

ఇట్లు జంగములను దుయ్యఁబట్టిన వేమన జంగములలోఁ జేరిన వాఁడనుట సత్యదూరము.

శ్రీ త్యాగరాయకీర్తనలవలె—శ్రీయన్నమాచార్యుల పదములవలె వేమనపద్యములు క్రొంగ్రొత్తవి. అప్పుడప్పుడింకను బయలుపడు

---

* His family name he never discloses and I hence imagine him to have been a "Zangam" the sect of "Sudras" known by this name are seceders from the common religion; they worship Siva alone and on embracing the 'Zangam' sect they give up their family appellation, and are then usually called by the name of the sect alone. Their creed also corresponds with that taught by Vemana, and this the only one not satirised by him.

చున్నవి. కాని మొదటిరెంటికి పట్టనిదురవస్థ మూఁడవదానికిఁ (వేమన పద్యములకు) బట్టినది. ఏమన :—ఇప్పటికే వేమనపద్యములు అయిదు వేలవఱకు ప్రచారములోనున్నవి. ఇంక నజ్ఞాతములుగాఁ గొన్ని యున్నవని భాషాపరిశోధకులు చెప్పుచున్నారు. కాని యందులోఁ బ్రక్షిప్తము లనేకములు చేరినవి, చేరుచున్నవి. ఇంతియో యంతియో తెలుఁగుబాస వచ్చినవారిలో చాలమంది కాటవెలఁది, గీతపద్యములు సులభముగా దొరలుటచేత నేవో కొన్నిభావములతో మూఁడుపాదములు వ్రాయుటయు నాతరువాత నాలుగవపాదముగా 'విశ్వదాభిరామ వినురవేమ' యని చేర్చుటయు, వానినే దిక్కుమాలిన పత్రికాముఖముననో లోకమునకు తెలుపుటయు నొక "మోజు"గా మన తెలుఁగు దేశములో తయారయినది. ఆవిధముగా చేయుటలో నిప్పటి యన్యదేశ్యపదాలుకూడ విస్తారముగా నాపద్యములలో గుప్పించుట జరుగుచున్నది. దీనిమూలమున వేమనపద్యములను హేళనచేయుటయైన నగును ; లేదా, తమపద్యములు వేమన "మకుటము"తోఁ బ్రజలలో బాగుగా ప్రచారమగునను నభిప్రాయమైన నగును. కాని యిట్టిపనికిమాలిన 'కృతక' (వేమన) పద్యములువ్రాసి, దేశములో 'చెలామణి' కావలెనని, యాయోగిపే రుపయోగించు వారందఱు వేమనకును, తన్మూలమున భాషకును తీరనియపచారము చేయుచున్నామని గుర్తించుకొనుట యవసరము.

ప్రకృతము నాకుదొరికిన (ముద్రితాముద్రిత) వేమనపద్యములలోఁ, బమ్మి త్యాగరాయసెట్టికంపెనివారు, బ్రౌనుదొరగారు ప్రకటించినవి ప్రాచీనతమములయిన ముద్రితప్రతులు. ఇందులో పద్యములకు—నముద్రితప్రతులలోని పద్యములకు నట్టే భేదమగపడుట లేదు. కాని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి పీఠికతోను, శ్రీశేషాద్రిరమణకవుల 'వేమనజీవితము'తోను ప్రచురింపబడిన "వేమనపద్యము"లను వావిళ్లవారి ప్రతిలో పద్యములరచన "వేమనగారి వేనా?" యనిపించునట్లున్నవి.

ఇందులో నుండుపద్యములు 2728 ; బ్రౌనుదొరగారి ప్రతిలోనివి 693. తక్కిన ప్రతులలోని పద్యసంఖ్యాలు పైరెండు సంఖ్యాలకు మధ్య

ష్యున్నవి. ప్రస్తుతము ప్రచారములో నైదువేల పద్యములవఱకున్నను ముద్రితగ్రంథస్థములు 3000—3500కు మించి లేవు.

ఈపద్యములనన్నిటిని పాఠభేదములతో సమగ్రముగా పరిశీలించుటలోఁ గేవలము పాండిత్యమునకు, లక్షణానుసరణమునకు ప్రాధాన్యమిచ్చు పండితుల చేతులలోఁ బడిన వావిళ్లవారి ప్రతిలోని పద్యములలో నూటికి 99 పాళ్లు తమస్వరూపమునే కోల్పోయినవని చెప్పుట యతిశయోక్తి కాదు. ఇది యెంతశోచనీయమో చూడుఁడు. అట్లు పరిష్కరించిన విద్వాంసులు లక్షణానుసారముగా మార్పులు—చేర్పులు, అవసరమైనఁ గ్రొత్తకూర్పులు చేయుటకెంతైనఁ దంటాలుపడిరి. కాని వేమన భావములకట్టివి "యెంతవఱకనుగుణములుగానున్న" వను విషయమును సంస్కర్తలాలోచించినట్లు కనఁబడదు. ఇంకొక విషయము:— ఈప్రతిలోని వేమనపద్యములన్నియుఁ బందొమ్మిది విషయములుగా విభజింపఁబడినవి. ఒక విషయవిభాగములోఁ గనఁబడుపద్యమే మఱియొక విషయవిభాగములోఁ గనిపించుచున్నది. నాలుగు పాదాలలో వేమన చెప్పిన పద్యములను మూఁడు పాదములలోనే సంకుచించుటవలన మూలకారకుని యభిప్రాయములు భిన్నములైనవి. అభిప్రాయాస్పష్టత, భావదారిద్ర్యము సంభవించినది. వేమనగారి భౌతికశరీరము లేకపోయినను, ఆతనివిజ్ఞానకాయమైన నిలిచియున్నది కదా! యని యుప్పొంగుచుండిన తెలుఁగువారికీపండిత పరిష్కృతమైన వేమనపద్యములు" చాల నాశాభంగమును కలిగించునని వ్రాయసాహసించు నందులకు పాఠకులు క్షమింతురుగాక!

వేమనపద్యముల స్వరూపము—అసలు పద్యముల కెంతదవ్వులో నున్నదో యీక్రిందివానిని జూచిన తెలియఁగలదు.

| వావిళ్లవారిప్రతిపాఠములు | తక్కిన ప్రతులపాఠములు. |
|---|---|
| 1. మాటలాడు టొకటి మనసులో నొక్కటి<br>యొడలి గుణమదొకటి, నడత యొకటి<br>యెట్లుగల్గుముక్తి యిట్టులుండఁగ తాను. | మాటలాడ వేఱె మనసుకోలఁది వేఱె<br>యొడలి గుణము వేఱె యోజ వేఱె<br>యెట్లు కలుగుముక్తి యేలాగు తవలాగు ‖ |
| 2. ఎండనీడ వన్నె యేకమౌనట్లుగ<br>నిండు కుండలందు నిలువఁజేసి<br>దండి తత్వమెల్లఁ దలపోసి చూడగా. | ఎండ వేళ చీఁకటేకమై యున్నట్లు<br>నిండుకుండ నీరు నిలిచినట్లు<br>దండిని పరమాత్మ తత్త్వంబు తెలియరో ‖ |

| | |
|---|---|
| 3. కూటికి నెడఁబాసి కూర్చున్న మనుజుఁడు<br>వెలఁదులఁ గనుఁగొన్న వెతలఁబడును<br>వెలఁగి యగ్నిఁజూచు శలభంబు చాడ్పున | కూటికి వగలేక కూర్చున్న వానికి<br>నాదుజానిమీద యాసలేల<br>యన్న మదముచేత నల్గి మునుంబులో |
| 4. కుక్కుట మనసంబు కొక్కెరధ్యానంబు<br>యతుల నొసట నొనమునట్లు వ్రాసెఁ<br>దొల్లి చేసినట్టి దోషంబు తగిలెనో. | కుక్కయేకతంబు కొక్కెర ధ్యానంబు<br>గాడ్దె రాగమెన్న కప్పమునుక<br>ఆత్మ నెరుగుభావ మది యేలచేయనో॥ |
| 5. కామియైన జనుఁడు ఘనుఁడు కాఁడాయెనే<br>కామి గాఁడె కృష్ణస్వామి ముందు ?<br>కామి గాని జనుఁడు గణపతి గాఁడొకో | కామి గానివాఁడు, కవిగాడు రవిగాఁడు<br>కామి గాక మోక్షకామి గాఁడు<br>కామియైనవాఁడు కవియగు రవియగు॥ |
| 6. నే ననఁగ మేను గాదని,<br>మానసమున నెఱుఁగకున్న, మనుజులకెల్లఁ<br>స్వానుభవసిద్ధి దొరకదు<br>తానగుఁబరమాత్మ నెఱుఁగఁదరమా? వేమా! | నే నెవ్వడనని తలచఁడు<br>మానసమున పుడమిలోని మనుజుండకటా<br>కానఁడు తన సకలంబును<br>మానుగ గనుగొనుటయెట్లుమహిలో వేమా |
| 7. మనసులోని శివుని మానక నిల్పిన<br>యోగియగు నతండె యుర్విలోన<br>శివునిఁ దలఁపలేని చిత్తంబదేలనో. | మనసులోనివాని మానుగాఁ దెలిసిన<br>నుర్విజనులు వాని యోగియండ్రు<br>నీవు నన్నెఱుంగ నీవేపో శివుఁడవు॥ |
| 8. వేదములను జదివి వెరవేమి గాంచిరి<br>యరిగి తిరిగి వత్తురందఱుకద!<br>బ్రహ్మమేమొ దెలిసి బ్రతుకుట నిజమయా | వేద శాస్త్రములను విన నేమి గుడిచిరి<br>యరిది తిరిగి చత్తు రందరిండ్ల<br>బ్రహ్మ మహిమ తెలిసి బ్రతుకుటనిజమయా |
| 9. చచ్చువారిఁజూచి చావని పుట్టని<br>తత్త్వమెల్ల నాత్మఁ దలఁపుఁజేసి<br>యరసి చూచినట్టి యతఁడెపో, సుజనుండు | చచ్చువారిని గని చావు నిశ్చయమని<br>తత్త్వమెల్ల నాత్మ దలఁచి తెలివి<br>నదరు బెదురులేక నడర విముక్తుఁడు॥ |
| 10. పలుగువానికేల పరసమృద్ధి తలంప<br>పలుకవరుస వానిబలిమితప్ప<br>చలము వానికేల సాత్త్విక ధర్మము. | పలుగు వానికేల పరసమృద్ధి దలంప<br>పలుగు వానికేల భక్తిపదము<br>పలుగు వానికేల పరమార్థ తత్త్వంబు॥ |

పద్యములకుఁ బద్యములే వావిళ్ల వారిప్రతిలోఁ బరిష్కర్త లెట్లు మార్చిరో చూపుటకయి పైపదిపద్యములు చాలును. అట్టివి చాల నున్నవి.

ఇఁక, ఒక ప్రకరణములోవచ్చినపద్యమే మరియొక ప్రకరణములో.

| పద్యములు. | పుటసంఖ్యలు: | పద్యములు. | పుటసంఖ్యలు: |
|---|---|---|---|
| 1. ధర్మమన్న వినరు | 12—465 | 4. పరుసమినుము | 47—361 |
| 2. మాటలాడఁగలుగు | 15—509 | 5. మాటలాడవచ్చు | 50—510 |
| 3. ఇహమునందు | 12—190 | 6. కొండెకాఁడుచావ | 79—198 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7. | పరులుచదువచూచి | 86—508 | 14. | పటువుగానుబుద్ధి | 215—316 |
| 8. | ఈనినపులిని | 110—228 | 15. | ఆఱుగురినిజంపి | 220—497 |
| 9. | ఏదికులముసీకు | 112—428 | 16. | ఊకొని చెప్పిన | 266—333 |
| 10. | తనదుమనసుచేత | 120—387 | 17. | చదువులందు లేదు | 273—349 |
| 11. | అతిథిరాకచూచి | 131—428 | 18. | తనదురూపమెల్ల | 292 లో రెండుమార్లు |
| 12. | ఇంచుకంతబోవ | 133—461 | 19. | నిజమువరుసనెఱిఁగి | 357—521 |
| 13. | ఆత్మలోనిజ్యోతి | 161—184 | 20. | పరపురుషునిమీఁద | 396—476 |

ప్రస్తుతము ప్రాచీనప్రతులలో "వేమ" యని మాత్రమే నాలుగవపాదమునఁ గడపట నుండి తక్కిన 3¾ పాదములు వేమనభావమును దెలుపుపద్యములు—వావిళ్లవారిప్రతిలో మూఁడుపాదములుగాఁ బరివర్తనంబొంది నాలుగవపాదము యథాప్రకారము పూర్తిగా "విశ్వదాభిరామ వినురవేమ" యను మకుటముతో ముగియునవి చాలకనఁబడుచున్నవి. *

వేమన ప్రపంచములోని మంచిచెడుగుల నన్నిటిని గాలించి చూచి యందలిసారాసారములను కూలంకషముగా గ్రహించిన మహామేధావి; ఆత్మావలోకన మలవఱచుకొనిన తత్త్వవేత్త, ఉత్తమజ్ఞాన సంపన్నుఁడగు వేదాంతి ; నిత్యానిత్యవస్తువివేకముగల విరాగి; ద్వంద్వాతీతుఁడగు యోగి; సంగవర్జితుఁడగు నవధూత; పిన్నలమొదలు పెద్దలవఱకు గ్రామీణులమొదలు నాగరికులవఱకు, విద్యావిహీనుల మొదలు విద్వాంసులవఱకు హంతకులమొదలు సాధువులవఱకు, సంసారులమొదలు సన్న్యాసులవఱకు నానాజాతిమతకులాచారములు గల మానవసమాజములోని వివిధస్వభావములను లోఁతుగా పరిశీలించిన సమ్యగ్ద్రష్ట. అతఁడు తిరుగని (తెలుఁగుదేశ) ప్రాంతములేదు. ఎఱుఁగని విషయములేదు. ఆనాటి సాంఘికపరిస్థితులను పరామర్శించి,

* ప్రాచీనప్రతుల పాఠములతో—వావిళ్లవారి ప్రతిపాఠములం సరిచూచునది : (వావిళ్లవారి వేమన పద్యములం) :—మొదటిది పుటసంఖ్య, రెండవది పద్యసంఖ్య:—(1) 11—54 ; (2) 102—551 ; (3) 97—523 ; (4) 57—302 ; (5) 462—2386 ; (6) 446—2313 ; (7) 167—901 ; (8) 84—456 ; (9) 88—474 ; (10) 117—630; (11) 502—2617 ; (12) 90—448 ; (13) 58—303 ; (14) 461—2378 ; (15) 105—891 ; (16) 69—370 ; (17) 69—371 ; (18) 115—621. ఇట్టివింకను గలవు.

యందులోని లోపములను చక్కదిద్దుటకు నవసరమునైన సంస్కరణ ములను మొట్టమొదటిసారిగా వ్యాపింపఁజేయుటకుఁ బూనుకొనిన కీర్తి వేమనకే దక్కినది. అతని యద్భుతలోకానుభవమును విశాలహృదయ మును ఆనాఁటి విద్యావంతులు మెచ్చుకొనకపోయినను సామాన్య ప్రజానీకముమాత్ర మవగాహన చేసికొనఁగలిగినది. అతని బోధనలు వారిలో నిద్రాణమైయున్న పారమార్థికబుద్ధిని తట్టిలేపి, క్రొత్త చైతన్యమును గలిగించినది.

వేమన విద్వాంసుఁడు కాకపోవచ్చును; కాని విద్యావంతుల పాత్రతనికుండెనని, యతని పద్యములలోని మహత్తరవిషయములే ఘంటాపథముగాఁ జాటుచున్నవి. అతని భాష సలక్షణమైనది కాకపో వచ్చును. కాని యతని యుపదేశములలోని విలక్షణత్వ మాత్మ స్వరూపమెఱుఁగని యజ్ఞానుల కమృతప్రాయమై నేఁటికిని వారిని సజీ వులఁ జేయుచున్నది.

అఱవలకు "తిరుక్కురళు"ను బ్రసాదించిన "వల్లువరు" కంటె వైరాగ్యమున వేమనయే శ్రేష్ఠుఁడనఁదగును. "తిరుక్కురళు" కంటె (ప్రజాప్రబోధవిషయమున) వేమనపద్యములు తీసిపోయినవి గావు. అందలి యంశములన్నియు నిందుకలవు. అంతియకాదు; అందు లేని విషయములెన్నియో యిందుఁ గలవు. అయినను ద్రావిడులకు "తిరు క్కురళు"—భగవద్గీత ; కాదు—వేదమే. వేమనపద్యముల కంతటి యున్నతస్థానమును మనవారీయకపోవుట శోచనీయము. అందులకు, మన పండితులదృష్టిలో వేమనపద్యములు పనికిమాలిన చెత్తలుగా నగపడు టయే కారణము. వేమనవంటి మహాత్ముఁ డింక నేదేశములోనైనఁ బుట్టియుండిన నక్కడివా రతనికి "జేజే"లు కొట్టుచు, బ్రహ్మరథము పట్టియుండురు. కాని "పొరుగుపచ్చ" చూచి యోర్వలేని తెలుఁగు దేశ ములో తెలుఁగువారిమధ్య, తెలుఁగువాఁడుగాఁ—దత్రాపి—కాఁపుకుల సుడుగా పుట్టుటయే వేమన చేసికొనిన పాపము. అంతమాత్రముతో నతని ఘనతకు లోపమురాదు. కాని మనయాంధ్రుల సంకుచితస్వభా వమే వెల్లడియైనది.

వేమన విద్వాంసుఁడు కాఁడని యీవఱకే వ్రాసితిని. కాని యతఁ డాజన్మకవి, సూత్రప్రాయములైన నీతులను సామాన్యప్రజల కర్థమగు

పదములకూర్పుతోఁ జిన్నచిన్నవాక్యములలోఁ బొదివి యాటవెలఁదు లను నడపుటలో నతనికతఁడే సాటి. ఉద్గ్రంథములు వ్రాయుమహాకవు లకుఁగూడ నతనియాటవెలఁదుల గమనపాటవ మలవడ లేదనుట యతి శయోక్తి కాదు.

వేమనపద్యములలో పదములపొదుపు, ఇమిడికబిగి, పాదాంతవి రామము, ధారాశుద్ధి, భావపుష్టి, రసస్వారస్యము, స్పష్టముగాఁ గను పించును. పాఠకునికి చదువుచుండగనే యందలి విషయములు మనస్సున కెక్కి యతనినరనరములందును విద్యుత్ప్రవాహమువలెఁ బ్రవేశించి యాంతరవికాసమునకుఁ దోడ్పడి యజ్ఞానతిమిరమును బటాపంచలు చేయుటలో నద్భుతముగాఁ బనిచేయును. రసగుళికలవంటి యీక్రింది వాక్యములఁ జూడుఁడు :—

(1) ఇఱుకుయోని జూచి పరయోగమును మాను, (2) ముసిలి ముండ లేక ముసిముసినవ్వులు, (3) అతనుచేతికత్తు లమరంగఁ గాంతలు, (4) భగము జూచినపుడె దగులుమనసు, (5) తిరుమలకును బోవ తురక దాసరి కాఁడు, (6) తోత్తుతో త్తెగాని దొరసానికాఁబోదు, (7) జనుల కర్మములను శకునముల్నిల్పునా, (8) రాళ్లు దేవళ్లయిన రాసులు మ్రింగవా, (9) తల్లిశూద్రురాలు తానెట్లు బాపఁడు, (10) మాదిగ గుణమున్న మఱి ద్విజుఁడగునయా, (11) కులముకన్న మిగుల గుణమె ప్రధానమ్ము, (12) నొసలు భక్తుఁడైన నోరు తోడేలయా, (13) పియ్యి దినెడు కాకి పితర మెట్లాయెరా, (14) జీవులందెకాక శిలల నేమున్నది, (15) తలలు బోఁడులైన తలపులు బోడులా ? (16) చేటుకాలమునకు చెడు బుద్ధి పుట్టును, (17) రోగికిడినవాని రాగి బంగారౌను, (18) బలిమి లేనివేళ పంతంబు చెల్లదు, (19) సరసమాడుటెల్ల చావుకు మూలంబు, (20) కోపమడఁచెనేని కోరిక లీడేరు, (21) చిత్తశుద్ధిలేని శివపూజ లేలయా, (22) కుత్సితుండు చేరి గుణవంతు జెఱుచు, (23) అనువుగానిచోట నధికుల మనరాదు, (24) స్థానబలిమిగాని తనబల్మి గాదయా, (25) ఏటివంకఁ దీర్ప నెవ్వరి తరమయా.

ఇట్టివి పరశ్శతములు. ఇంక నితని యుపమానములు నుపమిత భావములు నెంతో సులభముగా నర్థముచేసికొనుట కుపకరించుచు నతికినట్లున్నవి.

1. వలపుదీఱనేని వనజాక్షియధరంబు ముష్టిరసము చింతపండు రసము, జీడిరసముఁ బోలు.

2. మానినీమనోజ మందిరానందైక లోలుఁ డొల్ల డూర్ధ్వలోక సుఖము, మాలవాడకుక్క మఱి యన్న మెఱుఁగునా ?

3. దుండగీనికొడుకు కొండీఁడు చెలికాఁడు, బండరాజుకును బడుగుమంత్రి, కొండముచ్చునకును కోతియు విందాను.

4. ప్రస్తుతంపువేళ పద్యంబు చదివిన, తప్పుకలిగియున్న నొప్పియుండు, వెలఁది సురతవేళ బిత్తలైయుండదా ?

5. పికమువనములోన విలసిల్లఁ బలికినభంగి, ప్రాజ్ఞజనులపలుకు గులుకు.

6. కుక్కగోవుకాదు, కుందేలు పులిగాదు, దోమ గజముకాదు, దొడ్డదైన,—లోభిదాతగాడు.

7. ఆఁకటికిఁదొలంగు నాచారవిధులెల్ల, చీఁకటికిఁదొలంగు చిత్తశుద్ధి, వేఁకటికిఁదొలంగు వెనుకటి బిగువెల్ల.

8. ఒడలు బడలఁజేసి యోగులమనరాదు, మనసు కల్మషంబు మాన్పలేరు, పుట్టమీఁదఁగొట్ట భుజగంబు చచ్చునా ?

9. గాడ్దె యేమెఱుంగు గందంపువాసన, కుక్కయేమెఱుంగుఁ గొప్పకొద్ది, యల్పుఁడేమెఱుంగు హరునిగొల్చువిరక్తి.

10. కాంత కుంకయైన, కానికులంబైన బాయలేక విటుఁడు బ్రమసియుండు, మఱిగి గ్రుడ్డికుక్క మాంసంబుఁ గన్నట్లు.

11. హీనజాతివాని నిలుసేరనిచ్చిన హానివచ్చు నెంతవానికైన, ఈఁగ కడుపుఁజొచ్చి యిట్టట్టుచేయదా ?

12. గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁగొంపోయిన, పండు లూడఁదన్ను పాలనిడదు లోభివాని నడుగ లాభంబులేదయా.

ఇట్టి వెన్నియని చూపనగును ? వేమనపద్యములు జాతీయములకు, నానుడులకుఁ బుట్టినిల్లు. మఱి యేగ్రంథమునందును మనమిన్ని చూడఁబోము.

దాలిగుంటకుక్క ; పసిడికాయపురుగు ; పదటఁగలుపు ; ములకపంటిగిజరు ; నీరుకావిపంచె ; దాష్టీకులు ; బొమ్మగుడ్డు ; నగుబాట్లు ; చింతాకుతక్కువ ; జెట్టిసాము ; వలికి (ఒలికి ?) పాలు ; ఇనుపకచ్చలు;

వెఱ్ఱిపోకిళ్లు ; కాయసిద్ధి ; కల్లటికె (కల్లుముంత) ; చెడ్డముండ ; కొండ ముచ్చు ; పచ్చచూచువారు ; సాగపాఱియున్న ; అదురుబెదురులేక ; దిగువాయి ; ముసలిముప్పు ; పరపతి ; దొడ్డుకొంచెము ; తిన్నకడి (తిన్నకబళము) ; దిమ్మరేఁచు ; అడిగండ్లు—మలిగండ్లు ; దేబెలు ; పట్టుగొమ్మ ; సుష్టుభోజనము ; చీమంతతప్పిన ; బట్టబయలు ; నడినాశము ; గుసులెల్ల ; గొడ్డుటావు ; పరిసిపోవు ; తచ్చనలాఁడు ; బండికల్లు ; కడుపుచిచ్చు ; ముక్కినతవుడు ; ఊఁడఁద్రొక్కు ; దోవడొంకలుగొట్టు ; ఎడ్డె ; మొప్పె ; తాకట్టు ; దిమ్ముబట్టి ; గంపబెట్టియమ్ము ; కొంకనక్క ; పూసపోఁగులు ; పుచ్చకూర ; కంటెపాప ; కంటినలుసు ; కుంటెనకాడు ; బొజ్జకడుపు ; తిండిపోఁతు ; తండోపతండము ; గ్రుడ్డెద్దు జొన్న ; మంతుజీవి ; కనిగ్రుడ్డి వినిచెవుడు ; ఒకరినోరుగొట్టు ; తేనెతెరలు ; గంగిగోవు ; తళ్లు ; పఱిగయేరినట్లు ; గుల్లాములు ; కొంగుకాసు ; ఇసుమంత ; నక్కవినయములు ; నయగారములు ; కాసువీసములు : ముప్పతిప్పలు ; పెట్టిపొయ్యలేని.—ఇట్టివి, పెక్కులుగలవు.

ఆకాలపు విద్వాంసులు, యోగులు, త్యాగధనులు, వేమన వైరాగ్యమును మెచ్చుకొని, దగ్గఱచేర్చువారు. పరోత్కర్ష సహింపలేని పండితమ్మన్యులెవరో తప్ప, తక్కిన జ్ఞానవంతు లతని వేదవాక్యములవంటి యుపదేశములను శిరసావహించుచు వచ్చిరి. అట్టి పెద్దల మధ్య మెలఁగుచు, వారు సందర్భవశముగాఁ జెప్పుచువచ్చిన శ్లోకముల భావములుకూడ తనపద్యములలోఁ జేర్చుచువచ్చెను :—

1. ఆ॥ తనదు దాన మవని తనకూతురి సమంబు తండ్రి దానమెల్ల తనకు తోడు
అన్యులిచ్చుదాన మది తల్లివంటిది ॥విశ్వ॥
(శ్లో॥ స్వదత్తా పుత్త్రికాధాత్రీ పితృదత్తా సహోదరీ
అన్యదత్తా స్వయం మాతా విప్రదత్తా వసుంధరా॥)

2. ఆ॥ పరుల దత్తమిట్లు పాలనజేసిన నిల స్వదత్తమునకు నినుమడించు
నవని పరుల దత్త మపహరించిన, స్వదత్తంబు నిష్ఫలంబు ధరణి వేమ॥
(శ్లో॥ స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥)

3. ఆ॥ ప్రస్తుతంపు వేళ పద్యంబుఁ జదివిన తప్పు గలిగియున్న నొప్పియుండు
వెలఁది సురతవేళ బిత్తలై యుండదా॥
(శ్లో॥ అవసర పఠితా వాణీ గుణగణ రహితాపి వహతి పరమోదం
రతి సమయే యువతీనాం భూషా హానిశ్చ భూషణం భవతి॥)

కొన్ని శ్లోకములకు ఛాయలుగాఁగూడ ననువాదము లున్నవి. మచ్చున కొకటి రెండుమాత్రము :—

ఆ॥ శూద్రతనము పోయె శూద్రుఁడఁగానని ద్విజుఁ డనుకొను పెల్ల తెలివిలేమి
శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః. —
క॥ ఎక్కడి సతు? లెక్కడి సుతు? లెక్కడి బంధుగులు హితులు? నెక్కడ భృత్యుల్ ॥
శ్లో॥ కా తే కాన్తా? కస్తే పుత్త్రః? సంసారాయ, మతీవ విచిత్రః.
ఆ॥ తామసించి చేయఁదగు నెట్టి కార్యంబు వేగిరింప నసిగయు విషము సుగును.
శ్లో॥ సహసా విదధీత నక్రియాం అవివేకః పరమాపదాం పదమ్.

పూర్వాంధ్ర కవుల పోకడలు :—

ఆ॥ ఆత్మశుద్ధిలేని యాచార మదియేల? భాండశుద్ధిలేని పాకమేల?
ఆ॥ కల్లటికెకు భూతిఁ గట్టిగా పెట్టిన నందులోనికంపు లడఁగనట్లు
('వేయి కడవల జలమున వెలిగడిగిన గలుగునే శుద్ధి వారుణీకలశమునకు')
—శ్రీనాథుడు
ఆ॥ ఉదకఘటము పగుల నుపరిఁజూచిన గాని సూర్యుఁడొకఁడు గాఁడు చూడు వేమ॥
('ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచుపోలిక')
—పోతన

బద్దెన సుమతిశతక పద్యాల అనుకరణాలు :—

ఆ॥ ఉత్తముని కడుపున? నోగు జన్మించిన, వాఁడుచెఱుచు వానివంశ మెల్ల
చెఱకు వెన్ను పుట్టి చెఱచదా తీపెల్ల॥
(కం॥ కొఱగాని కొడుకుపుట్టిన కొరగామియె కాదు, తండ్రిగుణములు చెఱుచున్
చెఱకుతుద వెన్నుబుట్టిన చెఱకునఁ దీపెల్లఁ జెఱచు సిద్ధము సుమతీ॥

ఈక్రింది సుమతిశతకపద్యములు 'సుమతీ' అను మకుటమునకు మాఱుగ "వేమా" యను సంబుద్ధితో నేమాత్రము మార్పులేక 'వేమనపద్యములు'—ప్రాచీనప్రతులలోఁ గనుపించుచున్నవి.

(1) వినఁదగు నెవ్వరు చెప్పిన, (2) వెలయాలివలనఁ గూరిమి, (3) గడనగల పురుషుఁ గనుగొని.

దిగువ చూపిన పద్యములలో వేమన తనయచలయోగాను భూతి నెంతచమత్కారముగా చెప్పియున్నాఁడో చూడుఁడు. కేవలము తాత్వికులకేగాని వానిభావములు సుగమములు గావు :—

1. చచ్చువారలెవరు? చావనివారేరు? చచ్చిబ్రతికియుండు జనములెవరు?
విచ్చలవిడిగాను వివరించి చూడరా ॥విశ్వ॥

2. బ్రతుకువారలెవరు? బ్రతికి బ్రతుకలేని ప్రాణులెవరు?
క్షితిని శోధచేసి స్థిరముగఁ జూడరా ||విశ్వ||

3. పెట్టువారలెవరు? పెట్టకుందురెవరు? పెట్టి పెట్టనట్టి దిట్టలెవరు?
పట్టుదప్పకుండ భావించి చూడరా ||విశ్వ||

4. పుట్టువారలెవరు? పుట్టకుందురెవరు? పుట్టిపుట్టనట్టి పురుషులెవరు?
పుట్టి పుట్టనియటు బోధించి చూడరా ||విశ్వ||

5. కట్టువారలెవరు? కట్టనివారేరు? కట్టి కట్టలేని కర్మలెవరు?
గట్టిపఱచి లెస్స కనుగల్గి చూడరా? ||విశ్వ||

6. ఇట్టి పద్యపంచకైక్యముఁ దెలిసిన పెట్టి, పుట్టి, కట్టి, పృథివిబ్రతికి
చచ్చి శుద్ధుఁడగుచు సర్వజ్ఞుఁడై నిల్చు నెల్ల మహిమ నీకుఁజెల్లు వేమ||

ప్రాచీనప్రతులలోని ఈక్రిందిపద్యములు వావిళ్ల వారిప్రతిలో లేవు:—

ఆ|| ఆఁకటికిఁ దొలంగు నాచారవిధులెల్ల! చీఁకటికిఁ దొలఁగు చిత్తశుద్ధి!
వేఁకటికిఁ దొలంగు వెనుకటి బిగువెల్ల ||విశ్వ||

క|| త్రాసును, పడిసేలంజయు, భాసురగతి నొక్కరూపు పరికింపంగా,
వీసం బధికం బయినను వాసరమున కొక్కవంక వ్రాలుర వేమా||

ఆ|| ఎట్టి తోలుదాని నేపారఁజూచిన వేఁకి పుట్టి చాలవెఱ్ఱిబట్టు
పల్లుదెఱచినంతఁ బట్టు పెనూభూతంబు ||విశ్వ||

ఆ|| వెట్టి మొద్దుకేల వేదశాస్త్రంబులు? ముద్దులాఁడి కేల ముసలిమగఁడు?
సద్ది మిగులనింట సంసారమేలరా? ||విశ్వ||

ఆ|| ఒడలుఁ బెంచు లంజె యుబ్బసంబునసైన, వేగ విటునిమీఁద విఱిగనేని
పందికొక్కుమీఁద బండిగల్ పడ్డట్లు ||విశ్వ||

ఆ|| కడువిచిత్ర మరయ కామునియంత్రంబు పువ్వుబోఁడి చుక్కబొట్టుఁగన్న
కాంచి బెళుకుగన్న కడుసొక్కుబుట్టురా ||విశ్వ||

ఆ|| చూలువలన బుట్టు సుఖ దుఃఖములు రెండు పతికి సతికిఁ బుట్టు పరఁగసుతుఁడు
సతికి సుతునివలన సౌఖ్యంబు గలుగును ||విశ్వ||

ఆ|| చాడివాని మాట చావడిలో నిక్కు వేఁటఁబో శునకంబు వెలయనిక్కు
స్త్రీని జూచినపుడు...నిక్కురా ||విశ్వ||

ఆ|| మతముదారి మఱచు మధురాధరము చూచి మగువరూపుఁజూచి మనసు మఱచు
యోనిఁ జూచి సర్వయోగంబు మఱచురా ||విశ్వ||

ఆ|| విషసహితులు నరులు విషధరు లెన్నంగ వృషభ వృషణములను విరియగొట్ట
నఘమువచ్చు కడకు నాయువుకొదవగు ||విశ్వ||

ఆ|| "ముట్టు ముట్టి" సుచును ముట్టరా దందురు ముట్టుకు దరియేమి మూలమేమి?
నవబిలముల మఱికి నరుల కందఱికిని పుట్టగానె ముట్టు పుట్టు వేమ||

పెక్కుపద్యము లిట్టివి వెలుఁగులోనికి రాకపోవుటకు,—అవి యశ్లీలములను పండితజనాభిప్రాయమే ముఖ్యకారణమయి యుండును.

వేమన తాను సంచరించినచోటులలో నుపదేశింపఁ దలంచు కొనిన విషయములను, శ్రోతలకు స్పష్టముగా వివరించి చెప్పటలో—సశ్లీలములైనను—దాఁపఱికము లేక కుండ బ్రద్దలుకొట్టినట్లు, మొగమోట ములేకుండ బోధించువాఁడు; పైఁగా నతఁడు విద్వాంసుఁడుకాఁడు కనుక ప్రజలకు ముఖ్యముగా పల్లెపట్లలోని జనములకుఁ దగిన భాషలో వారిమనస్సుల కెక్కునట్లు ఆటవెలఁదులలోనే పరమార్థతత్త్వమును విస్పష్టముగ చెప్పువాఁడు. సలక్షణభాషకు—అతనికి చాలదూరము. ఉదాహరణమునకుఁ గొన్ని చూపుచున్నాను :—

మునిగేరు, ఆడేరు, అనవద్దు, సన్యసించేది, చేతురు, పదిలంబైతే, మొక్కేటి, సన్యాసయ్యా, పెట్టుక, ఇడుక, పూసితే నాయనా (పూసినవయ్యానా), పుణ్యాజనుఁడు, (పుణ్యాత్ముఁడనుటకు). ప్రస్తుతంపువేళ (శుభకార్యము జరుగునప్పుడు), తప్పితే, మొట్టితే, కొట్టితే, చాలా, చెయి, యివ్వాగా, తన్నుక, పెట్టితే, కలుసునో, సంపదే, పడిసేలంజ, రక్షించే, తిరిగేటి, చెవులోని, వచ్చేదిని, పొయ్యేదిని, చచ్చేదిని, వేసురా, కోరితే, కడుపుకు, మోసునా, తింటే, పొయ్యలేక, దొడ్డవాండ్లు, కొఱకైతే, కప్పిస్తివి, తోలలు (తోనలు), వల్చు (వలచు), ఆపదంచు, చూతమంటె, ఇచ్చేవారల, పోచ్చేదే, మండేరు, కల్దు (కలదు), పుట్టింది, ఎందైనాను, అయ్యాగాండ్లు, దొంగర్కము :—*

సంధిదోషములు :—కలిగున్న (కలిగియున్న), చవేమెర్గు (చవియేమెఱుఁగు), సంపదే (సంపదయే), మేదినందు (మేదినియందు), ఆపదందు (ఆపదయందు), రాజు యల్పుని (రాజల్పుని) వెలుగెల్లబారు (వెలుఁగు వెడలఁబాఱు), బ్రహ్మమును యెఱుగరు (బ్రహ్మము నెఱుఁగరు), తిరుగలేదు యాకసమున (తిరుగలేదాకసమున), చింతేలరా (చింతయేలరా), కుంజరంబు యీను (కుంజరంబీను).

యతిదోషములు:—(1) వోటికుండ నీరు వోసినచందాన, (2) వంటినున్నయంత వచ్చునాతత్వంబు, (3) వోగుబాగెఱుగని వొట్టి మూఢ.

* ధూర్జటికవియు నిట్టిప్రయోగములు చేసెను.

ఇట్టితప్పులు ప్రాచీనప్రతులలోఁ బెక్కులు గలవు. వావిళ్ల వారిప్రతి సిద్ధపఱచిన పరిష్కర్తలు వేమన ప్రయుక్తములగు శబ్దములను మార్చ వలసిన యవసరము లేకుండనే యట్టితప్పులను సులభముగా సవరించి యుండవచ్చును, కాని వారిసంస్కరణమున కగ్గమై వేమనపద్యములు తమస్వరూపమునే పూర్తిగాఁ గోల్పోవుట పరితాపకరము. పరిష్కృత ప్రతిలోని వేమనకవితాకళను బ్రదర్శించు పద్యములను—విద్వత్పరి ష్కృతపద్యములను—కొంచెము కవితావిమర్శ చేయు నేలాటి పండి తుఁడైనను వెల్లడిపఱచి చూపఁగలఁడు.

ఇఁక వేమనతత్త్వము నించుక పరిశీలింతము. ఇతఁడైహికమునే రోసినవాఁడు. ఆకాలపు సాంఘికపరిస్థితుల నామూలాగ్రముగాఁ బరిశీ లించి ప్రజలలోని యవినీతిమార్గములను దీవ్రముగా ఖండించినాఁడు. బ్రాహ్మణుల మొదలు నానావర్ణములవారిని వారివిధులను నిరసించుచు సంఘములోనికుళ్లను గుల్లగించుటకు ప్రయత్నించినాఁడు. వేదశాస్త్ర పురాణము లతనికి విశ్వాసపాత్రములే. కాని, వాని నాధారముచేసికొని తలకొకవిధముగా నడుచుకొనుచు, సామాన్యమానవులను నడుపుటకు బూనుకొనువారి నాతఁడేమాత్రము క్షమింపలేదు. అంతమాత్రముచేత నతనిని సంఘవిద్రోహులతోడను, నాస్తికులతోడను జమకట్టుట యవి వేకమగును. అతని పద్యములలో దేవతలు, నవతారపురుషులు, స్వర్గ నరకములు, యమదండనలు, వగైరాల ప్రశంసలున్నవి. కాని, యజ్ఞ ములు, నుపవాసములు, వ్రతములు, విగ్రహారాధనము మున్నగువాని నతఁ డీసడించినాఁడు. కామ్యకర్మములనిన వేమనకు బొత్తిగా గిట్టవు. "అహంబ్రహ్మాస్మి" యను నద్వైత తత్త్వమే యతనిలక్ష్యము. అతఁ డాత్మశుద్ధికే ప్రాధాన్య మిచ్చినాఁడు. పై వేషములవలన ప్రయోజనము లేదని యతనినిశ్చయము. అపరోక్షానుభవము కరతలామలకము చేసి కొనుమార్గమును గురుమూలకముగా గ్రహింపఁగలిగినవారికి మోక్ష సాధనము సుకరమని యతని నమ్మకము.

ఇతనిపద్యములలోఁ గొన్ని "కూటము"లనియు, నట్టివానిలో నతనిభావములు గుప్తములయినవనియు, శ్రీయనంతకృష్ణశర్మగారివంటి విద్వాంసులు నుడువుచున్నారు. నేను నట్లు భావించుటయు కాక, కొన్ని పద్యముల కితరులు చెప్పిన గుప్తభావములుగూడ వింటిని, ఇదివఱకు

"ఊరుకొండవీడు" అను పద్యభావము వివరించితిని. ఇక్కడ మఱి కొంటికి :—

> "కుక్కఁదిన్నవాఁడు గురులింగజంగంబు పందిఁదిన్నవాఁడు పరమయోగి,
> ఏనుఁగుఁదిన్నవాఁడు ఎంతసుజ్ఞానిరా" ||వే||

'కుక్క' యనఁగా 'కోప'మని,—'పంది' యనఁగా, 'మూర్ఖత్వ' మని ;—'ఏనుఁగు' అనఁగా, 'మద'మని :—వానిని దినుట యనఁగా, నిగ్రహించుట యని కొందఱు చెప్పుదురు. ఈభావము సమంజసమని యే తోఁచుచున్నది.

> "చెప్పులోని రాయి చెవిలోనిజోఁరీఁగ కంటిలోనినలుసు కాలిముల్లు
> ఇంటిలోనిపోరు ఇంతింత కాదయా" ||వే||

ఇది గురుశిష్యసంవాదరూపమైన యాత్మసాక్షాత్కార ప్రబోధ మని కొందఱు :—

శి :—'లోనిరాయి' = పరమాత్మనుగూర్చి ; చెప్పుము.

గు :—చెవిలోనిజోఁరీఁగ = ప్రణవనాదానుభూతి (నొందుము).

శి :—లోనినలుసుక్, కంటిక్ = (నీవారశూకమువంటి) లోని సూక్ష్మతేజస్సుకొననుగల పరమాత్మ నిప్పుడు కంటిని.

గు :—(నశించిన భవబంధముగలిగియూ) భవబంధము నశించెను.

శి :—ఇంటిలోనిపోరు = బంధమోక్షముల కగు మనస్సులోని తగులాటము. ఇంతింత కాదయా = అసామాన్యమైనది.

ఈయభిప్రాయము యుక్తియుక్తమైనఁ గావచ్చును ; కాని వేమనభావమున కది యెంతవఱ కనుగుణమను విషయముమాత్రము సందేహాస్పదము.

ఆటబోటికూటమితో నారంభించిన వేమన జీవితము, నాట వెలఁదులఁగూర్చి విద్వత్కవులు శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు రచించిన వాక్యాలతో ముగించుచున్నాను.

"శ్రీనాథునకుసీసమును, తిక్కనకుఁగందమువలె వేమనకాట వెలఁది వెన్నంటివచ్చిన వృత్తము.

ఈవృత్తమునం దితఁడు చూపినంత ప్రౌఢిమయు మాధుర్యమును శ్రీనాథుఁడు సీసమునందుగాని, తిక్కన కందమునందుఁగాని, చూప

లేదనుట యతిశయోక్తిగాదు. ఇదియుఁ బ్రకృతిదత్తవరప్రసాదములలో నొకటిగాని, వేఱుగాదు. తెనుఁగున నింతకన్నఁ జిన్నవృత్తము వాడుకలో లేదు. అందును నాల్గవపాద మంకితముతో ముగియును. తక్కిన మూఁడుపాదముల నడుగడుగునకు యతినియమము వదలఁడు. యతియందును దిక్కనాదులు వాడునట్లు పదమధ్య విచ్ఛేదము గాదు. యతిస్థానమునకు సరిగఁ బదమును అనేకస్థలముల భావమును గత్తిరింపఁబడినట్లు తునుకలై పడును. కుంతికడుపునుండి కర్ణునివలె సద్యోగర్భముచే సహజాలంకృతమై యాటవెలఁది వేమననోటినుండి క్రిందికి దూఁకుచున్నది !!—

---

సవరణలు :—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 138 | 21 | లేవదీసి | లేవఁదీసి |
| 139 | 19 | అభిప్రాయ | అభిప్రాయము |
| 141 | 5 | మండలము | మండలములు |
| 144 | 20 | సాహసించు | సాహసించి |
| 146 | 17 | వివేగము | వివేకము |
| 152 | 5 | కుంచెరెవరు | కుందురెవరు |



# కవిచౌడప్ప

(క్రీ. శ. 1600—1630)

భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సన్మానసంపుటములో "నైతికగ్రంథములు—కవిత్రయము"— అను వ్యాసమునఁ గవిచౌడప్పనుగూర్చి నాయభిప్రాయము నీక్రింది విధముగా వెల్లడించితిని.

"కవిచౌడప్పగారి నీతిబోధన యొకవిచిత్రమార్గమున నడచినది. అతఁడు బూతులనుగూడ మేళవించిగాని నీతులను దెలుపఁడు. అతఁడే "నీతులు బూతులు లోకఖ్యాతులురా" యని యుద్ఘాటించియున్నాఁడు. అతని పద్యములు చక్కెరపూఁతగల చేఁదుగుళికలు. బంగరుమలాముగల వాఁడికత్తులు. నీత్యవినీతుల రెంటిని జూపి, నీతి ప్రాశస్త్యమును వక్కాణించును. ఉదాహరణములు విరివిగ నొసంగును."

ఇప్పటికిని చౌడప్పనుగూర్చి నాయభిప్రాయమిదే. ఈశతకమకుట మాత్మసంబుద్ధిపరముగ వేమన—(పరమానందయోగి మున్నగువారివలె)—"కుందవరపు కవిచౌడప్పా"—యని చెప్పుకొనినాఁడు—ఈకుందవర మను గ్రామమెక్కడ నున్నదోగాని, దాని కితఁడు కరణముగా నున్నట్లు తెలియుచున్నది. ఆకారణముచేతనే తనశతకములోని కొన్ని పద్యములలో—గ్రామమునకుపెద్దగా, అధికారిగా, పాలకుఁడుగా (ఆకాలపు పద్ధతి ననుసరించి) ప్రకటించుకొనినాఁడు :—

(1) కుందవరంపురాయ! భళి! కుంజరవైరిసమానశౌర్య! (2) దొడ్డా! కుందవరంపురాయనుకవీ! (ఇత్యాదులు).

కవి సామాన్యముగా కందములే రచించినను, అక్కడక్కడ క్వాచిత్కముగా, గీతములు, సీసములు, చంపకోత్పలవృత్తములుకూడ కనిపించుచున్నవి.

ఇతఁడు బ్రాహ్మణుఁడని, నాగనామాత్యునిపుత్రుఁడని, యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

"ఆసలఁజేరి దుర్గుణగణాఢ్యుని దాతవటంచు వేడినన్
మీసము దువ్వుచున్ దిశలమీఁదున జూచుచు దుర్మదాంధుఁడై

వీసమునీ యలేని పలువిస్తుగులాముకు కీర్తి జేరునా ?
భూసురవర్య ! కుందవరభూషణ చౌడకవీశ్వరోత్తమా !"
"నాగధీమణి సత్పుత్ర నయచరిత్ర సకలసౌభాగ్యగుణధుర్య చౌడయార్య."

కరణీకములు సాధారణముగా నియోగులవే కనుక, నితఁడు కూడ నియోగియైయుండును. దీని కుపబలకముగా కొన్ని పద్యములలో నితఁడు నియోగులను శ్లాఘించుటకూడ కనఁబడుచున్నది.

1. "దొరవద్ద నెంతచనువరి నరులతనికిఁ బ్రియముచేయ న్యాయము ధరలో హరివాహనమని మ్రొక్కరె గరుఁడని"
2. "ఎయ్యెడలను జదరంగపుఁ గొయ్యకు నియ్యోగి లేక కొనసాగేనా ? నియ్యోగే కావలెరా"
3. "దొర యెంతప్రౌఢుఁడైనను సరసను నియ్యోగిలేక సమకూరదయా శర మెంతవాఁడియైనను కరవైఖరి కుందవరపు కవిచౌడప్పా"
4. "కరణము గావలె సరుఁడు కరణ మవశ్యంబు సకలకార్యంబుల, కా కరణము లోకంబుల సత్కరణముగద కుందవరపు కవిచౌడప్పా"
5. మాటలు పస నియ్యోగికి,

ఇతఁడు తనశతకములోఁ బేర్కొన్న (ఆకాలపు) ప్రభువులనుబట్టి చూడఁగా వారికితఁడు సమకాలికుఁడుగా కనఁబడుచున్నాడు. అందులో నొకఁడు మట్లవారి సీమను బాలించిన "మట్లయనంతభూపాలుఁడు" రెండవయాతఁడు తంజావూరిని పాలించిన రఘునాథరాయలు :—

1. "శేరా రాజులు భూమిని, వారల నెవఁడెఱుఁగు ? సకల వైభవ ముల నీవే రాజవు నీతికి, వినుమా రాజును నేనె కవుల మట్లియనంతా॥"
2. "అన్నిట మంచివారు విమలాత్ములు హాస్యకళాధురంధరుల్
సన్నుత నీతిపాలకులు జాణలు నైపుణు లెవ్వరంటిరా
పన్నగ మట్లనంతనరపాలునిఁ గొల్చి మహానుభావులై
వన్నెకు నెక్కినట్టి గుణవంతులు ఘంటన చౌడగాండ్లురా॥"
3. మట్ల కుమార యనంతుని పట్లను వినయంబులేని ప్రభువుల మహి నే పట్లను జెడిపోదురు, చేకట్లను వరకుందవరపు కవిచౌడప్పా॥"
4. "మీరిన పగతుల మట్లను మారానంతుండు విక్రమాప్త నిరీక్ష మారుకొనినఁ బోనీయఁడు కారణమున కుందవరపు కవిచౌడప్పా॥"

పై పద్యములలోఁ జెప్పఁబడిన అనంతరాజే కుమారానంత భూపాలుఁడు. (కకుత్స్థవిజయకృతికర్త).

ఇతనివంశక్రమము కకుత్స్థవిజయప్రబంధములో నీరీతిగా వర్ణిత మయినది.

బొమ్మరాజు రెండవపుత్రుఁడు తిమ్మరాజు. అతని పెద్దకుమారుఁడు కోనరాజు — అతనిద్వితీయకుమారుఁడు తిమ్మరాజు. అతని రెండవకుమారుఁడు చినకోననృపతి.—అతని జ్యేష్ఠసుతుఁడు ఎల్లమరాజు. ఈయెల్లమరాజుగారి యైదుగురుకొడుకులలోను కడపటివాఁ "అనంత (కుమారానంత) భూపాలుఁడు." ఇతఁడే కవిచౌడప్పచేఁ జేకొనఁబడిన కకుత్స్థవిజయకావ్యకర్త. ఇతఁడు క్రీ. శ. 1610—1617 సం॥ల మధ్యసింహాసన మెక్కినట్లు తెలియుచున్నది.

తంజాపూరు రఘునాథనాయకుఁడు మహారసికుఁడు. కళాభిజ్ఞుఁడు. ఇతనినిగూర్చి తంజావురాంధ్రనాయకచరిత్ర మిట్లు వర్ణించుచున్నది.

"ఈయనను కృష్ణరాయలతో సన్నివిషయములలోఁ బోల్పవచ్చును. లక్ష్మీసరస్వతులిర్వురును తంజానగరము తమకు రాజధానిగాఁ జేసికొని, నిరంతర నృత్యము గావించిరి. ఆంధ్రభాషామతల్లికి ముద్దుకుమారుఁడై. యాంధ్రకవితావధూటికిఁ బ్రేమాస్పదుఁడైన నాయకుఁడై యీయన వఱలెను విద్యానగరమునఁ గృష్ణరాయభోజునికాలమున నాంధ్రకవితావధూటి యెట్లు పల్లకిలో నూరేగింపఁబడెనో యట్లే రఘునాథుని కాలమున శారద ధ్వజాదిరాజచిహ్నములతో వఱలెను."

ఇతఁడనేకకావ్యములకుఁ గర్తృత్వము—భర్తృత్వము పొందినాఁడు. ఈతఁడు తంజావూరు రాజ్యమును క్రీ. శ. 1614—1633 వఱకుఁ బరిపాలించినట్లు చరిత్రలు చెప్పుచున్నవి.

దీనినిబట్టి యీయిద్దఱు రాజులును (మట్లిఅనంతభూపాలుఁడు తంజావూరి రఘునాథరాయలు) సమకాలికులని తేలుచున్నది. ఈయిరువురిని శతకములోఁ బేర్కొన్న కుందవరపు కవిచౌడప్పకూడ తప్పక ఆకాలపువాఁడే. విషయమిట్లుండగా, నాంధ్రకవులచరిత్రలో ననంత భూపాలునికాలము క్రీ. శ. 1550—1580 వఱకని, గోల్కొండనవాబయిన యిబ్రహీంసా యతని సమకాలికుఁడని తెలుపఁబడినది. దాని నాధారపరచుకొని, "శతకకవిచరిత్ర"కారుఁడు నట్లే చెప్పుట యంధోనుగాంధన్యాయముగ నున్నది. కాని, మట్లవారిశాసనములలో సాధారణముగ శాలివాహనశకమునే యుటంకించుట చేత నీతబ్బిబ్బులు కలిగి

యుండవచ్చును. లేదా—శాసనాధారములనే తీసికొనకుండ నూహ కందినంతవఱ కంచనాలు వేసికొని, తదనుసారముగానైనను వ్రాసి యుండవచ్చును.

ఏదియెట్లున్నను—సిద్ధవటము శాసనములో — "శాలివాహన నామ శకవర్షములు వేయునేనూటయిరువదియేడు చనిన" యని యనంతభూపాలుని పేర వ్రాయఁబడినది. దాని ననుసరించి, యతని కాలము విస్పష్టమగుచున్నది. శా॥ శ॥ 1527 వ సం॥రం—క్రీ॥ శ॥ 1605 కు సరిపోవుచున్నది. ఆపక్షమున ననంతభూపాలుని రాచఱికపు కాల మించుమించు క్రీ॥ శ॥ 1600—1620 వఱకుండును. అనఁగాఁ బూర్వో "క్తాంధ్రకవుల శతకకవుల" చరిత్రలకర్తల నిర్ణయముల ప్రకారము పదునాఱవ శతాబ్దాంతమనుట యూహాజనితము. ఆప్రభువులకాలము పదునేడవ శతాబ్దమనుట నిర్బాధకము. వారినిగూర్చి తనశతకములో సూచించిన కవి చౌడప్పయు నదేకాలములో నుండెననుట సుస్పష్టము —సత్యసన్నిహితము.

శ్రీ వంగూరి సుబ్బారావుగారు సాధనాంతరములను వదలివేసి శతకములో చౌడప్ప చేసిన కవిస్తుతి నాధారముగాఁ దీసికొని, కవికాల మును నిర్ణయింప సాహసించుట నేల విడిచి సాముచేయుటవంటిది.

స్తుతిపద్యములు :—

1. "విను, భారవి బిల్హణు, నాచనసోముని మాఘకవిని, చతురత శ్రీనా థు నుతింతు ; సుకవివరుఁ దిక్కనఁ దలఁతును—కుందవరపు కవిచౌడప్పా"
2. "పండితముఖ్యులు, ధారుణి దండియు, భవభూతి, కాళిదాసుల నె వ్వండైన నిడుఁ గృతుల, వారి, నఖండితయశ, కుందవరపు కవిచౌడప్పా"
3. "పెద్దనవలెఁ గృతిఁజెప్పినఁ బెద్దనవలె, నల్పకవిని బెద్దన వలెనా? యెద్దనవలె, మొద్దనవలె, గ్రద్దనవలెఁ గుందవరపు కవిచౌడప్పా"

ఇందులో, భారవి, బిల్హణుఁడు, మాఘకవి, దండి, భవభూతి, కాళిదాసు — సంస్కృతకవులు ; — నాచనసోముఁడు, శ్రీనాథుఁడు, తిక్కన, పెద్దన— తెలుఁగుకవులు.

"శ్రీనాథునివఱకు తెలుఁగుకవుల నుతించుటచే నీతఁ డాతని పిమ్మటివాఁడనుట స్పష్టము"—అని మొదటిపద్యము నాధారము చేసి కొని "శతకకవులచరిత్రకర్త వ్రాసినాడు. మఱల నంతలోనే మూఁడవ

పద్యము నుదాహరించుచు నీతఁడు మనుచరిత్ర రచించిన పెద్దనకే స్తుతి యించియుండును. అది నిజముకావచ్చును. మట్లయనంతుఁడును, రఘునాథభూపాలుఁడును, విజయనగరరాజ్య మస్తమించినపిమ్మట 16-వ శతాబ్దాంతమున నున్నవారు. కావున కవిచౌడప్పకూడ 16-వ శతాబ్దములో నుండినవాఁడే కావచ్చు''ననిరి.

కడపజిల్లా రికార్డులనుబట్టి చూచిన క్రీ. శ. 1330 మొదలు (అనఁగా శా. శ. 1252 మొదలు) అనంతరాజుపూర్వు లెనమంచిపెంటు చిట్వేలిని రాజధానిగాఁ జేసికొని మట్లవారి సీమను బరిపాలించినట్లు సూచీయగుచున్నది. ఆపక్షమున మట్లయనంతరాజు క్రీ. శ. 1605 (శా. శ. 1527) లో రాజ్యమునకు వచ్చినట్లు తేలుచున్నది. కనుక ఎటుచూచినను రఘునాథనాయకునికి సమకాలికుఁడైన యీయనంత నృపాలుఁడు పదునేడవ శతాబ్ది ప్రథమపాదములోనివాఁడే యగును. దీనినిబట్టి కవిచౌడప్పనుగూడ నాకాలములోనివాఁడుగానే నిర్ణయింప వలసినట్లేర్పడుచున్నది. మొత్తమున కాంధ్రకవులచరిత్ర — శతక కవులచరిత్ర—ఈకాలనిర్ణయవిషయములోఁ బొరపడినవనుటకు సందేహము లేదు.

ఇతఁడాత్మసంబోధనపరముగా నీశతకమున :—

"శ్రీపతి పుల్లూరిపట్టణ గోపాలుఁడు సదయుఁడగుచుఁ గుంతీసుతులకా
గాపాడినటుల మమ్ములఁ గాపాడును కుందవరపు కవిచౌడప్పా"

అని చెప్పుకొనుటచేతఁ "బుల్లూరిపట్టణగోపాలుఁడు" ఇతని కిష్ట దైవ మైనట్లు తోఁచుచున్నది. ఈపుల్లూరు కడపమండలములోనిది. కనుక నితఁడు "అనంతభూపాలుని" మనస్సునకెక్కినవాఁడుగా నుండినాఁడని, పుల్లూరుపట్టణ గోపాలభక్తుఁడని తేలుచున్నది. కాని, యింటిపేరివిషయములో కొంతసంశయము కలుగుచున్నది.

* ఎంచఁగలం డనంతవసుధేశుని యిత్తుగసంబు నోళ్ల ఖం
డించిన నక్కలక విషపటిష్ఠపుఁ బద్యముచెప్పి వానిని
ర్జించిన నింటిపేరు దయచేసిరి "నక్కలపాటి" వాఁడటం
చంచితరీతిఁ జౌడకవినాథుని పద్యఫలప్రభావతక॥

* ఈవిషయమున "చాటుపద్యరత్నాకరము"లో (మట్ల వేంకటరామరాజు కాలములో నుండిన) "నక్కలపాటిసంజీవరాయకవి"—మట్ల అనంతభూపాలుని చెఱకుఁదోఁటను నక్కలుపాడుచేయ, నాభూరమణునికోరికపై, నక్కలరాయిడి తొలఁగించుట

పై పద్యమునందలి సందర్భమెంతవఱకు నిజమో కాని చౌడప్ప కవి యింటిపేరు మొట్టమొదట కుందవరమైనను, దరువాత "నక్కల పాటి"గా మాఱినట్లు తెలియుచున్నది.

ఇఁకఁ గవిచౌడప్పశతకములోని విశేషములనుగూర్చి యించుక పరిశీలింతము :—

నాకు దొరకినప్రతులలో నొక్కదానిలో 191 పద్యములున్నవి. మఱియొకదానిలో 100 కి ఒకటిరెండు తక్కువగా నున్నవి. వావిళ్ల వారి ప్రతిలో సాధ్యమయినంతవఱకు బూతులన్నియు సవరింపఁబడినవి. అట్టి దొకటి 1910 వ సం॥రములో ముద్రింపఁబడినదానిలో 94 పద్యములు మాత్రమే యున్నవి. మిత్రులు శ్రీ॥ ఆంధ్ర శేషగిరిరావుగారు దాని నిచ్చిరి. వారు మఱికొన్నిపద్యములు సేకరించి యాశతకములో మధ్య మధ్య వ్రాసియున్నారు. దీనినిబట్టి యాలోచింపఁగాఁ గవిచౌడప్ప పద్యములు ఒక్కశతకపరిమితిమయినవిమాత్రమే కావు. వేమనవలె నతఁడు చాలపద్యములు చెప్పియుండినట్లు తోఁచుచున్నది.

---

కయి కాఁటియాఁకుపై ఈక్రిందిపద్యమును వ్రాసియిచ్చి యద్దానిఁ దోఁటవాకిటఁ గట్టు మని చెప్పినట్లును, నతఁడట్లొనరింప, నాబాధ నివారణమయినట్లును—వివరింపఁబడినది. ఆపద్యమిది :—

"ఆశీవిషసమమగు నాయాశుకవిత్వంబుచేత, నటు వంచకముల్
నాశము గావలెఁ జూడుము, హేశాంభవి, చౌడమాంబ, హేశర్వాణీ"

పై నక్షత్రచిహ్నముగల పద్యమునఁ—బేర్కొనఁబడిన అనంతరాజు, క్రీ. శ. 1605 ప్రాంతమువాఁడు. అతనికాలమున నుండినవాఁడు — "కవిచౌడప్ప"—గాని, "సంజీవరాయకవి" కాఁడు. అనంతరాజునకుఁ దరువాతివాఁడగు వేంకటరామరాజు క్రీ. శ. 1690 సం॥ ప్రాంతమువాఁడు. ఇతనికాలమున నుండిన నక్కలపాటి సంజీవ రాయకవి, అనంతరాజు చెఱకుఁదోఁటను నక్కలవాఁతఁ బడకుండఁ గాపాడుట ఎట్లు పొసఁగును ?—పైఁగా, చౌడప్ప చౌడేశ్వర్యాభాకుఁడుగఁ గనఁబడుచున్నాడు. ఆ మంత్రశక్తిచేతనే అతడు వంచకములపీడను బోఁగొట్టియుండుననుట యుక్తియుక్తము. "నక్కలపాటి" వారను నింటిపేరు 'చౌడప్ప' నుండియే కలిగినది. కాన, సంజీవరాయ కవి యతనిమనుమఁడు కావచ్చును.—'చాటుపద్యరత్నాకర' మందలి—ఉత్పలమున నాల్గవపాదము చుక్కలతో విడిచిపెట్టఁబడినది. అది కవిపేరును సూచించునది. సంజీవ రాయకవియే పద్యకర్తయగుచో "వ" కార ప్రాసముతో—తనపేరు వచ్చుట కను కూలముగఁ బద్యమారంభించియుండును. కాదేని—మత్తేభ శార్దూలములలో నేదయిన గ్రహించియుండును. కాన నది కవిచౌడప్పకృతము గాని, సంజీవరాయకవిది కాదు.

ఇతని పద్యములలోని నీతులు బూతులతో మేళవింపఁబడియుండు నని ముందే చెప్పితినిగదా! అట్టి బూతులను వాడుసందర్భమున నితఁడేమాత్రము వెనుదీయని గుండెలుతీసినబంటు. అయిన నట్టి పద్యములు చమత్కారముగా హాస్యరసమును వర్షించుచుండును. ఎంతి భాషాజ్ఞానము తక్కువగాఁ గలవాఁడైనను నర్థము చేసికొనునంతి సులభముగా పద్యములు చెప్పఁబడినవి. గ్రామీణులకు హృదయరంజకములుగా నుండును. కాని పండితజనపఠనయోగ్యములని చెప్పుటకు వీలులేదు. ఒకవిధముగా నీతఁడు 'ప్రజాకవి' యనుపించుకొనుటకుఁ దగిన వాఁడు. విషయము లెంత నగ్నసత్యములైనను నాగరికసంఘ మర్యాదను దృష్టిలో నుంచుకొని, చెప్పియుండిన నిట్టి యసభ్యములయిన బూతులమాటలను కవి యుజ్జగించియుండవచ్చును. ప్రజాసామాన్యము నాకర్షించుటచేతనే యీశతకమునకు, నీకవికి నింతప్రసిద్ధి గలిగియుండు ననుటకు సందేహము లేదు.

ఇతనిపద్యములు చదువువారికి పరస్త్రీగమనము పాపముకాదను నమ్మకము కలుగును. గుహ్యాంగములకు చాటుమాటు లక్కఱలేదని తోఁచును. ఇందులోని పద్యముల నన్నిటిని :—

(1) ఆత్మస్తుతి, (2) లోభిజననింద, (3) నీతిబోధన, (4) భక్తి మార్గము, (5) భోగప్రశంస, (6) నియోగిజనాధిక్యము, (7) అపకారులైనరాజాశ్రితులు—అను నేడుశీర్షికలక్రింద విభాగింపవచ్చును.

1. ఆత్మస్తుతి : దీనికి సంబంధించినపద్యములు పదుమూఁడున్నవి.
—తాను కందపద్యరచనమున మిగులఁ బ్రౌఢుఁడఁట!

1. "ముందటచను దినములలో, కందమునకు, సోమయాజి
ఘనుఁడందురు, నేఁడందఱు నను ఘనుఁడందురు"

2. "కందము నీవలెఁ జెప్పె డొందము మఱిగాన మెవరి
యందును, గవిసంక్రందన"

3. "కందములఁ బ్రాసగణయతు లందముగాఁ గవిత
నెందఱల్లరు? వినా, నీకందంబులు రసవన్మాకందంబులు"

4. కందంబు లితరులవి యానందంబులుగావు, వినఁగ
నవరసఘటనా కందంబులు, నీకవితాకందంబులు"

5. "అందంబులు సకలజనానందంబులు సరసమధుర న
వరస ఘుటికాబృందంబులు నాకవితాకందంబులు"

తనకవితాప్రాబల్యమును మాధుర్యమును దానే చౌడప్ప మెచ్చుకొనినాఁడు :—

1. "చొక్కంబైన సుధారసంపుఘుటికల్ చోద్యంబు నీపద్యముల్
ద్రుక్కులోవని గోస్తనీఫలతతుల్ శుంభద్భవత్కావ్యముల్
నిక్కంబన్నిట జాణవౌదువు భళీ, నీకెప్పుడుంజెల్లు. నీ
ఢక్కావాద్యపు పద్దు కుందవరచౌడశ్రీకవీంద్రోత్తమా"

2. "కుందవరంపురాయ, భళి, కుంజరవైరి సమానశౌర్య! నీ
కెందున సాటిలేరు ధర నించుక మించఁగఁ, గుల్క, నీసుధా
స్యంది వచోవిలాసముల, హా, కడు నీనుల విందుగా, సుహా,
నందము జేయఁగా, ధరణినాయకకోటికి మాటిమాటికిన్"

3. అన్నిట మంచివారు, విమలాత్ములు, హాస్యకళా ధురంధరుల్
సన్నుతనీతిపాలకులు జాణలు, నైపుణు లెవ్వరంటిగా!
సన్నుగ మట్లనంత ధరిపాలునిఁ గొల్చి మహానుభావులై
వన్నెకు నెక్కినట్టి గుణవంతులు ఘంటన చౌడగాండ్లుగా"

మూఁడవపద్యమునందలి 'ఘంటన' యెవఁడో తెలియుట లేదు. అతఁడు హాస్యకళాధురంధరుఁడుగా మాత్రమే పేర్కొనఁబడుటవలన బహుశా చౌడప్పవలె కవి కాఁడేమో? అట్లయియుండిన చౌడప్ప వలె నేదేనొక చిన్నకృతి చేసియుండును కాని, తనమిత్రుఁడు పద్యములు చెప్పుచుండఁ దానూరకుండఁడు.

4. "నీకవిత ప్రజకు ద్రాక్షాపాకము, విన నారికేళపాకము పరులకైతే కవిత"

దీనివల్ల ప్రజాసాహిత్యములోఁ గవిత చెప్పు తాను "ప్రజాకవి" యనియుఁ, దనకవిత ద్రాక్షాపాకము (అట్టివారికి) సులభగ్రాహ్యమనియుఁ బ్రకటించుకొనుచున్నాఁడు.

ఈక్రిందిపద్యములోఁ గవి, తన పరాక్రమకార్యములనుగూర్చి పొగడుకొనిన విధము గమనింపఁదగినది :—

"లోభికి నొకసొద్దులో కేక వేసిన, బ్రహ్మాండభాండంబు పగిలిపోవు,
గట్టిగా నొకసారి లొట్టలు వేసిన కుంభకర్ణుండు మేల్కొనఁగవలయు
కూర్చుండి యొకసారి కూఁతలు వేసిన ధర రెండు వ్రక్కలై యరలితీరు,
పెడగులుబ్బుని బట్టి విషయింపఁజూచిన వరుస నింద్రియము లేమరక పారు"

తన నీతులప్రాశస్త్యమునుగూర్చి యితఁడు చెప్పుకొనినవైఖరి యపూర్వము :—

1. "నానీతి విననివానిని, భానునికిరణములు మీఁదఁ బాఱనివానిన్
వానను దడియనివానిని గానను రా, కుందవరపు కవిచౌడప్పా!"

2. "మునుపద్యమ్ముల సీసము లెఱచియును, కందపద్యము పాడఁజెప్పినను
వినవినఁ దేఁటతెనుంగై కనఁబడుఁగద. కందపద్య కవిచౌడప్పా!"

3. శరనిధి మేరదప్పినను, శంకరుఁ డిచ్చు వరంబు దప్పినన్
సురగురు నీతిదప్పినను, సూర్యుడు చంద్రుడు త్రోవదప్పినన్
పరుస నయోధ్యరాఘవుని బాణముదప్పిన, హాస్యకారులన్
సరసుఁడు జాణ కుందవర చౌడనిపద్యము నీతిదప్పునే?"

చౌడప్పకుఁ గాకరకాయ చాలయిష్టమయినట్లున్నది. రెండవ
[illegible]కాయ :

"వేయారువగలకూరలు గాయలనేకములు ధాత్రిఁ గలవన్నిటిలో
నాయకములురా కాకరకాయలు"—

"పరికించి, చక్క, కమరిన పరితరముగినుంచి నేత పడవేఁచినఁ గా
కరకాయకు నీడెందున గలదప్పా"—(ఈపద్యములో-౨-౪ ప్రాసలోపమున్నది)

మీసము పౌరుషచిహ్నముగా భావించువారిలో నీకవి
యొకఁడు. మీసములప్రశంస చాలపద్యములలో గనఁబడుచున్నది.

1. "మీసము పసమగమూతికి"

2. "ఇయ్యఁగ నిప్పించఁగల యయ్యలకేగాక, మీసమందఱికేలా?
రొయ్యకులేదా బారెఁడు"

3. "దాతపటంచు వేడినన్, మీసముదువ్వుచున్ దిశలమీఁ
దున జూచుచు దుర్మదాంధుఁడై, వీసము నియ్యలేని
పలువిత్తు గులాముకు కీర్తిచేరునా?"

4. "తగుపాటి కవులకియ్యని మొగముండలకేల కలిగె మూతినిమీసల్
దిగగొఱుగఁడాయె మంగలి"

5. "విద్దెములజాము, మీసముల దిద్దొకజాము"

ఈకవి పొగాకు వేయుటయుఁ, బొగ ద్రాగుటయు నలవడినవాఁడని
తెలియుచున్నది :—

1. "గుడిసెయు మంచము కుంపటి విడియమును పొగాకు రతికి వెంపరలాడే
పడఁతియుఁగలిగినఁ జలియొక్కడిదప్పా?"

చలికాలములో నివియన్నియు వెట్టఁగలిగించువస్తువులుగాఁ గవి
(స్వానుభవముతోనేమో) పేర్కొన్నాఁడు. అందులోఁ బొగాకుకూడ
ముఖ్యమైనది. ఇది సామాన్యగ్రామ్యజనమునకు విడియముతో సేవిం
పఁదగిన ప్రధానవస్తువు. ఇఁక రాజభోగ్యముగా :—

"మృగమదసౌరభవిభవ ద్విగుణిత ఘనసార సాంద్రవీటీగంధ స్థగి తేతరపరిమళము"

అగు (పెద్దన చెప్పిన) విలువగల తాంబూలము మనకవి కనష్ట సరము. పొగాకుండిన చాలుననును.

2. లోభిజననింద :—కవిలోకసహజమైన యీనింద నీతఁడును ఒకింత మోతాదునుమించి చేసినాఁడు :—

1. "అదెయిదె నేఁడు రేపనుచు నాశలు పెట్టెడు లోభచిత్తునిం
బదరుచు బ్రహ్మరంధ్రమునఁ బాపటఁదీసి దశాంగుళంబులన్
'దధికిటధిమ్మిధి'—మ్మనుచు తాళముదప్పక సొడ్డు వెట్టుచున్
బదుగురు సూడఁ గొట్టవలె పావన చౌడకపీశ్వరోత్తమా"

2. "హంగుగ వేడబోయి, సుగుణాఢ్యుని వేడక, లోభచిత్తునిన్
వెంగలిగాని వేడినను విష్ణునియాన ఫలింపదేదియున్
వంగినవానిక్రింద మఱివంగినఁ దాఁకును వానిక్రింది, దా
సంగతిగాదె కుందవర చౌడకపీశ్వర ! పావనోత్తమా !"

3. దయ్యము మొత్తిన క్రియగా, కుయ్యక మాట్లాడలేక కొం
దఱులోభుల్ కొయ్యవలెబిగిసి, రారే కయ్యమునకు"

4. "భట్టుడాయవచ్చి, బ్రహ్మయవనిఐను గడునులోభి ము
ఖము ముడుచుకొనును...గి పెఱికినపుడు, పింగు పొక్కినకీతి"

5. 'ఎద్దులకొడుకులు, కలిగినకొద్దిని ధర్మంబు చేసికొనరు'

6. "ముండలకొడుకుల సంపద దండుగలకె గాని, ధానధర్మములకు రాకుండు"

7. "బండగులాములు యాచకతండంబుల కియ్యలేరు"

8. "తినఁజాలక యేధర్మముగనఁజాలక, పరమలోభి
కష్టఁడుగూర్చె ధనమెల్ల నేలపాలని కనుమప్పా"

9. "...కంటే రూకిత్తురు, నాకంటే యియ్యరెవరు నాకొడుకులయో !"

10. "అతిలుబ్ధు వేఁడఁబోయిన, వెతనొందుచు వానిమోము వె
లవెలబాఱున్, రతిఁ జాలించిన శి...గతి నుండురు"

11. "నిద్దపులోభిని దాతగదిద్దను వీల్గాదు హంసతీరున
నడకల్ దిద్దగవచ్చునె ? పీతిరి గద్దను"

12. "తలవెంద్రుకలందఱురా, యిలలో నిచ్చేటివారు, ఇయ్యని
వారో మొలవెంద్రుక లందఱు రా, కలియుగమున"

3. నీతిబోధన :—నీతులను బోధించువిషయమునఁ గవిచౌడప్ప వ్యావహారికములో నుండువిషయములనే ప్రజాసాహిత్యమునకు, సంబంధించిన తేలికపదములతో నందఱి కర్థమగునట్లు సులభముగను, మనస్సునకు నాటు నుదాహారణములతోడ, నుపమానములతోడ వ్రాయుటలో

సిద్ధహస్తుఁడు, అట్టిసందర్భములలో నసభ్యములైన బూతుమాటలు ప్రయోగింపవలసివచ్చునెడల కించిత్తుకూడ వెనుదీసినవాఁడు కాఁడు,

1. "పట్టెడైన లెస్స బాగైనవరికూడు, చిట్టెడైన నేతిబొట్టులెస్స, ముట్టుదైన ముంకముండ కౌగిలిలెస్స"

2. "ఆకులుపస వృక్షములకు, నీఁకెలుపస పక్షితతికి నింతులకెల్లన్ ......అనఁగ"

'పస'—గలిగిన వస్తువుల నితడు పెక్కింటిని చాలపద్యములలో తెలిపినాడు.

3. "సారములేవి సంసారికి, భారములేవి గోపురంపు ప్రతిమకు, పిప్పిన్ సారములేవి, గుడిసెకు ప్రాకారములేవి ?"

4. "దొరగావలె ధర్మాత్ముఁడు, సిరిగావలెఁ బ్రజకు పేరు సీమల నెఱుఁగన్, గుణిగావలె, కులసతి సిగ్గరిగావలె"

5. "పరవిత్తము గోమాంసము, పరపత్నిఁ తనతల్లియనుచు భావించిన యా నరుఁడు నరుండా! రెండవ కరివరదుఁడౌ"

6. "నోరకయినఁ బేదకయినను, పెరవరియిల్లాలికైన వేశ్యకు నయినం గరగరికతనము బాగు"—

7. "అత్తమెయిలకోక దొలఁగిన, తత్తరపడి రాజు నీతిదప్పిన—సుజనుండత్తటి కడఁదొలఁగవలె"

8. "వేసారక యేడాదికి దూసెదవొకబిడ్డ, మగఁడు త్రోసేమహిమో, యేసామిచ్చినవరమో"

9. "ముండైనా ముతకైనా, యెండిన...కైనగాని యెట్టిదిరైనా యుండవలె నరునకొక్కటి"

10. "యతికి మరిబ్రహ్మచారికి, అతులితముగ విధవముండ కళ్యాంబునకున్ సతతము మైథునచింతయె"

11. "ఎడ్డెకుఁ బేదకుసాదకు బిడ్డయి పుట్టేటికంటె, పృథివీశునకున్ ...డ్డయి పుట్టిని మేలుర"

12. "పెరవరికానిరాజునకు, పెచ్చుమెఱుంగనిదేవళానకున్, గరవునఁ జుట్టమింటికిని, గాచిఫలించని చెట్టుచేమకున్, దరచుగ వెట్టివాఁడు యెడతాకఁడు"—

13. "ముదితచను మెత్తనయినను, నధికారము మెత్తనయిన, నాజిని దొరకున్ మదిమెత్తనయిన రోతురు"

14. "సరసము చతురోపాయము, హరిభక్తియు శాంతగుణము, నార్తులపట్లన్ వరముపకారము సత్యము"—

15. "ఇంటికిఁ బదిలముబీగము, వింటికిఁ బదిలంబు నారి, వివరింపంగాఁ, జంటికిఁ బదిలమురవికయె"

భక్తిమార్గప్రబోధకములైన పద్యములుగూడ నితనిశతకములోఁ గానవచ్చుచున్నవి.

4. భక్తి :—

1. "ముంతెడు చమురున, హరికత్యంత మనఃస్ఫూర్తి
దీప మనుదినమిడు వాఁడంతమునఁ జేరు, లక్ష్మీకాంతునిపురి"

2. "తులసీదళముల, హరిపద జలజంబులఁ బూజ
సేయు సరసుల యమదూతలుచూచి యేమి సేయంగలరప్పా?"

3. "అలసట వేసటనయినం, గలనైనన్ నగుచునైన
గరుడధ్వజునిం దలఁచినవారలఁ జేరవు కలుషంబులు"

4. "నారాయణ యని, సుతునిం బేరనజామిళుఁడు
వేగపిలిచిన ముక్తిం జేరిచె, గదహరినామము"

5. "తనమనిలోపల దశరథ తనయులలోఁ బెద్ద
వాని, తలఁచిన జన్మం బనయంబు పావనంబని ఘనులందురు"

6. "హరిని సిరివరుని విశ్వంభరుని యదూద్వహుని
కృష్ణు ఫణిపతిశయనున్ నరుఁడు గొనియాడఁగలఁడా

7. "రంగేశుని సమదైవము, గంగకు సమమైననదియు కానము జగతిన్"

8. "చిత్తము శ్రీహరిపై కించిత్తును నిలుపంగలేని
చెడుగులంపోతే, మొత్తియమభటులు త్రోతురు"

చౌడప్పభోగి—మహాదాత.—

(5) భోగప్రశంస :—

1. "తనసతియుండఁగా, మనుమలు, తనయులు దలిదండ్రు
లన్నదమ్ములు బంధుల్, దినదినమును భుజియించుట ఘనమప్పా"

2. "సరసము చతురోపాయము, హరిభక్తియు శాంతగుణము,
నార్తులపట్లన్ వరముపకారము నిత్యము కరుణాకర"—

3. "దేవుఁడు దేవుండనఁగా, దేవుండాదివినుండి
దిగివచ్చేనా? యీవిగలదొరయె దేవుఁడు కావంగా"

4. "అప్పయినఁ దీసి తినవలె, పప్పును పరికూరను,
వయసు భామామణులన్ మెప్పింపఁగవలె, చలువలె కప్పఁగవలె"

5. "...వలె వయసుపడుచును, గ్రొంగవలెన్
వెన్నముద్ద, మెలఁకువ రతికిన్ చెంగవలె"

6. "వేసరకయిచ్చు దాతకు కానుసుమీ మేరువంత
కనకంబైనన్, కానే మేరువులోభికి"

7. రాపతినాసికు జందెపుంబోంచటరా సుఱుతు ?
రిపులఁ బొరిగొనుటయుఁ, జేఁజాచిన నిచ్చుట, శరణనఁ గాచుటరా"

8. "నరుఁడయితే సత్కారుణాపరుఁడై మనువాఁడె
నరుఁడు, భావింపఁగ తక్కోరుఁడైన కింకరుండగు"

9. "నాతివలగబ్బి గుబ్బలఁ జేతులకసితీర, బిసికి
జిలిబిలిచేసే యాతఁడు పుణ్యశ్లోకుఁడు"

10. "పండుగ పండుగయందురు పండుగదినమేది ? వ
యసుపడుచుల ప్రక్కన్, పండినదినమే పండుగ"

11. 'అతిథుల బంధుజనంబుల, యతులను, తనువడుగవచ్చు
యాచకతతులన్, క్షితిఁబూజించునరుఁడు సద్గతినొందును'

12. "ఇయ్యఁగ నిప్పించంగల యయ్యలకేగాని, మీ
సముందఱకేలా ? రొయ్యకులేదా ? బారెఁడు"

5. నియోగిజనాధిక్యమునుగూర్చి కవి చెప్పిన పద్యము లిదివఱకే యుదాహరించితిని. ప్రకృతము రాజాశ్రయమును బొందిన పరోపకారహీనులనుగూర్చి చౌడప్ప యభిప్రాయమును దెలుపు పద్యములు కొన్ని చూపుదును :—

1 "పెద్దలమంచును, రాజులయొద్దను గూర్చుండి, నీ
చవాక్యాలు పలికే పెద్దలు పీతిరిగద్దలురా"

2. "తా, రాజసభల మెలఁగుట ; తా, రసికతఁ
జెలఁగుటెల్లఁ దనబ్రదుకునకా ? పూరేడేసుకతినదా కాఅడవుల ?"

3. "ఉందురుపకారహీనులు కొందఱు, దొరనగరి,
శివునిగుడిపైనుండే నందులవలె బిగియించుక"

4. "ఎత్తెఱుఁగని నియోగ్యాగము తోత్తాపెను దీటురాదు, దొరకపకీర్తుల్ హత్తించు"

5. "నృపతులచెంగట, కొందఱు, ఉపకారములేని
పశువులుండఁగ నేమీ ? ఉపవనములందునుండవె కపికోటులు"

6. "పందలు నియోగులుందురు, కొందఱు, నుదరాలు పెంచుకొని యుర్విపయిన్"

7. "గాడీపల్లకి గలిగిన వాఁడైతేనేమి ? కవులవం
చించిన యాగాడిద కొడుకిల, తిట్టుకుఁగాఁడా ?"

ఈకవి తనశతకములో స్వవచనవ్యాఘాతములు చాల చేసియున్నాఁడు :—

"ఏపాటిదైన ప్రక్కకు దాపొక్కటిలేకపోతే, తరమటరా, యీపాపపుదినములు గడుపఁగ"—అని మగువలేని మగవానికి నీతి చెప్పెను. "కుంకముండ" నైనను దోడుగాఁ దీసికొనుమనును. "ముం

డైనా ముత్తకైనా, యెంచిన—కైనగాని యెట్టిదియైనా, యుండవలె నరునకొక్కటి" — యని శాసించును. "వయసుభామామణులఁ మెప్పింపఁగవలె" నని చాటును. ఇంతదూరము చెప్పిన యాతఁడు మఱల నంతలోనే "పరసతి తనతల్లియనుచు భావించిన యానరుఁడు నరుండా ? రెండవ కరివరదుఁడె" యని పరస్త్రీపరాఙ్ముఖతను గూర్చి బోధించుచున్నాఁడు.

ఒకవంక వ్యభిచారమువలన దోషములేదని చెప్పుచు మఱి యొకవంక భంగ్యంతరముగా స్త్రీలను ప్రోత్సహించినాఁడు. అయినను స్త్రీలు శీలమును బోఁగొట్టుకొనరాదని చెప్పుటలో నతనియుద్దేశ మేమో తెలియుటలేదు.

"కొండవలె పెనిమిటుండఁగ, మిండలచవి మఱిగి కడలమీఱు చుఁ దిరిగే రండల యమపురిఁ జీల్తురు కండలుగా" నని యుద్ఘాటించు చున్నాఁడు.

దీనివలన సభర్తృకలు వ్యభిచారము చేయరాదని, "కుంక ముండలు, వ్యభిచారిణులు" చేసిన తప్పులేదని యితనియభిప్రాయము గాఁ దోఁచుచున్నది.

ఇతఁడు వృద్ధవివాహాలను, భోగస్త్రీలను నిరసించు సంస్కర్త :—

"పగలాడికి ముసలాతఁడు మగఁడైతే దానిచింత మఱి యింతింతా ?"

"వగలాడి చెంతనుండిన మగవానికి నూరకుండ మనసయ్యేనా ?
తెగులాటమునను బూనక ?"

"లంజలు రాకుండిన గుడి రంజిల్లదు; ప్రజలమనసు రాజిల్లదురా !
లంజల నేల సృజించెనొ కంజజుఁడు"

ఈకవి ప్రపంచానుభవ మద్వితీయము.

1. పాలకిబోయలనుగూర్చి యాతఁడెంత సహజముగాఁ జెప్పెనో చూడుఁడు.

"ఇస్తేసై కాక మూఁదుగఁ బస్తొట్టులుం మోతుమంద్రు పాలకిబోయల్,
శిస్తుల నడిపేదే కడుకస్తిగదా"

2. విడెముచేయఁదగిన సందర్భములు ముఖ్యముగా నాలుగింటిని సూచించినాఁడు.

"పవ్వగడుపున, సభలోపల, తరుణులయెడ, భుక్తమైనతఱి నొకవిడెముం
దొరకని నరునకు సౌఖ్యము కలవప్పా"

3. కుంటెనకాఁడు వాల్గంటిసౌఖ్యము మొదట రుచిచూచునఁట!—ఇట్టిది తనకుఁ దటస్థించినదేమో ?

"కుంటెనకాఁ డొకపరి తానంటియు మును వెనుక దొరకు నంటించును వాల్గంటి !
ఇది బహుచిక్కులఁ గంటినిరా"

అని తానే ఋజువు చేసికొనినాఁడు.

4. భర్తృహరివలె నితఁడు పురుషునకు రెండే యుత్తమమార్గములని చాటినాడు :—

"మనుజుఁడు నేర్పరియైతే, కొనవలెరా మంచిముద్దుగుమ్మను,
లేదా, మునివృత్తినుండి మోక్షముఁ గనవలెరా"

5. ఎంత గొప్పయింటి యాఁడుబిడ్డయైనను బతికి లోఁకువయే యని ప్రకటించినాఁడు.

"డీకొని పాచ్చాకూతురి—కైతే, పెండ్లికొడుకు పూజించేనా ?
చీకాకుపఱచి—గక"

6. దైవసన్నిధిలో నర్చకులైన "నంబివారి" దుర్వృత్తి :—

"అడియేన్ దాస' నటంచును జడియక మడి జాఱఁదీసి సాతనిదానిన్
గుడివెనుక నంబిచేసెను గడసాధన"

7. స్త్రీల పూజాఫలమునుగూర్చి, యితని నిర్వచనము చాల సమ్మతమైనది :—

"మూరెఁడునిడుపుగలిగి, కడుతోరంబైనట్టి—దొరకడ మెల్లన్
వారిజగంధులపూజలు"

8. పుణ్యాత్ములవర్ణనము మఱియు విచిత్రముగా నున్నది :—

"ఆఁకటి కన్న పుగడ్డయు—బిగువైన—పుణ్యాత్ములకే, దొకేమి మట్టిగడ్డా"

9. దినములన్నింటిలోఁ దద్దిన ముత్తమమైనదఁట :—

"దినములలోపల నుత్తమ దినమే తద్దినము నాఁటితిండికి సమ
మేదినములను వెదకిచూచినఁ గనమప్పా"

10. కవికిఁగల యీక్రిందిజిజ్ఞాస హాస్యజనకముగా నున్నది :—

"కుత్తుక చెడ దగ్గిన మూతెత్తక చెడ తుమ్మి యావలించిన నగరే ;
పిత్తునకు నగుదురేమొ జగత్తున"

ఈవిధముగా నుదాహరించుచుండిన నొకనాఁటితో తెమలు విషయము కాదు. కనుక తక్కినవిషయములు పరికింతును. ఇతఁడు, నీతుల కెంత ప్రాశస్త్యమిచ్చుచున్నాఁడో, బూతులకుఁగూడ నంత ప్రాశస్త్య

మియ్యవలయుననువాఁడు. కేవలము నీతులనుమాత్రమే చెప్పి బూతులనుగూర్చి చెప్పకుండుట యన్యాయమని, బూతులన్న నేమాత్రము నిరసింపఁదగినవి కావని చెప్పుచున్నాఁడు.

1. "బూతని నగుదురు కదు, తమ, తాతలు ముత్తాత మొదలు
తరతరములవా రేతీరున జన్మించిరో"

పై విషయము వాస్తవమైనను "మాంసము తిందుమని పేవులు మెడ వేసికొని తిరుగుదురా"?—ఏసందర్భమునకైనను నవసరము నను సరించి చాటుమాటులు పాటించుట యుక్తము. కవులవిషయములో నది మఱియు ముఖ్యము. జుగుప్సాంశములు కావ్యదోషములలో నొకటిగా లాక్షణికులు పరిగణించిరి. కాఁబట్టి కొంతవఱకు వానిని పరిహరించుట సత్కవులలక్షణము.

బూతులునీతులు కలిపి సభలోఁ గవిత్వముచెప్పఁగలవాఁడే గొప్పవాఁడని యితనియుద్దేశము అట్టికవిత్వమే రాజాస్థానములలో దొరల కింపితముగా నుండునఁట!

2. "పదినీతులు పదిబూతులు పదిశృంగారములు గల్గు పద్యములు సభకా,
జదివినవాఁడే యధికుఁడు"

3. "నీతులకేమి ? యొకించుక బూతాడక దొరకు నవ్వుపుట్టదు"

4. "బూతులుకొన్నిటు, కొన్నిటనీతులు చెప్పితిని బుధులు నీతులుబూతుల్;
బూతులు మెచ్చుందగు నతికాతుకమతి"

ఈకవి యట్టి పాండిత్యము గలవాఁడు కాఁడని ముందే సూచించితిని. వేమనవంటివాఁడితఁడు. కొన్ని విషయములలో నిద్దఱు సరిసమానులని తోఁచుచున్నది. వేమనవలెనే యితఁడు నాత్మసంబుద్ధిపరముగా పద్యములువ్రాసినాఁడు. వేమనవలె నితఁడును బూతుల నుపయోగించు విషయమునఁ జంకినవాఁడుకాఁడు. వేమనవలెనే వ్యాకరణదుష్టప్రయోగములను విశేషముగాఁ జేసినాఁడు. వేమన కాట వెలఁది యెట్లభిమానపాత్రమయినదో యితని కట్లు కందమభిమానపాత్రమయినది. వేమన యెట్లు పామరప్రజను రంజింపఁజేయుకవిత్వము నడపినాఁడో యితఁడు నట్లే నడపినాఁడు.

1. ఇతనిదోషాలు చాలవఱకు ధాతుప్రయోగదూషాలలోనే ముఖ్యముగాఁ గనబడుచున్నవి.

వెళ్లొండేటి, చెప్పే, మెస్తే, కస్తి, ఇస్తేనే, వద్దను, ఉండే, అల్లే, అయితే, అయ్యే, చేసేనా, వేస్తినా, చూస్తినా, విషయించు ?, తరించే, లేకనే, ఇవ్వ, లోభ్లోకడు, ముండైనా, ముతకైన, పుట్టేటి, రంశే చేరుండవె.

2. నూతనపదప్రయోగములు.

గులాము, సొడ్డు, పద్దు, చేకట్లు, తిగులాటము, లొట్టు, డగలాబు, తొప్పె, కంగులు, పింగు, కవిలె, సపిండీకరణము, ముండాకొడుకులు, వేరువిత్తు, కత్తెము, కట్టడి, ధగిడి, పారుపత్యము, తుపాకి, మెరిక, తేర కాడు, తూటు, విద్దెము, కజ్జము.

3. సామెతలు : నానుడులు :—

(1) పూరేడేరుకతినదా కాటడవుల. (2) వంగిన వానిక్రింద మఱి వంగిన తాఁకును వానిక్రిందిది. (3) శివునిగుడిపై నుండే నందుల వలె బిగియించుక యుందురు. (4) దయ్యము మొత్తినరీతి. (5) తలు పేల చాపగుడిసెకు. (6) పిండము గ్రద్దలుతిను. (7) పులి నాకివిడుచు. (8) కలహించి గొట్టెకఱచును. (9) కాకము కోకిలయగునా ? (10) అడి ర్యేక దాసక. (11) గడసాధన. (12) నాలుకతేఁట. (13) దిద్ధిమికి ధిమికి యనుచును మద్దెలవాయించు. (14) అడవిమృగమ్ముల కన్నీరే మైన వేఁటకానికి ముద్దా ? (15) దేవుఁడు దేవుండనఁగా, దేవుండాదివి నుండి దిగివచ్చెనా ? (16) అందము మనుజుని మేనికి గందమురా. (17) ఉపవనములఁ జేరుండవె కపికోటులు. (18) గద్దఱిగంపల కెక్కడి గద్దెఱికము.

కవిచౌడప్ప యింకను చాలపద్యములు వ్రాసినట్లు, నవి యక్కడక్కడ చెదురుగా (కడపజిల్లాలోని) కొన్నిగ్రామములలో దొరకు నట్లును విన్నాను. అట్టివి వేయింటికి పైఁగాఁ గలవని యాప్రాంతముల వారియంచనా.

మంచి లాక్షణికకవి యయిన మట్లయనంతరాజు ఈప్రజాకవి నాదరించి గౌరవించినట్లు తెలియుచున్నది. అందులకుఁ గారణము కొంతవఱకు తనకవిత్వముమీఁది గౌరవము కానచ్చును. కాని విశేష

ముగా గ్రామీణులలో నతనికిఁగల పలుకుబడియే గణింపఁదగిన కారణమయి యుండును.

'అప్ప'—యనుశబ్దము కడపజిల్లాలో గౌరవార్హులపరముగా నుపయోగించుట సర్వసాధారణమైనది. "అప్పగారు"—అనునది పెద్దయుద్యోగస్థులనుగూర్చి తరచుగా నాప్రాంతములలో వినిపించుచున్నది. "తోప్పె"—ఈశబ్దము కడపజిల్లాలో 'మగగుఱి'కి పర్యాయము. (అరవములోఁ 'బొట్ట' యనునర్థములో వాడుదురు) "తూటు"—'బొంద'—ఇవి రెండు 'నాఁడుగుఱి'కి కడపజిల్లాలో వాడుదురు. మొదటిపదమే మోగాని 'నాబొంద' — 'నీబొంద' — యనువాడుకలు కోస్తాజిల్లాలలో తఱచుగా వాడుదురు. దూషణలో ముఖమనుపదమును 'మూతి'యని మదరాసు రాయలసీమ ప్రాంతములవారు వ్యవహరింతురు.

ఈకవి రాజంపేట కామడదూరములో "నాగాయపేట"కు సమీపములోని సిద్ధవరము కాపురస్థుఁడని నాసంచారకాలములో దెలిసినది. కాని సిద్ధవరముదగ్గఱనే 'కుందవర'ము కూడ నుండవచ్చునని నాయూహ— లేదా సిద్దవరమే కుందవరమేమో ?

రాజంపేట—సిద్ధవటము, బద్వేలి తాలూకాలలో నిప్పటికిని, వివాహాదిశుభకార్యములలో గృహస్థు లీకవిచౌడప్ప పేరితో—నొక సేరుబియ్యము — నొకరూక — యిత్తురఁట. అది యతనివంశస్థులకు పారంపర్యముగా వచ్చు "కవిమేర"గా మట్లప్రభువుల శాసనమఁట.

---

సవరణము :—159 పుటలో కకుత్స్థవిజయకర్తయగు (ఎల్లమరాజుపుత్రుఁడు) అనంతరాజు 1610_1617 సం||ల మధ్యను గాక, క్రీ. శ. 1600 ప్రాంతమున రాజ్యమేలెను. కాని ఎపుడు మరణించినది తెలియదు. ఇతనియనంతర మితనికొడుకు—తిరువెంగళనాథరాజు సింహాసనమునకువచ్చి క్రీ. శ. 1619 వఱకు పాలించెను. తరువాత నితనికుమారుఁడు, కుమారానంతభూపాలుఁడు రాజై 12 సం||రములు ఏలెను. ఈ యిరువురనంతరాజుల కాలమున చౌడప్పయున్నట్లు ఆధారములున్నవి. ఇతఁడు తనపద్యములలోఁ బేర్కొన్న యనంతరాజీ యిరువురలో నెవఁడో నిర్ణయింపవీలు లేదు.

కకుత్స్థవిజయకర్త ఎల్లమరాజు కొడుకగు అనంతరాజు. కాని, కుమారానంతరాజు కాఁడు.

160 పుట—9-వ పంక్తి—'1620 వఱకుండును'—అనుటకు, 'ప్రాంతము' అని చదువవలెను.

——♦♦——

# కూచిమంచి తిమ్మకవి

(క్రీ॥ శ॥ 1690—1760)

శ్రీనాథునితరువాత 18 వ శతాబ్దారంభమునఁ బెక్కుగ్రంథములను వ్రాసి, సమకాలికులచేత మెప్పుపొంది- ప్రభుదత్త "కవిసార్వభౌమ" బిరుదము వహించిన మహాకవి యీకూచిమంచితిమ్మనార్యుఁడు.

"హాటకగర్భవధూ లీలాటన చలితాంఘ్రి నూపురారావ శ్రీ
పాటచ్చరములు, తేనియ తేటలు మా కూచిమంచితిమ్మయమాటల్"

అని, సమకాలికుఁడును, విద్వత్కవీంద్రుఁడు నగు ఏనుఁగులక్ష్మణకవిచేఁ గొనియాడఁబడిన యీకవిలోకగ్రామణి పాండితీప్రతిభయుఁ, గవితాప్రజ్ఞయు, నలోకసామాన్యములని వేఱుగఁ జెప్పవలయునా? ఇతఁడేకాఁడు; 'కూచిమంచి' వంశస్థులందఱును బండితులు, కవులుగఁ గన్పట్టుచున్నారు.

గీ॥ "మును పు మాకీవె భర్గాణుఁడనెడి తేలికతయు, రుక్మిణి పెండ్లికతయు, బొబ్బ
మెకపు గుబ్బలికతయు, మేల్మిఱి నీలపెండ్లి కతయును గబ్బముల్పేర్మిఁగూర్చి॥"
(అని 'అచ్చతెలుఁగు రామాయణము'నను)

సీ॥ "ప్రతిభమై రుక్మిణీ పరిణయంబును, సింహశైలమాహాత్మ్యంబు, నీలపెండ్లి
కథయును, రాజశేఖరవిలాసంబును, నచ్చతెనుంగు రామాయణంబు,
సారంగధరనృప చరితంబు సాగర సంగమాహాత్మ్యంబు, రంగుమీఱు
సకల సలక్షణసార సంగ్రహంబు నొనర్చి కృతులు మా పేర నంకితముచేసి"
(అని 'రసికజనమనోభిరామము'నను)

సీ॥ "పరవొప్ప రుక్మిణీ పరిణయంబును, సింహశైలమాహాత్మ్యంబు, నీలపెండ్లి
కథయును, రాజశేఖర విలాసము, నచ్చ తెనుఁగు రామాయణంబు మొదలగు॥"
(అని 'సర్వలక్షణసారసంగ్రహము'నను)

సీ॥ "ప్రౌఢిమై రుక్మిణీ పరిణయంబును, సింహశైలమాహాత్మ్యంబు, నీలపెండ్లి
కథయును, రాజశేఖర విలాసంబును, నచ్చతెనుంగు రామాయణంబు,
సారంగధర నరేశ్వర చరిత్రంబు, సర్వార్ణవసంగ మాహాత్మ్యకంబు,
రసికజనమనోభిరామంబు, లక్షణసారసంగ్రహమును, సర్పపుర స
మంచిత క్షేత్రకథనంబు, మఱియుఁ బెక్కు శతక దండక సత్కృతుల్ ప్రతిభఁగూర్చి"
(శివలీలావిలాసమునను)

పేర్కొనియున్నాఁడు. అతనికృతులలో 'శివలీలావిలాసము' కట్టకడపటిదిగాఁ గనఁబడుచున్నది. ఏలయనఁగా, నందులోఁ దాను వ్రాసిన

గ్రంథముల నన్నింటిని తెలిపియున్నాఁడు. పైఁగా, దేనిలోను దడవని తనశతకములగూర్చి "శివలీలావిలాసము"లో సూచనప్రాయముగాఁ జెప్పినాఁడు. వాని పేరులు తెలుపలేదు. "శతకదండకసత్కృతుల్" అనినందువలన నవి రకమున కొకటికి మించియుండవలయును.

తిమ్మకవి తాను వ్రాసిన ప్రతికృతిలోను దద్రచనాకాలమును సూచించి విమర్శకలోకమున కొకింత మేలుచేసెను. ఈక్రింద నతఁడే యేగ్రంథముల నెప్పుడు వ్రాసినది తెలుపుపట్టికను బరిశీలించినచో నతనికాలము సులభముగ నూహింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. | రుక్మిణీ పరిణయము | శా. శ. 1637— | క్రీ. శ. 1715 |
| 2. | సారంగధర చరిత్రము | ,, 1651— | ,, 1729 |
| 3. | భర్గశతకము | ,, 1651— | ,, 1729 |
| 4. | సర్వలక్షణ సారసంగ్రహము | ,, 1662— | ,, 1740 |
| 5. | రసికజనమనోభిరామము | ,, 1672— | ,, 1750 |
| 6. | సర్పపురీ మాహాత్మ్యము | ,, ? | ,, 1754 |
| 7. | శివలీలా విలాసము | ,, ? | ,, 1756 |
| 8. | సింహాచల మాహాత్మ్యము | | |
| 9. | నీలాసుందరీ పరిణయము. | | |
| 10. | రాజశేఖర విలాసము | ? | ? |
| 11. | అచ్చతెలుఁగు రామాయణము | | |
| 12. | కుక్కుటేశ్వర శతకము | | |

రెండుమూఁడుతప్పఁ బై గ్రంథములలో నన్నియు ముద్రితములే. కడపటి యైదింటి రచనాకాలము తెలియవచ్చుటలేదు. "కుక్కుటేశ్వర శతక" మసమగ్రము. (92 పద్యములే కలవు). కాని తన ప్రతికృతిలోను కవి స్వయముగాఁ దాను వ్రాసిన గ్రంథముల నొకక్రమము ననుసరించి పేర్కొన్నాఁడు. అందులోఁ దొలిదైన 'రుక్మిణీపరిణయమే' యతని మొట్టమొదటికృతి. అది క్రీ॥ శ॥ 1715 సం॥రమున సాగినది. ఆ తరువాత (1) సింహాచలమాహాత్మ్యము, (2) నీలాసుందరీ పరిణయము, (3) రాజశేఖరచరిత్ర—యీమూఁటిని వ్రాసినట్లు తెలిపినాఁడు. కాని వాని కాలములు తెలుపలేదు. వీనితరువాత 'సారంగధరచరిత్ర' (ద్విపద)—'భర్గశతకము', రచించినట్లు చెప్పినాఁడు. ఈ రెండును లఘు

కృతులే. వీనినిర్మాణకాలము క్రీ॥ శ॥ 1729. కాబట్టి క్రీ॥ శ॥ 1715—1729 కు మధ్యగల 14 ఏండ్లలో పైమూఁడుకృతులరచన జరిగియుండు ననుటలో నేమాత్రము సందేహము లేదు. సారంగధరచరిత్ర వ్రాసిన క్రీ॥ శ॥ 1729 కిని, సర్వలక్షణసారసంగ్రహము వ్రాసిన 1740 కిని ఆకీతి గనే మధ్యగల 12 ఏండ్లవ్యవధిలో "నచ్చతెలుఁగు రామాయణ" కావ్యనిర్మాణము జరిగియుండును. దీనినిబట్టి కవిజీవితకాలమును గ్రహించుట కొంచెము సులభసాధ్యము.

'రుక్మిణీపరిణయము'ను వ్రాసిన (1715) కాలమునకు కవికి 25 యేండ్లప్రాయమైన నుండును. ఆపక్షమునఁ దిమ్మన క్రీ॥ శ॥ 1690 సం॥ రం॥ ప్రాంతమున జన్మించినవాఁ డనుట సమంజసము. అతని కడపటి కృతి యయిన "శివలీలావిలాసము" క్రీ॥ శ॥ 1756 లో వ్రాయఁబడినది. కనుక నతఁడు దాదాపు 1760 ప్రాంతమునకు జీవించియుండవలయును. ఈనిర్ణయము సత్యమే యని ఋజువుచేయుటకు మఱియొకయాధారము కూడ లేకపోలేదు. తిమ్మకవి :—

"రావు మాధవనృప పరిరక్షితంబు భోగనికరంబు పీఠికాపురవరంబు"

అని తాను "రుక్మిణీపరిణయము" వ్రాయు కాలమునకుఁ బీఠికాపురమునకుఁ బ్రభువైన పెద్దమాధవరావును బేర్కొన్నాఁడు. ఇది 1715 నాఁటిరచన ; కనుక నతఁడు ప్రభువులదృష్టి కెక్కునంత ప్రౌఢుఁడుగా నుండియుండఁడు. కాని 1750 లో రచించిన 'రసికజనమనోభిరామము'లో :—

"రావు నీలాద్రి మాధవరాయ నృపతిచేతఁ గవిసార్వభౌమ విఖ్యాతి బిరుద మందిన ఘనుండఁ, దిమ్మయాహ్వయుఁడ॥"

అని చెప్పినాఁడు. దీనినిబట్టి యీనీలాద్రిమాధవరాయనృపతి —నీలాద్రిరాయణింగారి మనుమఁడయిన 'చిన్నమాధవరాయణింగా రనియు, నితఁడు వేంకటకృష్ణారాయణింగారికిఁ దరువాత — ననఁగా 1759 లోఁ బ్రభుత్వమునకు వచ్చినాఁడనియుఁ దెలియుచున్నది. అట్టి సందర్భములోఁ, దిమ్మకవి తాను 1750 లో వ్రాసిన రసికజనమనోభిరామములో 1759 లో వచ్చిన ప్రభువు కవిసార్వభౌమబిరుద మిచ్చినాఁడనుట పొసఁగునా ?—ఏల పొసఁగదు ? బిరుదమిచ్చుటకుఁ, బరిపాలనము సేయురాజే యయి యుండవలయునను సిద్ధాంత మెక్కడను

లేదుకదా! యువరాజైన నందులకర్వుఁడే కదా! తిరుపతి వేంకటకవులు వేంకటగిరిసంస్థానమునకు వెడలినప్పుడు ముందుగా సత్కరింపఁబడినది, యప్పటి యేలికయగు శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రులవారివలన కాద నియు, వారి సోదరులగు ముద్దుకృష్ణ యాచేంద్రులవారిచేత గౌరవింపఁ బడిరనియు వారి 'నానారాజసందర్శనము' వలనఁ దెలియుచున్నది. కనుక చినమాధవరాయణింగారివలన తిమ్మకవియు బిరుదము పొంది యుండుటలో నసంభవ మేమియు లేదు. (ఏలికకాకున్నను) యువరా జైనవానికి నంతమాత్ర మధికారముండియుండు ననుట బేసబబుకాదు.

తిమ్మకవియెడల (అతని కాలమునకు) సంస్థానాధిపతులయిన దొరలకెల్ల సమాన గౌరవ ప్రతిపత్తు లున్నట్లతని రచనలన్నిట వారిని బేర్కొనుటచేతనే సూచితమగుచున్నది. తన రుక్మిణీపరిణయములో పెద్దమాధవరాయణింగారిని, సారంగధరచరిత్రలో వేంకటకృష్ణారాయ ణింగారిని, రసికజనమనోభిరామములో నీలాద్రి (చిన్న) మాధవరాయ ణింగారిని పేర్కొన్నాఁడు. ఈముగ్గురిలోను మొదటియిద్దఱికంటె మూఁడవవారే యెక్కువరసికులుగను, నెక్కువ సన్నిహితులుగను నుండి, కవిగారి నాదరించి, సత్కరించి, బిరుదమిచ్చి యుందురనుటలో సందేహము లేదు. పైఁగా నీప్రభునియొక్కయుఁ, గవిసార్వభౌముని యొక్కయు వయస్సులలో నట్టే తేడా కనబడుటలేదు. సమకాలికులు, సరసులయిన వీరిరువురి సమకాలికత్వము—ప్రభువు సాహిత్యపోషణ కును, కవియొక్క కవితాప్రతిభాప్రకటనకును తగినయవకాశము కలి గించినది. కనుకనే, కవి యందలి తనగౌరవమును సూచించుటకు చిన మాధవరావు "సార్వభౌమ" బిరుద మతని కనుగ్రహించినాఁడు.

తిమ్మకవి తనకులగోత్రాదికములనుగూర్చి తన కృతులలో విన రముగా వ్రాసికొనినాఁడు:—

ఇతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. లచ్చమ గంగనల జ్యేష్ఠపుత్రుఁడు. ఇతనితాత కూడ తిమ్మననామాంకితుఁడే. ముత్తాత బయ్యన. జగ్గన్న సింగన్న, నరసన్న లితని పినతండ్రులు. వీరమ్మ, పాపమ్మలు మేనత్తలు. సింగన్న, జగ్గన్న (జగన్నాథకవి) సూరన్నలు తమ్ములు. ఇతని సతీతిలకము గొట్టుముక్కల రామయమంత్రి కూఁతురైన బుచ్చమాంబ.

తిమ్మకవి తనరసికజనమనోభిరామములో :—

"నిఖిలవిద్యాభ్యాస నిపుణుఁడు మత్సహోదరుఁడగు జగ్గనకృతితనయులు
ఘనులు తిమ్మనయు, సింగనయును లేఖకపాఠకులై కృతుల్ ప్రబలఁజేయ"

అని చెప్పుకొనుటచేత నితనికి సంతానము లేదని యూహింప వలసియున్నది. జగ్గన్న కుమారులనుమాత్రమే పేర్కొనుటచేతఁ దక్కిన యిద్దఱికిఁగూడ నప్పటివఱకు బిడ్డలు లేరనియే తోఁచుచున్నది. తిమ్మకవిమీఁద నతనితమ్ములకుఁ, దమ్మునికుమారులకు నమితగౌరవమున్నట్లు తెలియుచున్నది. జగ్గకవి యితనినిగూర్చి తనకృతులలోఁ బ్రశంసించిన యీక్రింది వాక్యములవలన నది రుజువగుచున్నది.

"మానితానూనాసమాన నానావిధవంగ త్రిలింగ ద్రవిడ దేశభాషా విశేష భూషితాశేష కవితావిలాస భాసురాఖర్వ సర్వలక్షణసారసంగ్రహోద్దామ రామాయణాది ప్రముఖ బహుళ ప్రబంధనిబంధనబంధురవిధాన నవీనశబ్దశాసనబిరుదాభిరామ తిమ్మకవిసార్వభౌమ" (చంద్రరేఖావిలాపగద్య)

"రకపుం గావ్యకళాకలాపరచనా ప్రాగల్భ్యసంసిద్ధికై,
ప్రకటప్రేమ భజింతు నీశమకుట ప్రస్ఫీతగంగాజలా
ధికమాధుర్యకవిత్వ ధూర్వహధియా దివ్యప్రభావాఢ్యుఁ ది
మ్మకవిశ్రేష్ఠు, మదగ్రజుఁ మగిని రామా భక్తమందారమా" (భక్తమందారశతకము)

ఇతఁడు రుక్మిణీపరిణయములోఁ దప్పఁ దక్కిన తనయన్నికృతుల లోను "దెందులూరి లింగనారాధ్యుని" తనగురువని స్తుతించుటచేత రుక్మిణీపరిణయ రచనాకాలమునాఁటి కతనికి గురువుగారి యాశ్రమము కలుగలేదని యేర్పడుచున్నది. తద్రచనాకాలము క్రీ॥ శ॥ 1715. ఆతరువాత క్రీ॥ శ॥ 1729 సం॥ అతఁడు సారంగధరచరిత్రలో :—

"శ్రీకరగుణసార చిరశుభాకార, నాకధునీజార నవసుకుమార
అలఘుతేజోనిధి యగు దెందులూరి కులు లింగనారాధ్య గురుని నుతించి"

యనియు, భర్గశతకములో

"చిరభక్తి స్మదిలో భవద్వ్రితముగా జింతింతు నశ్రాంతముకౌ
బరవాదిప్రమదద్విపేంద్రపదవీ పంచాననశ్రేష్ఠు బం
ధురతేజోనిధి, దెందులూరి కులపాథోరాశి రాకానిశా
కరునిఁ లింగయసద్గురూత్తముని భర్గా పార్వతీవల్లభా"

అనియుఁ జెప్పుటవలన దెందులూరి లింగనారాధ్యగురుత్వము 1715—1729 సంవత్సరముల మధ్య యెప్పుడో యతనికి లభ్యపడి

యుండవచ్చును. ఈగురూపదేశము పొందుటకుముందు తిమ్మకవి, తాను రచించిన రుక్మిణీపరిణయములోఁ దక్కినకృతులలోవలె సతీసహితముగాఁ ద్రిమూర్తులను గణాధిపునిమాత్రమే కాక, యాంజనేయ, వైనతేయ, నవగ్రహాదులనుగూడ, స్తుతించుటచేత వైష్ణవపక్షపాతముగల యద్వైతిగనే కనిపించును.

నియోగులలోఁ బ్రాజ్ఞాటివారనియు నార్వేలవారనియు రెండు ప్రధానశాఖలున్నవి. అందులో మొదటిది తిర్యక్పుండ్రాది శైవప్రముఖాచారముగా, రెండవది యూర్ధ్వపుండ్రాది వైష్ణవప్రసిద్ధాచారపరముగా వ్యవహరించుచుండినను రెండు నద్వైతమతమునే యవలంబించి, శాంకరగురుపీఠమునకే యంకితమైయుండుట యందఱికెఱుకపడిన విషయమే. ఒక్కగోల్కొండవ్యాపారిశాఖమాత్రమే విశిష్టాద్వైతమతము నవలంబించినది. ఇఁక నార్వేలశాఖవారు శివకేశవభేదములేని శుద్ధాద్వైతులైనను, నామములు ధరింతురు. ఈయార్వేలశాఖవారినిగూర్చి కంకంటిపాపరాజు చెప్పిన విషయములన్నియు నక్షరముల నిజము. ఆనాఁటి కవులందఱు నూటికి డెబ్బదియైదుగురు ఆర్వేలవారే. (ఇఁక నిప్పుడున్న వారిమాటయో)—అదివిషయాంతరము.

ఆర్వేలశాఖవాఁడయిన మన కూచిమంచితిమ్మకవి యద్వైతమతావలంబకుఁడై యుండియు,

"దెందులూరి లింగనారాధ్య దేశికేంద్రదత్త మాహేశ్వరాచార వృత్తిరతుఁడ"

అనుటచేత శుద్ధశైవమతము నవలంబించినట్లు తోఁచుచున్నది. లింగన యారాధ్యబ్రాహ్మణుఁడని పైపంక్తులే చెప్పుచున్నవి. అనఁగా లింగధారణము కలిగిన వీరశైవుఁడని వేఱచెప్పనక్కఱలేదుకదా! అయిన నతని శిష్యుఁడగు మనతిమ్మకవి (శుద్ధ) శైవము నవలంబించి యుండవచ్చును. కాని వీరశైవాచారపరుఁడు మాత్రముకాఁడు. లింగన శిష్యత్వముచేత, నాంజనేయవైనతేయాది భక్తస్తుత్యాదులు దగ్గినవి. కాని, త్రిమూర్తులమీఁద నతనికిఁగల భక్తి సమానమే: ఇక్కడ మఱొకవిశేషము :—చిన్ననాటినుండి యతని శివభక్తి యతివేలము. అందునను పీఠికాపురకుక్కుటేశ్వరుఁ డతనియిష్టదైవము. అందుచేతనే (సర్పపురీ మాహాత్మ్యముతప్ప) తనగ్రంథములన్నియుఁ గుక్కుటేశ్వరునకే యతఁ డర్పించినాఁడు.

ఇతఁడు పీఠికాపురసంస్థానములోఁ జేరిన 'కందరాడ' గ్రామములో నుండువాఁడనని, సర్వలక్షణసారసంగ్రహములోను, శివలీలావిలాసములోను స్పష్టపఱచినాఁడు. కాని సారంగధరచరిత్రలో మాత్రము, తన్నుఁ గూర్చి చెప్పుకొనుటలో "పావన కంద్రాడ పట్టణాధిపుఁడ" యని పొగడుకొనినాఁడు. దీనినిఁబట్టి సారంగధరచరిత్రరచనాకాలమునకు (క్రీ॥ శ॥ 1729) అతఁడా గ్రామకరణీకమును సర్వాధికారములతో ననుభవించుచుండినాఁడనుట సత్యము. అయిన, సర్వలక్షణసారసంగ్రహము వ్రాసిన క్రీ॥ శ॥ 1740 సం॥రమునకుఁ దర్వాత నాయుద్యోగమును దనతమ్ముండ్రకో, జగ్గకవికుమారులకో యప్పగించి, సాహిత్యకవిత్వవిచారములతోఁ దాను కాలము గడపియుండును. అనఁగా నప్పటికే తిమ్మకవివయస్సు అఱువదియవపడిలోఁ బడియుండుటచేత "లేఖకపాఠకులు"గా జగ్గకవికుమారులసహాయ మపేక్షించుచు (రసికజనమనోభిరామము చూడుఁడు) నున్నవాఁడు కరణీకమును నిర్వహించుట కష్టమయి వారికే యొప్పగించినాఁడనుట సహేతుకమే. కనుక క్రీ॥ శ॥ 1729 నాఁటికి కంద్రాడపట్టణాధిపుఁడైన తాను 1740 నాఁటికి కందరాడ మందిరుఁడైనాఁడు.

పైఁగాఁ దాను స్వతంత్రముగా వ్రాసిన కుక్కుటేశ్వర భర్గ శతకములలో రాజులను, వారిప్రవర్తనములనుగూర్చి యుపాలంభించుటకుఁ, దనకరణీకవృత్తి ప్రతిబంధకముగా నుండునేమో యనునూహచేతఁగూడ దానిని వదలియుండవచ్చును. పోషకులయిన పీఠికాపుర ప్రభువులను దనగ్రంథములలోఁ గ్వాచిత్కముగా సూచించి తనప్రభుభక్తిని లాంఛనప్రాయముగాఁ దెలుపుకొనెనేకాని, యేప్రభువునకైన నొకకృతినైన నంకితము చేయలేదు. వారు నతని మహాకవిగా నంగీకరించి 'సార్వభౌమ' బిరుదముతో గౌరవించిరి. కాని తమపేర కృతి రచింపవలసినదని యెప్పుడును గోరినట్లు కనఁబడదు. తిమ్మకవిజీవితములో నుండు నీయద్భుత సన్నివేశము మఱి యేకవిజీవితములోను లేదు, "ప్రభువు—ఆశ్రితుఁడు"—అనునంతస్తులలోఁగాక, స్వతంత్రవృత్తి గల పాలకపాలితభావములో—సమానఛాయాలో—పీఠపురాధీశతిమ్మకవిసార్వభౌముల కాలము గడచినది. అవసానకాలములో నతఁడుచంద్రమపాలెము చేరినట్లు తెలియుచున్నది.

ఇతనికి "కవిసార్వభౌముఁడు" అను చినమాధవరాయ ప్రదత్త బిరుదమేకాక, "నవీనశబ్దశాసన" బిరుదముకూడ నున్నట్లు జగ్గకవి "చంద్రరేఖావిలాపము"వలనఁ దెలియుచున్నది. బహుశా యీబిరుద మతని "సర్వలక్షణసారసంగ్రహ" రచనముతరువాత విద్వత్కోటి యనుగ్రహించియుండవచ్చును. కాని యీబిరుదమునుగూర్చి తాను, స్వరచితగ్రంథములలో దేనియందును చెప్పలేదు.

తిమ్మకవిసార్వభౌముఁడు వశ్యవాక్కు. సంస్కృతాంధ్రము లలో సమానపాండిత్యము కలవాఁడు. అచ్చికశబ్దములతో నిరాఘాట ముగా కవిత్వమును 'కదం' త్రొక్కింపఁగల యుద్దండుఁడు. అతని కావ్యములలో నర్థాలంకారములకంటె శబ్దాలంకారములు ప్రాధా న్యము వహించును. లక్షణానుసరణమైన కవిత్వమును సాగించుటలో శ్రీనాథుఁడు. ఆకాలమున సంస్థానాధిపతులు—పండితులు మొదలయిన వారందఱు నతనిని గౌరవప్రపత్తులతోఁ జూచువారు. కవు లతనిగ్రంథ ములను ప్రామాణికములుగా నంగీకరించువారు. రాజులయెడఁ దిమ్మ కవి గౌరవము చూపువాఁడే; కాని వారి ప్రవర్తనలమాత్ర మంతగా మెచ్చుకొనువాఁడు కాఁడు. పైఁగా నీసడించువాఁడు. ఆకారణము చేతనే వారికి గ్రంథములను గృతి యీయలేదు. ఈవిషయమున నీతఁడు బమ్మెరపోతరాజునకుఁ దుల్యుఁడైనను నీయిరువురి నరాంకిత విముఖత్వములో భేదము లేకపోలేదు.

పోతన రాజులను "మనుజేశ్వరాధము" అన్నాఁడు. "సద్ద్విజ శ్రేయమై"—అని ద్విజులనుమాత్రము "సద్ద్విజు" లన్నాఁడు. ఇందు లోఁ గటువైన పరనింద, ఆభిజాత్యసూచకమైన యాత్మస్తుతి యున్నవి. ఇట్టిభావములు తిమ్మకవికి నున్నవి; కాని యంత పెడసరముగా (శత కములలోఁ దప్ప) నతనికృతులలో నంతగాఁ గనిపింపవు. అందుకుఁ గారణము లేకపోలేదు. వ్యవసాయము స్వయముగాఁ జేసికొనుచు బ్రతుకు నిరుపేదరైతయిన బమ్మెరపోతన, పాలకులవలన బాధ లనుభ వించినాఁడు. కవిసార్వభౌముఁ డట్లుకాక, "కందనాడపురాధీశుఁడై గ్రామన్యవహారములన్నియుఁ దనయదుపులో నుంచుకొని ప్రభువుల గౌరవమును సంపాదించుకొని జీవించినాఁడు.

నరులకుఁ గృతినర్పించుటకుఁ దన యసమ్మతిని జూపిన పోతన:—

"హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి, య
ల్ల కర్ణాటకిరాటకీచకులకమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ"

అని ప్రభువులయెడలఁ దనకుఁగల ద్వేషభావమును బూర్తిగ వెల్లడించినాఁడు. తిమ్మకవికూడ :—

"వినుమఖిలేశ, మర్త్యులకు వేడుకఁ గావ్యమొసంగి, ధాత్రిపై
నొనరఁగ సౌఖ్యసంపదల నుద్ధతులై సుకవీంద్రులుందురు"

అనియు,

"పనిఁబూని తుచ్ఛభోగంబునకై కొఱగాని జనులఁ బొగడుటయెల్లన్
గనుఁగొన నిహపరదూరం బని తలఁచి వినిర్మలాంతరంగుండగుచున్"

(రాజశేఖరచరిత్ర)

అనియు చెప్పినాఁడు. అంతియకాక తన రసికజనమనోభిరామములో :—

"నరవరులిడు మణిభూషాకరితురగాందోళికాది ఘనవిభవము లస్థిరము లవేటికి"

అని యన్నాఁడు. ఈవిధముగా, రాజులను, వారికిఁ గవులవిషయములోఁగల యలక్ష్యభావమును, వారిత్యాగములనుగూర్చి యితఁడు తనకుక్కుటేశ్వరభర్గశతకములలో మఱియు దీవ్రముగా విమర్శించుటతోఁబాటు వారిననుసరించుపండితులనేగాక, కవులనుగూడ నిరసించి పలికినాఁడు దానినిగూర్చి మున్ముందు మనవిచేయుదును.

తిమ్మకవి కవితను దనయనుదినారాధ్యదేవతగా భావించి, తన కృతులకన్నిటికిఁ "గుక్కుటేశ్వరు"నే పతిగాఁ జేసినాఁడు. పూర్వకవుల ప్రయోగముల నొరవడిగాఁ బెట్టుకొని శబ్దౌచిత్యమెఱిఁగి, నిరాఘాటముగా, ధారాశుద్ధితోఁ గవిత్వము సాగించుశక్తి యితనితో నంతరించినట్లు ప్రాచీనపద్యవాఙ్మయచరిత్రకారుల యభిప్రాయము. ఆనాఁటి సిద్ధహస్తులయిన కవీంద్రులలో నగ్రగణ్యుఁడైన యీతిమ్మన తనశివలీలావిలాసములో :—

"వినుఁ డీకృతి ముప్పదియొక దినములకుం జెప్పినాఁడ దేవునియాజ్ఞన్"

అని చెప్పుటవలన, నొకనాటికిన్ని పద్యములు రచింపవలయునను నియమము నవలంబించి గంగాఝరీసరణినిఁ బురుడించు ధారలోఁ బెక్కు లాచ్ఛికమిశ్రకావ్యములు వాణికిఁ దొడవులుగా దిద్దితీర్చుచుఁ దనజీవితమును గవితాసామ్రాజ్యపాలనకే యర్పించినట్లు తోఁచుచున్నది.

ఇతఁడు మహారసికుఁడు. ఇతనికావ్యములలోని శృంగారఘట్టములు రసికయౌవతయువతతుల కనురాగవర్ధనములు. కాని, దాని నాధారముచేసికొని, మనవా రట్టిమహాకవుల జీవితములకుఁ గళంక మాపాదించు చిలిపికతలను గల్పించి, చెప్పుట సర్వథా గర్హ్యము. అందు నీతిమ్మకవినిగురించి యీక్రిందికత పరంపరగా వచ్చుచున్నది :—

ఇతని కావ్యములలోని శృంగారరసము నామూలాగ్రముగా గ్రహించి యానందించు విద్వత్కవయిత్రి యయిన యొకవారకాంత యతని సాహచర్యమునకుఁ దగిన యవకాశముకొఱకుఁ జూచుచుండఁగా నిర్జనమయిన యొకసందుమలుపులో నతఁ డొకనాఁడు హఠాత్తుగాఁ దటస్థపడినాఁడట! అప్పుడామె బలాత్కారముగా నతనిని గౌఁగలించుకొనినదఁట! అతఁడట్టిసమయమున మోమావలకుఁ ద్రిప్పుకొనినాఁడఁట! అంతట నాగణికారత్నము :—

"చతురులలోన నీవు కడుజాణవటంచును, నేను గౌఁగలించితి నిటు
మాఱుమోమిడఁగఁజెల్లునె, యోరసికాగ్రణ్య!"

యనఁగా కవి వెంటనే :—

"అద్భుతమగునట్టి బంగరపుఁబొంగరపుంగవఁ బోలు నీకుచద్వితయము
ఱొమ్ము నాఁటి యల వీపున దూసెనటంచుఁ జూచితిన్"—

అనిచెప్పెనఁట! ఇది కర్ణాకర్ణిగా వచ్చుచుండు కట్టుకథ యనుటకు సందియములేదు. తిమ్మకవి రసికతాపరీక్ష కిదియా యుపాయసము? సందుమలుపా ప్రదేశము? ఎంత సిగ్గువిడిచినవారైన నిట్లు తమ గుడ్డిప్రేమను బ్రదర్శింతురా? విద్యావివేకములుగల నాయికానాయకుల కిట్టి రసాభాసపు నడివీధి శృంగార మంటఁగట్టి, వారి రసికత కిది తార్కాణమని పొంగిపోవు మేధావులు కుర్కురశృంగారక్రీడాప్రశంస చేయువారికంటె భిన్నులుకారు, *

నేఁటిమనవా రెట్టి యపదూఱులు తిమ్మకవికేకాక, శ్రీనాథునికి, ధూర్జటికిఁగూడఁ గట్టిపెట్టిరి. కారణమేమన, శృంగారము తొణికిస

* కొందఱీకథను ముక్కుతిమ్మనార్యునకంటఁ గట్టుచున్నారు. దీని విశ్వసించువారు, పరిస్థితులనుబట్టి, అతనికే యవకాశమెక్కువ కాన, అదియే నిశ్చయమని తలంతురు. ఆప్రబంధయుగమున రసికలోకవరుఁడగు ముక్కుతిమ్మన సాంగత్యము గోరు గణిక సాహసించి (తెగఁబడి) ఆమహానగరమున నేమూలనో — తారసిల్లిన ముక్కుతిమ్మన విషయమున నట్లు ప్రవర్తించెననుట సందర్భశుద్ధికి లోటుగలిగింపదు.—

లాను నూతనభావోపేతములగు నామహాకవీంద్రుల చాయిన్పులు — వారికావ్యములలోని పద్యములే! కవి హృదయమును బాగుగాఁ బరచి, వారిగంభీరభావముల నర్థముచేసికొనలేని యసమర్థులయిన విమర్శకులకు "కరసంఘాదితపంచాయుధగేహా" లనిన బమ్మెరపోతనవంటి మహాభాగవతశిఖామణికూడ విటాగ్రణియే. రంధ్రాన్వేషణపరాయణుల సంకుచితదృష్టులు వారికి సహజములు కావచ్చును. కాని యవి సంఘమున కపకీర్తికరములు; లోకమునకుఁ బ్రమాదకరములు; చారిత్రక సత్యమునకు విపత్కరములు.

ప్రకృతిసిద్ధ మానవసౌందర్యమునకు యువతులు నిధులైనందున, వారి హావభావవిలాసవిభ్రమోపేత శృంగారమును మనవారు ప్రధానముగా స్వీకరించిరి. ఆరసపోషణ లేకుండ కృతులు రచించుట యన, వారిదృష్టిలో, "నేలవిడిచి సాము చేయుట" వంటిది. ఈవిషయమునఁ గొందఱి రచనలలో నేరవంత మోతాదు మించినట్లుండినను, వారెల్లరు దుర్వర్తనులనుట సాహసమే. అది సహింపరాని నేరము.

సహజసౌందర్యలీలావిలాస ముగ్ధమోహనలగు గ్రామవనితల నిష్కళంకకోమలరూపమహిమను గుర్తింపనినాయకులు — పుట్టుసౌందర్యము వెల్లడించు నవయవసౌభాగ్యములేని పట్టణవాసి కాంతాజన కల్పితాభరణాంబరశోభలను, స్నో, ఫేస్పౌడర్, లిప్స్టిక్కులరంగులను, నసహజదృగ్గమనాదుల తళుకుబెళుకులను జూచి, వారే "యందాలరాణు"లని నిర్ణయించు నీకాలములోని మనకుఁ బ్రాచీనకవుల శృంగారమవినీతిగను, వారు "పక్కా" విటరాజులుగను గనఁబడుటలో వింతలేదు.

కావున; తుచ్ఛభోగముల నాశించి, తనకృతులను, (అందుకొని సత్కరించు ప్రభువులుండియు) నరాంకితము చేయనొల్లక, లింగనారాధ్యగురూపదేశ ప్రాప్త పరమమాహేశ్వరవ్రతనిష్ఠాగరిష్ఠుఁడై, పారమార్థికబుద్ధితో జీవితము పవిత్రవంతముగాఁ గడపిన తిమ్మకవిసార్వభౌమునికిఁ బరిహాసమునకయిన నఘ మంటఁగట్టుట మహాపచారమగును.

పదునెనిమిదవ శతాబ్దపు కవులలోఁ దిమ్మకవికిఁగల స్థానము మహోన్నతమైనది. అతని కావ్యములన్నియుఁ, దత్పూర్వకవుల మార్గములోననే నడచినను, గొన్నింటిలో నూతనత్వము లేకపోలేదు. 'రసిక

జనమనోభిరామ' రచనలోని యభూతకల్పనలు, నష్టాదశవర్ణనలు, ప్రాచీన ప్రబంధముల ఫక్కీలోనే నడచినది. అంతవఱకుఁ బ్రబంధముల ధోరణులతోఁ దలవాఁచి, మొగముమొత్తిన రసికజనులకు, "రసికజన మనోభిరామము" వెక్కసమయినది.

అచ్చతెలుఁగుకావ్యములను సరళశైలిలో వ్రాయుటయందుఁ దిమ్మకవి సిద్ధహస్తుఁడు. అందులో నతనికుండు ప్రత్యేకప్రతిభయే, యాయన కవితాధారకొక విశిష్టతను జేకూర్చినది. అతనికిముందు పదునాఱవశతాబ్దములోని పొన్నిగంటి తెలగనార్యుఁడుకూడ నచ్చ తెలుఁగులో "యయాతిచరిత్రము" వ్రాసినాఁడు. కాని తిమ్మకవి "యచ్చతెలుఁగురామాయణ, నీలాసుందరీపరిణయము"లకు వచ్చిన ఖ్యాతి దానికి రాలేదు.

తెలుఁగువారి సంప్రదాయములను జాఱవిడువకుండ, నొడు దొడుకులు లేని కవిత్వ మచ్చతెలుఁగులో నడపి—యాంధ్రప్రజానీక ప్రశంసలందుకొనిన యానాఁటి తెలుఁగుకవి తిమ్మన సర్వధా శ్లాఘ్యుఁడు; ధన్యుఁడు. అతని నిండుతెలుఁగుఁదన మతనిశతకములలో బాగుగాఁ బ్రస్ఫుటమగుచున్నది.

అతని కుక్కుటేశ్వర శతకము తెలుఁగుసీమలోఁ జాలకాలముగాఁ బ్రచారములో నున్నది. ఇది వేణుగోపాల రామలింగేశాది శతకముల వలె నాఁకాలమునందలి సంఘదురాచారములను బ్రభువుల యవినయ ప్రవర్తనలను, నిర్దాక్షిణ్యముగా ఖండించుచున్నది. అట్టి శతకములను గవులు స్వానుభవమును, బురస్కరించుకొని చెప్పుటచేత, నారచనల లోని యావేగము, నావేశము, కావ్యలక్షణములనుగూడ నతిక్రమిం చుట సహజము. అట్టిసందర్భములలో శబ్దములు దూఁకుడుగా దొర్లు కొని వచ్చు ధోరణిలోఁ గవిత నడచును. జుగుప్సాంశములుకూడ కృతిముఖముగా బట్టబయలగును. అట్టివానిని పరిష్కర్తృమహాశ యులు, సంస్కరించి ప్రకటనార్హము చేయుటకు తంటాలుపడినను, తత్సహజ స్వరూపమును కవిహృదయమును దాఁపలేక పోవుచున్నారు. ఏలాటి నిశితబుద్ధిగల పాఠకుఁడైన, నట్టి పట్టులలో "నిది కవ్యుదిష్ట శబ్దము కా"దని వెంటనే కనిపెట్టఁగలఁడు. తిమ్మకవి కుక్కుటేశ్వర శతకములోఁ గూడ నట్టి పట్టులున్నవి.

ఈశతకమునకుఁ దిమ్మకవి తన "రుక్మిణీపరిణయము"లోనే యీక్రింది పద్యముతో నంకుగార్పణము చేసినాఁడు.

"చిన్నివెన్నెలఱేఁడు చెన్నైన సికపువ్వు. పసమించు పులితోలు పట్టుసాలు,
చిలువల యొకిమీఁదు బలు మానికపుఁదాళి, వాటంపుఁ దెలిగిబ్బ వారువంబు,
గఱికి పూజల మెచ్చు గాగాబు కొమరుండు, వలిగొండ కూఁతురు వలపుటింతి,
జేజే తుటుముతెల్లఁ జేరి కొల్చెడు బంట్లు, నునువెండి గుబ్బలి యునికిపట్టు,
నగుచుఁ జెలువొందు, భువనంబు లనుదినంబు రమణఁ బాలించు నిన్ను నేఁ బ్రస్తుతింతు
బుధనుతవిలాస, పీఠికాపురనివాస కుముద హితకోటి సంకాశ, కుక్కుటేశ !||"

ఈపద్యములోని కడపటి రెండుచరణములే కుక్కుటేశ్వరశతకమునకు మకుటమయినది. దీనినిబట్టి తన యిష్టదైవమైన కుక్కుటేశ్వరునికి తనకృతులన్నియు నంకితముచేయుటతోఁ దృప్తిపడకుండ నొక శతకమే యాదేవునిపేర వ్రాయనెంచినాఁడనియు, దానికి రుక్మిణీపరిణయములోని పైపద్యాంతచరణద్వయమే యందమైన మకుటముగా స్వీకరించినాఁడనియుఁ దెలియుచున్నది. కాని పైపద్యములోని 'బుధనుత' యనునది, శతకములో "భూనుత" యని మాఱియున్నది. ఇది యసలు కవికృతమే యయి యుండును.

ఇఁక శతకములోని విశేషములనుగూర్చి కొంచెము పరిశీలించుట యవసరము.

ఇందు పద్యములు 92 మాత్రమే. వానివివరణము :—

| | | |
|---|---|---|
| 1. దేవతాస్తుతి | 24 | పద్యములు |
| 2. స్వవిషయము | 1 | పద్యము. |
| 3. పంచాక్షరీ మహిమ | 1 | ,, |
| 4. ఖల లోభులు | 12 | పద్యములు. |
| 5. సుజనులు ఘనులు | 6 | ,, |
| 6. సుకవి కుకవులు | 4 | ,, |
| 7. సుశీలా దుశ్శీలలు | 5 | ,, |
| 8. పామరజనులు | 10 | ,, |
| 9. కలిమి లేములు | 2 | ,, |
| 10. సత్ప్రభు దుష్ప్రభులు | 2 | ,, |
| 11. దాతలు సప్తసంతానములు | 2 | ,, |

12. సామాన్యనీతులు 12 పద్యములు.
13. కలికాలమహిమ 2 ,,

ఈ విషయవిభాగములవలన, కవి యప్పటి సాంఘికపరిస్థితుల నన్నింటిని సులభముగా నవగాహనము చేసికొని పాఠకుల కన్నులకు కట్టినట్లెట్టయెదుట ప్రత్యక్షము చేసినట్లు గోచరించుచున్నది.

ఇందులోఁ గల తెలుఁగునాటి దైనందినవ్యావహారికశబ్దములు నుపమానములు :—

ముకుదాడు, బొల్యావు, పోట్లావు, ఎగదొబ్బు, తిండిపోఁతు, కక్కూర్తి, గొగ్గిపుట్టు, గగ్గెర్లు, గాజుపూస, సల్లబొట్టు, సుద్దపట్టె, తిర్నామాలు, పరగళ్లు, కుంటెనలు.

అద్భుతజాతీయములకు, నానుడులకు నీశతకము నిధివంటిది.

(1) కడుగ్గైన తవుడైన, (2) మాడైన ముక్కైన, (3) తప్పుదండుగలు, (4) గొల్లసుద్దులు, (5) బాపన పిసాసులు, (6) నాబంటు కొడుకు, (7) ఎగరాసి దిగరాసి, (8) కాయకసరైన, (9) సల్లమిమ్మ సవకమిమ్మ, (10) తిమలంబుతుక్కు, (11) పల్లకికుక్క, (12) పటాపంచలు, (13) సందడితీర్చు, (14) కీల్గంటు పువ్వు, (15) సానకిందివన్నె, (16) జగడాలచీలి, (17) వేసాలవెల్లి, (18) చెరపనచేట.

లోకోక్తులు, ఉపమానములు, నుక్తవిషయముల కతికినట్లు కూర్చుటలో నీశతకకారుఁడు కడుంగడుదిట్ట :—కొన్ని యీ క్రింద కాననగును :—

(1) పాడింట ఇడిన దీపము, (2) షండున కబ్బిన చాన, (3) కోతి కొదవిన కొబ్బరికాయ, (4) రాతిని నార దీయవచ్చు, (5) గాలిపోగిడి మూటగట్టుట, (6) కోతికి బంగారు గొలుసు, (7) జొన్నఁబడు గ్రుడ్డి యెద్దు, (8) కయ్యంబునకు కాలుదువ్వు, (9) మంగలిచేతి దర్పణములు, (10) తృణహుతాశనములు, (11) తలకొట్టఁ బడుట, (12) కొండతో తగరు ఢీకొనుట.

ఇవిగాక, (1) రాజ్యాంతే నరకంధ్రువమ్, (2) జాతస్య మరణం ధ్రువమ్. అను నార్యవచనములు నటనటఁ గాన్పించుచున్నవి.

సంస్కృతగ్రంథములలోని భావములుకూడ సీశతకములో నక్కడక్కడ నగపడుచున్నవి :—

"అంభోధి కభిషేక మాచరించిన యట్లు, గంగకుఁ బాద్య మొసంగినట్లు,
మేరువునకు నలంకారంబు లిడినట్టు, లినునకు నారతు లెత్తినట్లు
మలయాచలమునకుఁ గలప మిచ్చినయట్లు ఇలకపంతునకుఁ బూ విడినయట్లు
భూపముఖ్యునకుఁ దాంబూల మిచ్చినయట్లు సోమున కద్దంబు సూపినట్లు
నిఖిలలోకైకభర్తకు నీకు నొక్క బిల్వదళ మర్ప్యవర్య్య లర్పించుచుంద్రు"
—(కుక్కుటేశ్వర శతకము)

ఈపద్యభావము సౌందర్యలహరిలోని :—

"ప్రదీపజ్వాలాభి ర్దివకర నీరాజనవిధి
స్సుధాసూతే శ్చంద్రోపలజలలవై రర్ఘ్యరచనా,
స్వకీయై రంభోభి స్సలిలనిధి సౌహిత్యకరణం
త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతిరియమ్"

అను శ్లోకభావమునకు ఛాయ ; కాని—పద్యములో, 'బిల్వదళార్పణము', శ్లోకములో "స్తుత్యర్పణము" ప్రసక్తమైనది. "సుధాసూతేశ్చంద్రోపలజలలవై రర్ఘ్యరచనా" యనునది తెలుఁగులో "సోమునకద్దంబు సూపినట్లు" అనుటచేత సంపూర్ణభావము రాలేదు. తక్కినవానికి ప్రజలర్పించు నౌపచారికవస్తుసముదాయము సమృద్ధిగా నున్నప్పుడట్టి యౌపచారికము పరిహాసాస్పదమని భావము. ఆరీతిగాఁ జంద్రునికి సమృద్ధిగా నుండువస్తువు (అతనిచేతనే ద్రవీకరింపఁబడిన) "చంద్రోపలజలం" మూలశ్లోకములో సూచితము. ఆస్థానమును తెలుఁగుపద్యములోఁ గవి "యద్దము"న కిచ్చినాఁడు. ఇది ప్రక్రమభంగమే కాకుండ భావపుష్టికిని గించిన్న్యూనము.

"శతవత్సరంబులు జనులకు నాయు, వంబుజాసనుఁడు మర్యాదచేసె"

యనుపద్యము — "ఆయుర్వర్షశతం" అను శ్లోకభావమును బుడికిపుచ్చుకొనినది.

"నదులలో జాహ్నవి, నరులలో విప్రుండు, గ్రహములలోనఁ బంకజహితుండు,
తృణములలో దర్భ, మృగముల సింగంబు వ్రతముల ద్వాదశి, లతల జాజి,
దానమ్ములం దన్నదానమ్ము, లోహజాతమ్ములలోనఁ గార్తస్వరంబు,
గిరులలో మేరువు, పురములలోఁ గాశి, తరువుల రావి, సంతతులఁ గృతియు"

అనుపద్యభావము, భగవద్గీతలలోని విభూతియోగ శ్లోకముల లోనివి.

1. నదులలో జాహ్నవి (స్రోతసామస్మి జాహ్నవి).

2. నరులలో విప్రుఁడు (నరాణాంచ నరాధిపం) "నరాధిపం" అనుముక్కకు విప్రుండు అని వ్రాయుట జాత్యభిమానమునకు సూచన.

3. గ్రహములలోనఁ బంకజహితుండు. (జ్యోతిషాం రవిరం శుమాన్).

4. మృగముల సింహంబు (మృగాణాంచ మృగేంద్రోహం.)

5. గిరులలో మేరువు. (మేరుశ్శిఖరిణామహం.)

6. తరువుల రావి (అశ్వత్థ స్సర్వవృక్షాణాం.)

## అనుకరణములు

ఈకుక్కుటేశ్వరశతకము నొరవడిగా నుంచుకొని వంకాయల పాటి వేంకటకవి "కోలంక శ్రీమదనగోపాలశతకము"ను రచించినాఁడు. ఎత్తుగడలుగూడ "ఫక్తుకాపి"

1. 'గురుతర కౌండిన్య గోత్ర పవిత్రుండ' (కుక్కు)
   'గురుతర గౌతమగోత్ర పవిత్రుండ' (కోలం)
2. 'దండ ముద్దండ దోర్దండ విఖండిత' (కుక్కు)
   'దండంబు దోర్దండ మండిత కోదండ' (కోలం)
3. 'కాకంబునకు రత్నఖచిత పంజరమేల ?' (కుక్కు)
   'ముసిఁడి తుప్పలకు గొప్పలు త్రవ్వగానేల ?' (కోలం)

(ఇట్టిపద్యాలు కో. మ. గో. శతకములో మూఁడున్నవి.)

4. 'భోగియై ప్రతిదినత్యాగియై పుణ్యసంయోగియై సుజనానురాగి యగుచు (కుక్కు)
   'జారుఁడై దుష్ట ప్రచారుఁడై, పాపవిదూరుఁడై బహుమరాచారుఁ డగుచు' (కోలం)
5. 'ఘూకంబు తెఱఁగున గొందుల నిఱుకుచు భుజగంబు చాడ్పున బుస్సనుచును' (కుక్కు)
   'కడుపిశాచముకీతి నెడపక భక్షించి గ్రామసూకరమట్లు కడుపుపెంచి (కోలం)
6. 'ఎలుఁబోతునకు విద్దెలెన్నింటి నేర్పిన మకుఁగునకేఁగుట మానఁగలదె ?' (కుక్కు)
   'ఏపి నందలముపై నెక్కించినను గ్రిందికురవడి పుల్లల నఱుకకున్నె ?' (కోలం)
7. 'అలికులవేణి సింహకిశోరనిభమధ్య, పరిపక్వబింబోష్ఠి పద్మగంధి,
   రాకేందువదన శరచ్చంద్రికాహాస కోకిలకలవాణి కుందరదన
   పల్లవపాణి శంపాలతావిగ్రహ లికుచవక్షోజ నాళీకనేత్ర
   ముకురకపోల చంపకపుష్పసమువాస భుజగరోమావళి పులినజఘన (కుక్కు)
   'కలికి మిటారి పూవిలుతుచేతికటారి, బంగరుబొమ్మ కప్రంపుదిమ్మ,
   యున్నుల తలమిన్న చిన్నిసంపెఁగగున్న. గోములనడుదీవి సుజ్ఞామావి,

వన్నెల దొంతి మవ్వంపుఁ బువ్వుబంతి, రతనాల తేట వరాల మూట
పండువెన్నెల సోరు జలువు మానికపు తీరు, వలపుల మొక్క మేల్ కేరడపు ముక్క' (కోలం)

8. 'జగడాల చీలి, వేసాలవెల్లి పిసాళి, తిండిపోతు, గయ్యాళి, మొండికెత్తె,
హేయభాజనము, పల్మారియల పుట్టిల్లు. గంతులరాకాసి, పంతగత్తె,
యపలక్షణముతావు, నవివేకముల ప్రోవు, చెఱపనచేటు మానికలమూట,
నిక్కులబండి, బందెలమారి, కల్లలపాఁతఱ, సోమరిపోఁతినంగ' (కుక్కు)

'పలుగుగయ్యాళి, దెబ్బలగండు పలుగాకి. మాలుఁగఁబోఁతు, బల్మారియలాఁడి,
పిసినిగొట్టు, పిసాళి, పెంకె, బొంకుల పుట్ట, చెడుగు నిక్కులయిక్క, చెంచటీమంకి.
టకుబాజు, కల్లరి, టాటోటు, గడుమోటు, బందెల పుట్టిల్లు, నందగత్తె,
అంకులరాటంబు, రవ్వలమారి, తంటాకోరు, రంతులతావు ముచ్చు,' (కోలం)

9. 'వలవని చెలువతో మెలఁగువాఁ డొకకూళ, వానిడించి చరించువాఁడు కూళ,
సిరిగల్గి వడువక చిక్కువాఁ డొకకూళ, వనిత కుంకువ చెప్పువాఁడు కూళ,
చెడి బంధునింటికిఁ జేరువాఁ డొకకూళ, వసుధేశు చెడనాడువాఁడు కూళ,
ధనికుతోఁ బగఁబెట్టుకొనెడువాఁ డొకకూళ, వడిలేని దొర కొల్చువాఁడు కూళ'
(కుక్కు)

'తనుఁ దాను నుతిజేసి కొనెడు వాఁడొక మూర్ఖు, వలదన్న పని సేయువాఁడు మూర్ఖు,
పలుగు పెండ్లాముఁ జేపట్టువాఁడొక మూర్ఖు, చాడిచెప్పఁగఁ బూనువాఁడు మూర్ఖు,
తనకన్న ఘనుఁడు లేడనెడు వాఁ డొకమూర్ఖు, వనితకు జనవిచ్చువాఁడు మూర్ఖు,
కొఱగానివారలఁ గూడువాఁ డొక మూర్ఖు, పలుగాకివలెఁ బ్రేలువాఁడు మూర్ఖు'
(కోలం)

10. 'పరమలోభిని దివాకరతనూభవుఁ డంచు ఛద్మచిత్తుని హరిశ్చంద్రుఁ డనుచు
నిర్దయాత్ముని రామనృపశిఖామణి యంచుఁ గడుకురూపిని రతికాంతుఁ డనుచుఁ
బాపకర్ము నభంగ పాండవాగ్రజుఁ డంచు సమరభీరుని సవ్యసాచి యనుచుఁ
గుండబీదను మరున్మండలేశ్వరుఁ డంచు మతివిహీనుని భోగిపతి యటంచు
కవులు కక్కుర్తి నిసుమంత కడుపుకొఱకుఁ బొగడుచుండు, రవివేక బుద్ధులగుచు'
(కుక్కు)

'కుక్షింభరుని బుధరక్షాపరుండంచు నతినికృష్టుని మహాత్యాగియంచు
బహుబీజసంభవుఁ బరమపావనుఁ డంచుఁ జంచలాత్ముని ధైర్యశాలియంచు
దౌర్జన్యకారిని ధార్మికోత్తముఁ డంచుఁ గఠినచిత్తుని దయాకరుఁ డటంచు
జారకర్ముని పరదారవర్జితుఁడంచు నుత్తమాధముని శాస్త్రవేత్తయంచుఁ
గవులు కక్కుర్తిచేతను గడుపుకొఱకు సన్నుతింతురు మదిలో విచారపడక' (కోలం)

తిమ్మకవికి దాదాఁపు 80 యేండ్ల తరువాతి వాఁడయిన యీ వంకాయలపాటి వేంకటకవి, శబ్దములను మార్చినాఁడు; కాని భావ చౌర్యము పూర్తిగాఁ గుక్కుటేశ్వరశతకమునుండి చేసినట్లతని కోలంక శ్రీమదనగోపాలశతకమువలన తెలియుచున్నది.

తిమ్మకవి రాజులను నిరసించుచు పలికిన పలుకులు గమనింపఁ దగినవి

1. 'నిక్కి మిక్కుటమైన యాదొక్కి బొక్కి టక్కరి నృపాలకులకీర్తి దక్కునొక్కొ?'
2. 'కాని దుర్మతులై ప్రజఁగలఁచి ధనము గూర్పఁజూతురు బేలలై కూళదొరలు'
3. 'రాజ్యమేలంగఁ గలవాఁడె రాజుగాక హీనమతియై చరించువాఁడేటిరాజు?'
4. తనరు క్రూరనృపాలకాధముల నమ్మి సిరులకాసించు వాఁ డొక్క చెనటిగాఁడె?
5. ధర్మమతి తొట్టు నీ! యిట్టి దుర్మదాంధ నృపకులాధము లేరి కేమియ్యఁగలరు?'
6. 'విత్తంబు గూర్చుట విమలప్రచారమా?, బహునిధుల్ గావఁడె భైరవుండు,
ప్రజల దండించుట పరమసంతోషమా? ప్రాణులనెల్ల నేఁపఁడె జముండు,
దొరతనంబునకివి గావు వరుసలరయ సాహసౌదార్య ఘనపౌరుషములు గాని'
7. 'గాక తనపొట్టకై ప్రజఁ గలఁచు దురితరతుఁడు వాఁడొక్క రాజా? తరాజుగాక'
8. 'రాజగునె జాగ్రదుర దురాగ్రహముచేతఁ బ్రజల బాధించు ఘోరదర్పధ్వజుండు'

కుకవులను ఇతడు తెగడిన విధము చూడుఁడు :—

1. 'తస్కరుల చందమునఁ బదార్థములు ప్రుచ్చిలించుచుఁ జరించు కుకవుల నెంచనేల?'
2. 'కూడదనఁగను గవితలఁ గూర్చి బలిమిఁ గుమతులకు నిచ్చువాఁడొక కూళసుమ్మి'

కుక్కుటేశ్వరశతక భావములు వేణుగోపాలశతకములోఁగూడ నక్కడక్కడఁ గనిపించుచుండినను క్రొంగ్రొత్త పోకడలు లేకపోలేదు.

"కాపు కవీశ్వరుల్, కంచరయోగులు, సాతాని వైష్ణవుల్, సాలెభటులు,
కోమటి దాతలు, కొంటె భాగోతులు, మాలవెజ్జులు, బోయమావటీలు,
గొల్ల పౌరాణికుల్, పల్లెదైవజ్ఞులు, బానిసవేశ్యలు, జైనబాప
లాఁడుఁదీర్పరు లుగ్రయవనధరాధీశ్వరులు, వైదికప్రధానులును..." (కుక్కు)

(ఛాయ :—)

"నంబికవిత్వంబు, తంబళజోస్యంబు, వలనొప్పు కోమటివైష్ణవంబు,
వసనే యుప్పరవాని సన్న్యాసంబు, తరువాత శూద్రసంతర్పణంబు,
రజకునిగానంబు, రండాప్రభుత్వంబు, వెలయంగ నటువల వితరణంబు,
సాతాని విద్వాంస శాస్త్రవాదము. వేశ్య తనయుఁ డబ్బకుఁ బెట్టు తద్దినంబు"
(వేణుగోపాల శతకము)

తిమ్మకవి "కుక్కుటేశ్వరశతక"మే తరువాత వచ్చిన నీతి (సీస) శతకముల కన్నింటికి మార్గదర్శకమైనది. అట్టి శతకములలో విషయ గౌరవమునుబట్టి, భావబాహుళ్యమునుబట్టి వేణుగోపాలశతకమున కగ్ర తాంబూల మీవలసివచ్చును.

తిమ్మకవి క్రీ॥ శ॥ 1729 సం॥న రచించిన మఱియొకశతకమైన భర్గశతకము సమగ్రముగా నుండ నీకుక్కుటేశ్వర శతకములో మాత్ర

మెనిమిదిపద్యములు తక్కువగా నున్నవి. ఇప్పటివఱకు దొరకిన వ్రాంత ముద్రితప్రతులన్నిటిలోను నీలోటు ఒకేవిధముగఁ గన్పించుచుండుట వలనఁ గవి వ్రాసిన వే 92 పద్యములని యూహింపవలసియున్నది. పైఁగా కుక్కుటేశ్వరశతకములోని కడపటిపద్య మీయూహను బలపఱచు చున్నది. ఏవో యొకటి రెంటిలోఁ దప్పఁ దనకృతులన్నిట కట్టకడపట, వాని రచనాకాలమును, మంగళాచరణమును దిమ్మకవి విధాయకముగా వ్రాయువాఁడు. భర్గశతకమునఁ గూడ 100,101 సంఖ్యలుగల పద్యము లలో నీ 'రివాజు' పాటించినాఁడు. "కుక్కుటేశ్వరశతకములోని 92 వ పద్యము" శివశివా! ధాత్రి దా వలచిన వధూటిఁ బాయు వెత వద్దు సుమ్మెట్టిపలువకైన యని పురుషవిరహామునుగూర్చి చెప్పునది. అందు చేతఁ దక్కిన యెనిమిదింటినిగూడ రచించు నుద్దేశముండియుండుననుట సబబు. అట్లు పూర్తిచేయకుండుటకుఁ గారణ మొక్కటే తోఁచు చున్నది.

ఈ కుక్కుటేశ్వరశతక మకుటనిర్మాణము క్రీ॥ శ॥ 1715 నాఁటికే (వెలువడిన) తన రుక్మిణీపరిణయములోనే కవి చేసినాఁడు. ఆనాఁటి నుండి తన యవసానదశవఱకు స్వానుభవములోని విషయములను బురస్కరించుకొని యప్పుడప్పుడు తనకుఁ దోఁచిన భావములతో 92 పద్యములనే వ్రాయఁగలిగినాఁడు. తక్కిన 8 పద్యములు పూరించులోప లనే యతఁడు మరణించియుండవచ్చును. ఈనిర్ణయమును దృఢపఱచు నంశములు కుక్కుటేశ్వరశతకములోనే కనఁబడుచున్నవి. అందులో 89-వ పద్యము :—

"నోరుచేఁదై కూడుకూరలు చవిదప్పె, గడగడ నొడలెల్ల వడఁకుచుండుఁ,
జెవుడున నేమియుఁ జెవులకు వినరాదు, తెగులును జింతయుఁ దగులుకొనును,
కన్నులఁ బొఱగప్పి కానరాదెద్దియు, సిగ్గొకించుకయైనఁ జేరబోదు ;
బాలురందఱుఁగూడి గేలిగావింతురు, మగువలు పకపక నగుచునుంద్రు
మదిఁ దలంపఁగఁ, గటకటా ! ముదిమియంత రోఁత లేదుగదా, ధారుణీతలమున॥"

అని వార్ధకమును గూర్చి తెలుపుటచే నప్పటికిఁ దిమ్మకవి వృద్ధుఁ డయి, యుండవలెను. ఆదశలోఁ దనవలన బాగుపడినవారే, తనకుఁ గీడొనర్చునట్లు తరువాతి పద్యములో :—

"బావిలోపలఁ బడ్డ పామును వెడలింపఁ జనువానిఁ గఱువక చనఁగఁగలదె ?
చిచ్చులోఁ బడెడు వృశ్చికమును వెడలింపఁ జనువాని మీఁటక సడలఁగలదె ?

పెనువెల్లిఁ బడిపోవు పెబ్బులిఁ బరికింపఁ జనువాని భ్రమింగక చనఁగఁ గలరె?
అవనిలోపల ఖలుని నెయ్యంబుమీఱ మనుపఁజనువానిఁ జెఱుపక మానఁగలరె?"

అని తెలిపినాఁడు. లోకవృత్తమెఱిఁగినవారి కిట్టి సంఘటన లాశ్చర్యమును గలిగింపదు. కొంచెము శక్తి యుడుగునప్పటికిఁ దిన యాప్తులైనవారు, తనవలన వృద్ధికి వచ్చినవారుకూడ మేలుచేయుమాట యటుండనిచ్చి, చెడనాడుట యేకాక, కీడుఁగూడఁ గలిగించుటకుఁ బూనుకొందురు. ఈవిషయములో మానవత్వముబదులు, దానవత్వమే పరజాతి నాశ్రయించును. తిమ్మకవివిషయములో నంతియ జరిగినది. అతని మనస్సునకు సహింపరాని నిర్వేదము కలిగించియుండుననుటకు పైపద్యమే ప్రబలసాక్ష్యము.

చిట్టచివర 92-వ పద్యములో నుటంకింపఁబడిన విషయమును బట్టి చూచిన, నతనికి సతీవియోగముకూడ సంభవించినట్లు తోఁచుచున్నది.

"అన్నంబు నాలుక కరుచియై కనుపట్టు, నిలిచినచో నిల్వనలవి కాదు,
మనుజేంద్రుతోనైన మాటాడ సైఁపదు, పనులయం దేమియు మనసు లేదు,
నడచుచో నడుగులు తడబాటు గైకొనుఁ, దగ బంధువులనైన నగవు రాదు,
చెవులుపుట్టినకతి దేహంబు కృశియించుఁ గలనైన నిద్దుర గలుగఁబోదు,
శివశివా! ధాత్రిఁ దా వలచినవధూటిఁ బాయు వెతవద్దు సుమ్మెట్టిపలువకైన"

ఈ దుస్సహావిరహముచేత నే క్రుంగిపోయి, కవి సార్వభౌముఁడు తన కడపటి జీవితమును, కష్టములోఁ గడపియుండును.

పై పద్యములోని "తావలచిన వధూటిని" ఎవతెయో 'వాడవదినె'గా మహాత్ముల యశఃకాయమును హత్యచేయుటకుఁ బూనుకొను రసాభాస రసిక నామధారులు చిత్రించుటకు ముందు, 'వధూటి' శబ్దనిర్వచనమును దఱచిచూడవలెనని మనవి. సామాన్య జారస్త్రీవిరహమునకైనఁ బైపద్యములో వర్ణితమయిన దురవస్థలన్నియు నొక్కుమ్మడిగ, వివేకవంతుఁడు, పరమేశ్వరభక్తుఁడు, మహాజ్ఞాని, పండితలోకసంభావితుఁడు నైన తిమ్మకవివంటి వానికి తటస్థించియుండు ననుకొనుట పరిహాసాస్పదము. అందులో నఱువది దాఁటిన వృద్ధునివిషయములో (89 ప: చూడుఁడు) భావించుట వెఱ్ఱితనము. ప్రకృతివిరుద్ధము. ఇక్కడ నింకొక విషయముకూడ అప్రస్తుతము కాదు.

ఆపద్యములో "పనులయం దేమియు మనసు లేదు" అనుటచేత నే పత్నీవియోగానంతరము "కుక్కుటేశ్వరశతకము" పూర్తిచేయుటకు

నున సు పాజలేదని, యొక వేళ నట్లు పాడినను, గజపతిపద్యములోని "తా వలచిన వధూటి"—జీవితము—అద్దములోవలెఁ దనకన్నులకుఁ దోఁచునప్పటికి దుఃఖావేగముచేత గంటము సాగక నిలిచిపోయియుండు నని దృఢపడుచున్నది.

దీనినిబట్టి తిమ్మకవి క్రీ॥ శ॥ 1715 లో వ్రాసిన రుక్మిణీపరిణయ ముతోఁ గుక్కుటేశ్వరశతకము నారంభించినాఁడు. కాని యది తలఁచు కొనినట్లుగ నొక్కనాఁటిలోఁగాని, లేదా యేవో కొన్నినాళ్లలోఁగాని వ్రాసినది కాదు. మఱి తనజీవితాంతమువఱకు నప్పుడప్పుడు తోఁచిన భావములను, స్వానుభవవిషయములతో గుదిగ్రుచ్చి వ్రాయుచువచ్చి నాఁడని, ఆకారణముచేతనే చివరి యెనిమిదిపద్యములు నట్లె నిలిచిపోయి, శతకసంఖ్యకు లోపము కలిగినదని నిశ్చయించుట సమంజసము.

ఇఁక భర్గశతకమునుగుఱించి :—ఇది యితని 'ప్రౌఢనిర్భరవ యఃపరిపాకము'న రచింపఁబడినదని శతకములోని క్రిందిపద్యమునుబట్టి తెలియుచున్నది.

"ధరలో నెన్నఁగ శాలివాహన శకాబ్దంబుల్ దగన్ యామినీ
కర బాణాంక శశాంకసంఖ్యఁ జెలువై కన్పట్టు సౌమ్యాహ్వయ
స్ఫురదబ్దంబున నిమ్మహాశతక మేఁ బూర్ణంబు గావించి, శ్రీ
కరలీలన్ బుధులెన్న నీకిడితి భర్గా! పార్వతీవల్లభా"

తిమ్మకవి "సార్వభౌమ" బిరుదమును బొందుటకుముందే, యనఁగాఁ దన మొదటి కావ్యమయిన రుక్మిణీపరిణయము రచించునాఁటినుండియే— ఆబిరుదభావసూచనను, తనకృతుల యాశ్వాసాంతిగద్యలలో చేయుచు వచ్చినాఁడు. అట్టి సూచన యతనిశతకములలోఁగూడ లేకపోలేదు :—

"శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితా సామ్రాజ్యధురంధర"
—(రుక్మిణీ పరిణయ—సర్వలక్షణసార).

"శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణసంలబ్ధ
సరసకవితాసామ్రాజ్య ధురంధర"
—(రసికజన మనోభిరామ, శివలీలా విలాసములు).

"శ్రీమదుమారమణ కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ
సరసకవితాసామ్రాజ్య ధురంధర"
—(నీలాసుందరీ పరిణయ—అచ్చతెనుఁగు రామాయణములు).

"కవితా మహారాజ్య ఘనధురంధరుని సకల లక్షణలక్ష్య సాహిత్యవిదుని"
—(సారంగధరచరిత్ర : ద్విపద).

"వఙ్కాంచిన్యస శ్రేప్రస్థానుని, యశోవర్ధిష్ణునిన్, కుక్కుటే
శ్వర కారుణ్య కటాక్ష లబ్ధ కవితా సామ్రాజ్యధౌరేయునిన్"
—(భర్గశతకము).

"సత్కవితామహాసామ్రాజ్య భారధౌరేయుండ, బుధజనప్రియు సచివుండ"
—(కుక్కుటేశ్వర శతకము).

దీనినిబట్టి యతని 'కవితాసామ్రాజ్యభారధౌరేయత'ను గుర్తించిన ప్రభు వతనికిది సార్థకమగునట్లుగా "కవిసార్వభౌమ" బిరుద మనుగ్రహించుటలో నాశ్చర్యమేమియు లేదు.

భర్గశతకము—కుక్కుటేశ్వరశతకముకంటెఁ బ్రౌఢశైలిలోఁ బడినది. కారణము కవి యొక్క ప్రౌఢవయస్సులోని ధారణానైశిత్యము కావచ్చును. ఈక్రిందిపద్యములలోని శబ్దజటిలత యితని గీర్వాణభాషాపాండిత్యమున కొరపిడిటాయివంటిది :—

"పురుహూతాగ్ని పరేత రాట్పలభుగంభోధీశవాతార్థపాం
బరికేశాబ్జభ వాచ్యుతాదిక మహా బర్హిర్ముఖానీక భా
స్వరకార్తస్వర విస్ఫురన్మకుట శశ్వత్పద్మరాగప్రభో
త్కర నీరాజిత పాదపంకరుహా, భర్గా, పార్వతీవల్లభా !॥"

"వ్యాకీర్ణాచ్ఛజటాటవీతట నితాంతాలంబితోద్యత్తమి
స్రాకాంతప్రథిత ప్రభాసముదయా క్రాంతప్రఫుల్లన్మహా
నాకస్త్రీపవతీ వినిర్మల జలాంతర్భాగ భాగ్దివ్యరే
ఖాకాంతోత్పల కైరవప్రకర, భర్గా॥"

యమకాంత్యప్రాసాదిశబ్దాలంకారము లశ్రమముగా నితనికవిత్వమున దొర్లుకొని పోవుచుండును :—

"కోటీరాంగద మేఖలా ఘనతులా కోటీ కవాటీ నట
ద్ఘోటీహాటక పేటికాభటవధూ కోటీ నటాందోళికా
వీటీ నాటకచేటి కాంబరతతుల్ వేఁ జేయరు న్నిన్నిరా
ఘాటప్రౌఢి భజించుధన్యులకు, భర్గా, పార్వతీవల్లభా"

"పతతానందితసర్గ, సర్వసుమన స్సంస్తుత్యసన్మార్గ, యూ
ర్జితకారుణ్యనిసర్గ, రాజితధరిత్రీభృన్మహాదుర్గ, హృ
త్కృతుకాలింగితదుర్గ, సంహృతసమిద్ఘోరద్విషద్వర్గ, సం
యతనీరంధ్రసుఖాపవర్గ జయ, భర్గా, పార్వతీవల్లభా !"

పెళుచుమాటలతోఁ బెటపెటలాడకుండ సరసశబ్ద సంకలితములుగ నుండు సమాసముల కీశతకము పెన్నిధివంటిది :—

(1) "భవదీయ పావనకళావిఖ్యాత కావ్యక్రియా నావికాచీర్ణహృదంతరాళ కవిరాట్సంక్రందనశ్రేణికిన్", (2) "మిహిరప్రోద్యద్ఘనఘృణికింకర సమున్మేషోరగశ్రేణికావిహగోత్తంసము", (3) "నానాద్రిపక్షరాఘురావహన మాన్యస్ఫార బాహాబలానూనఖ్యాతి", (4) "విస్ఫూర్జస్ఫురతూస్ఫార గోపరిపంథిక్షణ నాగగోచర మహాపక్షీంద్ర", (5) "దుష్టపటోపాయ విజృంభమాణ ధరణీకాంతాధమాగార నిష్ఠపట్టభ్రాంతి", (6) "కృపణమర్త్యాధీశ గేహాంగణాదకర క్షోణీరజశ్చ్యుటాకరతిసంధ్యాప్తాంగులు".

ఇట్లెన్నియైనను జూపవచ్చును :—

ఇందులోను సంస్కృతానుకరణములు ననువాదములు కనిపించుచున్నవి.

అనుకరణములు:—(1) శివోహమస్మి, (2) శివాత్పరతరంనాస్తి, (3) రాజ్యాంతే నరకంవ్రజేత్, (4) విద్వద్దండ మగౌరవం, (5) సుకవితా యద్యస్తి రాజ్యేనకిం ?

అనువాదములు :—

"నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా,
తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితా"

అనుటకు :—

1. "నీలాంభోధర మధ్య సంస్థిత తటిన్నికాశమై, విస్ఫుర
ల్లీల న్నివ్వరిముంటిచందమున నెంతే సూక్ష్మమై, పచ్చనై
చాల న్భాసిలు తేజు నీవయనుచు మత్స్వాంతంబునం జెన్నుదున్"

2. "పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః"
"మశ్లోకుం గొంచెపుకొండ్లలో గెడపి దుష్టుం బెక్కునాళ్లుంచి"

సౌందర్యలహరిలోని :—

3. "ప్రదీపజ్వాలాభి ర్దివసకర నీరాజనవిధిః"

అనుటకు (కుక్కుటేశ్వర శతకములోవలెనే)

"క్షితి నంభోనిధి కర్ఘ్యమిచ్చుక్రియ, భక్తి న్బద్మినీభర్త కా
రతి యర్పించుతెఱంగున న్బహుతరబ్రహ్మాండసంత్రాపకున్"

భర్తృహరిలోని :—

4. "లభేత సికతాసు తైలమపి యత్నతః పీడయన్"

జనులకు :—

> “క్రాలక శైలము శిలయగు భూజాత్రాతమ్ములం దేక్లగా
> శిలం [illegible]గనమ్ము, [illegible] హోం [illegible]గావమ్ము, దా
> కేలన్ [illegible] బట్టవమ్ము, విషినాగ్ని నిప్పలు గానమ్ము, మా
> ర్గాశీన్ [illegible] జేసెకని ?”

అని భావానువాదము లున్నవి. ఇందులోను దాదాపు 20 పద్యములవఱకు దుష్ప్రభువులను దూషించునవి యున్నవి. కొన్నిట నిది తీవ్రముగాఁ గనిపించుచున్నవి. అట్టిదూషణలు :—

(1) అవివేక క్షితినాయకాధమవరుల్ హాస్యోక్తులం బొల్తురు, కవితానారి మెఱుంగకుండుటను, (2) తలఁపం జాల రదేమొ మీఁదటి శిఖల్ దర్పాంధకారాంధులై, కలనైనన్ మహిభృద్దురాత్మకులు. (3) వసుధామర్త్యోత్తమ క్షేత్రముల్ . . . దిగమ్రింగం జూతు రల్పప్రభుల్ చెన్నప్పంబులొ బూరెలో, (4) జిల్లేడు సురావనీజ మగునా ? నానా నికంతంబులన్, రాజైనా ఘన లోభి దుర్జనుఁడు ?, (5) ఛీ, యిట్టి మహాప్యపారప్రభు లేరిఁ బ్రోతురిఁక ?, (6) దర్పంబున నట్టిటుం బొరలకే కొమ్మిగ్గింగినట్లుండుగా రవళిం దుర్నృపు లేమి యీఁగలరో ?

కుపండితులను గాకవులను దెగనాడుటలో నితఁడేమాత్రము వెనుదీసినవాఁడు కాఁడు.

(1) చవిలేల్ కాసులు వీసముల్ గొని యథేచ్ఛాలీలలం బ్రేలు ముష్కవులు, (2) భువిలో మేదర సెట్టి చివ్వతెడకల్ హొంకంబుగా నల్లి పెన్రవళిన్ సంతలఁ ద్రిప్పు క్రియ దైన్యం బెచ్చఁగా దుష్కవుల్ తివ్రొప్పన్ జెడు కబ్బపుందడకలోలిం ద్రిప్పఁగా, నద్దిరా!, కవితల్ కానుకగం పెడయ్యెఁగద!, (3) కవిముఖ్యుం బొడగాంచి జాఱుదురు వేగం బుండ విల్లన్న కాకవులట్లు న్నిలఁబోక కాకవులు, (4) బోయపెద్దలును దాసేయ ప్రభుల్ మష్టకవులు స్మీరి రిఁకేమి చెప్పనగు ?

సంఘదురాచారములనుగూడ (కొన్నిటిని) ఈసడించు రకములో చేరినవాఁడుగాఁ దిమ్మకవి కనఁబడుచున్నాఁడు.

1. అస్పృశ్యతానిరసనము :—

> “డాయన్ రావఁట యంద్రు మాదృశులు చండాలాదులన్, డాసినన్
> బాయన్ బుణ్యచయంబులంచుఁ జదువుల్ పల్కన్”

౩. విగ్రహారాధన దూష్యము ప్రాకృతమార్గము :—

"ధర మృద్దారుశిలామయ ప్రతిమలన్ దైవంబులంచున్ బ
ల్వుర వాదంబులఁ బోరుచున్నవిధ సంసారాంధులై, మేలు నే
నుఱకే మగ్గములోని కండెలగతిన్ ఘోరార్తులై ప్రాకృతుల్"

ఈశతకములో కవి—శివలీలలను అనఁగా:—త్రిపురసంహారము, హాలాహలభక్షణము, దక్షాధ్వరధ్వంసము, విధివిష్ణుకృతశివస్వరూపాన్వేషణము, మునిపత్నీగమనము, వ్యాసదోస్స్తంభనము, శివతాండవము, విష్ణుకృత సహస్రకమలార్చనము, పాశుపతప్రదానము, పంచముఖ బ్రహ్మ శిరోనికృంతనము, మార్కండేయ రక్షణము, శ్రీరామలింగప్రతిష్ఠ, బల్లాణరాజ శ్వేతకేతు చరిత్రములు, చిఱుతొండని, తిన్నని కథలు, మున్నగువానిని 22 పద్యము మొదలు 40 వ పద్యమువఱకు వర్ణించియున్నాఁడు.

ఆంధ్రకవుల యనుకరణములుకూడ నక్కడక్కడ లేకపోలేదు.

"తినదే చెట్టున నాకు మేఁక, గుహఁ గొందిం బాము నిద్రింపదే,
వనవాసంబునఁ బక్షులున్ మృగములున్ వర్తింపవే నీటిలో
మునుకల్ వేయవె మత్స్యకచ్ఛపములున్"

అను సర్వేశ్వరశతకపద్యమున కీక్రింది యనుకరణము :—

"ఆకులెక్కదె మేఁక, చెట్టుకొన నొయ్యన్ వ్రేలదే పక్షి, పెన్
గాకల్ గ్రుంకవె నీట, గాలిగొనదే నాగంబు, బల్ గొందులన్
ఘూకంబుండదె, కోనలన్ దిరుగదే క్రోడంబు"

పోతనగారి యనుకరణములు :—

"చెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై"

అనుపద్యమునకు :—

"తనర న్నిన్నమ్రది నెంతు నెప్పుడును నాదైవంబుగా దాతగా
జనకుంగాఁ జెలికానిఁగా, గురువుఁగా సద్బంధుఁగా నన్నగా
ఘననిక్షేపముఁగా మహాప్రభునిఁగాఁ, గల్యాణసంధాయిఁగా"

"ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచుపోలికి"

"ఏణాంకుం డొకఁడై పయోఘటములం దెల్లం బహుత్వంబు చే
రాణం బొల్పుతెఱంగునన్"

తక్కిన శతకములలోని యనుకరణములు సహిత మక్కడక్కడ నగపడుచున్నవి. మొత్తముమీఁద భర్గశతకము సూత్రప్రాయములైన భావములతో మొదట వ్రాసి తరువాత వ్యాఖ్యాప్రాయమైన వివరణ

ముగాఁ బక్కీశ్వరశతకమును కవి వ్రాసినట్లనిపించును. ఈ రెండు శతకములలోని పద్యములలోఁ బెక్కింటికి సామరస్యమగపడుటయే యందులకుఁ బ్రమాణము.

ఈశతకములో నక్కడక్కడ జాతీయములు, నానుడులు, పొంకముగాఁ గవి పొందించినాఁడు :—

వాలెము, గిద్దెఁడు, కొంపలు, గోర్లెంక, రుప్పా, బుల్బాను, చవిలెలు, బూరెలు, ఒబ్బట్లు, కొర్మ్రింగు, జుత్తెఁడు, చివ్వతడకల్ ఉండిపిల్లు, గోసంగులు, మోటకాఁపు, బలిభిక్షము, పల్గాకులు, కొఱ్ఱనూకలు, కూరాకైనఁ గైతాళము, తలదుద్దు, చెప్పుఁగాలు, నెలనాళ్లు, నీచిత్తము నాభాగ్యము.

## సామెతలు—ఉపమానములు

(1) ఫ్రాసలలోని దారముపోల్కి, (2) తిలజాలకాంతర మహాతైలంబు, (3) కవితల్ కాసుకు గంపెఁడయ్యె, (4) మగ్గములోని కండెల గతిఁ, (5) కాకుల్ హేములఁ జేరుచందమున, (6) కరికి ముక్తాకాయమానంబు, సొంపగుఁగా కొప్పునె యూరఁబందులకు, (7) నిల్పుకోఁగలదె ధాత్రిఁ గొంతసేపైన మర్కటపోతం బురురత్నహారముల, (8) కంటకావరణోజ్జృంభిత కేతకీవని కళుల్ వాలెంబుగాఁ జేరవే, (9) సువర్ణకమలస్తోమాసవాలంపట భ్రమరం బేఁగునె తుమ్మకొమ్మలకు.

ఆంధ్ర విద్వత్కవితా సామ్రాజ్య మఖండవైభవముతో నేకచ్ఛత్రముగ నానాఁడు పాలించిన కవిసార్వభౌముఁడు, దుష్ప్రభుదత్త ద్రవ్యాదికాపేక్షావిముఖుఁడు, నిరంతర పరమేశ్వర పదారవింద సంసక్త చిత్తుఁడు, తిమ్మకవీంద్రుఁడు, తనసమకాలిక విద్వత్కవిలోక దురవస్థను మఱపిల్లిన తెఱఁగు తెలుపు పద్యము నుదాహరించుటతో "భర్గ" శతక పరిశోధనకు స్వస్తి చెప్పుచున్నాను.

"జనసంస్తుత్య మహాప్రబంధ ఘటనా సామర్థ్యముం గల్గి స
జ్జను లత్యల్పుల దీనతం బొగడుటల్ జాత్యంధతన్ జెంది కా
కనువొప్పన్ దమరెన్నడున్, 'సుకవితా యద్యస్తి రాజ్యేనకిం'
బన్న వాక్యంబు వినంగలేవొ, మును భర్గా! పార్వతీవల్లభా"

———◆◆———

# కూచిమంచి జగ్గకవి

(క్రీ॥ శ॥ 1700—1765)

ఈ మహాకవి కూచిమంచితిమ్మకవి రెండవతమ్ముఁడు. ఇతఁడు గాక, సింగన యను మొదటితమ్ముఁడు, సూరన యను మూఁడవ తమ్ముఁడుకూడ నతనికుండిన ట్లతనికృతులవలన స్పష్టమగుచున్నది. తక్కిన యిద్దఱి విషయమేమోకాని, యీ జగ్గసమాత్రి మన్నగారివలె సాహిత్య కవిత్వ ప్రచారములలో నిస్సముఁడుగాఁ గనిపించుచున్నాఁడు. తిమ్మకవిసార్వభౌముఁడే తన "సింహశైలమాహాత్మ్యము"లో తన తమ్ములనుగూర్చి చెప్పుచు, జగ్గకవి నీక్రిందివిధముగా వర్ణించినాఁడు.

"అతని యనుజన్ముఁ డతులితమతియుతుఁడు రాజమాన్యుఁడు సుగుణా
న్వితుఁడు సమంచితకవితాచతురుఁడు జగ్గప్రధానిచంద్రుఁడు దనరున్"

"—రాజన్య సభా ఘూట నిరాఘాట నటచ్చాటుకవిత్వాంకుఁ డరయ
జగ్గన ధరణిన్"

"నిరతంబు నుడివోని సిరి నిరవొందియుఁ దవుటి నిప్పటి మెక్కఁ దలఁపఁడేని,
సదమలాచారప్రశస్తి గాంచియు వర్ణములు సంకరములుగాఁ గలపఁడేని
ఖలజనసంశిక్ష గావింపుచుండియుఁ బతితుల నెప్డుఁ జేపట్టఁడేని
యురుపుణ్యవర్తి యయ్యును బాడబాశ్రయసీమ నిల్లుగను వసింపఁడేని
యల జగన్నాయకుఁడు సాటియనఁగఁబోలు భోగమున నిర్మలాచారమున విశిష్ట
రక్షణంబునఁ బుణ్యమార్గమున నరయ గంగనామాత్యు జగ్గయ్యఘనునితోడ"

దీనినిబట్టి (తిమ్మన, సింగన, జగ్గన, సూరనలలో) క్రీ॥ శ॥ 1690 ప్రాంతమున జన్మించినట్లు నిర్ణయింపఁబడిన తిమ్మనకు రెండవతమ్ముఁడయిన జగ్గన యయిదాఱేండ్లయినను జిన్నవాఁడుగా నుండియుండును. అనఁగా జగ్గన క్రీ॥ శ॥ 1700 ప్రాంతములోఁ బుట్టియుండెననుట సహేతుకము.

ఇతఁడు దేశదేశములు సంచారముచేసి నానా రాజాస్థానములలో "నిరాఘాటనటచ్చాటు కవిత్వము"ను బ్రదర్శించుచు వచ్చినాఁడని తిమ్మకవి పేర్కొనుటచేతఁ బ్రత్యర్థులైన విద్వత్కవులను వాదములలో గెలుచునంతటి ప్రతిభను జిన్నతనముననే గడించినాఁడని తెలియుచున్నది. ఇతఁడు తన కృతులనుగూర్చి యిట్లు చెప్పుకొనినాఁడు:—

"రచియించితివి మున్ను రసికులౌననునట్లు సురుచిర జానకీపరిణయంబు
వచియించితివి కవివ్రాతము ల్వొగడంగ ద్విపద రాధాకృష్ణ దివ్యచరిత

ముచ్చటించితివి నిర్వచనయంబు నుతింపఁ జాటుప్రబంధముల్ శతకములును
వర్ణించితివి యుదంతరంబు వర్ణనల్ గాణించగా సుభద్రావివాహ
మాంధ్రలక్షణలక్ష్యంబు లోపిమాని భూరిరాజ్య సంపత్ప్రపూజితుఁడవు"
—(చంద్రరేఖావిలాపము)

జానకీపరిణయమును, ద్విపదరాధాకృష్ణచరిత్రము, సుభద్రా వివాహము, కొన్ని శతకములు, చాటుప్రబంధములు, చంద్రరేఖావిలాపము, ఇతఁడు రచించినాఁడని పైపద్యమువలనఁ దెలియుచున్నది. "సోమదేవరాజీయము" బహుశా "చంద్రరేఖావిలాపము"నకుఁ దరువాతికృతియై యుండును. కనుకనే పై (చంద్రరేఖావిలాప) పద్యములో దాని ప్రశంస లేదు. అయిన, నే యే గ్రంథము లెప్పుడెప్పుడు రచించినాఁడను విషయమును బై పద్యమందలి వరుసక్రమమునుబట్టి యాంధ్ర కవుల చరిత్రలో నిర్ణయింపఁబడినది. కాని యది నిర్బాధకమనుటకు వీలులేదు. తిమ్మకవివలె నితఁడు తనకృతులలో రచనాకాలమును సూచింపనందున వరుసక్రమముగా, ఫలానికృతి ఫలానికాలములో రచింపఁబడినదనికాని, ఫలానికృతికిఁ దరువాత వ్రాయఁబడినదనికాని నిశ్చయముగాఁ జెప్పలేము. తిమ్మకవిలాగున నితఁడుకూడఁ గొన్ని 'శతకములను' అనియే చెప్పుకొన్నాఁడు ; కాని, ఫలాని శతకములని చెప్పనందున 'భక్తమందార'శతకమే కాకుండ మఱికొన్ని శతకములుకూడ రచించినాఁడని తెలియుచున్నది. అట్టివి యింకను బయలుపడకపోవుట మన దురదృష్టము.

ఇతని కవిత్వ మద్భుతమైన ధారాశుద్ధి కలిగి శబ్దాలంకారములతో గంగాప్రవంతివలె ధారాళముగా సాగిపోవుచుండును. ఆసంగతిని జగ్గకవియే స్వయముగాఁ జాటుకొనినాడు :—

"వింతల్గాఁ గడు మీకు సత్కృతులొసంగావింతుఁగా, దుషారాద్రిజా కాంతా
కాంత జటాంతరాళ విలుఠ ద్గంగాతరంగచ్ఛటా తాక్రాంతాత్యంత ఝు
ఝంఝుంఝంనినద రంగద్ధాటి మీఱంగ"
—(భక్తమందార)

ఇతని కవితామహాత్మ్యమునుగూర్చి కవిసార్వభౌముఁడైన యితని యన్న తిమ్మకవికూడ :—

"రాజన్య సభాఘోట నిరాఘాట నట చ్చాటుకవితాంక" మని మెచ్చుకొన్నాఁడు.

'అల్లికజిగిబిగి' యల్లసానివారిదని యాంధ్రలోకములోఁ బ్రతీతి. ఆరెంటిని (జిగిబిగులను) క్రమముగా నీకవిసోదరు లిరువురు పంచుకొనినట్లు కనిపించుచున్నది. 'జిగి' తిమ్మకవిదైన, 'బిగి' జగ్గకవిదని చెప్పఁదగును. ఉపాలంభ, నిరసన, దూషణములలో జగ్గకవి యావేశమున కడ్డుమాఁకలు లేవు. ఆ యా సందర్భములలోఁ దీవ్రపదజాలముల దూఁకుడు, పద్యపాదముల ప్రాఁకుడు శ్రోతల (పఠితల) హృదయతంత్రులకు తాఁకుడై స్పందింపఁజేయును. ఈపట్ల నితఁడు తన యన్నకంటె నొకయాకెక్కువగఁ దిరుగ వేసిన యుద్ధతుఁడు. తిట్టుకవితలో వేములవాడ భీమకవి తరువాతఁ బేర్కొనఁదగినవాఁడు జగ్గకవి. దమ్మెనను దిట్టఁదలఁచుకొనిన పిండిప్రోలు లక్ష్మణకవి తనకావ్యమునకు ద్వ్యర్థి 'బురఖా' వేసినాఁడు. ఆప్రకారము చేయుటవలన సూటిగాఁ దానుద్దేశించిన వ్యక్తికిఁ జుఱుకు కొరడాదెబ్బలు తగులుట కవకాశము లేదు. అది యొక విధముగా నన్యాపదేశకావ్య మగును. "గుమ్మడికాయలదొంగ" వాటముగా నర్థముచేసికొనవలసిన పద్ధతి యేర్పడును. భీమకవిగాని, జగ్గకవిగాని, చెప్పతిట్టుకవితలో నీచిక్కుండదు. దూషణకుఁ బాత్రుఁడైన వ్యక్తిని మనయెట్టయెదుటనే చూడఁగలము.

జగ్గకవి వ్రాసిన చంద్రరేఖావిలాప మీతెగకుఁ జేరిన దూషణకావ్యము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని ప్రతిని చాలవఱకు సంస్కరించి, కీ॥ శే॥ శ్రీ కాళ్లకూరి గోపాలరావుగారు ప్రచురించిన గ్రంథములోఁ గవిహృదయము గుర్తించుటకుఁగూడ వీలుకానంతగ మార్పులు, చేర్పులు కనఁబడుచున్నవి. ఇట్టి కావ్యములుకూడ సారస్వతములో నొకభాగమని గుర్తించిననే తప్ప, అసలు కవుల కాల దేశ వర్తనలు మనకు దొరకుటకుఁ గాని, మన వాఙ్మయము పూర్తిగా నాకళించుకొనుటకుఁగాని, భాషాచరిత్రకారుల సమగ్రపరిశోధనకుఁగాని, యవకాశముండదు.

చంద్రరేఖావిలాప కావ్యోదయమునకు నాంధ్రకవులచరిత్రలో నీక్రిందివిధముగాఁ గారణము చెప్పఁబడినది :—

"జగ్గకవి ధనసంపాదనమునిమిత్తమయి విజయనగరమునకుఁ బోయి, రాజుగారిబావ యయిన నీలాద్రిరాజు నాశ్రయింపఁగా నతఁడు తానుంచుకొన్న వేశ్యను నాయికఁగాఁ జేసి, తనమీఁదఁ బ్రబంధము

సేయుమనెనఁట! ధనాశచేత నట్టిప్రబంధరచన కొప్పఁకొని కవి చంద్ర రేఖావిలాసమును జేసెనఁట! అటుతరువాతఁ దాను సంస్కృతకావ్యమును రచియించి యిచ్చెదనని చెప్పి రాజుమతి మరలించిన యాడిమల్లె వేంకటశాస్త్రి ప్రోత్సాహముచేత, నీలాద్రిరాజు జగ్గకవికి బహుమానముచేసి సత్కరింపక తిరస్కారమును జూపెనఁట! అందుపైని ముంగోపి యైన యాధూర్తకవి "చంద్రరేఖావిలాసము'ను జింపివేసి, చంద్రరేఖావిలాప" మను పేర నిప్పటిబూతుగ్రంథమును జేసెనఁట! ఇందు నిజమెంతయో!"

ఇతఁడు (జగ్గకవి) వ్రాసిన 'భక్తమందారశతకము' సాంఘిక శతకములలోఁ 'గాళహస్తీశ్వర' 'భర్గశతకము'లతో దీటయినది. వానికంటెఁగూడ నొకరవ మించినదేమో! ఇతఁడు తన శతకములో :—

"సారప్రస్తుత కూచిమంచికుల భాస్వద్వార్ధి రాకాసుధా
కిరణుఁ, గంగనమంత్రి నందనుని, రంగత్తిమ్మభూమండలే
శ్వరసత్కార్పిత 'బేబదల్' బిరుద విఖ్యాతయజ్ఞగన్నాథనా
మసజ్జాండను, బ్రోవు మెప్పుడును, రామా, భక్తమందారమా!"—

అని వ్రాసికొనుటవలన నితనికి భూమండలేశ్వరునిచే 'బేబదల్' బిరుద మియ్యఁబడినట్లు తెలియుచున్నది.

క్రీ॥ శ॥ 1700 ప్రాంతములోఁ బుట్టిన జగ్గకవినిగూర్చి, యాంధ్ర కవులచరిత్ర మీవిధముగాఁ జెప్పుచున్నది.

"ఈజగ్గకవి యిరువదిసంవత్సరములప్రాయము వచ్చువఱకును చదువెఱుఁగక, యల్లరిమూఁకతోఁ దిరుగుచు, కాలము గడపెననియు, అప్పుడు వివాహమై యత్తవారింటికి, మనుగుడుపునకు పోయి, మామగారు తనకుఁ బరమశుంఠయైన యల్లుఁడు దొరికినందున కనుతాపపడఁగా రోషముచేత దేశాంతరమునకు లేచిపోయి పండ్రెండు సంవత్సరములు విద్యాభ్యాసముచేసి పండితుఁడై కవిత్వము చెప్పనారంభించెననియు, పుక్కిటిపురాణ మొకటికలదు... ఈకథనుబట్టి యీకవికవిత్వము చెప్పనారంభించునాఁటికి ముప్పదిమూఁడు సంవత్సరములప్రాయమై యుండవలయును."

చంద్రరేఖావిలాపములో (నీ) కవిజీవితమును వ్రాసిన శ్రీకొండ కోటయ్యపంతులుగారుకూడ, పైకథ నుటంకించుచు :—

"జగ్గకవి (మామగారింట జరిగిన) యవమానంబు కతంబుగా దేశాంతరగతుండై మంగళగిరికరిగి, వేంకటాచార్యులను సుప్రసిద్ధపండితుల నాశ్రయించి,—విద్యాభ్యాసముఁగావించి, పదిపండ్రెండేండ్లలో విద్వాంసుఁడై, అనర్గళముగా కవిత్వము చెప్పునంతటి వాఁడయ్యెను ఈగురుకులవాసమున నితనికి వైదుష్యముమాత్రమేకాక, వైష్ణవము గూడ సిద్ధించెను.''—అని చెప్పినారు. పైకథలోని సత్యాసత్యములను వివరించుట యవసరము.

విద్వద్వంశమయిన కూచిమంచివారికుటుంబములో—తిమ్మకవి సార్వభౌమునివంటి వాని కనుజుండైన జగ్గన ఇరువదియేండ్లవఱకు" "ఓనామాలు" కూడ రాని నిరక్షరకుక్షిగా నుండెననుట నమ్మరాని విషయము. కేవలము శ్రుతపాండిత్యమైన నంతోయింతో యలవడి యుండకతప్పదు. పైఁగా నట్టివానికి, తెలిసి తెలిసి (పెద్దాపురము సంస్థానములో ప్రఖ్యాతిపొందిన) మామగారు తనకూఁతునిచ్చి పెండ్లి చేసి నాఁడనుటయును, తానయి యేరికోరి తెచ్చుకొనిన యల్లుని, శుంఠల క్రింద జమకట్టి, దూషించినాఁడనుటయును, నవ్యక్తమే యగును.

అట్లిరువదియేండ్లకు వివాహము చేసికొనిన జగ్గన మామగారి దూషణభాషణములకు, రోషముపొందినవాఁడయిన, భార్యతోఁగూడ నామఱుక్షణమే స్వస్థలమునకుఁ బ్రయాణము కట్టవలయునుగాని, క్రొత్తగాఁ బెండ్లాడిన యిల్లాలిని వదలిపెట్టి, చదువుకొనవలయునను బుద్ధి పుట్టి యెవ్వరితోఁ జెప్పకుండ వెడలి యెక్కడనో మంగళగిరిలోని యాచార్యుల నాశ్రయించి, పండ్రెండేండ్లు అజ్ఞాతవాసముచేయుచు విద్యనేర్చుకొనినాఁడనుట సర్వథా యసంబద్ధముగా కనఁబడుచున్నది.

మఱియొకచిత్రమేమన :—జగ్గన పెండ్లినాఁటి కిరువదియేండ్లవాఁడయిన, నతని వధువున కేపదియేండ్లయిన నుండును. అతఁడు విద్యాభ్యాసానంతరము వచ్చునప్పటి కతనికి ముప్పదిరెండేండ్లు సహజమే కావచ్చునేమో, కాని యతనిగృహిణి యిరువది రెండేండ్ల యువతికదా! శారదాబిల్లు పుట్టని యాకాలములో నాఁడు బిడ్డల నష్టుతీరుటయే తడవుగ నత్తవారింటికిఁ బంపఁజూచు తలిదండ్రులు,—అన్నిసంవత్సరములల్లుఁ డెక్కడ నున్నాఁడను నన్వేషణమాని యూరక యుండియుండు రనుట యసంభవము.

ఏవిధముగఁ జూచినను బరిణయమునాఁటికే జగ్గకవి గొప్ప విద్వత్కవియై నానారాజాస్థానములలోఁ దన పాండిత్యప్రకర్షను బ్రదర్శించుచువచ్చెనని, యాకారణముచేతనే యతనియన్నయగు తిమ్మకవి, తన ముప్పదవయేట రచించిన "సింహాశైలమహాత్మ్యములో నతనిని గూర్చి :—

"స్ఫోటకలాటకిరాట వరాటమురాంటాంగవంగరాజన్య సభా
ఝాటవిరాఘాట పటుచ్చాటుకవిత్వాంకుఁ డరయ జగ్గన ధరణిన్"

అని వర్ణించినాఁడు. తిమ్మనకే యప్పటికి ముప్పదేండ్ల వయస్సున్నప్పుడతని రెండవతమ్ముఁడైన జగ్గన్న యతనికంటె నయిదారేండ్లయినను జిన్నవాఁడయి యుండును. ఈకారణములనుబట్టి వివాహమాడునాఁటికి జగ్గన్నకు 20-25 సంవత్సరములమధ్య వయస్సనియు, పెండ్లికిఁ దరువాత నతఁడు విద్యార్జనచేసినాఁడనుట సత్యదూరమనియుఁ దేలుచున్నది.

ఇతఁడు మంగళగిరి నివాసియైన వేంకటాచార్యుల నాశ్రయించి, వైదుష్యమును, వైష్ణవమును గడించినాఁడనుటకూడ సంశయాస్పదముగాఁ దోఁచుచున్నది. జగ్గన తన గ్రంథములలో నెక్కడగాని, "వేంకటాచార్యుల"ను తనగురువని (తిమ్మకవి తనకృతులలో దెందులూరి లింగనను గురువని పేర్కొన్నట్లు) పేర్కొనలేదు.

తిమ్మన తనకృతులను గుక్కుటేశ్వరునికే యంకితముచేసినను, నతఁడు వీరశైవుఁడని యనిపించుకొననట్లే, జగ్గన తనగ్రంథములను కొన్నింటిని విష్ణువునకే (జగన్నాథునకు) యంకితముచేసినను వీరవైష్ణవుఁ డనిపించుకొనలేదు. తిమ్మకవిగాని, జగ్గకవిగాని, శివకేశవభేదములేని శుద్ధాద్వైతులే. కావున వేంకటాచార్యులవలన వైష్ణవమును జగ్గన యవలంబించినాఁడనుటకూడఁ బొరపాటు.

ఇఁక నితనికి (జగ్గనకు) తిమ్మభూమండలేంద్రదత్త "బేబదల్" బిరుదమునుగూర్చి యించుక పరిశీలింతము:—తిమ్మకవిసార్వభౌముఁడు పీఠికాపురాధీశుల గౌరవమునకుఁ బాత్రుఁడై కందరాడలోఁ గాలక్షేపముచేయు దినములలో, ధనమును, యశస్సు నార్జించు నిమిత్తమూ ధూసంస్థానములకు సంచారముచేయుచు, రాజసభలలో నిరాఘాట

ముగాఁ దనకవితా ప్రాభవమును, జగ్గకవి చూపుచుండువాఁడు, ఆసందర్భమున, నప్పుడప్పుడు స్వస్థలమైన కందరాడకును, శ్వశురుగృహమయిన పెద్దాపురమునకును రాకపోకలు జరుపువాఁడు. అప్పటిలో జగ్గనకు పెద్దాపురాస్థానకవులతో (తనమామగారి ప్రాపకమువలన) పరిచయము కలిగినది. అట్టికవులలో ముఖ్యుఁడయిన, యేనుఁగు లక్ష్మణకవి యదివఱకే కూచిమంచివారి విద్వత్కవితాప్రజ్ఞలు చక్కఁగా నాకళించినవాఁడై నందున మన జగ్గనకు రాజాస్థానప్రవేశమునకు సహాకరించుటయును, నారాజసన్నిహితులందఱు జగ్గకవిని సన్మానించుటయును జరిగియుండుననుట సమంజసము.

ఆకాలములోఁ బెద్దాపురమును బాలించుచుండిన "తిమ్మజగపతి" మహారాజే మనజగ్గకవికిఁ 'బేబదల్' బిరుదము నిచ్చినట్లు తెలియుచున్నది. ఆప్రభువు క్రీ॥ శ॥ 1759 సం॥న సింహాసన మధిష్ఠించినాఁడు. అప్పటి కతని ప్రాయ మెనిమిదియేండ్లే. అందుచేత రాజ్యతంత్రమును విశ్వాసపాత్రులయిన మంత్రిసేనానాయకులే నడుపుచుండినట్లు పెద్దాపుర సంస్థానచరిత్రము చెప్పుచున్నది. జగ్గన కీ తిమ్మభూమండలేశ్వరుఁడే బిరుదమిచ్చినవాఁడు. (అనఁగా నాప్రభుని యాజ్ఞ ననుసరించి నడచుకొనుచువచ్చిన యధికారులు) ఈతిమ్మజగపతి వయస్సులో పసివాఁడయినను, చిన్నప్పటినుండి విద్యాపరిశ్రమ చేసి విద్వత్కవితా సామర్థ్యముల నలవఱచుకొనినట్లు చరిత్రాధారములు విశేషముగా కనిపించుచున్నవి. క్రీ॥ శ॥ 1700 ప్రాంతమున జన్మించిన జగ్గకవి యీబిరుదమును పొందునాటికి 55, 60 సంవత్సరాలమధ్య వయస్సునకు దరిదాఁపుగా నుండవలెను, ఈయూహనే యాంధ్రకవులచరిత్రములో :—జగ్గకవియు నించుమించుగా నన్న (తిమ్మకవి) జీవించినంతకాలము జీవించినట్లు కనఁబడుచున్నది. అందుచేత నితఁడు 1700 వ సంవత్సరప్రాంతము మొదలుకొని, 1760 వ సంవత్సరప్రాంతమువఱకు జీవించియుండినవాఁడని చెప్పవచ్చును." అని శ్రీ కం॥ వీ॥ పంతులుగారు బలపఱచుచున్నారు. అనఁగా జగ్గన 'బేబదల్' బిరుదమును, పొందినతరువాత కూడ కొన్నిరేండ్లు, తుదకైదాఱేండ్లయినను జీవించియుండవలయును. పంతులుగారి "ప్రాంత" మనుపదము దీనిని దృఢపఱచుచున్నది. ఈ బిరుదధారణముతరువాతనే 'భక్తమందారశతక' రచనము, అందలి కడ

పటిపద్యములో నీబిరుదప్రసక్తి కనఁబడుచుండుటచేత జగ్గన 1760 సం॥న బిరుదము పొందినపిదప 1765 వఱకు సజీవుఁడై యుండుట నిస్సందేహము.

'చంద్రరేఖావిలాపములో' నీజగ్గనకవిజీవితమును వ్రాసిన శ్రీ కొండ కోటయ్యపంతులు బి. ఏ. గారు (జగ్గ) కవి సుగుణసంపన్నత కుపబలకముగా నీక్రిందికథను వివరించియున్నారు.

"(జగ్గకవికి) అగ్రజుఁడగు తిమ్మకవిసార్వభౌముఁడు ముప్పది యేండ్లవయస్సుననే భార్యావియోగము నంది సంసారసౌఖ్యపరాఙ్ముఖుఁడై, దాయభాగేచ్ఛ వదలుకొని, గ్రంథకాలక్షేపముచేయుచు, తమ్ములచేఁ బోషింపఁబడుచుండెను. ఒకనాఁడు తనపెదతమ్ముఁడగు సింగకవిభార్య "పెండ్లాము లేనివారి కనుదినము సేవసేయుట మిక్కిలి కష్ట" మని విసికికొన, తిమ్మకవి కోపగించి, పీఠికాపురమునకు దారి పట్టెను. అప్పుడు జగ్గకవి భార్యాసమేతుఁడై, వెడలి కవిసార్వభౌముని తోడితెచ్చి మిక్కిలిభక్తితాత్పర్యములతో తనబిడ్డలకంటె నెక్కువగా యావజ్జీవము పోషించెను...జగ్గకవి పెద్దవాఁడైనవెనుక విద్యాభ్యాసముచేయుటచే, మంచి లేకరి కాకపోయెను. ఇతనిగ్రంథములను దిమ్మకవియే వ్రాయుచుండెడివాఁడు."

పై కథ కేవలము పుక్కిటిపురాణముగాఁ గనఁబడుచున్నది. పై కథలోఁ జెప్పినట్లు తిమ్మకవి భార్య యతని ముప్పదిసంవత్సరముల ప్రాయమునఁ గాక యతని వార్ధకదశలోనే మరణించినదని కుక్కుటేశ్వరశతకములోని 89-వ పద్యమువలన స్పష్టముగాఁ దెలియుచున్నది. అందలి విధురునియవస్థలను దిమ్మకవి తన పూర్వగ్రంథములలో దేని లోను సూచింపలేదు. కాన సంసారపరాఙ్ముఖుఁడై నాఁడను వాదమున కాధారమే లేదు. అతఁ డట్టిపరాఙ్ముఖత్వము కలవాఁడయిన తన 55-60 సం॥రములమధ్య వయస్సున "రసికజనమనోభిరామము" వంటి శృంగారరసము తొణికిసలాడుచుండు కావ్యమును సృష్టింపఁ గలుగు వాఁడు కాలేఁడు. ఈహేతువులనుబట్టి, యతని యకాలభార్యావియోగముగాని, సంసారపరాఙ్ముతగాని, తమ్ములమీఁదఁ దా నాధారపడుట గాని, జరిగినదనుట సర్వాబద్ధము. అతని పెదతమ్ముఁడు 'సింగన'యే గాని శ్రీకోటయ్యగారు వ్రాసినట్లు, 'సింగనకవి' కాఁడు. అట్లతఁడు తాను కవినని చెప్పుకొని వ్రాసినగ్రంథమేదియుఁ గానరాదు.; తిమ్మన జగ్గన

కవులును నతనిని తమకృతులలో నెక్కడను కవిగాఁ జేర్కొనలేదు. పైఁగా, జగ్గకవి, తన పెద్దన్ననుగూర్చి తనగ్రంథములలో నంతమాత్రము మహాకవిగాఁ గొనియాడినప్పుడు, చిన్నన్నయయిన సింగన్నను (కవిగానుండిన యెడల) పొగడక విడుచునా.

విచిత్రమయిన, కోటయ్యగారు రచించిన జీవితచరిత్రములోఁ దిమ్మకవి, జగ్గకవి గ్రంథములకు లేఖకుఁడుగా నుండినాఁడనియు, నందులకుఁ గారణము, జగ్గకవి పెద్దవాఁడైన వెనుక విద్యాభ్యాసముమాత్రము చేసినాఁడేకాని, వ్రాయసకాఁడు కాలేక పోయినాఁడని చెప్పిరి. ఇదికూడ నెంతమాత్రము విశ్వాసార్హము కాదు. తిమ్మకవి తాను తన 60 వ సం॥ ప్రాంతములో వ్రాసిన రసికజనమనోభిరామమున :—

"నిఖిలవిద్యాభ్యాసనిపుణుఁడు మత్సహోదరుఁడగు జగ్గసత్కవితనయులు
ఘనులు తిమ్మనయు సింగనయును లేఖకపాఠకులై కృతుల్ ప్రబలఁజేయ"

అని తనకృతులకే, జగ్గకవిపుత్రులను లేఖకపాఠకులుగా నిర్ణయించుకొనినట్లు స్పష్టమగుచుండగా, ముసలితనములోఁ దాను తమ్ముని గ్రంథములకు లేకరిగా నుండినాఁడనుట ఎట్లు పొసఁగును ?

ఇఁక జగ్గకవిశతకమునుగూర్చి కొంతవఱకు చర్చించుట యవసరము. జగ్గకవీంద్రుని గ్రంథములలో సుభద్రాపరిణయము, సోమదేవరాజీయము, చంద్రరేఖావిలాపము, భక్తమందారశతకము మాత్రమే ప్రచారములో నున్నవి. చంద్రరేఖావిలాపమును సంపాదించి వెలువఱచిన శ్రీకాళ్లకూరిగోపాలరావుగారు, అందలి బూతుపద్యములను జాలవఱకుఁ బఠనయోగ్యములుగా సంస్కరించినందున నవి యథాతథములుగా కవిహృదయమును బయటపెట్టుటలేదు. భక్తమందారశతకమును శ్రీచెలికాని లచ్చారావుగారు తమ శ్రీరామవిలాసగ్రంథమాలా మూలముగా ప్రచురించిరి.

జగ్గకవి కవిత్వ మత్యంత ప్రౌఢమయినది. సముచిత శబ్దప్రయోగ చాకచక్యములో నితఁడు తనయన్న యయిన తిమ్మకవిసార్వభౌముని కెంతమాత్రము తీసిపోయినవాఁడుకాఁడు. సరికదా! అతనికంటె నొకరవ మించినవాఁడుగనే కనిపించును. పేరులు చెప్పక, తిమ్మన, జగ్గనల పద్యములను జదివిన నీయిరువురలో నెవరాపద్యరచయితయో కనిపెట్టుట కష్టము.

ఇతని భక్తమందారశతకము మంచిపాకములోఁ బడినది. దాదాపు అఱువదియేండ్ల ప్రాయములోఁ దనకు 'బేబదల్' బిరుదము లభించినతరువాతనే యితఁడీశతకమును వ్రాసినాఁడని కడపటి పద్యము తెలుపుచున్నది. అందుచేతనే, యీశతకములోని పద్యములన్నియు నతని ప్రపంచానుభవమును బురస్కరించుకొని, వ్రాయఁబడిన విషయములతో జాలువాఱుచున్నవి. ఆకాలమందలి సాంఘికాచారములను సిరసించుచు, నీతినుద్ఘాటించుటలో నీశతకము కొంతవఱకు సుమతి, వేమన, శాళహస్తీశ్వర, కవిచౌడప్ప శతకములకు సాటివచ్చును. అద్భుత శబ్దచిత్ర్యమునకుఁ దోడలంకారములుకూడ నీశతకపద్యములలో గోచరించుచున్నవి. ఇందలి యొక్కొక్క పద్య మొక్కొక్క రసగుళిక యని చెప్పఁదగును.

తన కవితాసామర్థ్యమునుగూర్చి, కవియే యేమనినాఁడో చూడుఁడు :—

వింతల్గాఁగడు మీకు సత్కృతులు గావింతుం, దుషారాద్రిజా
కాంతాకాంత జటాంతరాళ విలుఠద్గంగా తరంగచ్ఛటో
త్క్రాంతాత్యంత ఝుళంఝుళం నినదరంగద్ధాటిమీఱంగ, సా
మంతా సంతతశాంతిమంత జయరామా, భక్తమందారమా!

—(భక్తమందార శతకము).

'చంద్రరేఖా విలాపములోని సింగన్నపాలునిద్వారాతన ప్రజ్ఞను గూర్చి యీవిధముగా చెప్పించుకొన్నాఁడు :—

"అర్ణవమేఖలంగల మహాకవి కోటులలోన నెంతయుం
బూర్ణుఁడవీవు సత్కవిత, బూతులరీతుల గోరుకొండగా
వర్ణన సేయనేరుతువు, వాలెముఁ జుల్కఁగఁబల్కు మూర్ఖులం
దూర్ణమె తిట్టిచంపుదువు, దుర్దమ పౌరుషశాలి వెంతయున్,
నిర్ణయ మిత్తెఱంగెఱిఁగి నేర్పున నిన్ను బహూకరించినన్
స్వర్ణవిభూషణాంబర గజధ్వజచామర గోధనాశ్వదు
ర్వర్ణవిచిత్రపాత్ర బహురాజ్యరమా రమణీయపుత్రసం
కీర్ణ సమస్తవస్తుపరగేహ సముంచిత భోగభాగ్యమున్,
కర్ణసమానదానము, నఖండ పరాక్రమశక్తి, నిత్యదు
ష్కర్ణకులీన వాగ్విభవగౌరవ, మాశ్రితబంధురక్షణో
దీర్ణకృపారసంబును, సతిస్థిరబుద్ధి, చిరాయువున్, సుధా
వర్ణయశంబును స్గలిగి వర్ధిలఁజేతువు, జగ్గసత్కవీ!"

అంత్యప్రాసాలంకారము లసిన నితనికిఁ గడుప్రీతి. అట్టిపద్యము లీశతకములో నాలుగున్నవి. మచ్చునకొకటి :—

"అతసీపుష్ప సమానకోమల విశేషాంగుఁ, సముద్యన్మహో
న్నత కోదండనిషంగసంగుఁ, బలవన్నక్తంచరాఖర్వప
ర్వతజీమూతతురంగుఁ, గింకరజన వ్రాతావనాత్యంతర
మ్యతరాపాంగుని, నిన్ భజింతు మది, రామా ! భక్తమందారమా !"

శ్లేషాలంకారముతోఁ బ్రభుదూషణము గల పద్యమీక్రిందిది :—

"పలుమాఱుం ద్విజరాజు లొక్కట దమం బాధింతురంచు న్విషా
నలఘోరాననముల్మ్రుడుంచుకొని కానన్ రాక దుర్గస్థలం
బుల వర్తింపుచు భుస్సురిందు రిల నాభోగీశు లెందైననున్
మలకల్ మాని చరింపఁ గాఁగలరె ? రామా ! భక్తమందారమా !"

జటిలదీర్ఘసమాసము లితనికి నల్లేరుపై బండివలె నాగిపోవు చుండును.

1. "దోర్దండాగ్రజాగ్రన్మహోద్దండోత్తాల విశాలదివ్యతర కోదండోగ్రనిర్ముక్త సత్కాండవ్రాతవిఖండితాహిత శిరఃకాండా"
2. "మదనాగాశ్వశతాంగ కాంచన కనన్మాణిక్యభూషా మృగీమద దివ్యాంబర చామరధ్వజ లసన్మంజూషికాందోళికామృతలా చార్థ సమృద్ధి"
3. "మకరోగ్రక్రకచాగ్ర జాగ్రదురు సమ్యక్ఛాతదంష్ట్రాక్షత ప్రకటాంఘ్రిద్వయ నిర్గళద్రుధిరధారా పూరఘోరవ్యథా చకితుండు"
4. "అమరేంద్రాది సమస్తదేవ భయదాహంకారహుంకారదుర్దమ బాహాబలసింహ నాద పటుకోదండోగ్రబాణచ్ఛటా సముజాగ్రత్ఖర దూషణానుపటలం."

అనువాదప్రాయములు :—

"ప్రహ్లాద నారదపరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్"—అనుటకు :—
"కరిరాజార్జున పుండరీక శుక గంగానందనవ్యాసులున్"—(భ. మ. శతకము)

"వహ్నిస్తస్యజలాయతే, జలనిధిఃకుల్యాయతే తత్క్షణాత్
మేరు స్స్వల్ప శిలాయతే మృగపతి స్సద్యఃకురంగాయతే
వ్యాలో మాల్యగుణాయతే విషరసః పీయూషవర్షాయతే
యస్యాఙ్గేఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి ॥"
—(అనుభర్తృహరి శ్లోకమునకు)

"ఇనుఁ డద్దంబగు, నగ్ని నీరగు, భుజంగేంద్రుండు పూదండయౌ,
వనధుల్ పల్వల పంక్తులౌ, జలధరా ధ్వాంబెల్లియౌ, రాజయో
గనిరూఢస్థితి తావకీన పదయుగ్మం బెల్లకాలంబు, ప్రే
మ సెదంబూని భజించు ధన్యులకు, రామా ! భక్తమందారమా !॥"

అనుకరణాలు :—

1. "మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సంపదలు"
—(మహాభారతము)
"మదనాగాశ్వశతాంగ కాంచన లసన్మాణిక్యభూషామృగీమద"
—(భక్తమందార)
2. "ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపై" —(భాగవతము)
"మదలేపైః పయోధరద్వయముపై, సొంపొందు నెమ్మోముపై మదనాగారముపై"
—(భక్తమందార)
3. "చేతులకుఁ దొడవు దానము, భూతల నాథులకుఁ దొడవు బొంకమి ధరలోన్"
—(సుమతి శతకము)
"దానం భూషణంబు హస్తమునకున్, దప్ జ్ఞానికిన్నీ పదధ్యానం భూషణంబె"

ఇందలి జాతీయశబ్దప్రయోగములు కమ్మనివి :—

కొంటెతొత్తుకొడుకులు, కోనారులు, తక తేత త్తలవారు, మోట కొయ్యదొరలు, బవనీలు, దరిబేసులు, కోమటిమేనర్కము, మాళేబంగరు, హొందిలావు, క్రిందుసిీదుగానక, మోటకాఁపు దొరలు, పల్లాకి, దీమస, గోరంత, కాసంతసేపు, ఎడపొద్దు, సరిపిణీలు, మసియైపోవు, విడిదిల్లు.

నానుడులు : ఉపమానాలు :—

నీచిత్తము నాదుభాగ్యము ; నీమనసు న్నామనసు న్నెఱుంగు ; నేనీబంటను, నీవు నాధొరవు ;—మీాసంబేటికిన్ లోభికిన్, మకుటం బేటికి మర్కటంబునకు, మన్నుంబిల్లి మృగేంద్రమౌనె ? ఒత్తుల్ దిను దాసరింబలె, దోమలు వేయైన మదద్విపంబగునె ? ఈప్సితము దీర్పన్ లేని జేజేకు నైవేద్యంబేల ? — పారిజాతసుమనో మత్తద్విరేఫంబు దా మదనోక్షీజము చెంతకుంజనునె ? బర్బ్యారము గాలివానఁ బడుఁగా కిం త్తైనఁ గంపించునే మలయోర్వీధరమారుతంబునకు, జెట్టి (ని) చీమలు చీకాకుగఁ జేయుచందమున.

మతాచారసంస్కృతి కీకవియుఁ దన యగ్రజునివలె సుముఖుఁడుగ నున్నట్లు క్రిందివాక్యములు వివరించుచున్నవి.

(1) "నిన్నారాధించి సుఖంచలేక శిలలం బ్రార్థింతు రెంతే యపస్మారభ్రాంతిమదాత్మమూఢులు."

(2) "దుర్మదవృత్తిం బశుమాంస మగ్నిఁ దనరారన్ వేల్చుగా దేవతామదిరాక్షీసుర తేచ్ఛ భూసురుఁడు."

ఆకాలములో నమ్మరాని జాతుల నీక్రింది పద్యములో జగ్గకవి నిర్భయముగాఁ బేర్కొన్న విధము గమనింపఁదగినది :—

"అగసాలిన్ దిలఘాతకున్ యవనునిన్, వ్యాపారి, దాసి, న్నియోగిన్
జగతీనాథుని, వేటగాని, గణికన్, జండాలునిన్, జోరునిన్
బ్రెగడం, గోమటి, జూదరిన్ బుధజనుల్ పెన్నొక్కమన్నింప. న
మ్మఁగరాదెంతయుఁ దథ్యమిద్ధరణి, రామా! భక్తమందారమా!"

పంక్తి బాహ్యులు :—

"వృషలీభర్తయు, దేవలుండు, నటుఁడు, న్వేదాభిశస్తుండు, మా
హిషికుం, డగ్నిదకుండగోళకులునున్, హింసాపరస్వాంతుఁడున్,
విషదుండుం గొలగాఁడు, పంక్తికెపుడుర్విన్ ...మందారమా"

ఆకాలపు వైద్యులనుగూర్చి యీకవి నిరసించిన విధము కడు తీవ్రమైనది :—

"కలికాలంబున వైద్యలక్షణ పరీక్షాశూన్యమూఢావనీ
తలనాథుల్ బలుమోటకాఁపుదొరలున్ దట్టంబుగాఁబిల్చి, మం
దులు సేయించ, భుజించి క్రొవ్వి కడు వైద్యుల్గారె, సిగ్గేది త
మ్మళులున్, నంబులు, క్షౌరకాంత్యజులు, రామా! భక్తమందారమా!"

ఇఁక నీశతకములోఁ దిమ్మకవి భర్గశతకములోవలె నాకాలపుఁ బ్రభువులను దూషించుపద్యములు కొన్ని యున్నవి. అంతియకాక, నీతిబోధకపద్యములలోఁగూడ, కొన్నింటిభావములు భర్గశతకమునుండి పుడికి పుచ్చుకొనినట్లు కనఁబడుచున్నవి. సత్కవులను రాజు లేరీతిగా నాకాలములో నాదరించుచుండిరను విషయమును దెలుపుటకు భక్తమందారశతకమునుండి రెండుపద్యములుటంకించుటతో నీశతకపరామర్శను బూర్తిచేయుదును.

"ధాటీపాటవచాటు కావ్యరచనోద్యద్ధోరణీ సారణీ
వ్యాటీకోద్గతి సత్కవీశ్వరుఁడు నిత్యంబుం దమున్ వేడగా
వీటీ ఘోటకవాటకాదు లిడరుర్విన్ నిర్దయాబుద్ధిచే
మాటే బంగరు—నేఁటిరాజులకు రామాభక్తమందారమా"

"గడియల్ రెండికసైఁచిరా, వెనుకరా, కాసంత సేపుండిరా,
విడిదింటం గడె సేదదీర్చుకొనిరా, వేగంబె భోంచేసిరా,
యెడపొద్దప్పుడు రమ్మటంచు సుకవిన్ హీనప్రభుండీగతిన్
మడతల్ పల్కుచుఁ ద్రిప్పుఁ గాసిడక రామా! భక్తమందారమా"

—♦♦—

# అడిదము సూరకవి

(క్రీ॥ శ॥ 1720—1785)

"ఊరెయ్యది? చీఁపురుపలె, పేరో? సూరకవి; ఇంటిపే? రడిదమువార్;
ఏరాజు? విజయరామమహారా; జతఁడేమి సరసుఁడా? భోజుఁడయా"

సూరకవి తన వృత్తాంతమును ప్రశ్నోత్తరరూపమున (సంగ్రహించి) చెప్పుకొనిన పద్యమిది.

ఇందువలన నడిదము సూరకవి చీపురుపల్లె వాస్తవ్యుఁడని, యతని కాశ్రయభూతుఁడైన ప్రభువు భోజునివంటి సరసుఁడైన విజయరామ రాజని తెలియుచున్నది.

ఈతని పూర్వికులందఱు విజయనగరాస్థానమున పారంపర్యముగ (తొమ్మిదిపురుషాంతరములనుండి) విద్వత్కవులుగా విలసిల్లుచుండిరనియు, మొట్టమొదట వీరి యింటిపేరు మోదుకూరివారనియు, నాతరువాత నది గంధవారణమువారుగా మారినదనియు, నితని పూర్వులలో నొకఁడైన నీలాద్రికవి బ్రాహ్మణుఁడై యుండియుఁ దనప్రభువులపక్షమున యుద్ధములలో ఖడ్గకౌశలము చూపినందున "అడిదము"వారను బిరుదనామమే యింటిపేరుగా స్థిరపడినదనియు నీసూరకవి చరిత్రము వ్రాసిన శ్రీయడిదము రామారావుగారు తెలిపిరి. ఈయింటిపేరు విషయ మెట్లుండినను, సూరకవివంశపూర్వులు మాత్రము తొమ్మిదితరములుగా కళింగ వసుధాధవుల (విజయనగరము రాజుల) ఆశ్రితులయి యుండినట్లతఁడు చెప్పిన క్రింది చాటుపద్యమువలన నెఱుకపడుచున్నది.

"ఇరువదిమూఁడు పూరుషము లిప్పటికయ్యెఁ గవిత్వవృత్తిచే
నరపతులెల్ల మెచ్చఁ బదునాల్గుతరంబులు మించుఁ బిమ్మటన్
వెరవగు జీవనస్థితి లభించుట తొమ్మిదియయ్యెఁ బూరుషాం
తరములు నిక్కళింగవసుధాధిపుచెంగట నాశ్రయించుటన్"

'అడిదము' బిరుదప్రాప్తికిఁ గారకుఁడైన నీలాద్రికవి 'రణరంగవిజయ' మను గ్రంథమును నతని మూఁడవమనుమఁడైన బాలభాస్కరకవి "శుద్ధాంధ్రరామాయణ"మను గ్రంథమును వ్రాసినట్లు తెలియుచున్నది. కాని యాకృతులింతవఱకు లభ్యము కాకపోయినను సూరకవి వంశములోఁ గవిత్వమనునది పరంపరగా వచ్చుచున్నవృత్తిగాఁ గనిపించుచున్నది.

సూరకవికి, శుద్ధాంధ్రరామాయణకర్తగాఁ జెప్పఁబడు బాల భాస్కరుఁడే తండ్రి. ఆవిషయము నతఁడు తన కవిజనరంజనములో:—

"శుద్ధాంధ్రరామాయణ ఘటనా వైదుషీ ధురంధర రాడిదము బాలభాస్కర తనూభవ"

అని గద్యమునందుఁ జెప్పుకొనినాఁడు. సూరకవి (1) కవిజనరంజనము (చంద్రమతీపరిణయము), (2) రామలింగేశ్వరశతకము, (3) కవిసంశయవిచ్ఛేదము, (4) ఆంధ్రచంద్రాలోకము, (5) ఆంధ్రనామశేషము, (6) వేంకటమంత్రిశతకము అను గ్రంథములను వ్రాసినట్లు తెలియుచున్నది. దాదాపన్నియు వెలువడినవే. వేంకటమంత్రిశతకముమాత్రము పూర్తిగా దొరకలేదు. ఇతఁడు తనగ్రంథములను రామచంద్రపురములోని రామలింగేశ్వరస్వామి కంకితము చేసినాఁడు.

ఇతని చాటుధారవలన "వెరవగు జీవనస్థితి లభించుట తో క్షుదియయ్యెఁ బూరుషాంతరములు నిక్కలింగవసుధాధిపు చెంగట నాశ్రయించుటల్" అని, కళింగవసుధాధిపులని ప్రఖ్యాతి వహించిన విజయనగరప్రభువుల యాస్థానములోఁ గవులుగా నుండి యగ్రహారాదికములు సంపాదించినట్లు తెలియుచున్నది.

క్రీ॥ శ॥ 1652 వ సంవత్సరమున శ్రీకాకుళము ఫౌఁజుదారుగా నుండిన షేర్ మహమ్మదుఖానువలనఁ గూలిమి భోగాపురములను గుత్తకుఁ దీసికొని పరిపాలించుచువచ్చిన పూసపాటి రఘునాథరాజను తమ్మిరాజుకొడుకగు సీతారామచంద్రరాజు పరాక్రమవంతుఁడై పర్లాకిమిడి గజపతిదేవునితో మైత్రి సంపాదించి, పోట్నూరుజయించి. "కళింగరాజు" అను బిరుదము నంది పరిపాలించుచు నాయూరే వాసస్థానముగా నుండిన ట్లాంధ్రకవులచరిత్రవలనఁ దెలియుచున్నది. కనుక సూరకవి చాటువులో సూచించిన "కళింగరాజు" బిరుదము విజయనగర రాజులకు వంశపరంపరగా వచ్చుచున్నట్లు తోఁచుచున్నది.

విజయనగరప్రభువులలో నిరువురు "విజయరామరాజులు" కనఁబడుచున్నారు. అందు మొదటివాఁడు పైనఁజెప్పిన (కళింగరాజ బిరుద సంపాదకుఁడు) సీతారామరాజు మనుమఁడును, నానందరాజు కొడుకును చారిత్రకమైన బొబ్బిలియుద్ధకారకుఁడై తాండ్రపాపయ్యచే క్రీ॥ శ॥ 1757 సం॥రము జనవరి 24 వ తేది హతుఁడైనవాఁడును, మన్నెదొర

లను జయించి వారి దేశములను లోఁబఱచుకొన్నందున 'మన్నెసుల్తాన్' బిరుదము పొందినవాఁడు నయిన పెద్దవిజయరామరాజు. ఇతఁడే పోట్నూరునుండి తన రాజధానిని విజయనగరమునకు మార్చుకొని కోట నిర్మించుకొనినాఁడు. కాని యాంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహములో నితఁడు (విజయరామరాజు) ఆనందరాజుకొడుకుగాక, సీతారామచంద్రరాజుసుతుఁడుగా పేర్కొనఁబడుట కాధారము కనిపించదు. ఒకవేళ గ్రంథకర్త పొరపాటుపడియుండవచ్చునేమో? మొదటి (పెద్ద) విజయరామరాజునకు తరువాత నతని పినతండ్రిపుత్రుఁడైన యానంద గజపతిరాజు కొంతకాలము రాజ్యమునుపాలించి, చనిపోఁగానే, పెద్ద విజయరామరాజుగారి భార్య యయిన చంద్రయ్యమ్మగారు దగ్గఱిజ్ఞాతి యయిన పూసపాటి రామభద్రరాజుగారి రెండవభార్యకుఁ గలిగిన వేంకటపతిరాజును దెచ్చి పెంచుకొని, 'విజయరామరాజ'ని పేరు మార్చి పెట్టి పట్టాభిషిక్తుని చేసినది. ఇతఁడు సింహాసనమునకు వచ్చునాఁటికి పండ్రెండేండ్ల ప్రాయమే. ఇతనికే చిన (రెండవ) విజయరామరాజని పేరు. ఇతనికి సమవయస్కుఁడై (ఆకాలములో పెద్దాపురము సంస్థానమును పాలించుచుండిన తిమ్మజగపతి యితని కత్యంత మిత్రుఁడు; బంధువు; ఇద్దఱును సంస్కృతాంధ్రముల మంచిపాండిత్యముకలవారు. మన సూరకవి యీ చినవిజయరామరాజుకాలములోనే యాస్థాన కవిగా నుండినవాఁడు, కాని పెద్దవిజయరామరాజుకాలములోఁ గాదు. అప్పు డతఁ డింకను బాల్యదశలో నుండెను.

చినవిజయరామరాజు బాల్యముననే సింహాసన మెక్కెను. కాని యతని సవతియన్న యయిన సీతారామరాజే రాజ్యవ్యవహారము లన్నియుఁ జూచుచుండెను. ఈయిరువురమీఁదను సూరకవి యెన్నియో చాటువులు చెప్పియున్నాఁడు. కావున సూరన చిన్నవిజయరామరాజు కాలమువాఁడే యని నిర్ణయమగుచున్నది.

ఈకారణములను బట్టి సూరకవి క్రీ॥ శ॥ 1715-20 ప్రాంతములలో జన్మించి క్రీ॥ శ॥ 1759 లో రాజ్యమునకు వచ్చిన చిన్నవిజయరామరాజుకాలమునకుఁ బ్రౌఢకవియై ప్రకాశించి, నానారాజాస్థానములలోఁ దన విద్వత్కవితాప్రదర్శనములు చేయుచు క్రీ॥ శ॥ 1780-85 ప్రాంతమువఱకు జీవించియుండుననుటలో సందేహ మేమాత్రము లేదు.

ఇతఁడు విశాఖపట్టణమండలములోని (విజయనగరసమీపగ్రామమైన) చీఁపురుపల్లెలో నివసించుచు వచ్చెనను, నష్టైశ్వర్యుఁడై ప్రవ్రాజకయి దేశసంచారము చేయుచుండువాఁడు. ఇతఁడు గోదావరిమండలములోని కోటిపల్లి వాస్తవ్యులైన వడ్డాదివారింటి సూరాంబికను సహధర్మిణిగా స్వీకరించినాఁడు.

ఇతని గ్రంథములలో "కవిజనరంజనము" చాల ప్రౌఢకావ్యము. ఇందు మూఁడాశ్వాసములే యుండినను, కవితా చమత్కృతి విద్వద్రంజకముగాఁ బ్రకాశించుచున్నది. దీనికి "పిల్లవసుచరిత్ర" మను ప్రఖ్యాతి యున్నది. సూరన కవితాప్రాగల్భ్యమున కిది యొరపిడిఱాయివంటిది. ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము సూరకవిని గూర్చి "ఇతని చాటువులు వీన నింపుగ నున్నవి. కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని కితఁ డుద్దియన్నఁ దప్పుగా నేరదు"—అని వాకొనుచున్నది.

ఈసూరనయు జగ్గకవినలెనే తిట్టుకవిత్వమునఁ బ్రవీణుఁడనియు, వైశ్యులు మున్నగువారియిండ్లలో జరుగు ప్రయోజనప్రస్తుతములలోఁ జాటువులు చెప్పి ధనము గడించువాఁడనియు నొకప్రవాదమున్నది. అది యెంతవఱకు నిజమో నిర్ణయించుట సులభసాధ్యముకాదు. కాని సూరకవియే తనకు నిగ్రహానుగ్రహ సామర్థ్యము కలదని యీక్రింది చాటుధారమూలకముగాఁ బ్రకటించినాఁడు.

"గడియకు నూఱుపద్దెములు గంటము లేక రచింతుఁ, దిట్టఁగాఁ
దొడఁగితినా పటాలుమని తూలిపడుం గులశైలరాజముల్, *
విడిచి యనుగ్రహించి నిఱుపేద ధనాధిపతుల్యుఁ జేతు, నే
నడిదమువాఁడ సూరనసమాఖ్యుఁడ నాకొకరుండు సాటియే ॥"

ఇతనికిఁ 'గంచరము'—'రేగ', యనుమాన్యములు ప్రభుదత్తము లుండినట్లును, అవి నిరుపయోగప్రదేశము లయినట్లును, సూరకవి యీక్రిందిచాటువులో వెల్లడించినాఁడు. పైఁగా నందుఁ దనపాండిత్య కవితా ప్రకర్షలు భోగానుభవములునుగూడ సూచించినాఁడు.

"గరిసెలు వ్రాఁత గాని మఱి గంపెఁ డెఱుంగము, మన్యదేశముల్
తిరిగి యభీష్టవస్తువులు తెచ్చి భుజింతుము, సర్వకాలముం
సురుచిర సత్కవిత్వనిధి సూరకవీంద్రున కేల కల్గె కం
చరమును, రేగ, మేఁక మెడచన్నుల వంటివి రెండుమాన్యముల్"

---

* ఇయ్యది సత్యమని—"సూరకవితిట్టు కమసాలిసుత్తిపెట్టు"—అను వాక్యము తార్కాణించుచున్నది.

చినవిజయరామరాజు బాల్యదశలోనుండగా రాజ్యవ్యవహారము లతనిసవతియన్న సీతారామరాజు చూచుకొనుచుండువాఁడు. అధికారా కాంక్ష, రాజ్యతృష్ణ, ధనపిపాస యతనికి మిక్కుటము. ఆకారణము చేత- వసరాజ్యములోని మసీదులకు, దేవాలయములకు, బ్రాహ్మణుల కిచ్చిన మాన్యములన్నియు నూడఁబెఱికికొని రాజ్యమునఁ గలుపుకొనినాఁడు. ఆఘనస్త్రముగాఁ బరరాజ్యముల నాక్రమించుకొనినాఁడు. తన కెదురు లేని విక్రమముతో నిరంకుశముగఁ బ్రవర్తించి విజయరామరాజునకుఁ బాల నాదక్షత కలిగినతరువాతఁగూడ రాజ్యము స్వాధీనపఱచకుండ నుండి నాఁడు. అప్పుడు ప్రజాసంక్షోభము చెలరేఁగినది. దానికి తట్టుకొనలేక మంత్రిత్వమును వదలుకొని వెళ్లినను, నతనికుట్రలుమాత్రము పోలేదు. ఇట్టి దుష్పరిపాలకునియొక్క యవినీతులను లోకమునకు వెల్లడిచేయు టకే సూరకవి రామలింగేశశతకమును వ్రాసినాఁడు. సీతారామరాజు దేశద్రోహమును, రాజద్రోహమును నిరసించు సందర్భమున సూరకవి సమాదాక్షిణ్యములుకాని, జంకుకొంకులుగాని, పక్షపాతముగాని యీ షన్మాత్రమైనను జూపలేదు.

ఒకప్పుడు సూరకవి యేకవచనముతో సంబోధించుచు ఈ సీతా రామరాజుపై పద్యములు చదువఁగా నతఁడు కోపముఁ దాల్చెనఁట! అప్పుడు సూరకవి :—

"చిన్నప్పుడు, రతికేళిక మన్నప్పుడు, కవితలోన యుద్ధములోనన్
వన్నెనుమీ రాకొట్టుట చెన్నుగ నోపూసపాటి సీతారామా"

యని మఱల నేకవచనముతోడనే సమాధాన మిచ్చెనఁట.

విజయరామరాజుగారిమీఁదఁ జెప్పిన చాటువులలోఁ గొన్ని :

"ఢిల్లీలోపల గోలకొండపురి నిండెన్ నీప్రశంసల్ గుజాల్
బల్లాలం బొడిపించి, హుమ్మన యరబ్బా నెక్కి పైకొంచు, బా
దుల్లాఖానుని బాఱఁద్రోలితివి నీదోశ్శక్తినూ బాలమన్
మల్లింపందరమానె ? శ్రీవిజయరామా ! మండలాధీశ్వరా !"

"పంతమునీకెచెల్లె నొకపాటియమీరుఁడు నీకుసాటియా ?
కుంతముఁ గేలఁబూని నినుఁగొల్వనివాఁడు ధరాతలాన, భూ
కాంతుఁ డొకండు లేఁడు కటకంబుమొదల్కొని గోలకొండప
ర్యంతముఁ జూడ శ్రీ విజయరామనృపాలక ! మండలాధిపా !"

విజయరామరాజుగారేదో కారణమున సూరకవియెడ నాగ్రహము నొంది యాస్థానమునకు రావలదనిరఁట! బాదుల్లఖానుతో నొకనాఁడు యుద్ధము సేయఁబోయి పరాభూతుఁడై యీరాజు తిరిగి వచ్చుచుండఁగా సూరకవి తనగ్రామముప్రక్క త్రోవలోఁ బనస చెట్టెక్కి విస్తళ్లకయి యాకులు గోసికొనుచుఁ జూచి, యెదురుగఁ బోయి, పల్లకిఁ బాపి తన కసి దీఱునట్లు చుఱుకుగా నీపద్యముఁ జెప్పెనఁట!

"మెత్తనైయున్న యరఁటాకుమీఁదగాని, మంటమీఁదను జెల్లునే మంటివాఁడు
చీదలైయున్న సద్దాన్లమీఁదఁగాక కలదె క్రొవ్వాఁడి బాదుల్లఖానుమీఁద"

ఈకథ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితమయి వావిళ్ల వారిచేఁ బ్రచురింపఁబడిన చాటుపద్యమణిమంజరిలోనిది.

చిన విజయరామరాజింగ్లీషువారితోఁ దనమరణమునకుఁ గారణమైన "పద్మనాభము" యుద్ధము తప్ప మఱేయుద్ధమును జేసినట్లు కనఁబడదు. అట్లుండఁగా నీబాదుల్లాఖానుఁ డెవఁడో, యితనితో నెప్పు డెందులకు యుద్ధమొనర్చెనో తెలియుటలేదు. మఱి యీబాదుల్లాఖానుతో పోరొనర్చినది పెద్దవిజయరామరాజుగా నుండునేమో? అగుచోఁ బైని ప్రసక్తములైనపద్యములు సూరకవి విరచితములు కానేరవు. మఱెవరివో తెలియుట లేదు.

ఒకప్పుడు విజయరామరాజు తనయాప్తమిత్రుఁడైన (పెద్దాపుర ప్రభువు) తిమ్మజగపతిని జూచుటకుఁ బెద్దాపురమునకు వెడలెనఁట! సూరకవియుఁ దనప్రభువు వెంటఁ బోయెను. అట్టియెడ నొకనాఁడు రాజులందఱు సభచేసి కూర్చుండియుండఁగా సూరకవి:—

"రాజుకళంకమూర్తి, రతిరాజు శరీరవిహీనుఁ, డంబికా
రాజు దిగంబరుండు, మృగరాజు గుహాంతరసీమవర్తి, వి
భ్రాజిత పూసపాడ్విజయరామనృపాలుఁడె రాజుగాక, యీ
రాజులు రాజులే—పెనుతరాజులుగాక, ధరాతలంబునన్"

అనుపద్యమును రాజులందఱివంకఁ జూచుచుఁ జదువఁగా నందలి కడపటివాక్యము తమ్ముఁగూర్చి చెప్పినట్లు వారుభావించి, కుపితులై లేవఁబోఁగా "ఈరాజులు"—అనఁగాఁ బద్యమునఁ బైపాదములలోఁ జేర్కొనఁబడిన రాజులని సమర్థించి చెప్పి సూరకవి వారిని సమాధానపఱచెనఁట!

ఆకాలమున సూరనకుఁ బ్రత్యర్థిగా 'సోమన' యను వైదికకవి యొకఁడుండెనఁట! నియోగియగు సూరకవి కవిత నతఁడు నిరసించెనఁట! ఆసందర్భములో సూరన సోమనకవిత్వమునుగూర్చి యీక్రిందిచాటువు చెప్పెనఁట!

> "చెన్నగు నియోగికవనపు మిన్నా వైదికుని కబ్బి మించెనె చెప్పఁగా,
> వెన్నమినీ జున్నుకబ్బునె? తన్నుకవచ్చినను గాని ధరలోన నృపా!"

అందుమీఁద సోమకవియు :—

> "తక్కెకిక్కిరిబుద్ధులై తగినవారి కేమసాధ్య మటంచు నూహింపరాదె?
> తెలుఁగుమాటలు నాల్గైదు తెలిసి తాము కవులమనుకొన్న వెఱి పాడఁగట్లు మదిని"

అంతియకాక సూరకవికిఁ గలుగుచున్న రాజసన్మానమునకు నగచి, తనవంటి వైదికకవి కంతటిస్థితి లభ్యపడనందున నీక్రింది చాటువును సోమన చెప్పినాఁడుఁట!

> ఇలలో వైదికవిద్వత్తిలకంబుల కేమి దిక్కు తెలిపితివమ్మా!
> జిలిబిలిపలుకుల వెలఁదీ! పలుగాకి నకారగుల్ల పాలైతిఁగదే॥

ఇదెంతవఱకు సత్యమో కాని, సూరకవీంద్రుని కృతులలో దేనిలోను సూచనగానైనను వైదిక ద్వేషమును చూపు ముక్కయొక్కటియయినను గనఁబడుట లేదు. చాటువుల కేమి?

ఆకాలములో దంతులూరి అన్నమరాజను నతఁడు విజయనగర ప్రభువుల సంస్థానములోని (రేవ) రేగ యను గ్రామమును గుత్తకుఁ బుచ్చుకొనినాఁడుఁట! ఆగ్రామములో మనసూరకవికిఁ జెఱువుగట్టు క్రింద కొంతమాన్య ముండినదఁట! దానికి నీరుపెట్టుకొననీయకుండ నన్నమరాజు జన్నుపడఁగా, సూరకవి ప్రభువునకు ఫిర్యాదుచేసియుఁ బ్రయోజనము లేకపోయినది. తుద కతఁడు చెఱువులో మొలలోఁతు నీటిలో నిలుచుండి నాలుగు సీసపద్యములు చెప్పఁగనే నాలుగుప్రక్కల గట్లు తెగి యతనిపొలమునకు నీరుపాఱినదఁట! చమత్కారవంతములైన యీనాలుగు రసవత్తరపద్యముల నుదాహరించుట యప్రస్తుతము కాఁ జాలదు :—

> "బ్రహ్మాండభాండసంపత్తి కుక్షినిగల్గు పద్మనాభుని పదాబ్జమునఁబుట్టి,
> సకలరత్నాకరస్థానమై యుప్పొంగు నంబుధీశుని చరణంబుఁద్రొక్కి,
> పరమతత్త్వజ్ఞుడై పరఁగు శంతనుమహీరమణుదామాంక భాగమునఁజేరి,

యఖిలలోకారాధ్యుఁడై మించి విహరించు శివుజటాజూటాగ్రసీమ విడచి
తనరు నీవంటిధన్య కుత్తమముగాదు పూసపాటి మహాస్థానభూమియుండఁ
గాలుద్రొక్కఁగనోడుఁ జండాలుఁడైనఁ గదలు మిటమాని దివిజగంగాభవాని !"

"ఆదిభిక్షుండీతఁడనిరోసి విడియూకు గొనివచ్చి యిట నిల్వఁగోరితొకో !
జగడాలచీలివై సవతితోఁబోరాడి పేఁగివచ్చియిచట డాగితొకో !
నిర్జరాంగనలెల్ల నీజంకు వెలిపుచ్చ దూబవై యిచ్చోట మాఱితొకో !
పేదబాపలఁ గష్టపెట్టుటకై మిన్నుఁ డొలఁగి యిచ్చోటను నిలిచితొకో !
వలదు, ద్విజభూమిఁ గాల్నిల్ప వరుసగాదు నవ్వ నీకేల ? తగ దంబ[illegible]
నాతి యతఁడ కాఁడటె పిన్ననాఁటిమగఁడు కదలుమిటమాని, దివిజగంగాభవాని"

"భావింప నిలువెల్ల భంగంబులేకాని భంగముల్లేలఁగు కెప్పటికిలేదు,
తిరుగఁబో వంకరతిరుగుడింతియకాని తిన్నఁగాదిరుగుట యెన్నఁడెఱుఁగ,
మొనసి తేలియిపగల్లు మెరయుచుండుటెకాని, మెరయకూరక యుంట యెఱుఁగ మెప్పుడు,
పాఁకల్మి నిరోసి పల్చనగుటెకాని పలుచనిగతిమాని మెలఁగుటెఱుఁగ
మనుచు నీలోన నీవైన యవగుణంబు లరసి లజ్జించి దివినుండ కరుగుదెంచి
నిలువునీరైన నీవిందునిలిచితొకొ ! కదలుమిటమాని దివిజగంగాభవాని !"

"కృతకాద్రులాయెనా ? కీలోగ్రఫణిఫణానేకపూత్కార వల్మీకచయము,
విరిదోఁటలాయెనా ? కటుకకంటకకంట కాంకుర విస్ఫురత్నాగచయము,
పువుఁబాన్పులాయెనా ? నవమంజులశ్వేత లవణాలవాలమౌ చవుటినేల,
బొమ్మరిండ్లాయెనా ? భూరిభేకాండజాధారమై తనరు కేదారచయము
నీకు విహరింప వసతులై నివ్వటిలెనె ? చిన్నిపొలములు బ్రాహ్మణక్షేత్రములకు
ఘాతుకత్వంబుచేయు ముష్కరులుగలరె, కదలుమిటమాని, దివిజగంగాభవాని !"

ఇఁక రామలింగేశశతకమునుగూర్చి :—

ఇందు 105 సీసపద్యములున్నవి. "రామలింగేశ రామచంద్రపుర వాస" యని మకుటము. ఇతఁడు తనగ్రంథములన్నియు రామచంద్రపురములో నెలకొన్న "రామలింగేశ్వరు"నకే యంకితము చేసినందున నితని కాదేవుఁడే కులదైవమని తలంపవలసియున్నది. ఈవిషయములో నితఁడు పోతన, తిమ్మకవులతోఁ దుల్యుఁడనవచ్చును.

విజయరామరాజునకుఁ బ్రతినిధిగా విజయనగరసామ్రాజ్యమును సర్వాధికారములతో నేలుచుండిన (అతని సవతియన్న యయిన) సీతారామరాజు, ధనపిశాచము తన్నావేశింప, దేవబ్రాహ్మణకవీంద్రుల వృత్తులాక్రమించుకొని సర్వజనకంటకుఁడై చేసిన ప్రజాపీడనము లే సూరకవి నీశతకసృష్టికిఁ బ్రేరేఁచినది. "కలినచిత్తుని రాజ్యాధికారిఁ జేసి యింత పీడించితివి సత్కవీంద్రకోటి" యని వాపోయినాఁడు.

ఇతని శతకములోని సీసపద్యములనడక యత్యద్భుతమైనది. సీస శతకకారులలో నెవ్వరికిఁగాని యితనిధోరణి కుదురలేదనిన నతిశయోక్తి కాదు. ఏపాదమున కాపాద మొకనీతి నందిచ్చును. పద్యముతుది వఱకుఁ జదువ నక్కఱలేకయే, యెత్తుగీతిలోఁ గవి యేభావము వెల్లడించునో యని యెదురుచూచు నవసరము లేకయే, పద్యము మొదటి పాదముననే కవిహృదయము విస్పష్టమగును. వాడుకలో నుండు దేశ్యశబ్దములతో ముచ్చటగ సరళమైన ధారతోఁ బద్యము దొర్లుకు పోవుచుండును. ఒక్కసారి చదివినమాత్రముననఁ బాఠకునిమనస్సులో నాటుకొనిపోవు నభిప్రాయములను గుదిగ్రుచ్చుటలో రామలింగేశశతకమునకుఁ బోల్పఁదగినది వేణుగోపాలశతకముమాత్రమే.

ఈశతకములో నాకాలపు జమీందారుల దురాగతములుమాత్రమేకాక, సామాన్యనీతులుకూడఁ జెప్పఁబడినవి. క్వాచిత్కముగా భక్తి నుద్బోధించు పద్యములుకూడఁ గలవు :—

ఈక్రిందిపద్యము వ్యంగ్యభావస్ఫోరకము :—

"భయమేల కొండంతపగతుఁడు నాకున్న ? మేరువువంచిన మేటిగలుగ,
నాకేలశోకసంతాపంబువచ్చు గుంద ? శీతాంశుమౌళి నా చెంతనుండఁ,
దస్కరభీతికిఁ దల్లడిల్లఁగ నేల ప్రమథులతో శూలపాణినిలువ,
నగ్నిభీతికి నాకు, నళుకుజెందఁగ నేల ? గంగాధరుండు నాకడవసింప
ననుచు నెంతటికెంతటి కలుగలేక నమ్మియుంటిని నీప్రాపునామనమున
జాగరూకుఁడవై నన్ను సాకుమయ్య ॥రామ॥"

సామాన్యనీతులను దెలుపునప్పుడు సూరకవి సామర్థ్యమసామాన్యము :—

"జనసమ్మతములేని పని సేయఁగూడదు, చలముకూడదు కార్యసాధకునకు,
గుట్టుపోనిచ్చిన గిట్టుఁ బెద్దతికంబు, దుర్వ్యయపరుఁడైనఁ దొలఁగు మిసిమి,
ఘనతృష్ణపెరిగిన మునుపున్న దినశించు, నోరుచేటుఁ గోరిఁ జేటొందుఁదనకు,
దుడుకు సేయఁగరాదు తోఁపంబు చూడఁగాఁ, బట్టినపని కడముట్టవలయుఁ,
దెలివిచాలని పని సేయఁ గలుగుఁ గీడు అడుగవచ్చిన లేదను టనుచితంబు
మర్జనకోలంది రోయఁగుట దొడ్డతనము ॥రామ॥"

ఇందులో నేపాదమున కాపాద మొకచక్కనినీతిని బ్రసాదించును.

సిరి తొలఁగు నవలక్షణములనుగూర్చి యీక్రిందిపద్యములో నెంతముచ్చటగాఁ జెప్పఁబడినదో చూడుఁడు—

“ఉభయసంధ్యలనిద్ర, యుచ్ఛిష్టసంగ్రహం, బపరాహ్ణ[illegible] [illegible],
గ్రాసాతిరేకం, బకారణహాసంబు, చరణద్వయాల్పసంక్షాళనంబు,
పరవధూపరవిత్త హరణాభిలాషయు, స్వాంగవాద్యములు, [illegible],
మలినాంబరత, జానువులు మాశిరేఖ్కలు, యవనిలేఖనము, దంతాల్ప[illegible],
పలుమఱులుమియుట దుష్టభాషణములు. మొదలుగాఁగల దుర్గుణంబుల [illegible]
శ్రీనివాసునికైనను సిరిదొలంగు ||రామ||”

వాడుకలోనుండు దేశ్యశబ్దముల నీశతకములో సూరకవి ధారా ళముగా నుపయోగించుటలో నతని యుపజ్ఞ యొక్క విశిష్టత బాగుగా గోచరించును. దీనినిబట్టి పూర్వకవులు పాండిత్యప్రకర్ష కొఱకుగాక యెక్కువప్రచారాపేక్షముల్లైన విషయములను గూర్చి పద్యములను వ్రాయుపట్ల వ్యావహారిక పదముల కెంతటి ప్రాముఖ్యమిచ్చువారో సుల భముగా గ్రహింపవచ్చును. ఈక్రిందపదములు పూర్తిగాఁ దెలుఁగుఁ దనమును బుడికిపుచ్చుకొనినవి :—

ఊఁతకోల, గోడచారు, ఒరుగుబిళ్ల, నోతెఱుకొల్చు, వ్రేలెడుగుష్టి, అచ్చినవాడు, తడికపెట్టు, వెలిచవులు, వావివరసలు, కప్పకూఁతలు, గుత్తరూఁకలు, ముక్కిడితొత్తు, సుంకరమోట, ఎంగిలిపుల్లె, పేఁడమఱు కలు, పెంటగుట్టలు, పూఁటపడు, పాడుపత్తెము, కాలుచాఁచు (పూను కొను,) కొయ్యకాలు, చంకలువైచు (ఉప్పొంగు,) ముక్కాలిపీఁట, ముంజేతికడియము, తంగేటిజున్ను. వెలికాలు, తలసుళ్లు, సంధ్యముక్క, పిడికెఁడుబిచ్చము, లేకిపరకలు, పెడతల, కన్నెఁడచేయు, పరగటితట్టు, కతకము, ఆనవాలు, మందుమాకు, నక్కనోరు, పెట్టిపోయు, తొగరు చీర, పుక్కిటిపురాణము, తల్లుపుట్టు, కడవెల్లు, సరిపుచ్చు, చీఁకటితప్పు, నెయ్యార్లు, మల్లాతీలు, పుప్పిపల్లు, పిడుగుతునక, సిద్ధాంతివేత్త, బ్రహ్మ కాయ, జంగజాఁచు, ఉట్టిచేర్లు, చలపాది—గడ్డు, ముంత, దుంత, ఆడిక, పల్లాకి. సన్నికలు, పోరచి, ఊబి, తొంగుండు, సోనారి, తాకట్టు, గూన, జోకులు, చౌకట్లు.

ఈశతకములోఁ గనఁబడు కొన్ని కులముల పేరులు :— దేవాం గులు, పంబకాఁడు, బలిజెలు, పట్టెదాసరిజంగాలు, పిచ్చుకుంటి, పర జాలు, కల్లుకీ, రుంజకాఁడు, శిష్టుకరణాలు.—

సందర్భానుసారముగాఁ బ్రయోగింపఁబడిన సామెతలలోఁ గొన్ని:

(1) తిన రుచియు చోర లోఁతును తెలియఁబడదె ? (2) ఈఁతకు మిక్కిలి లోఁతులేదు. (3) కలిబోయ నుట్లవంకఁ జూచుచుండెదరు.

పానకములో మిరియపుఁబొడుము కమ్మదనమువలె సూరకవి పద్యములలో హాస్యరసముకూడ నవసరమైనపట్లలోఁ దొంగిచూచు చుండును :—

1. గర్దంబువపనంబు గావించుమంగలి కోఁతవెట్టునె తలగొఱిగి వేఁత
2. కంచంబు ముంతయుఁ గైకొన్నచోరుండు పూజించునే దేవపూజపెట్టె,
3. శ్రీ వైష్ణవుఁడు ముడ్డిఁ జెఱువులోఁగడిగిన నదియు సదాచార మనఁగఁదగునె ?
4. ఘనకమైథున, మప్వ, చూ, లధికారంబు లాద్యంతసౌఖ్యకష్టాస్పదంబు (లు)
5. మద్యపానముసేయ మడివస్త్రమేటికి ? త్రాడుదెంపఁగ ముహూర్తంబులేల ?
6. పేనే మెఱుంగును పెడతలకండూతి ? వృషణమర్వ్యథ చీమ యెఱుఁగుటెట్లు ?
7. జవ్వాదియలఁదినఁ జంకలెత్తఁగనేల ? విధవకుఁదలనుబ్లు వెదకనేల ?
8. కత్తిత్రిశ్రద్ధయగానె ? కలయథార్థంబౌనె ? పెనుయోని ముక్కాలిపీఁటయగునె ?

అల్పకవులనుగూర్చి సూరనయభిప్రాయము :—

"కొద్దవాఁడు కవిత్వంబుఁ దొడరిచెప్ప నల్పుఁడు కవిత్వమురచింప నభిలషించు"

"కవితసేయుట యతిఁగూర్పు కైపె తెలుపు."

మఱి యీశతకములో :—

"తనదుశైలలి దొడ్డభూధవునికిచ్చి యతనివలనను సిరిఁ గాంచు నంతకంటె
సారమైతోఁచుఁ గొండిదాసరితనంబు"

అని యెవరినిగూర్చి సూరకవి చెప్పినాఁడో తెలియుటలేదు. బహుశా సీతారామరాజునొద్ద చనవుతో మెలఁగుచుఁ దనకపకారము చేసిన రాజోద్యోగి నెవనినైన నీలాగు దూషించియుండవచ్చును. లేదా, రేగను గుత్తకుఁ బుచ్చుకొని తనమాన్యమునకుఁ జెఱువునీరు విడువకుండ బాధించిన దంతులూరు అన్నమరాజునకు (ప్రభువునకుందు) సంబంధమునుగూర్చి పైవిధముగాఁ జెప్పెనేమో !

మొత్తముమీఁద సీరామలింగేశశతకములో నక్కడక్కడ సామాన్యనీతులతో జోడింపఁబడిన రాజనీతిని బూర్తిగా తెలుపు పద్యములే 100 కి 95 భాగములున్నవి. సూరకవి మహాలౌక్యుఁడు, రాజనీతిచతురుఁడు. కేవలము ప్రభుదూషణమేగాక, దానితోఁబాటు నయమార్గబోధనముకూడ చేయుట శస్త్రచికిత్స (ఆపరేషన్) తోఁ బాటు ఔషధప్రయోగము చేయుటవంటిది. చాలమంది కవుల కట్టిశక్తి యుండదనుట యతిశయోక్తి కాదు.

ఇఁక రెండుపద్యములు లీశతకమునుండి యుటంకించుచు నీ వ్యాసమును ముగించుచున్నాఁడను.

సూరకవి రాజులను గంగిరెద్దులకుఁ బోల్చి చెప్పినపద్య మీ క్రిందిది :—

"కడువింతయగు స్థూలకాయంబుగలుగుట, చిత్రభూషాంబరస్థితి వలయుట,
తూర్యనాదంబులతోఁ జనుదెంచుట, వాలవ్యజన సమవాప్తిఁగనుట.
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట, చూపఱల్పుడుగుఁ బుట్టికొనుట,
స్వనియంతృవాద్యంబు వినితలయూఁచుట, మానవుఁబ్రవహించు మతముఁగనుట,
గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును భేదమించుకయును గానిపించదట్టి
ప్రభుని వేఁడిన సత్కవి పదవిచెడదె"

ఆకాలమున సంస్థానములు పాలించు నధికారులవలన సంఘమునకుఁ గలిగిన చెట్టలనుగూర్చి యీ క్రిందివిధముగా వాపోయినాఁడు :-

"అగ్రహారములు నామావశిష్టములయ్యె, మాన్యంబులన్నియు మంటఁగలిసె,
భత్యంబునకుఁ దొంటిపడికట్టు దప్పెను, బుధజనంబుల రాకపోక లుడిగె
వర్షాశనంబులు వఱదపాలై పోయె, మలవతీలను బ్రజల్ మాసివనిరి,
నశియించిపోయె వంటరులు ధనుష్కులు, గజతురంగములు తాకట్టుపడియె,
ధార్మికస్థానమున కిట్టితళ్లు పుట్టెఁ, గఠినచిత్తుని రాజ్యాధికారిఁ జేసి,
యింతపీడించితివి సత్కవీంద్రకోటి రామలింగేశ ! రామచంద్రపురవాస !॥"

---

సవరణములు :—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 215 | 14 | ఆశ్రయించుటల్ | ఆశ్రయించుటక్ |
| 219 | 23 | సీమపర్తి | సీమవర్తి |
| 220 | 30 | దామాంక | వామాంక |
| 224 | 15 | నఖిలక్షించు | వఖిలక్షించు |



# బృహత్తటాకము నాగశాస్త్రి

క్రీ॥ శ॥ 1740 ప్రాంతము

"తారకసంహార కిరిగిరి సుఖవిహార సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ"

అను మకుటముగల యీసీసపద్యశతకములో 98 పద్యములున్నవి. అందు 15, 16, 17, 32, 42, 50, 51, 98 పద్యములు బాగుగా శిథిలములైనవి. శతకము పూర్తిగా దొరకనందునఁ గవి యెవఁడో యేర్పడకున్నను పరిషత్కార్యాలయమువారికి దొరికిన ప్రతులలో నొకదానికడపట పైపేరున్నట్లు తెలుపుచు నతఁడే గ్రంథకర్తగా నూహించి పేర్కొన్నారు. కావచ్చును.

'బృహత్తటాక' మను నింటిపేరుగల యాంధ్రబ్రాహ్మణశాఖ దక్షిణదేశములోని తిరునల్వేలి, తంజనగర పరిసరములలో నున్నట్లు తెలియవచ్చుచున్నది. పైఁగా నీశతకములో:— వేలాయుధము, కణనాయి, కూతాడు. స్వామినాథ, వైద్యనాథేశ్వర, మొదలగు (దక్షిణదేశమునఁ బ్రచారములో నుండు) శబ్దములు విశేషముగాఁ గనిపించుచున్నవి. కావున నితఁడు దాక్షిణాత్యాంధ్రుఁడనుటకు సందేహము లేదు.

మఱి మకుటములోని "కిరిగిరి" క్షేత్రమేది? "వరాహగిరి" యగునా? అగుననుకొన్నను నది "బాలసుబ్బరాయఁడు" నెలకొన్న పుణ్యక్షేత్రమా? వరాహగిరి సుబ్రహ్మణ్యక్షేత్రముగ స్థలపురాణము లేవియు లేవు. పైఁగా నాక్షేత్రస్వామి బాలసుబ్బరాయఁడును గాఁడు.

దక్షిణభారతములో సుబ్రహ్మణ్యుని విశేషముగఁ గొలుచువారు ద్రావిడులు. కావుననే యఱవలుండు ప్రదేశమునఁ బ్రతిగ్రామమునను సుబ్రహ్మణ్యాలయములు తఱచుగా నుండును. వారికి కృత్తిక మహాపర్వదినము. మఱి బాలసుబ్రహ్మణ్యుని క్షేత్రమయిన "పళనిమలై" యను పవిత్రస్థల మఱవలకందఱకు వారణాసివంటిది. కనుక ఆ "పళనిమలై" యనునదే "కిరిగిరి" యగునేమో! కిరి యనఁగా వరాహముకదా! దానికి సరియగు తమిళపదము "పన్ఱి"గాని 'పళని' కాదు. మఱి యచ్చోటు తప్ప బాలసుబ్రహ్మణ్యక్షేత్రమని చెప్పఁదగిన మఱియొకచోటెందును లేదు. కవి పేర్కొన్న వైద్యనాథము మొదలయిన పుణ్యక్షేత్రములుగూడ "పళని"కి సమీపమున నున్నవి. కనుక

నెంబు చూచినను నీకవి యీప్రాంతమువాఁడే యని చెప్పుటకుఁ దగిన ప్రస్వనములు కనఁబడుచున్నవి.

ఇంక నీకవి కాలమునుగూర్చి కొంచెము పరామర్శింపవలసి యున్నది. శతకములో, కుల్లాయి, తురా, బందిఖానా, బురఖా మొదలయిన యన్యదేశ్యములు కనఁబడుచున్నవి. పైఁగా క్రీ॥ శ॥ 1724-30 ప్రాంతములలో జీవించియుండి శత్రుసంహారశతకము రచించిన "గోఁగుల పాటికూర్మనాథకవి" పోఁకడ లీసుబ్రహ్మణ్యశతకములో నుండుటవలనఁ దురకల దుండగములు దక్షిణదేశములోఁగూడ విజృంభించి, యక్కడి పుణ్యక్షేత్రములకు వారివలన వినాశనము సంభవించినట్లు తెలియుచున్నది. ఈ 'కిరిగిరి' సుబ్రహ్మణ్యదేవాలయముకూడ నాసమయమునఁ దురుష్కులు ముట్టడించి దోఁచుకొనినట్లున్నది. అందుచేత సుబ్రహ్మణ్యభక్తుఁడయిన యీ కవి యీదేవునిమీఁద నిందాస్తుతిగాఁ జెప్పిన యీక్రిందిపద్యములు గమనింపఁదగినవి :—

"సమయంబునకు లేని జముదాడి యదియేల వేళకుఁ బూనని శూలమేల ?
తఱిచూడకున్న కోదండబాణములేల ? జన్యంబు సేయనిశక్తియేల ?
వీఁకంబులేని మయూరవాహనమేల ? శృంగారమునకు వజ్రాంగియేల ?
దండెత్తలేకున్న దళవాయితనమేల ? రోసంబు లేకున్న మీసమేల ?
కొట్టి, గోడించి మ్లేచ్ఛుల గుట్టఁగూల్చి మట్టుసేయక యుండిన మహిమయేల ?"

"వేసట్ల కుళ్లాయి లేకున్నదా నీకు ? నీపైనయట్టి కిరీటమేల ?
ధర నల్లకంబళి దారము ల్తగలవా రమణీయ రత్నహారంబులేల ?
డంబు కస్బైరయుచోటను గట్టి దొరకదా కరమున సునిశితఖడ్గమేల"

"చటుల సింధురఘటా పటల చలత్కర్ణ వాతాహతైక జీమూతములుగఁ
గింకిణీయుత ధనుష్టంకారనినదంబు రోదసీకుహరంబు భేదిలంగఁ
జెంగావిపావడ చుంగు కాంతిచ్ఛటల్ కటిలారి చిత్రముల్ పెటిలిపడఁగఁ
గహకహమను భూతగణ మహారభసంబు విన్నంతశాత్రవుల్ తన్నికొనఁగఁ
బుడమి యొరయంగ హరిహర పుత్రుఁడొకఁడు చాలఁడా నీచసంతతి న్సంహరింపఁ
బాలుపోలేదె ? సెలవిమ్ము బాహులేయ"

వేంకటాచలమును దోఁచుకొని మ్లేచ్ఛులసైన్యము లప్పటి కాదండయాత్ర క్రీ॥ శ॥ 1725 సం॥తో ముగించుకొనినను, నప్పుడప్పుడు దక్షిణదేశములోఁ జాలక్షేత్రములమీఁదికి దాడివెడలి, యక్కడి యమూల్యవస్తువులను అపహరించి, యాపుణ్యస్థలములను ధ్వంసము చేసినట్లు తెలియుచున్నది. కాని యట్టిదోపిళ్ల వివరములు చరిత్రల

కెక్కలేదు. ఉత్తరహిందూస్థానములో సోమనాథదేవాలయమునకు గజనీమహమ్మదువలన సంభవించినదుర్దశ, యక్కడ తురకఫౌజులు చేసిన యత్యాచారములు మాత్రమే కొంతకుఁగొంత మనకుఁ జరిత్ర తెలియఁజేయుచున్నవి. తక్కిన చిన్నచిన్న క్షేత్రముల దురవస్థలనుగూర్చి యిట్టి శతకములవలన నే మనము సూచనప్రాయముగానైనఁ దెలిసికొనఁ గలుగుచున్నాము. ఇట్టివి సారస్వతములోఁ జారిత్రిక శతకములుగాఁ బరిగణింపఁదగినవి.

ఉత్తరసర్కారులలో దేవాలయములమీఁదికి దండయాత్రలు మొదలుపెట్టిన తురకసైన్యము, సింహాచలము, దాక్షారామము, కాళహస్తి, తిరుపతి, శ్రీరంగము మొదలైనపుణ్యక్షేత్రములను కొల్లగొట్టినవి, ఆసందర్భమునఁ బుట్టిన శతకములే, సింహాద్రినారసింహశతకము, శత్రుసంహారశతకము, రంగధామశతకము, కస్తూరిరంగశతకము. ఈ (కిరిగిరి) బాలసుబ్రహ్మణ్యశతకము.

'కిరిగిరి'కి మహమ్మదీయ సైన్యములు దండెత్తునప్పటికి శత్రుసంహారశతకముపుట్టి 15 సంవత్సరములైన నయియుండును. అనఁగా దాదాఁపు క్రీ॥ శ॥ 1740 ప్రాంతమున నని యూహింపవచ్చును. ఆపక్షమున నాగశాస్త్రి, కే 35–40 ఏండ్లనడిమిప్రాయముగా నైన నుండుననుట సమంజసము. కనుక నతనికాలము నిస్సందేహముగా క్రీ॥ శ॥ 1740–60 ప్రాంతమని చెప్పదగును.

నిందాస్తుతిం దెలుపు మఱికొన్ని పద్యము లీశతకమునుండి, ఈ దిగువ నుదాహరింతును :—

"నీతల్లి చట్టాతి కూఁతురై దయలేక మగనిదేహంబును సగముచేసె,
నీతండ్రి యేపాటి నీతిజ్ఞుఁడనవచ్చు ? పట్టణంబులు గాల్చి ప్రబలినాఁడు,
నీయన్న యెంతటి నిర్మలుండని చెప్ప ? ఘనకాంక్షఁ ద్రోవలు గాచినాఁడు,
నీమేనమామ, యేనిజమువాఁడని పల్క ? కొంచెమై కపుల యాచించినాఁడు,
వారివలెఁగాక, నీవైన వసుధలోన, నాశ్రయించిన భక్తుల నాదరించి,
మంచివాఁడని పేరు కల్పించుకొమ్ము"

"సురరాజు మెచ్చి కూఁతురి నిచ్చె నంచును గర్వభూయిష్ఠంబుఁ గాంచినావొ,
...శిగొట్టి చెలిఁదెచ్చినానని గర్వభూయిష్ఠంబు గాంచినావొ ?,
క్రౌంచపర్వతము భేదించినానని మించి గర్వభూయిష్ఠంబు గాంచినావొ?,
అహిపతిశాయి మేనల్లుఁడైతి నటంచు గర్వభూయిష్ఠంబుఁ గాంచినావొ ?,
బాలుఁడైతేని..................కృపను జూచిన నీదు సొమ్మేమిపోవు ?"

ఈ సతి శిరంబునఁ దాల్చి సభలోన నటియించు నిక్కమౌ శివయ్య నీ సఖుండు!
భద్రకాళితోనాఁ బ్రబలి రుద్రునిచేతఁ గష్టించి నిన్ను దుర్గాత్ముఁ డంద!
చేసెడిపనులెల్లఁ జెఱచి వేసెడు పెన్మహాదరుసనము నూర్మి పొందుచుండ!
ధర్మభంగము చేసి, ధరఁ బుణ్యజనులను హరియించినతని మేనల్లుఁడవు!
ప్రజలు పలికెడి దుష్కీర్తి పాయు నెట్లు? లోభమును ద్రోచి బహుమానములు
నగుచు మంచివాఁడని పేరు కల్పించుకొమ్ము”

“చకచకమనిపించు సంకొక్క చేతను, మొనసిపట్టిన కోల మొక్క చేత,
సానఁదీఱిన మంచి శక్తొక్క చేతను, నుక్కైన తోమర మొక్క చేత,
దంబైన బలుముద్గరం బొక్క చేతను, నురు భిండిపాలంబు నొక్క చేతఁ,
దపనీయ రత్నకోదండంబు నొక చేత, నొరపైన బాణంబు లొక్క చేత
నొకటఁ బాశంబు నంకుశం బొక్క చేత నభయవరముద్రలగు చేతు లమరియుండ
ప్రబలశౌర్యము మదిలోనఁ బట్టలేదా?”

ఈ శతకరచనకాలమునకు ఈకవికి దృష్టినిరోధమున్నట్లు క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది:—

“కనులకు శుభమిచ్చి, కరుణింపు సద్భక్తపాలనపరతంత్ర, బాహులేయ!,
నేత్రోత్సవంబిచ్చి నిత్యంబు రక్షించు పంచభూతాత్మక, బాహులేయ,
యాత్మ జానందంబు నీక్షణంబున నిమ్ము బ్రహ్మాదివందిత, బాహులేయ,
నయనంబులకు దర్శనంబిచ్చి రక్షింపు ప్రణవస్వరూపక బాహులేయ!
సకలలోకేశ, నీపాద సరసిజముల నమ్మియున్నాఁడ దేవసేనామనోజ్ఞ”

“శాత్రవపటలంబు సంహరించినమేటి నేత్రపటలముద్ప నేర్పు లేదో,
వైద్యనాథేశ్వర వరకుమారుఁడ వయ్యు నేత్రరోగముఁ దీర్ప మాత్ర లేదో,
రోహిణీనాథ శిరోమణివై పేత రోహిణి యరు, దాక్షి? రూపుఁదీర్ప;
మహితజగచ్చక్షు మంజులాక్షుఁడవయ్యు చక్షుసౌఖ్యంబీయ శక్తి లేదో?
యేల యెంచెద వారోగ్య వీక్షణంబు నిచ్చి పాలించు లోకంబు మెచ్చునట్లు”

రాజులకుఁ గారాని కార్యము లీక్రిందిపద్యములోనివి:—

“బ్రాహ్మణద్వేషంబుఁ బాటింపఁగారాదు, ధర్మంబులకు హాని తలఁపరాదు,
ధరఁ గృతఘ్నులఁ దనదటిఁ జేర్పఁగారాదు, దాయాదులను గొట్టి తఱుమరాదు,
తనసీమ పలుమాఱు కనక యుండఁగరాదు, జారమార్గంబులు గోరరాదు,
పాషండవర్గంబు ప్రబలఁజేయఁగరాదు, క్షుద్రమంత్రంబులఁ జూడరాదు,
ఇటులు నడిచిన నొక వేళ హీనుఁడగును బుణ్యశీలుండు మహితరాజన్యుఁ డరయ”

ఈదిగువ పద్యములోనివి మంత్రికుండదగిన లక్షణములు:—

“నిర్మలాచారుఁడై, నీతిశాస్త్రజ్ఞుఁడై, ద్విజకులశ్రేష్ఠుఁడై, ధీరుఁడగుచు,
గంభీరహృదయుఁడై ఘటనాసమర్థుఁడై, మితభాషియై బహుశ్రుతుఁడు నగుచు,
సత్యవాచాలుఁడై, జనరంజకుఁడునై లౌకికమతి, జాగరూకుఁడగుచుఁ

భాషింపకుండున్నై, పాపిష్ఠుఁడైనట్టి కాలదేశవిభాగ కారి యగువాని
తెలుఁగు పురుషుని మంత్రిగాఁ జేయవలయు”

సామాన్య నీతిబోధనమున క్రింది పద్యాంశము లుదాహరణములు :—

“సామర్థ్యములేని ధనరాసు లవియేల? భోగింపఁగారాని పొలఁతియేల?
[illegible] గావని నరపతి బ్రదుకేల? సత్యంబు మాలిన సఖ్యమేల?
వేదహీనుండైన విప్రజన్మంబేల? తనయులఁ బ్రోవని తల్లి యేల?
ఆప్తులుగానట్టి యన్నదమ్ములు నేల? దయతోడఁ బ్రోవని దైవమేల?
[illegible]ములు పరికించి యిన్నియు వృథయటంచు నిన్నుఁ గొలిచినవారెల్ల ధన్యు (?)లండ్రు”

మఱికొన్ని మెఱుఁగులవంటి పద్యములు. కవితాప్రౌఢిమను [illegible] భావబాహుళ్యమును ప్రకటించు ఈశతకపద్యము లెన్ని యుదహరించినను, దనివి తీరకున్నది :—

“ప్రోషించుకలేక పందికై పోరాడె, నరువింటిదెబ్బఁ దిన్నాఁడు తండ్రి,
మంచితఁ జూడక పేడికడ నుండు నష్టాలమేఁపుచుఁ దిరిగెను మేనమామ,
[illegible] లేక నెట్టనఁ దనపల్లు తొలి విఱుచుకొన్నాఁడు తోడఁబుట్టు,
లోకవిఖ్యాతియై చేకొన్నయది మహామాతంగి యనుపేరు మాతృదేవి,
యిటుల లాంఛనసేయక ఘనసుఖంబు పొందు దేవర, మమ్మేమి ప్రోతువిపుడు”

“కాసుకాసుకు వడ్డి కాంచనం బార్జించి, కొండపై నెక్కె నీకూర్మిమామ,
పిచ్చిమెత్తిరూక బేరమాడుటకునై ధనపతిఁ జేరె నీయనుఁగుఁదండ్రి,
రాజ్యాభిలాషచే రజతశైలముఁ బాసి పుట్టినింటఁ బాయఁ బోదు తల్లి,
తోఁచఁ జూచుచుండు నేవేళఁ బయలచే మోదకాసక్తిచే సోదరుండు,
ఇట్టిదేవతలే వేసమెత్తిరనిన, నీమతంబేమొ తెలుపుము సోమతనయ”

“భూతనాథుఁడగుచుఁ బొరుగింటిలోపల నవనిధుల్ పూడ్చినాఁడు తండ్రి,
సామ్రాజ్యమేలును సంపాద్యధనములు తామరకొలనిలోఁ దాఁచెఁ దల్లి,
కిణవాయికోటలు గట్టి నిక్షేపంబు నణఁచుకొన్నాఁడు నీయనుజవరుఁడు,
పంచాస్త్రి [illegible]సంస్థానముల్ తెగఁ గొల్లపెట్టి సంపద హెచ్చు పడసినావు,
ఇంతియునుగల్గి భక్తుల కిచ్చుటకును, సంకటంబేమి? దేవతాసార్వభౌమ”

“కన్నతండ్రికిఁ జేతఁ గప్పెర యిచ్చి, బల్ బోగియై తిరుగంగఁ జూచినావు,
ఒక్కతల్లిని నింట నుండనీయక యేటిత్రోవ సంద్రమ్మునఁ ద్రోసినావు,
ఇంకొక్కతల్లిని నిలలోన దయ్యాలఁ ద్రోలి బ్రదుకుమంచుఁ ద్రోసినావు,
తోడఁబుట్టినవానిఁ ద్రోవలో నిల్పితివింతె కాని, ప్రతిష్ఠ యింతలేదు,
యేటిప్రాభవమో యయ్యా! యేమియోగ మేమిదొరతన మింతైన నెగ్గులేదె”

ఆస్తికబుద్ధి లేనిజనుల కీక్రిందిపద్య మవశ్యపఠనీయము :—

"హరిహరాదులపూజ లనువుగాఁ జేయక, యారగించెడువాఁడె యూరపంది
నిత్యసద్భక్తి నాదిత్యనమస్కృతుల్ కోరి చేయనివాఁడె గ్రుడ్డిగూబ
దేవోత్సవంబును దీర్ఘయాత్రాదులుఁ గాంక్ష సేయనివాఁడె గర్దభంబు,
అతిథిభక్తిఁ గలకొద్ది యతిథి కన్నంబిడక, మెరసియుండెడువాఁడె ధాఁటి బాచి
నీదుపదములు మదిలోన నిలుపలేక వసుధ వర్తించువాఁడె జీవన్మృతుండు"

ఇఁకఁ గొన్ని శబ్దాలంకారముల కుదాహరణములు :—

"శక్తిఘంటాఘోషచలితాఖిలాజాండ, భానుకోపాంతకబాహుదండ,
ధృతఖడ్గశూలాదిదీప్తోరుకోదండ, మహితౌర్వకీలాసమానకాండ,
అతిదేహకాంతి ధిక్కృతచండమార్తాండ శూరపద్మాదిసంహారకుండ,
వీరరౌద్రరసాదివిస్ఫురితోద్దండ, ఘనరత్నకుండలకలితగండ,
ఖండపరశుతనూజ లేఖాద్యఖండ మానసోల్లాస నిన్ను నెమ్మదిని గొల్తు"

"చిన్మయాకార, యాశ్రితభక్తమందార, గురురూపజితశతకోటిమార,
మునిచిత్తసంచార, యనుపమితోదార మహనీయనిలయకుమారధార,
క్రౌంచగోత్రవిదార, కాద్రవేయకహార, ధరణీసురాధార, ధర్మసార,
సర్వలోకవిహార, చంద్రమౌళికుమార, యమితశృంగార, విశ్వావతార,
భూరికరుణామహోదార ! వైరివీరశూరసంహార ! నన్ బ్రోవు, శుభవిచార"

సుబ్రహ్మణ్యుఁడు స్వార్థపరుఁడఁట !—

"దేశాంతరములు ప్రవేశించి, సుందరీమణులఁ దేలేదె నీమనసు పొంగ,
పన్నగంబులఁబట్టి బహువర్తకులచేత ధనములార్జింపవే దానములకు ?
దళవాయివై తండ్రిదారిద్ర్యమడఁచి బంగరుకొండ విలుచేసి మెఱయలేదె ?
దేవుఁడంచును బలుదిక్కులు వెలిఁగించి, నిత్యోత్సవంబుచే నెగడలేదె ?
సొంతకార్యంబులందుఁ గొఱంతలేక చూచురీతిని భక్తులఁ జూడరాదె ?"

క్రింది సామాన్యసంఘనీతి ప్రతిపాదకపద్యముతో — ఈశతక పరామర్శ చాలించుచున్నాఁడ :—

"తల్లిదండ్రులఁ బ్రోచు తనయుండె తనయుండు భక్తిఁగల్గినవాఁడె భాగవతుఁడు
గుణశీలవతి యదె కులమున కిల్లాలు, సత్యంబుగలవాఁడె సజ్జనుండు,
కామాదులడఁచిన ఘనుఁ డిల జయశాలి యన్నమిచ్చినవాఁడె యనుఁగుఁదండ్రి
వర్ణాశ్రమముఁ బ్రోచువాఁడె ధాత్రీశుండు హింససేయనివాఁడె యీశ్వరుండు
భక్తియుక్తుల నీపాదపద్మములను భజన చేసెడివాఁడె సంపాద్యపరుఁడు"

# కర్ణాట తేరపకవి

క్రీ॥ శ॥ 1750 ప్రాంతము.

ఇతని తేరపావన శతకము పరిషత్కార్యాలయ ప్రథమశతక సముచ్చయమునఁ బ్రకటింపఁబడినది. ఇందు నూటయొక్క సీసపద్యము లున్నవి. కడపటిపద్యము కవి తనవిషయమునుగూర్చి చెప్పుకొనినది. ఆపద్యమిది :—

"అని యెల్ల సర్వలోకాధీశ్వరుని పేర వితతాగమాంత సన్నుతుని పేర
సుకృతి కర్ణాటవరవంశ సంభవుండైన యుశక్కి యాచనేడు వాని
తమ్ముఁడ కామాక్షితాయి పెంచినవాఁడఁ జీవవిప్రప్రసాద సంసేవనాప
యాతకల్మషుండఁ దేరాభిధానుఁడ నన్ను రక్షింపుమనుచు శ్రీరామమూర్తి
కంకితంబుగ శతకమియ్యదఁజెప్పి యొప్పగించితి గైకొమ్ము......
అనఘకర్ణాట తేరపావనవరేంద్ర రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర!!"

శతకములోని రెండవ పద్యములోనను నీకవినిగూర్చి కొంత తెలియఁగ కనఁబడుచున్నది:—

"శ్రీరామపదపద్మసారసంగ్రహ మత్త మధుపాయమాన సన్మానసుఁడను
శ్రీరామనామ విశేషలేఖన నర్తకాయిమాన కరాంగుళాంచితుఁడను,
అమల కర్ణాట తేరప యనువాఁడను నాంచారమాంబికానందనుఁడను"

మొదటిపద్యమువలన నీకవి కర్ణాటవంశసంభవుడనియు, 'సుశక్కి' యను వాని తమ్ముఁడనియు, కామాక్షితాయిచేఁ బెంపఁబడినవాఁడనియుఁ దెలియుచున్నది. ఇఁక రెండవపద్యమువలన నాంచారమ్మ గర్భమునఁ బుట్టినవాఁడని యెఱుకపడుచున్నది.

పయియంశములను బరిశీలించిచూడ నితఁడు వైష్ణవ సాంప్రదాయముగల తురీయవర్ణములోని యేతెగకైనను జెందినవాఁడుగాఁ దోఁచుచున్నాఁడు. ఇతఁడీశతకములోఁ దనతండ్రి యెవఁడో పేర్కొనలేదు. సరికదా! తల్లి నిగూడఁ బసితనమున నే పోఁగొట్టుకొనినవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. అనఁగా నెడబిడ్డగానున్నప్పుడే యామెమ గతించి నట్లూహింపవలసియున్నది. అట్టి సమయమున దిక్కులేని యితనిని "కామాక్షితాయి" యను పొరగింటియామెయో, యిరుగింటియామెయో దగ్గఱతీసి సాఁకినదని చెప్పుకొనినాఁడు. ద్రావిడకర్ణాటకములలో "తాయి" యన తల్లికదా! కనుక నాసాఁకినయామెను తల్లిగను

నాకేం కంతకుమునుపే యూరకుండెను, లేకకుంటె పెద్దవాడయిన కొడుకు "ఉళక్కి" యను నతనిని తనయన్నగను భావించుచు వాని చెప్పుచేతలలో మెలఁగుచు పెరిగియుండును. అయిన నితనితండ్రిని తెలి యకపోవుటకుఁ గారణము సందిగ్ధముగానున్నది. ఒకవేళ నితనితండ్రి తనభార్య గర్భముతోనుండగనే మరణించుటవలన నాంచారమ్మ పుట్టి పోసికొను మార్గము తోఁచక సమీపగ్రామములోని భాగ్యవంతురాలైన కామాక్షి పంచఁజేరి కాలముగడుపుచుఁ, బుత్రుని కని దివంగతురాలు కాఁగా నా కామాక్షి తాయి, చిఱుకూనయయిన యీ తేరపను సాఁకి సంతరించియుండవచ్చును. ఆమెకును బిడ్డలనిన నెక్కువ మక్కువయున్నట్లు ఆమె కిదివఱకున్న పుత్రుని పేరువలననే గ్రహింపవచ్చును. లేక లేక కలిగినకొడుకు కనుకనే యతనికి 'ఉళక్కి' యను పేరుపెట్టియుండవచ్చును. ఇప్పటికిని మన తెలుగుదేశమున లేకలేకపుట్టు కుమారులకు (పెంటలోఁబొర్లించి) పెంటయ్యయనియు, (దిబ్బలోఁబొర్లించి) దిబ్బయ్యయనియు, (కుప్పలోఁబొర్లించి) కుప్పయ్యయనియుఁ బేర్లుపెట్టుట యందఱిలో నానువాయితిగా వచ్చుచున్నయాచారమే. అలాగే "ఉళ్ళక్కి" యనఁగా నుత్తది, వట్టిది యనియర్థము. కామాక్షి తాయి కదివఱకువచ్చిన కానుపులన్నియు 'నుళక్కి' యగుచుండగాఁ గడపట దక్కినబిడ్డకు "ఉళ్ళక్కి" యని నామకరణము చేయుటలో విడ్డూర మేమియులేదు.

తాను కసుగందుగా నున్నప్పుడే తల్లిపోవుటచేతఁ దండ్రియెవఁడో తెలిసియుండదు. నాంచారమ్మ కామాక్షికి తన భర్తృనామమునుగూర్చి చెప్పవలసిన యవసర మేర్పడియుండదు. ఏర్పడినను నప్పటి మనసాధ్వీలు పతులపేరులుచ్చరించుటకు జంకు—బిడియము పొందువారు. ఆయీ కారణములను బట్టి తేరప తనజనకుని పేర్కొనుట కవకాశముండియుండదు. లేకున్న సాఁకినతల్లిని ఆమెకుమారుని తనశతకములో సూచించి, తల్లినిపొగడి తండ్రినిమాత్ర ముగ్గడింపక విడుచునా?

'ఉళక్కి' యనునతనిని, గన్నతల్లిని పేర్కొన్న రెండవపద్యములోఁగాక, కామాక్షి తాయినిగూర్చి చెప్పిన కడపటిపద్యములో సూచించుటవలనను, నతఁడు తన్నుఁదమ్మునివలెనే యాదరించినందు వలనను నతఁడు తేరపకంటె 10–15 ఏండ్లు పెద్దవాఁడనియు సొంత యన్నకాక, కామాక్షి కుమారుఁడేయనియు స్పష్టమగుచున్నది.

కర్ణాటవంశమని చెప్పుకొనుటచేత నీకవి 'కన్నడిగ' — యని తోఁచుచున్నది. తేరప, తాయి, ఇట్టివి దానిని బలపఱచుచున్నవి. ఇంతకును "తేర" శబ్దమున కర్థమేమో తెలియుటలేదు. మకుటములో "తేరపావనన రేంద్ర రమ్యగుణసాంద్ర దశరథరామచంద్ర" యనుట వలనఁ దన్నుఁ బవిత్రుని జేయు శ్రీరామచంద్రుఁడని కవియభిప్రాయ ముగాఁ దోఁచుచున్నది. ఆపక్షమున నీకవి శ్రీరామభక్తుఁడని నిశ్చయ మగుచున్నది, పైఁగా నీశతకమంతయు శ్రీరామప్రభావమును దెలుపు పద్యములతో నిండియున్నది.

శతకములో నెక్కడను కవికాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు కనిపించుటలేదు. అయినను బూర్వకవీంద్రులపోకడల న్నియు నిందుఁ జాలవఱకుఁ గనఁబడుచున్నవి. శబ్దాలంకారములతో, జటిల సాంస్కృతిక సమాసములతోఁ, బ్రాచీనసంప్రదాయములైన వర్ణనలతోఁ బద్యములు గుప్పించుటలో నీకవి యఖండుఁడుగాఁ గనఁబడు చున్నాఁడు. పైఁగాఁ గవితలోఁ బ్రవీణులనిపించుకొనిన యాకాలపు బ్రాహ్మణవర్గము, తన కవిత నీసడింతురేమో యను భయముచేతను, కవిస్తుతిలోఁ గొందఱిని వదలి కొందఱినిమాత్రము పొగడిన వారిమన స్సునకు కష్టము కలుగవచ్చునను జంకుచేతను, వ్యాసవాల్మీకులను మాత్రమే పేర్కొని, మిగిలినవారియూసే యెత్తకమానినాఁడు. "బ్రాహ్మణాశీర్వాదపాత్రభూతుఁడ" ననియు, "చిరవిప్రపాదసంసేవనాపమూత కల్మషుఁడ" ననియుఁ జెప్పుకొని బ్రాహ్మణకవులనేకాక, యావర్ణస్థులనే సంతృప్తిపఱచినాఁడు.

ఇది యొకవిధముగా కవులలో నియోగివైదికభేదములు, బ్రాహ్మణాబ్రాహ్మణపక్షపాతములు తలెత్తి విజృంభించుచుండిన కాలములోఁ బుట్టిన శతకమయి యుండవచ్చుననుకొనినఁ, దప్పక 18 వ శతాబ్దము మధ్య ఈకవి యుండియుండవలెను. అగుచో 1750 ప్రాంతమగును.

భక్తిరసానువిద్ధమయిన యీశతకము మిక్కిలిప్రౌఢమయి మనోహరశైలితో జాలువాఱుచుండును.

ఈశతకమునగూడ 16 వ పద్యమునుండి 25 వ పద్యమువఱకు దశావతారవర్ణనలున్నవి. 30 వ పద్యమునుండి 35 వ పద్యమువఱకు శ్రీరామచరిత్ర సంగ్రహముగాఁ దెలుపఁబడినది.

ఇతఁడు ఖేచరీముఖముద్రలఁ దాల్చినవారిని క్షుద్రదేవతల నారా ధించువారిని విమర్శించినాఁడు.

"మేఘమునుండి భూమికి జారు వర్షధారలరీతి జడలు భూస్థలిని వ్రాలఁ
బాదాగ్రమున నిల్చి, పవనునిరోధించి యుపవాసముల మేను నొలగజేసి
ఖేచరీప్రముఖార్య సూచితముద్రలు చూచుచుఁ దమలోనఁ జోద్యమందు
చుందురింతయు కాక ముందెందుఁ జెడకుండు త్రోవఁ జూడఁగలేరు"—

"పుడమి ప్రచ్ఛన్న రాత్రు లందుఁగనిశక్తితో మంత్రములుచ్చరించు యంత్రములను,
శవములమీఁద శ్మశానములోనుండి యాసతోఁ బలులిచ్చి ఫలానిచేసి,
గాసిఁబొందిన నొక గ్రుడ్డిగవ్వయైన దొరకదాయె మరేమి సేకరణలేక"

భాగవతములోని "కమలాక్షు నర్చించు కరములుకరములు" — అను పద్యమునకు ఛాయ :—

"ఉదయంబునను లేచి ముదముతో నీనామధేయముఁ బఠియించు దినమువినను,
పరిశుద్ధుఁడయిపోయి, భక్తితో నీరూపుచూచి సంతోషించుచూపుచూపు;
అనువేళలందు నీయాలయంబులుచుట్టి బడిబడివచ్చు నయ్యడుగులడుగు
లవనిసోఁకఁగ నీపదాంబుజంబుల మ్రోల దండంబు వెట్టిన తనువుతనువు"

"కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే? పవనకుంభితచర్మభస్త్రి గాక"

అనుపద్యమునకు అనుకరణము :—

"శ్రీరామనామంబు కోరి పఠింపని నోరుగా దది సైద్ధఘోరగాని,
శ్రీరామనామంబు కోరిలిఖింపని కరముగా దది ఘోరశరముగాని
శ్రీరామనామంబు కోరియాలింపని చెవులుగా వవి కొండగవులుగాని
శ్రీరామపదములు చేరిమ్రొక్కని మేను మేనుగా దది యొండుమ్రానుగాని,
రామమూర్తిని బూజింపరాని వాని పుట్టుగా దది చీమలపుట్టగాని"

ప్రకృతిమాయావాగుర దవులొన్న మానవుని స్థితినిగూర్చి రూపకోత్ప్రేక్షలో నీకవి 41 వ పద్యమునుండి 50 వ పద్యమువఱకు వర్ణించిన ఘట్టము రసవత్తరముగా నున్నది. జిజ్ఞాసువులకు సులభ గ్రాహ్యముగా నున్నది. సంగ్రహముగా దాని నిట గద్యరూపమున నుటంకించుచున్నాను :—

"శుద్ధస్ఫటికమణివంటి ఆత్మని మాయ క్రమ్మి వికారము పుట్టింప, ఆమెతో అతడు (ఆత్మ డు) తన్మయుడై కలయిక కలవాడై మనస్సనుకొడుకును గాంచును. అతడు తండ్రివలె విజృంభించి, అంత టను వ్యాపించి, నవద్వారపురములన్నియు గట్టికొని, ప్రవృత్తి, నివృత్తి యను సతులను జెట్టవట్టి సుఖించుచుండును. మొదటిభార్యకు

మోహకామాదిపుత్రులును, శాంతసతికి వివేకముఖ్యులయిన కొడుకులును గలుగుదురు. అందు ప్రవృత్తిసంతానము ప్రపంచమెల్ల వ్యాపించి యన్ని దేశము లాక్రమింప, నిలువనీడ లేని నివృత్తితనయులు—క్రోధోద్రిక్తులయి, వారితో పోరాడి కొన్నిపురములు వారిబారినుండి విడిపింతురు. దానికి నైపక కామాదులు సైన్యసమేతులై, సవతితమ్ములను తరుమగొట్టి తామే మరల లోకమెల్ల స్వాధీనమొనర్చుకొందురు.

అందు, కాముడను ప్రవృత్తితనయుడు రతిని పెండ్లాడి, పూవుటంపలతో జగతికి బాధ కలిగించును. క్రోధుడు హింసాసతీద్వితీయుడై—ప్రజకు బరస్పరవైరములు కల్పించి పోరాడునట్లు చేయును. లోభుడు తృష్ణాంగనం జేపట్టి పరద్రవ్యాపహరణబుద్ధి జనులలో చెలరేపును, మోహుడు భ్రాంతివనితాప్రియుడై యన్నిటిమీద పంచజనులకు వాంఛ గలిగించును."

ఈమాయామహిమనుగూర్చి యిక నాలుగుపద్యములున్నవి. కాని యవి యసంపూర్ణములైనందున యందలివిషయములుకూడ దెలుపుటకు వీలు లేకపోయినది.

ఇక నితని కవితావైచిత్రి సూచించుపద్యములను కొన్నిటిని చూపుటతో ముగింతును :—

1. "శివధర్మవర్ధన శీలుండవగు నీవు శివధర్మవర్ధన శీలుడగుట,
పుణ్యజనావన స్ఫురణుడైతగు నీవు పుణ్యజనావన స్ఫురణుడగుట
అనవరకరుడుగా నలరుచుండెడు నీవు నరవరకరుడవై యలరుచుంట
సంతతాశ్రిత విభీషణతో గాంచనినీవు సంతతాశ్రిత విభీషణతో గాంచు
టద్భుతంబయి కనుపట్టె నార నేడు"

2. జ్యాకర్షణోద్యద్భుజాప్తి గల్గిననీకు జ్యాకర్షణోద్యద్భుజాప్తి తగదె,
సంతతామోద కుజాప్తి కల్గిననీకు సంతతామోద కుజాప్తి తగదె,
మేఘనాదప్రాప్తి మెచ్చుచుండెడినీకు మేఘనాదప్రాప్తి మెచ్చదగదె,
సంతతాహీన ప్రసక్తత దగునీకు సంతతాహీన ప్రసక్తి దగదె,
జగతి దలపోయ నరిసర్వ జనములెన్న వెలసితివి, బళి, సత్క్రియా కలితవిభవ"

3. ఘననీలముల నేలగలతీగ గలమేని డాలువా డరుల బోద్రోలువాడు
బలువెక్కసపు రక్కసుల జెక్క గలవాలు గలుగువా డవనిపై వెలుగువాడు
చెలిగోరి నలిమీతీ వెలిబాతి మల జేరి పోవువా డమరుల బ్రోవువాడు
తనుగప్పు కొన నొప్పుగను గొప్పబంగరు వలువవా డుడివోని చెలువువాడు
వీర శృంగార రసములాకారమూని నటుల నుండెడివాడు నన్నరయుగాత"

సీ. హరికుమారునిఁబట్టి హరికుమారునిఁగొట్టి హరికుమారుని వని కాల్చినాఁడ
ఖరకరాన్వయుఁడవై ఖరకరేంద్రుని ఖర సఖరాయుధునిఁగూల్చి నేర్చినాఁడ
కమలాప్తుఁడై పూని కమలాప్తుపై వహ్ని కమలా ప్తకోటముల గట్టినాఁడ.
శేషుఁడవయ్యు నశేషలోకంబులు శేషుని తలలపైఁ జేర్చినాఁడ.
ఏమి చెప్పుదు నీమహాహీనచర్య (లు)"

వ. అంభోధిమథన దివ్యాస్త్ర నిర్జిత నిర్జరారాతిచయ విజయాఖిలాశ,
దానతర్పిత విప్రతతి సమర్పిత మహాశీర్వాదలబ్ధ విశేషవిభవ,
భవసమర్చిత పాద భవవారివహ పాతితాఘ కన్యాత్మజమహనీయభావ,
భావజాభాంగ సంభావనీయచరిత్ర మిత్రవంశాంభోజ మిత్రరూప
నేత్రసౌందర్య జితపద్మ గాత్రకళత్ర, కనకమయ నేత్ర కరధృత కార్ముకాస్త్ర !"

శబ్దాలంకారాలకు ఇవి చాలును :—

సీ. "దశరథ మూలకందప్రసూతంబునై కైకయీసుతకాండ కలితమగుచు,
సౌమిత్రి విస్తృత శాఖాయుతంబునై భూరివానర పత్ర పూర్ణమగుచు
వాల్మీకిముని కావ్యవారివర్ధితమునై రావణానుజసుమభ్రాజియగుచు
సీతాతినూలతాశ్రితమునై పవమాన తనయఫలాఢ్యమై ధరణి వెలయు
రామకల్పద్రుమంబు నేఁగాము మరయఁ జేరి కొలిచెద సర్వార్థసిద్ధికొఱకు"

పూర్వ (మధ్య) కవులధోరణి ననుసరించిన (యశఃప్రాశస్త్యమును వెలుపు) యీక్రిందిపద్యములందలి సొంపయిన వర్ణనలుచూడుఁడు :—

"కరువలిమేఁత మైపఱపుపైఁ బవళించి వెల్లటేనుఁగు వెనువీఁపునెక్కి
కూన క్రొన్నెలతాల్పుగూడి నేస్తముచేసి నలువపడంతితోఁ బలుకులాడి,
గుజ్జువేలుపుతండ్రి కొండతోఁ జెండాడి దండెతాళముఁ బూను తపసిఁ డాసి,
యీఁగిమ్రానును బండు లిగిలింపఁగాఁజేసి వేల్పుగిడ్డిని బాలవెల్లిఁ ద్రోసి.
మించె నౌరౌర, నీకీర్తి చంచలాక్షి యంచితప్రౌఢి జగములఁ దఖినుతింప"

"పరిపూర్ణచంద్రబింబము మెట్టి కందిచ్చి హొంగారుగంగను భంగపఱచి
బలవైరిగజము చెంపలు చళీమని కొట్టి పల్కుబోటిని వలవట్టి యీడ్చి
పనిబూని వేల్పుగిడ్డిని బూరి గఱపించి ప్రల్లదంబున హరి రొమ్ముతన్ని
బుడుతక్రొన్నెలతాల్పు మెడఁ బట్టుకొనినెట్టి పాఁపతేని తలట్టై పట్టిచుట్టి
జట్టుపడెఁగద నీకీర్తి గట్టువాయి మట్టు మేర యెఱుంగ కెప్పట్టుదిరిగి"

పూర్వము భట్టులు రాజులయశము నిట్లే పొగడువారు. కనుక నిందులో నతిశయ మేమియు లేకున్నను బద్యములు రసవంతములుగా నున్నవి.

---

# శేషప్పకవి

## ౮

క్రీ॥ శ॥ 1760—1840

శతకకవుల చరిత్రములో నీ శేషప్ప వ్రాసిన నరసింహశతకమును గూర్చి మాత్రమే తెలుపఁబడినది. అప్పటికి నృకేసరిశతకము వెలువడ లేదేమో? శ్రీవావిళ్ల వారి భక్తిశతక (8 వ) సంపుటమున నృకేసరిశతకమున్నది. దీనిని శ్రీశేషాద్రిరమణకవులు సంపాదించిరి. ఇది క్రీ॥ శ॥ 1926 సం॥రములోఁ బ్రచురింపఁబడినది.

నృకేసరిశతకమున కంత ప్రసిద్ధిలేదు. కాని నరసింహశతకము మాత్ర మాంధ్రదేశములోఁ జిరకాలముగా మంచిప్రచారమున్నది. శిశువులలోని పిల్లలే కాక, భక్తులైన ముసలులుఁగూడ నిందులోని పద్యములను గంఠస్థములు చేసికొని, విరామకాలములలో చెప్పుకొనువారు. లక్షణవిరుద్ధములుగ నుండినను, వాడుకమాటలతో నిండారి, తేలికగా నర్థమయి, సులభముగా మనస్సునకెక్కు ధారతో పద్యములు నడచుటచేత నాబాలగోపాలము నేర్చుకొనుట కనుకూలముగా నున్నవి. ఆకారణముచేతనే కవి యంతప్రసిద్ధుఁడు కాకున్నను, శతకమునుబట్టి వాఙ్మయరంగములో స్థిరమైనచోటు సంపాదించుకొనినాఁడు.

తన్నుఁగూర్చి యీశతకకవి :—

"నే చతురత్వమే మెఱుఁగ నీకృపవల్లఁ గవీశ్వరాఢ్యులై
తోఁచిన పద్యముల్ ముదముతో రచియించితి, తప్పులున్న, నీ
వే చెలువారఁజేసి, వెతఁబెట్టక కోర్కెలనెల్లఁ దీర్చి శే
షాచలదాసు నేలు మునిసన్నుత ధర్మపురీ నృకేసరీ"

"శేషప్ప యనుకవి చెప్పినపద్యముల్ చెవులకానందమై చెలఁగుచుండు"

అని క్రమముగా నృకేసరి, నరసింహశతకములలోఁ జెప్పుకొనినాఁడు. పేరులో మార్పు కనఁబడుచున్నది. శేషాచలదాసే శేషప్ప యగునా? శేషాద్రిరమణకవు లీరెండుపేర్ల కభేదమును జెప్పినారు. ఒకవేళ రెండుశతకములలోని పద్యశైలి సాదృశ్యమునుబట్టి వారట్లు చెప్పియుండవచ్చును.

ఈ శేషప్పకవి యెక్కడను తనకులమునుగూర్చికూడ సూచింపలేదు కాని "శేషాచలదాసు నేలు మునిసన్నుత" అని నృకేసరిశతక

ములోఁ జెప్పుటచేత నాల్గవవర్ణమునకు జెందినవాఁడేమో యని యూహింపవలసియున్నది. భక్తులైనవారు దాసశబ్దము నుపయోగించుకొనుట పరిపాటియే. అయిన నితఁడు నృసింహభక్తుఁడు కనుక నృసింహదాసుఁడనని తన యారాధ్యదైవతము పేరితో "దాస" పదము చేర్చి వాడుకొనియుండవలయును; (గోపన్న "రామదాసుఁడ"నని వాడుకొనినట్లు). అట్లుకాక తలిదండ్రులు పెట్టిన "శేషాచల" శబ్దముతో 'దాస' సంజ్ఞ చేర్చుకొని చెప్పుటవలన స్పష్టముగాఁ దన శూద్రవర్ణమును జాటుకొనుటయే యగును. ఇతని చతుర్థకులజత్వమును నిరూపించుటకు నృకేసరి శతకములోననే యింకొక యాధారము లేకపోలేదు.

"ఇలను మనుష్యజాతిమున నెక్కువతక్కువ లున్నవన్నచో,
కులముల శ్రేష్ఠ మెవ్వరిది? కొంచెము గానఁగరాదు, వారి ని
ర్మలినశరీరులో? నిను గుమాయని భక్తినిగంధమున్నదా కి
తెలిసిన నిండుభక్తులె సుధీరులు ధర్మపురీనృకేసరీ"

ఈపద్యమునఁ గవి కులముల శ్రేష్ఠత్వము నిరసించుటచేతను, "తెలిసిన నిండుభక్తులె సుధీరుల"ని భక్తులయతిశయము నుటంకించుటచేతను, బరోక్షముగాఁ దననాల్గవవర్ణసంభవతను సూచించుచున్నాఁడు. ఇతఁడు మఱియొక పద్యములోఁ బరమవైష్ణవభక్తిప్రపత్తులను సూచించు "దాసానుదాసత్వము" నిరూపించుచు, తానేకులమునకును జెందినవాఁడను కాననుచున్నాఁడు.

"కలియుగమందు విప్రుఁడను గాను, నృపాలుఁడఁ గాను, మేటి వై
శ్యుల జతవాఁడఁ గాను బలుశూరుఁడఁ గాను సమస్తమైన జా
తుల నొకరుండఁ గాను జుమి, దుర్దనుజాంతక, నీపదాబ్జముల్
దలఁచెడివారిదాసులకు దాసుఁడ ధర్మపురీనృకేసరీ!!"

పై పద్యములో "బలుశూరుఁడఁగాను" అని పరిష్కర్తలు సంస్కరించినట్లున్నది. మఱొకప్రతిలో "బలుశూద్రుఁడఁగాను" అనియున్నది. ఈరెండవదియే సరియైనపాఠము. ఏలయనినఁ, గ్రమముగాఁ దానానాలుగువర్ణములకుఁ జెందినవాఁడను గానని—"నీ (నృసింహుని) పదాబ్జములఁ దలఁచెడివారి దాసులకు దాసుఁడ" నని—కవిహృదయము. కావున నిస్సందేహముగా నతఁడు నాల్గవవర్ణజుఁడేయని నిర్ణయమగుచున్నది. అగ్రవర్ణము వాఁడయిన, గోత్రసూత్రాదికములతో బాహాటముగా నేయమాత్యపదమునో, కవీంద్రపదమునో తన పేరితోఁ

నుండు. చేర్చి వ్రాసికొనియుండువాడు. పాండిత్యము, కవిత్వము, తన సామర్థ్యమని భావించి, “శూద్రమక్షరసంయుక్తం దూరతః పరివర్జయేత్” త్తని నిందించుచున్న యగ్రజాతివారి హేళనకుజడిసి, కవి యిట్లు చెప్పుకొనియుండు ననుట సహేతుకముగాఁ దోఁచుచున్నది. లేదా—ప్రకటించుకొనఁదగని కులములోవాఁడుగనైన నుండవచ్చును.

ఈశతకకర్త “ధర్మపురీనృకేసరీ”—యనియు, “భూషణవికాస శ్రీధర్మపురనివాస, దుష్టసంహార నరసింహ దురితదూర” — అనియు తనశతకములకు మకుటకల్పన మొనర్చుటచేత, ధర్మపురిలోని నృసింహస్వామిని గొలుచు భక్తుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. మనవిశాలాంధ్రలో మూఁడు “ధర్మపురు” లున్నవి. నైజాంరాజ్యములోని ధర్మపురి మొదటిది. అనంతపురము జిల్లాలోని ధర్మపురము (ధర్మవరము) రెండవది. సేలము మండలములోని ధర్మపురి మూఁడవది.

శ్రీశేషాద్రిరమణకవులు ప్రసిద్ధమైన నృసింహక్షేత్రముగా, నిజాము రాజ్యములోని ధర్మపురికే వాడుక యున్నదనియు, నా దేవుని పేరనే యీశతకములు రచింపఁబడినవనియు నిర్ణయించిరి. *

మొత్తమునకు శ్రీశేషాద్రిరమణకవుల నిర్ణయమే యీవిషయములో సమంజసమైనదిగాఁ గనఁబడుచున్నది.

కవికాలమునుగూర్చి శ్రీశేషాద్రిరమణకవులు నూఱేండ్లక్రింద జీవించియున్నట్లుంచనా వేసి చెప్పిరి. ఆవిషయమునుగూర్చి తరువాత విచారింతము.

నృకేసరిశతకము:—ఇందు 108 చంపకోత్పలవృత్తములున్నవి. “ధర్మపురీనృకేసరీ” యని మకుటము. కేవలము భక్తిరసముతో నీపద్యములన్నియుఁ జదువుటకు నింపుగా నున్నవి. కాని ప్రౌఢిమ చాల తక్కువ.

---

* “అతులితలీలఁ గేశసచివాగ్రణి ధర్మపురంబునందు నం
చితముగ, నన్నసత్రమిడి శ్రీనరసింహుని కుత్సవంబులన్
సతతమహోపహారములు సల్పుచు రామగిరీంద్రమునందు నా
స్థితి గుడికట్టి విష్ణుని బ్రతిష్ఠ మొనర్చె నుదాత్తసంపదన్” —(పద్మపురాణము)

ఇందుఁ జెప్పఁబడిన రామగిరియు, నిజాముదేశములోని ధర్మపురి చెంతనే కలదు. ధర్మపురి నృసింహక్షేత్రము ప్రసిద్ధమయినదని ద్యోతకమగుచున్నది. “—ఇతర స్థానములలోఁ గల ధర్మపురి కీప్రశస్తి కానరాదు.”

ధారకూడ ధారాళముగా లేదు. లక్షణదోషములు సామాన్యము-గనిపించుచున్నవి. విద్వత్తులోఁ దనకుండు నసమర్థతను గవియే :—

"అమరము పంచకావ్యములనైన పఠింపఁగలేను, లెస్సగా
శ్రమపడి ప్రాసవిశ్రమవిచారము చేయఁగలేను, నే కవి
త్వముఁగని, నిన్ను వేఁడితిని తప్పులొ యొప్పులొ చిత్తగింపుమీ.
కమలదళాక్ష ! పండితుఁడ గానుర, ధర్మపురీనృకేసరీ !!"

అని చెప్పికొన్నాడు.

ఈశతకములోని పద్యములు దాశరథీశతకములోని పద్యముల కనుకరణములుగా నున్నవి.

1. "గవికల రేఁగుకాయలకు రత్నములే వెలబోసినట్లు దు
ష్కవిజనులంత బుద్ధిచెడి కాసులకోసము తుచ్ఛమైన మా
నవులను బ్రస్తుతించుచు ఘనంబుగఁ బద్యములమ్ముకొంద్రు, మా
ధవ, నినుఁ గానఁజాలరు మదంబున ధర్మపురీ నృకేసరీ !!"

"మసగొని రేఁగుఁబండ్లకును మౌక్తికముల్వెలబోసినట్లు దు
ర్వ్యసనముఁజెంది కావ్యము దురాత్ముల కిచ్చితి, మోసమయ్యె, నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగఁ జేకురునట్లు వాక్సుధా
రసములు చిల్కఁ బద్యముఖరంగమునందు నటింపవయ్య" —(దాశరథీశతకం)

2. "మామిడిపండ్లపానకము, మంచిసుధూదకమిశ్రభక్ష్యముల్,
జామలు, నారికేళములు, చక్కెరద్రాక్షఫలంపు లక్షలున్,
తామరసాక్ష మేలిమిసుధామధురాదులు లక్షయైన, నీనామము సాటిగావు."
—(నృకేసరిశతకము)

"చక్కెరలప్పముల్, మిగుల జున్నుని కెంజిగురాకుమోవులున్,
జొక్కపు జుంటితేనియలు, బొబ్బలగం గనలేరుగాక, నేఁ
డక్కట ! రామనామమధురామృత మానుటకంటె సౌఖ్యమా ?
తక్కినమాధురీమహిమ, దాశరథీ కరుణా" —(దాశరథీశతకం)

3. "తల్లివి దండ్రి వాప్తుఁడవు దాతవు భ్రాతవునీవె" —(నృకేసరి)

"దైవము తల్లిదండ్రి తగుదాత గురుండు సఖుండు నిన్నెకా" —(దాశరథి)

4. "బొందిని ప్రాణముల్ వెడలిపోయెడి నాఁటికి, వాసుదేవ, గో
విందముకుంద యంచు నిను వింతగ నెంతునొ యెంచలేనొ" —(నృకేసరి)

"ముప్పునఁ గాలకింకరులు ముంగిటవచ్చినవేళ, రోగముల్
గొప్పరమైనచోఁ, గఫము గుత్తుకనిండినవేళ బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ కల్గునొ కల్గదొ ?" —(దాశరథి)

5. ఆగజరాజు నీకు ఘనమైనమణుల్ జమచేసి పంపెనా?
త్యాగముతో విభీషణుఁడు ద్రవ్యము నీకెఱుఁగంగఁదెచ్చెనా?
కాఁగులతోఁ గుచేలుఁడధికంబుగ నీకటుకుల్ నొసంగెనా?
బాగుగ వారికేలిత్తివి” —(నృకేసరి)

“బ్రాహ్మణమాత్రమా శబరి? దాని దయామతినేలినావు, నీ
వాసునిదాసుఁడా గుహుఁడు? తావకదాస్య మొసంగినావు, నేఁ
జేసినపాపమో! వినుతిసేసినఁ గావవు.” —(దాశరథి)

ఇట్టియనుకరణము లితరశతకములనుండియు నున్నవి. ఈశతకమున కొన్ని తెలుఁగుఁబలుకుబడులు లేకపోలేదు:—

అరమరసేయు, సలాముసేయు, పండ్లిగిలించు, జమసేయు, బొక్కినవోరు, విసివిసనట్లు, బుగులుపుట్టు, బెదురుగుణాలు, కించతనాలు, పెడసరము, బట్టుకై వారము, లూటిబుచ్చు, ఆసరాగోను, కండ్లనిండ, గుంజఁగనేస్త (లాగనేస్త).

శబ్దదోషములును గ్రామ్యావిత్యముగాఁ గనఁబడుచున్నవి:—

కాలవేతురు, వద్దికి (ఒద్దకు) ఏలుకో, కలిగున్న (కలిగియున్న) ఏందుకుఁ, కద్దు, వేసేటివి, చేసేటివి, అందుకోఁజాలవు, మర్ల (మఱల), పట్టుకవచ్చి, చూచెదనంటె, మొసల్ని, నేను పవిత్రమయ్యెదను, కండ్లు (కన్నులు), పడుండ (పడియుండ), దేహమైతే.

లోకోక్తులు, నానుడులు:—

(1) శర్కరాళియుం, బొక్కినవోటితోఁ దవుడు బొక్కఁగఁబోవునె యెవ్వఁడైన, (2) బురదను బొర్లుచున్న యెనుబోఁతుల కేటికి మంచిగందముల్, (3) ఈనా పస మేడిపండుపస, (4) భ్రమరము కీటకంబు నొగి పట్టుకవచ్చి నిజస్వరూపమున సమముగఁ జేసినట్లు, (5) బెల్లపు గడ్డలు నోటఁ బెట్టుకో పలుకఁగ లేకపోయితివా? (6) మాటమాత్రానికి నోచవా? (7) ఏనుఁగునెక్కి దిడ్డిచొర నీగుదునట్లు, (8) పెద్దపులిచాటున కేఁగిన నెల్కకండ్లకుఁ నమిలెడి గండు బిల్లి యొక్కనల్లి సమానము.

ఈశతకములోని శైలికి యిచ్చిన పద్యములే చాలు ననుకొందును.

ఇతని మఱియొక శతకము నరసింహశతకము. ఇందులో సరిగా 100 సీసపద్యములున్నవి. “భూషణవికాస, శ్రీధర్మపురనివాస, దుష్టసంహార! నరసింహ! దురితదూర!” యని శతకమకుటము. నృకేసరిశత

కము న కంఠ ప్రఖ్యాతిలేదు కాని, యీనరసింహశతకమునకు మాత్రము తెలుఁగు దేశములో మంచిప్రచారమున్నది. ఇందలి పద్యములు పూర్వము వీధిబడులలో తెలుఁగుపిల్లలు కంఠపాఠముగా నేర్చుకొను వారు. తేలికపదములతో భక్తిరసము తొణికిసలాడుచుండుటచేత ముసలమ్మలుకూడ నీపద్యములను బాడుకొనుచుండువారు.

శతకకవియే "తప్పుపడనేమి సద్భక్తి తక్కువౌనె? చెఱకునకు వంకబోనేమి చెడునెతీపు"—అని తనశతకము భక్తిరసముతోఁ గూడి నదని చెప్పుకొనినాఁడు. నృకేసరిశతకములోవలెనే యిందులోఁగూడ కవి పాండిత్యవిషయమై తన యసమర్థతను "గణయతి ప్రాస లక్షణము చూడఁగ లేదు, పంచకావ్యశ్లోకపఠన లేదు, అమరకాండత్రయం బమర జూడఁగ లేదు, శాస్త్రీయగ్రంథముల్ చదువలేదు." అను మాటలతో వెల్లడించుకొనినాఁడు. పద్యములు సాఫీగా దొర్లుకొని పోవుచుండును. కాని యీక్రింది లక్షణవిరుద్ధములైనవానివంటి ప్రయోగాలు చాల గలవు.

కడతేరుదామంటె, ఔదామంటె, అర్థివాండ్రు, కట్టుక, ముట్టిపెత్తు, లక్షాధికారైనా, అనేకధనము, ధూర్తతనము, దోసిలొగ్గు, గుంజుక, పట్టుక, నమ్మినందుకు, పేరుకు, నమ్ముక, పదవేమి ?

ఇట్టిదోషములు, మధ్యకవులకృతులలో సహజముగాఁ గనిపించు నవియే ; కాని వావిళ్లవారి నరసింహశతకములోని పద్యములదోషము లను చాలవఱకు శేషాద్రిరమణకవులు సంస్కరించినను, దిద్దుటకు వీలు కాని స్థలములలోమాత్రము తప్పులట్లే యున్నవి. "క్షీరసాగరశయన కృష్ణవర్ణ"—అను పాదములోని గణభంగమును సవరించకుండుట యం దుల కొకదృష్టాంతరము.

తెలుఁగు వాడుకపదములుకూడ, (ఎక్కువగాఁ గాకున్నను) కొన్నిటి నీకవి ప్రయోగించినాఁడు.

వంకబెట్టు, ఎమ్మెలాడించు, జల్తారుకుళ్లాయి, సుంకరమోటు, అంకుబోఁతు, లక్షాధికారి, చాడీలు, ముల్లె, ముక్కుబట్టుక, తురాయి, కంఠీలు, పచ్చిపూరి, బహుపరాకు, బక్కబంటు, నీటిబుగ్గ, మైలతిత్తి, గద్దరింపు.

ఈశతకములోఁ గొన్నిపద్యములు పూర్తిగా "రామలింగేశశతకము" నుండి హరింపఁబడినవని, యీవిషయములో నక్షరశః అంతియును ననుకరించి తెరవాటులు కొట్టినవాఁడు శతకకారుఁడో, ప్రతులెత్తి వ్రాసికొనిన వ్రాయసకాండ్రో తెలియదు. అట్టిపద్యములు కొన్ని క్రింద చూపుచున్నాను.

(వావిళ్లవారి సంపుటములోని ముద్రిత ప్రతులనుండి)

1. "పసరంబు వంధ్యైనఁ బసులకాపరితప్పు ప్రజలు దుర్జనులైనఁ బ్రభునితప్పు
భార్యగయ్యాళైనఁ బ్రాణనాథునితప్పు తనయుఁడు దుష్టుఁడైనఁ దండ్రితప్పు
సైన్యంబు చెదరిన సైన్యనాథునితప్పు కూఁతురు చెడుగైన మాతతప్పు
అశ్వంబు చెడుగైన నారోహకునితప్పు దంతిదుష్టయిన మావంతుతప్పు
ఇట్టితప్పు లెఱుంగక యిచ్చవచ్చినటుల మెలఁగుదురిప్పుడీ యవనిజనులు"
—(నరసింహ : 12 పద్యం)

"పసరంబు పాఁగైనఁ బసులకాపరితప్పు ప్రజలు దుర్ణయులైనఁ బ్రభునితప్పు
భార్యగయ్యాళైనఁ బ్రాణనాథునితప్పు తనయుండు ధూర్తైనఁ దండ్రితప్పు
అశ్వంబు దూఁకైన నారోహకునితప్పు దంతిదుష్టైన మావంతుతప్పు
సైన్యంబు చెదరిన సైన్యనాథునితప్పు కూఁతురు చెడుగైన మాతతప్పు
ఇట్టితప్పులెఱుంగక యిచ్చవచ్చినట్లు చరియించువానికి హానివచ్చు
నాశికలింగల్గు నిది నిక్కమరసిచూడ" —(రామలింగేశ : 43 పద్యం)

2. "కోఁతికి జలతారు కుళ్లాయియేటికి? విరజాజిపూదండ విధవకేల?
ముక్కుఁడితొత్తుకు ముత్యంపునత్తేల? నద్దమేమిటికి జాత్యంధునకును?
మాచకమ్మకు నేల మాత్రికి హారముల్? క్రూరచిత్తునకు సద్గోష్ఠులేల?
ఆఁకుబోఁతుకు నేల బింకంపునిష్ఠలు? వావియేటికి దుష్టవర్తనులకు?
మాటనిలకడ సుంకరి మోటుకేల? చెవిటివానికి సత్కథాశ్రవణమేల?"
—(నరసింహ : 13 పద్యం)

"కోఁతికిజల్తారు కుళ్లాయియేటికి? విరజాజి పూదండ విధవకేల?
ముక్కుఁడితొత్తుకు ముత్యంపునత్తేల? యద్దమేటికిని జాత్యంధునకును?
మాచకమ్మకునేల మాత్రికి హారముల్? క్రూరచిత్తునకు సద్గోష్ఠియేల?
ఆఁకుబోఁతునకు సద్వ్రతనిష్ఠలేటికి? వావియేమిటికి దుర్వర్తనునకు?
మాటనిలుకడ సుంకరిమోటుకేల? చెవిటివానికి సత్కథా శ్రవణమేల?"
(రామలింగేశ : 33 పద్యం)

3. మాన్యంబులీయ సమర్థుఁ డొక్కఁడులేఁడు మాన్యముల్ చెఱుప సామంతులంత
యొండినయూళ్ల గోడెఱిఁగింప డెవ్వఁడుఁ బండినయూళ్లకుఁ బ్రభువులంత
యితఁడు పేదయటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడు కలవారి సిరులెన్నఁగలరు చాలఁ

దనయాలిచీఁకటి తప్పెన్నఁ డెన్నఁడుఁ బెఱకాంతలం గన్నఁ బెద్దలను
ముట్టిదుష్టుల కధికారమిచ్చినట్టి ప్రభువు కెన్నఁడియాపదా వచ్చు గనుక”
(నరసింహ : 11 పద్య)

“మాన్యంబులీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు మాన్యముల్ చెఱుపను మహిని గలరు
పండినయూళ్ల గోరాజేఁగింపఁ డెవ్వఁడుఁ, బండినయూళ్లకుఁ బ్రభువులకు
చేతఁడు పేదయటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడుఁ గలవాని సిరులెంచఁ గలరు పెక్కు
దనయాలిచీఁకటి తప్పెన్నఁ డెవ్వఁడుఁ బెఱకాంతలంగన్న పెద్దలకును
ముట్టిదుష్టుల కధికారమిచ్చినట్టి రాజునకుఁ గాక, మధ్యముల కిట్టి
నేమిపనియున్నయది పల్కవీంద్రములకును” —(రామలింగే : 8 పద్య)

ఇంతియకాక, కుక్కుటేశ్వరశతకమునుండి పద్యములు కొన్ని కూడ నున్నవి. వీనిని బట్టి కవి యంతప్రౌఢుఁడు కాకపోవుటవలన నితర శతక పద్యభావములనుగూడఁ దనకృతిలోఁ జొప్పించుకొనినాఁడని యూహింపవలసియుండును.

ఇది కవికాలమును స్పష్టముగాఁ దెలిసికొనుటకుఁగూడ నాధారమగుచున్నది. రామలింగేశశతకసాదృశ్య పద్యములనుబట్టి చూచిన, నంతప్రౌఢుఁడుకాని శేషప్పకవియే రామలింగేశశతక పద్యములను హరించి, తనశతకములో వేసికొనియుండుననుట సబబే; ఆసందర్భములో నడిదమునూరకవికి మన శేషప్పకవి వెనుకటివాఁడు. ఎంతకాలము వెనుకయో చెప్పుటకు వీలులేకున్నను సూరకవినాఁటికితఁడు చిన్నవాఁడుగా నుండియుండుననుటకు సందేహములేదు. సూరకవి క్రీ॥ శ॥ 1780 వఱకు జీవించియుండునని యిదివఱకే నిర్ణయించియున్నాఁడఁగదా! అప్పటికి శేషప్ప దాదాపు 20 యేండ్లప్రాయములోనుండి యుండును. సూరకవిశతకపద్యము లితనికిఁ జక్కఁగా నోటికి వచ్చియుండును. ఆకారణమునుబట్టి యాపద్యము లట్లే (ముక్కుమూరకుండ) నరసింహశతకములో దొర్లియుండును. దీనినిబట్టి సూరకవి యనంతరము దాదాపు క్రీ॥ శ॥ 1810 ప్రాంతములలోఁ దన నరసింహశతకమును వ్రాసియుండును. ఎటుచూచినను నితఁడు క్రీ॥ శ॥ 1760—1840 కి మధ్య జీవించియుండెనని తేలుచున్నది.

కులవిషయములోఁ గూడ నరసింహశతకమువలన దృఢపడుచున్నది :—

"వ్యాసుఁడే కులమందు వాసిగా జన్మించె విదురుఁడే కులమందు వృద్ధిపొందెఁ
గర్గుఁడే కులమందు ఘనముగా వర్ధిల్లె నావసిష్ఠుం డెట నవతరించె
నింపుగా వాల్మీకి యేకులంబున హెచ్చె గుహుఁడను పుణ్యుఁ డేకులమువాఁడు
శ్రీ శుకుఁ డెచ్చటఁ జెలఁగి జన్మించెను శబరి యేకులమందు జన్మమందె
నేకులంబున వీరంద ఱెచ్చినారు నీ కృపాపాత్రులకు జాతినీతు లేల ?"

"జందె మింపుగ వేసి సంధ్యవార్చిన నేమి ? బ్రహ్మ మందక కాఁడు బ్రాహ్మణుండు"

ద్విజుఁడైన కవి యీవిధముగ వ్రాయఁడు; సరికదా ఋష్యాదుల జాతులు సూచించుటచేత శేషప్ప తన యవరవర్ణజత్వమును పరోక్షముగా నుగ్గడించినవాఁడయినాఁడు.



# నృసింహకవి

(1775 ప్రాంతము)

నృసింహకవి కవిత్వ మంతప్రౌఢమైనదియు నిర్దుష్టమైనదియుఁ గాదు. తెలుఁగుదేశములో, సుమతి, వేమన శతకముల ప్రచారము తరువాత, మిక్కిలిప్రచారములో నుండునది యాతని కృష్ణశతకము.

ఇతఁడు తన్నుఁగూర్చి ఇట్లు చెప్పుకొనినాఁడు.

"భారద్వాజసగోత్రుఁడ గౌరవమున గంగమాంబ కరుణాసుతుఁడన్
పేరు నృసింహాహ్వయుఁడన్ శ్రీరమయుత నన్నుఁ గావు సృష్టిని గృష్ణా"

ముద్రిత ప్రతులన్నిటిలోను "గంగమాంబ కరుణాసుతుఁడన్" అని యున్నది. తండ్రినిగుఱించి పేర్కొనుట యాంధ్రకవులలో మొదటి నుండి వచ్చుచున్న యాచారము. దానికి భిన్నముగాఁ, దండ్రియూ సెత్తక, తల్లినిగుఱించిమాత్రము చెప్పుకొనిన వాఁ డితఁడొక్కఁడే! ఇందువలన నితని యాభిజాత్యమును శంకించవలసివచ్చుచున్నది. "భారద్వాజసగోత్రుఁడ"నని చెప్పుటచేత నున్నతఋషిగోత్రజుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. దానినిబట్టి యితని జనకుఁడు (ఎట్టివాఁడైనను) ఉన్నత వంశస్థుఁడుగనే మనమూహించుట కవకాశమున్నది. ఇంకొకపద్యములో, "తిరుమణి పెట్టిన మనుజుఁడు పరమపవిత్రుండు" అని యన్నాఁడు. కాఁబట్టి వైష్ణవమతావలంబి యనుట నిశ్చయము. తల్లియొక్క శైవసంబంధమైన పేరును బట్టి యితఁ "డార్వేలనియోగి"యో, "గోలకొండవ్యాపారి"యో యయి యుండవలయును. లేదా మాతృప్రాముఖ్యముగల మఱేజాతికో సంబంధించినవాఁడుగానైన నుండవలయును.

కాని నేను చూచిన యొకానొక తాళపత్రప్రతిలో 'గౌరవమున' యను దానికి బదులు "గౌరనకును" అని యున్నట్లు జ్ఞప్తి. ఒకవేళ యదియే సరియైనపాఠమైన పితృవిషయమైన పైసిద్ధాంతము పూర్వపక్షమగును.

కవి యుపయోగించిన కతిపయశబ్దములనుబట్టి, యితఁడుచిత్తూరు, కడపమండలములలోని వాఁడని యూహించుచున్నాను. "అప్పా, ఇత్తువు"—అను పద్యములోని 'అప్పా' అను పదము ఆప్రాంతములలో పెద్దలవిషయములో గౌరవవాచకముగ నేటికిని వాడుచున్నారు. "పిలి

చిన మోతకుము లిస్తివి”—“ఇస్తివి, ఇస్తిమి”—ఇట్టిపదములు, పడమటిసీమలోను, జిత్తూరుమండలములోను వ్యవహారమునఁ గలదు. శ్రీనాథుడు “పడమటిసీమ” వ్యాపారులనుగూర్చి హాస్యధోరణిలో, “వస్తామి చూస్తిమి, రోస్తిమిఁక బడమటఁ వ్యాపారులఁ గ్రూరులఁ”—అని చెప్పినట్లు వినుచున్నాము. మఱియొక విషయమేమనఁగా, కృష్ణశతకములోని—

> “శిరమున రత్నకిరీటము కరమున నవశంఖచక్ర ఘనభూషణముల్
> ఉరమున వజ్రపుపతకము, సిరినాయక, యమరవినుత శ్రీహరి కృష్ణా ॥”

అనుపద్యము, అంతకుముందునుండియే ప్రచారములోనున్న

> కం॥ “నిగనిగ మెఱయు కిరీటము ధగధగమను పట్టువట్టి తగినకటారుఁ
> బుగబుగవాసన నీకే తగుఁదగురా, యొంటిమిట్ట దశరథరామా ॥”

అను పద్యమున కనుకరణము. ఈ “యొంటిమిట్ట” కడపజిల్లాలోనిది. కనుక నక్కడ నంతకు పూర్వమునుండి వాడుకలోనున్న పద్యమును, ఆమండలమువాఁడే యయిన నృసింహకవి యొరవడిగాఁ బెట్టుకొని, యట్లే, తాను పైపద్యము వ్రాసియుండవచ్చుననుట యుక్తిసహము కాకపోదు.

ఇఁక నితనికాలమునుగూర్చి తెలుపుటకుఁ దగిన యాధారములు గ్రంథములో లేవు; కాని, కొన్నికారణములనుబట్టి 18 శతాబ్దమునాఖరువాఁడై (1775 కుఁ బైవాఁడయి) యుండునని యూహించుటలో నంతగా బాధకము లేదు.

ఈకవి పోతన, శ్రీనాథుల పోకడలను గొన్నిటి ననుకరించినాఁడు. ‘విశ్వాత్మక, విశ్వేశ్వర’ అను భాగవతపద్యమునకు “విశ్వోత్పత్తికి బ్రహ్మవు”—అని ; “దిక్కెవ్వరు దీనులకును, దిక్కెవ్వరునీకునాథు”—అను ప్రహ్లాదచరిత్రలోని పద్యమునకు “దిక్కెవ్వరు ప్రహ్లాదుకు, దిక్కెవ్వరుపాండవులకు” అనియుఁ బోటీగ పద్యములల్లినాఁడు.

“అంసాలంబితకుండల” యనుపద్యము “అంసాలంబితకచభర” యను శ్రీనాథునిపద్యమునకు ఛాయ, మొల్లనుగూడ నితఁ డనుసరింపక పోలేదు. “వనజాక్ష భక్తవత్సల, ఘనులగు త్రైమూర్తులందు” అను పద్యము “జలజాక్ష భక్తవత్సల, జలజాసనవినుత” యను పద్యమునకుఁ బ్రతిక.

దీనినిబట్టి పై కవులకుమాత్రమే కాక, వేమన, బద్దెనలకుఁగూడ నృసింహకవి, తరువాతివాఁడుగనే యగపడుచున్నాఁడు. ఏలయన :— సుమతి. వేమన పద్యముల కావలనే దేశములో చాలప్రచారముండు టచేత, భక్తిప్రబోధమునకై (సులభశైలిగల) యీ కృష్ణశతకమును గొన్ని బడులలోఁ బిల్లలకు నేర్పుచువచ్చిరి. కనుక ప్రచారములో నిది వాని తరువాతనే వచ్చినది. అందుచేతఁగూడ నితఁడు వారితరువాతివాఁ డని నిర్ణయింపవలసివచ్చుచున్నది. ఈకారణములనుబట్టి యితనిని క్రీ॥ శ॥ 1775 వాఁడనుటలో సందిగ్ధమేమియు నుండదు.

కృష్ణశతకములోని పద్యములు, సరళము, సులభగ్రాహ్యమైన శబ్దములతో నొడుదుడుకులులేని ధారాళధారతోఁ బ్రకాశించుచున్నవి. కాని కవి యంతకవితాసామర్థ్యము భాషాపాండిత్యప్రభావము కలవాఁడు కానందుచే, నర్థస్వారస్యములేని పునరుక్తులు, ఊఁకదంపుళ్లవంటి ప్రాసములు, సహింపరాని దోషము లనేకములు దొర్లినవి. వావిళ్లవారు క్రీ॥ శ॥ 1920 సం॥రం॥ ప్రకటించిన ముద్రితప్రతిలోని పద్యము లవసరములైన సందర్భములలో నుదాహరింతును.

1. అర్థవిశేషము గోచరింపని యేకప్రాసపద్యములు :—

(1) నీవే తల్లివి దండ్రివి, (2) హరి యను రెండక్షరములు, (8) దిక్కెవ్వరు ప్రహ్లాదునకు, (4) ఎటువలె కరిమొఱ వింటివి, (5) దండ మయా విశ్వంభర, (6) నారాయణ లక్ష్మిరమపతి, (7) తిరుమణి దురితవి దూరము, (8) అప్పా యిత్తువు దయతో, (9) నీనామము భవహరణము, (10) బలమెవ్వఁడు.

2. పద్యములలో నేకాభిప్రాయపాదములు పునరుక్తిగావచ్చుట:—

1. "అంభోజనేత్ర జలనిధి గంభీరుఁడ నన్నుఁ గావు కరుణను కృష్ణా" (53—58)

2. అటువలె నను రక్షింపుము. —(70—71)

3. ఒకశబ్దమునే పెక్కుపద్యములలోఁ బ్రయోగించుట.

(1) మందరగిరిధర, (8, 38, 97, 98) (2) లక్ష్మీరమపతి (55, 57, 59) (3) నందసుతుఁడు (అనుసర్థముగలవి) (8, 14, 18, 17, 60, 93, 97) (4) నారాయణ (3, 5, 92, 94).

4. ఛందోదోషములు :—

1. గణభంగము :—"పరగితవో నీవు బాలప్రాయము కృష్ణా" —(15 ప)

2. ప్రాసభంగము :—

(ఎ) "నీయాజ్ఞఁ దలఁగనేరను కుయ్యాలింపుము మహాత్మ, గుఱుతుగఁ" —(88 ప)
(బి) "ఏఘడియను నీనామము లఘుమతితోఁదలఁచఁగలనె లక్ష్మీరమణా" —(8 ప)
(సి) "శ్రీధర మాధవ యచ్యుత భూధర పురుహూతవినుత పురుషోత్తమ నీ
పాదయుగళంబు నెప్పుడు మోదముతో నమ్మినాఁడ ముద్దులకృష్ణా"

కడపటిదానిలో నొకపాదమునకైన ప్రాసము భిన్నముగా నుండవచ్చును. కాని రెండటు, రెండిటు లుండరాదు.

5. వ్యాకరణ దోషములు :—(1) 'కు' షష్ఠికి ముందు నగాగమము లేమి :—జగన్నాథుకు, ప్రహ్లాదుకు, సుగ్రీవుకు. (2) సాంస్కృతిక సమాసములలో మహత్త్వార్థకములకు దీర్ఘములు లేమి :—రతినాథజనక, దేవకిపుత్రా, సత్రాజిత్తనయనాథ, గంగమాంబకరుణాసుత్తుఁడక్, శ్రీరమయుత. (3) తప్పుసంధులు :—సారథైతి, కంటుండ (కనుచుండ) వింటివి యెటువలె, పిలువక్ ఏరీతి, ఏలుకొంటివిపరీ, దినంబుల్ యించుక, కంబములోనక్ ఇరవొంద, ఘంటాకర్ణుక్ ఎటువలె, నేను అచ్యుత, అనుభవశాలిక్, అప్పా, భూషణముల్ ఉరమున :—ఇందు ద్రుతము మీఁది యచ్చు "ద్విరుక్తనకారము" కావచ్చునను లాక్షణికుల మత మంతసమ్మతము కాదు.

4. శబ్దదోషములు :—చాలా, కొంచపు, ఘడియ, పరుసతో, గరిమతో, ఇస్తివి (మూఁడుచోట్ల) నీవల్ల, గోపాలదొంగ ;

5. క్లిష్టాన్వయ జుష్టములు :—

1. "అరయఁగ మిము దలఁచుజనుల కరుదా ?"—(అరుదేది ?)
2. "దుర్జనులగు నృపసంఘము నిర్జింపఁగ వలసి నీవు నిఖిలాధారా! దుర్జనుల సంహరింపను" (దుర్జనులవిషయము రెండుపర్యాయములేల ?)
3. "విక్రమమేమని పొగడుదు నక్రగ్రహా! సర్వలోకనాయక కృష్ణా"—(ఇందు 'నక్రగ్రహా'—అనుటకు సందర్భమేమో ?)
4. "విభ్రమవై దనుజసుతా గర్భంబులం పగులఁజేయు ఘనుఁడా" ('విభ్రమలగు దనుజసుతుల' యనిన మేలు)
5. "చొక్కపు నీగుణజాలము నక్కజముగ లెక్కపెట్ట నజునకు కృష్ణా"—(ఇందు క్రియ లేదు, 'అలవియె' యన్న సరిపోవును)

6. 'ఆదివరాహము నయ్యును' (ఆదివరాహమవయ్యును)
7. 'శరశర్వాణీ ప్రణుత వినుత' (అర్థము దుర్గ్రాహము)
8. "హరి సర్వంబుల గలఁడని గరమతో దైత్యుండు వలుకఁ గంబములోనన్
ఇరవొందించి వెడలి చీరవె శరణన్న విభీషణుండు సాక్షియె కృష్ణా"

ఈపద్యమున మొదటి మూఁడుపాదములలోని విషయమునకు, నాల్గవపాదములోని విషయమునకు, సమన్వయము కుదురుట లేదు. అవి వేర్వేఱు యుగములలో, వేర్వేఱవతారములలో జరిగిన విశేషములు. కనుక నొకదాని కింకొకటి 'సాక్షి' యగుట పొసఁగదు.

9. 'కనకకశ్యపు మాతకుఁనై యతనిసుతుని, కరుణను గాచెన్'—

ఇది యసంబద్ధము. ప్రహ్లాదునిగాచుట కతనితండ్రిని చంపెను. అవతార ప్రయోజనములలో మొదటిది సాధురక్షణము. రెండవది దుష్టశిక్షణము "పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చదుష్కృతాం" అనికదా భగవద్వాక్యము.

10. 'ఆదండకావనంబునఁ గోదండము, గాచిపట్టి కోమలమూర్తిన్' (కోదండము గాచుట యన నేమో తెలియదు).
11. "అయ్యా పంచేంద్రియముల ఉయ్యాలలు ఊఁచినట్టు లూరక నేనున్"
(ఉయ్యాలలు + ఊఁచినట్టు :—విసంధి—"ఊపఁగ నేనున్"—అనిన సరిపోవు నేమో ?).
12. "అమరఁగఁ దలఁచెదను నేను నమరఁగఁ గృష్ణా" (రెండుమారు 'లమరఁగ' ప్రయోగించుట).
13. "నాదండ దాపు గమ్మా"—"పాపము దుష్కృతములెల్ల" (ఏకార్థబోధక పర్యాయశబ్దములు వెంటవెంటనే వాడఁబడినవి).

ఇన్ని దోషములున్నను మొటికలవంటి పద్యములు కొన్ని భావపుష్టిగలవి లేకపోలేదు. భక్తిశతకములనుగూర్చి, "చెఱకునకు వంక బోతేమి చెడునెతీపు"—అని నృసింహశతకకారుఁడు చెప్పిన పలుకక్షరాలా నిజము. ఈక్రింది పద్యము లద్భుతములుగా నున్నవి :—

"దివిజేంద్రసుతునిఁ జంపియు రవిసుతు రక్షించినావు రఘురాముఁడవై
దివిజేంద్రసుతునిఁ గాచియు రవిసుతుఁ బరిమార్చితౌర రణమునఁ గృష్ణా"

ఇందలి విరోధాభాస చమత్కారముగా నున్నది. దిగువ మఱికొన్ని మనోహరపద్యములుకూడ గమనింపఁదగినవి.

"పదునాలుగు భువనంబులు కుదురుగ నీకుక్షి నిల్పుకొని నేర్పరివై
విదితంబుగ నా దేవకి యుదరములో నెట్టు లొదిగియుంటివి కృష్ణా" (ప 11)

"దుర్భరబాణము రాఁగా గర్భములోనుండి యభవ కావుమటన్నన్
నిర్భరకృప రక్షించితి నర్భకు నభిమన్యుసుతుని నచ్యుత కృష్ణా" (ప 31)

"నరపశువ మూఢచిత్తుఁడ దురితారంభుఁడను మిగుల దోషుఁడను, నీ
గుఱుతెఱుఁగ నెంతవాఁడను హరి నీవే ప్రాపుదాపు వౌదువు కృష్ణా (ప 49)

"పరనారీముఖపద్మము గుఱుతుగ కుచకుంభములును గొప్పను నడుమున్
అరయఁగఁ గని మోహింతురు నిరతము నిను భక్తి గొల్వనేరరు కృష్ణా" (ప 50)

"గజరాజవరద, కేశవ త్రిజగత్కల్యాణమూర్తి, దేవ, మురారీ!
భుజగేంద్రశయన మాధవ విజయార్చిత నన్నుఁగావు వేగమ కృష్ణా" (ప 61)

భగవద్గీతలలోని యభిప్రాయములు కొన్ని యిందులోఁ గవి పొందుపఱచినాఁడు :—

"గిరులందు మేరువౌదువు" (మేరు శ్శిఖరిణా మహం)
సురలందున నింద్రుఁడౌదు (దేవానా మస్మి వాసవః)
చుక్కలలోనన్ (బరమాత్మ) చంద్రుఁడౌదువు (నక్షత్రాణామహంశశి)
నరులందున నృపతివౌదు నయముగఁగృష్ణా" (నరాణాంచ నరాధిపం)

వేమన యనుకరణములు :—

"పరుసము సోకిన యినుమును వరుసతో బంగారమైన వడువున" (కృష్ణ)
"పరుస మినుము సోక బంగారమైనట్లు" (వేమన)

ఇట్టి వింక నున్నవి. గ్రంథవిస్తరశంకచే నుదాహరణము లెక్కువ చూపలేదు.

'కృష్ణశతకము' కేవలము భక్తిప్రబోధక మయినందువలన నందలి భగవన్నామసంస్తవమున కానందింపవలసినదే. కాని సారస్వతో పయోగమున కెక్కువ యుపయోగింపదు. అయినను కృష్ణశతకము నకుఁ బ్రజాబాహుళ్యములోఁ గల ప్రచారము గొప్పది.

ఇంకొక్క విషయము :—విష్ణుపరమైన భక్తిశతకములు వ్రాసిన కవులలోఁ జాలమంది దశావతారములనుగూడ నందుఁ జేర్చుట చిరకాలమునుండియు వచ్చువాడుకగాఁ గనిపించుచున్నది. నృసింహ కవికూడ తద్విధముగా కృష్ణశతకములో 37 వ పద్యమునుండి 46 వ పద్యమువఱకు దశావతారములను వర్ణించియున్నాఁడు.

# రామకృష్ణమూర్తికవి

(1780 ప్రాంతము)

ఇతని 'రామకృష్ణమూర్తి' శతకము ఆంధ్రసాహిత్యపరిషత్తు వారిచేఁ బ్రచురితమైన శతకసముచ్చయము, ద్వితీయభాగమున నున్నది, ఇందు 76 ఆటవెలఁదు లున్నవి. 'రామకృష్ణమూర్తి రమ్యకీర్తి'—అనునది మకుటము.

'అహంబ్రహ్మాస్మి' యను నద్వైతతత్త్వమును ప్రబోధించు వేదాంతశతకములలో నిది యొకటి. వేమన పద్యములధోరణిలో దీని యందలి పద్యములు నడచుచున్నవి. అసంపూర్ణము కనుక కవి తన పేరు తెలుపుకొను కడపటిపద్యములు లేకున్నను నాత్మసంబుద్ధితో సిట్టి కవులు పద్యములు చెప్పువాడుక కలదు. పైఁగా వేమనవలెనే యితఁడును నవ గాహనమగు సామాన్యసులభశయ్యలోఁ బద్యములను సాగించినాఁడు. వేమనపద్యములలోఁ గొన్నిటిభావము గ్రహించుట దుస్సాధ్యము. కాని యీశతక పద్య తాత్పర్యము లరఁటిపండొలిచి చేతఁబెట్టినట్లు సుకరముగా నర్థమగుచున్నవి. కొన్నిపద్యములలో నితఁడు తెలుపు దృష్టాంతములు, నుపమానములు, ప్రసక్తవిషయములును చాలసన్నిహితములుగ నుండుటచేత నెంతటిపామరునికైనను దత్త్వార్థము తటాలున బుద్ధికెక్కి మనస్సున నాటుకొనును.

"పాలలోననుండి పైటఁ దీసినవెన్న, పాలఁగలిసిపోదు పాలనున్న
జ్ఞాని కలిసిపోఁడు సంసారముననున్న"

"ఉప్పుగల్లు చూడ గొప్పవారాశిలోఁ గలిసిపోయి మరలఁ గానరాదు
బ్రహ్మమందు నీప్రపంచ మావిధమయ్యె"

"దురదమంటయుఁ గల కురుపువంటిదిచుమీ సుఖము దఃఖమొందు స్థూలతనువు
ఔషధంబువంటి దాత్మయోగంబది"

"జలధి నున్న చేప జలమునకై యటు దిరుగఁజనునె యన్యదేశములకుఁ
దన్ను నిండుకొన్న తత్వంబు వెదకునా?"

"నూకగింజఁ గానలేకయ గాడిద పుట్టెడూక కలయ బొక్కినట్లు
సారమెఱుఁగలేని శాస్త్రపాఠములేల?"

"రాజుభార్యతోడ రమియించుచున్నను నదియు బైటఁబెట్ట పోని గాదె?
బ్రహ్మవేత్తననుచుఁ బరులకుఁ జెప్పకు"

"అన్యశూన్యపదము నందిన దంపతుల్ సిగ్గుతోడ విడిచి చీరలెల్ల,
రతిసుఖమ్ము గాంచు గతి నుండు శివయోగి"

సూత్రప్రాయములైన కొన్ని సూక్తులు :—

(1) ఎండమావులందు నిండేఱు భ్రమలేల ? (2) సారమెఱుఁగ లేని శాస్త్రపాఠము లేల ? (3) గొప్పవాఁడొకఁడని తోఁచకున్నవాఁడె దొడ్డవాఁడు, (4) భర్తమాటవినని పడఁతి పతివ్రతా ? (5) పాలు గుడుచుచున్న పడఁతులు పతికేల ? (6) అంధుఁడైనవాఁడు నాదిత్యుఁ గాంచునా ? (7) సిగ్గువదలిపోక చీరలు వదలవు, (8) తనువులెన్ని చనినఁ దాఁ జావఁడెప్పుడును, (9) పసులు వేఱుగాని పాలొక్కరూపంబు, (10) ప్రాణులన్నిగూడఁ బరమాణు రూపంబు, (11) సరిగఁ జెవిటి యొద్ద శంఖ మూఁదినయట్లు, (12) నీవు నీవుగాఁగ నిఖిలంబునీవౌను, (13) గురునికరుణలేక దొరకదు మోక్షంబు, (14) శౌర్యమున్నఁ జంపు శత్రుషడ్వర్గము, (15) బ్రహ్మమైనవాఁడు పరులకుఁ జెప్పునా.

ఇతఁడు త్రిమూర్తులను దేవతలని యంగీకరింపఁడు. వారి యాధిక్యతను సుతరాము ఒప్పుకొనఁడు.

"పందిరూపు గొనుచుఁ బాతాళమునకేఁగి శివునిపాదములకుఁ జేరఁడాయె
నట్టి విష్ణుఁడేమి యధికుండు ! చెప్పుమా"

"దేవుఁడనుచు బ్రహ్మదేవునిఁ జెప్పగ దేవుఁడైన వాసుదేవుచేతి
దెబ్బచేత శిరసు దెగి యిలఁబడె నేమి ?"

"శివుఁడు దేవుఁడనుచుఁ జెప్పగ నాతోడ శివుఁడు దేవుఁడైన సిగ్గుచేతఁ
బాఱిపోవ నేల భస్మాసురునిభీతి"

"బ్రహ్మదేవుని తల బ్రద్దలైపోను, శంకరునియిల్లు వల్లకాఁడుగాను,
వీరు వేల్పులనుచు వెఱ్ఱులపుట్టిరా ?"

మోక్షముగనుటకు తోడ్పడని—శాస్త్రజ్ఞానము విద్య నిష్ప్రయోజనమని యితని అభిప్రాయము :—

"జ్ఞానియనఁగఁ బ్రభువు, జ్ఞాన మాతనిసొమ్ము సొమ్ము పెట్టె లాగమన్న్ము లెల్ల
మొరయఁ జదువువారు మోఁతకూలీలయా"

"వత్సరములు విద్య, వర్ణాశ్రమాదులుం గలుగువాఁడు పెద్ద గాఁడు చుమ్ము
యున్నవస్తు వెఱిఁగియున్నవాఁడే పెద్ద"

బ్రహ్మవిద్య నెఱుఁగఁజేయలేని శైవవైష్ణవ మతములను ఈ కవి ఈసడించినవిధము చూడుఁడు :—

"చక్రధారులనఁగ శైవమతస్థులు నేమొకాని మది సహింపలేరు,
చక్రధారిగాని జనుఁడొక్కఁడును లేఁడు"

"లింగధారులనఁగ వెంగలి వైష్ణవు లొప్పలేరు, నిజము చెప్పలేరు,
లింగధారిగాక లేఁడ యెవ్వాఁడును"

"విష్ణులోకమనుచు వేఱుగాఁ జెప్పుట విష్ణువైరబుద్ధి వైష్ణవులకు
విష్ణుమయముగాదె విశ్వంబు సకలంబు"

'వెఱ్ఱిలపుట్టెరా'—"మోఁతకూలీలయా"—యిట్టి ప్రయోగములు వేమనపద్యముల కనుకరణములే యగును. కనుక రామకృష్ణకవి యతనిమార్గముననే తప్పక యాత్మసంబోధనపరముగా నీశతకి మునకు మకుట మేర్పఱచుకొనినాఁడు. పైఁగా నితఁడు శివునిగాని, విష్ణువును గాని స్తోత్రముచేయుట కిష్టపడని తత్త్వవేత్త. ఇఁక 'రామకృష్ణమూర్తి' యని యే దేవుని పేరో మకుటముగాఁ జేసికొనినాఁడనుట నమ్మరాని విషయము.

ఇఁతఁడు వేమనకుఁ దరువాతివాఁడని యతనిపద్యముల వైఖరి చెప్పుచున్నది. సాదృశ్యములు కొన్ని చూపెదను.

(1) ఇద్దఱును నాత్మసంబుద్ధి పరముగనే తమపద్యమకుటము లేర్పఱచుకొనిరి, (2) ఇద్దఱు నచలవేదాంతమును, నద్వైతమును వ్యాపింపఁజేయ పూనుకొనిరి, (3) ఇద్దఱు నాటవెలఁదులనే వరించిరి, (4) ఇద్దఱును బ్రహ్మవిష్ణ్వాదులను, మతములను; నిరసించిరి.

కనుక నీరామకృష్ణమూర్తికవి వేమనతరువాత సుమారు వంద, వందయిరువదియేండ్లకు, ననఁగా పదునెనిమిదవ శతాబ్దాంతమున నుండినవాఁడు కావచ్చును.



# శ్రీమత్తిరుమల, నల్లాఞ్చక్రవర్తి సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యకవి

క్రీ॥ శ॥ 1790—1840

ఇతని "శ్రీతిరుమల వేంకటేశ్వరశతకము"—పరిషత్కార్యాలయమువారి "శతకసముచ్చయము—ద్వితీయభాగము"లోఁ బ్రచురింపఁబడినది.

"అరయుము బాలుఁడ నాచే విరచితమగు నీశతంబు విని యాపై నీ
కరమునఁ గైకొను ముదమునఁ దిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

"ధరలో నక్షయసంవత్సర వర భాద్రపద బహుళ చవితీ గురునా
సరమున రచియించితి, నిది తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

కవి యీ శతకమును దన బాల్యమున నక్షయ భాద్రపద బహుళ చవితి గురువారమున వ్రాసినట్లు చెప్పుకొనినాఁడు.

ఈశతకప్రతిని కవివంశస్థుఁడే పరిషత్కార్యాలయమువారి కిచ్చినాఁడు. అతఁడు తెలుపుటలో మొన్నటి యక్షయ కాక యాపై యక్షయ గాక యంతకుమీఁది యక్షయలో నిది రచింపఁబడినట్లు తేలుచున్నది. అనఁగా నీ 1954 సం॥రం నకు 148 ఏండ్లక్రిందట యీ కవి యుండి యుండుట నిశ్చయము. అప్పటి కీశతకరచనాకాలము క్రీ॥ శ॥ 1806 అగును. బాలుఁడనని కవి చెప్పుకొనుటచేతఁ, దన 16–18 యేండ్ల నడుమ నితని ప్రాయముండక తప్పదు. ఆపక్షమున నితని జననము క్రీ॥ శ॥ 1790—92 ల మధ్య యుండియుండును.

ఇతని వంశస్థుఁడయిన శ్రీమాన్ సంపత్కుమార వేంకటరాఘవ చక్రవర్తి అయ్యంగారు తెలిపిన యీకవి జీవితసంగ్రహము "శతక సముచ్చయము" నుండి యీక్రిందఁ బ్రకటించుచున్నాను.

"ఈశతకము రచించిన కవిగారు నాకు మూఁడుతరములపై వారు. అనఁగా నాకు ముత్తాతగారగుదురు. . .ఆకాలమున వారు కృష్ణాతీరమునఁ గల ముక్త్యేశ్వరపురమునఁ గాపురముండి శ్రీవైష్ణవ మత సిద్ధాంత బోధనార్థము భగవద్రామానుజులవారిచే నియమింపఁబడిన చతుస్సప్తతి సింహాసనస్థులలో నొకరగుటచే ననేక దేశములలోఁ బర్య

టనము గావించుచు, నందిగామతాలూకాయందుఁ గల శ్రీతిరుమలగిరి క్షేత్రమున కేతెంచి, యచ్చట శ్రీస్వామివారిసన్నిధి నీశతకము రచించి నట్లు తెలియుచున్నది.”

శ్రీసంపత్కుమార వేంకటరాఘవాచార్యుఁడే తన వంశక్రమము నీవిధముగాఁ దెలిపినాఁడు.

శ్రీనివాస వేంకటాచార్యుఁడు
|
రాఘవాచార్యుఁడు.
|
శ్రీనివాస వేంకటాచార్యకవి (ఈశతకకర్త)
|
తిరువేంగళాచార్యుఁడు
|
జగన్నాథాచార్యుఁడు
|
శ్రీ వేంకటరాఘవాచార్యుఁడు.

ఈకడపటి యతఁడే శతకమును బరిషత్కార్యాలయమునకు సమర్పించినవాఁడు. ఈకవివంశీయులు జగన్నాథాచార్యునివఱకు ముక్తేశ్వరపుర కాపురస్థులు కొంతకాలమున కీజగన్నాథాచార్యుఁడే యాయూరు విడిచి, జగ్గయ్యపేటకుఁ దరలివచ్చి కాపురము పెట్టెను.

శ్రీతిరుమలగిరి వేంకటేశ్వరశతకములోని కందపద్యములసంఖ్య 108. “తిరుమలగిరి వేంకటేశ! దేవాధీశా!” యను నాలుగవ చరణము పూర్తిగా మకుటము. ఆకారణమునఁ బద్యములన్నియు రేఫప్రాసముతో సాగింపవలసివచ్చినది. అయినను. కవిత ధారాళమైన నడక కలిగి మంచిశయ్యలోఁ బడినది. శతకములో సామాన్యముగా నన్నియు భక్తిపరములయినవి. వానిలో 14 వ పద్యమునుండి 18 వ పద్యము వఱకు విరాడ్వర్ణనమును, 32 నుండి 41 వఱకు దశావతారవర్ణనమును, 42 నుండి 47 వఱకు రామలీలలును, 48 నుండి 54 వఱకుఁ గృష్ణలీలలును జెప్పఁబడినవి. 65 నుండి 70 వఱకు పంచేంద్రియప్రయోజనము వివరింపఁబడినది.

భగవద్గీతలోని :—

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

అనుశ్లోకమున కనువాద మీదిగువపద్యము :—

"వరసాధుల రక్షింపఁగ, ధరఁగూల్పఁగ దుష్టతతుల, ధర్మమునిలుపన్
బొరిఁ బుట్టుచు నంటి వహా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

భగవత్సాన్నిధ్యము కల్పించుకొని యాయనతో సమక్షములో మాట్లాడినట్లుగాఁ గొన్ని వాక్యములును గొన్నినీతివచనములును నీశతకమునకు మెఱుఁగిచ్చుచున్నవి.

(1) కరము బలవంతుఁడైన నితరులం గొట్టుటన మిగులఁ దప్పగు, వారిన్ సరగునఁ గొట్టెదవీవహా! (2) ధర సిలుగు గలిగినపుడే మొఱలిడి నినుఁ గొల్చి పిదప ముదిగలిగిన నిన్ స్మరియింప రెందు లోకులు, (3) ధరలో జన్మంబందెడి వఱకేనా నన్నుఁ గనుట? ; భావ్యం బేనా తరువాతఁ గనకయుండుట ?, (4) ధరలోఁ బుట్టినయపుడే పర మేష్ఠి లిఖించె నాదుఫాలమునం, దేసరణిని గలదో యెఱుఁగను, (5) తరులపయిన్ వెన్నెల ప్రస్తరముపయిన్ గురియు వాన సరియ య్యెను, నీకరుణ యెటనేని బరపుట, (6) ధరఁ దండ్రి కాత్మజుపయి నెనరు గల విధమునను నీవు నామీఁదఁ గృపన్ బఱపుము, (7) పరు లకు మేలుకలిగినన్ దురితాత్మకు లోర్వకుండుదురు, (8) ధరపై నాటిన తరులకు జలమిడనిభాతిఁ దనరును నను నీవరయక పెడమోమునిడన్.

ఈకవికి సంగీతములోఁగూడ మంచిప్రవేశమున్నట్లీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

"అరమరలేక త్వదీయ సుచరితంబులనెల్ల రాగసరళిని నేనుజ్ నిరతము బాడుచుసుంటిని"

ఇఁకమచ్చునకీశతకములోని పద్యములఁగొన్నిటినీదిగువఁజూపుచున్నాను

స్మరజనకా ! మహిలో నిందతిఁ బ్రోతువు, నన్నుఁ బ్రోవ దయరాదా, నీ
తరమే గాదా ! నుడువుము, తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

"అరిభీకర ! సుగుణాకర ! వరదా ! ద్విరదేశవరద ! వర దాసజనా
దరణా ! కరుణాభరణా ! తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

"గిరులదొరముద్దుఁగూఁతురి వరుఁడగు ముక్కంటికైన, బ్రహ్మకునైనన్
దరమే గట్టిగ నినుఁగనఁ ? దిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

"దురితహరణ ! కమలచరణ ! నిరుపమమణిహారి ! యసురనికరవిదారీ !
హరమిత్రా ! నుతిపాత్రా ? తిరుమలగిరి వేంకటేశ ! దేవాధీశా॥"

———:o:———

# శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి

(క్రీ॥ శ॥ 1790—1870)

శిష్టువారివంశము పారంపర్యముగా విద్వత్కవివంశము. వీరు కాసలనాటి వైదికబ్రాహ్మణులు; వాసిష్ఠగోత్రులు; ఆపస్తంబసూత్రులు; వీరి నివాసస్థానము గోదావరిజిల్లాలోని రామచంద్రపురముతాలూకా యందలి గొల్లపాలెము. ఇది కాకినాడకు సమీపమున నున్నది.

శిష్టు కృష్ణమూర్తికవి స్వగ్రామములో శిష్టుసర్వశాస్త్రి గవరమ్మలకు క్రీ॥ శ॥ 1790 సం॥ జన్మించినాఁడు. ఇతఁడు రామచంద్రపురములోనే కొంతకాలము విద్యాభ్యాసముచేసి, యాతరువాత, నయినపల్లి వాస్తవ్యుఁడైన బులుసు అచ్చయ్యయొద్ద చేరి, కావ్యనాటకములు చదువుకొనినాఁడు. వ్యాకరణాలంకారములలోను మంచిప్రజ్ఞకలవాఁడు. ఆశుకవిత్వము, అవధాన మలవఱచుకొనినాఁడు. సంగీత సాహిత్యవిద్యలలో నిస్సీముఁడయి, యసర్గళముగాఁ బురాణము చెప్పు ప్రతిభ కాంచఁ గలిగినాఁడు. సంస్కృతాంధ్రములలోనేకాక, హిందీలోఁగూడ మంచి పరిచయము సంపాదించుకొనినాఁడు.

ఇతని ప్రజ్ఞావిశేషమునకుఁ బ్రౌఢిమకు మెచ్చి రామచంద్రపురము జమీందారయిన కాకర్లపూడి రామచంద్రరాజు, అతనిసోదరుఁడు జగన్నాథరాజు నతనిని తమయాస్థానకవిగా నుంచుకొనిరి. ఆ సమయములో వ్రాయఁబడినదే యీ "వాయుపుత్రశతకము." శతకములోని కడపటిపద్యములోఁ గవి యీవిషయమును వివరించినాఁడు:—

"శ్రీకలితోత్తమ కాకర్లపూడి గోత్ర క్షీరవారినిధాన చంద్ర
రామచంద్రావనీరమణ జగన్నాథరాజన్య నీలాద్రిరాజ పద్మ
నాభవసుంధరానాయకానుజుఁడగు విజయనృసింహ భూవిభుఁడు శిష్ట
గోత్ర సర్వజ్ఞ సత్పుత్రుని గృష్ణమూర్తిసమాహ్వయుఁడగు నన్ను సరసోక్తి
బహుమతియుతంబుగా జగత్ప్రాణనంద నాహ్వయాంకిత శతక మత్యనుపమముగఁ
గూర్పుమనఁ గూర్చినాఁడ నా నేర్చినట్లు వారిరుహబంధుసుకమిత్ర ! వాయుపుత్ర!!"

ఆతరువాత నితఁడు సేతుయాత్రకు వెడలి తిరిగివచ్చునపుడు శ్రీకాళహస్తి క్షేత్రమునకు వచ్చుటయు, నంతకుమును పే కృష్ణమూర్తిశాస్త్రి ప్రఖ్యాతి వినిన కాళహస్తిసంస్థానప్రభువు, మహారసికుఁడగు

దామెర్ల వేంకటపతిరాయనింవారు ఇతనిని పిలిపించి, తమయాస్థాన విద్వద్వరేణ్యునిగాఁ జేసికొనుటయును, జరిగినది. అక్కడ కృష్ణమూర్తి కవి కఱువదిరూపాయల మాసవేతనమును బ్రభువిచ్చుచుండువాఁడు. అట్లక్కడ పదునాలుగేండ్లు గడపి స్వదేశమునకువచ్చి పిఠాపురము, జగ్గంపేట, మాడుగల్లు సంస్థానాధిపతులచేత నపూర్వసత్కారములంది యనేకకృతులు రచించి తుదకక్కడనే క్రీ॥ శ॥ 1870 లో పరమ పదించెను.

ఇతని సమకాలికుఁడును, రావణదమ్మీయ ద్వ్యర్థికావ్యరచయితయు నగు పిండిప్రోలు లక్ష్మణకవికి, నితనికిఁ బరస్పర మెడ తెగని స్పర్థయుండునది. అట్లే పరవస్తుచిన్నయసూరికి, నితనికి సిద్ధాంతకౌముది సూత్రముల విషయములో చర్చలుసాగి, యది వివాదములుగాఁ బరిణమించి, వారికి భేదాభిప్రాయము లేర్పడినవి. అది కారణముగాఁ జిన్నయసూరి బాలవ్యాకరణ మతని స్వంతముకాదని, హరికారికావళి కనువాదమని, కృష్ణమూర్తిశాస్త్రి ప్రచారముచేయుటకుఁ బూనుకొనినాఁడు. కాని యితనికిఁ బ్రతిపక్షులయిన యాయిరువురిదే పైచేయిగా నుండునది. కృష్ణమూర్తిశాస్త్రికి సాహిత్యచర్చలు (ఎవరితోనైనను) విజయవంతములు కాలేదు. అయిన నితని పాండిత్యముమాత్ర మానాఁడద్వితీయముగా వెలిఁగి యితని కభినవకాళిదాసబిరుదమును బండితలోకమునఁ బ్రసాదింపఁజేసినది. ఇతఁడెంతవిద్వత్ప్రతిభలు, కీర్తిప్రతిష్ఠలు, కలిగిన వాఁడనువిషయమును నితనిసమకాలికులును, ఇతనికి కొంచె మీవలివారు నగు కవులితనిని తమగ్రంథములలోఁ బ్రశంసించుటవలన తెలిసికొనవచ్చును.

> "అష్టకమబ్మహీశ్వర సభాంతర సన్నుత కీర్తిశాలి, భూ
> శిష్ట జనోపకారకర సేవితపాదసరోజు, నిత్యస
> ద్గోష్ఠిని, వైభవేంద్రుఁ, గవికోటిశిఖామణి, గృష్ణమూర్తినిఁ
> ఇష్టుని, శిష్టువంశజలధిశకళానిధి సాశ్రయించెదన్॥"

ఇతని జీవితచరిత్ర మాంధ్రకవులచరిత్రములోను (సర్వశాస్త్రికృతాంధ్రానువాదమైన) అమరుకకావ్యములోని శ్రీనిడుదవోలు వేంకటరావుగారి పీఠికలోను సమగ్రముగాఁ బ్రచురింపఁబడినది. చరిత్రపరిశోధకుల కవి యెంతయిన నుపకరించును.

ఇతఁడు పెక్కు గ్రంథములను రచించినాఁడు.

(1) యక్షోల్లాసము, (2) వల్లీవల్లవోల్లాసము, (3) మదనాభ్యుదయము, (4) కంకణబంధము, (5) అశ్వశాస్త్రము, (6) హరికారికలు. (7) నీలశైలనాథీయము.

ఇవి సంస్కృతగ్రంథములు.

(1) సర్వకామదాపరిణయము, (2) వేంకటాచలమాహాత్మ్యము, (3) పీఠారణ్యమాహాత్మ్యము, (4) నీతిశాస్త్రము, (5) పంచతంత్రము, (6) నాటకదీపము, (7) వసుచరిత్రవ్యాఖ్యానము. ఇవి తెలుఁగు గ్రంథములు. ఇంకను దండకములు, స్తోత్రములు, చాటువులు, పెక్కులున్నవని ప్రతీతి. (ఈగ్రంథములపేరు లమరుక పీఠికనుండి గ్రహింపఁబడినవి).

ఇవిగాక, 'పంచతంత్రము' కూడ నితఁడు వ్రాసినట్లాంధ్రకవుల చరిత్రలోఁ దెలుపఁబడినది. కాని ప్రకృతము ప్రసక్తమయిన "వాయుపుత్రశతకము"నుగూర్చి యెవ్వరును దడవలేదు. శతకకవులచరిత్రలో దీని ప్రస్తావనమే లేదు.

ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో R. No. 298 వ్రాఁతప్రతిగా నీవాయుపుత్రశతకము "హనుమచ్ఛతక" మను పేరితో నున్నది. అందులోనే R. No. 541 వ్రాతప్రతి మఱియొకటి సమగ్రముగా 101 పద్యములు గలిగి పై పేరితోనే యున్నది. మొదటి దానిలో కవిపేరు లేదు. రెండవదిపూర్ణ మయినది. కనుక 101-వ పద్యములోఁ గాకర్లపూడి విజయనృసింహభూపుని ప్రోత్సాహముతోఁదా నాశతకము వ్రాసినట్లు కవి చెప్పుకొనినాఁడు.

ఈ వాయుపుత్రశతకమును కీ॥ శే॥ చెలికాని లచ్చారావుగారు సాధ్యమయినంతవఱకు నిర్దుష్టముగా ప్రకటించినారు. ఇందులో సమగ్రముగా 101 సీసపద్యములున్నవి. "వారిరుహబంధునుతమిత్ర వాయుపుత్ర" యను నెత్తుగీతిలోని కడపటిపాదము మకుటము.

ఈశతకమును గవి యొక్కదినమున వ్రాసినాఁడఁట!

"ఒక్కవాసరమున నొక్కొక్కకృతి ఘనసంస్కృతాంధ్రోక్తుల జతనమమర
జతగూర్చి కవికోటి నుతికెక్కుట దలంప శక్యార్థమగునా రసాతలమున

> నితరులకని జను లెంతురు తెలియక నన్నిది భవదీయ నవనవోద
> యానుగ్రహసుధాప్లవాప్తిచేతనె పొందె నాయవిజ్ఞాన మీచాయ గనుమె"

అని తానే చెప్పుకొనినాఁడు. ఇందులోని పద్యముల నీక్రింది విషయవిభాగముల క్రింద విభజింపవచ్చును :—

(1) స్తోత్రములు 1—13 పద్యములు (ఇందులోఁ దొమ్మిది పద్యము లంత్యప్రాసనియమములు, రెండు ముక్తపదగ్రస్తములు, ఒకటి సర్వప్రాసనియమము, ఒకటి వృత్త్యనుప్రాసము). (2) హనుమంతుని యవతారలీలావర్ణనాంశములు. 14 నుండి 82 వఱకు—(సముద్రలంఘన, సీతాన్వేషణ, రాక్షసవినాశన, లంకాదహన, శ్రీరామపునర్దర్శనాదులు), (3) వాయుపుత్రుని యవతారమైన భీముని సాహసకార్యవర్ణనలు 83 నుండి 94 పద్యమువఱకు. (4) స్తుతులకు స్వవిషయములకు సంబంధించినవి, 95 నుండి 100 వఱకు. (5) పోషకప్రభువును గుఱించి తెలుపునది 101–వ పద్యము.

'వాయుపుత్ర' యను మకుటము నేర్పఱచుకొనుటలో, హనుమంతుని, భీముని (ఇద్దఱిని) గూర్చి శతకములో వర్ణింతమని కవి యుద్దేశముగాఁ గనఁబడుచున్నది. ఆపక్షమునఁ బ్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందలి వ్రాఁతప్రతులలో 'హనుమచ్ఛతక' మని యుండుట లేఖకుల పొరపాటుగా నుండవచ్చును.

భీమావతారమునుగూర్చి పండ్రెండుపద్యములే వ్రాసినకవి యావిషయమునఁ దన యసంతృప్తిని వెల్లడించుచు:—

> తావక భీమావతారము కోటిపద్యముల వర్ణించిన దరలని మహి
> మగలది, నేనది మంజులద్వాదశపద్యముల గణించి హృద్యవృత్తి
> వర్ణించితి, నని గర్వముఁ బూనితిని గాని, చాల, దదంతకు, సరసులైన
> నీవంటివారలు నియతి కృపాత్ము లల్పంబైన ఘనముగా భావమునఁ దలంతురు"

ఇతఁడు సీసపద్యములను పాదవిరామములతో నద్భుతముగా నలంకారయుక్తముగా నడుపఁగలవాఁడయినప్పటికిని, గథాసందర్భములనుగూర్చి వివరించుఘట్టములలో పాదాంతవిరామములు పాటించలేదు. సరికదా! వాక్యాలతోఁ గాకున్నను, పదాంతములతోనైన పాదములు నిలుపలేదు. ఒకపదములోని యక్షరములు తునిఁగి, కొన్ని ముందు పాదము కడపట, మఱికొన్ని వెనుక పాదము మొదట ప్రయోగించుటచేత పాఠకులకుఁ దికమకలు కలిగించినాఁడు. అయిన నితని పద్యములలో

నెక్కడను చెత్తపదములు, పాదపూరణశబ్దములు గాలించినను దొరకవు. ఈక్రింది పద్యములలో పాదాంత నియమము లేకున్నను కథావిస్పష్టీకరణమునందు పొందిక నిరర్థకశబ్దరాహిత్య మేవిధముగాఁ గవి పాటించినాఁడో చూడుఁడు :—

"కాసికొండనుచు రక్కసులమూఁకలపయిఁ బరువెత్తి, యొకచేతఁ బట్టియెత్తి నట్టిగట్టునఁ గొట్టఁ, బొట్టలువగిలి, తలలుబ్రద్దలయి, గుండియలువగిలి, మలుగులులోవిఱిగి, కాళ్లుదునిసి, చేతులు నలిగి, నల్లడఁబడి మెలఁగఁజేసి, కలనఁ దిరుగు నీదుకడిమి గణింపఁగ భారతికైనను బట్టువడదు, నేను వర్ణింప శక్తుఁడనే? మహాత్మ ! దుర్నిరీక్ష విపక్షాతి దుష్టఘోర కృత్య హత్యాదరాయత్త నిత్యహృదయ !"

"చుక్కలుడులుతునా? దిక్కులు పగులుతునా?, కొండ పిండిగా నలుఁగఁజేతునా?, చెట్టులెల్లను నడిమికి విఱుతునా?, సంద్రంబునీరు పైఁజల్లివైతునా?, మూఁడులోకము లేమియుఁగాకుండ తలక్రిందుగాఁ జేసి కలఁతునా?, సుమేరుమందరము, లుదారత బంతులాడుదునా?, యమునైన బెదరిపాఱఁ దఱిమి వెఱపింతునా?, సముద్రగశక్తి, ననుచు రాఘవుబ్రోల, నీవనుసప్రు, డతఁ డధిక ముదమునఁ బొదలెఁగదా, మహాత్మ !"

"జోరౌర, నీసాహసాతిశయం బేమి చెప్పఁగవచ్చు? నిశీథసమయమున, నిసుమంత జంకును జెంద, కిల్లిల్లుఁ జొచ్చి శోధించితి వెచ్చటైన, దశకంఠుపురమునఁ,—దలఁప నిదెంతి?, నవనవయౌవనమున వఱలువారి, నిదురమేనెఱుఁగమి, వదలు నీవీబంధములు గలవారిఁ, గింపురుషయక్షచారణాసురగుహ్యక జలజముఖుల వేలకొలఁదిఁ గనుంగొని లేలుపడని మనము—నీకంటెఁగలుగునె? మఱియొకనికి?"

ఇతని యుభయభాషాపాండిత్యమున కీక్రింది పద్యములు మచ్చుతునుకలుగా గ్రహింపవచ్చును :—

"మైలేని కప్పంపు మస్నిని బొట్టెకై పట్టిన నెఱదిట్ట గట్టు నిల్పి, లిబ్బులుగలదాని కుబ్బున మబ్బున నల కప్పులో ప్రోలి నంటఁగల్లు గంటుపుట్టువుఁ ద్రావు కొంటెగమిం గూర్చి యుక్కఱ వారల యిక్కలెల్లఁ దివయజ్ఞదేవర దవిలించి మనుచేసి, యలదువయక్కఱములు గలయది యొక్కవారల దణి పొగరుక్కడంచి నిక్కువీన్వారువమునపయి నెక్కవేల్పు చిక్కవెడలించినావు, నీవొక్కరుఁడవె"

"శల్కిత శంకుకా శరజాత సంస్ఫోట నీరేక పంకాంధ భారకాక నగలోమ బకరాతి నందన శోభావిజిత లంకముఖకూట జిద్గభీర తాపాలిభర్గోనలాపాత జీర్ణేధి తార్క్ష కంజత్వతృడవనిసంస్థ హావభోజ తేజోవిభవ మలిమ్లుచ లపిత గుణాదిజాత సంతత వశాంక

ఘ్రాణిత సదృక్షగాంధర్వఫణితసత్ర హరిణరించ్ఛోళి కాగ్రియసురవలప్రకాండ బుధ్నవితర్దికాకలితకూట"—

ఇఁక నితని శబ్దాలంకారప్రియమును దెలుపు నుదాహరణములు కూడఁ గొన్ని చూపెదను :—

(అంత్యప్రాస నియమాలంకారం)

"భావి వివరించితా పటుతర నిజపండ, ఖండిత సకలరక్షఃపిచండ,
విక్రమవీక్షణ విస్మిత సురకాండ, మణిమండలద్వయీ మహితగండ,
పటువేగ వేపిత బహుశాతకుంభాండ, యాదోధిరాట్తరణాతిశౌండ,
సకల సద్గుణమణి సంఘసాధుకరండ, పరబలఖండిత బహుళకాండ,
పరమహితారాతితురగ నిష్పందభాండ, వాఙ్మసృణ మాధురీ జితావార్యఖండ,
దైత్యపూఃక్షిప్త బహుపర్వతప్రకాండ !"

(సర్వతః ప్రాస నియమాలంకారం)

"ఆశరక్షిప్త గదాశరపట్టస వాశరణావనీ ప్రమలలీల,
ధీరజనాగ్రియ సార జవాంచిత, నీరజనయన విచారికలిత,
పావన లక్ష్మణజీవనదాన కృతావన కమలహితాన్వవాయ,
సింధురసతరణా, బంధురతర, మద సింధురకర, సమస్థిరభుజాఢ్య
దానవారితె నుతి ధృత దానవారి, దానవాభాంక, రాక్షసదానవాగ్ర
దానవారిత మధుమంద, దానవాహ"

(ముక్తపదగ్రస్తాలంకారం)

"జన్యభయంకర స్ఫారారుణాలోక, లోకత్రయీస్తుతాస్తోకమహిమ,
హిమధరణీధర సమధీరతాంచిత, చితపుణ్య ఫలయోగి చిత్తమహిత,
హిత జాంబవన్ముఖ్య కృత నిర్భరాదర, దరచక్రధరనుత, దస్యుహరణ,
రణధరణీ సమారబ్ధోగ్రలంఘన, ఘన వేగ చలితాబ్ధి ఘూటగమన,
మనసిజారి ధనూరుచి మాన్యకాయ కాయసంగత నిజభక్తగణ, నుతబల,
బలనిషూదన రిపురాజ బలనివారి"

(వృత్త్యనుప్రాసాలంకారం)

"తతవాల కపిజాల నుతలీల ఘనసాల సురసాల హరలోల తర కపాల
త్రిదశారి పురతాళిధృతపాళి కలితాళి జితహేళి సుమపాళి వితతకేళి
మనసార ఘనసార కవితారక శతార కృతసార సువిహార కీర్తిపూర
ధృతమానిజనదాసకృత మానవరదానవబలేన హ్రాదమాన వలనిధాన
నిర్భర ఘనార్భటీ పటునిటలనయన చటులనిటలేక్షణద్ధాగ్ని పటల సమర
వ్రప్రతాప సమావిర్భవహరగర్భ"

(ఏకైకప్రాసనియమాలంకారము)

“విసవిస నబ్ధిపై వెస నీవు చన వేల్పు లసమానశక్తిచే నసదృశుండవో
పసలేదో యనుచు మానసమునఁ దలఁచి, సురస యనుదాని ద్వారసనమాత్ర
నసమయగతిఁ బంపఁ గసకసరాలైన వసముగ నములుట పొసఁగు పంక్తి
నెసఁగు మార్జారనేత్ర సనాథమగు మొగంబు సదంబవృత్తి నాకసముభంగిఁ
బ్రసరణాఢ్యంబు గాఁ జేయఁ బ్రసభముగ, నిరసన మొనరించితౌర, నీనసతఁ గూర్చి
కసవుప్రోఁగున నొకపఱక సరిఁగాగ”

ఇతఁడలంకారములమీఁదిదృష్టితోఁ బునరుక్తులనుగూడఁ బాటించినవాఁడు కాఁడు. ఇతని గడుసుకవిత్వములో నక్కడక్కడఁ దక్రాన్నభుక్తిసమయమున నుపదంశకణములంబోని కొన్ని జాతీయములుసహితము కమ్మగా పడినవి :—

చీమచిటుకుమను, దూదిపింజెలవలె, చెక్కుచెక్కలుగాంచు, గంపకొంగలగమి, మడమత్రిప్పక, ఒక్కబడిగా, మార్మొదల్రవేయు, గుడుగుడుప్రాణము, చిడిముడిపాటు, గుండెచెక్కలుగా, నిండవైచు, గాటంపుకోడవలి, గులగులపైపోవు, మిడుతుమిడుతు కనుంగొని, మెత్తగాగూటించు, పిడిగ్రుద్దులు, తొంగితొంగిచూచు, మోఁచేతిపోట్లు, కలవిలపడు, దొంతరపెట్టు, తెఱపిలేక, గుదిగాఁగూర్చి, పిండిపిండిచేయు, ఇల్లిల్లుచొచ్చు, ముక్కుపైకెక్కువేలు, గోటమీటు, హెచ్చుపెరుగు, మిద్దెటుంగరము, చెవుడెత్తు, కటారీలు, పెడచెంప, చెడుగుడుగా, దడబిడగా, కోలకుప్ప, కొండగాలి, చిమ్మనగ్రోవి, ముక్కుదూలాలు, పిక్కబెదురు, పలుగాకి, కత్తులబోను, ఇసుమంత, డీకొను.

ఈశతకము ధ్వన్యనుకరణములకుఁ బుట్టి :—

చంగుచంగున దాఁటు,—చివాలున ఉఱుకు,—గొలగొలజాఱు, గుభగుభగూలు, జలజల రాలు, గిరగిరఁ దిరుగు, గడగడ వడఁకు, చిటచిట రవము, ఘుమ్మఘుమ్మని విసరు, ఘణంఘణనినదము, పటపట గొఱుకు, పెటపెట విఱుచు, బొటబొటగ్రమ్ము, సొటసొటఁ గాఱుఁ, పుటుకుపుటుకున పేటులు, రివ్వురివ్వుమని త్రిప్పు, కరాలుకరాలుమని, కంఠము ద్రెంచు, రింగురింగుమను, కఱకఱనఱకు, చిఱుకుచిఱుకున చిమ్ము, పెళపెళమ్రోఁగు, దడదడబడు, విసవిసచను, ఘణంఘణ నినదము, గిఱ్ఱుగిఱ్ఱునఁ ద్రిప్పు, గఱ్ఱున త్రేన్చు, గుటుకుగుటుకున మ్రింగు, ఘుటఘుటనిస్వనము, గొరగొరఁ దాఁకు, ఖణింగుఖణింగున గదనడంచు.

“వాయుపుత్రశతకము” సరస్వతి కలంకారభూతమయిన శతకములలో నొకటి. ఈశతక పద్యము లిదివఱకే ఆ యా సందర్భముల ననుసరించి చాల యుదాహరించితిని. ఇఁక మచ్చుపద్యములని మరల తెలుపవలసిన యవసరము లేదనుకొందును.

—◆◆—

# పోలిపెద్ది వేంకటరాయకవి

క్రీ॥ శ॥ 1800—1875

పోలిపెద్ది వేంకటరాయకవి (1) వేణుగోపాలశతకము (2) లావణ్యా శతకము లేకాక, తిట్లదండకమునుగూడ చెప్పినాఁడు. ఇతఁడు వేణుగోపాలశతక మెవరిప్రోత్సాహమునులేకయే, స్వబుద్ధిచేతనే వ్రాసినాఁడని తోఁచుచున్నది. పైఁగా నితఁడు తిట్లదండకములోఁ దాను వేణుగోపాల భక్తుఁడని చెప్పుకొనినాఁడు. ఆభాగముమాత్రము :—

"వేదవేదాంత తత్వజ్ఞుఁడన్, వైదిక శ్రేష్ఠుఁడన్, సజ్జన స్తవ్యుఁడన్, సాధుసాంగత్య మున్నట్టివాఁడన్, సదాచార శీలుండ, శ్రీ వేణుగోపాల సద్భక్తుఁడన్, పోలిపెద్దాన్వయాబ్ధీందుతుల్యుండ, శ్రీ వేంకనార్యుండ, నాస్థాన విద్వాంసుఁడన్, సత్కవీంద్రుండ, శ్రీకారువేటీ పురాధీశు, శ్రీమన్మహా మండలేత్యాది వాక్యాళి సంశోభితున్, రాజరాజేశ్వరున్, మాకరాడ్వంశ సంజాతు, శ్రీ వేంకటప్పెరుమాళ్ల రాజాశ్రితుండన్, సదా రాజ సన్మానితుండన్"—

దీనినిబట్టి కవి సదాచారముగల వైదిక శ్రేష్ఠుడనియుఁ గార్వేటినగర రాజేంద్రుఁడయిన మాకరాడ్వంశస్థుఁడగు శ్రీ వేంకట పెరుమాళ్ల రాజాస్థాన విద్వత్కవీశ్వరుఁడనియు స్పష్టమగుచున్నది.

కార్వేటినగరములో నెలకొన్న వేణుగోపాలస్వామి యీకవికి కులదైవమగుటచేత నప్పటి సంస్థానములోని యక్రమములనేకాక, సంఘములోఁ గనిపించు దురాచారములను దీవ్రముగా విమర్శించుచు నాదేవుని పేరనే మకుటరచన చేసినాఁడు. ఆతరువాతనే యితనికి రాజాస్థానములోఁ బ్రవేశము దొరకినట్లు తెలియుచున్నది. అప్పటి ప్రభువైన శ్రీకుమార వేంకటపెరుమాళ్ళరాజులుంగారియొద్ద మంత్రిగా నుండిన వ్యక్తి తన్ను ముందుగా చూడనిదే, యెవరుగాని ప్రభుదర్శనము చేయరాదనే యహంభావము గలవాఁడఁట! ఆవ్యక్తిపేరు కవి చెప్పలేదు. కాని యతని యవలక్షణములనుగూర్చిమాత్రము వేణుగోపాలశతకములో నీవిధముగ వర్ణించినాఁడు :—

"పీనుఁగు గంధపుమోము, పిల్లిమీసంబులు, కట్టెశరీరంబు, కాకినలుపు,
ఆర్పుకన్నులు, వెన్నునంటినయుదరంబు, నరుఁగు చారలమూంపు నోటికంపు,

చెయిచెయ్యి దిగరాచి చెక్కిళ్లురుద్దుట, దవడలుసొట్ట, పాదములుమిట్ట,
ఒరుకీవిజూచి మేలోర్వలేకేడ్చుట, దౌర్భాగ్యగుణములు తోనియాస,
ఇట్టి యవలక్షణవుమంత్రి నేర్పరించ, గోరల కపకీర్తిఁ దెచ్చు నాదుర్జనుండు”

తన కపకీర్తిదాయకమైన యీ వేణుగోపాలశతకమునుగూర్చి యామంత్రి విని సన్నిహితులయిన పండితులసలహాల ననుసరించి, వేంకటరాయకవికిఁ బ్రభువర్యుని 'బేటి' చేయించినాఁడని తెలియుచున్నది. ఈకవీంద్రుని విద్వత్ప్రతిభకు, మెచ్చుకొన్ని, రాజుగారితనిని 'లావణ్యశతక'మను శృంగారవిషయికమయిన కృతిని నిర్మించుమనినట్లు కవియే తనలావణ్యశతకములోని మొదటి సీసపద్యములోఁ దెలుపుకొనినాఁడు.

“శ్రీమదఖండలక్ష్మీప్రసన్నుఁడు మాకరాట్కులాంభోధి కైరవహితుండు,
సరసుఁడౌ వేంకట పెరుమాళ్ల రాజేంద్రుఁ డొకసారి కొలువుకూర్చుండి, నన్నుఁ
గని పోలిపెద్ది వేంకటరాయ సుకవీంద్ర! రమ్మని ప్రేమమీఱంగఁ బురుష
విరహాంబు, శ్రీ హరిస్మరణ శృంగారంబుగను, జమత్కృతి శతకంబొనర్పు
మనిన, శారద నేకదంతుని భజించి నేరచించెదఁ బద్యముల్ నేర్చినటుల
నీదుకృపలేక కృతిసేయ నేరికయిన వశమె శ్రీరామరామ! లావణ్యసీమ!”

ఇతనికిఁ బ్రభువు “నవరసాలంకారశృంగారవాణీవిలాసపుర” మను 'బేచరు' గ్రామమును వంశపారంపర్యముగా ననుభవించుకొనుహక్కుతో శ్రోత్రియముగా ధారాదత్తము చేసినాఁడు. ఇది చిఱుతని తాలూకాలో నున్నది. జమీందారీలెక్కలలో (ఆకాలములో) పై పేరుతోడనే యాగ్రామము సూచింపఁబడుచుండునది. కొంతకాలమున కది భటవృత్తిమాన్యముక్రింద వారి 'రికార్డు'లలో 'దాఖలు' కాఁజొచ్చినది. ఇప్పటికిని, ఆశ్రోత్రియమును కవిగారి మునిమనుమఁడు (అతని పేరుకూడ వేంకటరాయఁడే) 60 యేండ్లపడిలో నున్నవాఁడనుభవించుచున్నాఁడు.

కవికాశ్రయమిచ్చిన యీ కుమార వేంకటపెరుమాళ్రాజులుంగారు క్రీ॥ శ॥ 1884 (తారణ) సంవత్సరములోఁ జనిపోయినట్లు “పద్మావతీపరిణయ”మను సంస్కృతకావ్యములో నున్నది. ఆపక్షమున నీ వేంకటపెరుమాళ్రాజులుంగారు పందొమ్మిదవశతాబ్దపు ప్రథమపాదములోఁ బుట్టి క్రీ॥ శ॥ 1860 ప్రాంతములోఁ బట్టాభిషిక్తులయి యాతరువాత క్రీ॥ శ॥ 1884 వఱకు రాజ్యము పరిపాలించిరనుట సహేతుకము.

దీనికి మఱియొక యాధారముకూడ లేకపోలేదు. పై వేంకటపెరుమాళ్రాజులుంగారి తమ్ములయిన తిరుమలరాజులుంగారికి గరుడాద్రి

సుబ్రహ్మణ్యావిద్వత్కవి తనచే రచింపఁబడిన "శత్రుఘ్నవిజయ" మను కృతినంకితము చేసినాఁడు. ఆగ్రంథము శా. శ. 1786 (ప్రభవ) అనఁగా క్రీ॥ శ॥ 1864 సం॥ రం॥ పూర్తియయినట్లుగా గ్రంథాంతములో నున్నది. ఆసమయములో శ్రీకుమార వేంకటపెరుమాళ్రాజులుంగారే రాజ్యపాలకులు. ఆతరువాత 20 ఏండ్లు ప్రభువులుగానుండి ముందు పేరాలో సూచించినట్లు క్రీ॥ శ॥ 1884 లో మరణించిరను నిర్ణయము సత్యదూరముకాదు.

పై కాలనిర్ణయము ననుసరించి మనకవియు, నతనిపోషక ప్రభువునకు ఏవో కొన్నియేండ్ల తేడాతో, సమకాలికుఁడై యుండినాఁడనుటలో సందేహము లేదు. ఈసమకాలికత్వమును వారితరువాతి వంశపరంపర దృఢపఱచుచున్నది. శ్రీకుమార వేంకటపెరుమాళ్రాజులుంగారికి బ్రహ్మ (బొమ్మ)రాజు, కావేరిరాజు, సింగరిరాజను మువ్వురు పుత్రులు. బ్రహ్మరాజుపుత్రుఁడు తిరుమలరాజు. అతనికిఁ గుమార వేంకటపెరుమాళ్రాజు, కుమారస్వామిరాజు నను వారు పుత్రులు. వీరిరువురికిని సంతానము లేదు. అందు మొదటివారు (కుమార వేంకటపెరుమాళ్రాజు) 25 సంవత్సరముల (దాదాపు) క్రిందట పట్టాభిషేకము చేసికొని నేఁటికి 6—7 సంవత్సరములకు పూర్వము గతించిరి. రెండవవారయిన కుమారస్వామిరాజా బహాదరువారు 1951 సం॥ న, వయోజనవోటింగు ఎన్నికలలోఁ బ్రజాపార్టిపక్షమున మదరాసు శాసనసభ కెన్నికొనఁబడి 1952 సం॥రం నవంబరుమాసములో స్వర్గస్థులయిరి.

చెప్పవచ్చిన దేమనఁగా, మొదటి కుమార వేంకటపెరుమాళ్రాజులుంగారికి రెండవకుమార వేంకటపెరుమాళ్రాజులుంగారు మూఁడవతరమువారు. వేణుగోపాల లావణ్యశతకములకర్త యయిన వేంకటరాయనికి రెండవ (సజీవుఁడైన) వేంకటరాయఁడు మూఁడవతరమువాఁడు. కావున ప్రభువుయొక్క కవియొక్క వయస్సులలో నంతగా తేడా యుండదు.

ఈ పోలిపెద్ది వేంకటరాయకవి కవితాప్రౌఢిమ యసామాన్యమైనది. ఇతని శతకసీసపద్యముల గమకమే యొక క్రొంగ్రొత్త నాజూకుతనము సంతరించుకొనినది. నన్నయాది ప్రాచీనుల కావ్యములకుఁ బెద్దనాదిమధ్యకవుల ప్రబంధములకు నెంతభేదము కనిపించుచున్నదో యంత తేడా యితని సీసపద్యములకుఁ దక్కినశతకకవుల సీసపద్యముల కగపడును. జాను తెనుఁగు పలుకుబడులు, జాతీయములు మొదలైనవి,

ఈతని సొమ్ములు. అప్రయత్నముగా నట్టివి ఇతనిపద్యములలో సందర్భానుసారముగావచ్చి కూర్చుండును. అట్టి కవితకుఁ బ్రభువు ముగ్ధుఁడై నాఁడనిన నబ్బుర మేమున్నది ?

ఇతఁడు కుకవిదూషణ చేయుచు, తెలుఁగుజాతీయకవిత్వస్వరూపమును నిర్ణయించు సందర్భములోనిది ఈక్రిందిపద్యము :—

"పాకంబునకుఁదగు ఫణితిఁ గానక, కిరీటము పెట్టినట్లు నీమములు లేక,
తెనుఁగు పోయెడుజాడ తెలియఁజాలక, పెక్కు శృంగారరీతులు చేతఁ గాక,
గ్రామ్యదేశ్యమ్ముల క్రమము తెలుఁగక, జాతీయములుగూర్చ సరణిరాక,
పెళుచుమాటల దొంతి పేర్చుచు, సాధారణములౌ యతిప్రయోగములు లేక,
ఒకరికయితను గని హేళనోక్తులాడు కుకవికుంఠలమూతిపైఁ గొట్టునటుల
నేనొనర్చెదఁ బద్యముల్ నీదుకరుణ" (లావణ్య శతకము)

తెనుఁగుపోయెడు జాడ తెలియవలెనఁట ! గ్రామ్యదేశ్యమ్ముల క్రమము తెలుఁగవలెనఁట ! జాతీయములు గూర్పవలెనఁట ! పెళుచు మాటల (చెత్తపదములేమో) దొంతి పేర్చరాదఁట! ఇవి యితని కవిత్వ నియమములు. తానీనియమములను పాటించుచునే తన రెండుశతకములను వ్రాసినాఁడని వానిని చదువువారికి స్పష్టమగును.

ఇతనికవిత్వములో భావగోపనమనునది యెక్కడను లేదు. ఏనీతి నైనను, బూతునైనను, చెప్పవలసివచ్చినప్పుడు 'ఖరాఖండి'గా, కచ్చితముగా సూటిగా చెప్పువాఁడు. ఈవిషయములో నితఁడు "నీతులు బూతులు లోకఖ్యాతులురా" యనిన కవిచౌడప్ప కన్నయే యగును. జుగుప్స, రోఁత, యను వస్తువు లితని కేకోశమునను లేవు.

ఇతని మొదటికృతియైన వేణుగోపాలశతకమునకు "మదరిపువిఫాల, మునిజనహృదయలోల, వేణుగోపాల, భక్తసంత్రాణశీల"— యనునది మకుటము. ఇందులో 100 కి తక్కువగనే పద్యములున్నవి. ప్రాచీనపు వ్రాఁతప్రతులలో నెందులోనను 85 పద్యములకు మించిలేవు. 1900 సం॥రంలో రంగవిలాసముద్రాక్షరశాలలో నచ్చయిన ప్రతిలో 83 పద్యములుమాత్రమే కలవు. మఱియొక ముద్రితప్రతిలో (చాలప్రాఁతదియేకాని, ముందు వెనుక పుటలు లేనందున ఎప్పటిదో తెలియదు) 84 పద్యములున్నవి. ఇప్పటి ముద్రితప్రతులలో 90 పద్యములకు మించియున్నవి (కాని 100 కి లోపు). వీనిలోను ఇటువంటి తక్కిన 'బజారు' ప్రతు

లలోను, రామలింగేశాదిశతకముల సరుకు కొంతవఱకుఁ గలసియున్నది.

నాయొద్దనున్న వేణుగోపాలశతక ప్రతులేడింటిలోను మిక్కిలి ప్రాచీనమైనది. క్రీ॥ శ॥ 1880 లో ముద్రింపఁబడినది. అర్వాచీనమైనది క్రీ॥ శ॥ 1949 లో అచ్చువేయఁబడినది. మొదటిదానిలో 83 పద్యము లున్నవి. రెండవదానిలో 96 పద్యములున్నవి. మిగిలినప్రతులలో 80-90 పద్యములకు నడుమ పలుసంఖ్యలుగా నున్నవి. పైఁగా క్రీ॥ శ॥ 1883 ప్రతికి 1949 ప్రతికి పాఠభేదములు పరిశీలించుటలో నా రెండుప్రతులకును తేడా హస్తిమశకాంతరముగాఁ గనిపించుచున్నది. మూలకవిభావము లను బరిష్కర్త లంతుపట్టుటకు వీలులేనివిధముగాఁ బాదములకుఁ బాద ములే పూర్తిగా మార్చిరి. అట్లు చేయుటవలన, బొత్తిగ కవిభావములనే చాలచోట్ల ధ్వంసీకరించిరి.

పరిష్కర్తలైనవారు ప్రభుత్వము నిషేధించునను భయముచేత మూలగ్రంథములోని జుగుప్సాంశములను దొలఁగించి, యాకుకందని, పోఁకకుఁబొందని, తమ భావములను జొప్పించి, గ్రంథకర్తల యభిప్రా యములను హత్యచేయుటకంటె నాచోట్లలోఁ జుక్కలు పెట్టి విడిచివే యుట మేలు. లేదా, యాగ్రంథపుటూసే యెత్తక యుండుట యంత కంటె నుత్తమము. మన సారస్వతములో మహాకావ్యములన్నిటికి నీయరి ష్టము—కాదు—అంటుజాడ్యము పూర్తిగా వ్యాపించి, పరిపాటిగా జరుగుచుండుట నరికట్టకున్న భాషామహాదేవికి, నామె నారాధించిన పూర్వవిద్వత్కవులకు నెంతయో ద్రోహము చేసినవార మగుదుము. ఉదాహరణముగాఁ గూచిమంచి జగ్గకవి చంద్రరేఖావిలాపమును దీసి కొనినఁ జాలును. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారపు వ్రాఁతప్రతికిని ముద్రితప్రతికిని పోలికయే లేదు. ఈవిషయమయి, యిదివఱకే మన పెద్దలు శ్రీగిడుగు వేంకటరామమూర్తిపంతులువారివంటి మహావిద్వాంసు లనేకులు నెత్తిని నోరుపెట్టుకొని ఘోషించినారు. కాని కాలపరిస్థితులను బట్టి, యట్టివారి ప్రయత్నము లేటికెదురీతగను రేవలమరణ్యరోదనము గను బరిణమించినది. ఇఁక నిప్పటి భాషాభ్యుదయకాము లీవిషయమున నొక యాందోళనము—మహావిప్లవము లేవఁదీయుట యెంతయైన నవ సరము. దీనినిగూర్చి యీసందర్భమునఁ జెప్పుట యప్రస్తుతము. ప్రకృ తమను సరామః!

వేణుగోపాలశతకములోని పద్యములు పెక్కువిషయములకు సంబంధించినవి. అందులో ముఖ్యముగా నాకాలములోని రాజులను, ప్రభువులను, మంత్రులను, అధికారులను, వారిచర్యలను తీవ్రముగా నిరసించుచు చెప్పిన పద్యములు, సామాన్యనీతుల నుటంకించు పద్యములు నెక్కువగాఁ గనిపించుచున్నవి.

ఈమహాకవి లోకవృత్తములను స్వానుభవముచేతఁ జక్కఁగా గ్రహించిన గొప్పలౌక్యుఁడు. అద్భుతమేధాసంపన్నుఁడు. సీసపద్యములు నడపుటలో నీకవిధోరణి తక్కిన సీసశతకకారుల కలవడలేదనిన, నతిశయోక్తి యనిపించుకొనదు. అడిదము సూరకవి రవంత యితనితో మొగ్గుచూపునేమో? కాని గాటయిన శబ్దములు సూటిగా నెదుటివారి మనస్సులలో నాటుకొనునట్లు చేయుటలో నితఁ డతనికంటె ఘనుఁడు. అఖండుఁడు. ఇతనికి భావదాస్య శబ్దదాస్యము లేకోశమున లేవు. రసోచితాలంకారములతో శబ్దము లనర్గళముగ దొర్లుకొని పోవుచుండును. ఇంతటి యుద్దండకవీంద్రుఁ డేదైన కావ్యము రచింపకపోవుట తెలుఁగు వారి దురదృష్టము. అయిన నాంధ్రభాషారమ కీతని వేణుగోపాలలావణ్యాశతకద్వయము రెండుపేటల ముత్యాలహారము. అందులోని పదకవితాతని తిట్లదండకము.

ఇతఁడు కవులనిగ్రహానుగ్రహాదిక సామర్థ్యములను వారియాన్నత్యమునుగూర్చి :—

"కలకొద్దిలో వరములు దెల్పి మన్నించి యిచ్చినవాని దీవించవలయు
సిరిచేతమత్తుఁడై పరువెఱుంగని లోభి దేబెను పెల్లునఁ దిట్టవలయుఁ
దిట్టిన నప్పుడే తెలిసి ఖేదమునొంది యింద్రుఁడైనను బిచ్చ మెత్తవలయు
దీవించెనా, చాలదీర్ఘాయువును బొంది బీదైన నందలం బెక్కవలయు,
నట్టియాతఁడుసుకవి, లేనట్టియతని కవియనఁగ నేల? కవిమాలకాకిగాఁడె?" ||మద||

అని వ్రాయుటవలనఁ దాను తనప్రత్యర్థియైన కోపూరిరామయ్యయను రాజకీయోద్యోగిపైఁ జెప్పిన 'తిట్లదండకము' మూలమున నతని మరణమునకు కారకుఁడయియుండు ననుట ఋజువగుచున్నది. *

* ఇతఁడు పైజెప్పిన శతకద్వయమేకాక 'తిట్లదండక' మను చిన్నకృతికూడ నితఁడు చేసెను. అందు వచ్చినతిట్టు మరలరాదు. అద్భుతమయిన ధారాధోరణి. ఇట్టి దండకమునకుఁ గారణమయిన యితివృత్తము నించుక తెలిసికొందము.

కార్వేటినగరమున ఆకాలమున రాచనగరున నిత్యావసరవస్తుభాండారాధ్యక్షుఁడుగ (ఉగ్రాణాధికారిగ) కోపూరిరామయ్యయను నియోగిబ్రాహ్మణుఁ డుండెడివాఁడు.

ఇతఁడు రాజాస్థానమును బ్రవేశింపఁగనే ప్రభువు మంత్రులు తప్పఁ దక్కినవారందఱు లేచి గౌరవించువారఁట! ఒకదినమున నితఁడు సభకుఁ బోఁగా రాజుగారమితముగా నభిమానించు నొకానొక వేశ్యకాంత లేవలేదఁట! అపుడు రుద్రుఁడై కవి యిట్లు చెప్పినాఁడఁట!

"ఆస్థానమందు విద్వాంసులఁగని లేచి, మ్రొక్కఁబూనని వారమోహినులను,
దలఁగొఱిగించి, మెత్తనిసున్నముసుబూసి, బొగ్గుగందంబున బొట్టుమర్చి,
చెప్పులమెడఁగట్టి, చింపిచేఁటలఁగొట్టి, గాడిదపైఁబెట్టి, కాలమెట్టి
తటుకున గ్రామప్రదక్షిణంబొనరించి నిల్చినచోట పేణ్ణీళ్లుచల్లి
విప్రదూషకులను వారివెంటనిచ్చి సాగనంపించవలయును శమనుపురికి" ||మద||

ఆకాలపురాజుల ప్రవర్తనలను వారినాశ్రయించిన వారి నడవడులను వివరించుచు, రాజు లెట్లుండవలయునో బోధించినాఁడు. ఈక్రింది పద్యములు రాజులకు సంబంధించినవి :—

1. "కొండెసిగల్, తలగుడ్డలు, పాకోళ్లు, చలువవస్త్రములు, బొజ్జలు, కటార్లు,
కాసికోకలు గంపెడేసిజన్నిదములు శాలువా జలతారు డాలువార్లు,
సన్నంపు తిరుచూర్ణపున్నీటునామాలు, జోల్లువిడెమ్ములు వల్లెవాట్లు,
దాడీలు వెదుగాకుతరహా సొగసుకోర్లు అంతకంతకు 'గార్లటంచుఁ'బేర్లు
సమరమునఁ జొచ్చి లోమ్ము గాయములకోర్చి శత్రువులఁజంప నేరని క్షత్రియులకు
ఏల? కాల్పనె? యీ వట్టియెమ్మెలెల్ల"

---

ఆతని నివాసమందిర మగ్రహారమున మన కవియింటికిఁ బ్రక్కదే. ఒకానొకనాఁడు రామయ్యయింటిదొడ్డిలోని కూరపాదులలోని మొలకలను వేంకటరాయకవి బఱ్ఱె మేసిపోయినది. అదిచూచిన రామయ్యభార్య, కామాక్షమ్మ క్రోధావేశమునఁ గవిగారియింటికిఁబోయి వారితోఁ దగవులాడెను. అప్పుడు కవి ఆమెంగని "అమ్మా, ఏదో తెలివిలేనిగొడ్డు చేసినపనికి ఇంత యల్లరెందులకు? దానిని స్వేచ్ఛగా మేఁతకు విడిచినతప్పమాదే. నీతోఁటకూరమొలకలక్రయము వలసిన నిత్తును. పొరపాటును క్షమించుము" అని బతిమాలెను. కాని యీర్ష్యావరురాలయిన కామాక్షమ్మకు ఆమాటలు రుచింపమిచేఁ జీటికిమాటికి సాకునపోకున కవిని అతని కుటుంబమును దిట్టుచు నేయుండెను. ఆ శ్లోకసంవత్సరము గడచెను.

ఒకనాఁడు ప్రాతఃకాలమున మనకవి యెటకోపోయివచ్చుచు అమ్మలక్కలతో నింటివాకిటనిలిచి బిగ్గఱగాఁ దన్ను దూషించు కామాక్షమ్మనుజూచి క్రోధము పట్టజాలకయు, రాజోద్యోగిభార్య కావునఁ దటాలున నేమియుఁజేయజాలకయు విసవిస ప్రభువుచెంతకేఁగి "రాజేంద్రా, కోపూరి రామయ్యభార్య స్వల్పదోషమును బురస్కరించికొని మమ్మెల్ల నొక్కయేడాదిగా నాడిపోసికొనుచున్నది. దీనికి బ్రతీకారమే లేదా?" అని జరిగినవిషయమంతయు బూసగ్రుచ్చినట్లు నివేదించి "క్షత్రియ ప్రభువులైన తామొక్కక్షణముగూడ నిట్టియవినయ మోర్వరు. అప్పుడే తల దీయించియుందురు. బ్రాహ్మణుఁడను గనుక నోర్వదగినంతకాల మోర్చితి. ఇఁక నోర్వఁజాలను. క్షాత్రమునఁ బ్రతీ

(ఇతని పోషకప్రభువులగు కార్వేటినగరాధీశులు సూర్యవంశ క్షత్రియులు. కాన క్షత్రియప్రభువులనే యిందుఁ బేర్కొనినాఁడు).

2. "పరదళంబులఁ గాంచి భయముచే నుఱికిన రాజు గాఁడతఁడు గోరాజు గాని"

3. "పానంబు, జూదంబు, పరసతిపైబాళి, ధనకాంక్ష, మోహంబు, తగనియాస అనుదినంబును వేఁట, యధికనిద్దురఁ గొంట, పేదఱికంబును, పిఱికితనము, అతిక్రౌర్యమును, మందగతి హెచ్చు, కోపము, అమితవాచాలత, అనృతములును, ఖండితం బాడుట, గర్వంబు, ప్రజ్ఞలు, విడువని వైరంబు, విప్రనింద, ఆప్తజనములదూఱుట, నసురతిండి, మానవేంద్రులపదవికి హానులివ్వి"

---

కారము చేయింతురా? కాదేని బ్రాహ్మ్యమున నేనే చేయుదునా?" అనఁగానే యేలిక కవిం జూచి 'యేమి చేయుమందు' రనెను. కవియుఁ 'మీరైనఁ దలఁ దీయింతురు. కాని అది బ్రాహ్మణస్త్రీహత్య యగుటచే మనకిరువురకు నరకము తప్పదు. కానఁ దల గొఱిగింపుఁడు. చాలును' అని మనవి చేసికొనఁ బ్రభునకుఁ బచ్చి వెలగకాయఁ గుత్తుక నడఁచికొన్నట్లయి, కొంతసేపేమియుఁ బలుకకుండి, తుదకు "మేమట్టి కార్యమునకుఁ బూనుకొనుట భావ్యమా? లోకమేమనుకొనును? ఇక్కార్యము అపకీర్తికారకము గదా! శాంతింపుడు" అని ప్రాధేయపడెను. "అగుచో నేనే ఆమె తల గొఱిగించెదను. అంతవఱకు నాకు శాంతి కలుగదు ప్రభూ! మన్నింపుఁడు" అనెను. అయినను రామయ్యను విచారించి మందలింతమను నూహతో రాజేంద్రుఁ డాతనికొఱకు హర్కారును బంపెను.

ఏలినయానతి ననుసరించి సత్వరముగ రామయ్య అతని సన్నిధానమునకు వచ్చుచుండ, అల్లంతదూరముననే ఆతనిం గాంచి దండతాడిభుజంగమువలె వేంకటరాయకవి మండిపడి "ఛీఛీ, ఒరే పాతకా, ఘాతకా, ప్రేత" అని యారంభించి "కోవూరిగామా, అయో రామ, రామా!" యని దండకము ముగించెను. దానిని బఠించుచున్నంతసేపు నృపాలుఁ డాకవివంక గ్రుడ్లప్పగించి చూచుచుండి నిట్టూర్పుపుచ్చి లేచి యంతిపురిం బ్రవేశించెను. కవీంద్రుఁడును రోషభారము తగ్గిపోవ శాంతించి యింటిదారినిబట్టెను. దురదృష్టవంతుఁడగు కోవూరి రామయ్య ప్రభునియెదుట దనకు జరిగిన పరాభవమునకు ఖేదమొందుచుఁ, దలవాంచి పరాకుతో నింటిని జొచ్చునపుడు ద్వారబంధము గాటముగ శిరమునకుఁ దగిలి గొప్పగాయమయి, పడుకఁ బట్టి వేదనాదోదూయమానుడై కొలఁది దినములలో మరణించెను. కవికోరికయు సిద్ధించెను.

ఈచరిత్ర ముప్పదియైదేండ్లనాఁడు మాయూర (కార్వేటినగరమున) నాకు వేదాధ్యాపకగురువులుగ వెలసిన శ్రీతిప్పావఝుల అనంతయ్యగారు చెప్పఁగా వింటిని. వారికప్పటివయస్సు డెబ్బది దాఁటినది చరిత్రకాలమున వారు చాలఁ జిన్నవారఁట.

"తిట్లదండకము"నకయి నేనిరువది యేండ్లుగఁ బ్రయత్నింప నిప్పటికి దొరకినది. పుత్తూరు బోర్డు ఉన్నతపాఠశాలా ప్రధానాంధ్రపండితులగు విద్వాన్ శ్రీ టి. శ్రీనివాసరావుగారు సంగ్రహమగు పైచరిత్రతోఁ గూడ తిట్లదండకము సంపాదించి పంపినందులకు వారికెంతయు గృతజ్ఞుడను.

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ,

(త్రిలిఙ్గ 27 ఏప్రిలు 1953).

4. ఘనము నల్పంబు నెఱుఁగక కలియుగమున నవని నడుతురు మూర్ఖులైనట్టిదొరలు"
5. క్ష్మాతలేంద్రులసేవకష్టంబు, వార లిత్తురని గర్వముననిక్క యెగురరాదు"
6. "మద్యపాయులతోడ మచ్చిక కారాదు, బడవాల గొప్పగాఁ బట్టరాదు, శాత్రవునింట భోజనము సేయఁగరాదు, సన్న్యాసులను గేలిసలుపరాదు, దేవభూసురవృత్తి తెరువునఁ బోరాదు, పరులాండ్రఁగని యాసపడఁగరాదు, కంఠోష్ఠునకు నధికారమీయఁగరాదు, చెలఁగి లోభిని చెంతఁజేర్పరాదు, లంచగాండ్రను దగవులకుంచరాదు, మాతృపితరులయెడ భక్తి మఱువరాదు"
7. "రాజులమంచు బొజ్జలు నిరిరినఁగాదు, అనిమొనలో నఱుకాడవలయు"
8. "ఏకచక్రముగ భూమేలినరాజైన కడ కేడుజేసెల కాటికేను"

రాజోద్యోగులనుగూర్చి నిర్దాక్షిణ్యముగ ఖండించుటలో నీతఁడందె వేసినచేయి. వారి యవినీతులను నిరసించుచు నితఁడు చెప్పిన యొక్కొక్కపద్యము నక్షరలక్షల విలువ కలవి. మంత్రులు దివానులు, బక్షీలు, ముసద్దీలు, శిరస్తాలు, రాయసములు, తుదకు గ్రామాధికారులు కూడ నితని చేతిగంటముపోటు తప్పించుకొనలేకపోయిరి.

మంత్రికుండవలసిన లక్షణములనుగూర్చి యీక్రింది పద్యములో కవి యుద్ఘాటించిన విధము చూడుఁడు :—

"కనుముక్కుతీరు, చక్కనికాంతిపొందిన శుభలక్షణంబును; సూక్ష్మబుద్ధి, ఘనత, వివేకవిక్రమము, బాంధవ్యవిమర్శ, విలాసంబు, మానుషంబు, సరసవాచాలత, సాహసం, బొకవేళ విద్యావిచక్షణ, విప్రపూజ, వితరణ, మేలుభూపతియందు భయభక్తి, నీతియు, సర్వంబునేర్చునోర్పు, స్నానసంధ్యాద్యనుష్ఠానసంపన్నత, గాంభీర్యము, పరోపకారచింత, ఇట్టిమంత్రిని జేర్చుకొన్నట్టిదొరకు కీర్తి, సౌఖ్యము, సకలదిగ్విజయము, సిరి గలిగియుండును దోషముల్దొలఁగి చనును"

(ఇదిపంచపాదిసీసము : ఎత్తుగీతమును పంచపాదియే).

ఇతడు దుర్మంత్రులను తెగతిట్టినాడు :—

1. "విద్యాధికుల రాజు వివరించినిలిపెనా?, ఇందరేమిటికంచుఁ గుందుచుండు మోయీను కుగ్రాణముఁజెప్పఁ గొట్లగింజలకు బరాతముల్ సరవిఁవ్రాయు, తిండికిఁ జేటుగాఁ బండితులేల, తెప్పున సెలవిమ్మని పోరుచుండు, బారిసాల్వాలుదెచ్చి బహుమతులిమ్మన్న చలువకరీదు వస్త్రములనిచ్చు, నిట్టి యపకీర్తిమంత్రిని బెట్టఁదగదు మంచిమాటల సాగనంపించవలయు"
2. "మంత్రులమని బొంకుమాటలాడినఁగాదు ఇప్పింపనేర్చి తామీయవలయు"
3. "యాచకులఁజూచి, తలద్రేవేలవైచి, పెద్ద సున్న జుట్టుఁగదా ముండగన్నకొడుకు"
4. "రాజసభలఁ బరోపకారములు దెలుప శ్రేష్ఠులకుఁగాక దుష్టులు చెప్పఁగలరె"

5. "పలువ మంత్రైన దొరలకు పరువులేదు"
6. "ధర్మవిదులైన రాజసంస్థానములను జేరు నొక్కొక్క చీవాట్లమారికుంత"
7. "మానాభిమానముల్ మాని ప్రవర్తించు మంకుగులాములు మంత్రులైరి"
8. "పలువతో సరసంబు ప్రాణహానియొనర్చు దుష్టుఁడు మంత్రైన దొరను జెఱచు"
9. తనకుగతిలేక ఒకరిచ్చుతటిని, వారిమతులఁ జెఱచెడిరండకుఁ గ్రతువులేల?"

రాజాస్థానమున నున్న యుద్యోగులలోఁ బ్రభువునొద్ద మిక్కిలి చనవుగల యొకానొక యధికారి తనకుఁ గీడుసేయ, నీకవీశ్వరుఁ డతని పుట్టుపూర్వోత్తరములన్నియు నేకరువు పెట్టుచు దూషించిన విధము గమనింపఁదగినది :—

"పంచాంగములుమోసి, బడవాతనముజేసి, పల్లెకూటముజెప్పి, పసులఁగాచి
హీనవృత్తిని బిచ్చమెత్తి, గోడలుదాఁటి, ముద్దకూళ్లకుఁబోయి మొత్తులఁబడి,
విస్తళ్లుగుట్టి, కోవెలనంబివాకిటఁ గసవూడ్చి, లంజెల కాళ్లుపిసికి,
కన్నతొత్తుల తమ్మకళ్లెత్తి, గతిచెడి, ఆలుబిడ్డలఁ బరులంటఁజేసి
నట్టిదేబెకు సిరిగల్గెనేని, వాఁడు కవివరులదూఱు, బంధువర్గముల గేరు,
పరునిపనిమీఱు, నొకరిని జెఱుపఁగోరు"

ప్రభుని సన్నిధానవర్తులైన దుష్టాధికారులను వారిసంకుచిత బుద్ధుల నెట్లు వర్ణించినాఁడో చూడుఁడు :—

"అవనీశ్వరుఁడు మందుఁడైన, నర్థులకీయ వద్దని, వద్ది దివాను చెప్పు,
మునిషీ యొకఁడు చెప్పు, బకిషీ యొకఁడు చెప్పు, తరువాత నామజుందారుచెప్పు,
తలఁద్రిప్పుచును శిరస్తా చెప్పు, వెంటనే కేలు మొగిడ్చి వకీలు చెప్పు,
దేశపాండ్యా తాను తినవలెనని చెప్పు, ముసరద్ది చెవిలోన మొనసి చెప్పు,
యశముఁగోరిన దొరకొడుకైనవాఁడు, ఇన్ని చెప్పులు గడద్రోసి యియ్యవలయు"

రాయసములు పిండములుతిను వాయసములఁట! (రాయసములకు రూపాంతరము వ్రాయసములు. ఈ రాయసములనఁబడువారు పూర్వము ప్రభువుసన్నిధానములో నెప్పుడు నుండువారు. సామ్రాజ్య వ్యవహారములలోఁ బ్రభువులు జారీచేయు ఫర్మానాలు, హుకుములు ఎప్పటికప్పుడు వీరే వ్రాయువారు. అంతరంగిక కార్యదర్శులు. అనఁగా నిప్పటి యున్నతోద్యోగులదగ్గఱ నుండు (Private Secretaries) వంటి వారు.) అట్టివారిసగూర్చి కూడ వేంకటరాయకవీంద్రుఁడు విడువలేదు. రాయసముల వేషములనుగూర్చి యతఁడు చిత్రించిన విధ మెంతసహజముగా నున్నదో చూడుఁడు :—

"వంకరపాగాలు, వంపుముచ్చెలజోళ్లు, చెవిసందుకలములు, చేరుమాళ్లు
మీఁగాళ్లపై పింజలూఁగెడు ధోవతుల్, బిగితరంబైన పాద్షి మొహర్లు,

చేఁపలవంటి పుస్తీమీసముల్, కలందాన్పెట్టె లంగవస్త్రములచుంగు,
సొగసుగా దొరవద్ద తగినట్లు కూర్చుండి, ఇంకులాంగ్రడకు సిఫారసులుచేసి,
కవిభటుల కార్యములకు విఘ్నములుచేయు రాయసా ల్పిండములుదిను వాయసాలు॥"

కార్వేటినగర ప్రభువుల రాచఱికపుదుస్తులలో "వంకరపాగాలు" ఈనాఁటికిని ముఖ్యములయినవి. విజయదశమి దర్బారలంకరించు రాజబంధువులకందఱికి నీపాగ గౌరవచిహ్నము.

ఈకవి "కాఁపువానికి గ్రామాధికారమైన దేవభూసురవృత్తులు తీయఁగోరు" అన్నాఁడు. కాని యాంధ్రదేశమున ననేకగ్రామములలో నానువాయితిగాఁ గ్రామాధికారము కాఁపులదిగనే కనిపించుచున్నది. ఈ విషయము చరిత్రలుకూడ ఋజువుపఱచుచున్నవి.

లోభులను చాలనీచముగను, నలక్ష్యముగను నితఁడు నిందించిన పద్యములలో హాస్యరసము తొణికిస లాడుచున్నది.

"తల్లిఱంకున పుండ్లు తాఁకివచ్చినయట్లు, మూలనిక్షేపంబు మణిఁగినట్లు,
కూతురి ముడుపెల్ల కొల్లబోయినయట్లు, కాణాచిపల్లెలు కాలినట్లు,
తనయాలి గడసెల్ల దండుగకయినట్లు, తండ్రితద్దినమేమొ తప్పినట్లు,
చెల్లెపైబడి దొంగ చేసిపోయినయట్లు, కొడుకు నప్పాడె తలగొట్టినట్లు,
దిగులు పడిచూచి, మూర్ఛిల్లి, తెప్పిఱిల్లి కవులకీయగ వద్దని కన్నుమీటు"

"వయసు దీఱినకాంత వక్షోజములభంగి, సంగమంబైన శి—బు కరణి,
గర్భిణియగు వారకాంత యుండెడి తీరు, పాండురోగి ముఖంబుభంగి, ముసలి
యెద్దు ముడ్డినిపేడ ఎళ్ళొచ్చుకైవడి, ఈనఁబోయినగాడ్దెయోని కరణి
అగ్గిదాఁకినవాని యండాల పోలిక మగఁడు పోయిన లేమపగిది, లుబ్ధు
యాచకులఁజూచి తలవ్రేలవేసి పెద్ద నున్నజుట్టుఁగదా, ముండగన్నకొడుకు"

అత్యంతజుగుప్సాకరములగు పదములనైన జంకుగొంకులులేక ప్రయోగించి యెల్లరకును తేటతెల్లమగునట్లు నీతులను బోధించుట యితని ముఖ్యలక్ష్యముగాఁ దోఁచుచున్నది. ఈక్రిందివి యందుఁ గొన్ని.

1. "తొడపల్చనగు నింతి నడిగండి బలుపెద్ద"
2. "చినిగిన దొండి బల్చెణుకుల కళుకునా, వెస నూత్నబాలిక వెఱచుఁగాక"
3. "వ్యాసాదులగు మౌనివర్యులు తపసెల్ల పోగొట్టుకొన్నది—ఁకు కేను,
జలజాతభవ శివాదులుగూడ భ్రమయుట దుర్గంధమగు నుచ్చ దొండికేను,"
4. "స్ఖలితశి—ము వికాసంబులు కడుగొప్ప"
5. "సుంకర్లకును, వర్ణసంకర్ల, కొకసారి ముడ్డిచూపెడి తొత్తుముండలకును,"
6. "భట్టరాచార్యుల—ట్టలు కాఁగానె పొసఁగ శ్రీ చూర్ణపు బుఱ్ఱలౌనె?
అల రాచకూఁతు స్మరాలయంబైనను పూజకు దాసాని పుష్పమౌనె?

అల్లయోలేశ్వరోపాధ్యాయు శీ—బు రాచూరి పెద్దఫిరంగియకానె ?
అలతాళ్లపాక చిన్నన్న శపవ్నముళైన తంబురవం డెను తంతులౌనె ?
హంకరించిన యెటువంటి మంకునైన తిట్టవలయును కవులకు దిట్టమిదియె"

ఇట్టిప్రయోగముల కొకయంతుపొంతు, హద్దుపద్దు కనఁబడదు. మెఱికలవంటి యద్భుతములగు నీతులుగూడఁ బొంకముగఁ బాఠకులకు హృదయంగమములుగ రచించిన శతకకవులలో నగ్రతాంబూలమున కీమహాకవి సర్వవిధముల నర్హుఁడు.

పరవధూకాంక్షను సకారణముగా నిరసించునది యీక్రింది పద్యము :—

"పరకాంతపై నాసపడెడి మానవులకు నగుబాటు, మనమునఁ దగని దిగులు,
నగడు, విరుద్ధంబు, నాచారహీనత, చేసొమ్ము పోవుట, సిగ్గుచెడుట,
అపకీర్తి, బంధుజనాళి దూషించుట, నీతియుఁ దొలఁగుట, నిద్రచెడుట,
పరలోకహాని, లంపటనొంది మూల్గుట, పరువుదప్పుట, దేహబలము చెడుట,
తనయాలిచేతి పోటునఁ గృశించుట, దాని వరుఁడు గన్గొనిన జీవంబుఁ గొనుట,
ముజ్జగములేలు నా విరాణ్మూర్తికైన కాని దుర్వృత్తి తగదెంత వానికైన"

అదృష్టవంతుఁడగు వాని కీక్రిందివన్నియు నమరిన నదియే భూతల స్వర్గమని కవి వివరించుచున్నాఁడు :—

"అగ్రజన్మము, తీరమందు వాసంబును, వితరణ గుణము, వివేక గరిమ,
సంగీత సాహిత్య సంపన్నతయు, మఱి రసయుత విబుధ సంరక్షణంబు,
అనుకూలయైన చక్కనిభార్య, రాజసన్మానంబు ప్రఖ్యాతి, మానుషంబు,
సౌందర్య, మతిదృఢశక్తి, విలాసంబు, జ్ఞానంబు, నీపదధ్యాననిష్ఠ,
ఇన్నివిధముల నొప్పి, వర్తించు నరుఁడు, భూతల స్వర్గసుఖములఁ బొందుచుండు"

పైఁ జెప్పినట్లుకాక, దుఃఖభాగుఁడగు సంసారి కీక్రిందికారణములచే సన్న్యాసమే తగుననియు నాప్తులే తనకవమానము తెచ్చుచో మానవంతుఁడయినవాని కంతకంటె మించిన మార్గము లేదనియు, కవి యభిప్రాయము.

"అబ్బ మేలోర్చలేనట్టి వాఁడైనను, మోహంబు గలతల్లి మూఁగదైన,
ఆలు రాకాసైన, అల్లుఁడనాథైన, కూఁతురుపెను అంకుపోఁతుదైన,
కొడుకు తుందుడుకైన, కోడలు దొంగైన, తనకు సాధ్యుఁడుగాని తమ్ముఁడైన,
గృహకృత్యములు పొరుగిండ్ల వెంబడిపోయి, చెప్పి యేడ్చెడి చెడ్డచెల్లలైన,
నరుని ఖేదంబు వర్ణింపఁదరముకాదు, యంతటను సన్న్యసించుటయైన మేలు"

కలియుగమున ధర్మములు తాఱుమాఱయినవని యీకవి యే విధముగా వాపోవుచున్నాఁడో చూడుఁడు :—

"అక్షరం బెఱుఁగని యాకారపుష్టిచే వర్ణసంకరులు విద్వాంసులైరి,
బాజారి అంకుకు పంచాయతీచెప్పు పాతలంజలు వీరమాతలైరి,
గోమాత లఱువగ కోసివండుకతిను మాలమాదిగలు భూపాలులైరి,
మానాభిమానముల్ మాని ప్రవర్తించు మంకు గులాములు మంత్రులైరి,
అహహ! కలియుగధర్మ మేమనగవచ్చు, ఇన్నిటికినోర్చి యూరక యుండఁదర మె"
"వేదశాస్త్రంబులు వినసొంపులేదాయె, సంగీతవిద్య బల్ చౌకనాయె
కవితారసజ్ఞత కలలోను లేదాయె, పారమార్థికబుద్ధి భస్మమాయె,
భూతలేంద్రులకు దుర్బుద్ధులే మెండాయె, నీచుమహత్త్వంబె నెగడిపోయె,
వర్ణాశ్రమాచారవర్తనలేదాయె, హీనకులంబులు హెచ్చునాయె,
అవని నిఁకమీద నొక్కదుడ్డంతి తళుకు యోనిగల లంజముండగా నుండవలయు"

ఇట్టియభిప్రాయమునే శ్రీనాథకవిసార్వభౌముఁడుకూడ నీక్రింది చాటువులో వెల్లడించినాఁడు :—

"కవితల్ చెప్పిన, పాడనేర్చిన వృథా కష్టంబె; యీ భోగపు
జవరాంద్రేకద భాగ్యశాలినులు పుంస్త్వంబేలపో, పోఁచకా ?
సవరంగా, సొగసిచ్చి, మేల్ యువతివేషంబిచ్చి పుట్టింతువేని పరిష్ఠంబు"—అని.

ఈవిధముగాఁ బరిశీలించుటకు మొదలుపెట్టిన నిది యింతట నంతటఁ దెమలు విషయముకాదు. కనుక దీని నింతటితో ముగించి యితని ప్రయోగవిశేషములనుగూర్చి కొంచెము పరిశీలించుట మంచిది :—

ఇతని శతకములోని యొక్కొక్కపద్యపాదము నొక్కొక్క సామెతయనుటలో నతిశయోక్తి లేదు. ఉపమానములు చదువుచుండిన నుపమేయములను జదువవలసిన యవసరము లేకుండనే వెంటనే పాఠకు లూహించుకొనునంత సన్నిహితత్వ మా రెండింటికి నుండుట యీతనికవిత్వములో నొకవిశిష్టత.

ఇందులో లాక్షణిక విరుద్ధప్రయోగములు పుంఖానుపుంఖములుగా నున్నవి. సహజకవులలో (చౌడప్ప వేమన మొదలైనవారిలో) కూడ నిది యొక్కటే పెద్దలోపము. అయిన నట్టివారిలో నది దోషముగాఁ బరిగణించుటకంటె నిరంకుశత్వముగా సమర్థించుట యుక్తమని నాయభిప్రాయము.

ఇఁక నితని శతకములో (వేణుగోపాలశతకము) దేశ్యములు, నన్యదేశ్యములు నగు శబ్దముల ప్రయోగములు గుదిగ్రుచ్చఁబడినట్లు (శతకము) కడవెడల నగపడుచున్నవి. జాతీయశబ్దములకు ఈతనిశతకములు రెండును పెన్నిధులు. ఈ రాయలసీమకవికి దెలిసినన్ని జాతీయ

ములు, మన తెలుఁగునాఁట నడిగడ్డపయిన జీవించిన యేకవికిని దెలిసి యుండవని చెప్పుట సాహసముకాదు. నేటికి నట్టిజాతీయకవులకు రాయల సీమ జన్మభూమి. శ్రీ॥ గడియారమువా రట్టివారిలో నొకరనిన సమ్మతింపని యాంధ్రుఁడుండఁడు.

ఈ వేంకటరాయకవి చేసిన జాతీయప్రయోగములు కొన్నింటి నిట సూచించుట యుక్తము :—

లొట్టెడు (కల్లు), గుడిసెవేటి (జార) తుందుడుకు, బేగములు, కుట్టుపోఁగులు, అధికప్రసంగి, మూతినాకు, (ఇచ్చకాలాడు), రద్ది, చంక నెక్కు, చాందిని, అమీరుసాహెబు, అతిరసాలు, దివాను, మునిషీ, బక్షీ, మజుందారు, శిరస్తా, వకీలు, దేశపాండ్యా, మునరద్ది, అంకులాడి. మాచకమ్మ, తగవర్లు, నెత్తిగీత, గొడ్రాలిముండ, నడిగండి, పోచీలు, బగిసి (సిగ్గు), జరీకుచ్చులజీని, పంగటించు, అంబలి, తెడ్డు, బజారురచ్చ, లాహిరికసరు, కొండెసిగలు, పాకోళ్లు, కతారులు, కాసికోకలు, డాలు వార్లు, వల్లెవాట్లు, తరహా, ఎమ్మెలు, గడికరణము, గ్రామదండుగ, మడియరండ, చౌడోలు, దరిబేసి, మంకుగులాము, బొజారిఅంకు, పాత లంజ, పంచాయతి, ధగిడీ, కోణతంబు, నొష్ట, బదనిక, కూచిమతము, లంజ కొడుకు, ముచ్చెలు, బడవాతనము, పల్లెకూటము, ముదిలంజ, దిడ్డికంత, ముష్టిక్కూళ్లు మొత్తులు, తమ్మికళ్లు, దేబె, వస్తాదుతనం, అసురతిండి, రాయసము, దీర్ఘనత్తి, వకాలతు, ఉగ్రాణకాఁడు, బుగ్గ (నీటియూఁట), చట్టు, చీవాట్లమారి, బహదరి, బడవా, దళవాయి, ధర్మచేట, పడిసేటి తొత్తు, పౌజులకమ్మెలు, తాటాకు దుద్దులు, కంకోష్ఠుడు, లంచకాండ్రు, పలువ, అచ్చినవాఁడు, హంకరింపు, చల్లడము, చౌకట్లు, మీార్జాకుళాయి, బులాకు, బొజిబందు, వంకరపాగాలు, చేరుమాళ్లు, పింజెలు, పార్షి మొహర్లు కలందానుపెట్టె, సిపారసులు, సున్నచుట్టు, ఎంగిలిమెగ్గు, పలుగాకులు, మేకమెడచన్నులు, బొండుమల్లెలు, బొరాహాజారి, పిసినారి, మోయీను, బరాతము, ఏడుజేనెల కాటెకి, ముడ్డిచూపు, బంగి బొయీలు, రంకులరాట్నము, ద్రాబ, తెగతినడము, పోఁతురాజు, కాటేరి, కొక్కిరాళ్లు, గుత్తలంజ.

ఇట్టి జాతీయములన్నియు మనభాషాశాస్త్రవేత్తలు పరిశోధించి, ప్రత్యేకముగా నొక కోశము తయారుచేసి భాషాదేవి కొక భూష

ముగా సమర్పించుట యెంతైన నవసరము. అప్పుడుగాని మనసారస్వత మహాత్వ మిట్టిదని, మనస్వతంత్రవాఙ్మయసంపద యింతటిదని గ్రహింపఁ జాలము. అట్టి సుదినమెన్నడో ?

ఇఁకఁ బ్రస్తుత మితనిచే వ్రాయఁబడిన మఱియొక శతకము లావణ్యాశతకమునుగూర్చి యించుక తెలిసికొందము. ఈశతకము తన ప్రభువైన శ్రీమాకరాజు వేంకటపెరుమాళ్ల రాజుగారి ప్రోత్సాహము చేత "పురుషవిరహంబు శ్రీహరిస్మరణశృంగారంబు"—గాఁ దాను రచించుచున్నానని కవి చెప్పుకొనినట్లు ఇదివఱకే తెలిపియున్నాను.

ఈలావణ్యాశతకములోని శృంగారము మార్దవముగను, సరసముగను, హృదయంగమముగను నడచినది. పచ్చిబూతులబుంగ కాదు. జుగుప్స కలిగించునదికాదు. మన ప్రబంధకర్తలలో చాలమంది సంభోగ వర్ణనలు మొదలైనవి వర్ణించుప్రసక్తి వచ్చునప్పటి కట్టివానికి దీర్ఘసంస్కృతజటిలసమాసముల 'బురఖా' తగిలించుచు వచ్చిరి. అంధ్రకవితాపితామహుని శృంగారపద్యము మచ్చునకు చూపెదను :—

"సహసా నఖంపచస్తన దత్తపరిరంభ మామూల పరిచుంచి తాధరోష్ఠ
మతిశయ ప్రేమ కల్పిత దంత సంబాధ మగణితగ్లాని శయ్యానిపాత
మతివేల మణితయా శ్లాఘాగల్లచపేట మతిదీన వాక్యాంచి తాత్మవిరహ
మంకురత్పులక జాలకవిద్ధ సర్వాంగ మానందకృత హారవా సనాబ్జ
మాక్రమక్షీణ నుతివర్ణమానిమీలి తాక్షమాస్విన్నగండ మాయత్తచేష్ట
మాస్తిమిత భావణారవ మావధూటి ప్రథమసురతంబు గంధర్వపతిఁ గరంచె"

ఇతనిసమకాలికుఁడే యయిన ధూర్జటి యొక మెట్టు క్రిందికి దిగి, వర్ణించిన శృంగార మంతనిగూఢముకాదు :—

"మంచలమీఁద నెక్కి, కటిమండలిఁ జుట్టినపాఱుటాకు లిం
చించుక సంచలించి మరునిల్లు బయల్పడఁజేయఁ బిట్టలం
జెంచెత లార్చి వ్రేయుమరు చిత్రముగా, నొడిపిళ్ల, బాహుమూ
లాంచితదీధితుల్ చిఱుతలైన చనుంగవమీఁదఁబర్వఁగన్॥"

ఇఁకఁ గుండ బ్రద్దలుకొట్టినట్లు, బాహాటముగా, శృంగారవిషయములను దేటతెనుఁగులోఁ జెప్పిన శేషము వేంకటకవీంద్రుని యీ క్రింది పద్యము చిత్తగింపుఁడు :—

"కన్నాతలాగించి కాంతుమోముగదించి, సారెసారెకు మోవి చప్పరించి,
రతి చాతురికి మెచ్చి, రమణుఁ గౌఁగిటఁగ్రుచ్చి, మోహాన నూటాఱు ముద్దులిచ్చి,
తనియక యెదురెక్కి దయసేయుమని క్రమెుక్కి గుదికాళ్లు వెన్నునఁగూర్చి నొక్కి

మదనశాస్త్రమెఱింగి, మనసు కొంకుగొఱంగి, కాయంబు లొక్కటిగాఁగ మెలఁగి,
అరిది సూదంటు శిలవలె హత్తిహత్తి, గొనబుఁదీవియ చందానఁ బెనఁగి పెనఁగి,
కౌముదిని జంద్రశిలవలెఁ గరఁగి కరఁగి, సమరతుల నేలె, నాబాల సరసలీల"—

కవిచౌడప్ప సరేసరి. రసాభాస శృంగారమున కతఁడు పెట్టినది భిక్షు! దొంగదాపఱికములు—చాటుమాటు లతని కేకోశమునను లేవు. గ్రామ్యశృంగార మెంతసొగసుగ వర్ణించినాఁడో గమనించుఁడు.

"అడియేఞ్ 'దాస'నటంచును జడియక మడి జాఱఁదీసి సాతనివనితఞ్
గుడివెనుక నంబిచేసెను 'గడసాధన' కుందవరపు కవిచౌడప్పా"

ఇందులోని నాజూకేమనఁగా—నసభ్యశబ్దములు వాడకుండ నసభ్యశృంగారము నుటంకించుట. ఇది కొంచెము గడుసరితనమే. ఈచమత్కారము, చాకచక్యము, అందఱికిని రాదు. పచ్చిబూతైనను నెబ్బెఱికము కనఁబడదు. పైఁగా 'నంబుల' యవినీతికి మంచికొరడాదెబ్బ. కనుకనే యతనికవిత్వములో, బూతనుకొనిన దానిలోనే, నీతియు నుండును. ఆమాట నతఁడే చెప్పినాఁడు, "నీతులు బూతులు లోకఖ్యాతులు"—అని. కావున నెంతశృంగారమైనను బ్రతికవియుఁ దనకృతిలోఁ దడవక విడువఁడు. కాని యా యా కవుల యభిరుచులనుబట్టి లేఁత ముదురు పాకములలో నది సాఁగుచుండును.

వేంకటరాయకవికృతమయిన యీలావణ్యశతకరచన పరిశీలించిన, శేషము వేంకటపతి పద్యములకు, చౌడప్పపద్యములకు మధ్యస్థమయిన ధోరణిలో నడచినదని దృఢముగాఁ జెప్పవచ్చును.

ఇఁక నిట్టిశృంగారశతకములను రాజాశ్రితులైన కవులు తమ ప్రభువుల ప్రోత్సాహముచేత వ్రాయుపద్ధతి యాకాలమున నుండునట్లు కనఁబడుచున్నది కార్వేటినగరాస్థానకవియైన యీపోలిపెద్ది వేంకటరాయఁడు లావణ్యశతకము వ్రాయఁగా, వేంకటగిరి సంస్థానాస్థానకవియైన గోపీనాథము వేంకటకవి "బ్రహ్మానందశతకము" వ్రాసినాఁడు. ఈ రెండు శతకములకు మకుటనిర్మాణముకూడ నొకక్రొత్తత్రోవను ద్రొక్కినది. "వశమె శ్రీరామ రామ, లావణ్యసీమ యనునది లావణ్యశతకమకుటము. "అరసి చూడ బ్రహ్మానంద మదియ కాదె" యనునది బ్రహ్మానందశతకమకుటము. కాని 'లావణ్య'శబ్దము శృంగారరసపోషక సన్నిహిత సాధనమయినట్లు "బ్రహ్మానంద" శబ్దము కాఁజాలదు. పైఁగాఁ దత్త్వజిజ్ఞాసువులు చదువుటకుఁ బుస్తకము తెఱచిన నేతప్పు యిది యిట్టివిషయమును

బోధించుననుసంగతి గ్రహింపలేరు. రామాయణమువంటి పవిత్రగ్రంథమును రచించిన వేంకటకవి, యీబూతుశతకమునకు బ్రహ్మానందశతకమని పేరుపెట్టుట యెంతవఱకు సమంజసమో కాని, పాఠకలోకమును మాత్రము వాత్స్యాయన కూచిమారాదుల శాస్త్రాంశములలోనికి 'బోల్తా' కొట్టించును. ఈయభిప్రాయము, అనఁగాఁ గేవలము కామకళాప్రపూర్ణతయే బ్రహ్మానందమను సిద్ధాంతమును పెద్దన్నగారు కూడ సమ్మతించిరి. "ఎందే నింద్రియముల్ సుఖంబు గను నాయింపే పరబ్రహ్మ మానందో[బ్రహ్మ" మటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా"—అని.

బ్రహ్మానంద శతకముకంటె లావణ్యశతకము పదలాలిత్యములోను నర్థగౌరవములోను భావప్రపుష్టిలోను జాతీయశబ్దజాలప్రయోగములోను, ధారాశుద్ధిలోను, శృంగారరసావిష్కరణసౌష్ఠవములోను నుత్కృష్టమైనది.

ఇందులోని యెత్తుగీతములు సాధారణముగా నంత్యప్రాసనియమముతో 'బారాహజారివలె' 'కదం' త్రొక్కుచు సీసపద్యమునకు నైజమయిన గాంభీర్యమును బ్రస్ఫుటము చేయుచుండును. ఈ క్రింద నట్టివానిని కొన్నిటిని సూచించుట యవసరము.

1. "మదిని దలపోఁసి, యితరరామలను రోసి, నేర్పు లెడఁజేసి, కంటికి నిదురఁ బాసి, మమత నినుడాసి, యుండక మరుని గాసి"
2. "వెలఁది! కడుసోలి, బ్రతిమాలి, వెతలచాలి, భావమటుతూలి, తమిఁదేలి, పాలుమాలి యెడతెగని బాళి, నీజోలికింతజాలి"
3. "ఎపుడు నేఁ గందు, నీయును రెవరిఁజెందు, నెటుల మతిఁ బొందు, నీతమికేమిమందు, జాలి నెటులొందు, దెవతె నీసరిపసందు"
4. "తగని మరులాయె, మానసోద్భవునిమాయ గెలువరాదాయె, మననేమునిలువదాయె, క్షణము యుగమాయె, నిపుడింత చలముసేయ"
5. "వింత నీచెంతలేని నివ్వెఱఁగు, కాంత! వేసటొక్కింత, తమియింత వెగటు కొంత, యీదినము నంతకంత నీమీఁది చింత"
6. "బడలికను లేచి, నెమ్మోము పాఱఁజూచి, మది నొకటిదోఁచి, నవ్వియమ్మాటదాఁచి, చేతఁజేయూచి పలుకు నీ చెలువమెన్న"
7. అనుచు నేనుందు, నేఁటికి నబ్బెసందు, కనికరము జెందు, మనసుకీ కపటమెందు కొఱకు, నీపొందు లేనిదే కొదవయెందు"

8. "విరహులదరంగఁ, దమ్ములవేడ్క గ్రుంగఁ, గలువలుపొంగ, నింగి రిక్కలు చెలంగ, గ్రౌర్యము వెలుంగ మింటజక్కవల గొంగ"

9. "పాదములు ముట్టి, గండదీపంబు దట్టి, చేతఁ జెయివెట్టి, యాకున శిరముగొట్టి బాసచేసిన"—

10. "వలపులమిటారి నిత్యము వచ్చుదారి చూచి వేసారి, మనమున సొంపుమీఱి, మగువ నొకసారి, సెనయక మరునిబారి"—

ఇట్టి వింకను గలవు.

ఈశతకములో— దేశ్యములు, జాతీయములు, కుప్పలుతిప్పలుగా నున్నవి. అందులోఁ గొన్ని :—

తొడల కొక్కెసము, అత్తరురవమెఱుఁగు, కడానిహారంగు, జలపూఁత, ముమ్మరించు, బిందీలు, పికిలిచెండ్లు, కుసుంబావన్నె, కసికాటు, సురటి, లంకెలు, అక్కళించు, డింకిసేయు, పికిలిపిట్టలు, కీల్గంటు, సరిగెకంగోరు, తాయి, జులాయింపు, జరీపాగా, తురాయి, విరులపంకా, ఊదారంగు, సికాకుళముసెల్లా, హవుసు, హొయలు, జమాయించు, సునాయించు, ఎలగోలు, ముత్యాలచేర్లు, ముప్పరిపట్టు పగ్గాలు, చేవకంబాలు, అద్దాలబారు, పరదాలచాటు, కటికెములు (దారిచూపు చోవుదారులు), పచ్చాకూదుబత్తీలు, పన్నీరు, గంబురు, గులాబియత్తరు, అరగజాలు, క్రొత్తకైరావళ్లు, రసదాడి, కైలాగులు, గులాల్వన్నె, మొల్కపాంజేలు, జొత్తుపెట్టెలు, చెఱఁగుమాయు, తలుపుగుబ్బలు, బరిణె కప్పులు, వీణెకాయలు, పుట్టచెండ్లు, రసగుండ్లు, కారంజి, పచ్చాకుదిండు, తక్కెంబు, సవరణపఱచు, కందువమాటలు, లోడీలు, జెట్టీలు, మసకాడు, తీగెపన్నీరుపూవు, ఉడాయిపావడ, గరిడి, పచ్చిబోయ, వేరువిత్తు, బుగ్గపోటులు, జంటితేనె, మోజు, జల్తారుపేటు, గిల్కమట్టెలు, రవకసీదాగోటు, పచ్చిమరాటిమొగ్గ, దవనంపుమొలక, గోవజవాది బరణి, దర్పకుని బొక్కసము, లోకతరబడి, కన్నడదస్తురి, రతిహుమాపిట్ట, ఆకుమడుపులు, పేటులెత్తు, తాపితారయిక, కైజీతములవారు.

అన్య దేశ్యము లీకవి ప్రయోగించినన్ని మఱేకవియుఁ బ్రయోగించియుండఁడేమో! హైదరు టిప్పుసుల్తానుల కర్ణాటప్రభుత్వములోఁ దెలుఁగుసంస్థానము లన్నిటిలోను నిరాఘాటముగా నన్యదేశ్యాలు వ్యవహరించుచు వచ్చుటచేత, నవి మనభాషలో నొకభాగమయి, స్థిర

ముగా నిలిచిపోయినవి. ఈకవి యట్టిపదముల నందముగాఁ బద్యపాదము లలో సందర్భానుసారముగా చేర్చుటవలన నితని కవిత్వమున కొకవింత శోభ వచ్చినది. అట్టివానిని గొన్నిఁటి నీక్రింద చూపుదును.

"గజనిమ్మపండ్లు నే నజరు చేసెద"—"తీపైన బేషక్ మతా పతాక తుర్కికచ్చీ మాదువాను తేజీల పాగ" — "జుల్పతీపిల్ల"— "చిగురు ఖాండాకమ్మి"—"అస్సల్ కడానిబొమ్మ"—"నిద్రాహరాంత కారి"—"గరిగులేతాకు తేగాబాదుషా" — "సామువస్తాదు"— కన్నడదస్తురి"—"సెబాసుషట్పదమా" — "పికమా బళారె"— "దస్తురుమాలు"—"ము స్తీబు"—"కంకణంబులు మొలయ పంఖాలు పూని" "బిరుదు జట్టీ"—"లోడీలు"—"ఇంగిలీకపరఖు"—"జాఫల్ రసంబు"—"గుర్రాపూలు"—"గుల్లందు", "చొక్కపు జవాజి"— "జాఫరా అగరు"—"కచేరీ"—"నకలు"—"సరదార్లు"—"బల్లు షామతు"ను జెంది—"ఖూబైన బాసుజిలీబు తేజీ"—"హరోలుతయా రికతారు"—"జల్తారుభారీపోషకు"—"బహుపరాకు"—"జాతి జం గాతి బనాతి కనాతి సరాతిలోదటను సూరవుతు" లందు—"మొఖమల్ ఖురాళ్" మిమ్మగ "నఖాసీ" చుట్లు—"తగుట చీనీలు"—"నమరుష మేనా"—"కలశములు"—"కమాను" వాకిళ్లు—నీలంపు "మేకీలు" —"కొణిగె" తీరు—అద్దాలబారు "గుడారు"—"చదురు" సేయంగ —"హరాయలు"—"భారీబురాన్పురీ" పాగ—చెంగావి "కుతిసీత మాను" — "ఖుబువహవాజల్దుఘోడా"—"సఫేదా" రంగు — "మహతె"క్కి దారిజూచి"—"బాకి" చెల్లగ "నులఫా" లొసంగి— "పాజు" లెల్లను "రాయబారులు" సేయ—"ఫాదుషా"—"తురా యి"—"ఫేషైన" రవల "సర్ఫేషు"—"జిగిబర్ధవాని తెగా" వరపై —"మొఖమల్ గలీబా"—"తేజీపతాణి"—"కీనుఖాబు" పావడ— "జరీబుటా" వల్వ—"మహతాబి" చీర—"బస్తా"వన్నె,—'కుసుంబా కలాబతు', 'ముగాదు' — సొగసు, 'కల్మా'.

ఇట్టి యన్యదేశ్యములు శ్రీకృష్ణరాయలకాలముననే మనసార స్వతములో విశేషముగా చేరినవనుట క్రింది పద్యము లుదాహరణ ములు. (ఇవి యెవరిరచనమో తెలియదు).

"రాయగ్రామణి, కృష్ణరాయ భవదుగ్ర క్రూరఖడ్గాహిచే
గాయంబూడ్చి కళింగదేశనృపతుల్ — "కానగ్ఘరీపోషణీ
మాయాభీకు ముటూరులోటు కుహుంటూ మాయాసటా జాహరే
మాయాగ్గేయమదే" — యటంచ్రు దివి రంభాజారునిం జోరునిక్"

"సమరక్షోణిని గృష్ణరాయల భుజాశాతాసిచేఁబడ్డ, దు
ర్దమదోర్దండ పుళిందకోటి యవనవ్రాతంబు, సప్తాశ్వమా
ర్గమునం గాంచి— "సెబాసహో, హరిహరంగా ఖూబు ఘోడాకితే
తుముకీ బాయిల బాయిదేమలికి" యందుర్మింటికిం బోవుచుక్"

తరువాతకూడ చాలమంది మధ్యకవు లీయన్యదేశ్యపద ప్రయోగములమీఁద మోజుపడిరి. ఆధునికులలో శ్రీకళాప్రపూర్ణులు వేదము వేంకటరాయశాస్త్రిలవారు :—

"బురసాపట్టు జరీబుటా పరికిణీము స్త్రీబుతో సాదరా,
బురఖా తోడ జవాహరీ పటలితో భూకాంతకూడేక్ మధుక్"

శ్రీ తిరుపతి వేంకట కవులును :—

"దేఖోహుకు" మంచునిచ్చె—బంగారుజడ "బరాబరులు" చేయ
క్రుద్ధుఁడగు భీష్ముముందర "కోన్కి-స్క-"—

ఈవిధముగా శబ్దము లుపయోగించినారు. శ్రీజాషువాగారి కవిత్వములో నీలాటివి చాలఁ గలవు. ప్రకృతము మన మింగ్లీషుపదములు చాల వాడుచున్నాము. పక్కా సంస్కృతము, కల్తీలేని యచ్చ తెనుఁగు పదములు తప్పఁ దక్కినవి వాడరాదను దీక్షతో మడికట్టుకొని కూర్చుండు ఛాందసులను మినహాయించిన, భాషకుఁ దుష్టి, పుష్టి కూర్పవలయునను కవులు దేశకాలపాత్రల ననుసరించి, కవిత్వము సాగించిననే తప్ప, వారిగ్రంథములకు లోకములో 'చెలామణి' యుండదు. నన్నయ నాఁటి సాహిత్యము అంతమాత్రముచేతఁ దుడిచిపెట్టుకొనిపోదు. ఆమాటకువచ్చిన "ఏను, ఏము, ఈవు, ఈరు, కోలె, బలె, ఆకె, ఈకె" మొదలగుశబ్దములను, "అట్లుకానినాఁడు, అగుటంజేసి, భక్తిమెక్" మొదలగు ప్రయోగముల నెందఱు చేయుచున్నారు? నన్నయభట్టు సీసపద్య నియమము నెందఱు పాటించుచున్నారు? భాషాభిజ్ఞులు, శబ్దసాధకులు నా యా కాలముల ననుసరించి, వాడుకలో నుండు జాతీయములను, విపరీతముగాఁ దమగ్రంథములలో నుపయోగించుచునే వచ్చిరి. అట్టివారిలో పాల్కురికి సోమనాథుఁడు, నన్నెచోడుఁడు, మున్నగు మహాకవులు

ముఖ్యులు. ఈ పోలిపెద్ది వేంకటరాయకవివంటి శతకకవులుకూడ చాల మంది యారకమునకుఁ జెందినవారే! అట్టివా రుపయోగించిన జాతీయములన నన్నింటిని పరిశోధించి, వాని యర్థనిర్ణయమును జేయుటకు శబ్దశాస్త్రవేత్తలు పూనుకొనిన, తమిళమువలెనే మన భాషకూడ స్వతంత్రముగాఁ బ్రకాశింపఁగలదు. వాఙ్మయమును సంపద్వంతము కాఁగలదు.

ఇఁకఁ బ్రకృతము లావణ్యాశతక కారుని కాలమున కాంధ్రపురంధ్రు లెట్టి యాభరణములు ధరించువారో యతఁడు సూచించిన కొన్ని నగలను బట్టి తెలియఁగలదు.

(1) పాపటచేర్లు, (2) బిందీలు, (3) బాజుబందులు, (4) రాకడి, (5) నెలవంకరతనంపు బిళ్లలు, (6) ఒడ్డాణము (గంటలు), (7) చెంప ఖిల్లీలు, (8) చంద్రహారములు, (9) పోచీలు, (10) కంకణాలు, (11) సరలు, (12) పాటీలు, (13) గొలుసులు, (14) పావడంబులు, (15) చిఱుగజ్జెలు, (16) అందెలు, (17) మొల్కపాంజేలు, (18) వజ్రాల బేసరి, (19) బులాకీనత్తు, (20) చేకట్లు, (21) పైఁడి కుచ్చులు.

జాతీయాలు కొన్ని :—(1) నేరమా, పల్కుబంగారమా ?—(2) అతివ, దానిల్లు బంగారమైరి.—(3) పూమొగ్గతో బుగ్గపోటులు, (4) గ్రుక్కత్రిప్పదు దానిగొంతుకోయ, (5) కాపురాలు గుత్తసేయు, (6) పైమాటలోకలకు పలుకవచ్చు, (7) మిద్దెపై పరుగులు, (8) మీసాలపై తేనె, (9) ఏనుఁగుదిన్న వెలఁగ కాయలు,—(10) దూరమగు కొండనునుపు.

ఈలావణ్యాశతకమునందును, వేణుగోపాలశతకమందువలెనే లాక్షణిక విరుద్ధ ప్రయోగములు గలవు :—

సేనా (చాల), చెయ్యి, పట్టనియవె, తరబడైన, మోవంచు, (మోవి + అంచు), సరేను, పావురగతి, అనితే, పట్టితే, అయింది, తెలుసు, మూతువు, చేసుక, తెలుసుక, పోతే పోదాము,—ఇట్టివున్నను సందులో గొన్ని (ఛందోనియమములకు భంగము కలిగింపనివి) సవరించుటకు వీలుపడును.

ఈశతకములో సరిగ నూఱుపద్యములున్నవి. అన్నిటిలోను శృంగారరసము తొణికిసలాడుచున్నది. సాధారణముగా నిందలి పద్యములలో వర్ణితలయిన నాయికలు ముగ్ధాప్రౌఢలు. కన్యావర్ణనముకూడ

నొకానొకచోట నున్నది ; పైఁగా నాయికలను (ఆ యా పరిస్థితులలో స్వభావసిద్ధముగా) ఉచిత నేపథ్యములతో రసవంతముగాఁ బాఠకుల కన్నులకు కట్టునట్లు చిత్రించి నిలుపుటలో వేంకటరాయకవి మిక్కిలి చాకచక్యము కలవాఁడు.

కన్యావస్థలో నున్నదాని చేష్టలనుగూర్చి యీక్రిందిపద్య మెంత యద్భుతముగా నున్నదో గమనింపుఁడు :—

"తాళిగట్టని చిన్నతనమునఁ దనయీడు చేడియలనుగూడి యాడుచుండి,
ననుఁ జూచి 'బావవచ్చె' నటంచు, బాజుబందుల క్రింది చెండ్లంగి దుముకులాడ,
పరుగున నాదు పైఁబడి, కౌఁగిలించిన, ఎనలేని కడువేడ్క నెత్తి, లేఁత
మొలక మెఱుంగుచన్నులు, నాభి, చెక్కులు, గళమును, పచ్చవిల్కానినగరు,
ముద్దుపెట్టుక నవ్వుచు, ముదిత, నీవు 'ఎవరి పెండ్లాడెద?' వటంచు నేను బలుక
'నిన్నె'—యని మీసములు మీటు నీటుదలఁప వశమటే, రామరామ లావణ్యసీమ !॥"

ఈక్రిందిది ముగ్ధావర్ణనము. తొలికేళి రాత్రి గడచినపిదప యుదయమున నే చెలికత్తెలకు నాయికకు జరిగిన సంభాషణ మిందులోనున్నది.

"ఆదికేళికను మై యలసియుండినతీరు గని నేస్తమగు జోడుగరితలెల్ల
'సతి, రేయి పతి సేయు రతి వింతలే' మన,—'నేమందు ? నదియ నే నెఱుఁగఁ, బాన్పు
చేరఁబోవఁగను గుచ్చెలఁబట్టి తీసినవడి, నీవిముడియును వదలె ; నపుడు
సిగ్గుచేఁ బయ్యెద చెఱఁగు దివ్వెకుఁ దెఱచాటుసేయఁగ హారచయమునందుఁ
గలుగు రతనాలు దివ్వెలుగా వెలుంగ నతిభయంబునఁ గనులు మూసితిని, నవల
నేమి కనుగొన'—నని పల్కు ప్రేమ దలఁప॥"

ప్రౌఢా వర్ణనము :—

"సమబంధ మొనరించు సమయమందునఁ గరమ్ములు మధ్యమునకు లంకెలు దవిల్చి,
గుదికాళ్లు పిఱుఁదల నదిమి, వాతెఱల నొండొండఁ బల్మొనలతో నొరయఁ గొనుచు,
మెక్కులన్గూర్చి, కఱ మెప్ప అల్లార్చుచుఁ గడుపక్కళించి వెన్కలకుఁ దిరిగి
తను చివుక్కనఁగ "బైకొనువిధం బిదిగాదు డింకసేయుదము లెండి"యని లేచి
"వెనుకఁ జిక్కితిరో—" యని వెన్నుజఱచి నొసట చెమ్మటఁ బయ్యెద నొత్తికొనుచు
నిలిచి ననుఁజూచి పలికిన నీటుదలఁప॥"

అభిసారికా వర్ణనము :—(సంకేత స్థలమునకు నాయకునికిఁ గబురు పెట్టుట)—

"పసమించు నెమ్మేనఁ బసపాని, మెత్తని పాదంబులకు జొత్తు పట్టెలించి,
తళ్కుచెక్కిళ్లఁ జేతుల మంచిగందమ్ము బూసి, కుంకుమ నడ్డఁబొట్టువెట్టి,
జాజిపువ్వుల మంచి జాఱు కొప్పమరించి, సొగసుకాటుక కనుసోగదీర్చి,
'చెఱఁగుమాసె, నిఁకేమి సేతు'—నంచని భర్తతోఁ బొంకి, ననుఁ బ్రేమతో నుపవని

కలువకోలనికిఁ బడమటిగట్టు పొన్నగున్నలకుఁ దోడితెమ్మని గుఱుతుచెప్పి,
కన్నె నంపించునాఁటి సౌఖ్యము దలఁప॥"

ఖండితా వర్ణనము —

"పసుపునిగ్గైన దుప్పటితోడఁ, గాటుకమరకాను దుస్తు రుమాలుతోడఁ
జెక్కుటఁ గొనగోటి జీరలతోడ, నవ్వొలఁదిచ్చు దొంతర విడెముతోడ,
నతివ పల్కానకాటు లారని మోవితో వెన్నున కీల్జడ వ్రేటుతోడ
సొగసైన నిద్దుర సొలపుతో, రతులకు బడలిన నెమ్మోము బాగుతోడ
నే నితరకాంతఁ గూడిరాఁగాను, యున్న చిన్నె పరికించి మనమునఁ జిడిముడగుచు
నపుడు నిను నీవె దూరుకొన్నది తలంప"—

కోపనా వర్ణనము :—

"కోపమేటికి? ముద్దుగుల్కు నెమ్మొగమెత్తి చూడవే నను బాల సుగుణశీల,
వలచివచ్చితి నంచు వంచనేమిటికి నన్మన్నించవే భామ మధురసీమ,
సుల్కుచేయక తేనెఁ జిల్కుఁ బ్రేమఁగ నొక్క మాటాడవే యింతి, మదనుదంతి,
గబ్బిగుబ్బల తొమ్మ్రుఁ గదియించి నాయెద నానవే యోచాన హంసయాన
యేలనే గోల?, చలము నీకేల? పైఁపఁజాల, నీ జాలమేల? నకా జాలరతులఁ
దేల దయ నేలకున్న నీవేళఁ దాళ?—

ఈశతకములోఁ జాలవఱకుఁ గవి ప్రౌఢలనే వర్ణించినాఁడు. అందు చేత ఇందలి పద్యములు నాయికానాయకుల ప్రణయానుభూతికి నిదర్శనములైన యనేక శృంగార చేష్టలను బ్రదర్శించునవిగా నున్నవి.

1. ఉపరతి :—

"తమినికళలూర, నొసటఁ గ్రొంజెమట జాఱఁ, గదలవదలని యెదనెద నదివొరవదిమి
యుపరతి యొనర్చునాఁటి నీ హాయియలుదలఁతు" (ప్రౌఢ)

2. తొలిరతి :—

"నూతనకేళి నే నొనరింపఁ బూనినఁ జిడిముడి, లోజంకు, సిగ్గు, వెఱఁగు
వేఁగుట, వేసట, వెల్లవాటును, జాలి, మడిమవిదల్పు, పెందొడల పడఁకు,
బొమముడి, కనుమాఁత, మోవియార్చుట, లల్లి, మైచెమర్చుట, తడంబడుట, సొలపు
పలుమెంచ బిగియించు పటిమ, యధైర్యంబు, కసరు, తొందర, బాళి, కదలుకొనఁగ;
బొలఁతి నన్నెంచనపుడు, నే బుజ్జగించఁ గాను నసియాడ, మన్మథకళలు వీడ,
రతి మొనర్చిన నాఁటి నీ వితము నెన్న॥" (ముగ్ధ)

3. మార్నిటి రేయి రతి :—

"......................................గోలుసులు పావడంబులు చిటుగజ్జె లం,
దెలు పదమ్ముల ఝుళంఝుళలు సేయ, వలరాయనింట జిల్జిలమంచుఁ గళఁ గుసుం
బాపుప్వు రసము కైవడిని గురియ, బోటి మార్నిటిరేయి నీతోటి నెనయు
నాఁటి వేడుక లింక నేనాఁటికైన కోటియిచ్చినఁ గల్గ దాపాటి దలఁప॥"

4. వేసవినాటి రతి:—(ఈ భోగము రాజులకు ఆకాలములో సహజము.)

"కారంజిలో నీతకాయల మోపాని తేలెడు పచ్చరి తెప్పపల్క-
పై; గొంపురాళ్లోళ్ళ పట్టెమంచము దోమ తెఱచుట్టు, దివ్వెకంబాలబారు
తొడిమ తీసిన రెక్కవిడు మల్లెపూ పాన్పు, పచ్చాకుదిండ్లు, కోపైవలోడు,
దవరు కుంకుమపువ్వు, తక్కెంబు, కీలు బొమ్మలు వేయు పంఖాల చలువగాడ్పు
లెగయ వేసవి నెలఁ బవ్వళించియున్న వచ్చిచెయ్యానితే, ఎక్కివత్తు ననుచుఁ
బలికి నాతోడఁ గలసిన వగలనెన్న"—

ఆ యా దేశ స్త్రీల కేశబంధనములు :—"కన్నడదస్తూరిగా సిగ వేసి"—యనుటలో, సిగముడి నాజూకుగా వేయుటలోఁ గర్ణాటాంగనలు ప్రసిద్ధికెక్కినవారని కవి యభిప్రాయము. అదేవిధముగాఁ బాండ్య దేశ స్త్రీలు గొజ్జంగిపూల రేకులతో జడలు సొంపుగా నల్లుకొనువారని, కళింగకామినులు రకరకాల కీలుగంట్లు వేసికొందురని విదర్భకాంతలు మెడల కానునట్లుగా నునుగొప్పులు సవరించుకొనువారని వర్ణించినాఁడు.

అయిన వర్ణనార్హములయిన విషయములు శృంగారవతులలో నెన్నియో యుండఁగా నా యా దేశ స్త్రీల కురులసౌభాగ్యమునుమాత్రమే (అంతగా) యీశతకములో ముచ్చటింపవలసిన యవసరమేమి? —అనఁగా "కురూపికైనను కురులంద"మను లోకోక్తి యున్నదికదా!

ఇటీవల మనరాష్ట్రములో "నందాలరాణి" నెన్నుకొను విషయమున "క్రొమ్ముడి" ప్రాధాన్యము వహించినది. "అజంతా" శిల్పచిత్రములలోని రమణులవలె కురుల "క్రొమ్ముడి" దిద్దుకొనినదఁట! అది నిర్ణాయకులదృష్టి నాకర్షించుటచేతనే యీావసితామతల్లి రాష్ట్రములోని తక్కినయందకత్తెల నందఱిని తలఁదన్నిన సౌందర్యవతిగా వారిచేత తీర్మానింపఁబడినది.

కేశసంపద ప్రాశస్త్యమును దెలుపుటకు దీని నింతవిపులముగా ముచ్చటింపవలసివచ్చినది.

ఇఁక నీకవికాలమునకు భోగులైనవారు ధరించు నంబరముల్లను గుఱించి యక్కడక్కడ నీశతకములోఁ బ్రస్తావించుటవలన వానియాధిక్యత స్పష్టమగుచున్నది. చూడుఁడు :—

(1) అభ్యంగనస్నానమైన పిమ్మట—'సికాకుళము'—సెల్లా నొంటికొంగు గట్టి, (2) 'మైసూరుకుతినీ' తమాను వేసుక జరీపాగా తురాయి గన్పడఁగఁజుట్టి, (3) 'సీమపన్నీరు' పైఁజిలుకుచు హాాయ

లుగా భారీబురాన్సురీపాగ చుట్టి, (4) 'నారాయణవనంబు చీరె' కుచ్చెం చులు మీఁగాళ్ల కెలమిఁ గ్రేలాగులెసఁగ, (5) 'జల్తారుపేటు గంజము చీర' కుచ్చిళ్లు గిల్కుమట్టెలఁ దట్టి పల్కరింప, (6) "వాసించు 'గోవజ వాది' బరణి"

దాదాపు శతాబ్దముక్రిందవఱకు మన దేశమునకు విదేశములకు వ్యాపారము (ఇప్పటివలె నిర్బంధములతోఁగాక) ధారాళముగా సాగు చుండునది. మన దేశములోఁ దయారగు శ్రీకాకుళము సెల్లాలకును, మైసూరు (కుతిని) పట్టుకు, జరీయంచులుగల గంజాముచీరలకు, నారా యణవనము కోకలకు మన తెలుఁగునాటిలోనే కాక, దేశవ్యాప్తమయిన ప్రఖ్యాతి యుండునట్లు కనిపించుచున్నది. కాని పాశ్చాత్య దేశముల నేత యంత్రముల పోటీకి నిలువలేక శ్రీకాకుళమురవసెల్లాలు, గంజాముచీరలు రూపుమాసినవి. కాని నారాయణవనముచీరెలకు—పంచెలకు నేఁటికిని ప్రసిద్ధికలదు. అక్కడి నేతవస్త్రములు, చాలచిక్కనగను, సున్నితముగ నుండును. ఇఁకఁ బట్టుపరిశ్రమకు నేఁడేకాక యానాఁడును మైసూరు పేరుగడించినది. ఇప్పుడు మైసూరుపట్టునే "బెంగుళూరు" పట్టు అను చున్నాము.

సీమపన్నీరు :—ఈలావణ్యశతకకారుని కాలమునకు సీమపన్నీ రపురూపమయిన సుగంధద్రవ్యము. మన దేశములో చిరకాలముగా "హిమాంబువు" లని యొకవిధమైన పన్నీరు తయారగునది. అది కేవ లము గులాబిపూవుల సారముతోడనేకాక, యనేకరకముల సుగంధ పుష్పరసములతో సమ్మిశ్రితమై యుండునది. దానిలో నప్పటమయిన గులాబిపూవులతో సిద్ధపఱచు పన్నీటిలోనుండు మధురమార్దవ శీతలాది గుణాళిగాని, స్వచ్ఛసువాసనాపరిపుష్ట సౌఖ్యానందప్రదముగాని యుం డదు. అందుచేతనే రాజభోగ్యమయిన పన్నీరు (Rose water) మన వారికాకాలమున సీమనుండి దిగుమతి యగునది.

ఈశతకములోఁ గొన్ని బంధాలను గూర్చిన ప్రసక్తిగూడ కవి సూచించినాఁడు :—

1. దండెంబులకు బొమ్మతట్టి క్రొమ్ముగ్గఁగఁదోఁచు ధేనుకాబంధంబు పూనుకరణి.
2. బిరుదు జట్టీలతోఁ బెనఁగొనుతఱిఁ దోఁచు నురగబంధము సేయుచున్న పగిది.
3. గుబ్బచనుమొన లెదసాని గుఱుతులుంచ తరుణి చాళీతిబంధపద్ధతు లెఱింగి రతులఁ దేలించు నీచమత్కృతిఁ దలంప॥

రతులలో విహంగమగతుల ననుసరించుట కామకళాబంధచతు రతాసంపాదనకు నాందికాఁబోలు!

పికిలి పిట్టలరీతిఁ బెనవికాటందుచు గూర్పుం డెమక్కాని కొంతసేపు,
చిలుకలగతి ముద్దుపలుకు లొప్పఁగను పైకొని హాయిగా రతి గొంతసేపు
కన్నెపావురమున గళమున మణితంబు గులికించి హాయిగాఁ గొంతసేపు,
కళలుప్పతిల్లఁ బ్రక్కలు గోటఁ జెనకుచుఁ గోకిలరవముచేఁ గొంతసేపు,
వింత గోర్వంకపోరులఁ గొంతసేపు, గుమపుతో బ్రక్కమార్పులఁ గొంతసేపు
క్రీడసల్పిన నాఁటి నీరీతినెన్న॥

నాయకుని మన్మథోన్మత్తునిగాఁ జేసి యశ్లీలములనుగూడ నతని నోటి గుండ పలికించి శివాలాడుటలో నీకవి వెనుకాడువాఁడు కాఁడు.

1. వలరాజు నగరిముంగలనైన నుంచవే జీతమొల్లని కొల్వు సేతుఁగాని.
2. అపుంచు మరునిల్లు నివిరిదేమన, నిటు లడుగవద్దని చిన్నియావపెట్టు.
3. కుసుమబాణుని నగరెల్లఁ గొల్లసేయ నెపుడు గల్గును, జాన, నీ హితముమాన.
4. వనిత నాతోడ నొకసారి నెనయఁగానె? దర్పకుని బొక్కసముకేమి తక్కువగునె?

కవిసార్వభౌముఁడు "ఏదేనొక్కమనోహరాంగకము" అనిన పద్యములో నేగుహ్యాంగమును వర్ణించినాఁడో దాని నీకవి వాచ్యముగా నుత్ప్రేక్షానుప్రాణితోపమలతో స్పష్టముగా వివరించినాఁడు.

"కమలారి కృష్ణపాడ్యమి జేయి రాఁగఁ దూర్పున, నాకసము పర్వపోలికనఁగ.
నమర వసంతకాలమునందు వికసించు తీఁగ పన్నీరు పూదీప్తి యనఁగ,
శుకవాహనునకు సేవకులువేయు నుడాయి పావడచెంగావి భాతి యనఁగ,
మదనుని రాణి సీమంతవీథిని నంటి వగఁగాంచు సిందూరవర్ణమనఁగ
కుందనపుఁ బళ్లెమునఁ దోఁటకూరవిత్తు లెండ నెరపిన బైబిల్లలేడి పదము
నిడినగతిఁ దోఁచు నీమరు నిల్లు దలఁప॥"

ఇది లావణ్యశతకశృంగారవర్ణనాంశములకుఁ బరాకాష్ఠ.

ఈశతకములో ననుకరణములు కొన్ని కనఁబడుచున్నవి.

"అనాఘ్రాతంపుష్పం కిసలయమలూనం కరరుహైః" అను కవి కులగురుని శ్లోకమునకు క్రిందిపద్యము భావానుకరణము:—

"చిలుక ముక్కునఁ గాటుచెందని బింబంబు, పొగలేక నిల్చు కప్పురపుదివ్వె,
కోయిల నొక్కగా గొఱుకని చివురాకు, గాటంపు బచ్చి మరాటి మొగ్గ,
తుమ్మెద వ్రాలని కమ్మదామరపూవు, నవకమౌ మేల్దవనంపు మొలక—
సానపై దీరిన జాతివజ్రపురవ వాసించు గోవజవాదిబరణి
వలపులమిటారి నిత్యము వచ్చుదారి, చూచి వేసారి, మనమున సొంపుమీఱి,
మగువ నొకసారి నెనయక మరునిబారి॥"

ప్రబంధకవుల వెట్టిమొట్టి భావములు, తలతిక్కవర్ణనలు నీకవికి కూడ సహజముగా నలవడినట్లు తోఁచుచున్నది. ఈశతకములోఁ గొన్ని పద్యములు పై యంశములను ఋజువు చేయుచున్నవి.

సాధారణముగా మధ్యకవులు వ్రాసిన ప్రబంధములు పెక్కింటిలో వ్యంగ్యభావస్ఫోరకముగా, నౌషధములను, మహర్షులను, పుణ్యక్షేత్రములు మొదలైనవానిని జవరాండ్ర (ముఖ్యముగా నాయికల) యంగ ప్రత్యంగములకు నుపమించుచు కేశాదిపాదాంతమువఱకు వర్ణించువారు. ఈశతకములోను నట్టివి యున్నవి.

కూచిమంచితిమ్మకవి రసికజనమనోభిరామములోనిది ఈక్రిందిపద్యము:

"కలకంఠి జఘనంబు కాంచికా స్థానంబు, మధురామృతస్థలి మగువమోవి,
అన్నులమిన్న పదాగ్రంబు కూర్మంబు, పడతుక జిల్గునెన్నడుము మాయ,
నీలజీమూతంబు నెలఁత ధమ్మిల్లంబు, రాకేందుముఖి రోమరాజి కాశి,
నలినలోచన నిమ్ననాభి కేదారంబు, భామ చన్దోయి శ్రీపర్వతంబు,
గాఁగ నృపచంద్ర నుక్షేత్రగరిమ నెపుడు జెలగుచున్నది దాని భజింపగలుగు||"

ఇందులోని పుణ్యక్షేత్రములు ధ్వన్యర్థములు; నాయికావయవ రూపకములుగా గ్రహింపఁబడినవి.

ఇఁక లావణ్యాశతకములో దీనిననుసరించి రాగములను రూపకములుగాఁ జేసికొని, కవి యబలాంగములను వర్ణించినపద్య మీాక్రిందిది :—

"నీలాంబరౌర, పెన్నెరుల సౌరుదనంబు, వీనులు శ్రీరాగ విభవమేలు,
పొలఁతి నెమ్మొగము సంపూర్ణచంద్రిక మణితము పరీక్షింప ఘంటారవంబు;
సారంగి చూపుల చపలత వీక్షింప మెఱుపగు లేఁగౌను మేఘరంజి
చారు రోమావళి శంకరాభరణంబు, తీరైన కెమ్మోవి దీపకళిక,
ముదిత క్రౌంజిగిమేను మోహన, సద్గుణ లావణ్యగరిమ కల్యాణి, భళిర !
నడక మెల్లదనంబు పున్నాగ, దాని సుగతమానందభైరవి, సొంపునాట||"

వేణుగోపాలశతకములో నితఁడు "పరవధూకాంతు"ను నిరసించి చెప్పినపద్యమును జూపితిని. యట్టిదే కొన్నిపదములమార్పుతో నిందున్నది. గమనింపుఁడు :—

"స్త్రీలపై నతిబాళి జెందినపురుషుల కపకీర్తి, దీనత, నగడు, దిగులు,
పరువుతక్కువ, మోక్షపదవికి దొలఁగుట, నైష్ఠికహీనత, నవ్వుబాటు,
చుట్టపక్కంబులు నుల్లగించుట, గాసి, విబుధాళి గన్న భవిష్యహాని,
మానంబువిడి యవమానంబు నొందుట, ధనము గోల్పోవుట, తనువు చెడుట
వసుధలోపల నెటువంటి వారికైన దగని వలపిటు కారాదు, తరుణి నీదు
కృపను గాంచక మన్మథ చపలమణఁప||"

క్రిందిపద్యము పురుషులు స్త్రీలను నమ్మరాదని స్పష్టముగా బోధించును. చేడియల మంచితనము నమ్మరాదఁట !—

"మనసెఱుంగరాదు మాట నిల్కడలేదు, దానివర్తన సహీ, వలపు సున్న,
కనువిచ్చిచూడరు, చనవిచ్చి కూడరు, నేస్తంబు పూజ్యము, నెవరు నాస్తి,
మర్యాదలెంచరు, మన్ననగాంచరు గుణము చక్కనిదిల్ల, గుట్టుకల్ల,
కపటంబు మానరు, కడువేడ్కఁ బూనరు, సత్యమన్నను వట్టి, జాలి మట్టి,
సాహసము మెండు, మిక్కిలిచలము నిండు, అంగిట విసంబు, మునాల్కలయందుఁ
దీయఁదనముగదె, చేడియల మంచితనము"

ఈ విశ్వాసగుణమునుగూర్చి యింకను రెండుపద్యములున్నవి. ఇఁకఁ బురుషుల హితముకూడ నమ్మరాదని యీక్రిందిపద్యములో కవి తెలుపుచున్నాఁడు.

"మగవారిమాట బూరుగుపంటితే, టద్దమునఁ గానఁబడు పైఁడిమాట, దూర
మగు కొండనున్ను, లేనుఁగుదిన్న వెలఁగకాయలు, మబ్బులోఁ దళుక్కనెడి మెఱుపు
మిద్దెపైఁ బరుగులు, మీసాలపైఁ దేనె, పొగ ముల్లెగట్టినపోల్కి, తేట
నీటిలో జాబిల్లి నీడ, లేగినయెండమావులు, రతివేళ మరులు—సతుల
వద్ద నున్నంతసేపె, యావలనుబోవ నెంతకతినంబు !, పురుషుల హితము నమ్మ
వచ్చునా, యని పల్కు నివగఁ దలంతు"—

స్త్రీపురుషు లొకరినొకరు నమ్మరాదనుటలోఁ గవిహృదయ మేమో ? అట్లు నమ్మకున్న సంసారములు సుఖప్రదముగా సాగుట కవకాశములుండవనుట యనుభవసిద్ధము. ఈనమ్మక ముభయత్ర కుదిరిననే గార్హస్థ్యము స్వర్గతుల్యమగును. కాని పక్షమున చెప్పవలసిన దేమున్నది? ఇంతకు ఈనీతి, అవినీతికిఁ బాల్పడు విటీవిటులనుగూర్చి చెప్పఁబడినదైన నొకవిధముగా సమర్థనీయమగును.

ప్రబంధములలోని శృంగారమంతయు నీలావణ్యాశతకమునఁ గ్రోడీకరింపఁగలిగిన యీమహాకవి మేధావిశేషము స్తుతింపఁదగినది.

ఈకవి పోషకులైన మాకరాజవంశస్థులు తమ మొదటిముఖ్యనగరమైన నారాయణవనమును, కవికాలముననే విడిచిపెట్టి దానికి పది మైళ్లదూరమునఁ గల కార్వేటినగరమును నూతనముగా నిర్మించుకొనినట్లు :—

"నవ్వుకొంచును కార్వేటినగరరాజ వీధి నెదురైన సిగ్గున వీఁపుగప్పి
త్రోవ తొలఁగిన నాఁటి నీభావమెంతు"—అనుటవలన స్పష్టమగుచున్నది.



# మల్లంపల్లి మల్లికార్జున పండితారాధ్యుఁడు

క్రీ. శ. 1800 ప్రాంతము.

ఇతని యగస్త్యేశ్వర శతకము పరిషత్కార్యాలయమువారు తమ శతకసముచ్చయము ద్వితీయసంపుటములో ప్రచురించిరి. ఈశతకములో 105 శార్దూలమత్తేభవృత్తములున్నవి. "పెదనాభిధాన శివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా!" అని మకుటము. సుకరముగా నోటపలుకుటకు వీలయిన శబ్దములతో మకుటనిర్మాణము చేయుట యుక్తము. ఇది కొంచెము క్లిష్టమనిపించును.

ఈకవి యారాధ్యబ్రాహ్మణుఁడనియు, మల్లంపల్లివాసుఁడనియు.

"చిల్లీలాకృతి మల్లికార్జున ఇతి శ్రీ పండితారాధ్య హృ
త్ఫుల్లాంభోజ విహార, భూరివిల సత్సుప్రబంధయ స్వామివై
మల్లంపల్లి వసించియున్న త్రిజగన్మాన్యుండవీవంద్రుం సం
పల్లీనా! పెదనాభిధాన శివపూర్వస్స్వాద్యగస్త్యేశ్వరా"—

అను పద్యమువలన నూహింపఁదగును. అంతకుమించి యితనిని గూర్చి తెలిసికొనుటకు ఈశతకమున నెట్టియాధారములును లేవు. పెదన యను గ్రామసమీపమందలి యీశివుఁడు (అగస్త్యేశ్వరుఁడు) పురాణప్రసిద్ధి నొందిన క్షేత్రపాలకుఁడని తెలియవచ్చుచున్నది. ఇంకను గొన్ని యీ యగస్త్యేశ్వరునిగూర్చి కవులచేఁ జెప్పఁబడిన శతకములుకూడ నున్నవి. అందులో నిది యొకటి. ఒకటేమి? సంస్కృతపదజటిలమై తక్కినవానికంటె శైలిలో నొకరవంత కఠినపాకములోఁ బడిన యుత్కృష్ట శతకమనుటలో సందేహము లేదు.

కవి బహుశా ఒకటిన్నఆ శతాబ్దమున కీవలివాఁడు కాఁడనుటకు గ్రంథస్థశయ్యను ప్రమాణముగా నంగీకరింపవచ్చును. బ్రాహ్మణకవులు తెలుఁగున కవిత్వము చెప్పరాదనుకాలమున నన్నయభట్టు భారతము నకు మంగళాచరణమును రచించి, యాతరువాతనే భారతమును (రాజాజ్ఞచే) తెనిఁగించుటకుఁ బూనుకొనినాఁడు. ఆవాడుక ననుసరించి వైదికుఁడైనవానికి తెనుఁగు కవిత్వము "నన్నుముట్టుకోకు నామాలకాకి" యయినది. అందుచేతనే తెలుఁగుకవులలో చాలమంది నియోగులగుటయుఁ దటస్థించినది. దాదాపు 1800వఱకు నీఛాందసము వైదికులకుఁ బోలఁగినదికాదు. అథవా యెవరైనఁ దెనుఁగున కవిత్వము చెప్పుట

క్కారంభించినఁ దెనుఁగునఁ గవిత్వము చెప్పఁగల నియోగిమూఁక యంతయు నతనిమీఁదికి దండెత్తునది. అందుచేతనే కాఁబోలు నియోగికవీంద్రుల దెబ్బకు తట్టుకొనలేని యొకానొక వైదికకవి :—

"ఇలలో వైదికవిద్వత్తిలకంబుల కేమిదిక్కు తెలిపితివమ్మా
జిలిబిలి పలుకుల వెలఁదీ, పలు గాకి నకారగుళ్లపాలైతిఁగదే"

అన్నాఁడట! ఈస్థితి, 1800 వఱకుండినది.

ప్రకృత మీాయుగస్త్రైశ్వరశతకకర్తకూడ నట్టి నైష్ఠికుఁడయిన వైదికారాధ్యుఁడు. ఆకారణమును బట్టి యీాతని క్రీ॥ శ॥ 1800 ప్రాంతము (అటో—ఇటో) వాఁడుగా నుండునని యూహించుట సమంజసము.

ఇతని కవిత్వములో నుపమానములు సామెతలు మొదలగునవి చాల చక్కఁగ నుపయోగింపఁబడినవి. నూటికి తొంబదిపాళ్లు గీర్వాణ శబ్దములు ప్రయోగింపఁబడినవి. కొన్నిపద్యములు మచ్చుకు గమనింపుఁడు :—

"ప్రమథాధ్యక్ష, మహోక్షసైంధవ, జగద్బంధో, దయాసింధ వేం
దుమణి స్ఫాటిక సన్నిభాంగరుచయే, తుభ్యంనమో, దేవదే
వ, మహాదేవ, దృఢప్రభావ, చిదచి ద్వ్యాప్తపారమాంపాహి స
ర్వమనోవ్యథ్"— (అంతయు సాంస్కృతికమే)

"రథరంధ్యద్విరథాంగ సారథి ధనుర్బాణేషుధిజ్యాళి, యా
పృథివీ వేద రవీందు వాక్పతి సురాద్రి శ్రీవధూనాథ వా
స్నిథిభోగీంద్రులు గాఁ బురత్రితయము న్నిర్జించు నీచర్యలు
గ్రథురంబుల్" (సం. సమాసభూయిష్ఠము)

ఉపమానాలు : లోకోక్తులు :—

(1) దాసరితప్పు దండమున నా, కీడెంచి మేలెంచ సంపదగల్గుం, (2) నెగడినిప్పై వెల్లి చల్లాఱెఁదా నాఱంబోయిన దీపమోయన, (3) పై నిగుఱులున్న నిప్పునందు సెక లేనే లేదె, (4) నీలింగాంగింగనుచో మొఱింగెదరు హాళిం గొందఱజ్ఞాను లేనుంగుంగన్గొను కుక్కలుంబలెను, (5) గుడి మ్రింగు వానికట లింగంబొక్కటడ్డౌనె ?, (6) మధురాజ్యక్షీరములోసి పెంచిన సర్పంబు విషంబుమాననిక్రియన్, (7) కావేరీవారి మునింగియున్నశిల పృథ్వి స్మెత్తనౌనే ?, (8) తోడేల్లన్న మృగంబులట్లు, (9) చూడంజుట్టము మ్రొక్కదైవము, (10) ఈఁగకును సౌగంధ్యంబు సొంపౌనె ?, (11) దొంగలుపడ్డార్నెల కుక్క బొవ్వమను సంజ్ఞన్,

(12) కీలూడంబడు జంత్రపుం బ్రతిమమాడ్కిన్, (13) అలసన్న్యాసికి లేదు
తస్కరభయం బాభీతి సొమ్మున్న వారలకే, (14) తైలమేదివతుదిన్ జిం
తింప దీపప్రకోపనమౌనా?, (15) పంకజాక్షులకు బాంధవ్యంబు నిత్యంబె?,
(16) విడంగనౌనె నిజసంతానం బదింకెంతతప్పు మదింగూర్చినఁ గన్న
తండ్రి, (17) నిజం బాడిన నిష్ఠురంబు వెనువెంటన్వచ్చు, (18) ఇంకేమైన
సందున్న దేపల్లెత్తన్?, (19) ఈఁదంబోయినఁ ద్రావనీళ్లు మఱి లేవిందన్న
చందంబు, (20) ఒకపూఁటన్నము లేని వానికెటు నోరూరంగ ముమ్మాఱు
తింటకుఁగా నొక్కటఁబంచభక్ష్యములు నింటంగల్గునే?, (21) లంజియ
కొక్కఁడే మగఁడుగా భావించినన్ దానిజీవనమౌనా? (22) జాత్యం
ధుల్సదా పద్మినీబంధుం జూడనిమాడ్కి, (23) ఇందూపలరాశి కాము
దిశ రాకీర్ణంబు గావించుసంగతి.

అగస్త్యేశ్వరశతకకర్త యయిన మల్లికార్జునపండితారాధ్యులు
దేవీస్తుతిపరముగా శ్యామలాంబాశతకమునుగూడ వ్రాసినాఁడు. ఇం
దులో 101 సీసపద్యములున్నవి.

"పెడనపురీలలామ, రామలింగేశ్వరస్వామి వామభాగ చంద్ర
శాలా సభాలంబ శ్యామలాంబ" అను మకుటముతో నిది యొప్పారు
చున్నది. ఇదికూడ సంస్కృతశబ్దసమాసజటిలముగనే యున్నది. కవి
యక్కడనక్కడ శబ్దాలంకారములు మొదలయినవి ప్రయోగించినాఁడు.
కొన్ని భాగములు మిక్కిలి చక్కఁగ నున్నవి.

ఈక్రిందివి గమనింపుఁడు :—

(1) తప్పుఁ బట్టఁదలంచితే నీకు దొరకదే, తెల్విగల్గు రాజుద
లంచి తేరోజు దెబ్బలు లేకపోవు, (2) నీపాదపద్మములతోడే సరి కడు
దోసెఁడేని మాడ లనువొంద రాశివోసిన దాని నేనొల్ల, (3) ఎవ్వారిని
నైన నీళ్లముంచినఁ బాలముంచిన నీవకాకొరులేరి?, (4) ఎట్టివారైన
నేమి! సాధుసంతాపమునఁ గులక్షయముఁ గాంతురే కదా! (సాధుస
జ్జనసన్తాపం కిమాశ్చర్యం కులక్షయమ్), (5) అఖిలజగంబు దైవాధీన
మౌ దైవ మరయ మంత్రాధీనమనఁగ, మంత్రదేవత వస్మదధీనమౌట
రుదె? (దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతం, తన్మంత్రం
బ్రాహ్మణాధీనమ్), (6) దృఢమైనపతిమనంబు సతిహావభావచేష్టాలతా
వలి వలనొన్నంత, సెకపొంత వెన్నగాదె, కానిచో మేనిసగము నీకొనఁ

గలిపి త్రిమ్మరుట ఎట్లు ?, (7) ఉదరపోషణముమాత్ర మొకలక్షణమె? గ్రుడ్డికొక్కెర ముక్కునఁ బఱిగల నొక్కి మెక్కి తనకడుపుఁ బ్రోచి కొనలేదె? (8) విత్త మాదిమధనద్విగుణంబుగాఁ దెచ్చి కలదానిలో పలఁ కలిపికొందు, రది యిదికూడ ముందరుగునంచెఱుఁగరు, క్రొత్తను బ్రాఁతనీరెత్తిపోదె ?, (9) తలబరువు చాలఁగల్గిన తరువుమొదలు నేలఁ గూలదె ?, (10) ఆఁడువారిమనంబుఁ జూడ వజ్రనిష్ఠురంబను శాస్త్రోక్తి నిక్కము, (11) బాల్యవైధవ్యసంప్రాప్తకులాంగనాకులమనంబుఁబోలెఁ గోర్కెలబ్ధికల్లోలములభంగిఁ గడువడి జతపడి పుట్టి, పుట్టినయట్ల మట్టు పడు, (12) మూఢుండు కాలాబ్దములఁజూచి తనయింటి కడవనీరెల్ల వెల్వడలనూకి మొఱఁగెడుమాడ్కిఁ, గాముకుఁడు, వారాంగనాసంగ మంబున నగ్నిసాక్షిగా వివాహమాడిన వరారోహను విడనాడు, (13) అర్ధాంగమునఁ బెనఁగొని నీవు దనకుఁగల్గ ముక్కంటి తలమీఁద నెక్కించుకొనియె, నామందాకిని నిదేటి మగతనంబు ?

ఈకవి సంస్కృతంలోని గడుసుపోకడలను తెలిపే ఈ యంత్యప్రాసనియమపద్యము చూడుఁడు.

"పలిత శుద్ధసువర్ణఫలకాసదృశ కపోలకళా నిరాకృతముకురకేళ
నిబిడాంధకార సన్నిభ నీలకుంతలద్యుతి సముద్ధూత మధురకరజాల
మత్తమాతంగ సమానయాన మనోజ్ఞనిర్జిత కలహంసనికర ఖేల
కలమగర్భ ప్రతీకాశ జంఘారుచి మహిమ పరాభూత మకరహేల
నికసితకటాక్షచకిత కామకరవాల శైలకులబాల పెడనపురీలలామ"

సర్వతఃప్రాసయతి :—

"చాలింపుమల్క, కయ్యాలింపు జిగిగుల్క, బాలింపు నను, బరాకేల, వలదు
వారించుమరుల, నుబ్బారించుసిరుల విక్ష సైరించునేరముల్ దూరమరుగ,
నాటింపు మది భక్తి, పాటింపు తుదిముక్తి దాటింపు జన్మాబ్ధినీటిఁ ద్వరను,
భావింపు సదసత్త్వఁ గావింపు కృతకృత్యుఁ గావింపు నను మంచిత్రోవఁ దఱియ
నరయనీదయ విమలంబులయ్యె, నాసుకృతములెల్లను బెడనపురీలలామ"

ముక్తపదగ్రస్తము :—

"బాలేందుసంకాశ ఫాలదేశాంకిత కస్తూరితిల కాతిగంధసార,
సారకాశ్మీర సంభారసీమంత నిరంతర సౌభాగ్యరాణివాస,
వాసవనీలాశ్మవార విస్తార భాస్వరకచ రచిత పుష్పప్రకాశ,
కాశనీకాశసంకలిత రోమావళీ కల్పవల్లిస్తబక స్తనాభి
రామ, రామామణిశ్యామ రణతలాగ్ర రిపుగణ విరామ పెడనపురీలలామ"

యమకములు, వృత్త్యనుప్రాసములు, మొదలయినవి కూడ నీ శతకమున కవి యద్భుతముగాఁ బోషించినాఁడు :—

"భ్రమరీ చికురజితభ్రమరీ కృశానుశుభ్రమరీచిగాత్రి"

"నేత్రత్రయీ త్రయీస్తోత్రపాత్రి"

"కాళీ భయప్లవవ్యాళీ విశాలచూళీ వీరసమరకేళీ పరాకు"

"శాంభవీ శుంభనిశుంభ వీరభట సంరంభ వీక్షాలతారంభ హేతి"

"నీకుమాఱిలలేని నీకుమారులలోని వానిఁగా నన్నుఁ బ్రోవంగవలదె?
నీకరాసి వొలంగ నీకరాసిగలంగ నాయరాతులపాలు సేయవలదె?
నీకథామహిమల నేకదా మహిమాన్య లలర నాకెఱిఁగింపఁ దలఁపవలదె?
నీకృపాలోలనా నీకపాలనము దీనులయందు ముందుగాఁ దెలియవలదె
వలదు వలదు పరాకు నాపలుకులవధరింప నదనిదె పెదనపురీలలామ"

పార్వతీ పరమేశ్వరుల దాంపత్యము :—

"కైసేయ రెండునాల్కలపుర్వతే కాని, మణిహారములటన్న మాటసున్న
కబళింప కటికిహాల్కడలిచేఁదే కాని, మధురాన్నములటన్న మాటసున్న
కలయఁబూయఁగ వల్లకాటిబూడిదె కాని మంచిగంధమటన్న మాటసున్న,
వలెవాటు మతిపెద్దపులిచర్మమే కాని మడుఁగువల్వలటన్న మాటసున్న,
నీమగనికేమి చూచి మన్నించి మనువరించితే? రామ! పెదనపురీలలామ"

"బూడిదలోఁబడి పొర్లాడువానికి గంధంబు మేన నలందఁగలిగెఁ,
దోలుగప్పుకొని గంతులు వేయువానికిఁ జలువదుప్పటిఁ గప్పుకొనఁగలిగెఁ,
బాములఁదాల్చి సంబరమందువానికి మేలిమితొడవుల మేలుగలిగెఁ
గాడుల నెపుడు నిల్కడగల్గువానికి నింటఁ బూఁబాన్పున నుంటగలిగె
నింత నిన్నుంచి, కాని మున్నెఱుఁగువటవె కృత్తివాసుండు; పెదనపురీలలామ"

దేవి మిగులకఠినహృదయ యనియెంచి, ఆస్వభావమామెకుఁ గలుగుటకుఁ గారణములను కవివివరించిన విధము గమనింపఁదగినది :—

"చట్టుతాతికి ముద్దుఁబట్టివైనప్పుడా గట్టితనం బెట్లుపట్టువడదు?
గట్టువిల్తునిఁ జెట్టవట్టినయప్పుడా గట్టితనం బెట్లుపట్టువడదు?
మెట్టదారికిఁ దోడఁబుట్టువైనప్పుడా గట్టితనం బెట్లు పట్టువడదు?
తిట్టలతోఁ దున్కపట్టైనయప్పుడా గట్టితనం బెట్లు పట్టువడదు?
పట్టువడకున్న వజ్రసంఘట్టనంబు హృదయమునకేల? పెదనపురీలలామ"

షడానన గజాననుల బాల్యక్రీడలతో, వారితగవులను గూర్చి తల్లితో మొఱవెట్టుకొనుటను ఈకవి — ఎంతో ముచ్చటగ వర్ణించినాఁడు :—

"ఉంకుండీ, తానొండు, రెండు, బండ్రెండెండంచు నాకన్ను లెన్నుచున్నాఁడు చూడు,
మొకలేదు నాముక్కు పొడుగు మూరెఁడుబారెఁడని, మునుఁ గొల్చినాఁ డదిగొ చూడు,
మునికాడు నామోము లాఱించు బల్మారు వెక్కిరించుచు నాదువిధము చూడు,
వెక్కిరించుటకేమి? నిక్కమాడెద, ముందు నులిపె నాచెవిఁ బోడు తెలిసిచూడు
చునెడి తనయులఁ గని ముద్దుఁగొనియెదవల్ల నవషదంబవు పెడనపురీలలామ"

"నాస్తి తత్త్వం గురోఃపరమ్"
నిత్యమంగళాని భవంతు తే"

ఇట్టి సంస్కృతవాక్యములు పద్యములలో ఇముడ్పఁబడినవి. ఈ క్రిందివి కొన్ని అనుకరణములు:—

"తలఁచుగా మొసలివాతను నున్న మానికంబును బెకలించి మేలెనయవచ్చుఁ,
గడలేని కరడుల విడి మొఱంగెడు సముద్రంబు నొక్కుమ్మడి దాఁటవచ్చుఁ,
జటులకర్కోటక జాతిపామును పువ్వు దండపోలికఁ దలఁదాల్పవచ్చుఁ,
బొంచి మంచితనంబుఁగాంచి పంచాస్యంబు నింపుగాఁబట్టి యాడింపవచ్చుఁ.
గాని, మూర్ఖునిఁ దెలుపఁ గాఁ గాదనాక ఏలుకోవమ్మ పెడనపురీలలామ"

ఇది భర్తృహరి సుభాషితములలోని:—

"మకరముఖాంతరస్థమగు మానికముం బెకలింపవచ్చుఁ బా
యక చలదూర్మికానికరమైన మహోదధి దాఁటవచ్చు, మ
స్తకమునఁ బూవుధండవలె సర్పమునైన భరింపవచ్చు, మ
చ్చిక ఘటియింప మూర్ఖజన చిత్తముఁ దెల్ప నసాధ్యమేరికిన్"

ఈపద్యమునకనుకరణము:—

"నీ మహామహిమ వర్ణింపంగ నాల్కలు రెండువేలున్న శేషుండఁ గాను,
నిన్ను దర్శింపఁగ మున్నొక్కవేకన్నులున్న నిలింపముఖ్యుండఁ గాను,
నిన్ను బూజింప దండి సహస్ర కరసరోరుహముల బాణాసురుండఁ గాను,
నిను స్మరియింపంగ నేనాల్గుముఖములుగల యలకలహంస గామిఁ గాను,
గాని పూనితి మన్ననఁగాంచి చిత్తవృత్తిఁ గరుణించు పెడనపురీలలామ"

దీనికి నరసింహశతకములోని:—

"నీమీఁదికీర్తనల్ నిత్యగానముజేసి రమ్యమొందింప నారదుఁడఁ గాను,
సావధానముగ నీచరణపంకజసేవ సలిపి మెప్పింపంగ శబరిఁ గాను,
బాల్యమప్పటినుండి భక్తినీయందుల గలుగను ప్రహ్లాదఘనుఁడఁ గాను,
ఘనముగా నీమీఁద గ్రంథముల్గల్పించి వినుతసేయను వ్యాసమునిని గాను,
సాధుఁడను మూర్ఖమతి మనుష్యాధముఁడను హీనుఁడనుజుమ్మి నీవు నన్నేలుకొనుము"

అనుపద్యము మాతృక.

> "బహుళాశోభమతికి ద్రవ్యంబగ్గలంబైన నేమి మొదల్ తగ్గ నేమిఫలము ?
> విశ్వస్తకు సమస్తవిధభూషణము లుండె నేమి లేకుండిన నేమిఫలము ?"

అను ఈశతకపద్యము—వేణుగోపాలశతకములోని :—

> "చండాలువాకిట వండుకొన్నది, యంబలాయె నే ? మతిరసాలాయె నేమి ?
> మాచకమ్మ సమర్త మఖపుబ్బచిత్తహస్తాయె నేమి ? పునర్వసాయె నేమి ?"

అను పద్యమునకు అనుకరణచ్ఛాయ యగును.

మఱియు నీకవివతంసుఁడు.

"మతమొుండుగలదని మద్యమాంసంబుల భక్షించువారిని"—"మహిషమార్జాలాదిదానముల్గొనువారిని"—"స్వర్గభోగంబునిశ్చయమని, పశువధఁ జేయఁబొల్పడువారిని"—"మునివేషంబు దాల్చి యింటింటభుజించువారిని"—హానికి వెఱవని బైసిమాలినవారని నిందించెను.

"వెలసి దేవాంగఋషికులసంభవులకిలువేల్పవై ప్రీతిఁగావించి జగములరసి కాంచినదాసిఁ" గా ఈశ్యామలాంబను స్తుతించుటచే, 'దేవాంగ' కులమువారి ప్రేరణమున ఈశతకము రచించెనని ఊహింపఁదగియున్నది.



# కొండవీటి కోటయ్య

క్రీ॥ శ॥ 1800 ప్రాంతము.

'నీతిశాస్త్ర' మనఁబడు (అనుష్టుప్పు) సంస్కృతశ్లోకముల కీతని నీతికందశివశతక మనువాదము. ఇందన్నియు కందపద్యములు. పూర్వాపరక్రమము సంస్కృతములోవలె నీ తెలుఁగుసేఁతలో లేదు. అంతమాత్రముచేత మూలకవిభావములకు లోపము కలుగలేదు. కందపద్యములు వ్రాయుటలో కోటయకవి మహానిపుణుఁడుగాఁ గనిపించును. అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణదోషములున్నను, నాబాలవృద్ధ, మాపండితపామరము, సులభముగా నర్థముచేసికొనఁగల చిన్న చిన్న తెలుఁగుపదముల తోడనే కడుముచ్చటగా నీకందపద్యములు నడచిపోవుచుండును. ఈవిషయమునఁ గవియే గ్రంథారంభములో నీక్రిందివిధముగాఁ దనప్రజ్ఞను దెలుపుకొనినాఁడు. అది యొకవిధముగాఁ బోతనపద్యమున కనుకరణము. చూడుఁడు :—

"కొందఱకిఁ దెనుఁగు హితవగుఁ గొందఱకిని సంస్కృతంబు గూరిమియగు నే
నందఱ కనుగుణ్యము మఱిఁ జెందఁగ నుభయోక్తులఁ జేతు స్తుతిశివా"

'శివా' యనుపదము మకుట మీశతకపద్యముల కమరినది. ఈ 'శివుఁడు' కవి స్వగ్రామమయిన కొప్పరావూరిలో నెలకొనిన చెన్నమల్లేశుఁడు. "కొప్పరావూరిపుర ప్రాకటమందిర భాస్వదుమాకాంతారమణ చెన్నమల్లేశశివా" యని మంగళాచరణముగా వ్రాయఁబడిన మొదటి పద్యముననే యిది ద్యోతిక మగుచున్నది.

ఇతఁడు తనతలిదండ్రులనుగూర్చి కాని, సమకాలికులనుగూర్చి కాని తనశతకములో నెక్కడను బేర్కొనలేదు. "నీతిశాస్త్రమంతయు వేడ్కన్ భువిఁ గొండవీటికోటయకవి నేరచియింతుఁ బద్యకావ్యంబుశివా" యని తన్నుఁగూర్చి మాత్రమే చెప్పుకొనినాఁడు. ఈశతకములోనిపద్యములు 103. దీనిని కీ॥ శే॥ చెలికాని లచ్చారావుగారు తమ శ్రీరామవిలాస గ్రంథమాలలోఁ జేర్చి ప్రకటించినారు.

ఇంకను నీకవి వ్రాసిన గ్రంథాలేవో యున్నవని తెలియుచున్నది. ఇప్పటికి నితనివంశస్థులు గుంటూరి కాలుమైళ్ళదూరమున నుండు కొప్పరావూరిలో నున్నారని, వారియొద్ద నీకవి విరచితాముద్రిత కావ్యములు దొరకవచ్చునని విన్నాను.

ఈకవికాలమునుగూర్చి విమర్శించుటకుం దగిన యాధారములు లేకపోవుట దురదృష్టము. కాని యొకటిమాత్రము నిజముగాఁ దోఁచుచున్నది. తెలుగుదేశములోఁ దురకలప్రాబల్యాధికారము లెక్కువై వారిభాషలోని పదము లాంధ్రములోఁ జేరి బాగుగా (గుర్తుపట్టలేనంతగా) కలిసి పోయిన కాలమునకుఁ దరువాతనే, యనఁగా గోల్కొండ హైదరాబాదుల నవాబుల కాలములో, వారితో నేస్తముకలుపుకొనిన పాశ్చాత్య దేశముల సార్వభౌమత్వము వెలిఁగిన నడిమికాలములో ననఁగా నిప్పటికి సుమారు 150 ఏండ్లకుఁ బూర్వము (పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభము)న ఈకవిజీవించినవాఁడని తోఁచుచున్నది. "మాదరచోదు, ఖర్చు" ఈలాటిపదము లితఁడు వాడుటవలన పైనిర్ణయము సత్యము కావచ్చును.

ఇతనికిఁ గవితాధార స్వతస్సిద్ధముగ లభించినట్లు కనఁబడుచున్నది. కావుననే ఇతఁడు కవితాదక్షత్వము చూపుటలో వ్యాకరణనియమములను లక్ష్యపెట్టలేదు.

మృత్యువంటె, నిద్రెఱుఁగడు, వస్తే (స్త్రే ప్రాసస్థానములోనిది), దూషించేదుర్మతి, షడ్గుణ్యా, పిల్లంటుకొన్న (పిల్లిఅంటుకొనిన) శాఖలతో (ప్రత్యయముదీర్ఘాంతముకాదు), అప్పుడీటితే, అన్నముపెట్టే.

గొప్పప్రబంధములుగాఁ బరిగణింపఁబడు మహాకవులకావ్యములలోననే యిట్టిదోషములు సహజముగా దొర్లుచుండును. ఇఁక నిందులో నుండుట యంతవింత కాదు. అందులో నిది యనువాదము. ఇట్టియనువాద శతకములు తెలుఁగులో చాలతక్కువ. ఏనుఁగులక్ష్మణార్యాది కవిత్రయము వ్రాసిన భర్తృహరిశతకములు, ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రి వ్రాసిన సూర్యశతకము. గట్టిలక్ష్మీనరసింహశాస్త్రివ్రాసిన మహిషశతకము ననువాదశతకములే.

ఇప్పుడీకోటయకవి వ్రాసిన నీతికందళినశతకముకూడ నట్టిదే యని పైన వివరించియున్నాను. ఈశతకపద్యములు మూలశ్లోకసహితముగాఁ గొన్ని మచ్చునకుఁ జూపి విరమింతును.

1. ఆత్మబుద్ధిస్సుఖంచైవ గురుబుద్ధిర్విశేషతః
పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయాంతకః॥

కం॥ "తన యాత్మబుద్ధిసుఖమగు, ఘనుఁడగు గురుబుద్ధి సాధకం, బన్యుల చెప్పిన బుద్ధి నాశనము, భామిని బుద్ధి ప్రళయకాలమృత్యువగు శివా"

శ్లో॥ దీర్ఘశృంగ మనడ్వాహం నిర్లజ్జా విధవా స్త్రియాం
శూద్ర మక్షరసంయుక్తం దూరతః పరివర్జయేత్॥

క॥ పెద్దయిన బారుకొమ్ముల యెద్దును, సిగ్గేమిలేని యింద్రాణికి బల్
విద్దెగలమోటునను, నే ప్రొద్దుం దూరముగఁ గొలఁగి పోవలయు శివా॥

ఈపద్యములో "నిర్లజ్జా విధవాస్త్రియా" మ్మన్నదానికి "సిగ్గేమిలేనియింద్రాణికి" అని చేయఁబడిన యాంధ్రీకరణము మూలకవిభావమునకు విరుద్ధము, కాని "శూద్రమక్షరసంయుక్తం" అనుదాని కాంధ్రీకర్త "విద్దెగలమోటుమానిసి" యని తెనిఁగించుట యాతనికిఁగల లౌకికానుభవమునకు గొప్పనిదర్శనము.

3. ఉత్తమం స్వార్జితంవిత్తం మధ్యమం పితురార్జితం
అధమం భ్రాతృవిత్తంచ స్త్రీవిత్త మధమాధమం॥

క॥ తనయార్జితార్థ ముత్తమమనఁదగుఁ, బితురార్జితంబు మధ్యమచందం
బును, భ్రాతృవిత్త మధమము ధనమధమాధమము స్త్రీవితతి దగును శివా॥

4. ఘృతేన వర్ధతే బుద్ధిః క్షీరేణాయుష్యవర్ధనమ్
శాకేన వర్ధతే వ్యాధిః మాంసం మాంసేన వర్ధతే॥

క॥ బుద్ధివిశేషము నేతిన వృద్ధియు, నాయువుకు బాలు, విరివిగఁ గూరల్
ఇద్ధర రోగము, ప్రజకు సమృద్ధిగ మాంసముకు మాంసమే బలము శివా॥

5. కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకం
మౌనేన కలహం నాస్తి.....................

క॥ కఱవేమి లేదు కృషితో, దురితంబును లేదు జపముతోఁ, గలహంబుల్
మఱిలేవోర్పున, జాగ్రత పరుడైనను భయములేదు ప్రజకెందు శివా॥

6. అదానదోషేణ భవేద్దరిద్రః దారిద్ర్యదోషేణ కరోతిపాపం
........................ పునర్దరిద్రో పునరేవపాపి॥

క॥ మును దా నివ్వనిదోషంబునను దరిద్రుఁడు, దరిద్రమున నతిపాపం
బొనరించు, దాన నరకంబునఁ బడి, మఱలను దరిద్రమునఁ బుట్టుశివా॥

7. స్త్రీణాం ద్విగుణమాహారం బుద్ధిశ్చాపి చతుర్గుణః
సాహసం షడ్గుణంచైవ కామ మష్టగుణం భవేత్॥

క॥ వినుమాహారము, సాహసమును, బుద్ధి మనోరథమును బురుషునికంటెన్
గనుగొన రెండును, నాల్గారెనిమిది పాళ్లెక్కుడందు రింతులకు శివా॥

అనువాదము క్రమాలంకారముతో ముచ్చటగా నున్నది. కామ మనుదానినాంధ్రీకర్త 'మనోరథ' మనుట మూలకవ్యుద్దిష్టము కాదు.

8. ప్రాతరామలకం చైవ భుక్త్వాతు బదరీఫలం
కపిత్థం సర్వదా పథ్యం కదళీ నకదాచన॥

కం॥ తనువారోగ్యము పఱగడుపున నుసిరికపండ్లు, బదరి భోజనమువలన్,
ననువుగల వెలఁగపండును తినఁదగు నెపుడరఁటిపండు తినరాదు శివా॥

9. ముఖం పద్మదళాకారం వాచా చందనశీతలం
హృదయం కర్తరీతుల్యం అతివినయం ధూర్తలక్షణం॥

కం॥ శతపత్రదళాభాస్యము, మితచందనశీతలంబు మృదువాక్యములున్,
మతికర్తరీసమానం బతివినయము ధూర్తలక్షణాదికము శివా॥

8 వ పద్యమున శ్లోకమునందలి 'సర్వదా' యనుపదమును, 9 వ దానిలోని 'హృదయం' అనుపదము నాంధ్రీకర్త విడిచిపెట్టినాఁడు. ఇట్టివి చాలగలవు.

10. విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం
నహీ వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనాం॥

కం॥ సూనులు కలుగనిచాన, లహీనప్రసవంపుబాధ లెఱుఁగని భంగిన్
బూని యనక్షరు లతివిద్యానిధుల రసజ్ఞ తెఱుఁగరొ భువిని శివా॥



# ముడుంబై వేంకటకృష్ణమాచార్యుఁడు

క్రీ. శ. 1800 ప్రాంతము.

ప్రాచీనకాలములో తూర్పుసముద్రతీరమునుండి పడమట తెలంగాణమువఱకు మూఁడు ముఖ్యమైన రాజ్యములు వెలసినవి. (1) ఉదయగిరిదుర్గరాజ్యము. (2) శ్రీశైలమండలరాజ్యము. (3) తొండ (తుండీర) మండలరాజ్యము. ఇందులో నుదయగిరిదుర్గమును ముఖ్యస్థానముగాఁ జేసికొని రెడ్లు పాలించుచుండిరి. కాని తమ ప్రాబల్యము నధికము చేసికొనవలెనని ప్రయత్నించుచుండిన రాచకొండ వెలమప్రభువులకును నీయుదయగిరి రెడ్డిప్రభువులకు నిరంతరవైరము. తమరాజ్యము తెలంగాణములో క్షీణించినతరువాత రాచకొండ వెలమలు 'కలివిలి' దుర్గమును (వేంకటగిరిని) కట్టుకొనిరి. ఆప్రాంతములను స్వతంత్రముగాఁ బాలించుటకు మొదలుపెట్టిరి. తరువాత నుదయగిరిదుర్గమును విజయనగర ప్రభువులు స్వాధీనము చేసికొనుటతో వెలమప్రభువులు సామంతులైరి.

రెండవది శ్రీశైలమండలరాజ్యము. ఇది కందనోలురాజ్యము. చిట్టివేలిలోని మట్లరాజులు పేరునకుమాత్రము రెడ్డిరాజ్య సామంతులుగ నుండిరి.

మూఁడవది తొండమండలరాజ్యము. ఇది ఘటికాచలమనఁబడు చోళలింగపురమునుండి శ్రీకాళహస్తివఱకు వ్యాపించియుండునది. ఇప్పటికిని కాళహస్తికి నాలుగుమైళ్లు దూరమునఁ దొండమనాడను గ్రామమున్నది. దాని నానుకొనినట్లుగా "బొక్కిసంపాళె" మను కుగ్రామమును కలదు. ఆకాలమునఁ జంద్రగిరి దుర్గాధీశులకు లోఁబడి కాళహస్తి నేలుచుండిన దామెర్లవారి ఖజానాలువగైరా లీబొక్కిసంపాళెములో నుండునవి యఁట.

తొండమండలములోని (కార్వేటినగర) నారాయణవనప్రాంతమును సాళ్వరెడ్లు పరిపాలించుచుండఁగా వారియొద్ద దండనాథులుగా నుండిన క్షత్రియప్రభువులు వారిపైఁ దిరుగఁబడి, యోడించి యాప్రాంతమును స్వాధీనముచేసికొనిరి. దానితో నది క్షత్రియరాజ్యమైనది. వీరు కూడ నొకప్పుడు చంద్రగిరిరాయలకుఁ గప్పము కట్టుచువచ్చిన సామంతరాజులే!

దీనినిబట్టి యుదయగిరిదుర్గములో, కనిగిరి, బుచ్చిరెడ్డిపాళెము, వేంకటగిరి యను జమీనులును, శ్రీశైలమండలములో, కందనోలు, చిట్టివేలి, ఎట్టిగుంట్లకోట యనుజమీనులును, తొండమండలములో కార్వేటినగరము, బంగారుపాళెము, పుంగనూరు, కాళహస్తి జమీనులును నాయామాండలిక ప్రభువుల రాజ్యములకు లోఁబడియుండునవి. ఈమూఁడు రాజ్యములు మొత్తముమీఁద విజయనగరసామ్రాజ్యాధీశులకు లోఁబడినవి. కాని ఇదియంతయు బహమనీ, నైజాముసుల్తానుల రాజ్యాక్రమణలకు ముందటిసితి.

ఇందులో నాయాసంస్థానములు భాషాభివృద్ధి కెంతవఱకుఁ దోడ్పడినవని తెలిసికొనుట సులభసాధ్యముకాదు.

ఉదయగిరి (తరువాత కొండవీడు) ముఖ్యనగరములుగా నేలిన రెడ్డిరాజులు తాముస్వయముగా సంస్కృతాంధ్రములలో, విద్వాంసులగుటచేతఁ బండితులను గవుల నాదరించుచు వచ్చిరి. రేచర్ల గోత్రీకులయిన వెలుగోటివెలమప్రభువులుకూడ సారస్వత ప్రియులైనందున ననేకకృతులకుఁ గర్తలైనారు.

అట్లే తొండమండలములోని కార్వేటినగర ప్రభువులు సంస్కృతాంధ్ర సాహితీసంపన్నులై యెన్నియో గ్రంథములు సృష్టియగుటకుఁ గారకులయిరి. కాళహస్తిరాజులైన దామెర్లవారి భాషాసేవ యంతగాఁ బ్రచారమునకురాలేదు. కాని యాసంస్థానములో దామెర్లవారి పాలనకుఁ బూర్వోత్తరకాలములలో ధూర్జటివంటి కవులు వెలసియుండినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. మట్లివారు (చిట్వేలి) తెలుఁగుభాషకుఁ గన్నాకయినట్లుగా వారిమీఁద నెందఱోకవులు చెప్పినచాటువులు ఘోషించుచున్నవి. అనంతభూపాలుఁడు 'కకుత్స్థవిజయ' గ్రంథకర్త.

ఈ ప్రాంతములలోని జమీనులన్నిటిలోను ప్రఖ్యాతివహించి, వాఙ్మయసేవచేసినవి నాలుగుమాత్రము ముఖ్యముగాఁ జేర్కొనఁదగినవి. (1) కార్వేటినగరము, (2) వేంకటగిరి, (3) ఉదయగిరి, (4) చిట్వేలి (ఎట్టిగుంట్లకోట).

శతకముల సందర్భములోఁ గార్వేటినగరములోఁ బుట్టినవి నాలుగు. (1) వేణుగోపాలశతకము, (2) లావణ్యాశతకము, (3) శ్రీకృష్ణశతకము, (4) సదాశివేశ్వరశతకము.

వేంకటగిరిలోఁ బొడచూపినవి రెండు :— (1) బ్రహ్మానందశతకము, (2) శార్దూలశతకము.

తక్కిన రెండు సంస్థానములలో నేవైన నున్న వేమో తెలియదు.

ఇఁక అసలువిషయము:—ముడుంబి వేంకటకృష్ణమాచార్య విరచితమైన "శ్రీకృష్ణశతకము" (1939 లో ముద్రితము)ను నాప్రియహితులు, సారస్వతోపాసకులు భాషాభూషణులు, శ్రీబూదూరు రామానుజులురెడ్డిగారి మూలమున సంపాదింపఁగలిగితిని. దానిలో వారే వ్రాసిన "విజ్ఞాపనము"నుండి యీక్రిందియంశము లుటంకించుచున్నాఁడను :—

"ఈశ్రీకృష్ణశతకమును రచించిన ముడుంబి వేంకటకృష్ణమాచార్యుఁడత్యంతగణనీయుఁడు. ఈకవితల్లజుఁడు మద్గురువర్యుఁడును, "నీతిమాలి"—కాది గ్రంథకర్తయునై ఖ్యాతిఁగాంచిన ముడుంబి వేంకటరమణాచార్య జనకుఁడు. విశిష్టాద్వైత మతస్థుఁడు. శ్రీవత్సగోత్రజుఁడు. శ్రీ వేంకటరమణార్యకవికిని వేంకటాంబకును పుత్రుడు. చిత్తూరుమండలాంతర్గతమగు తిరుత్తనితాలూకా చివ్వాడపాయకట్టుకు చెందిన అగరము గ్రామవాస్తవ్యుఁడు. శ్రీకార్వేటినగర సంస్థానాష్టకవులని వాసిఁగాంచిన సారంగపాణి— పేరూరు మునుస్వామయ్య—పోలిపెద్ది వేంకటరాయడు మొదలగువారిలో ముఖ్యవిద్వన్మణియైయుండి, ఏతత్సంస్థానాధీశునివలన 'విజయరాఘవవు' రాగ్రహారాదికములచే బహూకరింపఁబడినవాఁడు. శ్రీకృష్ణశతకముతోఁబాటు—(1) ద్విపదోత్తర రామాయణము (2) ఆధ్యాత్మరామాయణము, (3) శ్రీరామస్తవచూర్ణిక, (4) పోలేరమ్మ దండకము ఆదిగాఁగల గ్రంథములకు కర్తయై చిరతరకీర్తిగాంచిన కవిశేఖరుఁడు. ఈకవిపుంగవుఁ డించుమించు నాకు బదిసంవత్సరముల ప్రాయము వచ్చువఱకు జీవించియుండియాంధ్రభాష కమూల్యమగు సేవ యొనరించెను. ఈకవివర్యుని గ్రంథములలో ఈ "శ్రీకృష్ణశతకము"—1897 సంవత్సరారంభమునను, "శ్రీరామస్తవచూర్ణిక" 1925 సంవత్సరాంతమునను ముద్రణములైనవి. తదితర గ్రంథము లముద్రితములు."

శ్రీకృష్ణశతకములో 108 మత్తేభశార్దూలవృత్తములు గలవు. "కృష్ణా! దీనరక్షామణీ!" యనునది మకుటము. కవి స్వవిషయమును గూర్చి చెప్పుకొనిన కడపటి రెండుపద్యములివి :—

"శ్రీవత్సాంచిత గోత్రజప్రవరుఁడన్, శ్రీవేంకటాంబామణీ
శ్రీవేంకట్రమణార్య పుత్రుఁడ, భవత్సేవా ప్రవీణుండ, నో
శ్రీవత్సాంచిత వక్ష, నిన్ను నిశముల్ సేవింతు, దిక్కై వె న
న్నావన్ వేంకట కృష్ణయార్యు, నిఁక, కృష్ణా, దీనరక్షామణీ॥"

"ధరఁ బెంపొందిన శాలివాహనశకాంతర్భుక్త భూతాష్టభూ
ధరసోమాన్వితమైన దుందుభి శరద్వర్గస్థ రుగ శ్రావణ.
స్థిరవారాన్విత శుక్లపూర్ణిమను, నీ శ్రీపాదమం, దబ్జమం
జరిగా నీ శతకంబుఁ గూర్చితిని కృష్ణా, దీనరక్షామణీ॥"

రెండవపద్యములో శతకరచనాకాలము శా॥ శ॥ 1785 నకు సరియయిన దుందుభినామసం॥ర శ్రావణశుక్లపూర్ణిమా శనివారముగా కవి వేర్కొన్నాఁడు. ఆకాలమున కితనివయస్సు ఎంతో కనుగొనుటకుఁ గూడ నాధారము శతకములో లేకపోలేదు. ఈక్రిందిపద్యము గమనింపుఁడు :—

"సడలెం గాయమునం బటిష్ఠత, గరిష్ఠాహంక్రియల్వీడె, వా
గ్జడిమంబుప్పతిలెం, నొడల్వడఁకెఁ, గార్శ్యంబందె నెమ్మేనునేఁ
డడుగే యామడయయ్యె, నిట్టియెడ నా కన్యంబు లేద దయ్యానీ
యడుగుల్ దక్క మరొండుదిక్కు హరి కృష్ణా"

దీనినిబట్టి కవి తనవార్ధకమున, ననఁగా 55—60 యేండ్ల ముసలితనములో నీశతకమును వ్రాసినాఁడని స్పష్టమగుచున్నది. అనఁగా శా॥ శ॥ 1720—25 ప్రాంతములలో జన్మించి యుండునని యూహించినయెడల క్రీ॥ శ॥ 19 వ శతాబ్దారంభములో నతనిపుట్టుక యయియుండును. ఇతఁడు పోలిపెద్ది వేంకటరాయకవికి ఇంచుమించు సమకాలికుఁడై యుండును.

ఈకవి తనపోషకప్రభువువలన "విజయరాఘవపు" రాగ్రహారమును బహూకృతిగాఁబొందియు, నతనిపేరీశతకమున నెక్కడను బ్రస్తావింపకపోవుట విచిత్రము. బహుశా, భక్తిరసశతకమయినందువలన శ్రీకృష్ణునిఁదప్ప మఱి యెవరిని స్తుతింపరాదనుకొనెనేమో! అదియునుగాక యితని ద్విపదోత్తరరామాయణము, అధ్యాత్మరామాయణము మొదలగు కావ్యములలో వివరించియున్నాఁడేమో ?

ఈకవిపౌత్రుఁడు శ్రీముదుంబి కృష్ణస్వామయ్యంగారు సజీవులు. వారియొద్ద నితని పై కావ్యములున్నట్లు తెలియుచున్నది.

ఇప్పటికి ప్రచారములోనున్న యీకృష్ణశతకమును మాత్రమే ప్రమాణముగాఁ దీసికొని, కవిగారి విద్వత్కవితాప్రతిభలను నిర్ణయిం

చుట యొకవిధముగ సాహసమేయయినను, గొంతవఱకు సాధించుట యెందుకైన మంచిదను నభిప్రాయముతోఁ బూనుకొనుట యయినది.

శ్రీకృష్ణశతకకర్తకవిత్వము ప్రౌఢమయినది. సంస్కృత జటిలస మాసము లితనికిఁ "గొట్టినపేలపిండి". శబ్దాలంకారములనఁ జెవికోసి కొనురకము. అక్కడక్కడఁ గొన్ని పద్యములలోఁ గనఁబడు నర్థాలంకారములుకూడ నద్భుతములుగానున్నవి. "దాశరథి" "శ్రీకాళహస్తి" శతకములలోని యనుకరణములుకూడఁ జాలవఱకుఁ బుడికిపుచ్చుకొనినాఁడు. దుష్కరప్రాసములతోడను, ద్విప్రాసత్రిప్రాసలతోడను, గొన్నిపద్యములు కనఁబడుచున్నవి. శబ్దాలంకారములకుఁ గొన్నిమచ్చుపద్యములు.

అంత్యప్రాసయుక్త ముక్తపదగ్రస్త పద్యం :—

"మురళీగానవిలోల, లోలనయనామోహక్రియాజాల, జా
లరమా లాలనశీల, శీలపరిధీ లబ్ధాశయాఖేల, ఖే
లరతాభీరకబాల, బాలశశిఫాలా, ఫాలనేత్రాశ్రయా,
శరణార్థిన్ నను నేలవేల ? హరి, కృష్ణా, దీనరక్షామణీ !"

అంత్యప్రాసనియమబద్ధము :—(స్తుతి)—

"కనకోద్యన్మృదుచేల, ఘోషతరుణీ కామక్రియాలోల, భూ
వినుతాత్యద్భుతకీర్తిజాల, మునిరాడ్విశ్వక్రియామూల చి
ద్ఘన భక్తప్రియశీల, నవ్యకరుణోద్యద్వల్లికావాల, న
న్ననిశంబుం దయనేలవేల ?, హరి, కృష్ణా, దీనరక్షామణీ!!"

పై అలంకారములోనే :—(నీతి)

"జలసౌకర్యము లేనియూరు, విధవాజాలంబు బల్వొరు, లం
జలకాముండగు వానిపేరు, పటికార్చంగాని బంగారు, దు
ర్జిలయంబైన బిడారుతీ, రుపకృతుల్ నీనామసంకీర్తనల్
సలుపంజాలనినోరు నీఱుగద, కృష్ణా ! దీనరక్షామణీ !"

త్రిప్రాసాలంకారము :—

"తగదయ్యా, తెకతేరనేయుటను, నాతండ్రీ, త్రిలోకాధినే
తగదయ్యా, నతభక్తపోషణ కళాదక్షుండవౌ మేటి దా
త గదయ్యా, దయనీయులం దిటుల నిర్దాక్షిణ్యుఁడౌటెన్న, విం
త గదయ్యా, నగుబాటు సెందకుము, కృష్ణా, దీనరక్షామణీ !"

ద్విప్రాసాలంకారము :—

"నగరాడ్ధీర, రమావిహార, మునినానారాధనాధార, ప
న్నగరాట్శాయి, నతేష్టదాయి, శరణన్నన్ నాయెడం గూర్మిఁ బూ
నగరాదా, దయలేద, నావెతలు మాన్పన్ జేతఁగాకున్నచో,
నగరా ? లోకములోని మానవులు, కృష్ణా, దీనరక్షామణీ !"

రూపకోత్ప్రేక్ష :—

స్వగుణధ్వానము గర్జ, మూర్ధ్వగమణిచ్ఛాయల్ మహేంద్రాయుధం
బు, గళద్రక్తము లంబుపూర, మమరుల్ మోదించు సారంగపూ
గ గతిక్ మీఱ, శరోగ్రవృష్టి సురజిద్గాత్రాదులం బెల్లు నిం
చఁగ మేఘంబగు శార్ఙ్గముం గొలుతు, కృష్ణా, దీనరక్షామణీ !

శ్లేష :—

"చతురాస్యుల్, విబుధేశ్వరుల్, శుచిహితుల్, సద్ధర్మరక్షాదయా
రతులుం, బుణ్యజనుల్, ప్రచేతసులు, జగత్ప్రాణాగ్రదుల్ సౌమ్య భా
స్వత్సర్వజ్ఞులు, భోగిశేఖరులునై, సర్వోన్నతిం బొంది, ధ
న్యత దీపింతురు, తావకాశ్రితులు, కృష్ణా, దీనరక్షామణీ॥"

సంస్కృత జటిల సమాసములు :—

1. "వితతాస్యాహృతకాండ జర్జరిత పృథ్వీగర్త దృష్టాహిత
శ్రుతిపాటచ్చర గాత్రహేఁడన పటు......మిపక్షాళనా
మతి వాఃపూర పునః ప్రపూరణ జలామర్ద్దోత్థడిండీరసం
హతి మద్భాసిత విధూదయా"

2. "ప్రథమాలోకన భక్తిసంయుత విధిప్రక్షిప్త పాద్యాంబు మ
త్పరిధితాంభోనిధి దంష్ట్రికాగ్ర ధరణీభాగోపహార్యార్చనా
విధి లగ్నాంబుజపద్భ్రమాస్పద"

3. "గిరికాండాసన చండశౌర్యబల మోఘీకృద్వ్యధూశీలతా
జర దుర్జేయ పురత్రయాసుర శుభాచార భ్రమాపాది వి
స్తర మిథ్యా పటువాద తోషిత గిరీశప్రాప్త సర్వజ్ఞతా
క్షర సారూప్యసమంతభద్రదవర"

4. చలదాత్మీయ కరాసి నిర్దళిత తుచ్ఛ మ్లేచ్ఛ రాహూత్త భి
జ్జలజాతప్రియ బింబ మధ్యబిల 'దృశ్యా'కార నైల్యచ్ఛలా
తుల నిష్పార్శ్విత కంకణగ్రహణ ధీతోయావగాహా
ర్థ స్వర్జలవద్భ్రాంతిద"

ఇంతశతకములోను నచ్చతెలుఁగు శబ్దములతో మచ్చునకన్న శ్లోక్కపద్యమే యీకవి రచియించినాఁడు.

"పులుఁగుంద త్తడిరా పయాళి సలగక్, బుల్దిండిరా మొత్తముం
బలె నెమ్మేక్ దగ పైడిదువ్వాలువ, యీపై వల్లెవాటొప్పఁగాఁ
గలుముల్ చిక్కెడు లేమ పేరెదను, పక్కం జుట్టంవాలొప్ప, నో
జలజాతేక్షణ, నామదిన్నిలుము, కృష్ణా, దీనరక్షామణీ"

యాచకుఁడు లోకమున కెంత చులకనయో యీక్రిందిపద్యములో వివరించినాఁడు :—

"తృణమే చుల్కన, యంతకుం జాలకనెంతో దూది, తాఁజుల్కనా
గణుతింప న్మతి యాచకుం, డదియు నిక్కం బేని, గాలేటికో

యణుమాత్రంబును గొంచుఁబోదు, భయమానా గాలికిన్
యాచనాచణుఁడౌ నీతఁడు దన్ను వేఁడునని కృష్ణా, దీనరక్షామణీ"

ఆకాలపు రాజులను గూర్చి :—

"నీచుల్ భూపతులైరి, వారికడ దుర్నీతు ల్దురాచారులే
వాచాలత్వముఁ గాంచి మించిరి"

లుబ్ధులనుగూర్చి :—

"అభాగ్యప్రాప్తులౌ లుబ్ధులన్ బ్రతుకుంబీనుఁగు లిద్ధరా
తలమునన్ భాగ్యాయువుల్గల్గి యున్నతటి న్నేమగుఁ జన్న నేమగును ?"

ఈశతకమునఁ గ్వాచిత్కముగా వాడబడిన జాతీయములు కొన్ని :

బ్రతుకుం బీనుఁగులు, నీచిత్తంబు నాభాగ్యము, కాడంగట్టిన తుండుపోలిక, ముంచం దేల్చ నీభారము, మొట్టో మ్రొక్కో యటన్న యట్లు, తలకొట్లమారి, గయ్యాళి, బ్రతుకాద్యంత విహీనము. గుట్టెల్ల నేనెట్టుం బైటికి దేకమాననుసుమీ, రట్టేల?, నావంటి దాసరి, నీవంటి మహాత్ముఁడు, పురుషశ్రేష్ఠత కట్టిపెట్టుము, తెక తేర.

ఈశతకములోఁ జాలవఱకు దాశరథిశతకపద్యముల యనుకరణములున్నవి. మచ్చునకుఁ గొన్నిపద్యములు :—

1. తరణికులేశ నానుడులఁ తప్పులుగల్గిన నీదునామస
ద్విరచితమైన కావ్యము పవిత్రముకాదె, వియన్నదీజలం
బరుగుచు వంకయైన మలినాకృతిఁ బాఱినఁ దన్మహత్వమున్
దరమె గణింప నెవ్వరికి దాశరథీ కరుణాపయోనిధీ !" (దాశరథిశతకము.)
"ధరణిం దావకదివ్యనామకథార్థంబైన మద్వాక్కు, లే
సరణిం దప్పుఘటిల్లినన్ విమలమౌఁ జర్చింపఁగా, వంకలై
పారలంబాఱినఁ, బంకమైన నురువుల్ పొల్పారినన్ జాహ్నవీ
ఝరతోయంబు పవిత్రమైనక్రియ, కృష్ణా, దీనరక్షామణీ" (శ్రీకృష్ణ శతకము)
2. కంటి నదీతటంబుఁ, బొడఁగంటిని భద్రనగాధి వాసమున్. (దాశ)
కంటిన్ దావకవాహమౌ ఖగపతిన్, గంటిన్ భవత్పాదముల్ (శ్రీకృష్ణ)
3. "పాతకులైన మీకృపకుఁ బాత్రులుగారె తలంచిచూడ, చ
ట్రాతికిఁగల్గె పావన, మరాతికి రాజ్యసుఖంబు గల్గె" (దాశరథి)
"కరికిన్ ముక్తిఘటిల్లెఁ, గోతికిని నిక్కంబయ్యె రాజ్యంబు" (శ్రీకృష్ణ)
4. "డాసిన చుట్టమా, శబరి, దాని దయామతి నేలినావు, నీ
దాసునిదాసుఁడా గుహుఁడు, తావక దాస్యమొసంగినావు" (దాశరథి)
"గజయూథేంద్రుఁడు తండ్రియా, పిలుపుకై కాంక్షించియుండం
గ, నావిజయుం డెన్నఁగ నీదొరా ?, నియతి సేవింపంగ" (శ్రీకృష్ణ)

ఇవి కొన్నిమాత్రమే. విస్తరభీతి విరమింపవలసినచ్చినది.

ప్రకృతమున్న సర్వజ్ఞయాచమనాయనింవారు పైకడపటివారి కుమారులు. అనఁగా ముప్పదియవతరము వారగుదురు.

మన గోపీనాథము వేంకటకవిగారి పోషకులయిన సర్వజ్ఞకుమార యాచమనీని నిర్యాణకాలమయిన క్రీ॥ శ॥ 1892 నుండి నేటి 1953 సం॥రముల వఱకుగల 61 సంవత్సరములలోను వేంకటగిరిసంస్థాన పాలకులయిన వెలుగోటివంశస్థులు ముగ్గురు.

ఈకవి తనపోషక ప్రభువువలన శా॥ శ॥ 1782 సరియగు క్రీ॥ శ॥ 1860, సిద్ధార్థి శ్రావణ శుద్ధ 15 న, మాఁచెర్ల సీమలోని పెరుగుపల్లి గ్రామమును బహుమతిగా దానపత్రము పొందినాఁడు. ఇతఁ డీశతకమును మాత్రమేకాక, యనేకోద్గ్రంథములనుగూడ రచించినాఁడు. కాని యన్నియు ననువాదములుగనే కనఁబడుచున్నవి.

(1) గోపీనాథ రామాయణము, (2) భగవద్గీతాశాస్త్రము, (3) బ్రహ్మకైవర్తమండలి శ్రీకృష్ణజన్మఖండము, (4) మాఘము (శిశుపాలవధయాంధ్రీకరణము), (5) బ్రహ్మానందశతకము, (6) రాధికాపరిణయము.

ఇందులో మొదటిదానిని సర్వజ్ఞకుమారయాచేంద్రులు క్రీ॥ శ॥ 1859 లో ముద్రింపించిరి. కృష్ణజన్మ ఖండమును, మాఘకావ్యమును, పై వారికుమారులయిన గోపాలకృష్ణయాచేంద్రులు అచ్చువేయించిరి. (మాఘకావ్య మొకపర్యాయము మదరాసు విశ్వవిద్యాలయ పరీక్షకుఁ బాఠ్యముగాఁగూడ నియమింపఁబడినది). ఇతనికిముం దీమాఘకావ్యమును 'పాచిరాజువీరన్న' యను కవి తెనిఁగించినట్లు తెలియుచున్నది. భగవద్గీతాశాస్త్రమును వావిళ్లవారు ప్రచురించియున్నారు. ఇతని కడపటి కృతియయిన రాధికాపరిణయమును శ్రీసర్వజ్ఞకుమార యాచమనీని బావమఱదియు, తిరుపూరు జమీందారునగు వెల్లంకి సూర్యారాయనికి కవి యంకితమిచ్చినాఁడు. కాని గ్రంథము ప్రకటింపఁబడినదో లేదో తెలియదు.

ఇతని గ్రంథములనుగూర్చి యాంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహములో నీవిధముగానున్నది. "గోపీనాథము వేంకటకవి యథామూలముగా వాల్మీకిరామాయణమును దెనిఁగించివ్రాసిరి. వేంకటకవి వేంకటగిరిసంస్థానమునఁ బ్రసిద్ధికెక్కినకవీశ్వరుఁడు. బ్రహ్మకైవర్త పురాణములోని కృష్ణజన్మఖండమును, మాఘకృతమగు శిశుపాలవధనుగూడ

నితఁడు తెనిఁగించెను. భగవద్గీతాశాస్త్రమును పద్యముగా నొనర్చెను. ......ఇతఁడాధునికుఁడగుట నితనివిలువఁ జూఁచుటకు మనమశక్తుల మేమో?...ఇతని యథామూల వాల్మీకిరామాయణమాంధ్రీకృత యథామూలము లన్నిటిలో నుత్తమోత్తమమైనదని యయ్యెపుస్తకముల నొకేచోట, నొకప్పుడే చదివినయెడల పాఠకులకుఁ దప్పక విశదమగును. సంస్కృతపంచకావ్యములలో నొకటియగు మాఘము నితఁడు తెలిఁగించిన తెఱంగునకు శ్రీనాథుఁడును దలయూఁపవలసినదే! శైలి "విద్వత్సం స్తవనీయకవితావేశంబును" మెఱయించుచు సలలితపద ప్రయోగనైపుణ్యమును జూపుచు చదువఁజదువనింపులు పుట్టించు చున్నది. ఇతఁడు స్వతంత్రగ్రంథము వ్రాయమి కళంకము, శోచనీయము. ఉన్నంతలోఁ గృష్ణజన్మఖండ మించుక స్వాతంత్ర్యము సూచించెడు. ఇతఁడు మారనసింగనల పంక్తిని కూర్చుండవలసిన వాఁడన్న సాహసోక్తి కాదు. ఒక్కొక్కెడఁ గన్పట్టు పూరణపదంబులు గొన్నితప్ప నితనియందు లోపము లెవ్వియు లేవు." ఈయభిప్రాయము వేంకటకవిగారి గ్రంథపరిచయమున్న విద్వత్కవులకెల్ల సర్వదా సమ్మతమే కాకుండ— ననుభవైకవేద్యముకూడ.

పందొమ్మిదవ శతాబ్దకవీంద్రులలోఁ బ్రథమశ్రేణికివచ్చు మండపాక పార్వతీశ్వరశాస్త్రి దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి మొదలైన వారితోఁగూడ నీగోపీనాథము వేంకటకవి చేరఁదగినవాఁడు. అతని కవిత్వము నిరర్గళ గంగాప్రవాహమువలె నడ్డమాఁకలులేక సాగిపోవుచుండును. ఊఁతపదములు చాలతక్కువ. ఇతని కృతులన్నియు నాంధ్రీకరణములయినను, జదువువారి కావిధముగాఁ దోఁపవు. లక్ష్యలక్షణ సమన్వయము చక్కఁగాఁ దెలిసిన యీమహాకవి కవిత్వములోఁ గ్వాచిత్కముగా వ్యాకరణవిరుద్ధప్రయోగములు (ఇత్వసంధులు — కొనికి, కకారాదేశము మొదలగునవి) కొన్ని యుండినను, నవి కవులకు సాధారణముగానుండు నిరంకుశత్వమునకు, స్వాతంత్ర్యమునకు జమకట్టవలెను గాని, దోషములుగాఁ బరిగణించుటకు వీలులేదు.

ప్రభువు ప్రార్థన ననుసరించి వ్రాయఁబడిన యీ శతకములో నూటముప్పది పద్యములున్నవి. అన్నిటికి నెత్తుగీతి తుదిపాదము "మదిఁ దలంప బ్రహ్మానంద మదియకాదె" యని మకుటముగా నేర్పడినది.

ఈసీసపద్యములలోను, వాని ననుసరించు నెత్తుగీతములలోను బెక్కింటికి నాలుగింటికి మించినపాదములు కవిరచించినాఁడు. ఆవిధముగా వ్రాయుటకుఁ గవి కారణమును వివరించినాఁడు :—

"ఈశతకంబున నేపద్యమందు, నాకేవిలాసము సెప్ప నిచ్ఛగలిగె
నావిలాసంబున కనుగుణసంగతులన్నియు స్పష్టంబు, లగుటకిట్లు
క్రమ మొప్ప నాల్గుపాదములను విధిమాని వలసిన పాదముల్వ్రాయఁ గూర్చి
సీసపద్యంబులఁ జెప్పితిఁ జరణంబులెక్కువ యని కవులెంచవలదు,
పదములధికంబులైనట్టి పద్యములను మాలికలుగా గ్రహించి సమగ్రముగను
సర్వభావార్థము లెఱింగి, చతురులెల్ల ముదముగనుఁడు"—అని

ఇట్లు కాక యెక్కువగానున్న పాదములనన్నిటిని, నాలుగేసి పాదములక్రింద లెక్కపెట్టిన నిప్పుడుండు 130 పద్యములు శతకద్వయమగుటలో సందేహము లేదు.

ఇఁకఁ బద్యములలోని విషయవిభాగము లీక్రిందివిధముగానున్నవి.

1. ఇష్టదేవతాస్తుతి—శతకరచనాకారణము. ప్రభుప్రేరణము—స్వవిషయము—విషయసూచనము. (1 నుండి 6 పద్యములు).

2. మానుషానందప్రభావము — సురతము బ్రహ్మానందమని యుద్ఘాటనము. (7 వ పద్యము).

3. శ్రీకృష్ణలీలలు—అవతారప్రభావము. (8-23 పద్యములు).

4. వ్రేపల్లెగోపికలతోడి శృంగారక్రీడలను శ్రీకృష్ణుఁడుద్ధవునితోఁ జెప్పఁబూనుట (24 పద్యము).

5. శ్రీకృష్ణుని నానావిధశృంగారక్రీడావర్ణనము. (25 నుండి 120 వఱకు).

6. శ్రీకృష్ణసందేశము నుద్ధవుఁడు వ్రజాంగనలకుఁ జెప్పుట (121 పద్యము).

7. గోపికల విరహవేదనము (122-123 పద్యములు).

8. ఉద్ధవుఁడు మధురకువచ్చి గోపికల పరితాపమెఱిఁగింప శ్రీకృష్ణుఁడు వ్రేపల్లెకుఁబోయి వారితోఁగూడి సుఖించుట (124 పద్యము)

9. రతిరహస్యవిచక్షణ (126 పద్యము).

10. పదునాఱుకళల వివరణ (126 పద్యము)

11. పాఠకులకుఁ గవివిన్నపము (127-129 పద్యములు).

12. శుభాకాంక్ష, మంగళము (130 పద్యము).

కామశాస్త్రమునఁ జెప్పఁబడిన 16 కళలను గవి యీవిధముగా వివరించినాఁడు :—

(1) ప్రమదాకళాశీఘ్రపతనకారణము, (2) నరకకళాపరివర్జనస్వాతంత్రత, (3) బాహ్యారతమునఁ దరుణీకళాస్రావణము, (4) యోనిసంకోచము, (5) యోనిశబ్దాపనము, (6) రజస్సందర్శనముకన్న మున్న సీమాంతరభోగక్రియ, (7) నారీకళోత్సర్జనస్వాతంత్రత, (8) స్ఖలనాంతమునఁ బునఃకరణమునకుఁ దత్క్షణంబున వృద్ధిచేసికొనుట, (9) మున్నుగ జరిగిన ప్రముచ్చసంగమం బెఱుంగుట, (10) భవిష్యద్రజోజ్ఞానము, (11) జలనాడీవర్ణనము, (12) స్త్రీయోనిగాధాగాధముల వ్యత్యస్తము, (13) ప్రథమమాసమందే వామాగర్భవిజ్ఞానము, (14) ఆంతరభోగవంధ్యాత్వనిర్ణయంబు, (15) మదనగేహాంతరస్థిత లింగమున, మకరధ్వజమును నెలంత యవలఁద్రోచుట, (16) యువతితోఁ గ్రీడించునపుడు భగాంతర్గతామయముల నెఱుంగుట.

ఈశతకములో నా యా నాయికలతోడి క్రీడలను వర్ణించు పద్యములసంఖ్యను దిగువ చూపుచున్నాను.

(1) కాముకి (37 వ పద్యము), (2) పరకీయ (38 వ పద్యము), (3) సామాన్య (54 వ పద్యము), (4) ప్రౌఢ (60 వ పద్యము), (5) కన్య (86 వ పద్యము), (6) నవోఢ (96 వ పద్యము).

ఈశతకములోఁ జేర్కొనఁబడిన బంధములు :—

(1) సమబంధము. (2) గో (ధేనుకా) బంధము, (3) గ్రామ్యబంధము, (4) సంవృతోరుబంధము, (5) వివృతోరుబంధము, (6) సంఘాటబంధము, (7) సమవిపరీతబంధము, (8) కుక్కుటబంధము.

సామాన్యములయిన పురుషాయితములు, పికిలిపిట్టలక్రీడలు—ఇట్టివి లావణ్యశతకములోవలెనే చెప్పఁబడినవి.

ఒకచోట దశవిధచుంబనములని చెప్పినాఁడేకాని, వానివివరణములు కనఁబడవు. ఈచుంబనక్రియలోని స్వారస్యము. ఉద్దీపనము—మనకామకళాశాస్త్రములలో విశేషించి పేర్కొనఁబడినను నవి విదేశములలోని కాముకులయిన నాయికానాయకులలోఁ బొందినంత ప్రచారము మనవారిలోఁ బొందలేదు.

ఇందులో న్యాయములు, సామెతలు, జాతీయములు చాలకొలఁదిగనే యుపయోగింపఁబడినను సందర్భోచితముగా నున్నవి.

(1) మధురరసాస్వాదితౌషధ ఘుటికాన్యాయము (7 వ పద్యము), (2) రొట్టెవిరిగి నేతిలోఁబడ్డ విధముగాదె, (3) దొంగ చిక్కుతివి, (4) చీమచిటుకన్న, (5) తళ్లగ త్తెర వేయు, (6) బిడ్డనొప్పులు, (7) గుంజె గుభాలుమను, (8) అల్లిబిల్లిగ, (9) మొగ్గ ద్రావాలు, (10) ఉయ్యాలో జంపాలో, (11) తోడబెల్లము, (12) మోజేలచేసితి, (13) కాశీబనారసు పనులు, (14) కుసుంబావన్నె.

ఈ క్రిందివి కోకోక్తమునకు సంబంధించిన కొన్ని సాంకేతికములు:

తగరుతాకులు, ఘటచక్రము, మెండినమన్మథచ్ఛత్రము, శృంగిబేరచుంబనము, ముద్దాడి బలాగొను, పెడవిల్లుడోలు, కళికారంధ్రము, చల్దివాసన, ఉమ్మెరము, చప్పిడిసేఁత, కామధ్వజము, చడాయించు.

ఈశతకములోఁ గవి యన్యదేశ్యములు విపరీతముగా వాడియున్నాఁడు.

గుర్నము, సాయలు, బస్కులు, ఝట్టి, కపర్దారు, ఖుషీ, సెబాస్గిరి, పసందు, పచ్చిపతాను, బాజీఖావుడాక్, హిందూస్థానీదిరసు (Dress), జరీతాజ్, ఝూకా, ఇతర్, ఇస్తంబల్‌హీక్, అర్గజా, తక్సీరు, మాఫుకరో, నాఫర్మాసిరం, ఫేదామితాయి, విజిటింగుహాలు, (Visiting Hall), గుళ్లోబు, వాలుసైడ్లు (Wall sides) లస్టర్లు, అగరుబత్తీలు, అత్తరు, పంకాలు, చోపుదార్లు, బరాబర్లు, మోర్ఛెలు, సోఫాలు, దర్బారు, ఝమాయించు, దరఖాస్తు, ముక్తసర్బాక్, హిందూస్థానిఖ్యాలు, రేక్తాలు, నహీ, వఖత్తనెడు, టప్పా, (నవవిల్లు) లాహిరి, తమాషా, సారటు, మొఖమల్, గలీబు, (అద్దాల) మహాలు, (పైడి) తఖ్తు, బడేఆద్మీలు, నజర్మజరాలు, గరీబు పర్వర్నలా, కటికాలు, స్వారి, కబురు.

ఈమాదిరి పదప్రయోగ నైపుణ్యములో నితఁడు పోలిపెద్ది వేంకటరాయకవిని పోలును. ఈయిద్దఱు ప్రభువుల సమ్ముఖమున మెలఁగుచుండినవారగుట, కర్ణాటకనవాబుల కాలమున మన భాషలోనికిఁ బ్రవేశించిన యన్యదేశ్యముల ప్రయోగసందర్భశుద్ధిని గుర్తించి, తమ

కవిత్వముతో ధారాళముగా వాడి, పాఠకునను రసవాహినిలో నోల లాడింపఁ గలిగెను.

ఈమహాకవి తన కవిత్వవిశేషములనుగూర్చి యీ క్రిందివిధ ముగాఁ జెప్పుకొన్నాఁడు.

"గుణదోషములు వర్ణగణములు శబ్దార్థ సరణులెన్ని యనుప్రాసబంధ
నియమంబు తెలిసి యెన్నికకెక్కు మృదుమధురోక్తులు గురియించి సూక్తిభంగి,
నతివిపులార్థంబు మితపదంబులలోనఁ బొలియించి ముద్దుమాటలనుగూర్చి,
విరళార్థసంయుక్త సరళశబ్దంబులు పొసఁగ నలంకృతుల్ పొందుపఱచి,
రసము చిలుకంగ వాచకరౌచికాది సప్తవిధ సత్కవీంద్రుల జాడ తెలిసి
శౌరిలీలావిలాసముల్ సన్నుతింతు నరసిచూడ బ్రహ్మానంద మదియొకాదె!"

ఈయభిప్రాయ మితని కవిత్వములోని లోఁతుపాఁతులు క్షుణ్ణ ముగాఁ దఱచి చూచువారికి సర్వదా సత్యమని బోధపడును.

ఇఁక విషయమునుబట్టి యాలోచింపఁగా, నింత బాహాటముగాఁ గొండొకచో నసభ్యముగ, వాత్స్యాయన, కూచిమారాదులకంటెఁ గూడ మించునట్లు, నగ్నశృంగారము నీశతకవస్తువుగా గ్రహించుటలోఁ గవి కిష్టమున్నను, లేకున్నను, దనప్రభువున కేకారణములచేత నది యిష్టమయినదో, యాకారణములు తనకుఁగూడ నచ్చినవను ధ్వనివచ్చునట్లును, నందుచేతనే తానీశతకరచనకుఁ బూనుకొన్నట్లును నీక్రింది మాటలవలనఁ దెలుపుచున్నాఁడు.

(1) "కామసంతృప్తుండు గానివాఁడిల మోక్షకామిగాఁడు" (2) "సురతభవానందమరయ బ్రహ్మానందలేశంబుగాని వేఱుగాదు" —"కాన శ్రీకృష్ణుని గోపికాలీలలను వర్ణింపుఁ"—డని ప్రభువు తన కాజ్ఞాపించినాఁడనుటవలన "ననిష్టమున కంగారకుఁడు పాత్రుఁ" డన్నట్లా నెపము (కేవలము కామకలాప్రసంగమునకు కారణము) ఆతని మీఁదనే, త్రోసివేయుటకుఁ బ్రయత్నించి, యట్టిదానికామోదించి నిర్వహించిన తాను తప్పించుకొనఁ జూచినాఁడు. కాని యదియెట్లును సమర్థనీయముకాదని తెలిసినతరువాత మఱియొక యెత్తెత్తినాఁడు. చూడుఁడు :—మరల తనప్రభువు నోటినుండియే యేమని పలికించుచున్నాఁడో !

"శ్రీకృష్ణుండు వల్లవస్త్రీలగూడి చేసిన లీలావిశేషంబులన్నియు శృంగారశతకంబుఁ జేసి ప్రీతినవలఁ, దదుక్త గీతార్థసారంబంత సంగ్ర

హించి సమస్తసమ్మతముగ నొక్క శతకంబుఁగావింపు" మని తన యేలిక యనెనఁట! ఈకవి బహులౌక్యుఁడు. ఆకాలములోని జమీందారులను, వారియొద్ద మెలఁగువారల నందఱిని మెప్పింపఁగల సమర్థుఁడు.

ఇంత పచ్చిబూతులబుంగ యైన శతకమునుజూచి, చనువుగల వారెవరైన "ఏమండీ! మిమ్ములను ఎంత స్త్రీలోలునిగా మీకవి చేసినాఁడు? సురతానందము బ్రహ్మానందమని మీరే సెలవిచ్చినారఁట!" యని తమ దొరతో మనవిచేసిన కష్టము కలుగునేమో యని ముందుగనే జాగ్రత్తపడి యీశతకము తాను వ్రాయుటకు అంతదూరము ప్రోత్సాహపఱచిన ప్రభువే తటాలున "గీతార్థసారముకూడ వ్రాయుమనినట్లు" చెప్పుట చమత్కారముగా లేదా? అయిన మొత్తమునకు నీకవి గీతాసారసంగ్రహముకూడ వ్రాసినాఁడు. కాని యది సంస్థానాధీశుని కోరికయో, లేక తానీశతకములో చెప్పినమాటలను నిలఁబెట్టుకొనుటయో యగును. ఇట్టిగ్రంథములను (ఆకాలములో) వ్రాయవలసి వచ్చునెడల కవులెన్నియవస్థలు పడుదురో, యెన్ని డొంకతిరుగుడు త్రోవలతోఁ దమచేఁతలను, వ్రాఁతలను సమర్థించుకొనవలసి వచ్చెడిదో యుదాహరణప్రాయముగా చూపుటకు ఇంతదూర మీసందర్భము వివరింపవలసి వచ్చినది.

కామాగ్నిదగ్ధహృదయ మృణ్మయపాత్రలుగల యీకుమ్మరి యావముపొగలోఁగూడ మనకుఁ గొన్ని బంగారుముంతల వెలుగురేకలు కనఁబడుట యెంతైనఁ బ్రశంసింపఁదగినది. అసామాన్యుఁడైన యీకవిలోకపూజ్యుఁడు క్రిందఁజూపిన నీతివాక్యములవంటివి వీలైన చోటులలోఁ బ్రయోగించినాఁడు.

1. భగవద్వాక్యము :— "అరయ నా 'మాయ' నాయంతవానికె, యజ్ఞతయును, బరాధీనతయును గల్గఁజేయు సామర్థ్యంబుచే నొప్పునట్టిది"—(8 వ పద్యము).

2. "తలఁప సర్వజ్ఞునకు నజ్ఞతయును సర్వశక్తియుతునకుఁ బారవశ్యంబుకలదె"—(8 వ పద్యము).

3. "ఆత్మీయాంగములలోనఁ దలపోయ మోక్షలక్ష్మి కంఘ్రులే రుచ్యంబులనియును, భక్తులకెఱిఁగించుటకె కాక యింపుమెఱయ బం

గారుతోట్లలోఁ బవళించి, కరములఁ జరణంబు పదనకంజమునఁజేర్చి మొనసియంగుష్ఠమానుట జననిపాలఁదనివితీఱుటకాదు" (10 వ పద్యము)

4. "పశువులు శిశువులు, ఫణులు, గానరసంబు నెఱుఁగుదురు"—(11 వ పద్యము).

5. "గోప్రదక్షిణంబున, భూప్రదక్షిణజాత ఫలమబ్బును"—(14 వ పద్యము).

6. "కర్మమును దాఁటలేరను గాథ యితరజనములకెగాని, నిజ భక్తజనుల దరిఁజేరదనుట నిజము"—(15 వ పద్యము)

7. "కాత్యాయని పూజలుసేయ గోపాలకస్త్రీల చేలములు గొను, టది వారుజలములలో నగ్నలై స్నానంబుచేయు దోషమున డంచి, తనకర్థి మ్రొక్కించుకొని, వారి వ్రతము సువ్రతము జేయుట కేకా, కతులితముగ, ద్రౌపది తన్నుఁదలంచినమాత్రానఁ బెక్కువస్త్రములు గల్పించి యిచ్చినట్టి దివ్యప్రభావున కంబరములేక కాదు; కామాసక్తిలీలకాదు"—(18 వ పద్యము)

8. "గోపికలకందఱకు నన్నిహరిశరీరములుదాల్చి, మించి సంక్రీడఁగావించి, తా, యోగీశ్వరేశ్వరత్వము నర్థి నెఱుకపఱచె"—(20 వ పద్యము)

9. "రణముఁగావింపనొల్లక, విషాదంబు నొందిన యర్జునుని నిమిత్తీకరించి, సర్వోపనిషదర్థసారభూతంబు సద్యోముక్తిదము, మహాయోగి సేవ్యమానమైన గీతాశాస్త్ర మత్యంతకరుణచేఁ గరముపదేశించు టరసిచూడ భావికాలజనంబు భవబంధములఁ బాసితోడ్తోడ ముక్తి నొందుటకుఁగాదె"—(22 వ పద్యము)

10. "సలిలఫేనమునకుఁ జవిటికిఁ జెట్టుబంకకు మాకుఁ బాపమొక్కటియగాదె—యవనిలో స్త్రీహత్యకన్న బ్రహ్మహత్యాంశమది యెక్కుడగునె?"—(83 వ పద్యము)

11. "అఖిల వేదాంతంబులందాత్మ కఘులేప మరయ లేదను మాట తరుణి వినవె?—ఆనందమే బ్రహ్మమని చెప్పు వాక్యమెన్నఁగ జారసంగ మానందమానుగాదె"—(85 వ పద్యము)

రామాయణము, గీతాసారసంగ్రహామువంటి మహాగ్రంథ రచయిత యయిన యీకవివరేణ్యుఁడు, శ్రీకృష్ణావతారతత్త్వమును సంపూ

ర్ణముగా గ్రహించియుండుననుటలో సందేహముండదుకదా! అట్టి సందర్భములో :—

"శ్రీకృష్ణుఁడింపార బృందావనమ్ములోఁ జతురత గోపికాసతులఁ గూడి, చేసిన శృంగారచేష్టలన్నియుఁ జాల మోక్షప్రదములని మున్ను మహానివరుఁడు వ్యాసుండు శ్రీభాగవతంబులో శిష్టసమ్మతముగఁ జెప్ప లేదె?"—

అని "శ్రీకృష్ణశృంగారక్రీడలు మోక్షప్రదములు" అని "వ్యాసుఁడు" చెప్పినాఁడనుట కొంతవఱకు సాహసమేయగును. ఒకవేళ మహావిష్ణునవతారములలోఁ బరిపూర్ణమయిన కారణముచేత శ్రీకృష్ణపరమాత్ముని లీలావిశేషములన్నియు (గోవర్ధనోద్ధారణాదులు) కేవలము మానవాతీతములును, దైవాతిశయములునయిన చర్యలు. కనుక ఆభగవచ్చరిత్రమంతయు మోక్షాసక్తులందఱు చదువఁదగినదని యామహర్షి వచనము నభిప్రాయమును; కాని యొకబృందావనములోని గోపికల తోడి కామకలాపమే (అది నిజముగా నట్టిదికాదు) మోక్షప్రదముల నినాఁడని యాయనమీఁద లేనినింద మోపుట తనశతకముచదువు పాఠకులను దప్పుత్రోవలకుఁ ద్రిప్పుట యొకవిధముగా లోకప్రతారమే యగునేమో?

ఇంతకును జెప్పవచ్చిన దేమనఁగా, నుద్దండులైన యిట్టి మహాకవీశానుల నోటినుండి వెలువడు ప్రతివాక్యమును బ్రజ పూదండమాదిరి శిరసావహించుననుట సహజము. దానికి దోహదము వారికిఁగల రాజసన్మానము.

అప్పుడు వారుగాని, వారి పోషకులుగాని, యప్పటి ప్రజాబాహుళ్యములో, వ్యాప్తినొందించవలసిన నైతికసాహిత్యమును సృష్టించు దృష్టి కలిగియుండవలెను. అప్పుడుగాని దేశము బాగుపడదు. అయినఁ బ్రసిద్ధిపొందిన యుద్గ్రంథములను బవిత్రకృతులను వ్రాసినకవులే యిట్టి పచ్చిశృంగార సాహిత్యముకూడ ప్రచారములోనుంచుట యెంతైన గర్హింపఁదగినది. కాశీఖండ భీమేశ్వరపురాణాది గ్రంథాల ననువదించిన పరమశివభక్తుఁడు శ్రీనాథమహాకవియును, రామాయణ గీతాసార సంగ్రహరచయిత, పరమవిష్ణుభక్తుఁడీ గోపీనాథము వేంకటకవియును, నట్టివారిలోఁ బ్రథమగణ్యులగుట శోచనీయము. అస్తు :—

ఇఁక నీకవియొక్క బ్రహ్మానందశతకములో నంత పచ్చిబూతులు కావని (వెదకిచూచి తేల్చిన) పద్యములలోఁ గొన్ని మచ్చునకు క్రింద చూపుచున్నాను :—

“తలిరుఁ బ్రాయమునాఁడు వలపు నాపైఁజేర్చి మఱిగి యడ్డంబుగాఁ దిరుగులాడు
నుడిగంపుఁబనులెల్ల సేయుటకు దగ్గఱఁజేరి మేని సోఁకుల గొంతమెలపుఁ జూపుఁ
బ్రియలన్నమాటలు వినుమని చెవియొద్దఁజేరి తా గుసగుస చెప్పసాఁగు,
నదివిని కలికిరో ! యిదియేమి ? యన నవ్వి తలవంచి తనకోర్కెఁ దెలుపవెఱచు
దయగలిగి గూడఁ, “దిన్న తిన్నఁగ” నటంచు బాల సుఖియించి, “యింక నెప్పటికి నన్ను
విడువ వల” దంచుఁ బలికిన నుడువుసొంపు మదిఁ దలఁప బ్రహ్మానంద మదియె కాదె||”

“ఒకనాఁడు నేను తోటకుఁ బోవ, నది మంచి వేళయం చొకతన్వి పేఁటలోన
నమ్మగారింటి కేనటు బోయివచ్చెదనని భర్తతోఁజెప్ప, నాతఁడొకనిఁ
దోడిచ్చిపంపినఁ దోఁటవద్దకు వచ్చి మఱచి వచ్చితి నేను నెరవుసొమ్ము
దెమ్ము, నేనందాఁక, నమ్మయింటికిఁ బోవనని బొంకి, పంపి, తా నవల నన్నుఁ
గనిపించుకొని, ప్రీతి, గనుసన్నఁజేయ, నేఁ దెలిసి, యాచెలిఁగూడి, తృప్తిఁజేసి,
‘యలివేణి ! యింతసాహసము చేతురె’ యన్న నవ్వి, యిన్నాళ్లకు నన్ను నిన్ను
నలువ యిటుగూర్చె ‘నింకొకనాఁడువత్తు’ ననుచు నొప్పించుకొని, తోడుమనిషి కెదురు
గలిసికొని పోయినట్టి యాకలికిపనులు మదిఁదలంప బ్రహ్మానంద మదియ కాదె||”

‘మొండిచేతివానికి నూవులుతిను మార్గము’ నేర్పుటయన నిట్టిదే! ఉపాయము తెలియని యమాయికలైన యువతులకుఁ బై పద్యములోని యుపదేశము గీతోపదేశమువలె యుక్తులు తంత్రములుగలదై ‘హంసవింశతి’తోఁ బాటు జారవాంఛగల్గిన విటీవిటులకు ‘కామకళాప్రపూర్ణ’ బిరుదు పరీక్షలలో నెగ్గవలయుననిన ముఖ్యముగాఁ జదువఁదగిన ‘టెక్స్టుబుక్కు’.

“ఒకలేమ తనభావ మొగిఁ దెల్పుటకు వేఱె యొకదాని బిడ్డ నెత్తుకొని వేగఁ
దా ముద్దులాడి నాసామి నాపండు నా బంగారమనుచు నబ్బాలునోట
విడియంబుపెట్టి పెందొడమీఁద నిడుకొని చెక్కిలి నిమురుచుఁ జెంపఁగొట్టఁ
బోఁ, బాలుఁడేడ్చిన బుజ్జగింపుచు, నింక నేడ్వకు నీకుఁ జన్నిత్తు ననుచుఁ
బయ్యెదఁ దొలఁగించి, పాలు లేవని పల్కి చిఱునవ్వు మోమునఁ జెలఁగ నింత
కఠినుఁడగు బిడ్డఁ డెందునుగలఁడె యంచు నన్నుఁగని తాఁకనాడుచుఁ గన్నుసైగఁ
జేసి కరఁగించిచేసిన చెలియరతులు మదిఁదలంప బ్రహ్మానంద మదియ కాదె||”

“లేమ నొక్కతెను మాలిమి సేయుటకు దానిచంక బిడ్డను నేను సరసనెత్తు
కొను నెపంబున గురుకుచముఁ జేఁదాకించి బిడ్డనుగొని ‘ముద్దువెట్టుకొనుచుఁ
బతక మెక్కడిదని పల్కి చేనంటుచు నీమేను చిక్కినదేమి యనుచుఁ
జెక్కులు చేతులఁ జక్కఁగా నిమురుచు మచ్చెకంటి జ్వరంబు వచ్చినట్టు
తోఁచుచున్నది యని తోడ్తోడఁ జేనాడిఁ బదపడి గుండెలు వట్టిచూచి
జ్వరముగాదిది మోహసంబంధమగు కాఁక వెస మోహశాంతిఁ గావింతుననుచుఁ

బాలకుఁడేడ్చినఁ బాలియ్యమని యిచ్చి మొనసి క్రమ్మఱ దాని ముద్దులాడి
మేనిసోఁకులచేత మెయిచెమర్చియు మఱి పులకలెత్తిన నేను గలయఁజూచి
భయమెడల దానిచెయిగీఱ బాళిమీఱ నన్నెలంతయు సైఁగచే నన్నుఁబిలిచి
కూడి క్రీడించి సుఖముఁ గైకొన్నవిధము మదిఁదలంప బ్రహ్మానంద మదియగాదె॥"

ఇందులో మూఁడవపద్యమందు, నాయిక విదగ్ధుఁడైన ప్రియుని, యర్భకాపదేశముతో వశ్యునిఁ జేసికొనుట సూచితము. నాలుగవదానిలో విదగ్ధుఁడైన నాయకుఁడే నాయికను కారణాంతరములతోఁ గళాస్థానములను స్పృశించి యుద్రిక్తురాలిని చేసి, మనోరథమును సఫలీకృతము చేసికొని, యామెను దృప్తిపఱచును :—

"పొసఁగ నాశోభనంబునకు బేరంటంబు వచ్చినవారిలో వనితయొకతె,
వరుసలాడుచు మమ్ముఁ బడకింటిలోనికిఁ బంచి తానటుపోక పొంచిచూడఁ
బొసఁగ నందఱు నిద్రపోనిచ్చి తగనేమఱించి వంచించి నేపొంచి దానిఁ
బట్టి లోనికిఁదీసి పడవైచి, యప్పనిచేసి, చూపించి, యాచిన్నిపడుచు
కాశపుట్టించి, దాని సాహాయ్యమునను గాంక్షదీఱంగఁ గడునిషేకంబుసేసి
యిద్దఱిని నొద్దనుంచుక ముద్దులాడ నధికసాహసి వనుచు వారన్నమాట,
మదిఁ దలంప బ్రహ్మానంద మదియుకాదె॥"

అమ్మా! శోభనపుఁ బెండ్లికొమరుఁడెంత గడుసరివాఁడో చూచినారా? అయిన నా పేరంటాలి కంత యుబలాట మెందులకో? కర్మముకాలిన లోకసహజమైన యీవిషయములోనను వింతయేనా? ఆఁడువాండ్రకన్నియుఁ జోద్యములే. కనుకనే యీనిషేకపుఁ బెండ్లికొడుకక్కడి సమయసందర్భములన్నియుఁ గనిపెట్టుచు, నందఱు నిద్రపోవువఱకు వేచియుండి గ్రుక్కిళ్లుమ్రింగుచుఁ, బొంచిచూచుచుండు నా పేరంటాలిని, నా మెసహాయముతోఁ గొంతయుద్రేకించిన క్రొత్తప్రియురాలిని కాజేసినాఁడు. "డబుల్‌ఛాన్సు" దొరికినదికదాయని. పూర్వము :—

"అల్లుఁడవయ్యెదో మగఁడవయ్యెదవో మనమండవయ్యెదో" యని యొకసరసురా లొకవిటశేఖరు నడుగఁగా :—

"అల్లుఁడనయ్యెదన్, మగఁడనయ్యెద, నేమనమండనయ్యెదన్"
—అని యెనఁట!

ఈశోభనపుఁ బెండ్లికొడుకు కారకములోఁ జేరినవాఁడుగాఁ గనిపించును. ఆ పేరంటాలితో నింకొకయమ్మాయి కూడ లేకపోయినది. ఉండిన ముగ్గురును ముచ్చటగా శోభనములు చేసికొనియుందురు. అతనిపంటయు ముత్యాలు పండియుండును.

ఈకవి కవిత్వవైశద్యమును దెలుపుపద్యము లీక్రిందివి. అందు మొదటిది, నాయికాకాంక్ష సాంకేతికముగా నాయకునికిఁ దెలిసి కోరిక తీర్చుకొనువిధమును వర్ణించునది. రెండవది రతాంతమున నాయికాస్థితి నుద్ఘాటించునది :—

"అలివేణి నవలతావ్యాలంబి సుమమంజరులఁ జూప వలుద చన్నులను బట్టి,
వగలాడి క్రొమ్మావి చిగురాకుఁ గొనుమన్న వలదని కెమ్మోవిఁ బంటనొక్కి—
కమలాక్షి పున్నాగకుసుమము మూర్కొ—నుమన్న నిద్దంపుఁ జొక్కి—లి ముద్దులాడి,
గరిత కెందమ్మిలోఁ గర్ణికఁ గనుమన్నఁ బ్రీతితో నిధువనక్రీడ సల్పి,
లలనభావ ప్రకాశోక్తులకును దగిన చెయ్వులొనరించి కరఁగించి చెట్టవట్టి
వనవిహారంబు చేసిన వైభవంబు మదిఁదలఁప బ్రహ్మానంద మదియకాదె!!"

"శుకతుండ సందష్ట సురుచిరబింబంబు పోలికనున్న కెమ్మోవితోడఁ
గరరుహ పరిలూన కరమర్దనమ్లాన ఘనమంజరులఁబోలు చనులతోడ
గంధేభవిహరణ కలుషీకృత సరోవరాభపుష్పాస్త్ర గేహంబుతోడ
భానుమయూఖ సంపర్క—పరిక్లాంత లతికోపమాన గాత్రంబుతోడ,
వితత నిశ్వాసమారుతమలినీకృత ముకురంబుక్రియ నొప్పు మోముతోడఁ
గాంత సురతాంత తాంతయై కనులు దేలవైచుచు మదంసవిన్యస్త బాహుయుగళ
యగుచుఁదొడలపైఁబవళించినట్టి హాయిలు మదిఁదలఁప బ్రహ్మానందమదియకాదె"

ఈమహాకవి కవితాప్రాభవమునుదెలుపుటకు దీనికంటె మించిన యుద్గ్రంథములు పెక్కు—లుగలవు.



# అనంతరాజు సుబ్బరాయకవి

క్రీ॥ శ॥ 1825—1884.

శ్రీసదాశివేశ్వరశతక మనంతరాజు సుబ్బరాయకవికృతము. ఈ శతకములో వందపద్యములున్నవి.

"నగవరశరాస ! కార్వేటినగరవాస ! గిరిధరశరా ! సదాశివ, కృత్తివాస !"

అనునది ప్రతిపద్యమునకు మకుటము. ఈశతకరచనకారణమును కవి మొదటిపద్యముననే ఈక్రిందివిధముగాఁ జెప్పినాఁడు.

శ్రీకర సప్తాంగ శృంగారపూరిత రాజ్యసామ్రాజ్యధురంధరుండు,
మాకరాద్వంశ కుమార వేంకట పెరుమాళ్ళరాజేంద్రుండు, మహితకనక
విలసితంబగు సభాస్థలి రత్నసింహాసనమున నాసీనుఁడై, నన్ననంత
రాజాన్వయుని, సుబ్బరాయకవీంద్రునిఁ బిలిచియిట్లనెఁ, జిత్రకలితసీస
శతకము రచింపుమనినను సంతసిల్లి విరచన కుపక్రమించితి వినుము కృపను
నగవరశరాస, కార్వేటీనగరవాస గిరిధరశరా, సదాశివ, కృత్తివాస॥

దీనినిబట్టి "పోలిపెద్దివేంకటరాయకవి"ని లావణ్యశతకమునకుఁ బురికొల్పిన శ్రీకుమార వేంకటపెరుమాళ్లరాజేంద్రుఁడే యనంతరాజు సుబ్బరాయకవి నీశతకము వ్రాయుటకుఁ బ్రోత్సహించినాఁడని తెలియుచున్నది. శ్రీకుమార వేంకటపెరుమాళ్లరాజు క్రీ॥శ॥ 1884 సం॥ (తారణ) లోఁ జనిపోయినాఁడు. కనుక నంతకుమును పే యనఁగా 1875—84 సంవత్సరములమధ్య సదాశివేశ్వరశతకమును, పోలిపెద్దివేంకటరాయకవి లావణ్యశతకమును వ్రాయఁబడియుండియుండును.

శ్రీకుమార వేంకటపెరుమాళ్లరాజుగారి తరువాత రాజ్యమునకు వచ్చిన యాతని జ్యేష్ఠపుత్రుఁడైన బ్రహ్మరాజు కాలమున నీశతకము ముద్రితమైనట్లందులోని యీక్రిందపటి పద్యమువలనఁ దెలియుచున్నది.

"శ్రీమదఖణ్డ మహీమండల శాఖణ్డలాయమానార్థి కల్పావనీజ
కల్ప కుమార వేంకట పెరుమాళ్రాజ పుత్రవరిష్ఠ శ్రీ బొమ్మరాజ
మూర్ధాభిషిక్త సంపూర్ణ కటాక్ష వీక్షణ సచివ శివభాగవత గుండు
కులజ గురుస్వామి"—విలసితంబగు సదాశివ చిత్రశతకము—నవనినాథు
శాసనంబున "వాణీలీలాసదనము" నందు ముద్రింపఁజేసె, నానందమంది
జనులు మెచ్చ "విరోధ్యబ్ద చైత్రశుద్ధ పూర్ణిమేందుదినంబున పూర్ణముగను"

శ్రీబ్రహ్మరాజుగారి 'హయాం'లో గుండుగురుస్వామయ్య యను వెలనాటి బ్రాహ్మణుఁడు ముఖ్యమంత్రిగా (దివాను) నుండెడివాఁడు. పరమశివభక్తిపరాయణుఁడు. అతఁడు బొమ్మ (బ్రహ్మ) రాజుపట్టాభి

సేష్కృద్దైన యైదేండ్లకు వనంగా, క్రీ॥ శ॥ 1889 సం॥రం॥ సరియైన విరోధి—చైత్రశుద్ధపూర్ణిమా సోమవారమునాఁటికి శతకమును, సంస్థానాధిపతుల ముద్రాక్షరశాల యయిన "శ్రీభారతీ (వాణీ) లీలాసదనము" లోనచ్చు వేయించిరి.

గ్రంథనామము "శ్రీసదాశివశతక" మని యుండినను నక్కడక్కడ పద్యములలో "చిత్ర" అను విశేషణము చేర్పఁబడియుండుట ముఖ్యముగా గమనింపఁదగినది.

1. "..................చిత్రకలితసీస శతకము రచింపుమనినను సంతసిల్లి" (1 ప)
2. "చిత్రతర సీస శతకంబు చిత్తగింపు" (6 ప)
3. "చిత్రకృతివైన నిన్ను నేఁ జిత్రకృతిని వినుతిగావింతు వినుము సద్వినుచరిత" (21 ప)
4. "అని చమత్కారపద్ధతి నమితభక్తి సన్నుతించెద యుష్మత్ప్రసన్నమూర్తి (47 ప)
5. "చిత్రకావ్యము నేను జెప్పితి సిద్ధదా" (58 ప)

ఇందులోని ప్రతి సీసపద్యము నేవో కొన్నివృత్తములతో గర్భితమయియున్నది. అట్లు వ్రాయుట సులభసాధ్యము కాదు. ఆరితేరిన కవిత్వపు 'సర్కసుఫీట్లు'లోఁ బ్రఖ్యాతి పొందినవారు తప్ప జయప్రదముగా, గర్భకవిత్వముగాని, బంధకవిత్వముగాని, చిత్రకవిత్వముగాని చేయలేరు. అయిన నవేవియుఁ బ్రజాసామాన్యమున కుపయోగపడవనుటలో సందేహము లేదు. అట్లని యాకళను ధ్వంసీకరించుటయు సబబుకాదు. కవితాకళాభిజ్ఞులకట్టివి కొంతవఱ కుపకరించును. అట్టివి వ్రాయువారి ధీకౌశలమును బ్రకటించును. ఈశతకసీసములలో నిమిడియుండు వృత్తములను కవియే తాను స్వయముగా వేఱుపఱచి చూపుటవలన, నేపద్యములలో నేవృత్తము లిమిడియున్నవో, సులభముగాఁ దెలిసికొనుటకు వీలగుచున్నది. పరిశ్రమతోఁ గూడిన గర్భ బంధ కవిత్వసృష్టి కొన్ని నిర్బంధములకు, నియమములకు లోఁబడియుండుట సహజము. అట్టి సందర్భములలో గర్భవృత్తములమీఁదనే దృష్టినిడి కవిపద్యములను సాగింపఁజూచుట తప్పని సరి యగును. అప్పుడు గర్భవృత్తము లేలాగో కుదిరినను, నసలు పద్యధోరణి చెడి, నడకకుంటువడి చదువువారికి సులభగ్రాహ్యము కాకుండ చిరాకుఁ బుట్టించును. ఈశతకములోని సీసపద్యము లట్లుకాక, గర్భితములున్నవను విషయము పాఠకులకుఁ దెలియనీయని విధముగా వ్రాయఁబడినవి. దానినిబట్టి, కవి యెంతటి సామర్థ్యము కలవాఁడను విషయమును మనము సులభముగా గ్రహింపవచ్చును.

ఈకవి యాత్మస్తుతి (కవిత్వవిషయములో) చేసికొనుట యేకాక, కుకవినిందాదులుకూడ సంప్రదాయమును బాటించుచు చేయక విడువ లేదు.

తనకావ్యదుహితను—ఇతఁడు—మత్తేభవృత్తగర్భితసీసములో నీక్రిందివిధముగా వర్ణించినాడు.

"విలసదర్థోత్కర విశ్రుతాఖిల గుణాలంకార సంయుక్తరా, ప్రకాశ !
ప్రియసమాహ్లాదకరీతి లక్షణ సుశీలాంచచ్చమత్కారిరా, సుభాషి
సరసభావోచిత సర్వ శాలిని సుమీ రాజత్సువర్ణాంగిరా, మనోజ్ఞ!
సురసవత్వంబున సొంపులొ పదములన్ రమ్య స్వరోద్భాసిరా, సువృత్త !
నవ్యసుకుమారి ! కైకొమ్మ, నాదు కావ్యదుహిత నిచ్చితి మత్తేభసహితముగను"

పై సీసములోని ప్రతిపాదములోను మొదటిలఘువును కడపటిసంబుద్ధిని తొలఁగించి చదివిన నది మత్తేభవృత్తమగును.

ఈక్రిందిది కుకవినింద—తోటకవృత్తగర్భితసీసము.

"మిసిమియానన బలిమింగొనఁ గుంటయి భావములేక సద్భావములుడిగి,
సరసంపుజోకల శయ్యాపదంబిడ కర్థమనన్ రచనానుసరణి
గీలుంగొల్పక చులకించి హితక్రియ సూపక గ్రంథంబు సూటిసెఱుఁగ
కుడుగని చింతల నుందురు గోళకతం గుకవుల్ వసుంధరను బ్రబలి
యిట్టిమూఢులు లజ్జింప నేరచింతుఁ జిత్రతర సీసశతకంబు చిత్తగింపు"

ఇందలి గర్భిత తోటకవృత్తము :—

"బలిమింగొనఁ గుంటయి భావములే కల శయ్యాపదంబిడ కర్థమనం
జులకించి హితక్రియ సూపక గ్రంతల నుందురు గోళకతం గుకవుల్"

ఈ శతకసీసపద్యములలో గర్భితములుగా నుండు వృత్తముల వివరమీక్రింద చూపుదును.

| గర్భితవృత్తాలు. | | వృత్తసంఖ్య. | పద్యాలసంఖ్య. |
|---|---|---|---|
| 1. మత్తేభవృత్తములు | ... | 15 | (2,—34—47) |
| 2. స్రగ్విణి | ... | 9 | (3,70—77) |
| 3. మాలినీ | ... | 2 | (4,—94) |
| 4. భారతీ | ... | 2 | (5,—97) |
| 5. తోటక | ... | 4 | (6—9) |
| 6. ఉత్థానపాది | ... | 8 | (10—17) |
| 7. ద్విపద | ... | | |
| 8. మహానవమి పద్యము | ... | | |

| గర్భితవృత్తాలు. | వృత్తసంఖ్య. | పద్యాలసంఖ్య. |
|---|---|---|
| 9. మధ్యమావతి రాగము ఆదితాళము (తరంగము) | 8 | (10–17) |
| 10. శంకరాభరణము : గౌళ కల్యాణము ... | ,, | ,, |
| 11. వసంతరాగము: ఆదితాళము (తలంటు శోభాన) | ,, | ,, |
| 12. సువ్విపాట ... | ,, | ,, |
| 13. శంకరాభరణము : ఆది తాళము : (నలుగుపాట) | ,, | ,, |
| 14. మధ్యమావతిరాగము : ఆదితాళము (ఆమతింపు) | ,, | ,, |
| 15. గొబ్బిపాట ... | ,, | ,, |
| 16. జంపె : (గరుడాచలంరీతి పాట) ... | ,, | ,, |
| 17. కాంభోజి: ఆది (పద్యము) | ,, | ,, |
| 18. సౌరాష్ట్రము (తలుపుతీసే పాట) ... | ,, | ,, |
| 19. సావేరి : రూపకము (హెచ్చరిక) ... | ,, | ,, |
| 20. భైరవి: జంపె (మంగళము) | ,, | ,, |
| 21. సురట: చాపు (మంగళము) | ,, | ,, |
| 22. నవరోజ్ : ఏకతాళ ... | ,, | ,, |
| 23. శ్రీరాగము: త్రిపుట (లాలి పాట) ... | ,, | ,, |
| 24. చిలుకపాట ... | ,, | ,, |
| 25. చౌళిరాగము (మేలు కొలుపు) ... | ,, | ,, |
| 26. బేగడ: త్రిపుట (పదము) | ,, | ,, |
| 27. హెచ్చరికపాట ... | ,, | ,, |

| | గర్భితవృత్తాలు. | వృత్తసంఖ్య. | పద్యాలసంఖ్య. |
|---|---|---|---|
| 28. | భైరవి : (ఉయ్యాలపాట) | 8 | (10—17) |
| 29. | అచ్చోమంగపాట ... | ,, | ,, |
| 30. | అల్లో నేరేడల్లో ... | ,, | ,, |
| 31. | ఆరభి: రూపకము (కీర్తన) | ,, | ,, |
| 32. | ద్రుతవిలంబితము ... | 2 | (18,—19) |
| 33. | వసంతతిలకము ... | 8 | (20) |
| 34. | కందద్వయ గర్భితము | 8 | (21—28) |
| 35. | భుజంగ ప్రయాత ... | 2 | (29—30) |
| 36. | ఇంద్రవజ్ర ... | 2 | (31—32) |
| 37. | ఉపేంద్రవజ్ర ... | 1 | (34) |
| 38. | మత్తకోకిలా ద్విపదలు | 1 | (48) |
| 39. | మత్తకోకిల ... | 14 | (49—62) |
| 40. | ధ్రువకోకిల ... | 3 | (63—65) |
| 41. | ద్విరద గతి రగడ ... | 4 | (66—69) |
| 42. | అంత్యానియమ చంద్రిక | 1 | (78) |
| 43. | ప్రమితాక్షరీ ... | 1 | (79) |
| 44. | వనమయూర ... | 1 | (80) |
| 45. | వనమంజరీ ... | 1 | (81) |
| 46. | అలసగతి ... | 1 | (82) |
| 47. | ప్రహరణకలిత ... | 1 | (83) |
| 48. | పణవవృత్తము ... | 1 | (84) |
| 49. | అంత్యానియమకాంతవృత్తము | 1 | (85) |
| 50. | పరాజితవృత్తము ... | 1 | (86) |
| 51. | మణిగణవృత్తము ... | 1 | (87) |
| 52. | భూతిరాట్తిలకము ... | 1 | (88) |
| 53. | ప్రభాకలిత ... | 1 | (89) |
| 54. | త్వరిత పద గతి ... | 1 | (90) |
| 55. | మనోజ్ఞవృత్తము | 1 | (91) |
| 56. | ప్రియకాంతావృత్తము ... | 1 | (92) |

| | గర్భితవృత్తాలు. | | వృత్తసంఖ్య. | పద్యాలసంఖ్య. |
|---|---|---|---|---|
| 57. | రుచిరవృత్తము | ... | 1 | (93) |
| 58. | తోదకవృత్తము | ... | 1 | (95) |
| 59. | దోధకవృత్తము | ... | 1 | (96) |
| 60. | మందరవృత్తము | ... | 1 | (98) |
| 61. | సుందరవృత్తము | ... | 1 | (99) |
| 62. | మంగళము (భైరవి) ఝంపెతాళము | ... | 1 | (100) |

పై వివరణములనుబట్టి యిందలి నూఱుపద్యములలోను గర్భవృత్తములేనిది మొదటిది మాత్రమే. మిగిలిన 99 పద్యములలోను 62 రకములవృత్తము లీమహాకవి యిమిడ్చినాఁడు. కొన్నిఁటిని లయబద్ధముగా రాగతాళములతోఁ బాడుకొను పాటలనుగూడ పద్యములలో వచ్చునట్లు వ్రాయుట సామాన్యకవితాకృషి కాదు. మన తెలుఁగులో సంగీత సాహిత్యము లెంతసన్నిహితముగా, నవినాభావముగా, విడరానియతుకుగాఁ బూర్వము కళాప్రియులు గుదిగ్రుచ్చఁగలుగువారనునది బోధపడుచున్నది. ప్రత్యేకముగా నీశతకకవిని గూర్చి చెప్పవలసివచ్చినప్పుడు, కవితాకళ నింతటి ప్రజ్ఞతోఁ, బ్రతిభతోఁ, బ్రౌఢవముతో సునాయాసముగా మనోహరముగా, చిత్రవిచిత్ర పదవిన్యాసములతో సృష్టించి, రాజాదరణకుఁ బాత్రుఁడై యాంధ్రజగజ్జేగీయమానమగు యశఃకాయముతో నద్వితీయుఁడుగాఁ బ్రకాశించినాఁడు. 'శతక'మని యలక్ష్యముతోఁ జూడఁదగిన గ్రంథము కాదిది.

ఇది భక్తిరసోద్దీపక పరమేశ్వర సంబోధనలుగల శతపద్యరత్నకోశము. చిత్రకవితా తత్వజిజ్ఞాసువుల కిది కల్పవృక్షము. ఈమహాకవి తననామము తప్ప కులగోత్రాదితములనుగూర్చి కించిత్తయినను నెక్కడను జెప్పలేదు. ఇతని కృతి యిదితప్ప మఱియొకటి యున్నట్లు కానరాదు. అయిన నొకచోటమాత్రము తనవిషయమునుగూర్చి యిట్లు చెప్పినాఁడు.

"చిత్రకావ్యము నేను జెప్పితి, సిద్ధిదాయివి నీవనం, గోరి, యిష్టముగను,
ధాత్రిలోపల నాదుగోత్రము తామరల్లిక మించ, నాయాప్తసకలసచివ
మిత్రబాంధవకోటి మేలని మెచ్చి, సంతసమంద, నక్ష శోభనములం మెఱయ,

బుత్రవంతునిఁజేసి పూరితభూరిసత్కృప నేలు మా పేరు విపులవెలయ
నాయురారోగ్య భాగ్యంబు లతులకీర్తి సౌఖ్యము శుభంబు విభవంబు సంఘటింపు॥

పద్యములోఁ గవి తనగోత్రమునుగూర్చి, కులమునుగూర్చి యెక్కడను జెప్పుకొనలేదు, కాని 'నాయాప్త సకలసచివ మిత్ర బాంధవకోటి' యనుటవలన, నతఁడు బహుశా రాజబంధువుగా నుండవచ్చునేమో యని యూహింపఁదగియున్నది. అట్లు కానిపక్షమున 'సచివులు' సామాన్యుఁడయిన యొకకవిమాత్రుని కుందురనుట యసంభవముకదా! పూర్వము రాజులకేకాక, రాజకార్యనిర్వాహణమునకుఁ గారకులైన, ప్రధానమంత్రులకును సలహాలిచ్చు సచివులుండువారు. సుబ్బరాయకవి కూడ నావర్గమునకుఁ జెందిన రాజప్రధానిగా నుండవచ్చును. పైఁగా నట్టివారు సాధారణముగా నియోగులైనందున నీశతకకర్త కూడ నియోగిబ్రాహ్మణశాఖకు సంబంధించినవాఁడుగా నుండవచ్చును. అయిన "వైదికిగా నుండరాదా యను ప్రశ్నకు తావు లేకపోలేదు. కాని, వైదికులైన మంత్రు లరుదు. మఱి యట్టివారికి "అనంతరాజు" వారని యింటిపేరుండదు. కనుక నితఁడు తప్పక నియోగి యని చెప్పవచ్చును. లేక (బ్రాజయినను గావచ్చునేమో) "పుత్రవంతునిచేసి" యనుట వలన నితనికి సంతానము లేనట్లు తోఁచుచున్నది.

కార్వేటినగరములోని శివకేశవులకు క్రమముగా సదాశివేశ్వరుఁడనియు, వేణుగోపాలస్వామి యనియు పేరులు. శ్రీకుమార వేంకట పెరుమాళ్రాజాశ్రితులైన, యీసుబ్బరాయకవియు, నితనిసమకాలికుఁడైన పోలిపెద్ది వేంకటరాయకవియు, నాయిరువురు దేవతలమీఁద శతకములు వ్రాసిరి.

గర్భిత నానావిధ వృత్తములయినను, సీసపద్యములనడక ధారాళముగా సాగినది. ఇతఁడును నంత్యప్రాసనియమములు చాలచోట్ల పాటించి, యలంకారబహుళములైన కావ్యలక్ష్యములతో లక్షణముల కవిరోధముగా నొక బృహత్కావ్యమువలె, నీశతకమును సంతరించినాఁడు. మంచిప్రౌఢకవిత్వము. ఈశతకమునకు సాటి యీశతకమే. మఱి యొకటి తెనుఁగులో నింతవఱకు సృష్టి కాలేదనుట సాహసోక్తికాదు. కాని 18 వ శతాబ్దమధ్యమున నీవిధమయిన చిత్రకవితాప్రబంధము— ఏకాశ్వాసము కలిగినది గణపవరపు వేంకటకవి రచించినాఁడు (అది శతక

రూపమయినదికాదు.) "ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము" అనుపేరుగల యాప్రబంధమున, చతుర్విధ చిత్రకవితాప్రాగల్భ్యము, కవి కెంతవఱకున్నదను విషయమును దెలుపుచున్నది. అయిననది యీ శతకమువలె సరళమైనధార కలిగినదికాదు. చాలవఱ కిట్టిచిత్రకవిత్వము లకు భగవన్నుతులో, రాజస్తుతులో యాధారములుగా తత్కర్తలు గ్రహింతురు. అట్టి పొగడికలుకూడ విశేషముగా సంబుద్ధులతోఁ గూడి యుండును. కథావిషయములు చిత్రకవిత్వములకు చుక్కెదురు. ఈకృతి లోఁగూడ సుబ్బరాయకవి శివపర్యాయములతోఁ బరమేశ్వర నామము లను బేర్కొని జయప్రదముగాఁ దనదీక్షను నిలఁబెట్టుకొనినాఁడు.

అతని విద్వత్కవితా ప్రతిభ తెలియుటకుఁ గొన్ని పద్యాంశ ములు క్రింద చూపుచున్నాను.

అంత్యప్రాసనియమములు.

1. ప్రవిమలజ్ఞాన విజ్ఞానభాసమాన, విశ్వసంస్థాన, విషపాన, వృషభయాన॥
2. భక్తజనపోష, సవిశేష పరమపురుష మధురసంభాష బుధతోష మానివేష॥
3. కలుషజీమూతవాతూల, కాలకాల, కర్బురవిశాల శ్రుతిమూల, కామపాల॥
4. దుష్టశాసన సమవర్తి, యష్టమూర్తి, స్వచ్ఛతరకీర్తి, దేవతాచక్రవర్తి॥
5. సాధునికురుంబ సేవితచరణ సాంబ యధికకరుణావలంబ, ద్విట్కుధరశంబ॥
6. ప్రకృతిసంస్ఫోట కరధృతాబ్జజకరోట ఖండిత నిశాట కబళిత కాలకూట॥

ఒక్కపద్యములో మాత్ర మాచ్ఛికశబ్దములతో నెత్తుగీతి రెండు పాదము లగపడుచున్నవి :—

"మదపుటేనుంగు రేగాము కొదమసింగ మీనుపడగ దునేదారి మేటిగొంగ"

ఇదితప్పఁ దక్కినవానిలో సంస్కృతశబ్దములే బహుళముగా కవి వాడినాఁడు.

ఈక్రింది పద్యములు గర్భితవృత్తములతో మనోహరముగా నున్నవి.

1. మత్తేభవృత్త గర్భితసీసము :—

"విలసితాంభోజభవేందు వహ్నినయన, బ్రహ్మాండరక్షాపరా, జోహారు,
ప్రభసితశ్వేతవరాంగ శంకర హరా, బాలేందు భూషా ప్రభా జోహారు,
ప్రహసిత స్మిత కపాలహార రజితాహార్యాగ్రదివ్యాలయా జోహారు,

విలసదంభోజ భవేంద్రముఖ్యనుత, శర్వాణీమనోధీశ్వరా, జోహారు,
శ్రీకరాకార, మోక్షలక్ష్మీవిహార, మేరునగచాప, పన్నగోత్కరకలాప॥"

ఇందలి మత్తేభమునకు ప్రతిసీసపాదములోని మొదటిలఘువును, కడపటి "జోహారు" పదమును తొలగించి చదువుకొనవలెను.

2. స్రగ్విణీ వృత్తగర్భితసీసము :—

"వేధ నాసారథిన్ వేదముల్ మావులన్ గావించు నీమాయఁ గాంచు టెట్లు
భూధరంబుద్ధతిన్ బూనితౌ విల్లుగా, శేషుని మౌర్వి గాఁ జేయుటెట్లు?
శ్రీధరుం గాండమున్ జేసి మేల్వాసిగా గుణమున నంటఁగఁ గూర్చుటెట్లు?
సాధనాఢ్యుండనే శక్తి నీకొప్పఁగా, దివ్యతేజోరాశిఁ దేరుటెట్లు?
త్రిపుర హరణం బొనర్చితౌ త్రుటిని నీవు నద్భుతం బిది యెన్నంగ నఖిలవేద్య"

ఇందలి పెద్ద(సీస)పాదములనుమాత్రము నాల్గింటి కలిపి చదివిన స్రగ్విణి యగును.

3. మత్తకోకిల గర్భిత సీసము :—

"మేలువాటిల లోకపాలన మీవు సేయుచు నెట్లొకో తమోయుతుఁడవగుచు
కేల శూలముఁబూని కేవలకిన్క జీవుల ద్రుంచుటల్ దేవ తెలియనగునె?
కాలకూటము లీలఁగా నిజకంఠమందునఁ దాల్పవే, కీర్తినినుతికెక్క
జాలవింతలు నీదు చర్యలు చంద్రమౌళి, శుభాకరా, నిన్ను వశమె పొగడ
ప్రమథగణసేవ్య, యాశ్రితపారిజాత దక్షిణామూర్తి, విద్యావిచక్షణాఢ్య"

ఇందలి మత్తకోకిల :—

"మేలువాటిల లోకపాలన మీవు సేయుచు నెట్లొకో?,
కేల శూలముఁ బూని కేవల కిన్క జీవులఁ ద్రుంచుటల్,
కాలకూటము లీలఁగా నిజకంఠమందునఁ దాల్పవే?,
చాలవింతలు నీదుచర్యలు, చంద్రమౌళి శుభాకరా!"

ఇట్టి చిత్రకవిత్వరచయితలు సాధారణముగా లక్షణముల నుల్లంఘించిననే తప్ప కృతినిర్మాణములోఁ గృతకృత్యులు కాలేరు. కాని యీ సుబ్బరాయకవి యెక్కడనో యొకటిరెండుచోట్లలోఁ దప్ప దుష్టప్రయోగముల పొంతకుఁ బోకుండ నీశతకమును వ్రాయుట సర్వథా శ్లాఘాపాత్రము. కళాకౌశలము శిల్పిభావనాబలము నాశ్రయించినదని చెప్పుట కీసదాశివేశ్వరశతకము గొప్పతార్కాణము.

———◆◆———

# క్రొత్తపల్లి లచ్చన

క్రీ॥ శ॥ 1825—75

ఈ క్రొత్తపల్లి లచ్చనకవినిగూర్చిన విషయము లేవియుఁ దెలియ వచ్చుటలేదు. కాని 'క్రొత్తపల్లి' యనునింటిపేరుగల బ్రాహ్మణ (వైదికుల) కుటుంబములు నేటికిని కోస్తాజిల్లాలలో నుండుటచేత నితఁడును బ్రాహ్మణుఁడనియుఁ గోస్తాజిల్లాలవాఁడనియు నూహించుట యసమంజసము కాదు. ఇఁక నితని తండ్రి యెవఁడో, కాల మేదో కనుగొనుటకుఁ దగిన యాధారములు దొరకుటలేదు. ఇతఁడు దుష్కరప్రాస సూర్యశతకముమాత్రమే కాక మఱేదైన వ్రాసినది లేనిదికూడ నంతు చిక్కలేదు. ఈ కవినిగుఱించిన 'భోగట్టా' లేవియు దొరకలేదు.

శతకాంతపద్యము :—

"ఈ క్రమమున భవదంకితమై క్రాలఁగ వినెడువారి యఘములు గాలన్
శ్రీ క్రొత్తపల్లి లచ్చనచేఁ గ్రొత్తగ నయ్యె సంతసింపుము సూర్యా॥"

అని కవి తన పేరినిమాత్రము చెప్పుకొనినాఁడు. రచనావిధానమునుబట్టి చూడఁగా నితఁడు కడచిన శతాబ్దము ప్రథమపాదాంతమున జన్మించి తృతీయపాదాంతమువఱకుండినట్లు తోఁచుచున్నది.

ఈ శతకములో నూటయైదు కందపద్యములున్నవి. దుష్కరప్రాసములన్నియు సంయుక్తాక్షరములుగనే కుదురుట యిందలి ముఖ్యవిశేషము. అట్టి ప్రాసముల కాచ్ఛికములలోకంటె సాంస్కృతికములలో శబ్దములసంఖ్యాకములుగా దొరకుచున్నవి. ఈ కారణమునుబట్టి యీ శతకమంతయు సంస్కృత పదజాటిల్యముగల పద్యములతోడనే నిండి యున్నది. దుష్కరప్రాసములైనను నవి నిర్బంధముగాఁ దెచ్చిపెట్టుకొనిన ప్రాసజీవాతువు లనిపించుటలేదు. ఎంతటి కఠినప్రాసములైనను సహజశబ్దములవలెనే శబ్దసాధకుఁడైన లచ్చనకవిత్వములో దొర్లిపోవుచుండును. అట్టి ధారాళమైన ధారాధోరణి కవితలో నారితేరిన సిద్ధహస్తులకుఁగాని లభింపదు.

ఈశతకమును శ్రీచెలికాని లచ్చారావుగారు తమ శతకసంపుటములోఁ జేర్చిరి. కవియొక్క ధారాశుద్ధిని తెలుపుటకు శతకములోని కొన్నిపద్యము లీక్రింద నుదాహరింతును :—

“రుగ్ధామదివ్యచందన దిగ్ధామోదసుశరీర దివ్యాభినుతా,
దుగ్ధాన్నప్రీత మనోదగ్ధుఁడ ననుఁ బ్రోవు మతిహితంబుగ సూర్యా” (గ్ధప్రాసము)

“బ్రధ్నచతురాగమాగమ బుధ్న ప్రభాకర దినేశ పూషణనామా,
గృధ్ననిరాకరణ యహిర్బుధ్నార్చిత విధిమయస్వరూపా సూర్యా” (ధ్నప్రాసము)

హర్ష నిరామర్ష వరోద్ధర్షంబులు, నాకొసంగి యనుకంప సుధా
వర్షితదృష్టిం గను మఘమర్షణ ఖలలోకజలధి మందర సూర్యా” (ర్షప్రాసము)

“స్వర్వ్యోమధరారంజన దుర్వ్యసననిరానురక్త దుఃఖవిదళనా,
నిర్వ్యాజ మాని హృదయాంతర్వ్యాపక శోకసమ్ముద్రప్రద సూర్యా (ర్వ్యప్రాసము)

“ఉల్బణకరుణాసాగర కిల్బిషసంఘాతఘాత కీర్తితప్రోద్య
చ్ఛుల్బాభిఖ్యమదాశా శుల్బచ్ఛేదక త్రిలోక సుందరసూర్యా” (ల్బప్రాసము”)



# శిష్టు సర్వశాస్త్రి

క్రీ॥ శ॥ 1830—1880.

సర్వకామదాపరిణయాద్యనేకకృతులు రచించి యాంధ్రప్రపంచములో మంచిఖ్యాతిని, ఆంధ్రసంస్థానములలో నమితసత్కారములను గడించి యానాఁడు తనయంత పండితకవి లేఁడనిపించుకొనిన శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారి సుపుత్రుఁడీ శిష్టుసర్వశాస్త్రి. ఇతఁడు జగ్గంపేటలో క్రీ॥ శ॥ 1830 సం॥రమున జన్మించి, తనతండ్రియొద్దనే కావ్యనాటకాలంకారములు చదువుకొని, విద్వత్కవి యయినాఁడు. ఇతఁడు జగ్గంపేట—అయినవల్లి—కాళహస్తి మొదలయిన సంస్థానములలోఁ దనవిద్వత్ప్రతిభలను బ్రదర్శించి, రాజాదరణకుఁ బాత్రుఁడయినాఁడు. ఇతఁ డవధానములలో, నాశుకవిత్వములోఁగూడ నందెవేసినచేయి. ఇతఁడు కొంతకాలము సైదాపేట నివాసియు, గంగమ్మ వీరాస్వామిసెట్టికుమారుఁడును, 1859—60 సం॥ర ప్రాంతములో గోదావరిజిల్లా కలెక్టరుపదవిలోనున్నవాఁడును, దనతండ్రియయిన కృష్ణమూర్తిశాస్త్రిలవలన "వీరారణ్యమాహాత్మ్యము"—అనుకృతి నంకితము పొందినవాఁడు నగు నూరా తులసింగంసెట్టి యను వైశ్యకులసంభవుని ప్రోత్సాహముతో రాయవేలూరునందలి యాంగ్లపాఠశాలలో సంస్కృతాధ్యాపకుఁడుగాఁ బనిచేసినాఁడు.

ఇతనికృతులు :—జ్ఞానప్రసూనాంబికాశతకము, శ్రీలలితాంబాస్తోత్రము, అమరుకము (అనువాదము), అచ్చిగానితారావళి, కొన్ని చాటువులు. ఇందులో మొదటిమూఁడును శతకలక్షణములు గలవి. మొదటిరెండింటికిని క్రమముగా "జ్ఞానప్రసూనాంబికా" యనియు, "అధరజితబింబ, శ్రీనగరావలంబ, పదనమద్దేవమునికదంబ, లలితాంబ" యనియు మకుటములు. మూఁడవదానికి మకుటము లేదు. తొలిశతకములో 102 మత్తేభశార్దూలములు, రెండవదానిలో వందసీసములు, మూఁడవదానిలో 103 (అన్నిరకములయిన) పద్యములున్నవి.

జ్ఞానప్రసూనాంబికాశతకమును దొలిసారిగా 'నాంధ్రపరిషత్కార్యాలయము' వారు సంపాదించి ప్రకటించిరి. ఆతరువాత వావిళ్లవారు తమ భక్తిశతకసంపుటము రెండవదానిలో నెనిమిదవశతకముగాఁ బ్రకటించిరి.

సర్వశాస్త్రి క్రీ॥ శ॥ 1853 సం॥ రమున దారుణ రుజాపీడితుఁడై యున్నతరుణమున నొకనాఁటి రాత్రి జ్ఞానప్రసూనాంబికను ధ్యానించుచు నీశతకమును జెప్పినాఁడఁట! ఆవెంటనే వ్యాధి నివారణమయినదఁట! ఈ యైతిహ్య మెంతవఱకు సత్యమో కాని, తనపోషకునియాజ్ఞచేతనే, కవి దీనిని రచించినట్లు తానే తెలుపుకొనినాఁడు :—

"శ్రేయస్సంతతధామ, దామరకుల శ్రీవేంకటేంద్రాజ్ఞఁ బ్ర
జ్ఞాయత్తాచితి, సర్వశాస్త్రి, యిటు లొయ్యం జేసె జ్ఞానాంబికా
శ్రీయానుగ్రహలీలఁ బద్యశత మీరీతిం బఠింపన్ జనుల్
ధీయుక్తస్థితి నన్నివిద్యలఁ బ్రశస్తిం జెంది పెంపెక్కరే"

ఈకడపటిదానికి మకుటము లేదు. ఈకవి కాళహస్తిప్రభువైన దామర వేంకటపతినాయని యాస్థానములో కవిగా నుండిన దినములలో నీశతకము వ్రాసినాఁడనుటయు, నాప్రభువు నాజ్ఞచేతనే యందులకుఁ బూనుకొనినాఁడనుటయు కవియే తనపద్యములలో ఘంటాపథముగాఁ జెప్పుకొనుటవలనఁ బైఁ జెప్పిన పుక్కిటిపురాణము నమ్మఁదగినది కాదని తోఁచుచున్నది. పైఁగా నీశతకరచనాధోరణికూడ నాయభిప్రాయమున కుపబలకముగా నున్నది.

శతకములో దాదాపు 80 వంతులు సంస్కృతపదము లగపడు చున్నవి. సంస్కృతపదజాటిల్యము గల సమాసములు (ఒకొక్కచోఁ బద్యమంతయు నేకసమాసముగా వ్రాయఁబడినది) విశేషముగా నున్నవి. ఉభయభాషలలో నీకవి కూలంకషప్రజ్ఞకలవాఁడనియు, నిర్దుష్టమయిన ధారాధోరణి సహజసిద్ధముగా నితని కలవడినదనియు, నితనిరచనలే (చెప్పక) చెప్పుచున్నవి. ఇట్టి ప్రౌఢపదబంధనలతోఁ గూడినకృతిని (శతకమే యాఁగాక) రచించుటయన, దారుణరుజాపీడలో నెంత గొప్పవిద్వత్కవికైనను సాధ్యపడదనుటలో ప్రత్యవాయము లేదు.

జ్ఞానప్రసూనాంబికాశతకములోని దీక్రింది మంగళాచరణ (నాంది) పద్యము :—

"శ్రీమద్దామర వేంకటక్షితిపతి క్షేమంకరప్రక్రియో
ద్దామాత్మీయ దయారసప్రసర సిధ్యన్మంజులా పాంగవీ
క్షామందస్మిత సుందరాస్య మెలమిన్గన్పట్టఁ బ్రత్యక్షమై
సామంజస్య మెసంగఁ బ్రోవుము ననున్ జ్ఞానప్రసూనాంబికా!"

ఈశతకములో సౌందర్యలహరీచ్ఛాయలుకూడ కొన్ని కనఁబడు చున్నవి :—

> చింతారత్న గృహాంతరాళమున వాసిన్ బ్రహ్మ విష్ణ్వాదిమం
> చాంతస్థాయినివై జగంబుల సముద్యల్లీల రక్షింప న
> ట్లంతంబొందఁగఁ జేయ నీవొక తెవే యాధారశక్త్యాత్మికన్
> సాంతత్యంబున నున్న దానవుగదా! జ్ఞానప్రసూనాంబికా!"
> "కైలాసాచల సీమసంగత లసత్కల్పద్రుమాకల్ప నీ
> పాళీపాళివిహారకృన్మ శుకరీ"—ఇత్యాదులు.

ఈశతకములోని దీర్ఘ జటిల సంస్కృతసమాసముల కుదాహర ణములు కొన్ని :—

1. మాన్యానూన మాణిక్యమౌక్తిక పంకేరుహరాగ విద్రుమ ముఖాగ్రిమోజ్జ్వలద్రత్నయుక్త కరాంభోరుహపాత్రికాకలనన్.

2. చకితాత్మీయ జనాంతరంగ భయసంసర్గాపనోద క్రియాధిక మందస్మిత సుందరాస్య హిమరుగ్దీప్తి ప్రసారాంచిత ప్రకటానర్గళ సుప్ర భావ విలసద్భవ్యాకృతి శ్రీయుతా!

3. పారావారసుతాది లేఖసుదతీ పారంపరీ గీతికాపారానంద పురంధ్రివర్గ నియతప్రాంచ ద్వివాహాంగణోదారామోద యుతాత్మ బాంధవసతీ తత్యాశ్రిత స్వాంతికస్ఫారాచార కృతిప్రమోదభరితా.

4. శోణాంభోరుహ జైత్ర పాదయుగళీ శోభాకృదుద్యన్మణి శ్రేణీ హంసక మంజుగుంజిక సమాకృష్టావదాతచ్ఛదక్వాణాకర్ణన మోదమాన హృదయా గచ్ఛద్ధ్వ్యపత్కిన్నర స్త్రైణాలోకన హృద్య సుందరగతీ.

5. సరసాలాప విలాస హాసరచనా చాతుర్య సుస్థైర్యభాస్వర దివ్యస్వరరీతి సంతత తతవ్యాసంగ దివ్యాంగనాపరిపాటీ గణనావినోద విలసద్భవ్యాదరోద్యత్స్మితాచరణాంభోజ సతామరవ్రజ హితాజ్ఞాన.

రోగపీడితుఁడయి చావుబ్రదుకులలో నుండు, మనస్థిమితము లేని కవి యిట్టి దివ్యసమాసములతోఁ బద్యములల్లుచుఁ గూర్చుండినాఁడన నెవరైనా నమ్మఁగలరా ?

ఇఁక సంస్కృతశబ్దబాహుళ్యముగల పద్యమొకటి, యచ్చ తెలుఁగు పదములు గల పద్యమొకటి మచ్చునకుఁ జూపి, యీశతకవిషయము ముగింతును :—

"జయమాతంగి ! మణీ విపంచివిలసత్స ప్తస్వరీ సజ్ఝరీ
నయసంద్రావిత మేరుశైలగత నానారత్న వాఃపూర సం
చయ నానారుచిముద్ఘనీ శతసహస్రప్రాప్త నవ్యక్రియా
జయ ! నిర్ధూత సమస్త దైవతభయా. జ్ఞానప్రసూనాంబికా"

"పొంగట్టున్విలుదాల్పు మేన నఱియై పొల్పొందు నిన్జూచి యా
బంగార్పుట్టపువేల్పురాణి యిటులై పల్వాన్నె నవ్వెన్ను హ
త్తంగానంగదె, యంచు ముచ్చట నెడందం జెంద మేల్త్రివి సా
గంగా జాణతనంబు నూనితిగదా, జ్ఞానప్రసూనాంబికా"

సర్వశాస్త్రి వ్రాసిన రెండవశతకమయిన "లలితాస్తోత్ర" మను కృతి పూర్తిగా దొరకుటలేదు. చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని R. No. 330 సంఖ్యగల యీశతకములో 69 సీసపద్యములే యున్నవి. అందులో నుదాహరింపఁబడిన రెండుపద్యములు కవి ప్రజ్ఞాప్రాభవములను దెలుపునవి :—

"శ్రీమదాగమ సమాశ్రిత పరబ్రహ్మాంబ, విపుల చిదానంద విలసనంబ,
ఫల పరిపూర్ణ సకలతంత్ర సారంభ, చారుతరానన చంద్రబింబ,
జిత మహీమండలాకృతి భాసురనితంబ, నియతభక్తావన నిర్విలంబ,
లలిత నిజోత్సంగ లాలితహేరంబ, కబరీనివేశిత ఘనకదంబ,
శయకృత వినూత్నతర కుశేశయవిడంబ, మానితాత్మీయ కేళికాధీనసాంబ
అధరజితబింబ, శ్రీనగరావలంబ పదనమద్దేవమునికదంబ లలితాంబ"

"రాయంచగమి మోయ రాణించు తెలఁపుమానికపువిమానంబు నీటుమీఱ
నెక్కి మిక్కుటమగు చక్కఁదనమ్మున సురసతీ సౌందర్యగరిమ లెల్ల
పారిమాండల్యము భజియింప వాహ్యాళి కరుగుచో నడుత్రోవ నమరవరుల
మొఱయాలకించి సమ్మోదమునిండించి వారల విడిదలఁ జేరఁజేసి
వాసికెక్కినదాన వీవే సితాంశు శేఖరోత్సంగ సంగ భాసితనితంబ,
యధరజితబింబ, శ్రీనగరావలంబ, పదనమద్దేవమునికదంబ లలితాంబ"

ఈ కవిరచితమైన యమరుక కావ్యము నించుక పరిశీలింతము :—

ఇది ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని R. No. 299 సంఖ్య గలది. అది సంపూర్ణ మయినను, నుపోద్ఘాత పద్యములు లేనిదని తోఁచు చున్నది. అందుచేతనే కర్త యెవరో తెలియలేదు. కాని 1939 సం॥ మున దీనిని ప్రకటించిన శ్రీకొత్రా శ్యామలకామశాస్త్రిగారిప్రతిలోని యుపోద్ఘాతపద్యములలోఁ గవి తన్నుఁగూర్చి, పోషక ప్రభువైన దామర వేంకటపతినాయనింవారిని గూర్చి విపులముగా చెప్పియుండుటచేతఁ

శిష్టు సర్వశాస్త్రియే యీ యాంధ్రానువాదమునకుఁ గర్తయని నిశ్చయముగాఁ దేలుచున్నది.

ఈ యమరుకము ననేకులు తెలిఁగించిరి. శ్రీనిడదవోలు వేంకటరావుగారిపీఠిక ననుసరించి చూచిన దాదాపు పండ్రెండుమంది యైనను దేలుదురు. అందులోఁ బ్రఖ్యాతకవులుకూడ లేకపోలేదు. సారస్వతమునఁ జిరస్థాయిగా నిలుచు నమరుక కావ్యానువాదములు వ్రాసినవారిలో :— తాళ్లపాక తిరువేంగళప్ప, మండపాక పార్వతీశ్వర శాస్త్రి, వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రులు, ఈసర్వశాస్త్రి, ముఖ్యులనుటకు సందేహము లేదు. తక్కినవారి యనువాదములలోఁ గొన్ని యముద్రితములు, మఱికొన్ని ప్రథమముద్రణముతోడనే శరీరము చాలించినవి. దొరికినవానిలోని కొన్ని యనువాదములు వానిమూలములు పఠితలకుఁ జవిచూపుట యుక్తమని యీక్రింద నుదాహరించుచున్నాను :—

1. ఆలోలామలకావళీం విలులితాం బిభ్రచ్చలత్కుండలం
కించిన్మృష్ట విశేషకం తనుతరైః స్వేదాంభసా జాలకైః
తన్వ్యా యత్సురతాంతతాంతనయనం వక్త్రం రతివ్యత్యయే,
తత్త్వాం పాతు చిరాయ కిం హరిహరబ్రహ్మాదిభిర్దైవతైః॥ (సంస్కృతమూలము)

అనువాదాలు

"చెదరి చలించు ముంగురులు స్వేదకణంబులనింత జాఱుబొ
ట్టూదవు రతాంతకాంతిమెయి నొయ్యన సోలెడు కన్నుఁదామరల్
కదలెడు కుండలంబులును, గల్గిన పౌరుషభాసమాన యా
ముదితముఖారవింద మతిమోదము మీకు నొసంగుఁ గావుతన్"
(తాళ్లపాక తిరువేంగళప్ప)

"అలకంబుల్ చెదరంగ, గుండలయుగం బల్లాడ, లేఁజెమ్మటం
దిలకం బించుక జాఱఁ, గన్నుఁగవ యెంతే దాంతమై యొప్పఁగా,
జలజాతాంబక కేళిసల్పెడు సరోజాతాక్షి సెమ్మోము ని
చ్చలు మిమ్ముం గృపఁ బ్రోచెడున్ హరిహర బ్రహ్మాదులింకేటికిన్"
(జయంతి రామయ్య)

"ఎలమి దలిర్ప నీకొసఁగు నీప్సితముం బురుషాయితంబునన్
జలమణిమండలాలకము సంభృతఘర్మజలాల్పలుప్త ని
స్తులతిలకంబునై తనరు తొయ్యలి మోము రతాంతతాంత నే
త్రలలిత మేల యీహరి విధాతృ హరాదుల సేవనల్లుటన్ (శిష్టుసర్వశాస్త్రి)

2. "సాలక్తకేన నవపల్లవ కోమలేన పాదేన నూపురవతా మదలాలసేన
యస్తాడ్యతే దయిత యా ప్రణయాపరాధా దంగీకృతో భగవతా మకరధ్వజేన"
(సంస్కృతమూలము)

"యావరసాగ్ద్రిముఖా, కిసలయాయుణ కోమలముఖా, వినూత్నస్త్ర
త్నావళినూపురంబును, మదాలసభావము నా పదంబుచే
సేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగవచేతఁ దాడితుం
డైవిలసిల్లువాఁడు కుసుమాయుధదేవునకుం బ్రియుండగుఖా" (తాళ్లపాకతిరువేంగళప్ప)
"నగవులఁ గినుకఖా లత్తుక జిగియుం దెలఁగవలీమదము చెలువును దగఁ జె
న్నగు మగువ జిగురుటడుగున నొగిఁ దాఁకుఁడైనవాని నొప్పు మరుఁడిలఖా
(శిష్టు సర్వశాస్త్రి)

3. సందష్టాధర పల్లవా సచకితా హస్తాగ్రమాధూన్వతీ
మా, మా, ముంచ శఠేతి, కోపవచనై రావర్తిత భ్రూలతా
శీత్కారాంచితలోచనా సపులకం, యైశ్చుంబితా మానినీ
ప్రాప్తం తైరమృతం శ్రమాయ మధితో మూఢైస్సురై స్సాగరః (సంస్కృతమూలము)
"పెదవి చుఱుక్కనం గొఱుక బెగ్గిలి కేల్విదలించి, కిన్కచే,
వదలుము చాలు చాలు కితవా, యని పిల్చి—బొమల్ముడించి, మై
గదుర గగుర్పు, సీత్కరణకంపిత నేత్రములొప్ప, నింత ము
ద్దొదవిన వారిదే యమృతే, మూఢులు ద్రచ్చిరంబుధిఖా"
(మండపాక పార్వతీశ్వరశాస్త్రి)
"పెదవిచుఱుక్కనం గొఱుకఁబ్వోడిచేకొని యూఁచి వద్దు వ
ద్దెది, నను వీడుమంచలిగి యించుక కన్బొమువంచి సీత్కృతిఖా
వదలని కాంత ముద్దుఁగొనువాఁడు, సుధం జవిజూచెఁగాక కం
ధిదఱచి యెల్లవేలుపు లతిశ్రమమందిరి మందబుద్ధులై" (శిష్టు సర్వశాస్త్రి)

అమరుకశ్లోకములకుఁ దెలుఁగులో వృత్తజాతులే యనుకూలములుగా నుండును. తక్కిన యనువాదకు లందఱు నావిధముగనే యాంధ్రీకరించిరి. కాని యీ సర్వశాస్త్రి కొన్నిచోట్లలో సీసములుకూడ నుపయోగించినాఁడు. అందులో వ్యాఖ్యాంశములుకూడ చేరియుండు ననుటకు సందేహము లేదు. మూలకావ్యాభిప్రాయమును బయలుపెట్టు వ్యాఖ్యానాంధ్రీకరణ మంత సమంజసమయినది కాదు. అసలు కావ్యము లోని యలంకారధ్వన్యాదు లట్టి తెలిఁగింపులో బాహాటముగా బట్టబయలై పాఠకులయుత్సాహమును కుంచించుమార్గములో నడుచును. అట్టి పౌరపాటనువాదకులు ఎంతవఱకు చేయకుండిన నంతవఱకుఁ దమ కావ్యమును సజీవము చేయఁగలుగుదురు. దానికి సారస్వతములో నొక శాశ్వతస్థానము నిచ్చినవారగుదురు. క్రిందిపద్యములు పరిశీలింపుఁడు.—

"పాగరుంగుబ్బలు పొట్టివై, పులకలం బూనంగ, నేనెంతయుం
బిగికాఁగింటనుగూర్పఁ జీరనడుము న్వోవీడి జాఱఁగఁ, దా
శఁగలేనింకను, మానుమానుమని, భల్ దైన్యంబుగా బల్కనీ
చిగురుంబోఁడికి మూర్ఛయో, నిదురయో, చిత్తమ్మునం జేరనో"

ఇది జయంతిరామయ్య అమరుకములోనిది :—దీనికి మన శిష్టు సర్వశాస్త్రిగారొక సీసము వ్రాసినారు. చూడండి :—

"అతిదృఢాలింగనావాప్తి నోకించుక నడగు చన్గవ పులకాళి వోదము,
సాంద్రతమ స్నేహ సంబంధమున, స్రక్రమంబుగ జఘనాంశుకంబు జాఱ
అలుక లడంచు మాయావి వీవనినన్ను నెట్టన ధట్టించు నేర్పు వెలయ
వలదిటు వలదని పలుమాఱు సన్నపు టెలుఁగునఁ, దెలుపు సొంపెలమిఁ దనర
మానినీమణి నిద్దురఁబూనెనేమొ, కర్జములు దక్కి బలువూర్పుఁ గాంచెనేమొ
కొంచ కిప్పుడ నామదిఁ గూడెనేమొ కాక నాయంతరాత్మలోఁ గలసెనేమొ"
(సర్వశాస్త్రి)

సర్వశాస్త్రిగారి పద్యములో "పొగరుంగుబ్బలుపొట్టివై" యనుటకుఁ గారణము వాచ్యమైనది. "స్రక్రమంబుగ జఘనాంశుకంబుజాఱ" యనుటకంటె "చీరనడుమున్వీడిజాఱంగ" యనుటయే రసవంతముగ నున్నది.

మొత్తమునకు సర్వశాస్త్రిగారి యమరుకముకూడ మంచిపాకమున నే పడినది. అమరుకాంధ్రీకర్తలలో వరుసగాఁ బ్రథమద్వితీయతృతీయ స్థానము లాక్రమింపఁదగినవారు. ముండపాక, జయంతి, శిష్టుకులాలంకారులు. తక్కిన వారిలో తాళ్లపాక తిరువేంగళప్పది "తూ—చా" తప్పని యథామూలము కాకపోయినను సరసమైన శైలిలో నడచినది. తక్కిన వారివి లభింపలేదు.

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమువారి గ్రంథసూచికలో సర్వశాస్త్రిగారి యమరుకములోని మొదటిపద్యము :—

"రాముఁ డ్సద్గుణవల్ల్యారాముఁడ్, రాక్షసవనవిరాముఁడ్, సీతా
కాముఁడ్, సజ్జనజగదభిరాముఁడ్, స్మరియింతు నంతరంగములోనన్"

అను కందపద్యము నుదాహరించినారు. కాని యతని యమరుకములో నెక్కడ నిది యగపడదు. బహుశా లేఖకుని పద్యమేమో!

ఇంకొకపద్యము అమరుకములోని మొదటి శ్లోకమున కాంధ్రీకరణముగా నుటంకింపఁబడినది. అదియిది.

"జ్యాకృష్టి బద్ధ కటకాముఖపాణిపృష్ఠ ప్రేంఖన్నఖాంశుచయ సంవళితోమృడాన్యా
త్వాం పాతు మంజరిత పల్లవకర్ణపూర లోభభ్రమద్భ్రమర విభ్రమ భృత్కటాక్షః"
(శ్లోకము)

"అల్లల్లాడాను కటకాముఖాఖ్యపాణి గోళ్ల నిగనిగమను జిగి గూడె ననఁగ
నలరు జిగురాకు కర్ణికయందుఁ దిరుగుతుమ్మెదని తోఁచు నుమచూపు మిమ్ముఁ బ్రోచు"

ఆనూచికలో "నగవులఁ గినుకన్ లత్తుక" యనుపద్యము కడపటిదిగా ప్రచురితమయినది. దీనిని బట్టి యుపోద్ఘాతపద్యములు వగైరాలు ప్రాచ్యలిఖిత పుస్తకాగారప్రతిలో లేవని తోఁచుచున్నది.

ఈ యమరుకము శ్రీకాళహస్తి సంస్థాన ప్రభువైన వేంకటపతినాయనింవారికి కృతి యీయఁబడినది. కనుక కావ్యలక్షణముల ననుసరించి, ఇష్టదేవతాప్రార్థనాదికములు, కృతిభర్తృకృతాభ్యర్థన, కృతిపతి వంశావతారవర్ణనము మొదలయినవి సలక్షణముగాఁ గవి సాగించినాఁడు. ఇది యేకాశ్వాస ప్రబంధమని చెప్పవచ్చును. ఇది యితిహాసము కాకపోయినను, నానానాయికావస్థలను వర్ణించుటచే శృంగారకావ్యముగాఁబరిగణనకు వచ్చును. ప్రభువు తన్ను అమరుకానువాదమునకుఁ బూనుకొమ్మని యాజ్ఞాపించినట్లుగా కవి యీక్రిందిపద్యములోఁ జెప్పుకొనినాఁడు :—

"లలితపదంబులన్ గవితల క్షణలక్షితమై తనర్ప నీ
చెలిమి రచింప నేర్పరివి యెన్నిక నీయమృతోక్త కావ్యమిం
పలరఁ దెనుంగొనర్పుము, మదంకితమౌం దగఁ గూర్పు, మిందు కే
వలముగ నాద్యమే రసము వర్తిలుచుండును జూడ మెండుగన్"

కవి తన్నుగూర్చి యిట్లు చెప్పుకున్నాడు :—

"నను నిఖిలావనీతల జనస్తుత సాధుకవిత్వగూఢరీ ఖన ఘనపాండితీ సమధి
క స్ఫుటకీర్తికిఁ గృష్ణమూర్తికిన్ దనయుని, సర్వశాస్త్రి"—

ఇతఁడు జ్ఞానప్రసూనాంబికాశతకమును క్రీ॥ శ॥ 1858 నను, అమరుకమును క్రీ॥ శ॥ 1860 నను రచించినాఁడని తెలియుచున్నది. లలితాంబాస్తోత్రరచనాకాలము తెలియుటలేదు. కాని యది పైరెండు గ్రంథములకు ముందే వ్రాయఁబడినదిగా నూహించవలసివచ్చుచున్నది.

ఇతనితండ్రియయిన, శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి క్రీ॥ శ॥ 1870 సం॥ మున మరణించినట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈసర్వశాస్త్రి తండ్రి గతించిన రెండేండ్లకే యనఁగా క్రీ॥ శ॥ 1872 సం॥ మున పరమపదించినట్లు శతకకవులచరిత్రలోను, వావిళ్లవారి జ్ఞానప్రసూనాంబికా శతకపీఠికలోను నున్నది. కాని శ్రీనిడదవోలు వేంకటరావుగారి 'అమరుక పీఠిక''లో 'అయినవల్లికి'—(కవిస్వగ్రామము) వచ్చి యచ్చట క్రీ॥ శ॥ 1880 లో సర్వశాస్త్రి దేహముచాలించినాఁడని వ్రాసినారు. బహుశా అదియే నిజమయి యుండవచ్చును.

—:o:—

# పులిగంటి సుబ్బరాయకవి

క్రీ॥ శ॥ 1830 ప్రాంతము.

ఈకవిరచితమయిన కోదండరామశతకము మొన్నటి రుధిరోద్గారి (1924) సంవత్సరమునగాక యంతకుమునుపు రుధిరోద్గారి (1864) సంవత్సరమున ముద్రింపఁబడినది. కవికప్పటికి 40 సంవత్సరముల ప్రాయమైన నుండియుండును. ఆపక్షమున నితఁడు 19 వ శతాబ్దప్రథమపాదములో పుట్టినవాఁడనుటకు వీలగును.

ఇతఁడు రజానగరవాస్తవ్యుఁడనియు. అక్కడి కోదండరామునికే యీశతక మంకితము చేయఁబడినదనియు తెలియుచున్నది. ఇతఁడు తన్నుగూర్చి శతకములో నీవిధముగాఁ దెలుపుకొనినాఁడు :—

"వలనొప్ప పులిగంటి వంశాబ్ధిచంద్రుఁడై తనరుకొండ్రాయ ధన్యునకును
సుతుఁడనై జనియించి, సుబ్బరావను పేరఁ బరఁగి సత్కవులను బ్రస్తుతించి
సాధుజనంబుల సాంగత్యమునఁజేసి యాదిత్యకులజ నీకర్పితముగ
మతిగోచరించినమాత్ర మేమును సీసశతకం బొనర్చితి సహజముగను"

ఇంతకంటె నితనినిగూర్చి తక్కినవివరము లేవియుఁ దెలియవచ్చుటలేదు.

ఈకోదండరామశతకములో "నవ్యమణిభూష శ్రీరజానగరవాసరామ! నన్నేలు కోదండరామచంద్ర" యనుమకుటముతో సరిగా వంద పద్యములున్నవి.

ఈకవి (కవియనుటకుఁగూడ తగఁడేమో ?) రచనలో సహజత్వమనునది బొత్తిగా నగపడుటలేదు. శ్రుతపాండిత్యము ఎక్కువ. ఇతని కవిస్తుతి చూడుఁడు :—

"వ్యాసశుకులకు భక్తివందనంబొనరించి తనరవాల్మీకిని దగభజించి
ధన్యుఁడౌ కాళికాదాస మాఘమయూర బాణభీమాదులఁ బ్రస్తుతించి,
కవిరాజరాజశేఖరుఁడైన బమ్మెనా మాత్యుపాదంబులు మదిఁదలంచి"

పై పాదములో సంస్కృతకవులను జేర్కొన్నతరువాత భీమన్నను జెప్పినాఁడు. మఱి యీబమ్మెనామాత్యుఁడెవఁడు ? బమ్మెరపోతనామాత్యుఁడా ? కావచ్చునేమో ? తిట్టు కవిత్వములోఁ బ్రసిద్ధికెక్కిన భీమ

న్నను, భక్తజనహృదయరంజకముగా భాగవతమును రచించిన పోతన్నను, వారిపద్యములను వినియుండును. అందుచేతనే తక్కినలాక్షణిక విద్వత్కవులెందఱో యుండఁగా నీకవి, యీయిద్దఱనే గణించినాఁడు. అందులో బమ్మెరపోతనపేరు పూర్తిగా జ్ఞాపకములేకయో పైపద్యములో దాని నిముడ్చుటకు చేతగాకయో—'బమ్మెన' యనినను 'పోతన' యనినను నొకటేయను నుద్దేశముచేతనో కవిస్తుతి యీవిధముగ వ్రాసినాఁడు. కనుక నితఁడు గురుముఖముగా విద్యనేర్చినవాఁడనికాని, తెలుఁగులోఁ బూర్తిగా భారతరామాయణములయినఁ జూచినవాఁడనికాని భావించుటకు వీలుపడకున్నది.

ఈకోదండరామశతకములో నరసింహశతకములోనుండియును భాగవతములోనుండియును చాల అనుకరణములు కనఁబడుచున్నవి. ఇందులోను 86 వ పద్యమునుండి 95 వ పద్యమువఱకు దశావతారస్తోత్రము కనఁబడుచున్నది.

ఇతని కవిత్వములో నిర్దుష్టప్రయోగము వెదకుట, కుమ్మరియావమున బంగారుముంతకు వెదకుటవంటిది.

"సాధులవంచించి చలగువాని" "పరద్రవ్యములమీఁద భ్రమలచెందెడువాని" "మిత్రద్రోహముచేసి మెలగువాని" "సాధుసజ్జనులను జేరకయూరకే" "పాటింప యమభటుల్వేటిపాలౌదురు" "పాడుబావ (వి + అ) నవచ్చుపరమపురుష" "నీదాసులతొ (తో) చెల్మినిరతంబుజేసిన" "వ్యాఘ్రాసనంబున వ (ఒ) నరగగూర్చుండి" "ఘ్రాణహత్యనుమృగముభీతినణగు" "చాలదా? జపములుసేయనేల?" "ఇసుకను త్రాడుగానేయవచ్చు" "అతికినన్నిదినాలు భాగ్యమందెదమన్న" "సంసారమనుఘోర సాగరమునుదాట వశమె నీపరభక్తివా (ఓ) డలేక"

ఇంకను కొన్ని అపప్రయోగములు :—

(1) దానవకులగిరిదళితభిదురును, (2) ఆపదోద్ధారకుడు, (3) పరమనాస్తి, (4) శుద్ధమూఢులు, (5) శరదిందువదనని (వదన అని), (6) మాయని (మాయఅని), (7) కాచుందురు (కాచియుందురు).

ఇఁక అనుకరణములకు ఒకొక్కపద్యము :—

భాగవతములోని—"మందార మకరంద మాధుర్యమును"—అను పద్యమున కనుకరణము :—

"నవపల్లవంబులు నమలెడుపికములు, పండుటాకులమీఁద భ్రాంతిపడునె ?
మకరందమట్లుగ్రోలి మసలెడుభృంగముల్ జరుగునే సాంద్రతుషారములకు
విమలజాహ్నవియందు విహరించునంచలు కోరునే కొంచెపుకోలనుచేఁ
మధురమా ఫలరసమట్లుద్రావుశుకములు కొరుకునే కసుగాయ కొంచెమైన
నీపదధ్యానమొనరించు నీతిపరులు ఇతరదైవంబులను గొల్వరినకులేశ"

నరసింహాశతకములోని "మందుఁడనని నన్ను నిందజేసిన నేమి నాదీనతను జూచి నవ్వితేమి" యను పద్యముత్రోవలోని దీక్రిందిది.

లోకులందఱు నన్ను లుబ్ధుడంటేనేమి ? పామరుడని లెస్సపలికితేమి ?
నారూపమటుచూచి నవ్వినందులకేమి ? ద్రోహినటంచును దూరితేమి ?
పాపాత్ముడని చాలకోపగించితెనేమి ? మంచివాడంచు భూషించితేమి ?"

ఇట్టివి చాల గలవు.



# వెల్లాల నరసింగకవి

క్రీ॥ శ॥ 1830 ప్రాంతము.

ఇతఁడు రచించిన సుభాషిత త్రిశతి, ఆంధ్రపరిషత్కార్యాలయము వారిచేఁ బ్రచురింపఁబడిన శతకసముచ్చయ ప్రథమభాగములో నున్నది. భర్తృహరి సుభాషితముల నాంధ్రీకరించిన కవులిప్పటి కాఱుగురు కనఁబడుచున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1. | ఎలకూచి బాలసరస్వతి | ... | (1620) |
| 2. | ఏనుఁగు లక్ష్మణకవి | ... | (1725) |
| 3. | పుష్పగిరి తిమ్మన | ... | (1750) |
| 4. | పోచిరాజు వీరన్న | ... | (1790) |
| 5. | గురురాజకవి | ... | (1810) |
| 6. | వెల్లాల నరసింగకవి | ... | (?) |

శతకకవులచరిత్రలో మొదటి యైదుమందికవులనుగూర్చి తెలుపఁబడినది. కాని 4, 5, సంఖ్యలుగల కవు లాంధ్రీకరించిన సుభాషితము లింకను దొరకలేదు. ఇప్పు డీ వెల్లాల నరసింగకవి విరచిత సుభాషితములు ప్రచారమునకు వచ్చినవి.

ప్రకృతము లభ్యమగు వానిలో పుష్పగిరి తిమ్మనది నీతిశతకము మాత్రమే.

ఎలకూచి బాలసరస్వతి స్వకృతములయిన సుభాషితములను గద్వాల ప్రభువయిన మల్లభూపాలుని కంకితము చేసెను. కనుక ప్రతి పద్యాంతముునను మకుటముగా "సురభిమల్లా నీతివాచస్పతీ, సురభిమల్లా మానినీమన్మథా, సురభిమల్లా వైదుషీభూషణా" యని రచింపవలసి వచ్చినందున, మత్తేభ శార్దూలములలోనే విధిగా శ్లోకముల నిముడ్చవలసివచ్చినది. చిన్న చిన్న యనుష్టుప్పులుకూడ నీపెద్దవృత్తములలో నాంధ్రీకరించుటచేత కొన్నియూఁతపదములు విధిగాపడవలసిన యావశ్యకము కలిగినది.

ఇప్పుడీ వెల్లాలనరసింగకవి గ్రంథాంతములో :—

ధర భర్తృహరికృతంబై పరఁగిన శ్లోకములు కందపద్యంబులు గా
నరసింగకవి రచించెను నరుదుగ వెల్లూరి వేంకటాచలరమణా॥

భర్తృహరిలోని పెద్ద పెద్ద వృత్తములలోని భావములను కంద పద్యములలో నిముడ్చుట యనఁ జాలశ్రమతోఁ గూడిన కార్యమే ! కాని కవినైపుణ్యము నది చాటుచున్నది. చాలవఱకు భావములను గప్పి పుచ్చు చెత్తపదములకు దావుండదు. మఱియు నీతని శతకత్రయియు మకుటసంకలితము. ప్రతిపద్యము తుదను "వెల్లూరి వేంకటాచలరమణా!" యని ప్రయోగింపఁబడినది. ఇతర సుభాషితకర్తల నానావిధ వృత్తములను, నందు ముఖ్యముగా బాలసరస్వతి మత్తేభ శార్దూలములను జూచి యీతఁడు అంత పెద్దవృత్తములలో వ్రాయుట యంత నేర్పు కాదు; అనుభావముతో చిన్నకందపద్యములలో నందును కడపటి పాదమునఁ జాలవఱకు మకుటముగా రచింపఁబూనెనని తోఁచుచున్నది. మొత్తమున కీతఁ డందఱి యాంధ్రకరణవైఖరులను జూచియుండును. ఆకారణమునుబట్టి గురురాజకవికి (భర్తృహరిసుభాషితాంధ్రీకర్తలలోఁ గడపటివాఁడు) తరువాతివాడుగా నుండును. అనఁగా 18 వ శతాబ్దపు ప్రథమార్థమున (1830 ప్రాంతము) నుండియుండును.

ఇంటిపేరును బట్టి చూడగా నితఁడు ములకనాటి శాఖాబ్రాహ్మణుఁడుగా నుండవలెనని తోఁచుచున్నది. ఇతఁడు వెల్లూరివాఁడని మకుటమునుబట్టి యూహింపవలసియున్నది. ఈవెల్లూరే రాయవేలూరను ప్రసిద్ధిగన్న పట్టణమయిన నితఁడు దాక్షిణాత్యాంధ్రకవి యనుటకు సందేహములేదు. ఇంతకంటెఁ దక్కిన వివరములేమియు తెలియుటలేదు. ఇతని కవిత్వము సరళముగా సాఁగిపోవుచుండును. క్వాచిత్కముగా సంధిదోషము లక్కడక్కడ కనిపించుచున్నవి. భావము సుగమముగా గ్రహించుట కనుకూలమైన ధారాశుద్ధి యున్నది.

ఆంధ్రీకృత భర్తృహరిసుభాషితములలో ఏనుఁగులక్ష్మణకవికృతి కున్నంత బహుళప్రచారముమాత్రము నాఁటికి, నేఁటికి మఱెవరిదానికిని లేదనుట మూఁటికి ముమ్మాటికి నిజము.

ఈక్రింద శ్లోకసహితముగా, ఏనుఁగులక్ష్మణకవి యాంధ్రీకరణము —ఇతనిపద్యములు మచ్చునకుఁ జూపుచున్నాను :—

## నీతిశతకము

1. వ్యాళం బాలమృణాళతంతుభిరసౌ రోద్ధుం సముజ్జృంభతే
భేత్తుం వజ్రమణిం శిరీష కుసుమ ప్రాన్తేన సన్నహ్యతి,

మాధుర్యం మధుబిన్దునా రచయితుం క్షారాంబుధే రీహతే
మూర్ఖాన్యః ప్రతినేతు మిచ్ఛతి బలాత్సూక్తైః సుధాస్యందిభిః (భర్తృహరిమూలము)

"కరిరాజున్ బిసతంతుసంతతులచే గట్టన్ విజృంభించు వాఁ
డురువజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింపఁ, దీ
పు రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణ ప్రాప్తిం బ్రవర్తించు ని
ద్ధరణిన్ మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారాను కారోక్తులన్"
(ఏనుఁగు లక్ష్మణకవి)

కరి బిసతంతునఁ గట్టను దిరిసెనవిరి మణిని మెదుపఁ దేనెఁ గడలిమా
ధురి నిడనగు మూర్ఖుఁ దెలుప నరుదగు వెల్లూరి వేంకటాచలరమణా (వెల్లాలనరసింగకవి)

2. హర్తుర్యాతి నగోచరం కిమపిశం పుష్ణాతి యత్సర్వదా
హ్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధిం పరాం
కల్పాన్తే ష్వపి నప్రయాతి నిధనం విద్యాఖ్యమన్తర్ధనం
యేషాం తాన్ప్రతి మానముజ్ఝిత నృపాః కస్తైః సహస్పర్ధతే॥

"హర్తకుఁ గాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టి సేయు, స
త్కీర్తి ఘటించు విద్యయను దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ జోదు యుగాంతపువేళ నైన, భూ
భర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము మానుటొప్పగున్" (ఏనుఁగు లక్ష్మణకవి)

"అనిశముఁ బెంపగు, దొంగకుఁ గనఁబడదు, ఖిలంబు గాదు, కాంక్షు
లొసఁగు విద్యనుధనమునుగల బుధున కనుగలుఁవా? వెల్లూరి వేంకటాచలరమణా!"
(వెల్లాల నరసింగకవి)

3. క్షుత్క్షామోపి జరాకృశోపి శిథిల ప్రాయోపి కష్టాందశా
మాపన్నోపి విపన్నదీధితిరపి ప్రాణేషు నశ్యత్స్వపి
మత్తేభేంద్ర విభిన్న కుంభపిశిత గ్రాసైక బద్ధస్పృహః
కింజీర్ణం తృణమత్తి మానమహతా మగ్రేసరః కేసరీ (భర్తృహరి)

గ్రాసములేక స్రుక్కిన, జరాకృశమైన, విశీర్ణమైన, సం
త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీలసాగ్రహా
గ్రేసర భాసమానమగు కేసరి జీర్ణతృణంబు మేయునే? (ఏనుఁగు లక్ష్మణకవి)

"కరికుంభపలముఁ దిను హరి, జర నాఁకలిఁ గష్టపడి రుజను శిథిలంబై, చర
మదశనైనఁ బులుందిన, నరుగునె? వెల్లూరి వేంకటాచలరమణా!" (వెల్లాల నరసింగకవి)

## శృంగారశతకం

"ద్రష్టవ్యేషు కిముత్తమం మృగదృశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యేష్వపి కిం తదాస్యపవన శ్శ్రావ్యేషు కిం తద్వచః
కిం స్వాద్యేషు తదోష్ఠపల్లవరస స్పృశ్యేషు కిం తద్వపు
ర్ధ్యేయం కిం నవయౌవనం సహృదయైస్సర్వత్ర తద్విభ్రమాః (భర్తృహరి)

"చూడంగఁ దగిన వస్తువులందు ఘనమేది ? తులలేక తగు వెలందుల మొగంబు,
వలపుగైకొనఁదగు వానిలో నెయ్యది ? మగువల వదనాబ్జమారుతంబు,
వీనులకింపైన వానియందెయ్యది ? కోమలాంగుల ముద్దుగులుకు పల్కు-
తనువు సోఁకిన సుఖం బొనరించు నెయ్యది ? మెలఁతల సొంపైన మేనుఁదీవ
యతిమధురమెద్ది? కాంతాధరామృతమ్ము సరసజనులకు జింతింపఁ జాలు నెద్ది ?
పువ్వుఁబోఁడుల వెలలేని జవ్వనంబు వెలయు నెల్లెడఁ బడఁతులవిభ్రమములు"
(ఏనుఁగు లక్ష్మణకవి)

"వినఁ జెలిపలుకులు, మైఁజేర్పను మెయి, కనమోము, తలపఁబాయము, మోవా
నను, మూర్కొనమూర్పు సుకృతి కనువగు వెల్లూరి వేంకటాచలరమణా"
(వెల్లాల నరసింగకవి)

ప్రాఙ్మామేతి మనాగ నాగతరసం జాతాభిలాషం తతః
సవ్రీడం తదనుశ్లథీకృత తమ ప్రత్యస్తధైర్యం పునః
ప్రేమార్ద్రం స్పృహణీయ నిర్భరరహః క్రీడా ప్రగల్భం తతో
నిశ్శంకాంగ వికర్షణాధికసుఖం రమ్యం కులస్త్రీరతం॥ (భర్తృహరి)

"అది మితాదరంబు తదనంతర మంచితరాగ మంత ల
జ్జోదయ రమ్య, మంత శిథిలోద్యమ, మంత నితాంతధైర్యవి
చ్ఛేదము ప్రేమపూరము, విశేష వివిక్త విహార, మంత నా
హ్లాదకరాంగసంగము కులప్రమదారత మల్పసౌఖ్యమే ? (ఏనుఁగు లక్ష్మణకవి)

"వలదను, సిగ్గునఁబడు, ధృతి నలరు, నభిలషించుఁ, బ్రియుని నంగజతం
త్రంబుల మెప్పించును, గులసతి యలవడ వెల్లూరి వేంకటాచలరమణా"
(వెల్లాల నరసింగకవి)

## వైరాగ్యశతకం

విపుల హృదయైర్ధన్యైః కైశ్చిజ్జగజ్జనితం పురా
విధృత మపరై ర్దత్తం చాన్యైర్విజిత్య తృణం యథా
ఇహహి భువనా న్యన్యైర్ధీరాశ్చతుర్దశ భుంజతే
కతిపయ పురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః॥ (భర్తృహరి)

"అంచిత బుద్ధులైన మను జాధిపతుల్ జగమెల్లఁ దొల్లి ని
ర్మించిరి, దానిఁగొందఱు భరించిరి, యిచ్చిరి గొందరర్థికి,
న్మించి జగంబులన్నియును నెమ్మి భుజించుచుఁ గొందఱుండఁగా
బంచమపట్టణేశుల కపారమదజ్వర మింత యేటికిఁ॥" (ఏనుఁగు లక్ష్మణకవి)

"తగఁ గొన్ని పల్లెలకు దొరలగు నల్పులకేల గర్వ, మధిపు లనేకుల్
జగమేలి గెలిచి విడువరె యగధర వెల్లూరి వేంకటాచలరమణా."

# భుజిమెళ్ల భగవచ్ఛాస్త్రి

క్రీ॥ శ॥ 1830 ప్రాంతము.

కవి తన్నుఁగూర్చి శతకమునఁ గడపట నీవిధముగాఁ జెప్పుకొని నాఁడు.

"వరభుజిమెళ్లాన్వయభాసుర విమలాత్రేయ గోత్రజుఁడు భగవచ్ఛా
సురుఁడను నీకొసఁగితిఁ దిరుమల శ్రీవేంకటేశ త్రిదశాధీశా॥"

శ్రీ నల్లాన్‌చక్రవర్తుల శ్రీనివాస వేంకటాచార్యులు వ్రాసిన శ్రీ తిరుమల వేంకటేశ్వరశతకమువలెనే యిదికూడ రేఫప్రాసకందములు. ఆచార్యులు వ్రాసిన శతకమునకు "తిరుమలగిరి వేంకటేశ త్రిదశాధీశా" యనునది మకుటమయిన, నీభగవచ్ఛాస్త్రికృతికి "తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా" యనునది మకుటము. కనుక వీరిరువురు సమకాలికులని తెలియుచున్నది. శ్రీనివాస వేంకటాచార్యులు క్రీ॥ శ॥ 1790 ప్రాంతమున జనించినవాఁడని యాతని చరిత్రలో నిర్ణయించితినికదా! ఇఁక నీభగవచ్ఛాస్త్రినిగూర్చి శ్రీములుగు వీరభద్రశాస్త్రిగారు శతకసముచ్చయము ద్వితీయభాగములోఁ దెలిపినయంశములు గమనింతము.

"భగవచ్ఛాస్త్రిగారు క్రీ॥ శ॥ 1894 ప్రాంతమున జగ్గయ్యపేటలో వైశ్యులు వేదోక్తమునఁ బౌరవిద్వద్బ్రాహ్మణులతో నొనర్చిన సంగ్రామమునఁ బాల్గొనిన మహావిద్వాంసులు. నాఁటికే వారికి షష్టిపూర్తి యయినది. బాల్యప్రాయముననే (1) తిరుమలగిరి వేంకటేశశతకము (2) గోవిందశతకము (3) శంకరవిజయము. (హరికథ) మున్నగు తెలుఁగుకృతులు రచించినారు. వీరు సంస్కృతమున స్తోత్రములు, ఉపన్యాసములు పెక్కులు వ్రాసియుండిరి. వీరి పౌత్రులున్నారు."

క్రీ॥ శ॥ 1894 నాఁటికి కవికి షష్టిపూర్తి అయినదనుటవలన నితఁడు దాదాపు 1830 ప్రాంతములో జనించియుండవలయునని తెలుచున్నది. ఆపక్షమున వేంకటాచార్యకవికి, నితనికి సుమారు 40 ఏండ్లు 'తేడా' యున్నది. ఇరువురును జగ్గయ్యపేటవాస్తవ్యులే. భగవచ్ఛాస్త్రి నిండుజవ్వనములో నుండుకాలమున వేంకటాచార్యులు వార్ధకదశలో నుండియుండును. కనుక నొకరినొకరు బాగుగా నెఱిఁగియుందురు. కాని పోటీపడినట్లుగా నిరువురు నొకే దేవరనుగూర్చిఁ కొన్నిపదములమా

ప్పుతో మకుటకల్పనము చేసికొనుట, ఇరువురును శేషప్రాసముతో, గ్రంథములే వ్రాయుట, ఇరువురును నొక్కగ్రామవాసులగుట, ఈయూహను బలపఱచుచున్నవి.

ఈ రెండుశతకముల శైలిలోఁ గూడ నంతగా భేదము లేకపోవుట ముఖ్యముగా గమనింపఁదగినది. ఇతఁడును శతకములోని 60 వ పద్యముః నుండి 70 వ పద్యమువఱకు దశావతారవర్ణనము చేసినాఁడు. అందు విశేషమొకపద్యముననే పదియవతారములు చెప్పుట :—

"శరిచర కచ్ఛప కిరి నరహరివయి భృగురాము రామ హరి బుద్ధత ఘు
స్ఫురణలఁ బ్రభవించితివౌ తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా"

ఈ కవి యంత్యప్రాసనియమనములమీఁద చాలమోజు కలవాఁడుగఁ గనఁబడుచున్నాఁడు :—

"కరణంబులు, ముక్తికలంకరణంబులు, ఫణికి భద్రకిరణములగు నీ
చరణంబులు మదిదలచెదఁ దిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా"

ఇందు త్రిప్రాసముకూడ తొంగిచూచుచున్నది.

"శరణాగతపరిపోషా ! సురుచిరమృదుసత్యభాష సుందరవేషా !
సురవరిహృత్సంతోషా ! తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా"

"నిరుపమ గరుడతురంగా ! పరమమునీంద్రౌఘసంగ ! భవభయభంగా
నిరవధికరుణాపాంగా ! తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా"

"ఉరగాధిప మృదుతల్పా ! కరుణాకర భక్తకల్ప కమలాకల్పా !
భరితాబ్జజాండకల్పా తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా"

ఇందజామిళ, ధ్రువ, గజ, నారద, విభీషణ, ద్రౌపదీముఖ్యుల రక్షించు విషయములు, ఇంకను గొన్ని విష్ణుప్రభావ ద్యోతక లీలలు వివరింపఁబడినవి. క్రిందివచ్చుపద్యమును జూడుఁడు :—

"శిరమున రత్నకిరీటం బురమునఁ గౌస్తుభము వెలయ సురుకుండల స
త్కరకంకణములఁ జెలఁగెదు తిరుమల శ్రీ వేంకటేశ త్రిదశాధీశా"

ఇతఁడు వ్రాసిన గోవిందశతకము లభింపకపోవుట దురదృష్టము. ఈతిరుమల శ్రీ వేంకటేశ శతకములో పూర్తిగా 108 పద్యములేకాక స్వవిషయమును దెలుపు 4 పద్యములున్నవి.

—◆◆—

# పరశురామపంతుల లింగమూర్తి

క్రీ॥ శ॥ 1830 ప్రాంతము.

ఇతఁడు రచించిన మనశ్శతకములో 101 కందపద్యములున్నవి. "మనసా" యనునది మకుటము. ఇతఁడు గొప్ప వేదాంతి. నారాయణ గురునిశిష్యుఁడఁట! ఇంతకంటె నితనినిగుఱించి విశేషము లేవియుఁ దెలియుటలేదు. రచనను బట్టిచూడగా కడచినశతాబ్దము పూర్వార్థములోని (1830 ప్రాంతము) వాఁడుగా కనఁబడుచున్నాఁడు.

వేదాంతులందఱివలెనే యితఁడు, తనగురువును నిష్టదైవమగు శ్రీరామచంద్రునివలె భావించువాఁడు.

(1) శ్రీనారాయణగురు సీతానాయకుఁగాఁ దలంచి ముదమొందుము, (2) అఱగడియలోన రాముని సిరిఁబొందఁగ నొక్కయుక్తిచేఁ దెలిపిన శ్రీగురునారాయణయోగుల మఱవకుమీ, (3) సుకరున్నారాయణేంద్రుఁ జూడుము మనసా, (4) ఘను నారాయణుని రాముగాఁ గను మనసా, (5) శ్రీరాముని గను మను గురునారాయణు చరణయుగము నమ్మవె మనసా!

ఇతఁడైహికములగు కామ్యకర్మములనన్నిటిని నిరసించినాఁడు. ప్రకృతిసంబంధులైన విషయములను మాయాకల్పితములని దూషించినాఁడు.

(1) మతములు నిర్వాణపద ప్రతిబంధకములు. (2) మంత్రంబులన్నియును నడుమంత్రంబులు, లేనిపోనిమాటలు, (3) జపములు, తపములు, వ్రతములు విపరీతపు డాంబికములు, (4) గారడపుయోగములచే నాఱడి పొందకుము, (5) అంబరగమనాదులు కడుడంబమ్ములు, (6) చదువులిలఁ బలు తెఱంగుల వదరుల్, (7) వేదంబులగాథంబులు, వాదంబులు బహువిధాపవాద విరచితోన్మాదంబులు, (8) స్నాన జప హోమ మంత్ర ధ్యానాదికకర్మములు మహాడంబరముల్, (9) భువి దూరదృష్టి దూరశ్రవణాదులు మాయలని విచారింపుము, (10) వాయునిరోధముల నిజకాయంబులు సిద్ధిసేయఁగడఁగినవారల్ మాయాకాయికులు, (11) మాయలిల లక్షలక్షలు, కాయికములు కోటికోట్లు, కాననఖిలముల్ మాయాకార్యములు.

ఇంకను, శబ్దస్పర్శరూప రసగంధాదులు, ఇంద్రియస్వరూప స్వభావములు, అక్షరాక్షరములు, జాగ్రత్స్వప్నసుషుప్తులు, అండాండ పిండ బ్రహ్మాండములు, ద్వంద్వాతీతస్థితి, అమనస్కాదియోగములు, అజపాగాయత్ర్యాదిజపములు, అహంకారనిరాసము, జ్ఞానాజ్ఞానజ్ఞాతృ జ్ఞేయములు, చక్కఁగాఁ బామరులకుఁగూడఁ దెలియునట్లు ఈకవి వ్రాసినాఁడు. నిర్గుణోపాసకుఁడైనను, కవి తనయిష్టదేవమైన రామచంద్రుఁనే గురుదేవుఁడైన నారాయణదేశికుఁడని, గురువే పరబ్రహ్మమని, యతని యనుగ్రహముచేతనే జన్మరాహిత్యమైన యద్వైతసిద్ధి యధిగమింపవలయునని సంపూర్ణవిశ్వాసముతో చరించినవాఁడు. అంతేకాదు. స్వానుభవముచేత యోగాభ్యాసములనలవఱచుకొని పరబ్రహ్మసాక్షాత్కారముపొందిన అద్వంద్వుఁడు నిరామయనిశ్చల స్వభావము కలవాఁడుగా నున్నాఁడు.

ఈశతకములో నతనిపేరుగాని, ఊరుగాని యెక్కడను చెప్పుకొనలేదు. ఈశతక సంపాదకులైన పరిషత్కార్యాలయమువారు, వినికిడి వలన "లింగమూర్తికవి" యని ప్రశ్నార్థకముతో సూచించిన కవియే వ్రాసెనో మఱియెవరైన వ్రాసిరో తెలియవచ్చుటలేదు.

ఇతని నిర్మమత్వమును నిరహంకారమును సూచించు నీక్రింది (శతకాంత) పద్యత్రయము పాఠకులకుపాయనము :—

"నీకన్నఁ దక్కువగు నీ ప్రాకట విషయేంద్రియముల పజ్జ మెలఁగుట
స్తోకవివేకమె? నీ తగదిఁక, గాపత్ స్థాన్వయునిఁగూడు, గ్రక్కున మనసా!"

"రామునికి రుణ. నిజాత్మా రాముఁడవై, యుండెదవు. కింబుగ నిఁక నీ
వ్యామోహముడిగి, నాలో, వేమఱు గలియుము నిరస్తవృత్తిని మనసా!"

"భంగమును బొందకుండు, కురంగ మతంగజ పతంగ రాజీవ మహా
భృంగములరీతిఁ గువిషయ సంగతిఁ దలఁపుమింక రాముని మనసా!"



# గాదె ఆదిశేషకవి

క్రీ॥ శ॥ 1830—35 ప్రాంతము.

ఇతఁడు తన్నుఁగూర్చి, తన కొచ్చెర్లధామశతకములో 9 వ పద్యము నీవిధముగఁ జెప్పియున్నాఁడు :—

"ఆర్వేలవారిలో నలరారుచుండెడు నయ్యాన పౌత్రుని కామమాంబ
గాదె వంశాబ్ధి రాకాసోముఁడన నొప్పు కొండయపుత్రుని కూర్మిసుతుఁడ
హారితసగోత్రజుండనై విలసిల్లెడు బుధనుతుం దప్పయపుత్రకుండ
ఆశ్రితజనకర్ణుఁ డనఁగఁ జెన్నలరారు సుభగుఁడౌ కృష్ణయసోదరుండ
ఆదిశేషాభిధానుఁడ, ననవరతము నీదు పాదాబ్జములను హృద్వీథినిలిపి
పద్యశతకంబొనర్చితి భవవిరామ చారుతారకనామ, కొచ్చెర్లధామ"—

తా నార్వేలనియోగిననియు, హారితసగోత్రుఁడననియుఁ జెప్పుకొనుచుఁ, దనముత్తాతనుండి వంశక్రమమును దెలిపికొనినాఁడు.

తనకృతి నితఁడు 'నందివెలుగు' అనుగ్రామమునందలి సంపన్నుఁడును, కమ్మకులాలంకారుఁడు నగు కన్నెకంటి వేంకటసుబ్బయ యను గృహస్థుని ప్రేరణచే వ్రాసినట్లు వివరించినాఁడు.

ఈ నందివెలు గను గ్రామము గుంటూరుమండలమున తెనాలికి దుమైళ్లదూరమునఁ గలదు. కవి పోషకుఁడయిన వేంకటసుబ్బయ్య తరతరాలుగా నాగ్రామవాస్తవ్యుఁడుగనే కనఁబడుచున్నాఁడు. పైఁగా నాగ్రామము కమ్మలప్రాబల్యము, జనాభా యెక్కువగాఁగల గ్రామముగాఁ దెలియుచున్నది. కవి శతకముతొలిపద్యముననే నందివెలుగు గ్రామస్థులయిన కమ్మవారినిగూర్చి :—

"శ్రీరమణీయమై విబుధ సేవితమై తగు కృష్ణవేణికా
తీరమునందు రత్నచయ దీధితి రాజిలు నందివెల్గునం
దారయ, కమ్మవారు పరమాద్భుత సంపదుదార దానమం
దారులు సద్యశోధనులుఁ దద్దయు శూరులు వారిలోపలన్"

కన్నెకంటి వెంకయ్య గౌరమ్మల పుత్రుఁడు కోటయ్య. అతనికి పున్నమ్మ యను సాధ్వియందు కలిగిన ముగ్గురుకుమారులలో నీకృతిప్రేరకుఁడైన వేంకటసుబ్బయ్య కనిష్ఠుఁడు.

కోటయ్య "సప్తసంతానములొనర్చి సకలజనులు తన్నుఁ బొగడఁగ సత్కీర్తిఁ దనరె"నఁట!

కవి వేంకటసుబ్బయ్యాఖ్యనిగురించి యీ క్రింది పద్యములోఁ బూర్వకవులవలె వర్ణించిన విధము గమనింపఁదగినది :—

"వేంకటసుబ్బయ యనమిల వేంకట శంకరగిరీంద్ర శరదభ్ర లస
త్పంకజభవసతి విమలసుధాంశులతో సాటిపోల్పఁదగు నెల్లెడలన్"

ఈ శతకము మూలప్రతి (నాదగ్గ ఱనున్నది) 1903 సం॥న ముద్రితమయినది. సరిగా నూఱుసీసపద్యములు. "చారుతారకనామ కొచ్చెర్లధామ" యనునది మకుటము. దీనిని బట్టియు, మొదటినుండి పదుమూఁడవపద్యమునందుఁ గల శ్రీరామావతారవర్ణనమునుబట్టియు నిది కొచ్చెర్లలో నెలకొన్న శ్రీరాముని కంకితమని తెలియుచున్నది. ఈకొచ్చెర్ల గుంటూరుజిల్లాలోని పెనుగొండకు సమీపములో నొక గ్రామముగా విన్నాను. అదే శతకమకుటములోఁ బ్రసక్తమైనదైన నచ్చట శ్రీరామాలయ ముండవలయును. పైఁగాఁ గృతికర్త, కృతిప్రేరకుఁడు నొకేమండలములోనివారును, కొంచెముసన్నిహితులు నగుట తటస్థించుచున్నది. ఇదిగాక, 'కొచ్చెర్లకోట' యను జమీందారీగ్రామముకూడ నున్నది. కాని యది గుంటూరుమండలములోనిది కాదు. ఈశతకములో కొచ్చెర్ల అని "కోట" శబ్దము లేకుండ కవి వాడియున్నాఁడు. అయిన నింతకుఁ గవి యేయూరివాఁడో స్పష్టముగాఁ దెలియుట లేదు.

ఈశతకములో గర్భ, బంధ, కవిత్వములే కాక, యెన్నో చిత్రరచనలు కనుపించుచున్నవి. అద్వైతసిద్ధాంతములకు అనుగుణములైన వేదాంతవిషయములు విస్తారముగా నున్నవి. కవి తనపోషకుఁడే యట్టి శతకమును వ్రాయుమనినట్లు చెప్పుకొనినాఁడు :—

"అంచిత వేంకటసుబ్బయాహ్వయుం డొకనాఁడు నాకు శేషకవీంద్రుఁ డ్రాసన్నుఁ
బిలిచి కొచ్చెర్లధాముని పేరిమీఁద సీసశతకంబు నద్వైతసిద్ధముగను
చెప్పు మనుచుంట, మా కనుశీఘ్రముగను ననుచుఁ బల్కఁగఁ జెప్పితి నతిముదమున"

వేదాంతవిషయములు పుంజీభవించు చిత్రకవిత్వ సీసశతకమును వ్రాయఁగలిగిన యీయాదిశేషయ రచన మహాప్రౌఢమయినది. సమగ్రమైన యద్వైతతత్త్వావబోధకుఁడుగాని యింత చక్కఁగా నిర్వహింపలేఁడనుట సత్యదూరము కాదు. కాఁగా నీశతకరచననాఁటికి కృతినిర్మాణములో గడితేఱిన యీతఁడు ఏబదియేండ్ల ప్రాయముగలవాఁడుగా తప్పక యుండియుండుననుట సహేతుక మగును. అనఁగా నితఁ డిప్పటికి, నూఱు, నూటయిరువది యేండ్ల క్రిందటివాఁడుగా నుండవచ్చును.

చిత్రకవితాధోరణికిఁ గొన్ని మచ్చుముక్కలు.

(ముక్తపదగ్రస్తము)

"శ్రీరమారమణీ సుసేవితమృదుపాద, పాదసంభూత సంభావ్యగంగ,
గంగాధర పటిష్ఠ కార్ముకభంజన, జనలోకపూజిత చారుచరణ,
రణరంగనిర్జిత రాక్షసచయమద, మదయుత రావణ మథనబాణ" (౨ వ పద్యము)

(మత్తేభగర్భితసీసము)

"త్రిభువనాధేశ హరీ త్రివిక్రమ స్వయంభూవంద్య యజ్ఞప్రభో రమేశ,
సుకవిరాజస్తుత, సూర్యవంశజ రమా కాంతా మనోనాయకా మహేశ,
మధవ దామోదర కుంభినీధర జగత్సాక్షీ సురేంద్రస్తుతా యుపేంద్ర,
విభవవైకుంఠ వివేకరక్షణ జగద్భద్రాయమానప్రభా మురారి" (౩ వ పద్యము)

(పై సీసపాదములలోని తొలియక్కరములను, పాదాంతవర్ణత్రయములను—విడిచిపెట్టి—మిగిలినది చదివిన మత్తేభ పాదములగును.)

(దంత్యోష్ఠ్యసీసము)

"దశరథనందన దశకంఠఖండన చారుకోటీర కనకవసన
రవికులోదధిచంద్ర, రవిచంద్రలోచన నారదవందిత నగసుధీర !" (౪ వ పద్యము)

(సర్వలఘుసీసము)

"పెనుమినుకుల కొనలను మునిగణములు వినుతిరొనరిచియుఁ గనుఁగొనఁగను,
నెఱుఁగని నిను నొకనరుఁడను దెలియఁగఁ గలనని పలుకఁగ నలవియగునె ?"
(౧౯ వ పద్యము)

(ప్రాసయమకసీసము)

"శంకరు, దాసవశంకరుఁ బాపనాశంకరు సద్భక్తి సంస్తుతించి
ధాత, నందితబుధవ్రాత సద్గుణగణోపేత నామదిలోన ప్రేమ్మఁదలఁచి
సీత, సాశ్రితపారిజాత పద్మోద్భవ, మాత పరాపరమహిమ తెన్ని,
గౌరి, గిరీంద్రకుమారి దుష్టాసుర హారి హృద్వీధియందు దభినుతించి
శారదను కాంతివిజిత తుషారహీర హారడిండీర వదనవిహార నెంచి" (౭ వ పద్యము)

ఇంకను నామగోపన షోడశాక్షరీ, ద్వాదశాక్షరీ, రథబంధములు కూడ నున్నవి. ఈ(చిన్న) శతకకృతిలోననే తన కవితాప్రౌఢిమనంతయు చూపఁగలిగిన యీ యాదిశేషకవి చాలగడుసువాఁడు.

ఈ కవి కావ్యమార్గము ననుసరించి వర్గశుద్ధిగా, నిష్టదేవతావందన గ్రంథోద్భవ కారణములతో నీశతకము రచించుటలోఁ, గవిస్తుతియుఁ జేసినాఁడు. అందులోఁ దనగురువైన వరదాచారి నాగేశ్వరుని, వాల్మీకి వ్యాసులను నన్నయ, తిక్కన, పోతనలను పేర్కొనినాఁడు.

విషయవిభాగ పూర్వకముగా నీశతకములో నద్వైతసిద్ధాంత సారమును వేదాంతపీయూషమును బూర్తిగా సంగ్రహముగా దిమ్మరించి యీకవి ధన్యుఁడయినాఁడు :—

ఇందలి విషయములివి :—(1) చతుర్విధ శుశ్రూషాప్రకరణము (ప 23–24), (2) సాధనసంపచ్చతుష్టయము (ప 25), (3) నిత్యానిత్య వస్తువివేకము (ప 26), (4) ఇహాముత్రార్థఫల భోగవిరాగము (ప 27), (5) శమాదిషట్కసంపత్తి (ప 28), (6) ముముక్షుత్వము (ప 29), (7) పంచమలనిరూపణము (ప 30), (8) షణ్ణవతితత్త్వములు (ప 31), (9) తాపత్రయ నిరూపణము (ప 32), (10) ఈషణాత్రయములు (ప 33), (11) వాసనాత్రయము (ప 34), (12) పంచక్లేశములు (ప 35), (13) సప్తవిధబుద్ధినిరూపణము (ప 36), (14) అజ్ఞానభూమికలు (ప 37 షట్పది), (15) విజ్ఞానభూమికలు (ప 38 షట్పది), (16) పంచకోశములు (ప 39), (17) నవవిధత్రిపుటులు (ప 40), (18) పరాపశ్యంతిమధ్యమావైఖరీ వాక్కులు (ప 41), (19) ఓంకారమాహాత్మ్యము (ప 42), (20) ఆగామి సంచిత ప్రారబ్ధములు (ప 43), (21) పంచముద్రలు (ప 44), (22) అద్వైతత్రయము (ప 45–47), (23) మహావాక్యార్థ ప్రకరణము (ప 48–51), (24) షట్చక్రనిరూపణము (ప 53–59), (25) ఇడాపింగళా నాడికావివరము (ప 60), (26) ఇడాపింగళాసుషుమ్నా నాడికా వివరము (ప 61), (27) తారకవిచారము (ప 62–63), (28) సాంఖ్యము (ప 64–67), (29) అమనస్కము (ప 68–80), (30) అష్టప్రకృతి విచారణము (ప 89), (31) సర్వంఖల్విదంబ్రహ్మయనుట (ప 90–93), (32) దశావతారములు (ప 94–95), (33) షోడశోపచారపూజలు (ప 96–99) (34) మంగళము (ప 100).

ఈ యాదిశేషకవి మహాతాత్త్వికుఁడు. కూలంకషముగా వ్యాఖ్యానములన్నియుఁ జదివి యవగాహన చేసికొనినఁగాని బుద్ధికెక్కని వేదాంతవిషయవిశేషములను నొక్కొక్క పద్యములో స్పష్టపఱచుట యనిన, నది యొకపాటి తత్త్వజ్ఞునివలన నగుపని కాదు. పైఁగా కావ్యనిర్మాణములోఁ బూర్వకవులమార్గముల ననుసరించి, యెన్నిహంగులతో కృతికన్యను సింగారింపవలెనో, యన్నిహంగులు నీశతకకావ్యపుత్రికకుఁ గూర్చి రసవంత మొనరించినాఁడు.

ఇంకను ముక్తసరిగఁ జెప్పవలయునన్న (ఒక్కమాటలో) ఇది కావ్యలక్షణములకు, వేదాంతరహస్యములకు చిన్న లక్ష్యశతక కావ్య మనవలయును.

ప్రౌఢకవి, వేదాంతి యయిన యితఁడొక యుద్గ్రంథము—సీతారామాంజనేయము వంటిది యేదైన రచించియుండిన—మన "యాంధ్ర కవులచరిత్ర" కారుల దృష్టిలోఁ బడి రాణకెక్కియుండువాఁడు. ఆభాగ్య మతనికి లేకపోవుట—అతనికి కాదు, తెలుఁగుదేశమునకే యొక మాపరాని కళంకము. ఈ కొచ్చెర్లధామశతకమునయినను కాపాడుకొనవలయునను నాస్థ కలిగిననాఁడు మనయాంధ్రులు ధన్యులు కాఁగలరు. కాని నాఁడు ఆంధ్రశారదా మకుటస్థగిత హీరమణి యొకటి రాలినట్లు అనుకొనవలసివచ్చును. పాడుపనిచేసి పశ్చాత్తాపపడు మనవారి స్వభావము ఈశతకరక్షణసత్కార్యనిర్వహణముగాఁ బరిణమించుగాక!

ఇంతతో నీశతకసమీక్ష ముగించుచు మూఁడుపద్యములు పాఠకుల కీక్రింద మచ్చునకుఁ జూపుచున్నాను :—

"మింటికి మంటికి నంటియుంటనిపండు, పంట నొక్కఁగ వీలుపడనిపండు,
తినఁబోవ దొరకని తీపిగల్గినపండు, పామరులకుఁ గనఁబడనిపండు,
వేదాంతములచేత వెదకి కాననిపండు, ఎందుఁజూచిన నందె యొసఁగుపండు,
సాధులమది సంతసము చేయునాపండు, పండుగన్గొన బట్టబయలనుండు,
పత్రపుష్పంబులును లేక పండుపండు మించిపరిపూర్ణతత్త్వమై మెలఁగుపండు
పరఁగ గురుకృపలేక కన్పడనిపండు చారుతారకనామ! కొచ్చెర్లధామ!"

"భవరోగములఁబోవు బలువైనమందుల నెఱిఁగింతుఁ, బెద్దల నెఱిఁగికొనుట
పూర్ణచంద్రోదయంబు, పరాత్పరుని సేవ సంజీవమనెడి రసాయనంబు,
నానందమైయొప్పు నానందభైరవి గురుపాదమే, జ్వరాంకుశము దెలియ
దాసోహమనుట, చింతామణి గురుసేవ, మండూర మతిభక్తి యభ్రకంబు,
రామనామంబు వీరవిక్రమరసాయనంబు, రసభూపతి హరివ్రతంబు, మదిని
దలఁప నీసేవ పరమామృతంబు దెలియ చారుతారకనామ కొచ్చెర్లధామ!"

(దశావతారవర్ణనము)

"వేదాంతమయ్యుండి వేదంబులరయుట, జలశాయివయి జలచరమవగుట,
మింటమింటనుండి మంటికైపోరుట, యావికారివై నరహరివి యగుట,
ఆశలేకయ యొరు నాశించఁబోవుట, రూపహీనుఁడవయ్యు బాపఁడగుట,
ధరను నిర్వైరివై దశకంఠుఁ గూల్చుట, మదిమితేతలు లేక ముసలివగుట
ఆశ్రమము లేక యతిరూపివై తిరుగుట, చలనమొందని నీవింకఁ గలికివగుట,
మదికి నాశ్చర్యమైయొప్పు మహితనామ! చారుతారకనామ! కొచ్చెర్లధామ!"

—:0:—

# మంచెళ్ల కృష్ణకవి

క్రీ॥ శ॥ 1840 ప్రాంతము.

'శతకకవులచరిత్ర' రెండవభాగములో నీకృష్ణకవినిగూర్చియు నితని 'వేంకటనగాధిపశతకము'ను గురించియు శ్రీసుబ్బారావుగారు వ్రాసినారు. కృష్ణకవి యీశతకములోని కడపటిపద్యములలోఁ దన్నుఁ గూర్చి యీవిధముగఁ జెప్పుకొనినాఁడు.

"ప్రాశస్తిమంచళ్ళాన్వయుఁడఁ బాపయమంత్రితనూజుఁడన్, భర
ద్వాజసగోత్రజుండఁ బ్రియ భక్తుఁడఁ గృష్ణకవి న్భవత్పదాం
భోజయుగాంకితంబుగ సమున్నతిఁ గబ్బ మొనర్చినాఁడ, న
వ్యాజత నేలుమీ వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ"

"పూరుషముఖ్య రంగ రఘుపుంగవ వేంకటనాథ కృష్ణ శృం
గారకథాళి నైదుశతకంబు లొనర్చి, తటాక బాహ్యభా
త్రీరుహ ముఖ్య సంతతులు ప్రేమనొనర్చి యొసంగినాఁడ, సాం
పార గ్రహింపు వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ"

ఇంటిపేరు 'మంచెళ్ల' వారనియు, నితఁడు పాపయమంత్రి కుమారుఁడనియు, భారద్వాజసగోత్రుఁడనియు మొదటిపద్యమువలనఁ దెలియుచున్నది. ఇతని వేంకటనగాధిపశతకము తెలుఁగుదేశమునఁ జాలదినములుగాఁ బ్రచారములోనున్నది. దానిశైలినిబట్టియు శబ్దప్రయోగములనుబట్టియు నితఁడు క్రీ॥ శ॥ 1840 సంవత్సరమున కివతలివాఁడు కాఁడు. చాటుపద్యరత్నాకరముననో, మంజరిలోననో యితని ప్రస్తావన కలదు. "పొల్లుపుచ్చకు తృష్ణ మంచెళ్ల కృష్ణ" యని యితని నేసందర్భముననో యొకానొకకవి యన్నట్లు తెలియుటవలన నితఁడు కవితావ్యాసంగము విశేషముగా కలవాఁడని తోఁచుచున్నది. ఇతఁడు (1) పూరుషముఖ్య, (2) రంగ, (3) రఘుపుంగవ, (4) వేంకటనాథశతకములు, (5) కృష్ణశృంగారకథావళి యను నాటకము రచించుటయేకాక, తటాక వన ప్రతిష్ఠాది సప్తసంతానములుకూడ నిర్మించినట్లు పై పద్యములలోని రెండవది వివరించుచున్నది.

ఈ కృష్ణకవి రచించిన యైదుశతకములలోను "వేంకటనగాధిపశతక" మొక్కటే శతకకవులచరిత్రకారునికాలమునకు వెలువడినట్లున్నది.

పైఁగా, ఇక్కావి 5 శతకములు వ్రాసినట్లు ఆశతకమునఁ గడపటిపద్యమే చెప్పుచుండఁగా నావిషయమైనను సుబ్బారావుగారితనిచరిత్రలోఁ దెలుపకపోవుటకుఁ గారణము బహుశః అతనికి దొరకిన వేంకటనగాధిపశతక మసమగ్రమయి యుండునని యూహించుచున్నాను.

ప్రకృత మాంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమువారు సంపాదించి ప్రకటించిన శతకసముచ్చయము—ప్రథమభాగములోఁ బై వేంకటనగాధిపశతకమే కాక, పూరుషముఖ్య శతకముకూడ నున్నది. పద్యములోఁ గవి చెప్పిన క్రమమునుబట్టి చూచిన నీపూరుషముఖ్యశతకమే యతని ప్రథమరచనగాఁ గనఁబడుచున్నది. ఇప్పటికి లభించిన యీరెండు శతకములలో శైలీప్రౌఢిమను, నలంకారబాహుళ్యమును, భావబంధురతనుబట్టి, చూచిన వేంకటనగాధిపశతకమునకే ప్రథమస్థాన మీయవలసియుండును.

మొదటి శతకమకుటము "వేంకటనగాధిపతీ! విలసత్కృపామతీ" యని. ఇదివఱకే యిది శతకకవులచరిత్ర కెక్కినందువలనఁ బ్రకృతము పూరుషముఖ్య శతకమునుగుఱించి మాత్రము సంగ్రహముగా సమీక్షింతును.

ఈశతకములో 109 ఉత్పలవృత్తములున్నవి. కడపటి పాదమంతయు "పూరుషముఖ్యుఁ డాభువనపూజ్యుఁడు నాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్" అను మకుటముతో నిండియున్నది. కనుక ప్రాసము నిర్బంధముగా రేఫమయి కూర్చున్నది. కవి మహాభారతములోని యుదంకుని చరిత్రయందలి (1) అహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్, (2) అద్రినందనేశ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్, (3) ఐరావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్. (4) ఈక్షణశ్రోత్రవిభుండు తక్షకుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్—అను నన్నయభట్టారకుని ప్రయోగముల నొరవడిగాఁ బెట్టుకొని యీపూరుషముఖ్య శతకమకుటము కల్పించుకొనియుండును.

ఇందలి పద్యములన్నియు శ్రీకృష్ణచరిత్రాంశములను వర్ణించునవి. ఒక్కొక్కపద్యములో నొక్కొక్క శ్రీకృష్ణలీలను కవి పొంకముగా

వేణురవామోద వర్ణనము :—

"సూరిసుతాధునీ పులిన సుస్థలుల న్మురళీరవంబుచే
సూరెల వల్లవాంగనలు సొక్కఁగ బంధుర బంధుసంజ్ఞలన్
వారలఁ బ్రీతిఁ దేల్చు యదువంశ సుధాబ్ధి సుధామయూఖుఁడే॥"

భూభారహరణ వర్ణనము, శ్లేష :—

వారని సత్కళాప్తిఁ దలఁపం, ద్విజరాజన నొప్పి చండభే
నారచితార్తయౌ కువలయవ్యథ మాన్పు రథాంగ మత్తసం
హారివిధుండు, నా, యదుకులామృతకంధి జనించి చండభే
నారచితార్తయౌ కువలయవ్యథమాన్చు విధుస్వరూపుఁడే॥"

పార్థసారథ్య వర్ణనము :—

"హారము పేరెదం గునిసియాడ ముఖాబ్జమునన్ శ్రమాంబువుల్
దేఱఁగఁ గుండలంబులు చలింప, మహాజి సురేంద్రసూతికిన్
సారథియై తురంగ పటు సారగతిక్రియ లేర్పరించె, నే॥"

బలరామావతార వర్ణనము :—

"సీరముఁబట్టి, పై నసితచేలముఁగట్టి, ప్రలంబముఖ్య దే
వారులఁ గొట్టి, సూర్యతనయారభసం బెడవెట్టి, రేవతీ
ధీరువుఁ జెట్టవట్టి, ముగ భేదికిఁ దోడయినట్టి జెట్టి యే॥"



# పూండ్ల చెంగయకవి

క్రీ॥ శ॥ 1840 ప్రాంతము.

ఇతని "శయనపురి కోదండరామశతకము" క్రీ॥ శ॥ 1882 సంవత్సరము వాణీనిలయ ముద్రాక్షరశాలయందు అచ్చు వేయఁబడినది. దీనిని కార్వేటినగర సంస్థానమునకుఁ జెందిన పల్లిపట్టువాస్తవ్యుఁడైన ముద్దుగురునాథపిళ్లె ప్రచురించినాఁడు. కో. అనంతాచార్యులు పరిష్కరించినాఁడు. కనుక నిది 72 ఏండ్లనాఁడు ముద్రించి ప్రకటింపఁబడినది

ఇందులో సరిగా వందసీసపద్యము లున్నవి. "శయనపురిధామ దనుజసంచయవిరామ, చండకరకోటిధామ కోదండరామ" యను (ఎత్తుగీతిలోని కడపటి రెండుపాదములు) మకుటము. పద్యములు సలక్షణముగా, ధారావాహికగా, పాండిత్యస్ఫోరకశబ్దప్రయోగలలితముగా నున్నవి.

స్వవిషయమునుగూర్చి శతకకారుఁడు కడపటి పద్యములో నీవిధముగాఁ జెప్పుకొనినాఁడు :—

"శ్రీలలసింగ నార్వేలకులాబ్ధి శుభ్రాంశుఁడౌ పూండ్ల శేషాభిధాను
పౌత్రుఁడ, పిచ్చయపుత్రుండ, చెంగయాహ్వయుఁడను విబుధసంచయవిధేయుఁ
డను భవచ్ఛ్రీపాదవనజాతయుగమిళింపన్మానసుఁడ భరద్వాజగోత్ర
సంజనితుండ యుష్మద్దాసదాసుండ నతిభక్తితో సీసశతక మిదియు
నొనర రచియించినాఁడను గొనుము దీని"

ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణశాఖకుఁ జెందినవాఁడు, భారద్వాజసగోత్రుఁడు. శేషయార్యుని మనుమఁడు. పిచ్చయకుమారుఁడు.

ఈకవికూడ పల్లిపట్టుప్రాంతమువాఁడే. ఈశతకమును బ్రకటించిన ముద్దుగురునాథపిళ్లె ఆకాలమున పల్లిపట్టుగ్రామకరణమని తెలియుచున్నది. లేక మఱి యేసమీపగ్రామమునకైనను గరణీకము చేయుచుండి యుండవచ్చును. సాధారణముగా చిత్తూరు, ఉత్తరార్కాడు జిల్లాలలో నీపిళ్లలను బిరుదములుగలవారు కరణాలు, వీరి యుపభాష

పుదూరు ద్రావిడుల యఱవభాషకుఁ జెల్లెలనిపించును. ఆకారణముచే పుదూరుద్రావిడులవలెనే పేరికిని ప్రాంతీయభాషయయిన తెలుఁగే మాతృభాష యయినది. దానిమీఁద నెక్కువ యభిమానమును గలదు. అందు వారు పండితులు, కవులు నయిరి.

ఈశతక ముద్రణకాలమునకు గురునాథపిళ్లె కేఁబది యేండ్లకుఁ బైఁబడి యుండిననే తప్ప కేవలము భక్తిరసము చిప్పిలుచుండు నీశతకమును రచించిన కవిమీఁద నాదరాభిమానములుగాని, యీశతకము అచ్చువేయింప నలయునను పారమార్థికచింతగాని యుండదు. కవికిని అప్పుడు 45–50 ఏండ్ల వయస్సు ఉండియుండునని నుకొనిన, ఇతని జననము క్రీ॥ శ॥ 1837–42 ప్రాంతమని యనుటలో సందేహముండదు. కాని పల్లిపట్టు కార్వేటినగరమునకు 8 మైళ్లదూరమే యయినప్పుడు అక్కడి కతఁ డెడపదడప పోయివచ్చుట యుండును. కాని యాకాలమునఁ బ్రభు దర్శనములనిన సాధ్యమగునవి కానందున, నీకవియు రాజాశ్రయవిషయములో నిరాశఁ జెందియుండును. పైఁగా ఆకాలమున శ్రీబ్రహ్మరాజు గారు రాజ్యముచేయుచుండినట్లు తెలియుచున్నది. అతనికి వైదికప్రభు వని ప్రఖ్యాతి. ఆయన వేదములలోని కొన్నిభాగములను స్వరయుక్తముగాఁ జెప్పఁగలవాఁడు. శ్రీదేవ్యుపాసకుఁడు. తన్మంత్ర సిద్ధుఁడు. ఆయనకాలములో సంస్కృతగ్రంథములు, మంత్రశాస్త్రములు చాలవఱకు సంస్థానముద్రాలయముననే అచ్చయినవి. తెలుఁగన్న నాతని కభిమాన మెక్కువ లేకపోయినది. అందుచేతనే యీచెంగయకవికి ప్రభువుయొక్క ఆదరము లేకపోవుట కేవలము మెుక గ్రామకరణ మతని గ్రంథమునకు (శతకమునకు) వెలుఁగుచూపుట తటస్థించినది.

ఈశతకములోఁ బేర్కొనఁబడిన 'శయనపురి' ఏదో తెలియుట లేదు. కాని 'పల్లి' అను ద్రావిడశబ్దమునకు "శయన" మను నర్థమున్నట్లు తెలియుచున్నది. ఆపక్షమున పల్లిపట్టు శయనపురి కావచ్చును. కాని యాయూరిలో నీశ్వర దేవాలయము తప్ప కోదండ రామాలయము లేదు. బహుశా, అది యక్కడి పురాతన భజనమందిర మేదైన నయి

"కమలాప్తశశినేత్ర, కమనీయచారిత్ర, నీరదనిభగాత్ర వైరిజైత్ర,
భార్గవీయుతవక్ష, పలభక్షకవిపక్ష, పద్మాయతాక్ష సద్భక్తరక్ష,
సుజనావనవిహార, సుగుణగణాధార. సీతాసుహృచ్చకోర, శ్రీవిహార,
వినుతభక్తసమాజ, దినకరశతతేజ వందారుసురభూజ, వందితాజ,
ప్రవణసుత్రామ, సంగరరంగభీమ, భువనకల్యాణనామ, సంపూర్ణకామ"
"శ్రీరామ జయరామ, సీతామనోనాథ !, రార, పాపవిదూర, రారధీర !,
దైతేయవర్గ కాంతారదావానల !, వరద రారా, భక్తవంద్య రార !,
సుజనార్చితపదాబ్జ, త్రిజగదవనపరంధామ, రారా, రణభీమ రార !"

ఇది—శ్రీనాథమహాకవి "శివరాత్రిమాహాత్మ్యము" లోని :—

రారా, వణిగ్వంశవారాశిహిమధామ, రారా వికస్వరాంభోరుహాక్ష.

అనుపద్యమును తలంపునకు తెచ్చుచున్నది.

"శ్రీరమణీ మనస్సారసమిత్ర, సుజ్ఞానరత్నాకర, తేనమోస్తు !
ఇనకులాబ్ధిశశాంక, సనకాదినుతగాత్ర ! ధీరవందితపాద ! తేనమోస్తు !
భోగిభూషణవంద్య, భోగిశశయన, సీతేశ సర్వాధార, తేనమోస్తు !
దశరథావనిపాలకాత్మజార్యస్తుత, దివ్యనామ, పరేశ, తేనమోస్తు !
దివ్యమణిమయభూషణ, తేనమోస్తు ! జ్ఞానధీవేద్య, శ్రీరామ, తేనమోస్తు"



# చామర్తి శేషగిరిరాయకవి

క్రీ॥ శ॥ 1840 ప్రాంతము

ఇక్కవి తన నమశ్శివాయ శతకము తుదిపద్యమున :

“విమలకౌండిన్యసగోత్రుఁడ, వేంకటాఖ్యమంత్రి గారి తనయుఁడను జామర్తి శేష
గిరి పేరిటి కవిని చిత్తగింపుమయ్య మఖిరిగజదనుజాయ నమశ్శివాయ ||”

అని చెప్పికొనుటచే, నితఁడు కౌండిన్యసగోత్రుఁడనియు, వేంకట మంత్రిపుత్రుఁడనియుఁ దెలియుచున్నది. “మంత్రి” శబ్దముచే నితఁడు నియోగిశాఖవాఁడుగఁ గన్పట్టెడు. ఈశతకము నేకాక, ‘రామకథాలహరి, కాళిందీపరిణయ’’ మను మఱి రెండుకృతులనుగూడ రచియించినాఁడు. అందు కాళిందీపరిణయమున, తద్రచనాకాలము నిట్లు వచించెను :—

“శరనిధి శైల ధరాధర శకసంఖ్య చెలంగఁగ, భావనామ వ
త్సర బుధవాసి పూర్ణిమకు సత్కృపతోన్, నవకృష్ణభానుజా
పరిణయ మింపుగా నొడివె, భానుజవైరికృపన్ బుధాంఘ్రిపం
కరుహయుగుండు శేషగిరి కింపవిదారికి నంకితంబుగన్ ||”

దీనింబట్టి, శా॥ శ॥ 1795 సం॥ము క్రీ॥ శ॥ 1873 సం॥కు సరిపోవుచున్నది. అనఁగా, ఇప్పటి కెనుబదిరెండేండ్ల నాఁడీకావ్యము రచింపఁబడినది. ఇతఁడు ‘చామర్తి’ — గ్రామవాస్తవ్యుఁడు. కాన, నదియే యితని యింటిపేరుగ వాడుకలోనికి వచ్చెను.

ఈ “నమశ్శివాయశతకము”న 108 తేటగీతములున్నవి. “మఖిరిగజదనుజాయ నమశ్శివాయ” — అని చతుర్థచరణమంతయు సాంస్కృతికమకుటముతో నొప్పారుచున్నది. తక్కిన మూఁడుపాదములలో దృష్టాంతపూర్వకమగు విషయవివరణము కానవచ్చెడు. ఇట్టి యీశతకమును రచించినకవినిగూర్చి, (వావిళ్లవారి నీతిశతక సంపుటమందలి) గ్రంథపీఠికలో శ్రీశేషాద్రిరమణకవులు తెలిపిన యంశములు గమనింపఁదగినవి.—*

* ఈకవి సంస్కృతాంధ్రభాషలయందే గాక, వేదాంతమునందుఁగూడఁ గృతపరిచయుఁడు. అంతియగాక ప్రబంధకవి. కవిత్వము సుబోధముగ సులభశైలిలో నుండును. ఈశతకము సామాన్యజనులుసైతము అర్థము గ్రహింపఁదగినంత సులభశైలిలో నున్నది. కవికిది ప్రథమప్రయత్నమేమో యని యనుమానింపఁ దగియున్నది.

వీరు తమపీఠికలో నొకచోటఁ గవి ప్రాపీణ్యమును బెక్కు తెఱఁగులఁ గొనియాడుచుఁ, దుదకిది కవికిఁ బ్రథమప్రయత్నము గానోపునని యనుమానించుచున్నారు. మఱియొకచోట, శతకరచనావిషయమునఁ గవి యవలంబించిన నియమముల నుగ్గడించుచు, నతఁడు దాని నిర్వహించిన విధమును బ్రశంసించుచున్నారు. ద్వైవిధ్యమగు నిట్టి యభిప్రాయముచే, వీరు స్వవచనవ్యాఘాతి దోషమునకుఁ బాల్పడిరి. *

"నమశ్శివాయశతకము"లోని ఐహిక పారలౌకిక విషయములను జక్కఁగఁ బరిశీలించి చూచుచోఁ గవికిఁ గల యసామాన్యప్రజ్ఞా ప్రాభవానుభూతులు స్పష్టముగ గోచరించును. పైఁగా విషయోద్ఘాటనమున కనువుగఁ బాఠకజన సౌలభ్యముగ నూఱుదాహరణములతోఁ బద్యప్రథమపాదత్రయముననే యుక్తాంశప్రకటన మొనర్చుచు శతకము నాఁగించుట గడిదేఱిన కవికిఁగాని సాధ్యపడదు. కావున, నీనమశ్శివాయ శతకము కవీంద్రుని యపరవయస్సున రచింపఁబడినది. శేషాద్రిరమణ కవులన్నట్లిది ప్రథమప్రయత్నమని చెప్ప వలనుపడదు.

ఇతని తక్కిన గ్రంథములలోఁ గాళిందీపరిణయము క్రీ॥ శ॥ 1876 సం॥న వ్రాయఁబడినట్లు కవియే తెలిపినందున అప్పటి కితనికి ఏముప్పదేండ్లప్రాయమయిన నుండును. అగుచో నితఁడు 1840 ప్రాంతమున జనించి, యీశతాబ్ది ప్రారంభమున కించుక ముందు వెనుకగాఁ గాలగతి నొందియుండును. ఆపక్షమున నితని మొదటికృతి 'కాళిందీపరిణయము'ను, తరువాత 1880 సం॥రము ప్రాంతమున 'రామకథాలహరియుఁ' చనని ర్యాణమునకు నాల్గయిదేండ్లపూర్వ మీశతకమును రచించియుండును. సాధారణముగఁ గవులప్రాగల్భ్యము రచనాసౌష్ఠవము వారి ప్రథమకృతులలోనే కనఁబడుట భాషాభిజ్ఞులకెల్లఁ దెలిసినవిషయమే. ఇతని "కాళిందీపరిణయము" ఒకించుక ప్రౌఢిమ గలదియగుట నదియే తొలిరచనమనుటలో సందియము లేదు.

---

* ఒకపాదము పూర్తిగ మకుటమునకు విడుచుటచేతను, మిగిలిన మూఁడుపాదములలో నీతియు నుపమానము నిముడ్చవలసివచ్చుటవలనను పద్యములు భాగాశుద్ధికిఁ గొఱంతపడి విషయముచే నిబిడములుగా నున్నవి. ఇందలినీతులు శిశుబాలవృద్ధులకుఁ బఠనయోగ్యములుగా నున్నవి. ఉదాహరణములు సమంజసములుగా సుబోధములుగా నున్నవి.

"వచనమిచ్చి తొలంగిన వానిఘనము హీనమునఁదగు, బోగముదాన సగటు
నొకని నమ్మని చేయి వేఱొకనిఁ గూడు ||మ||"

"మంత్రి కుటిలత్వమూనిన, మానవేశ్వరునకు హానితొలంగదు గూఢగాను
శల్యసారథ్య మర్జునుఁ జంపలేదె ||మ||"

"లంచగొండికి రాజ్యపాలనమొసంగ నేలికకుఁ బైకమిచ్చునే నీ[illegible]
కడఁగి తోడేలు మేఁకల గాచినటుల ||మ||"

"అప్రయోజకునకు నుత్తమాధికార మబ్బెనేనియు, మిగులఁ బ్రఖ్యాతి గనఁడు
ధర నపుంసకునకు రంభ దొరకనేమి ? ||మ||"

"సరసుని రసజ్ఞతావృత్తి సరసుఁ డెఱుఁగుఁ గాని, మొఱకుఁ డెఱుంగఁడు గణనసేయ
గొడ్డురాలికిఁ దెలియునె బిడ్డనొప్పి ||మ||"

"అవని నుద్యోగ సమయ సౌఖ్యంబు నిర్గమావసర దుఃఖమెవ్వారికైన విడువ
దెట్టులన శ్వాన సురత మహీనసాక్షి ||మ||"

"వావి వరుసఁ దలంపక వారివారి తొయ్యలులఁ గూడు మదమున దుర్విటుండు
పొగరు బట్టిన బలుదున్నపోఁతు గాఁడె ? ||మ||"



# ముడుంబై వేంకటరామ నృసింహాచార్యస్వామి

క్రీ॥ శ॥ 1841—1927.

ఇతని కృతియైన రంగేశశతకము, వావిళ్ల వారి భక్తిరసశతకసంపుటము రెండవదానిలో పూర్తిగాఁ జేర్పఁబడియున్నది. ఇందులో 101 సీసపద్యములు గలవు. మొదటి 65 పద్యములు ప్రథమభాగముగను, దక్కినవి రెండవభాగముగను గవిగారే విభజించె. ఇవి తనచే రచింపఁబడినట్లు తద్భాగాంత కందపద్యములలోఁ జెప్పుకొనినాఁడు. పద్యములలోఁ గృష్ణలీలలు విపులముగా వర్ణింపఁబడినవి. "సీతభవత్కృష్ణ రంగేశ వేష కృష్ణ" యనునది మకుటము.

ఈశతకములోఁ దన వంశమునుగూర్చి కవి యీక్రిందివిధముగా వివరించినాఁడు :—

"ఎల్లవిద్యలు నల్పకడిన నితోఁ గేనాప మే సూక్ష్మతోఁ బుద్ధి కిష్టతనము
నొసఁగియు కైంకర్యసముఁడు శ్రీ కృష్ణార్యుఁ డే మహాత్మునకుఁ బితామహుండు
నిరుపమాన జ్ఞాననిధి రాఘవార్యుఁ డే సత్యగుణ వార్ధి కెలమిఁ దండ్రి
ప్రసింహా నారేంద్రుఁ డీరరాఘవగురుం డే పుణ్యాత్మునికి గారాబుపట్టి
కేశవాగ్రమునికటా మేనృతికి నిలయ మట్టి శ్రీవత్స నారసింహార్యవర్యుఁ
గనుఁ డిహ వినవమ్ము విను తింపఁ గంటినయ్య ॥"

"శ్రీరంగాంబికా శ్రీరాఘవత్సయమున నన్గడుపారఁ గని పెంచు నాదయుఁడెవఁడో,
వాత్స్య నృసింహార్య వైఖరి ననుఁ గృతసంస్కారుఁగాఁ జేయు సదయుఁడెవఁడో,
ష్యభాష్యాజ రామానుజార్యాఖ్య భాష్యార్థ మిడు దీనబంధుఁడెవఁడో,
ఘనకూర్మనాథార్య భావంబునను దైవ్యకృతి శక్తి యొసఁగు సుప్రతిభుఁడెవఁడో,
వాని శ్రీరంగ వేంకట వారిజాద్రి యాదవాచలములఁ బొడ మూనియున్న
విన్నగా నది నీలగిరి నిజాత్మ ॥ సీత ॥

"శ్రీ సూక్ష్మమున బొదిచి గ్రహయోగమయిన వంశధారాతీర వసుధ నను
నన్యూత్తిపుర మంగళాలంబమైన శ్రీవత్స ముడుంబ సద్వంశమునను
ననుఁ గృపఁ బొడమించి నరసింహపాదాఖ్యఁ గావించి నిజవిద్యఁ గఱపి పెంచి,
దివ్యదేశము లెల్లఁ ద్రిప్పి దర్శనమిచ్చి, తెట్టె రోగములున్న పెంచుకొనవు,
మఱియు నను నిరతాత్మకింకరునిఁ జేయఁ దలఁచి కాఁబోలు నీనాఁటిదాఁక నచట
నీవు కేశవరూపివై నిలిచినావు ॥ సీత ॥

దీనినిబట్టి శ్రీకృష్ణమాచార్యులపుత్రుఁడు రాఘవాచార్యుఁడు; అతనికుమారుఁడు నరసింహాచార్యుఁడు; అతనితనయుఁడు వీరరాఘవా

చార్యుఁడు ; వీరరాఘవాచార్యులకొడుకే యీశతకకవి. ఈతని పూ[illegible] పేరు.

“శ్రీమన్ముడుంబ వేంకటరామ నృసింహార్య రచిత రంగేశకృతికి”—

“ముడుంబ నృసింహాచార్యకవి” యను శీర్షికతో “నాంధ్రరచయితల”లో నితనిచరిత్రము పూర్తిగా నున్నది. ఇతని నివాసస్థానము శ్రీకూర్మము దగ్గఱ వంశధారా నదీతీరమునందలి యచ్యుతపురి “కేశవాశ్రమనికట మేకృతికి నిలయ” మని యీకవి చెప్పినదాని ననుసరించి, “కేశవాశ్రమ” మని, తన వార్ధకదశలో నితఁడాశ్రమవాసము చేయుచుఁ బ్రశాంతముగా జీవితము గడపినట్లు తోఁచుచున్నది. విజయనగరములోని నల్లచెఱువుమెట్టపై వేదవ్యాసులను కేశవస్వామిని బ్రతిష్ఠించి, యాలయము నెలకొల్పినట్లు “ఆంధ్రరచయితలవలనఁ దెలియుచున్నది. ఇతఁడు ప్లవంగ సం॥ర భాద్రపద బహుళ నవమి (1841 సం॥ సెప్టంబరు నెల 22 వ తారీఖున) జన్మించినాఁడు. ప్రభవ సం॥రం భాద్రపద బహుళ ద్వాదశి (1927 సం॥ సెప్టంబరు 22 వ తేది) మరణించినాఁడు.

ఇతఁడీశతకము నేకాక, పెక్కు గ్రంథములను సంస్కృతాంధ్రములందు రచించినట్లు తెలియుచున్నది.

ఇతని రంగేశశతకము మంచిధారాశుద్ధిఁ గలది. మృదుమధురములయిన శబ్దములతో సమాసముల నుభయభాషలయందును సద్భుతముగాఁ గూర్చుటయం దితఁడు ఖండుఁడు. పదలాలిత్య మితనిసొమ్మనవచ్చును. కవితాకుమారి లాస్యముల కితనిశతకము రంగసీమ. (నాటి చెప్పవలసియుండిన) కూచిమంచి, పోలిపెద్ది కవులిరువురితనికి కుడియెడమ స్థానములకుఁ దగినవారనవలసియుండును. అత్యధికాక్షేపణలు లేకున్నను దిదముక వికూడ నితనితో నించుమించు తులఁదూఁగవచ్చును.

ఇతని శతకపద్యములు జాతీయపదములకు పుట్ట. తెలుఁగునానుడులకుఁ గడలి. ధ్వన్యనుకరణములకుఁ గోశము.

సంస్కృత శబ్ద జాటిల్య సమాస సముపేతమయిన యీక్రింది పద్యమును జూడుఁడు :—

“నిబిడ నిష్ఠుర బాణ నిర్ఘాతపాతి పతత్పత్రిపావనీభృత్పత్రిక,
శశ్వత్స్రవద్రక్త ఝురకర్దమిత సమీకాంగణాభోగ విశదచలచక్ర
రథ సమాకృష్టి వైపథిక సారథి కళాహిత కృచ్ఛ్రి విక్రమదార్త వివిధ

కింకాశ నిష్క్రమక్రమ నిష్కళీకృత సకలలోక పురస్సారోత్కరాశ
శర విఖండిత సాదినిషాదిపతిన ఘావమానాశ్వగజములెల్లఁ దావకాను
జన్మ గోత్రుల కనిలోన శత్రుసేన    ॥ వీత ॥

అచ్చ తెలుఁగు పదములతో నీపద్య మెంత కమ్మగా నున్నదో గుర్తించుఁడు :—

వలదు ప్రాయకపు రేలు, వగలు సేయకుమ వాలు, దుడుకు, నా కన్నీరు మడువగాను;
వెలిపు పెల్లపు, కల్ల మరులు గొల్పకు, మెల్ల నక్కునఁ జేర్చ నన్నదు మరాను;
వలదు కోపము పెంపు, వగకు లోపము వచ్చు, చెక్కులు ముద్దాడి చెనకి గాను;
ననదు మొప్పెవనమ్ము, సతముఁ జెప్పెదనమ్ము, నొచ్చె నాకెమ్మోవి నొక్కరాను;
గునను పిటిగెను సిమ్మోఁది మయిల తత్తిగె పోగ నుటుమాయలాఁడ, యపాపలఁతిఁ గూడ
నటుననన్నట్లు విభులోక నడుమఁ గాక    ॥ వీత ॥

సందర్భానుసారముగా నితఁడు ప్రయోగించు జాతీయ పదముల వైచిత్ర్య మెంతయేని ముచ్చటగా నుండుటయే కాక, యా యా స్థానములలో ననుకొనకుండ వచ్చి కుదురుకొనిన విధా కనిపించుట ప్రత్యేక విశేషత :—

(1) 'గన్నసేయుచుచు' నిదిగట్టి 'రచ్చబెట్టి', (2) కోయిలమూఁకల 'కొండనూఁకెలు', (3) కదలనీనన్నులు 'కాళ్లఁ బెనఁగ', (4) 'తలయెత్త నీదాయె' మలినాళిదిగ్గోళి, (5) తోయజాక్షికి 'దిగదుడిచిపాఱవైన'. (6) 'సముసమే యుగమాయె'—నెమ్మనము సగమాయె, (7) బంగరు 'దుప్పటి నెఱవాలుపోక', (8) అకట, 'కలయని తోఁచుఁ గాదనియుఁ దోఁచు', (9) 'కూసెను' 'కనులెఱ్ఱ జేసెదు', (10) 'గానుగాడించిన' గాసి సేసెమరి, యింతోంటిగుణంబు నీ తుంట విల్లు. (11) ముందు నడచు నసంతుఁ 'జేయవిడిఁగలసె', (12) గోఁటికందోయికిఁ గాటుకే 'మోటమొ'. (13) నెఱగంది సాల్వొందు 'కొరడువారె', (14) వైద్యుండు రథముపైఁ 'జదికిలఁబడి', (15) 'తలగోఁకుగుడు' పడ నేల రుక్మి, (16) చాలు పోరకతి వికి 'పగల్ సాగనీను', (17) తార్క్యాణమేల? కాదంటె 'సటుడి', (18) ఏలాగు 'కాళ్లాడి' యేఁగవచ్చు.

ఇట్టి జాతీయములు నానుడులు లేని పద్యమే యితని శతకములోఁ గనఁబడదనుట యతిశయోక్తి కాదు. కనుక అట్టివి కొన్ని సాధ్యమయినంతవఱకు నుటంకించుటవలనఁ బాఠకులకేగాక, భాషకుఁగూడ నత్యంత ముపకరించినట్లగును.

సడీయుమువు, కుసుంబాహారంగు, గులాబీ, జన్నములు, అత్తిరు పూత, నీరునిల్వు (నిల్వునీరు ?), ఉలుకించు, తేట తెల్లము, గడిదేఱు, అపరంజి, వెగముడి, పూవుటూఁచ, మీఁదు మిక్కిలి, ఏసివాడు, ఎడయదలు, అలజడి, దిరీసు (Dress), డబ్బాడవాల్, చిచ్చరకీళ్లు, బలుగుడకలు, తుపాకులు, జోడుగుండ్లు, నిద్దాహారంగు, నీలంపు దిమ్మెలు, మిటారము, పూటీరాలు, చెమ్మటడాగు, వెగరుటావిరి, అలరుటేసిక. బిరాలున, చండాలినారి (చండ + అలి, నారి), నిలువెల్ల. నసరు తేఁకౌతు ముట్టసులు, రేకాయువలినిగ్గు, వీరపాణపుముస్తు, గంబురాపౌడి, తెమ్మెదేను. అరసందియము, కడవెడలు, తేరుటుండలు, రాముట్టెలు, గీరునామము, సరిఫేషుమిసిమి, కొరడువారు, చదికిలఁబడు, సన్నెద్రాక్కించు, రంతు, పూనీరు, మడుపులు, నునుపుగ్గు, నెఱజాణ, దిగనాడు, చలపట్టు, మొప్పెదనము, నవ్వులాట, నగుబాటు, దొండజరాలు, చిందుద్రొక్కు, ఎట్టికప్పు, పట్టుజాలరు, అడియాస.

ధ్వన్యనుకరణము లిందులో కోగొల్లలు :—

(1) తేఁటిమై 'చకచక' ల్దాఁటు చక్కని కురుల్, (2) తప్తమై 'తుకతుక' ధ్వనుల నుడుక, (3) 'దుందు' మ్మని కమ్మపూదుమ్ము చిమ్మ, (4) అంచు 'వలవల' కన్నీరు నించుఁ జెలియ, (5) జిగి పగఱకన్నుల 'జిగ్గు' రనఁగ, (6) 'గొలగొ' లేమని భీష్మకుండు పలుక, (7) 'పక్కు పక్కు'న తలల్పగుల, (8) అస్థివితతులు 'ఫళఫళ' విఱుగ (9) 'బొళబొ'ళ్లని గ్రక్కున నెత్తురుల్ గ్రక్క, (10) మెదడు టసలు 'తెఫ్తె'ప్పని అవనిపైఁ బడ, (11) 'తుప్పు తుప్పు'న పైతల తునుఁకలెగయ. (12) 'వలవల' నెత్తురు వఱదలు వాఱ, (13) శవంబులు 'దిభదిభ' వసుధఁగూల.

ఈశతకములోని ప్రథమభాగములో రుక్మిణీకల్యాణకథ పొంకముగాఁ గావ్యధోరణిలో కవి సాగించినాఁడు. కనుక ప్రబంధముల పోకడలు ప్రతిపద్యమునను గనఁబడుచున్నవి. రుక్మిణీదేవి విరహము, శిశిరోపచారములు, మన్మథ, మధుకర మలయమారుత చంద్ర శుక పికాదుల యుపాలంభనములు, కడుసొంపుగా రచింపఁబడినవి ధ్వనిప్రధానములయిన యట్టిపద్యములలో నొకటి రెండు మచ్చునకు చూపుట యవసరము కాకపోదు.

శ్రీకృష్ణలగ్న (గత) చిత్తమై యన్ని విషయముల మఱచిన రుక్మిణీయవస్థ :—

"పుంభావాలు పిలిచినఁ బలుకమి పెంభోక్తి యగుటచే నేమొకో యతివలారా,
నెమ్మోము చూపమి నీరజ మ్మనుపాదయగుటచే నేమొకో యతివలారా,
చాంచమి పంచముఖలెటలెఁ బల్లవపాణియగుటచే నేమొకో యతివలారా.
నగఁబల్కు మాతోడ నగదు కోకస్తనియగుటచే నేమొకో యతివలారా,
మునెపు నళినముఖ్య తుకపికవనజన్మైర చంద్రికావ్యంజకింబయి చెలియ కకట
కతన తొ మనస్వ్య నిమఁగూర్చి కాఁకఁ జేచ్చె ॥ సీత ॥
"మొగమె మొత్తనీదాయె వెన్నెలతమ్ము లసిందు, పలుకనీదాయె గాచిలుకదండు,
గిత్తె మొత్తనీదాయె గిండుఁగోయిల ధాక, పాలయనీదాయె వేగోఁకుమూఁక,
నేను మొత్తనీదాయె చిగురుంగాను పిదాను, కాంచనీదాయె వే కల్పబారు,
తలయెత్తనీదాయె నులినాళిను ధోళి, కదలనీదాయె దుమ్మదము గాళి,
కలికి గిరికపై గిరజపై కాకగాని నిండవలేక యనోకహ నిబిడకేళి
గిహాసిసుము బహాని కన్నెల దాల ॥"

రుక్మిణీదేవి సందేహావస్థ, పోతనగారిని నీతఁడు పుడికిపుచ్చు కొనినాఁడు :—

"ఘనుఁడైన భూసురుఁడు పదటికేఁగెనో, లేక యన్నకు జడిచి తా నాఁగనేమొ,
వలినమా ప్రాణేశు సముఖమున్యోనో, లేక యనుగ నసంద్భ్రమయ్యె నేమొ,
వతిలెక్క నిలుస్తని విమనవనో, లేక దయమాలి వేఱుగాఁ దలఁచు నేమొ,
సుఘనమైర నాగోర్క మన్నించునో, లేక, వలదని వార్తలఁ బంపునేమొ"

కృష్ణశతకములోని :—

"నీవే తల్లివి తండ్రివి నీవే నాతోడు నీడ నీవే గురుఁడా"

యనుపద్యమున కీకవి యనుకరణము :—

"నీవె నాతండ్రివి; నీవె నాతల్లివి, నీవె నాతోడవు నీవె నీడ
నీవె నాగురుఁడవు నీవె నాసఖుఁడవు నీవె నాసంపద నీవె ధనము"

ఇట్టివి క్వాచిత్కముగాఁ గనఁబడుచున్నవి.

ఈయుద్దండకవిగాఁడ లక్షణవిరుద్ధములైన కొన్ని ప్రయోగములను ప్రయోగింపలేకుండ నుండలేక పోయినాఁడు.

తెలుసు, చేతు, నవలామూక, భ్రమిక, కనఁగనేలా, వలన నేలా, గౌరిలు (గౌరి + ఇలు) పోతివి, కృపే.

అక్కడక్కడ కనఁబడు నిటువంటివి "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అను న్యాయము ననుసరించి, యంతగా లక్ష్యము చేయఁదగినవి కావు.

———:o:———

# విక్రాల రంగాచార్యులు

క్రీ॥ శ॥ 1845 ప్రాంతము

ఇతఁడు రచించిన "శార్దూలశతకము" తిట్టుకవిత్వము. ఇట్టివి తెలుఁగులో చాల తక్కువ. కాని సంస్కృతములోఁ గొన్ని కనఁబడు చున్నవి. అందులో ముఖ్యమయినది కుట్టికవి యను నామాంతరముగల వాంఛేశ్వరకవి రచించిన "మహిషశతకము." క్రీ॥ శ॥ 1739 నుండి 1763 వఱకు తంజావూరు రాజ్యమును బాలించిన ప్రతాపసింహు నాస్థాన మంత్రులలో వాంఛేశ్వరుఁడొకఁడు. తన ప్రభువు మంత్రుల సలహాల నలక్ష్యము చేసి దుష్టసహవాసమువలన రాజ్యవినాశనమునకుఁ గారకుఁ డగుచుండుటవలన నతని కనేకవిధముల బోధించి, విసుగెత్తి, తుదకు 'మహిషశతకము' శ్లేషగా చెప్పి యతనిని దారికి తెచ్చినాఁడు. సక్రమ పరిపాలనాకాంక్షతో రాజుమీఁది యభిమానముచేత నతని మనస్సు మార్పు నుద్దేశముతో జనించినది మహిషశతకము.

ఇఁక నీ 'శార్దూలశతక' మో, స్వార్థపరుఁడైన విక్రాల రంగా చార్యులు (ఏండ్లతరబడి శిస్తులు చెల్లింపని తన తప్పు బైటపెట్టకుండ, నన్నాళ్లు ప్రభుదత్త మాన్యమువలన బ్రతుకుచు వచ్చితిమిక దా యను కృతజ్ఞతయైన లేకుండ, నగ్రవర్ణమువారి కుండవలసిన కనికరము శాంతము అనునవి కించిత్తైనను దలఁపకుండ రాజధర్మప్రకారము (శిస్తు బకాయిలు ముదరఁగా) తనమాన్యమును సంస్థానములోఁ గలుపుకొనిన పోషకప్రభు ప్రాణహరణసంకల్పముతో ఈశాపశతకము చెప్పుట, పరమశ్రోత్రియుఁడైన తనకు మహాపాతకాపాదకమని తలంపకపోవుట విచిత్రము. తామసమున నితఁడు దుర్వాస మహర్షి కగ్రజుఁడేమో!*

---

* ఈ విక్రాల వంశమువాఁడే "రామచంద్రాచార్యులు" అను మహా విద్వాంసుఁడు. అతఁడీశతకకవికి మనుమఁడు. మూఁడు శాస్త్రములలో నుద్దండపాండిత్యము కలవాఁడు అతని విద్వత్ప్రతిభలు, రాయలసీమలోను గుంటూరు, నెల్లూరు జిల్లాలలోను నఖండముగా వెలసినవి. శాస్త్రవిషయములలోను, సాహిత్యవిషయముల లోను, నేసభలోనైన నాతఁ డుపన్యసించుననిన గొప్ప గొప్ప విద్వాంసులు హడలగు వారు. ఎంతటి కొమ్ములు దిరిగిన కోవిదుఁడైన నాతనిమాటలలో గ్రహింపఁగల విషయములు క్రొత్తవి కనఁబడునవి. అయిన నాతని జీవిత మడవిమల్లె యయినది. అతని నిస్పృహత్వమే యందులకుఁ గారణము. ఇంతకు, నావ్యక్తిని జూచిన "నంతవిద్యాసంపన్నుఁడగు రామచంద్రాచార్యుఁడితఁడేనా?" యనిపించునట్లుండువాఁడు. అంగుష్ఠప్రమాణము గల

ఈశతకరచనాకాలమును గవి యీవిధముగాఁ జెప్పుకొనినాఁడు.

"ఈకల్యాది గతాబ్దముల్ కరుధనవాలెన్నన్ వికృత్యాఖ్యలో
లోకారాధ్య బుధేంద్ర భూషణశీలున్ రాజగోపాలునిన్
శ్రీకంఠాంబుజగర్భకేశవసునాశీరాజ్ఞ శార్దూలమై
యాకాలుండు వధించు రంగకవి వాక్యం బుర్వి సత్యంబుగాన్"

"కరుధవా" 4991 (వికృతి) — ఇప్పటికి కలియుగ శతాబ్దములు 5054—అనఁగా నలువది మూఁడేండ్లయినవి. (మొన్నటి వికృతికి, కరుధవా—వికృతి, యరువదియేండ్ల క్రిందటిది. పైన మూఁడేండ్లు గడచినవి. — జరుగుచున్నది జయసంవత్సరము) దీనిని బట్టి యీకవి శతకరచనాకాలమునకు నలువదియేండ్లవాఁడయి యుండును. పైఁగా నితఁడు పెద్దకుటుంబిగాఁ గొన్నిపద్యములవలన తెలియుచున్నది.

"దారపుత్రులు, తల్లి, నేను మఱి మత్సంబంధు లన్నానకున్
ధారాళంబుగ లేక మాపడెదు సంతాపంబుఁ గంటే కదా!"

ఇతనికి తల్లియు నున్నట్లు చెప్పినాఁడు. కనుక ఆమె యఱువది కించుమించు వయస్సు కలిగియుండిన నితనికి నలువది యేండ్లుండుటలో విపరీతమేమియు లేదు. ఇతనికి భార్యాపుత్రు లుండి యితనితోఁ బాటు కష్టపడిరి. ఈలెక్క ప్రకారము చూచిన దాదాపు 20 ఏండ్లక్రిందట మరణించిన ఇతని వంశస్థుఁడేఅయిన విక్రాల రామచంద్రాచార్యులకు '55' ఏండ్లుండవచ్చును. అనఁగా శతకకర్త రంగాచార్యులవారికిని అప్పటి వేంకటగిరి ప్రభువులయిన శ్రీరాజగోపాలయాచేంద్రులకును వయసు

గతించి యిప్పటికి దాదాపు ఇరువదియేండ్లయినది. కాని వారియుపన్యాసములవలన నేర్చుకొనిన విషయములు మాత్రము నామనస్సులో గాఢముగా నాటుకొని నేఁటికిని చెక్కుచెదరకయున్నవి. ఈమహాశయునిగూర్చి కోస్తాజిల్లాలలోఁ బెక్కురకుఁ దెలిసియుండదని యింతదూరము వ్రాయవలసివచ్చినది. అంతటి విద్యావైదుష్య భూషణుని రచనలు (బ్రాహ్మణపత్రిక వగైరాలలోని వ్యాసములుతప్ప) లేకపోవుట మన దురదృష్టము. తత్సంబంధులయొద్ద నట్టివేమైన నుండిన వెలికి తెచ్చి యతనికీర్తికాయమును నిలువఁ బెట్టుట యెంతయు లోకోపకారమగును.

ఈ శ్రీరామచంద్రాచార్యులీశతకకవియయిన రంగాచార్యులకో లేక యతని యన్నదమ్ములకో పుత్రుఁడై యుండును. అయిన శాంతమూర్తియైనరామచంద్రాచార్యులకు, ఈరంగాచార్యులు తండ్రియో, పితృవ్యుఁడో యయి యుండిన వీరికుండిన స్వభావవ్యతిరేక మజగజాంతరమని చెప్పవలసియుండును. తండ్రివరుసవాఁ డెంతకోప్రోద్దీప్తుఁడో, కొడుకంత శమాగుణసంపన్నుఁడు. ఇది హిరణ్యకశిప ప్రహ్లాదుల స్వభావ తారతమ్యమును బోలియున్నది.

బోఁ గానన్, సుగలాఁగ మీకెట్టుల హాస్యంబుల్ సమర్పింపఁగా
సాఁగుం గావున, నీని శీఘ్రముననే శార్దూలమై చంపుఁడీ॥"

తన కపకారము చేసిన ప్రభువు నవినయములను నకృత్యములను నితఁడు బాహాటముగా వివరించినాఁడు :—

1. "రాజ్యంబిచ్చిన తండ్రి కన్నమునకే ద్రవ్యంబు నీకొప్పునే
వ్యాజ్యంబాడెదు నట్టిలుబ్ధుఁ డిక మాయట్టింద్ర విజ్ఞప్తిభూ
త్యాజ్యప్రాహ్ణ్యతిఁ జేసెనన్న నిది చోద్యంబౌనె ?"

దీనినిబట్టి యితఁడు సర్వజ్ఞకుమారయాచమనీఁడు (గోపీనాథము వేంకటకవిగారి పోషకుఁడు) బ్రతికియుండగనే యతనివలన రాజ్యమును బొందినాఁడనియుఁ, దండ్రికిని, దనకును వైషమ్యముండెననియుఁ దెలియుచున్నది.

2. "తోడంబుట్టిన తమ్ములందు కపటద్రోహంబులం బూని, తా
నాడుం బంచి యొసంగనట్టి ఖలుఁ డీనాభూమి గొంపోవుటన్
జూడంగా నిది వింతయౌనె ?"

అనుటవలన జమీందారీలలోఁ బెద్దవానికి రాజ్యార్హతయును, నతనితమ్ములకు భరణములకుమాత్రమే హక్కును, తర్వాత చట్టరీతిగా బ్రిటిషుప్రభుత్వము తీర్మానించుట యీశతకకాలమున కేర్పడలేదని తెలియుచున్నది. పైఁగా నప్పటిచట్టసభలో నీ రాజగోపాలయాచేంద్రులుకూడ బ్రిటిషుప్రభుత్వముచేత సభ్యుఁడుగా నియమితుఁడయి వారి కండగా నుండి వారి యనుగ్రహము సంపాదించుకొనినాఁడు. దానిఫలితముగనే వారికి "మహారాజా" బిరుదము వచ్చుటయు. ఈప్రభువు చాలమేధావి, జాగ్రత్తపరుఁడును. అందుచేత సంస్థానమునకు బకాయిపడిన యినాముల నన్నిటిని స్వాధీనపఱచుకొనినాఁడు. (అప్పుడే యీ దగ్గోలు పునస్స్వీకరణ జరిగి యీశతకకర్తకు క్రోధమును గలిగించినది. చుట్టుపట్ల నుండు, కాళహస్తి, కార్వేటినగరము మొదలయిన జమీనులు, పరిపాలకుల యసమర్థతవలన, నలవికాని భోగములవలన, నవినీతి మార్గములవలన, నమితవ్యయములవలన నప్పులవారి స్వాధీనము (కొలఁది, కొలఁదిగా) అగుచుండుట యీప్రభువు గమనించినాఁడు. దీనని ప్రభుత్వదృష్టికిఁ దానును మఱికొందఱు కోస్తాజిల్లాల జమీందారులు కలిసి తెచ్చుటవలన వానిని బ్రిటిషుప్రభుత్వముచేత నియమింపఁబడిన "కోర్టు ఆఫ్ వార్డ్సు" వారు తమ అజమాయిషి క్రిందికిఁ దెచ్చుకొని,

క్రమముగా సంస్థానాలు కొన్ని యేండ్లలో దీర్చి, సంస్థానములను, ప్రభువుల కిష్టానుసారము నిచ్చిరి. కాని కొన్ని జమీనులలోని యప్పు లొక పట్టున తీరుమార్గము లేక పోవుటచేత, అవి యమ్మగంటిపోవు స్థితికి వచ్చినవి. ఆ పరిస్థితులను పరిశీలించి, తన యనంతరము వచ్చువారుకూడ సంస్థానము నాగతికి తేసికొని వత్తురేమో యను భయముచేత "ఇకమీఁదట సంస్థానములమీఁద, వాని ప్రభువుల కెవరైన నప్పు లిచ్చిన, వానివలన సంస్థానముల కెట్టి చలనము లేద"ని యొక శాసనము చేయుటలోఁగూడ ముఖ్యపాత్ర వహించినాఁడీ రాజగోపాలయాచేంద్రుఁడు. ఇంతే కాదు.

1. సంస్థాన మవిభాజ్యపు కుటుంబపుటాస్తి.
2. జ్యేష్ఠునకే దానిని పాలించు హక్కు.
3. సంస్థానము బాగోగుల కతఁడే యుత్తరవాది.
4. అతని సహోదరులు వేఱువేఱుగ నున్నను, కూడియున్నను, వారు నియమిత భరణములకు మాత్రమే హక్కుదారులు.
5. ప్రభువునకుఁ దరువాత నతనిచేత ప్రభుత్వము ననుమతితో నియమింపఁబడిన దివాను అధికారి; తక్కిన ప్రభుకుటుంబీకులకు నతని పరిపాలన విషయములో నేజోక్యము లేదు. పాలకునికిమాత్రమే జవాబుదారీ వహించినవాఁడు.

ఇందువలన "తోడంబుట్టిన తమ్ములందుఁ గపటద్రోహంబులం బూని, తోడ నాశనం బొంచి యొసంగనట్టి ఖలుఁడు." అని యాశతకకవి చెప్పిన విషయము జమీందారీ లవిభాజ్యములను చట్టము పుట్టుటకు ముందు విషయము. అప్పటిదనుకూడ మన తెలుఁగుదేశములోని జమీందారీలు (అవిభాజ్య కుటుంబములవలెనే) పెద్దవాని యధికారమునకు లోఁబడియుండుట, తక్కిన చిన్నవారందఱు భయభక్తులతో నతని చెప్పుచేఁతలలో మెలఁగుటయు జరుగునవి. కుటుంబకల్లోలములవలెనే) అలజడులు అప్పుడప్పుడు చెలరేఁగునవి. వానికి కారణము (నాఁటికి నేఁటికి కొందఱు కలహప్రియులు తయారగుట. ఆకల్లోలములు సహింపరానివయినప్పుడు పంపకములు జరుగునవి. అట్లు పంపకములయిన జమీందారీలుకూడఁ జరిత్రజ్ఞులకు విదితములే. కనుక "తోడంబుట్టిన" తమ్ములు విచ్చలవిడిగా దుర్వ్యయములు చేయవలయునని తమకు జ్యేష్ఠుఁడయిన

ప్రభువుమీఁద నొత్తిడి తెచ్చినప్పుడు సంస్థానక్షేమమును దృష్టిలో బెట్టుకొనిన ప్రభువు ధనవ్యయము విషయములలో కొంచెము మొండి తనము చూపవలసివచ్చును. అదియే విద్వేషమునకు దారితీయును. తమ్ములవలన శ్రీరాజగోపాలయాచేంద్రులకు నిట్టి చిక్కు సంభవించి యుండవచ్చును. తమ్ముల యిష్టప్రకారము నడుచుకొని రాజ్యానికి హాని కలిగించు నేమో యని తనతండ్రిహయాముననే యతనిని సమ్మ తింపఁజేసి రాజ్యము చేపట్టియుండును. దానినే యీశతకకవి "రాజ్య బిచ్చినతండ్రి కన్నమునకే ద్రవ్యంబు నీనొప్పక" అని సూచించి నాఁడు. అయిన నిది ప్రభువుమీఁదఁ దనకున్న ద్వేషముచేత నతిశ యోక్తిగఁ జెప్పియుండును. ప్రభుసోదరులవిషయముకూడ నంతే. కాకున్న వారిదోషములనుగూర్చి యొకముక్కకూడ చెప్పక వారికి రాజ్యము పంచి యీయలేదని ప్రభువుపై నిందమోపుట యెందులకు? ఇంతకును శ్రీరాజగోపాలయాచేంద్రులు నిష్పక్షపాతముగా మెలఁగిన ధర్మప్రభువు; కనుకనే "బకాయి" పడిన రంగాచార్యులవారి వంటి వారి మాన్యములు సాఁగనీయలేదు. రాజ్యము భాగించి యిమ్మన్న తమ్ముల యాటలు సాఁగనీయలేదు. పైఁగా—"సంస్థానము లవిభాజ్య ములు"గా బ్రిటిషు ప్రభుత్వముచేత చట్టము చేయించినాఁడు. లేకున్న మనకు స్వతంత్రమువచ్చునాఁటికి ముందుగనే యెన్నిసంస్థానములు, కాళ హస్తి, కార్వేటినగరములవలె నామమాత్రావశిష్టము లయి యుండునో?

"పరువంబు కలిమి దొరతన మరియమి యనునట్టి వీని యందొకఁడొకఁడే
కోరయించు ననర్థము నాఁబరఁగినచో నాల్గుఁ జెప్పవలయునె? చెప్పుఁడా॥"

యను సూరివర్యుని వాక్యమక్షరలక్షలు విలువగలవికదా!—

ఇఁక యాచేంద్రుని మూఁడవ యపరాధము:—

3. "కోవల్లిళ్లను ద్రావిడోత్సవమున నాలోచించి తమ్ముండొకం
డొనర్పించిన చల్లపందిరిని నా నాక్షేపముంజేసి, వే పీఁకించెంగద"—

ఇందలి యైతిహ్యమేమో స్పష్టముగా కవి చెప్పలేదు. కాని యిది యెంతటి నీచుఁడును చేయ సాహసింపనికార్యము. ఉదారుఁడైన ప్రభు విట్టిదౌష్ట్యము చేసినాఁడనుట విశ్వసింపరానిది. ఒకవేళ ప్రభు ని యుక్తులగు హుజూరు ఉద్యోగులెవరైన నిట్టివి చేసియుండవచ్చును.

జమీందారీలలోని యుద్యోగులలో చాలమందికి విద్య వెదకదగిన వస్తువు. కచేరీల పంచ కనిపెట్టుకొని యక్కడి వ్యవహారములు గ్రహించుచు నచ్చువాఁడెవఁడైన నక్కడ తహసీలుదారు పదవికిఁగూడ నర్హుఁడే! జబర్దస్తీ, దౌష్ట్యము, దౌర్జన్యము, లంచములులాగుట—తన్ను సమర్థించువారి నాశ్రితులుగాఁ జేసికొని, వారి సహాయముతో నెంతటి యవినీతికైనను నొడిగట్టు సాహసమునకుఁ బూనుట — ఇవి సంస్థానోద్యోగి కావలసిన వాని కుండవలసిన యోగ్యతలు. వారికి విశాలబుద్ధులుండవు. అట్టివారు చేసే దౌర్జన్యములన్నియు నీకృతికర్త ప్రభువునకే యంటగట్టి యాతనిని శపించుట మహాపాపకార్య మనిపించుచున్నది, అట్టివే యింకను గొన్ని యీక్రింది పద్యములలో గమనింపఁదగును. కాని యవన్నియు ప్రభుస్వామ్యములనుటకువీలు లేదు. అతని పరోక్షములో నతని తాబేదారులు చేసినవిగా నూహించుట సమంజసము:—

4. "నాభూమిన్ నియుతుల్ వచ్చో యనుచు దున్నన్ వచ్చినన్ వారి కెం
తో ప్రీతిన్ నిలిగించి యువ్వాలను బోఁగోటించి పీడించి నా
నాభిందంతేను నష్టిచేసిన మహారాజన్య గోపాలునిన్ లోభిన్ బట్టి వధింపు"

స్వాయముగాఁ బ్రభువు తా నా కుగ్రామమునకు, కవిహాలమునకు వెడలి యిట్లు చేయునా?

ఈక్రింది పద్యములో శ్రీయాచేంద్రుఁడు, నారాయణస్వామి యను తనదివానుతోఁ జేరి యీమోసము చేసెనని కవి వచించినాఁడు. రాజు కానఁబడుట నారాయణస్వామి మారీచుఁడఁట!

5. "రావణా! రావణుతోడ వచ్చి కడుఁ జిత్రంబైన రూపంబుతో
నానాగ్రీణుఁడు మాయచేయఁగని సంహారంబు గావించి, శ్రీ
రామాప్తుండిట నేమో నప్పుడు నృపసుభాగ్యామాత్య నారాయణ
స్వామిని కొట్టు వధించి, తోడసన్ నృపున్ తాన్దూరమై చంపుమా!!"

ఈ క్రింది పద్యములోని చర్య ప్రభువు తెగించి చేసియుండునా? యను శంక కలుగుచున్నది. దివాన్‌గారి రాజకీయోద్యోగు లెవరో చేసినదానిని ప్రభువుచెవిదాఁక పోనిచ్చు సాహస మాకాలమున నెవరి కుండును?

6. భూదేవి! నినుఁ దల్లివోలె ననిశంబున్ భక్తిసేవించు న
న్నీదుస్స్వామ్ముఁడు బల్మి నెట్టి నినుఁ దానిద్వంగ నెంతార్తవై
తో? దైన్యారి యొజింగ నిం కితని భూర్తన్ రాజగోపాలునిన్
మేనోమాంసము బట్టి చంపి మనకున్ మేలిచ్చు"

శార్దూలశతకములోఁ బత్కర్త రాజోద్యోగివర్గము చేసిన దుష్కృత్యముల కన్నిటికిని రాజునే యుత్తరవాదినిగాఁ జేసి, మహా ఘోరముగా నతనిని శపించుట, నెుకవిధముగాఁ బ్రాయశ్చిత్తము లేని గొప్ప పాపమని చెప్పుటకు సందేహ మేమాత్రమును లేదు.

ఇదివఱకుఁ దెలిపినట్లు, నారాయణస్వామి యను పేరుగల దివాను చాల యక్రమస్థుఁడని, యతఁడే తనమాన్యము లాగుకొనుటకు కారణమని, కవి స్పష్టముగాఁ దెలిపినాఁడు. ప్రభువు, ప్రధాని మాత్రమే కాక మఱి యిద్దఱుకూడ నిందలకు బాధ్యులని కవి యీక్రిందిపద్యము లోఁ దెలిపినాఁడు.

"మున్నా దుష్టచతుష్టయంబు కలహంబుం బెంచి కౌరవ్యులన్
మిన్నందించిరి, యట్లనే యిపుడు భూమిన్ రాజగోపాలుతో
డ న్నల్వుండ్రగు ద్విజేంద్రభూస్థితుల నూడందీయ యోచించుచున్
రన్నా రెగ్గిలకేమియౌనో"

అని యానలువురిని "దుష్టచతుష్టయ"మని యన్నాఁడు. కాని తక్కిన యాయిద్దఱి పేరులను వారికి సంస్థానములోఁ గలయధికారములు మున్నగువానిని తెలుపలేదు. కాని ముఖ్యముగ బలుమ్మారినారాయణ స్వామి, రాజు, వీరిద్దఱే కవి కోపశాపములకు పాత్రులయిరి. వారిలో వారికి "బాహాబాహిని" కల్గఁజేయుమని కవి పూషుని వేడుకొనినాఁడు.

ఏలయన, ఆమంత్రియే విప్రులమాన్యములను కాఁజేయవలయునని రాజునకు సలహా యిచ్చినాఁడఁట ? అతఁ డొప్పుకొనినాఁడఁట !

"విప్రగ్రామ గతోపరాత్తి ధనమే విప్రస్వమే కాదటంచు,
అప్రాజ్ఞుండగు మంత్రి చెప్ప, అట్లేని లాభంబటంచు
అప్రాచీనపథంబు దప్పికొనె రాజు"

రంగాచార్యులు తన మాన్య విషయమైన దస్తావేజులు మొదట లైనవి ప్రభువడుగఁగా, నిచ్చినాననియు, నదే (అట్టినమ్మకమే) తనకు ముప్పు తెచ్చిపెట్టినదనియు—న్యాయస్థానములోఁ దన కన్యాయము జరిగినదనియుఁ, దరువాత, తానెన్ని యర్జీలు పెట్టుకొనినను ప్రయోజనము లేకపోయినదనియు, మొఱపెట్టుకొనినాఁడు.

గమనింపుఁడు :—

"రాజీతం డనృతంబులాడఁ డపహారంబుం దలంపం డటం
చేఁ జిత్తంబున నమ్మి, చూచుటకుఁగా నేనిచ్చు దస్తావెజుల్"

"మాంసాజ్యంబుల తిండిచే బలియుటన్ మందాత్ములై బ్రహ్మవి
ద్వాంసున్ సత్క్రతులన్ గణింపకయ, గర్వస్ఫూర్తిఁ దద్వృత్తి వి
ధ్వంసం బొనరించునట్టి మహిభర్తన్ రాజగోపాలునిన్"
"మ్లేచ్ఛుల్ గ్రీస్తుమతస్థులుం బ్రబలి, భూమి న్వేదవిధ్యుక్తముల్
దుచ్ఛంబంచు వచింతురు"—

ఇతని మాన్యసందర్భముగ జరిగిన యక్రమములన్నియు నితనిపై ద్వేషముకలిగిన రాజోద్యోగివలన జరిగియుండునని నాయూహ. సాధారణముగా సంస్థానములలో పరిపాలన బాధ్యత, అంతయు దివాను మీఁదనే యుండును. ఏవో పెద్దవిషయములైననే తప్ప ప్రభు వన్ని విషయములలో జోక్యము కలిగించికొనఁడు. ఈకారణములనుబట్టి, ఈ కవి మాన్యములకు సంబంధించిన కాగితములు దివానుగారి చేతికిచ్చి యుండును. ఒకవేళ యేలికచేతి కిచ్చియుండినను నవి దివానుగారి దగ్గఱకే పోయియుండును. వాని యాధారముతోఁ బరిశీలనచేసి మాన్యమును స్వాధీనపఱచుకొనుటకు దివానే యుత్తరవు చేసియుండును.

అట్టిపరిస్థితిలో, నాత్మదోషవివేచన లేకుండ (తాను బకాయిపడిన శిస్తులకొఱకట్లు జరిగినదను నాలోచనయే లేకుండ) సంస్థానమువారు న్యాయము ననుసరించి మాన్యమును లోఁబఱచుకొనఁగా నమితాగ్రహముపూని, తనవంశపోషకుని నిర్దయాస్వభావముతో శపించుచు శతకము చెప్పుట బ్రాహ్మణుఁడైన తన కెంతమాత్రము యుక్తముకాదు.

కార్యము మించిపోయినతరువాత నితఁడు ప్రభువున కెన్ని యర్జీలు పెట్టుకొనినమాత్రము ప్రయోజన మేముండును. అసలు బుద్ధిమంతుడైన రాజుగారికిఁ దన మొఱను విన్నపపత్రము మూలముగాఁ దెలిపియుండు నని తోఁపదు. అర్జీలన్నియు సంస్థానకార్యాలయములో దివానుగారి పనికిమాలిన కాగితములబుట్టకు దాఖలయియుండును. కాన జమీను పరిపాలన సందర్భమునఁ దనకుఁ జేదోడు వాదోడుగా నుండిన ప్రధాని మాటలు వినుట రాజునకు ధర్మముగాని, (ఒకవేళ) యీకవి సముఖములో మొఱపెట్టుకొనినను, విన్నపములు సమర్పించుకొనినను, నవి యన్నియు తాను గమనింపవలయునను నిర్బంధ మతని కేలయుండును? అట్టి అర్జీలన్నియుఁ దగిన చర్య పుచ్చుకొనుటకు దివాన్‌గారికి 'జారీ' చేయును. అతఁ డంగీకరించుట యంగీకరింపకపోవుట అతనియిష్టము. ఆ విషయములో నతనికి సర్వాధికారము లుండును. రాజు ఒప్పుకొనిన

(10) వాచాటుఁడు, (11) శఠుఁడు, (12) రక్షఃప్రాయుఁడు. (13) పాపిష్ఠుఁడు, (14) మాయావి, (15) కీశప్రాయుఁడు, (16) దురాత్ముఁడు. (17) లోభి, (18) ధూర్తుఁడు, (19) కిరాతుఁడు, (20) ప్రేత, (21) జాబాలోపముఁడు (గొల్లతో సమానుఁడు), (22) పతితుఁడు, (23) దురాత్మ, (24) అభ్రాజిష్ణుఁడు, (25) వికటవాది, (26) క్రూరుఁడు, (27) ధూమాభుఁడు, (28) అపశీలి.

ఇతఁడు ఒక్కొక్క పద్యములోను, ఒక్కొక్క దేవతను పేర్కొని — 'శార్దూలరూపము'—తో— రాజగోపాలయాచేంద్రుని వధింపుమని వేఁడుకొనును.

మొదటి మంగళాచరణపద్యములో 'కాలునిఁ' — సంబోధించుచు :— రాజునుశపించినవిధము గమనింపఁదగినది.

"కాలా ! కంఠగతాసువుల్ చన హతుఀ గావింపవే, రాజగో
పాలుఀ , వేంకటగిర్యధీశ్వరుని విప్రక్షేత్రబాధాకరుఀ,
శూలిద్రవ్యహరుఀ, సమాదృతమహా శుంఠాప్త వేగంబ, శా
ర్దూలాకారముదాల్చి సాధుజనసంతోషంబు వర్ధిల్లఁగఀ"

కవి పేర్కొనిన తక్కిన దేవతలలో— హిందువులకు ఆరాధ్యులయిన వారిలో— ఒక్కరినిగూడ విడిచిపెట్టలేదు. అందులో ముఖ్యులు:—

(1) త్రిమూర్తులు, (2) త్రిశక్తులు, (3) అష్టదిక్పాలురు, (4) చంద్రార్క తారకా గ్రహములు, (5) కపిలా సావిత్రీ గాయత్రీ సంధ్యామృత్యు దేవులు, (6) దశావతారమూర్తులు, (7) శంఖచక్రాది విష్ణుపంచాయుధములు, (8) అహో రాత్ర బ్రధ్నాదులు, (9) సప్తమాతృకలు, (10) షాణ్మాతుర గణేశ హయగ్రీవ హనుమదాదులు, (11) పంచభూతములు, (12) వరదరాజ వేంకటేశ్వరాది పుణ్యక్షేత్రపతులు—మున్నగువారు.

తనపోషకుని విషయములో ఎంతటి పశుప్రాయ దుర్ణయ, క్రూరస్వభావము నీకవి వహించినాఁడనునది యీక్రింది పద్యమువల్ల స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును :—

"రాజ్యభ్రష్టునిఁ దొల్తఁజేసి, యటుతర్వాతఀ గడుఀ నిర్ధనుఀ,
వ్యాజ్యగ్రస్తుని, నవ్వలఀ,— వెనుకనే వ్యాధ్యాత్ముఁ గావించి, తో
డ్తో జ్యేష్ఠత్వముమాన్చి పిమ్మటను శార్దూలంబవై చంపవే
నాజ్యాపహరకు భూరిపాతకునిఁ బ్రధ్నా ! రాజగోపాలునిఀ"

త్రాను రాజును శపించుచు, ఈశతకమును జెప్పినందులకు లోకులు తన్ను నిందింపరాదఁట!

“ఏ నీ రాజును బట్టి నాథుఁడని యెన్నెన్ని గ్రామియుం బల్కుకుం
గోనిష్ఠానిధులార! నీవు మహిపై నున్నంత కాలంబు, నే
మైనన్ విప్రుల బాధ తీరదుగదా, యట్లౌట శార్దూలమున్
నీనిం జంపఁగఁ జెప్పినాఁడ నిపుడే వేయేల? గోపాలునిన్”

ఇఁక నీశతకమును గూర్చి, తత్కర్తను గూర్చి యెక్కువగా వ్రాయ నవసరము లేకపోయినను, నాప్రభు సంతతునకు తగినంత గౌరవమైనను జూపక నిర్దాక్షిణ్యముగాఁ జరించిన యీకవి విషయమున నతఁ డెంతయో సహనము వహించినాఁడని తుదిమాటగాఁ జెప్పవలసియుండును.

సుమారు ఇరువది సంవత్సరములనాఁడు జమీందారుల నిరంకుశపరిపాలనలో నిట్టి దురుసుకవు లెవరైనను ఇట్లు ప్రభునిందతోఁ గూడిన కవిత్వము చెప్పిన వారితల లెగిరియుండునవి. ఈ రాజగోపాలయాచేంద్రుఁడు పరమశాంతుఁడు, విశాలహృదయుండు నై యుండవలెను. లేదా, శతకవృత్తాంత మాతనికి తెలియక యుండవలెను. కాని యెడల రంగాచార్యుల వాక్కౌర్యము ఇంతదూరము సాఁగియుండదు.

అయినను ప్రభువంతి యరసికుఁడా యనిన, నదియు లేదు. తన తండ్రిగారి హయాములో గోపీనాథము వేంకటకవి వ్రాసిన గ్రంథము లన్నియు నచ్చు వేయించినాఁడు. తిరుపతి వేంకటకవులు, పసితనములో (వయసు చిన్నంగ నిర్వాద కించుమించు), తన యాస్థానమునకు వచ్చినప్పుడు, అమితాదరముతో సన్మానించినాఁడు. కళాప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి సాహిత్యసేవకుఁ గూడ నెంతయో యార్థికముగాఁ దోడ్పడినాఁడు. *

* ఈగోపాలకృష్ణయాచేంద్రుల రసికత్వాని తెలుపేవిషయం ఒకటి ఉదాహరిస్తాను:—

అభిజ్ఞాన శాకుంతలంలో శ్రీ కాళిదాసమహాకవి—నాయకదర్శనం చేత, శకుంతలకు గలిగిన నానావిధ మదనావస్థలను తెలిపేసందర్భంలో—వేతసగృహమందు—చెలికత్తెల పరిచర్యలు పొందుతూవుండే శకుంతలను, చాటునుండి చూస్తుండే రాజు—ఈమోస్తరు అనుకుంటాడు:—

“క్షామక్షామకపోల మాననమురః కాఠిన్యముక్తస్తనం
మధ్యః క్లాంతతరః ప్రకామవినతావంసౌ ఛవిః పాండురా
శోచ్యా చ ప్రియదర్శనా చ మదనే క్లిష్టేయమాలక్ష్యతే
పత్రాణామివ శోషణేన మరుతా స్పృష్టా లతా మాధవీ॥”

ఈశ్లోకానికి శ్రీశాస్త్రిగారు రెండువిధాలుగా రెండుపద్యాలు అనువదించినారు. అందులో (పాఠాంతరంగా అధోజ్ఞాపికలో ఇచ్చిన పద్యం మనకనవసరం) ముఖ్యమయింది—నాటకంలో వాడదగిందిగా వ్రాయబడింది—ఈక్రిందిపద్యం :—

"చిక్కెను జెక్కుటద్దములు, చిక్కఁదనం బెడలెం జనుంగవన్,
స్రుక్కెఁ గరంబు నెన్నడుము, సోలె నితాంతము నంసకంబులున్,
ఎక్కెను బాండిమంబు మరునేఁపులఁ గొమ్మ యిదు స్వైత వ్రతిన్
మిక్కిలి పర్ణశోషణ సమీరక దర్శిత మాధవీక్రియన్"

ప్రభువు ఒకనాడు సాహిత్యగోష్ఠిలో శ్రీశాస్త్రిగారి నాటకాన్ని (శాస్త్రిగారే చదువుతూండగా) సవిమర్శగా వింటూ :—

"శాస్త్రిగారూ, యీశ్లోకం విషయంలో నాకు చాలా దినాలుగా ఒక సంశయం పీడిస్తోంది—'ఆమహాకవి యింతటి పొరపాటు ఎలా చేసినాడా'—అని."

"కాళిదాస మహాకవా?—పొరపాటు చేసినాడా?"

"ఆయనే కాదు. ఆంధ్రీకర్తలందరూ—తుదకు మీరుకూడా."

"సరే. తాము ఆవిధంగా సెలవిచ్చినప్పుడు, కాదనడానికి ఎవడికి గుండెలుంటుంది?—అయినా, తమ సంశయమేమిటో సెలవిస్తే—"

"దిద్దుకుంటారా?"

"కాళిదాసుగారి కవిత్వం దిద్దేంత సాహసం లేదు, కాని నాపొరపాటు సవరించుకొంటాను. అదియుక్తమనితోస్తే, తక్కిన అనువాదకులుకూడా, ఆమార్గమే అనుసరిస్తారు."

"ఆంధ్రీకర్తలకు ఆహక్కు ఎవరిచ్చినారు?"

"'వీతు నతనికి వైశాఖవేళలందు'—అని శ్రీహర్షుని కవిత్వంలోని పొరపాటును దిద్దడానికి కవి సార్వభౌముడికి ఎవరు హక్కు ఇచ్చినారు."

"ఆయన పోషకప్రభువులు—అలాటి హక్కు ఇవ్వడమే కాకుండ — అతని సమయోచితమయిన ధిషణానైపుణ్యాన్ని మెచ్చుకుని వుంటారు."

"మావంటివారికికూడా — తమవంటిప్రభువులు అంతటిహక్కు ఇస్తారనే నా ఉద్దేశం. ఇంతకూ, తమసంశయమేమో సెలవిచ్చినారు కారు."—

"శకుంతలకు కలిగిన మన్మథావస్థల్లో—తక్కినవన్నీ అలాఉండనిచ్చి, "చిక్కఁదనం బెడలెం జనుంగవన్—అని చెప్పారు గదా! — మాఅనుభవంలో ఆమాస్తరు ఎప్పుడూ తేటపడింది కాదు. మఱి సమస్తభోగాలూ చవిచూచే మాకే అనుభవానికి మారమయిన విషయాన్ని—కాళిదాసువంటి కవి వ్రాసినాడంటే—కొంచెం సందేహానికి—విమర్శకు—ఎడమిస్తుంది కదా!"

ఈపలుకులు వినేటప్పటికి శాస్త్రిగారికి నవ్వువచ్చింది. కాని ప్రభువుయొక్క నిశితదృష్టికి—సరసత్వానికి మెచ్చుకొని :—

"ప్రభూ, నిజమే. అట్టి అవస్థలు భర్తృ (ప్రియ) విరహంచేత కదా, స్త్రీకి కలుగుతుంది?—తమ అనుభవానికి అది ఎలావస్తుంది?—తాము ప్రవాసులయినపుడు, తమ రాణివాసానికి గలిగే అవస్థ—తమపునరాగమనంతో—తొలగిపోతుంది. సాన్నిధ్యంలో నాయకుడు లేనపుడు—నాయికకు "చిక్కఁదనం బెడలుం జనుంగవన్"—మఱి, ప్రియుడు దగ్గరేఉంటే— "చిక్కఁదనము సమకూడుతుంది."

ఈశతకమును ప్రకటించిన వావిళ్లవారి ప్రతిలోని శతక కాలము సరిగనే యున్నది. కాని "ఛందశ్శాస్త్రజ్ఞులు చెప్పిన ఫలము వ్యర్థము గాక యాపై కొంచెము దినములకు శ్రీరాజావారు వేటలో నాప్తులగు బంధువుల తుపాకిగుండునకు బారియయి చనిపోయినట్లు తెలియుచున్నది." అని తెలుపఁబడినది. "ఆపై కొంచెము దినములకు" అనఁగా నెన్నిదినములకో స్పష్టపఱచఁబడలేదు. కాని శతకరచనాకాలమిప్పటికి 63 ఏండ్లక్రిందట, అనఁగా 1890 ప్రాంతమగును. కాని రాజాగారు ఈ శతాబ్దాది దశకములోకూడ సజీవులే. ఆపక్షములో శతకరచనకుఁ దరువాత 10—15 ఏండ్లకుఁగాని యతఁడు మరణింపలేదు. కావున—ఆ శతక ఫలితముగా నతఁడు మరణించుట పొసగదు.

---

"అయితే, యిది కాళిదాసుకు ఎలా తెలుసునంటారు?"

"రవి గాంచనిచోఁ గవి గాంచునేకదా! తానుకూడ (రవి) ఇనులే. తమ తెలుసుకొనివి కవు తెలుసుకును."

"మరి, ఇది మహ్యాంతుడుగదా అనుకోవడం?—అతడి కెల్లా తెలుసునంటారు?"

"తామిప్రుడు ఎల్లా తెలుసుకొన్నారో, అల్లాగే."

శ్రీ రాజగోపాలయాచేంద్రుడు—శాస్త్రిగారి పాండిత్యానికి—వివేచనాశక్తికి మహానందభరితుడయినాడు.

ఒకపర్యాయం శాస్త్రిగారిచే తెలిగింపబడ్డ "ఉత్తరరామచరిత"—ప్రదర్శిస్తే బాగుండునని ఈప్రభువు భావించి—ఆవిషయం శాస్త్రిగారికి తెలుపగా—ఆయన—"ప్రభూ, నాకూ అది ఇష్టమే—కాని, నాతక్కిన నాటకాలన్నీ ఒకయెత్తు. ఇది ఒక యెత్తు. ఏలనంటే—ఇందులో—అంతర్నాటకాద్యనేకరంగ ప్రదర్శనాలు ఉన్నవి. వానికి కావలసిన యవనికాది నానావిధసాధనాలకు బోలెడు డబ్బు ఖర్చు అవుతుంది. ఇంతా చేసి కవిహృదయాన్ని అనుసరించి—ప్రదర్శించడమంటే, ఏదో ఒకటి రెండు నెలల్లో అయ్యేపని కాదు. నటులు చక్కగా తయారు కావలసివుంటుంది—ఎంతో కష్టసాధ్యమయిన రూపకం. రక్తి కట్టేటట్టు చేయడం మహాదుర్లభం. ఆవల తమచిత్తం"—అనేటప్పటికే,—"ఏమైనాసరే—ఎంతవ్యయమైనా—వెనుదీయం. ఇక నటకులను తరిబీతుచేసే విషయంలోనూ—రంగసాధన విషయంలోనూ—(తమరు ముందునిల్చి) యెన్నాళ్లయినాసరే—జయప్రదంగా దీన్ని ప్రదర్శించవలసిందే"—అని, చెప్పి—తాను చెప్పినప్రకారం నెరవేర్చిన కళారాధకుడు ఈరేచర్లాన్వయ సంజాతుడు.

రసికశిఖామణి అయిన యిట్టి ప్రభువు రంగాచార్ల శ్రోథానికి అర్హుడయినాడంటే, విచారపడదగ్గ విషయమే. ఈమహారాజాగారి మృతి—శ్రీశాస్త్రిగారికెంత హృదయవిదారక మయినదనే అంశము—ఆయన "ఆముక్త"—(వ్యాఖ్యా) పీఠికలో స్పష్టీకరించబడింది.



# కొల్లూరు కామశాస్త్రి

క్రీ॥ శ॥ 1850 ప్రాంతము.

ఇతఁడు రచించిన శతకము శ్రీరఘునాయకశతకము. అందుఁ దన్నుఁగూర్చి :—

"కల్యాభిమాన హార్ద్ర గుణ గాన విలాస కథానిధాన స
ద్వల్యసగోత్రుఁ డార్యమతి ధన్యచరిత్రుఁడు, కామశాస్త్రి మం
గళ్యకరమ్ము పద్యశతకమ్ము సమర్పణచేసె భక్తమం
దల్యమకంపఁ గొమ్ము రఘునాయక భక్తవరప్రదాయకా"

అని తన నామధేయమును (గోత్రసహితముగా) పేర్కొన్న యీకవి తనతలిదండ్రులనుగూర్చికాని, నివాసస్థలమునుగూర్చికాని, కనీసము శతకరచనాకాలమునుగూర్చి కాని తెలుపుకొనలేదు. కాని వంశపారంపర్యముగా నియోగికవులు "అమాత్య" శబ్దమును వాడుకొనినట్లు వైదికకవులు "శాస్త్రి" బిరుదము నెక్కడను దమగ్రంథములలోఁ జెప్పుకొనలేదు. ఈయలవాటు సాధారణముగా 19 వ శతాబ్ద ప్రారంభమునుండియే వచ్చియుండును. తదనుగుణముగనే "శిష్టు" వంశస్థులు మొదలయిన కొందఱు శాస్త్రులయిరి. అట్టివారిలో నీకామశాస్త్రియు నొకఁడై యుండును. ఆపక్షములో నితఁడు 19 వ శతాబ్దము మధ్యభాగములో జీవించియుండు ననుట ప్రకృతమునకుఁ జాలును.

ఇతఁడు సంస్కృతమున మంచిపాండిత్యము గల గొప్పకవి. అకారణముచేతనే యీశతకములో 100 కి 90 పాళ్లవఱకు సంస్కృతశబ్దములు ప్రయోగించినాఁడు. సామాన్యముగా సంస్కృతసమాసములు దొరలని పద్యము లీశతకములో మృగ్యము. కొన్నిచోట్లలోఁ బద్యమంతయు నేకసమాసముతో నవదరిల్లుచున్నది. మఱియొక విశేషమేమనఁగా, నీశతకకవి శబ్దాలంకారములకు చెవి కోసికొనురకము. శబ్దాలంకారములను బూర్వకవులలో నెక్కువగా నాదరించిన వారిలో చేమకూర వేంకటకవి యగ్రగణ్యుఁడు. అయిన సందర్భానుసారముగా నర్థపుష్టి, భావగాంభీర్యము, వ్యంగ్యచమత్కృతి, యతఁడు చూపిన ట్లితని ననుకరించి రచనలు సాగించినకవులు చూపలేకపోయిరి. అతనికవనములో శబ్దార్థాలంకారములు సమానమైనపాళ్లలోఁ బడి చదువరులకుఁ జవులూరించుచుండును. కాని యతనిజాడలలో నడచిన వెనుకటికవు

పతనికి సాటి కాలేకపోయినది. అర్థముండినను లేకున్నను శబ్దాలంకార పోషణార్థము ఏవో శబ్దములు తమయిష్టము వచ్చినట్లు, ప్రయోగించి, గణగణ ధ్వనులుచేసి పాఠకలోకమునకుఁ జెవులు గింగురులెత్తించిరి. “చూచి తెలియఁజూచి యెఱిఁగి రసోచితంబుగన్” “అమ్మక చెల్ల నా హృదయ మమ్మకచెల్లదు” “నువ్వు బువ్వు నవ్వు జవ్వనినాసిక” “ఏమందము నాసికానన మొగమందము, మీఱు సవారివిందముల్” —అర్థపుష్టి గల యిట్టి శబ్దాలంకారములు తరువాతికవులలోఁ బెక్కుర కలవడలేదన్న సత్యదూరముకాదు.

ఇఁకఁ బ్రకృతి మీశతకకర్త సంస్కృతభాషాపరిజ్ఞానమును సూచించుశబ్దములు ఇందులో నున్నవి,

(1) నవత్ప్రచయ సార మలిమ్లుచము, (2) విదారణప్లుతము. (3) బల్యభిన్న తైజలార్ఘ్యలిప్సు, (4) స్థలదంబరసంపరాంతుసిన్, (5) ధర్మనిష్ఠతాంతస్వాతిభాగతాంగ, (6) తామనామకాంబరము. (7) పదాంతికతాంసగనాంగధార. (8) వాచికపత్రము, (9) ఉచ్చావచరూపముల్.

అక్కడక్కడ నచ్చుతెలుఁగైన మంచి తెలుఁగుపలుకుబడులుకూడ వాడినాఁడు ; కాని యవి చాలతక్కువ :—

ముద్దుసుద్దులు, సింగ్రమింగు, బిరాన, తళుకుబెళుకు, వాడబేరము (ఓడబేరము), కయిదండ, నూఁగునూఁగు మీసపురేక, బెడగుమేదగ, కసుగాయ. కడాని మేల్ మలినావని, బాజుబందులు, సుపాణిముత్తెము, కుళాయి. నామాఁకీ, కన్నులగప్పికొను.

ఈసుకవి ‘ర ల’ ప్రాస మైత్రి యంగీకరించినవాఁడు :—

1. “గ్రక్కదానమూనై నెపుడు గోరు దిమ్మనిన లక్ష్మిణుకత్తిరియె”

2. రావు సుపాణిము త్తెపుఁ గుళాయి.

‘చెప్పు’ లనుటకు ‘చౌ’ లనియుఁ బ్రయోగముకలదు.

“ముక్కు చౌల ఖండన మొనరించి తీర్చి”

ఈకవి కూడ, తక్కినశతకకవులవలెనే తనకృతిలో 4 నుండి 15 పద్యములవఱకు దశావతారస్తోత్రము చేసినాఁడు.

ఈక్రిందిది నరసింహావతారమును వర్ణించుపద్యము :—

“డింభక ఘాతుకోగ్ర గిరి తటీ నికటీకృత భేదబోధక
స్తంభ విదారణోన్నత సిత స్వనఖాంకుర లగ్న దైత్యరా

డ్డంభ సటాచ్ఛటాస్ఫురిత తారకితాభ్రభు నృసింహవేషునిన్
సంభృతదాను నెంతు రఘునాయక భక్తవరప్రదాయకా"

**యమకాలంకార యుక్త మీాదిగువ పద్యము :—**

"నేరము లెంచి నన్నిలువ నేరము నీమహిమంబులుం గడుం
దూరము నన్యులన్ శరణుదూరము, చెప్పగనేల? యింక నే
వారము, నీదుభక్తజనవారములం గణించి ప్రోవఁగం
భారము నీదెసుమ్మి రఘునాయక భక్తవరప్రదాయకా"

**ముక్తపదగ్రస్తాలంకారము :—**

"శరధినివాస, వాసవవశాపనిశాపతి, శారదాభకీ
ర్తిరుచివికాస, కాసరసరీసృపరీతిపరీతిదైత్యజై
త్రరణవిలాస, లాసకవిభారతిభాదిబుభాళిహాస్య నూ
నరథశరాసరాస రఘునాయక, భక్తవరప్రదాయకా"

**అంత్యప్రాసనియమము :—**

"పసుపడిమీారు, ముంగురులబారు, కనుంగవతీరు, నక్కునె
క్కొను పులిగోరు, బల్కులిమిగోరు, భుజంబులసౌరు, గాంచినం
తనె జడదారులైన జడదారులనన్ వడిఁదారు చిత్రమన్
వననిధి తేలినారు రఘునాయక, భక్తవరప్రదాయకా"

ఛేక వృత్త్యా ద్యనుప్రాసాలంకారముల కీశతకములోఁ గావలసి నన్ని యుదాహరణములున్నవి.

(1) పచ్చికలమెచ్చని, పచ్చనిరాలడోల, (2) కానలకోనలోఁ బొడమఁగా, నలతేనెలు, సోనలెంతయూ, (3) రాణఁ జెలంగఁ బొరు లగురాతగురా, చిగురాకు, (4) బలి వేడ వేడబవు బాడబతం గను ప్రోడవు, (5) ఒకపరి గేరి పారి మఱియొక్కొక్కమారటు మారి మీారు నిన్, (6) వధార్హతోద్ఘాటక కౌశికాజ్ఞ జవదాటక దుష్టచరిత్ర పేటికన్ దాటకఁ గూల్చితీవె.

ఇదివఱకే చాలపద్యము లుటంకించియుండుటచేత సీతాకళ్యాణ సందర్భమును వర్ణించు నీక్రిందిపద్యము నుదాహరించి విరమించుచున్నాను.

"ఊరమునమించు హైకముడి యూఁడిన జోడను జాడ నంతటన్
బిరుసగునట్టి పోఁకముడి వీడినతోడనె గాడినట్టి ని
ర్భర పులకాంకురంబులు భరంపడఁ జేసితి వాసుధేయికిన్
గరము గ్రహించువేళ, రఘునాయక, భక్తవరప్రదాయకా"



# వెండిగంటము గురునాథకవి

క్రీ॥ శ॥ 1850 ప్రాంతము.

వెండిగంటము గురునాథకవి రచితమైన 'సరస్వతీశతకము' రుధిరోద్గారి సం॥ భాద్రపదశుద్ధ పంచమీగురువారము (క్రీ॥ శ॥ 1863 సం॥ రము) "వర్తమానతరంగిణీ" ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. అంతకు పదేండ్లకుముందట దీనిని కవి వ్రాసినట్లు క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

"ఘనముగ శాలివాహన శకాబ్దములాఱును నేడు నేడు నొం
డనియెడి సౌమ్యవత్సరము నందలి రెండవమాసమందు ప
ల్లని జగి పక్కయందు సకలంకి యజుశ్శ్రుతిశాఖ విప్రసం
జనసుతుఁడు వాణి దాసుని కొసంగెఁ గృతిన్ గురునాథుఁ డాద్యృతిన్"

శా॥ శ॥ 1776 సం॥రము, అనఁగా సౌమ్య సం॥రము వైశాఖ శుద్ధము (తెల్లనిజగిపక్క) లో నీశతకము పూర్తియైనట్లు కడపటి పద్యమువలనఁ దెలియుచున్నది. వర్తమాన శక వర్షములు 1875 అయినందువలన నిప్పటికి నొక్కయేఁడాది తక్కువగా నొక శతాబ్దముక్రిందటి దీశతకము.

కవి తన్నుఁగూర్చి యీవిధముగాఁ జెప్పుకొనినాఁడు :—

"ప్రముద మెలర్ప నాంధ్రమునఁ బద్యశతమ్ము నరంచి వెండిగం
టము గురునాథుఁ డార్యనికటస్థితుఁ డప్పయసూరిపుత్రుఁడు ప
శ్రమునఁ ... ... ... ..., నీకొసంగె, సం
భ్రమమున దీనిఁ ... బ్రాహ్మణి సత్యవతీ సరస్వతీ"

కవి తాను యజుశ్శాఖవాఁడనియుఁ, దన యింటిపేరు "వెండిగంటము" వారనియుఁ, దన తండ్రిపేరు 'అప్పయసూరి' యనియు చెప్పుకొనినాఁడు.

నియోగిశాఖలో పైఁడిగంటము, వెండిగంటము వారని యింటిపేరులు కలవారుండునట్లు తోఁచుచున్నది. మంచిమునసద్దీలుగను, కరణములుగను, రాజకీయ తంత్రజ్ఞులుగను వెలసిన నియోగిశాఖీయుల కాకాలమునఁ ప్రభువులు పైఁడి వెండిగంటములు బహుమానము లిచ్చుట వాడుకగాఁ బొడకట్టుచున్నది. ఆకారణముచేత, నేవంశీయు లాప్రకారము రాజసన్మానము నందుదురో, యావంశీయు లప్పటినుండి

యాగౌరవమునకు సూచనగా నట్టిపేరులతోఁ బిలువఁబడుటయు నవే తుద కింటిపేరుగా మారుటయు నసంభవముకాదు. ఏనుఁగు లక్ష్మణ కవికిని నాయింటిపేరు రాజకృత గజబహుమానమువలనఁ గలిగినదే యని ప్రతీతి యున్నదికదా!

అయిన, 'శతఘంటము', 'సహస్రఘంటము' లటువంటివి కావు. శతఘంటకవనము, సహస్రఘంటకవనములవలనఁ గలిగినవి. ఇవి సాధారణముగా, మనకుఁ దెలిసినంతవఱకు వైదికులలో నింటిపేరులుగాఁ బ్రచారములో నున్నవి. శతఘంటము వేంకటరంగశాస్త్రిగారి యింటిపేరావిధముగాఁ గలిగినదేకదా!

ఇట్లుండగా "నితఁడు సరస్వతీశతకము నెవ్వరు వ్రాయలేదని. వ్రాసినకారణముననే కాఁబోలు వెండిగంటమువాఁడయ్యె" నని శతక కవుల చరిత్రకారులు వ్రాసిరి. "సరస్వతి శ్వేతవర్ణ" కాన నాశతకము వ్రాసినకవి గంటముకూడఁ దెల్లనిదే. కనుక నది "వెండిగంటము"— అని శ్రీ వంగూరుసుబ్బారావుగారి యూహయైనచో నంతకంటె హేత్వాభాసమునకుఁ బరాకాష్ఠ మతేముండును ? అది నిజ మే యయిన నావిషయమును కవి కడపటి పద్యమునఁ జెప్పకొనలేకపోయినాఁడా ? మొత్తమునకు శతకరచనకుఁ బూర్వమే గురునాథకవివంశస్థుల కీయింటి పేరు స్థిరపడియున్నట్లు స్పష్టమగుచున్నది.

ఈశతకకవి తండ్రికూడఁ బండితుఁడయినట్లు "సూరి" యని (కవి) యన్నందువలనఁ దెలియుచున్నది. ఇఁక నీకవి యొక్క వాసస్థానము మొదలయిన విషయములేవియు నీశతకమునఁ గనఁబడుటలేదు.

ఇందులో 131 చంపకోత్పల వృత్తములున్నవి. మంచి రసవంతమైన కవిత్వము. ధారాళమైననడక. పదవిన్యాసము ప్రస్తుతింపఁ దగినది. అక్కడక్కడ శబ్దాలంకారములు సముచితముగాఁ బొందింపఁబడినవి. వ్యతిరేకక్త్వార్థకముమీఁద ద్రుతప్రయోగము, అఖండయతిప్రయోగము మొదలయిన లక్షణవిరుద్ధము లీరచనములోఁ గనఁబడినను గవి మిక్కిలి ప్రౌఢముగాఁ బద్యములు వ్రాయుటలో సమర్థుఁడుగనే తోఁచుచున్నాఁడు. నూత్నభావములుకూడ మనోహరముగాఁ గవితలో నిముడ్పఁగల దిట్ట యీగురునాథుఁడు. ఇతఁ డీక్రింది పద్యములో తన కభిమానులయిన పూర్వకవులను బేర్కొన్న విధము గమనింపఁదగినది :—

"నన్నయభట్టు, తిక్కనయు, నాచనసోమన, పోతనార్యుఁడుం
జన్నయమాన్యుఁడుం బలె, నల్లసానికులోద్భవ పెద్దనార్యుఁడే
సన్నుతికెక్కె నాంధ్రకవి సంతతికెల్లను దాతయౌచు నే
నెన్నెద నాతని న్కృతి గ్రహింపఁగ సత్యవతీ సరస్వతీ!"

కవిత్రయములోని "ఎఱ్ఱన" నితఁడు చెప్పని కారణమేమో! అంతటికంటె నల్లసాని పెద్దన కవిత్వముమీఁద నితనికి "మోజు" ఎక్కువ యనువిషయము పైపద్యమున "ఎన్నెదనాతనిన్" అని (అంతకు ముందుఁ గొందఱు కవులనుఁ బేర్కొనికూడ) పెద్దననే యెన్నెదననుట వలనఁ దెలియవచ్చుచున్నది. ఇఁకఁ దానీసరస్వతీశతకరచనకుఁ బూనుటకుఁ గల కారణముల నీవిధముగఁ జెప్పినాఁడు :—

"తెలుఁగుకవిత్వ మల్లఁగల ధీరులు సర్వసురాంకితంబులై
చెలఁగఁగఁ గొన్ని సత్కృతులు చేసిరి లక్ష్మి భవదీయనామసం
కలితముగాఁగ నొక్కశతకమ్ము రచింపరదేమొ? తత్కృతుల్
తెలియఁగ నీవ యూవనియొ? శ్రీమతి, సత్యవతీ, సరస్వతీ!"

ఇఁక నితని శతకములోని కవిత్వవిశేషములను గొన్నిటిని మచ్చునకుఁ జూపుదును.

(1) దుష్కరప్రాసములతోఁ బద్యములను సాఁగించుటలో నితఁడు సమర్థుఁడు.

"నూర్వ్యవలంబనంబున సముద్ధతి లక్ష్యముసూచుఁ బాణి, శ్రీ
గుర్వనుషంగ వేగమునఁ గోవిదుఁ డాత్మపదంబు చూచుఁగా,
దుర్వ్యసనాలతిన్ గని పదార్థము పక్వముచూచుఁ బోకి, నే
మూర్వ్యసనాబ్ధి దాఁటఁగనుదు నిన్ను"—

(2) కొన్ని శబ్దాలంకారములు :—

"కలియుగధర్మమేమొ వినఁగా కనఁగా మనఁగాన మేమియున్
నల విబుధాళులెల్ల నగులై గురులై వరులైరి భూమికిన్
ఫలముకృశించె, వాన యొడపాదడపా పడ పాలుమాలుటన్
బలుకులనాతి యేమిగతి? భారతి!"

"వాణియుగమ్ము ఫాలమున బాగుగఁ జేర్చి భజింతు నిన్ను గీ
ర్వాణిని, నీలవేణి, నజురాణిని వాణిని, బాలికానత
శ్రేణిని, గల్పభూజ మృదుశీతల పల్లవపాణినిన్ దరశ్రోణిని"—

"తెల్లనిపుట్టుపుట్టి, నను తెల్లనిచిల్కను జేతఁబట్టి, మైఁ
దెల్లనిచీరఁగట్టి, జిగి తెల్లనితామరగద్దె మెట్టి మేల్
తెల్లనితూఁడుఁదిండిగల తేజి సవారిగ బెట్టినట్టి మాతల్లివి"—

(3) కొన్ని అర్థాలంకారములు :—

“వరము భవద్గళాకృతికిఁ, దా సరి యంచటు వచ్చి చూచు, పెన్
వెఱఁగొని జోగిదాసరుల వెన్కలఁ జేరుచు, వీథివీథులన్
మొఱలిడఁబట్టి వైద్యులు సమూలము భస్మముచేతు, రిట్టులే
తిరితెను భావమెంచని మదస్థులు”—

“మురువగు మొల్లమొగ్గగుమి ముత్తియముల్మగరాలు నీదుప
ల్వరుసకు సాటి యందు రిల వానిని విల్తురు, గాన, మెచ్చ నే
నఱువదినాల్గువిద్దెల కనాదిగ మూలము నీవెయౌట నక్షరముల పస్తుతిసేసెద”

“ఈవు వసించుచోట వసియింపదు శ్రీ యనుచుందు రంద, వాణీ
దేవి, జగంబు మోదనిధిఁ దేల్చెడు సాహితి, గాయనంబు నీ
చే విన, నీదుకర్ణముల చెల్వున మచ్చిక హెచ్చవచ్చి యా
దేవియుఁ గాచియున్నది కదే”—

(4) జాను తెనుఁగుపదములతో ముచ్చట గొల్పుచున్న దీక్రింది పద్యము :

“ఆఱునెల నేలు పెన్నిదురు, నద్దపుబిళ్లలఁ బోలు చెక్కులన్,
మెఱసెడి తేఁటిఱెక్కలను మీఱుకురుల్, బటువౌ పిఱుందు, నుం
గరిముల గేరు ముంగురులు, గబ్బిచనుంగవ, పేదకౌను, చం
దురు నగు నవ్వుమోము గలతొయ్యలి”—

(5) సంస్కృత జటిల సమాసములుగల కొన్ని రచనలు :—

(1) ధ్వని రస భావ శబ్ద పద ధాతు విశేష్య విశేషణార్థ లక్షణా మధురోక్త్యలంకరణ సంధి సమాస సమన్వయక్రియా ఫణితులు. (2) సౌర ధునీ లలద్విమలసాంద్రతరంగ ఘుమంఘుమారవ స్ఫార గభీర చారు తర సార కవిత్వ సుధారసస్రవత్స్ఫార సుమాధురిన్. (3) చటుల మణీ గణాచ్ఛురిత చంద్రమయచ్ఛవి గుచ్ఛ కృద్ఛవత్కటక ఝుళంఝుళా ర్భటులు.

(6) ఈశతకమునందును గలిధర్మనిగర్హణము కనబడుచున్నది.

“తుఱకలు, దొమ్మిదాసరులు దొమ్మరివాండ్రును మాలమాదిగల్
కొఱవలు కమ్మరుల్ మొఱకు గొల్లలు బోయలు బెస్తవాండ్రునున్
తిరిపెపుజోగి జంగములు దేశముపై దొరలైరి, యోగ్యులే
వెరవునఁ బూజ్యులౌదురు ?”—

“నీచులకెల్ల భాగ్యమును నిర్మల వంశ్యులకెల్ల లేమియున్
వే, చదువొప్ప వ్రాయఁగల వేధను నీవొకమాఱు దెల్పరా

గా? సవివింపు శిల్పిని గదా? వెసఁ దప్పులు వ్రాయువారలన్
గావక శిక్ష సేయఁ దగదా?॥——

(7) తత్కాన్న భక్తిసమయములో నుపదంశములవలెఁ దెనుఁగు లోకోక్తులు కనఁబడుచున్నవి.

(1) "క్రిందటి మాటకాలినను గిల్లిల నవ్వను మీఁదియాకు, దానుం బెనుఁ గొన్నినాళ్లకు", (2) "తాఁ జెడునట్టిధర్మము, మొండ త్ర్చెడు బేరము", (3) "నమ్మె నదాఁటఁగ బుడ్డనమ్ముటల్ నీచన రేంద్రుఁ గొల్చుటలు", (4) పెద్దలుదెల్పు బుద్ధియును, బ్రేమను పెట్టినఁ గట్టు చల్దియుం బ్రొద్దునఁ బ్రొద్దునన్ నరులఁ బ్రోవదె". (5) మంచిది మంచిదే యనఁగ మంచిది", (6) కోటి చమత్కృతుల్ నరుఁడు గొబ్బున నేర్చినఁ గూటికేకదా!"

(8) తెలుఁగు జాతీయములుగూడ నీశతకపద్యములలో విస్తారముగా నున్నవి.

మంకు (తపము) గ, ఊహాపోహాలు, కూటికిగుడ్డకుఁ గలిగి, జంజాటము, బువ్వకు లేకయుండుట, ఆలు గయాళి పక్కకు బోటిలేదు, దేహమమ్మట, వంపోటకట్ల, అరచేయి గుళ్లు, కత్తెరబావిలీలు, చెంప సరాలు, పైఁడితురాయి, సోఁగదిమ్మె, రాకడిబిళ్ల, అద్దపుఁబిళ్ల, పాఁపట చేరుచుక్క, చీమలబారు, దుబారు చేయు, కుంకుమబరణి.

గురునాథకవి యీశతకమును, తన వార్ధకదశలో రచించినట్లు——"తనువునఁ బాటవమ్ము చనె, ధైర్యమువీడె, విలోలవృత్తి నెమ్మనము వశమ్ము కాదు, మతిమందత చేకొని, రోగజాలముల్ పెనగుచు నొంప జొచ్చె, ననుఁ జేర్కొనువారొకరైన లేరు"——అనుటవలన తెలియుచున్నది. అప్పటి కతనికి ఆఱువది యేండ్లైన నుండవచ్చునని తోఁచుచున్నది. పై పద్యములోఁ జెప్పిన యవస్థలన్నియుఁ జుట్టుముట్టిన ముసలితనముననే రసవత్తరమయిన యీశతకమును వ్రాయఁగలిగినవాఁడు నడిప్రాయమున నేదైనకృతి నిర్మించియుండునని భావింపవచ్చును. కాని మనదురదృష్టమున లభింపలేదు.

——♦♦——

# కరువూరు బంగారయ్య

క్రీ॥ శ॥ 1850—1910.

మానసవైరాగ్యశతక మీకవి రచించినది. అక్కడనక్కడ లక్షణముతప్పినను, ధార సరళముగ, సుగమముగ నున్నది.

దీనిని 'సవుటూరు' తాలూక (నెల్లూరుజిల్లాలోనిదిగా తెలియుచున్నది) 'మర్లపల్లె'—"దక్షిణపు అప్పారెడ్డి ఖంద్రిగ" వాస్తవ్యుఁడైన నల్లారెడ్డి వెంకట్రామారెడ్డి జ్యేష్ఠపుత్రుఁడు రామచంద్రారెడ్డి ప్రేరణవలనఁ జెన్నపట్టణము పాతచాకలపేటలోని శ్రీరాజరాజేశ్వరీ ముద్రాక్షరశాలాధికారి యైన పమ్మిత్యాగరాయసెట్టి ముద్రించినట్లు తెలియుచున్నది. కడచిన శతాబ్దాంతములోని ముద్రణముగాఁ గనఁబడుచున్నది. శతకరచనాకాలమునుగాని, ముద్రణకాలమునుగాని యీ గ్రంథములో నెక్కడను జెప్పలేదు.

మొత్తమునకుఁ బ్రాచీనముద్రణమునుబట్టి, శైథిల్యమునుబట్టి యిది కడచినశతాబ్దములోని చతుర్థపాదములోఁ గవి రచియించి యుండవలెనని తోఁచుచున్నది. శతకనిర్మాణకాలమునకుఁ గవి మానసవైరాగ్యము కలిగిన వేదాంతశాస్త్రపారీణుఁడు కావలయుననిన, నతనికి దాదాఁపు ఏఁబది యేండ్లయిన నుండవలెను. ఆపక్షమున కవి, క్రీ॥ శ॥ 1850 ప్రాంతమున జన్మించి 1910 సంవత్సరమునకు (ఇంచుమించు రెండుమూఁడేండ్ల తేడాతో) నిర్యాణము చెందియుండుననుట సహేతుకము.

ఈకవి రాచగుండ్ల సుబ్బయార్యుని ప్రియశిష్యుఁడనని చెప్పుకొన్నాఁడు. తక్కిన వివరములేవియు నీశతకాధారముతో నిర్ణయించుటకు సాధ్యముకాదు.

ఇందు 104 తేటగీతము లున్నవి. ఒకవిధముగా వేమన యాటవెలఁదులవలె లలితశబ్దములతోఁ బాదవిరామములతో నుస్నితముగా సాగిపోవుచుండును. ఈకవి పండితుఁడు కానందున ఛందోవ్యాకరణదోషములు తఱచుగ నగపడుచున్నవి. అట్లయినను నీకవిత్వ మాస్వాదనీయమే. వేదాంతవిషయముల నింత సౌంకర్యముగా చిన్నగీతములలో నిముడ్చుట యనిన, నేకొంచెమో కవితారంగములోఁ దంటాలు పడిన కవికిఁగాని వీలుకాదు. పైఁగా వేమనపద్యములవలెనే కడపటిపాదముం

తయు మకుటమే, "ధర్మగుణధుర్య బంగారుదాసవర్య" అనుటచే వేమనను బూర్తిగా ననుకరించుచు నతనిపద్యముల నొరవడిగా నుంచుకొని తనశతకము నీబంగారుదాసకవి నిర్వహించినాఁడు. మచ్చునకుఁ గొన్ని పద్యములు :—

"సకలశాస్త్రములనెల్లఁ జదువఁజదువ చిత్తవిభ్రమ కలిగించి చిత్తుచేయు
పుట్టువులు జావు వడిగెడి పూని గాదు"

"ఒడలిపైని బూది పూసి యీయుర్విలోన కావివస్త్రంబులను గట్టి కనులమధ్య
కుంకుమము పెట్టి తిరిగిన కుటిలమతులు"

"నీటికాకులరీతిగ నీటమునిఁగి బూదిపూసియు జపమాల పూనిచేత
త్రిప్పుటను నేమిసిద్ధించు"

"తీర్థయాత్రలు సేవించ తిరిగితిరిగి యుచటఁ జెందిరి మతియేమి యెఱుకగలిగె
అచలపరిపూర్ణులైయున్న నన్నిగల్గు"

"రాళ్లు బొమ్మలు సేయించి గుళ్లలోన నిల్పి పూజలు చేసెద రర్థి జనులు
మోసపోయిరి వారికిమోక్షమేది"

"ఆత్మలింగంబు గనలేక యవనియందు లింగకాయల మెడదాల్చి రంగుమీర
తిరుగువారెట్లు బ్రహ్మంబుఁ బడయఁగలరు"

"మేఁకపోఁతులరీతిగా లోకమందు గడ్డములఁ బెంచి మూరెఁడు, జ్ఞానులనుచు
తిరుగవలెనేమి ? మేఁకలదీటుగాదె"

"భూమిలోఁ బుట్టు పైరెల్ల భూమి నణఁగు యోనిలోఁ బుట్టు జీవుండు
యోనినడఁగు పుట్టిగిట్టెడుమర్మంబు పొలఁతియెఱుఁగు"

"వట్టిమతములు లెస్సఁగఁ గట్టవచ్చు చుట్టు ప్రాకారములుగట్టి చూడవచ్చు
ఘటము లోగుట్టు గాంచని మతము లేల"



# దుర్భాక వేంకటసుబ్బశాస్త్రి

క్రీ॥ శ॥ 1850 ప్రాంతము.

ఈతని "వారాంగనా ప్రవర్తన" మను గ్రంథారంభమునఁ గవి తన్నుఁగూర్చి యీక్రిందివిధముగా వర్ణించియున్నాఁడు:—

"పురివెల్లాల, చిదంబరార్యునకిలన్ బుత్రుండ, దుర్భాక స
ద్వరవంశుండ, గవీంద్రశిష్యుఁడను శ్రీ వైకుంఠ పూజారతుల్
బరఁగన్వేంకట సుబ్బశాస్త్రి యనినన్ బల్కన్ జనవ్రాతముల్
వరుసన్ సత్కృతిగా నొనర్చితిని, నే వారాంగనా చర్యలన్"—

"అరుదుగా మొదలం వారాంగనావర్తనమ్మొనరించి కౌసల్యా జననమాది
పరిణయ పర్యంత మిరవొందఁగాఁ గృతిసల్పితి, జయదేవు చరితమొకటి
గావించి పిమ్మటఁ గాళిదాసుచరిత్ర నాటకఫణితిఁ జెన్నారఁ గవన
మెలమితోఁ జేసితి నెంతొ నాలుగుకావ్యములు మఱి మంగళాచల మహాత్మ్య
మొకటి యాశ్వాసపంచక మొనర నటియు నక్కడక్కడ జీర్ణించి యలరు తాళ
పత్రముల్ దెచ్చి పోయిన పద్యములనుగూర్చి వెలయఁగఁ జేసితి నేర్పునట్లు"

కవి 'వెల్లాల' గ్రామవాస్తవ్యుఁడనని చెప్పుకొనినాఁడు, కాని యదెక్కడ నున్నదో చెప్పలేదు. మొత్తమున కట్టి గ్రామము చెంగల్పట్టు ఉత్తరార్కాడుజిల్లాలలో నేదియో యొకదానికి సంబంధించినదిగా నుండును. 'వెల్లాల' యనునది మొదలియారుల తెగకు పర్యాయము. అందునను గర్లక తెగకు మాత్రమే యది వర్తించుచున్నది. అంతియకాక, యీశతకములో కవి యుపయోగించిన కొన్ని శబ్దములనుబట్టియు, నూళ్ల పేరులనుబట్టియు నితఁడు దాక్షిణాత్యాంధ్రుఁ డనునది స్పష్టము. "దుర్భాక యను నింటిపేరు వైదిక ములకనాఁటి శాఖలో నున్నది. ("దుర్భాక రాజశేఖర శతావధాని యీశాఖకు చెందినవాఁడే).

ఈ వారాంగనా ప్రవర్తనమనుకృతికి శతకమను పేరు కవి పెట్టకున్నను నిందు 108 చంపకోత్పలమత్తేభ శార్దూల వృత్తము లున్నందువలనను, పద్యములలోఁ బెక్కింటికి "వారకామినుల్" "అంగనల్" అను మకుటము లున్నందువలనను, నేపద్యమున కాపద్యము ప్రత్యేక భావ స్ఫోరకముగా రచింపఁబడినందువలనను నిది శతకవాఙ్మయము క్రిందికే వచ్చును.

"వరలక్ష్మీవ్రత మాచరింపవలయుఁ బర్వానికీనాటికే
కరణిందెత్తువో ?, గజ్జె, లడ్డిగలు నాగ్గాపుల్, మహాపేర్మితో
మిరియాల్దండ, గతాణిగుండ్లు బుగడల్ మెట్టెల్, మొగ్రలేసు, నా
గరు, జూన్పావులు కాళ్ళగొల్సులివి చాల్, కాని, మిమ్మటీసారకిన్"

"మూలన్నున్న ధనమ్ముఁ జూడ రెవరుఁ మోహింపఁ జేయించితే,
తాలూకాల్, జడసాదు, మేటిమురుగుల్, దళ్కొందు కీఁ బాపి[illegible]
రాలంగూడినకమ్మ, లొంకరకడేల్, రాగిల్లుపిల్లాండు, పో
చీలుం, గోదుమపూస, లొంకులును పాంజేలర్ధచంద్రంపు ఫు
స్సీలుం, బొబ్బిడికాయలుం, గరముల స్సీలంపు కీల్గాజులున్"

"కాసులదండ, రేఖణియు, గజ్జలడాబు హుజూరుబావిలీల్,
బేసరి, పచ్చరాల్, నొసటఁ బెట్టెడిపాపటబొట్టు, నత్తు, కా
ళ్కై సెడిగొల్సు, పింపిణిరహించెడి గువ్వలబావిలీలు, రా
ళ్లేసినబాజుబందు, లెఱుపెచ్చిన కత్తెరబావిలీలునుఁ"

"నాగొత్తుల్, జడకుచ్చు, లాణిమెటియల్ నాకెంపు గిర్గాజులుఁ,
బాగాబిళ్లలు, చేమపూలకడియాల్, బంగారు తోడాలునుఁ
రాగిల్చేపపిలేండ్లు, ముత్యముల హార, మ్మద్దపుంబావిలీల్
బీగంచెవ్వులగొల్సుఁ గాటుకపుడబ్బి, ల్చంద్రహారమ్ములుఁ"

ఈక్రిందివి నానారకాల కోకలు :—

"కలశము బెట్టఁగావలయుఁ, గాశిబనారసు పట్టుచీరెయుఁ,
తోలకరిగన్ను, లాదవన తోఁపుగులా, లవిసానుపట్టెలుఁ,
వెలుపగు నామధారిజరి వేసిన కాటుకగండ్లు, చింతపి
చ్చెలును, పరంగిశార్ఖనియు, చీరలు దె, మ్మిపుడింతెచాలనుఁ"

"'గుడియాతమ్మ' పురాణి పైట్లిపయిటేఁ 'గూడూరు' కొర్ణాటక
మ్మొద్దుసుంబోని 'కోయంబుతూరు' నగరీ యుప్పాళము, న్నల్లపూల్,
పిడికిట్లోనిడి తెల్లపూలు, 'మధురఁ' జేరైన 'తంజాపురిఁ'
పాడవొకుంకుమరంగుచీర, లివితే, పోనివ్వనుమ్మానినుఁ"

"కనకన్నాగులు వంగపండు పసుపుం 'గద్వాల' శార్ఖాణి దు
ప్పైనకడ్డిఁ, పుటలమ్మ సళ్లబువులుఁ వింతౌ పగడ్సాలయుఁ,
మొనయఠామల్లు 'బళారి' లుంగి జలతార్మత్యాల పందిళ్లమేల్
ఘనచెంగావి పసందుకోకయును, గంగా సారెపుంజీరలుఁ"

"'వేలూ' ర్యూదకునుంబచిందిని, 'పులంపేట' స్గలీపువ్వులుఁ
'మాలూ' ర్చుక్కవిభూతి పట్టెలగరీ 'మళ్యాలపుం' బామిడీ
మేలింద్రాణియు, నానెపప్పళిజరీ 'మీనాపురీ'—'యారణీ'
బాశేపట్టెల మల్లెమొగ్గవలంవల్ పంపంగదే—చీరలఁ"

సుగంధద్రవ్య ప్రశంస చూతము :—

"డెంబే, ల్బాజి, సొహాగ్మసాలలు, హిరాణ్ చేమంతి, రోజా మొగల్,
అంబర్, మేల్లిఘనమ్ము లాదిమజమా యత్తర్లు, బత్తీలునున్
గంబూరాపౌడి, పచ్చిబిళ్లపురుఁగుం, గస్తూరి, జవ్వాజినా
ఘుంబంపించవె, పన్నికప్పుగము, సంకోచింపకే వేగమే"—

"నాచన వేయఁగావలయుఁ, దల్లికిఁదండ్రికిఁ జీరవోవతుల్,
నా చెలికొక్కకోక, మఱి నాకు పదేనువరాల చీరయున్,
నీ చెయిముట్టి కట్టవలె నిక్కము, బంగరుతాళిబొట్టు, నే
నాఁచఁగ నేల ? మెట్టెలు తప్పక తేవలె, నందురంగనల్"

"బందుగులందఱిం బిలిచి, భక్ష్యములం దగు విందు చేసి, నీ
ముందర 'నాచు' చేయవలె ముద్దియలందఱు నాడఁగావలెన్
ఎందును జూడకీవు తలనెత్తవు నామదికోర్కెనిల్వ, దే
మందును పాడుబుద్ధినని యందురు వేశ్యలు విత్తముంగొనన్"

ఈక్రింది వెంతజుగుస్సాకరములో, అశ్లీలతాపూర్ణములో గమనింపుడు :—

"ఉసికొట్టుం, గుసిలించు, పల్లఱచు, గండ్లొక్కింత ద్రాల్చేసి, నన్
విసుగంజేయక, మోవినిమ్మను, తొడల్విచ్చున్, స్తనాగ్రమ్ములం
బిసుకన్ వేడును, మూర్ఛిలింగమును సంప్రీతిన్ భగంబాదిడున్,
బుసగొట్టున్, రతిఁగూజితమ్ము డుమరా పూబోండ్లు సంసర్గతన్"

మొత్తమున కీ శతకములోఁ గవి తాను స్వయముగా వేశ్యాలోలుఁడై యనుభవించిన మేలుకీళ్లను విస్పష్టము చేయుటవలన లోకమును బాగుపఱచ నెంచినట్లు కనఁబడుచున్నది.



# అయ్యానకోట పార్థసారథికవి

క్రీ॥ శ॥ 1850—60 ప్రాంతము.

ఈ కవి ప్రణీతమగు "కుమారశతకము"—వావిళ్ల వారి నీతి శతకసంపుటమునఁ గలదు. దానికి పీఠికారచయితలగు శేషాద్రిరమణ కవులు ఈకవింగూర్చి యిట్లు తెలిపియున్నారు:—

"ఈశతకము, రచయిత యగు ఐయ్యాన కోట పార్థసారథి శెట్టి తన యుత్తర వయస్సులో వ్రాసి సొంతముగ ముద్రించెను. కవి రమా రమి పదిసంవత్సరములక్రిందట నెల్లూరున మరణించెను."

ఈ పీఠికావాక్యములు 1-8-1928 న వ్రాయఁబడినవి. అగుచో నందు సూచింపఁబడిన "యుత్తరవయస్సు"—50–60 సంవత్సరముల నడిమి ప్రాయము గావచ్చును. కాన శతకరచన కాలమునకుఁ దరు వాతఁగూడ నతడు ఐదారేండ్లు జీవించి, శేషాద్రిరమణకవులు చెప్పి నట్లు 1928 సం॥రమునకు రమారమి 10 వత్సరములక్రిందట మరణించి యుండినచోఁ బదునెనిమిదవ శతాబ్ద మధ్యమున నతఁడు జన్మించి యుం డుననుటలోఁ బ్రత్యవాయ మేమియు లేదు.

ఈకవి తన్నుఁగూర్చి శతకము కడపటి పద్యమున నిట్లు వ్రా సెను:—

> "ధరణిఁ గులాలుఁడు, కవి కుంజరుఁ డయ్యానకోట పార్థసారథి నీకున్
> వరవిద్య బుద్ధి యేర్పడ విరచించెను గందశతము వెలయఁ గుమారా!"

ఇతఁ డీశతకమునేకాక సత్యవిజయమను నామాంతరముగల "శుద్ధాంధ్ర హరిశ్చంద్రచరిత్రము"నుగూడ రచియించెను. అయ్యది కళాశాలలలోఁ బఠనీయ గ్రంథముగఁగూడ నిర్ణయింపఁబడి ప్రసిద్ధి కెక్కినది.

ఈ కుమారశతకమున 112 కందపద్యములు గలవు. "కుమారా" యను మకుటముతో నవి యొప్పుచున్నవి. పద్యములన్నియు లలిత మృదు మధుర శైలిలోఁ బిన్నలకు సులభగ్రాహ్యములగు పదసముదాయ ములతో నలరారుచున్నవి. ఇందలి యొక్కొక్కపద్య మొక్కొక్క రత్న మనఁజెల్లును. పసితనమునఁ బిల్లవాండ్రలవఱచుకొనవలసిన సుగుణములఁగూర్చియు, విసర్జింపవలసిన దుర్గుణములఁగూర్చియు—ఈ

# దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి

క్రీ॥ శ॥ 1853 ప్రాంతము.

జగజ్జేగీయమాన విద్వత్కవితా ప్రతిభలచేతఁ దమకీర్తిలతను దిగ్దిగంతములఁ బ్రాకించిన దేవులపల్లి సోదరకవు లనఁబడువారిలో జ్యేష్ఠుఁడు ఈసుబ్బరాయశాస్త్రి. కనిష్ఠుఁడు వేంకటకృష్ణశాస్త్రి యనఁబడు తమ్మయ్యశాస్త్రి. సౌభ్రాత్రమున రామలక్ష్మణులు. సాహిత్యాసములోఁ గుశలవులు. ఇందులోఁ బాండిత్యమునకుఁ బ్రథమపీఠము మొదటివారిది కాఁగాఁ గవిత్వమునకు నగ్రతాంబూలము రెండవవారిది. అని యానాఁటి వీరి యాశుకవితావధాన విశేషములఁ గనులారఁ గని, వీనులారవిన్న రసికప్రకాండుల యేకగ్రీవాభిప్రాయము.

వంశానుపూర్వముగా పాండిత్యకవిత్వములు జిరాయితీహక్కుభుక్తములయి వీరి నాశ్లేషించినవి. లబ్ధప్రతిష్ఠులైన యీకవిద్వయమునుగూర్చి (పందొమ్మిదవ శతాబ్దమునుండి వాఙ్మయపరిణామములను గూర్చి వివరింపఁ బూనుకొనిన) "సాహిత్యవీథుల"లో నొక్కముక్కయయిన పేర్కొనకపోవుట దురదృష్టము. కాని, ఆగ్రంథము మూఁడవ భాగములో దేవులపల్లి కృష్ణశాస్త్రినిగూర్చి వ్రాసిన వాక్యములలోనైన వారితండ్రులైన యీసుబ్బరాయ వేంకటకృష్ణశాస్త్రిల విషయము కొంచెము స్పృశించియుండిన బాగుగ నుండును. "ఆంధ్రరచయితలు" మాత్రము ఈసోదరకవులనుగూర్చి నాలుగైదుపుటలలో వివరించి తన ధర్మమును నెఱవేర్చుకొనినందుల కభినందించుచున్నాను.

ఈ సుబ్బరాయశాస్త్రి కృతమయిన "మహేంద్రవిజయ"మను కావ్యము ముద్రితప్రతి 30 ఏండ్ల క్రిందట నాకు దొరికినది. సాహిత్యోపాస నాకాగ్రంథము తుదముట్టు చదువువఱకుఁ దీరినదికాదు. అంతకుముం దాంధ్రగీర్వాణకావ్యములను ఎన్నిటినో చదివి జీర్ణించుకొని, వాని ప్రాచీన లక్షణానుసరణైకమార్గములలో విసుగెత్తి, మొగము మొత్తిన నాపాలిటి కది యపూర్వ పెన్నిధానమైనది. అనవసరమైన యుత్ప్రేక్షలతోఁ జీదర పుట్టింపక యొక క్రొత్తబాటలో పడి సహజవర్ణనలతో ననుకొనకుండఁ దమంత వచ్చి వ్రాలిన యుచిత శబ్దాలంకారములతో, తెలుఁగునాటి జాతీయతా స్ఫోరకములయిన పలుకుబడులతో నాకది

యొక క్రొత్త ప్రపంచమును ప్రదర్శించు మహాకావ్యముగా దోచినది. ప్రాంతజనిత సంకల్పవీధులలో విహరించు పుష్పకవిమానము కాదది. ఆరితేరిన పైలట్ నడపు పటువైన యంత్రసన్నద్ధము, అడ్డమాంకులు లేక, సాఫీగా జరజర పరిగిన కదలిపోవు "ఏరోప్లేను". ఆ గ్రంథ మెవరో సంగ్రహించినారు. మరల దానికొఱకు ఎంత ప్రయత్నించినను లభించి నదికాదు. మొన్నను మిత్రుడగు చిరంజీవి. యం. యస్. శాస్త్రిగారు 1950 వ సం॥రములో శ్రీపిఠాపురము మహారాజావారు ముద్రింపించి ప్రచురించిన "మహేంద్రవిజయ" ప్రతి నీయగా నష్టధనపునర్లబ్ధిచే నెంత సంతోషము కలుగునో యంత సంతోషము కలిగినది. అందులో కవిజీవితము పీఠిక సమగ్రముగా నుండుటవలన నీకవిని గూర్చి పూర్తిగా దెలిసి కొనుట కనువగుచున్నది.

దేవులపల్లి వారిది విద్వద్వంశమని యిదివఱకే చెప్పియున్నాను కదా! వీరి వంశీయులు క్రీ॥ శ॥ 1598 సం॥రము ముందునుండి శ్రీపీఠికాపుర రాజాస్థానములో నప్పటి రావు తెనుంగురాయల యాదరణకు పాత్రులుగా నుండుచు వచ్చినట్లు తెలియుచున్నది. ఈవంశములోని రామరాయశాస్త్రులు అను నతడు విజయనగర సంస్థానాధీశ్వరు లయిన విజయరామరాజుగారి యనుగ్రహమువలన "వెలగవాడ" యను నగ్రహారమును సంపాదించినాడు. తరువాత బ్రహ్మనశాస్త్రి యనునతడు పిఠాపురము రాజాగారి మీద సంస్కృతములో తారావళి వ్రాసి వారిని (శ్రీమహీపతి రాయనింగారి) వలన 'పగర్తిను' పాకములో మాన్యక్షేత్రములు సంపాదించినాడు. మొదట పేర్కొనబడిన రామారాయశాస్త్రి మనుమడైన రామశాస్త్రి రామచంద్రోదయము, సాహితీదర్పణము, బాలభాగవతవ్యాఖ్యానము మొదలైనవి రచించి యిప్పటి రాజాగారి ప్రపితామహులు నీలాద్రిరాయనింగారిచే "సాహిత్య చక్రవర్తి" బిరుదము నందినాడు. ఇతని తమ్ముడైన కృష్ణశాస్త్రి విశ్వగుణాదర్శవ్యాఖ్యానము, తర్కసారము, సాహితీసారము మున్నగు గ్రంథములకర్త. ఈవిధముగా నీవంశీయులందఱు గీర్వాణాంధ్రభాషలలో దిగ్దంతులు.

ప్రకృత మీసుబ్బరాయశాస్త్రి క్రీ॥ శ॥ 1853 వ సం॥ జనవరి 21 వ తేదీకి సరియైన పరీధావినామ సం॥రము పుష్య శు॥ ౧౩లు స్థిర

వారమున జన్మించినాఁడు. ఇతని వంశస్థులు నివసించిన గ్రామము శాస్త్రి వారిచంద్రమపాలెము. (కూచిమంచికవులకుఁగూడ నిదియె వాసస్థలము) ఇతఁడు తెలంగాణ వైదిక బ్రాహ్మణ శాఖకుఁ జెందినవాఁడు. కౌండిన్యస గోత్రుఁడు. తండ్రి వేంకటకృష్ణశాస్త్రి. తల్లి వేంకమాంబ. ఇతని తమ్ముఁడే తమ్మన యనఁబడు వేంకటకృష్ణశాస్త్రి. ఇతఁడు తన తాతయు యిన సీతారామశాస్త్రిలయొద్ద కాళిదాసత్రయము చదివినాఁడు. తరు వాత తండ్రియొద్ద నైషధము, కావ్యద్వయము, అలంకారశాస్త్రము, నాటకములు, సిద్ధాంతకౌముది, తర్కప్రకరణము, నభ్యసించినాఁడు. స్వయముగా నాంధ్ర ప్రబంధపఠనము చేసినాఁడు. చిన్నప్పు డితఁడు కూచిమంచి వేంకటరాయకవిగారి యొద్ద నాంధ్రకావ్యములు చక్కఁగాఁ జదువుకొనినాఁడు. అట్టి విద్యార్థిదశలోనే యితఁడు సంస్కృతములో "రామపంచాశత్తు" అను స్తోత్రగ్రంథము వ్రాసినాఁడు. ఇతఁడువ్రాసిన గ్రంథములు :— (1) శ్రీరామపంచాశత్తు (1875) అముద్రితము. (2) మందేశ్వరశతకము (1879) అముద్రితము. (3) శ్రీరావువంశముక్తా వళి—అముద్రితము. (4) మల్హాణస్తవము (1882—ఆంధ్రీకరణము) (5) కుమారశతకము (ఆంధ్రీకరణము), (6) కుమారశతకవ్యాఖ్య, (7) మహేంద్రవిజయము (ప్రబంధము), (8) రామరాయవిలాసము.

వీరి పాండిత్యప్రతిభలనుగూర్చి "మహేంద్రవిజయము" లోని కవి జీవితమందలి వాక్యములనే యిక్కడ పొందుపఱతును :—

"వీరి కమరము కాండత్రయము కంఠస్థంబులు విశ్వనానార్థరత్న మాలాది నిఘంటువులు వచోవిధేయంబులు. వీరు పరిశీలించిన సంస్కృ తాంధ్రకావ్య నాటక ప్రబంధంబులనేకంబులు. వీరి నెద్దియేని నొక యుదాహరణంబు గోరఁ బుస్తకభాండాగారం బనఁదగు వీరి రసనాంగ ణంబువలన నుండి వేనవేలు పద్యంబులు, శ్లోకంబులు ప్రసరించు. వీరి గ్రహణధారణాశక్తి యత్యద్భుతంబు."

పిఠాపురమున కిప్పటి మహారాజాగారి జనకులు శ్రీగంగాధర రామారాయనింగారు, తమవంశచరిత్రమును శ్రీసుబ్బరాయశాస్త్రిని సంస్కృతమున వ్రాయ వేడుటయు, నతఁ డట్లుచేయఁగా 1882 వ సం॥న దానిని కృతినంది యందలి యత్యద్భుత కవితాశిల్పమున కనల్ప సంతోషమున నుప్పొంగి, యిందులకు "మిమ్మెట్లు సత్కరింపఁగలను ?

నా రాజ్యమే మీ కిచ్చితి" నని తమ సింహాసనమున నధివసింపఁ జేసెను. తత్క్షణమే యీకవి, "నాకిదియేల! పరిపాలించు సామర్థ్యము మీరు సహించునట్లు మేము సహింపఁగలమా? 'కవితా యద్యస్తి రాజ్యేనకిం' మ్మనుట మీ రెఱుఁగరా? మాకిఁక రాజ్యమేల? య నెనఁట!

ఇప్పటి మహారాజాగారు శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారికి సుబ్బరాయశాస్త్రి సంస్కృత సాహిత్య గురువు. ఈ రాజాగారు మైనరుగా నున్నప్పుడు ఇతని రాజ్యార్హతను గూర్చిన వ్యవహారములో నితనికి గెలుపు కలిగినప్పుడు సుబ్బరాయశాస్త్రికి కలిగిన యానందమునకు మేరలేదు. ఆవార్త తొలుదొల్త తనకుఁ దెలిపిన రాజభృత్యుని కీకవి తన చేతితోడా తీసి బహుమతిగ నిచ్చెనఁట!

అతని ప్రభుభక్తిపరాయణత యట్టిది. రాజతనియందుఁ జూపిన గౌరవాదరాభిమానము లట్టివి. శ్రీగంగాధర రామరాయనింగారు (తనపోషక ప్రభువు) మృతి చెందినపు డీతఁ డెంత నిర్వేదించెనో యీక్రింది పద్యమువలనఁ దెలియఁగలదు :—

"శతలేఖినీపద్య సంధానమునకై, మాయిల్లు టంకము సెయ్యాయఁ బలికె
నెలమి సంభావనఁ గృతిఁగాంచి సంశయంబు చిగురింప సనము హర్షించి వాగదేఁ
బృగులసింహాసనం బెక్కించి రాజ్యంబు నీదే యటంటు నర్మిలి నొసంగెఁ
గౌమరు విద్యాభ్యాస గోష్ఠిఁ జిరంజీవి మీఁకిష్యుఁడంచుఁ బేర్మి నచించెఁ
బ్రఖ్యాతి దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి యస్మదాస్థాన విద్వాంసుఁ డనుచుఁ బిలిచె
నట్టి శ్రీరావుగారు సూర్యాంశనాథు నాకసున కెప్డైన నేమందు, నకట!"

మహేంద్రవిజయములో నీకవి తన్నుఁగూర్చి యీవిధముగాఁ జెప్పుకొనినాఁడు :—

సీ॥ హితపండితులఁ గూడి శతలేఖినీపద్య నిర్మాణచాతురిఁ గ్రమ్మ నెరసి,
నిజవంశ ముక్తావళి జయంబు వినుతింప గీర్వాణభాషను గృతిగ్రహించి,
యాశ్చర్యకర విధా నాష్టావధాన వినోద కేళులఁ గడు మోదమంది,
యభిమత బహుపురాణార్థ సంస్థిత కుంభ దాసుధారా శీల లాలకించి,
కల్పితానన్య సామాన్య గౌరవమునఁ బ్రేమ రావు గంగాధర రామరాయ
భూమివరమణి సానుజన్ముని గనెపుడు మించుకృపఁ జూచె విఖ్యాతిఁ గాంచినాఁడ"

ఉ॥ "సాధుజనావన ప్రవణ శస్తయశస్స్తవనీయ రావు గం
గాధర రామరాయ నృపగౌరవపూర్వక దత్త సింహపీ

తే ధనరత్న భూషణపటీ ప్రకటీకృత కావ్యకల్పనా
సాధనుఁడం, దదాత్మభవ సంస్కృత దేశికతా ప్రసిద్ధుఁడన్"
క|| శ్రీమద్రఘురామప్రభు నామస్మృతి పాదపూజనవ్రత ముఖ నీ
క్షామతిఁ జంద్రమపాలె గ్రామనివాసుండ సుబ్బరాయాహ్వయుఁడన్||"

ఇతఁడు అత్యంత రామభక్తుఁడు :—

ఉ|| "వేలుపు రాఘవుండు పదివేల పురాణము లన్యు లెన్న నీ
యేలిక లెన్న రావుకులు లెప్పటి వారల కప్పడొప్ప, భూ
పాళి నిజంబుగాఁ దనకిటంచును దేవులపల్లి వంశ భూ
పాళి దలంచుచుండుఁ దనపాలికి కీయుభయంబె ప్రాపుగన్||"

ఇఁక నీశాస్త్రివర్యుఁడు వ్రాసిన గ్రంథములలో శతక మను పేరితో రెండు గ్రంథము లగపడుచున్నవి. అందులో స్వతంత్రముగా వ్రాసిన యముద్రిత "మందేశ్వరశతకము" నీతిబోధక మయినది. ఇం దులోనిది మత్తేభశార్దూలవృత్తాలు. "మందేశ్వరా" యనునది మకు టము. ఇఁక రెండవది కుమారశతకము. ఇది నూరు (అనుష్టుప్పు) శ్లోక ములు కల సంస్కృత కృతి కనువాదము. ఈకవి యౌచిత్యమును చాల చక్కఁగా పాటించుచుండెవాఁడు. అందుచేత ననువాదము చేయు నప్పుడు కొందఱివలె చిన్న శ్లోకములకుఁ గూడ వృత్తములు వ్రాయుచు వ్యర్థపదములతో—ఊఁతగఱ్ఱలతో కొండవీటి చేదత్రాళ్లవలె పద్యము లను సాగనీయక అన్వయము నడుగున కణఁగద్రొక్కి పాడుచేయక, ధారాళముగా, కందములలో, గీతములలో రసవంతముగా ననువదించి నాఁడు. మూలములో మకుటము లేదు. కాని తెలుఁగు పద్యములచివర "కుమార" శబ్దమును మకుటముగా నాంధ్రీకర్త నిలిపినాఁడు. ఈరెండు శతకములు నాకు లభింపలేదు. కనక సంపూర్ణ పరిశోధన కవకాశము లేక పోయినది. ఈక్రిందివి మహేంద్రవిజయ పీఠికలో మచ్చునకు చూపఁబడి నవి. ప్రకృతము వానితోడనే సంతృప్తి పొందుదము :—

మందేశ్వరశతకము :—

"రాజుల్ భోజులవంటివారొదవ, నారా! కాళిదాసోపమ
శ్రీజాగ్రత్కవిరాజులుం గలరిలన్, శ్రీరామచంద్రోపముల్
క్ష్మాజానుల్గలరేని, వాయుజనిభు ల్దాసుల్గలారేల ? యీ
రోజుల్ పిండికొలంది నిప్పటియుఁగా నూహింప మందేశ్వరా"

"వినయంబే సుగుణంబగుం, బరులకున్ ప్రేమంబు పుట్టించి, లా
లనముం బొందును, మెప్పుచేర్చి బహుధాలాభంబునుం బొందు, భ

క్తిని పంధించి సుమస్ఫలంగొనుచు ప్రీతిన్నించి మేలంద నో
పు, సాయుజ్యాన జగానఁ దాదృశగుణాబ్జుంగాన, మందేశ్వరా !"

**కుమారశతకము :— (శ్లోకములతో)**

శ్లో|| "మంత్రి కాలం వినాప్యస్య ! జనసేవ్యస్థ లేవస
యతః కుమార త్వాం ద్రష్టుం మాయాంత్యర్థార్థినో జనాః"

సీ|| మంత్రిని మొనసి చెప్పను మాని యితర వేళలందెల్ల జనులు సేవించుచోటఁ
గొలువ వచ్చు కర్ణముల్ దెలిపికొనఁగ జనము నినుఁజూడవచ్చుఁ గావునఁ గుమార"

శ్లో|| మా మానం ధిజ మాలస్యం, మాలక్ష్యం మా ప్రలాపితం
త్వం కుమారాగతాన్ పశ్యన్ పూర్వాభాషీ ప్రియంవద"

క|| మానంబూనకు, కులసతఁబూనకు, ప్రల్లదనములాడఁబూనక, కలక్ష్యం
బూనకు, ప్రజగాంచిన, హితవాక్యంబుల మున్నె పలుకుమయ్య, కుమారా"

మఱి యీసుబ్బరాయశాస్త్రి వ్రాసిన మల్హణస్తవముకూడ శతకమేమో! తెలియవచ్చుట లేదు. ఏది యెట్లయినను "మందేశ్వర శతకము" ఈ కవి స్వతంత్రరచన కనుక నది వెలువడుట ముఖ్యము.

---

ఇతని తమ్ముఁడయిన శ్రీతమ్మయ్యశాస్త్రి శతకమునుగూర్చి వ్రాయుట మను నూహతో, వారికుమారులు శ్రీకృష్ణశాస్త్రిగారికి లేఖలు వ్రాసియు సముక్షమున నడిగియు నాశాభంగ మొందవలసివచ్చినది.



# వడ్డాది సుబ్బరాయకవి

క్రీ॥ శ॥ 1854—1938.

పావన గౌతమీతీరస్థ పట్టణము లెన్ని లేవు? కాని రాజమహేంద్రనగరమునకు వచ్చిన ప్రఖ్యాతి తక్కినవానికి రాలేదేల? రాజరాజనరేంద్రునినాఁటి నుండి విద్యాపీఠముగా, కవితారంగముగా విబుధావాసముగా నది తెలుఁగు దేశమాతయొక్క ముత్యాలహారమందలి మణిప్రాసవలె నేఁటివఱకుఁ బ్రకాశించుచునేయున్నది. సామ్రాజ్యము చితికిపోకుండిన, బహుశా యట్టి ప్రశస్తి, పశ్చిమాంధ్రములోని తుంగభద్రాస్రవంతీ తీరమున దేదీప్యమానముగా వెలిఁగిన, విజయనగరమునకుఁగూడఁ గలిగియుండునేమో? ఒక్కొక్కప్పుడు స్థానబలమును కాలబలము, కాలముబలమును స్థానబలము మించుచుండును. ఈసందర్భమున విజయనగరమును కాలబలము కబళింపఁగా, రాజమహేంద్రవరమును స్థానబలము మించి పేరుపెంచినది.

ప్రసక్తానుప్రసక్తముగాఁ జెప్పిన పైవిషయమును వీరేశలింగకవికాలమునుండి తీసికొని పరామర్శించు సాహిత్యచరిత్రకారులకు నిశ్చయముని ఋజువు కాకపోదు. నాఁటికి, నేఁటికిఁగూడ దిగ్దంతులవంటి పండితులు, ఉద్దండులయిన కవులుం అక్కడ పుట్టిరి. పుట్టుచున్నారు. పుట్టఁగలరు. అట్టివారిలో 19-20 శతాబ్దముల సంధికాలములో జీవించి, వాఙ్మయసేవయే జన్మసాఫల్యముగా భావించి, దాని యున్నతికొఱకుఁ బాటుపడ్డ మహనీయులలో వడ్డాది సుబ్బరాయకవి యొక ప్రత్యేకస్థానమనుట సర్వాంధ్ర విద్వత్సమ్మతమైన వాక్యము.

ఇతఁడు 30-7-1854 (ఆనందనామసంవత్సరము శ్రావణ శుద్ధ పంచమీ ఆదివారము) నగరము తాలూకా పాసెర్లపూడి గ్రామములో సూరపరాజు లచ్చాంబలకు జన్మించినాఁడు. హారితసగోత్రుఁడు. నియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. ఈతఁడు తన బాల్యదశను గూర్చి యీక్రిందిపద్యములో వివరించినాఁడు.

"గౌతమిఁగట్టి కాలువలు "కాటను" త్రవ్వినకాలమందె సం
భూతుఁడనైనవాఁడఁ బదుమూఁడగు నేఁడుల యీడు తల్లికిన్;
మాతకు లేమిఁ బా, లచట మంటిని మోసెడి యొప్పరమ్మ లే
ప్రీతిని నన్నుఁ జన్గుడిపి పెంచిరఁ, లేమి ఋణానుబంధమో"

తన శైశవ మారీతిగా వెళ్ళబుచ్చిన సుబ్బరాయకవి కాపేరు కలుగుటకును—బహులిపు పాలతో బ్రదుకుటకును, నతని జన్మవాసరమే కారణమేమో! అది గరుడపంచమిగదా! పైగా 84 ఏండ్లప్రాయము వఱకు నతఁడు జీవించినాఁడను "పడియుండదే పేర్మి పాము పదినూరేండ్లు"—అనుసూక్తికూడ నిజమనిపించును. ఇఁక సర్పసంతానమల్పాయువనుటకూడ నితనిజీవితమున కన్వర్థమయినది. దాని విధముగనే యనునిమేష విపద్వ్యథలతో జీవితము సాగించినాఁడుగదా ఆమహానుభావుఁడు. ఏదెట్లయినను, ఆయనంతాదులవలెనే—ఆత్మాభిమానము, విబుధప్రీతి—శేషి, హలుందా, దర్జా—గల కారణజన్ముఁడాతఁడు. ఆదిశేషునివలె సహస్రముఖుఁడు. కాఁడన్నచో నతనికృతులలో సహస్రాధికముగా రసగుళికలవంటివి, అమృతతుందిలములయిన పద్యములెట్లు రచింపఁగలఁడు? సర్పదంష్ట్రలు గరళపూరితములైనఁ గావచ్చును. జిహ్వాంచలములఁ దేనెలొలుకునని యమానుషప్రజ్ఞానిధుల భావన. అతఁడు ద్విజిహ్వుఁడు కాఁడు. ద్విసహస్రజిహ్వుని యపరావతారము. ఉత్తిపిశునుఁడు గాఁడు. కుటిలుఁడంతకు ముందే కాఁడు.

సుబ్బరాయకవి కోరంగిలోఁ దన పదునొకండేండ్లవఱకుండి, తరువాత దొడ్డమ్మపేఁట దివానుగారి పోషణతో నక్కడ విద్యాభ్యాసము చేసినాఁడు. అక్కడికి సమీపములోని "భీమక్రోశపాలెము"లోని శ్రీహరిశాస్త్రిలను వైయాకరణపండితునియొద్ద లక్ష్యలక్షణయుక్తముగా గట్టిసాహిత్యము నేకదీక్షగా సాధించినాఁడు. అప్పటి కితఁడు పదమూఁడేండ్లవాఁడు.

ఇతఁడు దొడ్డమ్మపేఁటలో నున్నప్పుడే పందొమ్మిదవయేఁడు (శ్రీముఖ సం॥రమున) మొదటి వివాహముజరుగుట, భార్యగతించుట సంభవించినది. ఆవెనుక రాజమహేంద్రవరము చేరి యక్కడి కళాశాలలో నధ్యాపకత్వమును బొంది, దానిని కడుసమర్థతతో నిర్వహించినాఁడు. బోధన విషయములో అతని నేర్పు ఎవరికో కొలఁదిమందికి మాత్రమే యుండిన నుండవచ్చును. ఆయనకడ తయారైనవారికి బోధనాంశములలో నేమాత్రము సందేహముండునది కాదని ప్రతీతి.

ఇతనియొద్ద సర్. కె. వి. రెడ్డి నాయుఁడువంటి యున్నతికివచ్చిన వ్యక్తులనేకులు తరిబీతు పొందిరి. కాని యాత్మగౌరవమును బాటించువారిలో

సద్గ్రంథకర్త యగు సుబ్బరాయకవి, తన గురుస్థానఘనతను కాపాడు కొను దృష్టి గలవాఁడగుటచే శిష్యు లెంత యుత్కృష్టపదవియందున్నను వారి నెన్నఁడును స్వార్థమునకయి యాశ్రయించినవాఁడు కాఁడు. నిరాడంబరమగు జీవనము, మితభాషిత్వము అతని సహజాలంకారములు. పరగుణగ్రహణ పరాయణత్వము ఇతరులలో నెన్ని దుర్గుణములున్నను జూచియుఁ జూడన ట్లుండుట, అతనిలోని విశిష్టత. అతని పాండిత్యమునకు వన్నె పెట్టు వినయ మాతని సొమ్ము.

సుబ్బరాయని కృత కావ్యములు :—

(1) ప్రబోధచంద్రోదయము, (2) ఆంధ్ర వేణీసంహారము, (3) అభిజ్ఞానశాకుంతలము, (4) మల్లికామారుతము, (5) విక్రమోర్వశీయము, (6) చండకౌశికనాటకము, (7) నృసింహవిశ్వరూపము, (8) గౌతమీజల మహిమానువర్ణనము, (9) భక్తచింతామణి, (10) ఆర్తరక్షామణి, (11) మేఘ సందేశము, (12) నందనందన శతకము, (13) సతీ స్మృతి, (14) సుత స్మృతి, (15) వసురాయ చాటూక్తి ముక్తావళి, (16) శ్రీసూక్తి వసుప్రకాశము, (17) సుగుణ ప్రదర్శనము, (18) సుమనోమనోజ్ఞము, (19) సూర్యశతకము, (20) భామినీవిలాసము, (21) భగవత్కీర్తనలు (22) కుందమాల.

వీనిలో "వేణీసంహారము" (అనువాదము) ప్రసిద్ధికెక్కినది. ఈ నాటకము ఆంధ్రదేశమందలి నాటకరంగములలోఁ బెక్కుతడవలు సుప్రసిద్ధులగు నటులచేఁ బ్రదర్శింపఁబడి పెపాసనిపిం చుకొనినది. వసురాయకవియే నాటకకళాప్రియుఁడు. వేణీసంహారనాటకములో, ధర్మరాజుగా నాతఁడే నటించువాఁడు. రంగముమీఁద స్పష్టోచ్చారణతో నతఁడు పద్యములు చదువుచుండగా ప్రేక్షకులు తన్మయులగువారఁట! సంస్కృతములోని నాటకములన్నియు సశాస్త్రీయముగాఁ బ్రదర్శింపఁ బడవలయు ననుబలాటమే యాతఁడన్ని నాటకము లనువదించుటకుఁ గారణమైనది. కాని తక్కిననాటకముల నట్లుండనిచ్చి, వసురాయకవి స్మృతికి వచ్చినప్పుడంతెయుఁ బ్రత్యాంధ్రునికి నాతని వేణీసంహార నాటకమే మనస్సున మెదలుచుండును. అట్లని తక్కినవానిని కించపఱచుట కాదు. శిష్టమార్గములో నిర్దుష్టముగ సాగినవారి (అనువాద) నాటకములు

త్రనేకములు విశ్వవిద్యాలయమువారి సమాదరణము నందుకొని పట్టపరీక్షలకు పాఠ్యగ్రంథములైనవి.

అతని తక్కిన గ్రంథములలో పండితపామరు లాబాలగోపాల మాదరించు గ్రంథము "భక్తచింతామణి". వసురాయకవి యాస్తికతకే కాక, నిశితమైన ప్రకృతిపరిశీలనకు, నాధ్యాత్మిక దృష్టికి, వినూత్న భావములకు, నవ్యకవిత్వపు పోహళులకు నది యద్దమువలె మెఱయుచున్నది. నిజముగా యావదాంధ్రకీర్తిని ఆయనకు సంతరించి పెట్టినది యీభాగవత్స్తుతి పద్యరత్నసుకృతియే యనుట యతిశయోక్తి కాదు.

ఇఁకఁ దనజీవితములోఁ దటస్థించిన యొడుదుడుకులకు నికషాయమానములుగా నిలిచిన రచనలు "సతీస్మృతి, సుతస్మృతి" వంటివే కాక, వసురాయ చాటూక్తి ముక్తావళి వంటి యుద్గ్రంథములు కొన్ని భావి చరిత్రకారులకు చాల యుపకరించును.

ఈవిద్వత్కవితిలకుని కవితా వైఖరినిగూర్చి నాలుగుముక్కలు వ్రాసి ఆతనివాత నతనిశతకముల ముచ్చటకు వత్తము. ఇతనిగాంభీర్యము, సారళ్యము, ఋజుగమనము, సుగుణపుంజము, విశాలభావము మొదలగునవి యితని కవితాకుమారికి సంక్రమించినవి. ఉచ్చారణలోని విస్పష్టపదబంధము. వేషములోని చిక్కఁదనము, నడతలోని ధారాళగుణము, హృదయసంకల్పములోని పటుత్వము, అతని ప్రతిపద్యము గద్యము చాటకుండనే చాటుచున్నది. ఏరసమున కారసము పోషించుటలో మన సమకాలికులని చెప్పుకొని గర్వింపఁదగిన యుత్తమశ్రేణికిఁ జెందిన కవిసార్వభౌములలో నన్నయతరువాత రాజమహేంద్రవరములో వసురాయశేఖరుఁడు, తిక్కన తరువాత నెల్లూరిలో వేదము వేంకటరాయశాస్త్రి, పరిగణింపఁదగుదురని భావిచరిత్రకారుఁడు చిత్రింపకపోఁడు. (ఒక్కొక్కరి నొక్కొక్క పద్యమే యుద్దిష్టరసమును బోషించిన ఫక్కి కుదాహరణముగా నీక్రిందివి :—)

(భక్తిరసము : వసురాయకవి : భక్తచింతామణినుండి.)

కడగండ్లం బడుచిట్టు నీదయకు నేఁ గన్పెట్టుకొన్నాఁడ, నె
క్కడనున్నావొ? కృపాసముద్ర! మొఱ నీకర్ణంబులన్ సోఁకదో?
పెడకర్ణంబులఁ బెట్టెదో? వినివితిన్ వేసారితిన్, నోరఁగా
నుడ కిట్లార్చినఁ బ్రోవవేమిగతి? తండ్రీ! భక్తచింతామణీ!”

(శృంగారరసము :— వేదము వేంకటరాయశాస్త్రి : శాకుంతలము).

"బిత్తఱి వ్రేళ్లలో నధరబింబము మాటికిఁ జాటుసేయుచున్
ద త్తరమందుచున్ "వలదు తాళుఁడ" యన్ బ్రతిషేధవర్ణముల్
చిత్తము ముచ్చిలన్, బుజముఁ జేర్చిన నెమ్మొగ మెట్టకేని నే
నెత్తియు, నౌర ! ముద్దుగొనకే విడనాడితిఁ బక్ష్మలేక్షణన్"

ప్రకృతము వసురాయకవి శతకములు నాల్గిటిలోను (నందనందన శతకము—భక్తచింతామణి, ఆర్తరక్షామణి, శ్రీసూక్తివసుప్రకాశము) మూఁడవది తప్ప తక్కినవి దొరకినవి. దొరకినవానిని గూర్చి క్రింద సమీక్షింతును.

1. నందనందన శతకము :—

ఇది శతపద్య పరిమితమయినది. చంపకోత్పల వృత్తములలో వ్రాయఁబడినది. "నందనందనా" యనునది మకుటము. ఇది 1877 వ సం॥రములో రచితమయి 1878 వ సం॥రములో నొకసారియు 1911 సం॥రములో నొకసారియు ముద్రణభాగ్యము నందినది. ఇందులోఁ దక్కిన మూఁటిలోవలెకాక, కచ్చితముగా వందపద్యములును, కడపట స్వవిషయమును దెలుపు పద్యమును మొత్తము 101 పద్యములున్నవి.

శతకరచనా కారణమునుగూర్చి కవియే యుపోద్ఘాతములో నీ క్రింది విధముగాఁ జెప్పుకొనినాఁడు :—

"శ్రీమతి వార్నరుదొరసానిగారు స్త్రీలకౌషధము లిచ్చుచున్న (రాజమండ్రి) చిత్రపువారి మందిరమున స్థాపితమయిన చిన్నపాఠశాలలోఁ దెలుఁగు గఱపుట కొజ్జనుగాఁ బ్రవేశించి, పనిచేయుచుండఁగా, క్రీ. శ. 1877 వ సంవత్సరమున నాకు వ్యాధి పీడ సంభవించినది. అత్తఱి నారోగ్యము నొందుటకయి, యౌషధసేవకుఁదోడుగ భగవత్సేవకూడ నావశ్యకమని యాలోచించి, యాబాధలో "నందనందనా" — యను పావననామము నాహృదయమున కూఱటగాఁ దోఁచుటచేతఁ దన్నామమే మకుటముగా, నీశతకము రచించి, శీఘ్రముగ నుల్లాఘుఁడ నయితిని."—

దీనినిఁబట్టి యీకవి 1877 వ సంవత్సరములో ననఁగా దన 23 వ యేట యీ"నందనందనశతకము"ను రచించినాఁడనుట విస్పష్టమయి

గాన, స్వవిషయమునుగూర్చి తెలుపు (శతకములోని) కడపటి పద్యము గమనింపఁదగినది :—

“శ్రీదయిత ప్రసాదిత విశృంఖల సత్కవితావిభాసి — వ
డ్డాది మహాస్వనామయ సుఘూర్ణవ పూర్ణ సుధానిధాన వ్యా
ఖ్యాదినుత ప్రధాన విబుధావన సూరిపరాత్పరిధానవ
ఖ్యాదిమ సుబ్బరాయ సచివాఖ్య తనూజ కృతావపద్య స
ద్వ్యావళియన్ మిళింద మరియుంచుఁ డోముత శాశ్వతంబుగన్”

చిన్ననాఁడే, తనతలిదండ్రులు తన్నుఁ బాసి స్వర్గతులయినందునఁ దన పోషక జననీజనకులను నీక్రింది పద్యములోఁ గవి పేర్కొని తన కృతజ్ఞతఁ దెలుపుకొనినాఁడు :—

“శ్రీకర నాదశేషుకుల సింధుసుధాకర సుందరాఖ్య నా
మాకలన ప్రభూత సుగుణాయనయాధిక రంగనాయకాం
బా కరుణాకటాక్ష పరిపాలితుఁడైతిని, గన్నవారు నాఁ
డే కఱవౌట బాల్యమున, నీవిఁకఁ బ్రోవవె, నందనందనా”

ఈ శతకవిషయములో నితఁడు గూడ పూర్వకవులమార్గమునే యవలంబించినాఁడు. ఇందు మొదటి పదిపద్యములు నంత్యప్రాస నిబద్ధములు. మచ్చున కొక్కటి :—

“గుంజల స్రజకల్ప మాలసుతిస్వ ధనుర్జలజాది రేఖ ప
త్త్రకంజ ! సుకేళికా భవన దగ్ధను తామసి కూలమల్లికా
కుంజ ! పదద్వయీ మతిత ఘోరతిరాంగి భుజంగరాట్ప్రభా
పుంజ ! భవద్దయారసము పూరముఁ జిక్కవె, నందనందనా!”

శ్రీకృష్ణకర్ణామృతము శ్లోకమున కనువాదము గాఁబోలు దిగువ పద్యము :—

వరియమునాతటంబునఁ ద్రిభంగిగ నిల్చి, బొమలుక్కడించి, యొ
య్యనవుగ మోము వామభుజ సీమను జేర్చి, నిరంతరాంతరాం
తరచలితాంగుళీ చయ లతాంతముగా నొప్పఁగ, తానమాన సు
స్వనమున వేణువూఁదు నిను సన్నుతిఁ జేసెద నందనందనా !”

ఇట్టి యనువాదమే శ్రీకృష్ణకర్ణామృతములోనిది :—

“మూఁపున వామకుండలము మోవి నొకించుక మోడ్పు, నందముం
జూపెడు నోరచూపు, సొగసుంబొమ, నొక్కట నిక్కు గన్పడన్
వ్రేళ్ళులుసొక్కఁ గల్పకము క్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళీ
న్యాసపిత వంశపూర్తి యయి వచ్చిలు మోహనమూర్తిఁ గొల్చెదన్

ఈ క్రిందిపద్యమందలి యమకము—గమకము—నన్నయ పెద్ద నల పోకడలకు నకలుగా నున్నది:—

"మనసిది యేమి పాపము ? రమాకర ! మాపరమానురక్తి, ని
న్ననయముఁ జేరుమన్నను నయంబు, భయం బుభయంబులేక, నిం
దనములు సేయు భక్తజనతావన, తా ఘనతామసాన, నిం
కను నెటులైనఁ జేర్చు సుముఖా ! సముఖానకు నందనందనా"

నన్నయ్యగారిపోకడ :—

"మద మాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పదలొలిం గొనివచ్చి యిచ్చి, ముదమారగ్గాంచి, సేవించి, ని
య్యుదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీపతుల్"—

ఇక పెద్దనగారిది గమనింపుండు :—

తావుల్ ద్రేవలఁ జల్లు చెంగలువ కేదారంపుఁ దీరంబులన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొను కాంతారంబునందు"—

ఈయలంకారమును బోషించు పద్యము లిందు మఱికొన్ని కన్పట్టుచు నున్నవి :—

"మాటలు పెక్కులేల ? వినుమా, నిను మానక నేభజింతు, నో
హాటకచేల ! నెమ్మిఁ గనుమా, యనుమానము మాని నన్ను స
య్యాటము గాదు, నిక్కము, సుమా, కుసుమాయుధుఁ గన్నతండ్రి, మో
మాటముతోడ నిత్తు ననుమా, చనుమానము నందనందనా"

యౌవనారంభదశలో వ్రాసిన యీానందనందనశతకము చాలఁ బ్రౌఢమయినది. అట్లని దురవగాహ శబ్దాడంబర మేమైన నున్నదా యనిన నదియు లేదు. దీర్ఘసమాసములు దొరలినను లలితముగను సుగమముగను సద్యఃప్రబోధముగను సాగిపోవుచుండును. పూర్వకవు లందఱు విష్ణుపరముగాఁ దాము చెప్పు శతకములలోఁ బ్రత్యేకముగా దశావతార వర్ణనలకొఱకుఁ బద్యదశకము "రిజర్వు" చేసికొను వారు. ఈయనూచానాచారము కవిసమయమువలె శతక సారస్వతములో నేఁటికిఁగూడ కనిపించుచున్నది. పూర్వకవి సంప్రదాయము ననుసరించిన ప్రతికవియు శతకరచనాసమయములో నీపద్ధతి యవలంబింపక పోయినఁ దన శతకమునకు అది యొక గొప్ప లోటుగా భావించును. వసురాయకవి నందనందన శతకకాలమున కీపద్ధతి కొంచెము మార్పు పొందినట్లు తోఁచుచున్నది. అదియు నతనివఱకు మాత్రమే !

ఇతఁడు శతకమున దశావతారములను నొక్కె పద్యమున నిము డ్చుటలో నైపుణ్యమును జూపినాఁడు :—

"తేలియు నీటఁ, గదలిఁ దూఁగుటనో, మోయుటనో మన్ను, పన్నుటనో
పలుసట, లేఁగుటనో తిరియు, మాపుటనో భూపుల, నబ్ధిఁ గట్టుటనో,
హాలను ధరించుటనో, సతులయాత్మఁ గలంచుటనో, ద్రుంచుటనో జగాల్
గలుగి నీ నామములేమియును గావుము శైశవ నందనందనా"

మఱియు 77 వ పద్యము నుండి 95 వ పద్యమువఱకు షోడ శోపచార పూజావిధానములో నందనందనుని యర్చన పరముగా స్తోత్రము చేసినాఁడు. ఇది భక్తిరస శతకసారస్వతములో నొకక్రొత్త పోకడ.

ఇఁక నీశతకకవియొక్క ప్రారంభ కవిత్వప్రౌఢిమను దెలుపురెం డుపద్యము లీక్రింద చూపుదును. ఉభయభాషలలో నితనికిఁ గల ప్రాగ ల్భ్యమును (ఒకటి అచ్చికము—మఱియొకటి సాంస్కృతికము) ఆచిన్న నాఁడే యేవిధముగా పొందఁగలిగినాఁడో యవి ప్రకటించుచున్నవి:—

(అచ్చ తెలుఁగు పద్యము):—

"నక్కన మక్కజంబు నొదవించెడు రక్కసిరూపుదక్కి, తాఁ
జక్కని టక్కులాఁడి యయి, జక్కవ లక్కునఁ జొక్కులాగున,
న్నిక్కఁ బనుఁగివ న్విసము నించుక పాల్గుడుపంగఁ, గాని, నీ
నొక్కటి రెండు గ్రుక్కలను నుక్కడఁ జేయవె? నందనందనా !"

(సాంస్కృతికము):—

"సులలితరాగ యుక్త సుషమాయుత పూర్ణవిభావరీశ సుం
దల ముఖసుందరాసన కనద్దరహాస విలాస చంద్రికా
కలన జలీకృత స్వకృతకప్రయ గోప నివేశకోపనా
నలహృదయక్షపాకర దృషచ్ఛయ కందళ, నందనందనా !"

లాక్షణికకవి యయిన యితని కవితలో దోషములే లేవు; కాని:—

ముక్కు, తావరయుట (తావి + అరయుట) మోమాటము (మోము + ఓటమి), సముఖాన (సం + ముఖాన) (సమ్ముఖాన), ఇట్టివి వెదకి చూపఁదగిన పొరపాటు లక్కడనక్కడ కనఁబడుచున్నవి.

(1) లంచముపుచ్చుకొంటి పృథుకంబులు, (2) అధోగతి విధిం చెదొ, మంచెదొ, (3) క్రొన్నెల కొక్క నూలుపోఁగన్న విధాన.

ఇట్టి యపూర్వవాక్యములు వసురాయకవి లోకజ్ఞతకుఁ దార్కా ణములు.

2. భక్తచింతామణి శతకము :—

వసురాయకవి సారస్వతరంగములోను, నార్యమతధర్మములను, పూర్వసంప్రదాయములను మఱువని యాస్తికశిరోమణి; ప్రాచీన పవిత్ర మహర్షి మార్గావలంబకుఁడు. ధర్మచింతనుఁడు. ఇతని సహజస్వభావము లన్నియు నితని రచనములలోఁ బ్రస్ఫుటమగుచున్నవి. గ్రామ్య గ్రాంథిక భాషా వివాదములు చెలరేఁగిన కాలములో సలక్షణ భాషా సంరక్షణార్థము లేచిన దిగ్దంతులవంటి పండితవర్యులలో నితఁడొకఁడు. ఆవిషయములో నిర్దాక్షిణ్యముగా నితఁడు ప్రతిపక్షుల నెదుర్కొని పోరాడి తక్కిన తనసహచరుల మెప్పులను బొందినాఁడు. నిర్మముఁడైన వసురాయకవి తాను నమ్మినదానిని స్థాపించుటలో నెట్టి త్యాగమునకయిన సిద్ధపడువాఁడు. వాచాలత లేని నిరాడంబరుఁడైన కర్మయోగి.

ఆనాఁటి శాబ్దికులలో నెన్నదగినవారు మువ్వురు :—*

---

* రామమూర్తిపంతులు చూడని, వాడని, యెఱుఁగని, పదములు, యక్షగానములు, జంగముకతలు, శతకములు, పురాణములు, ప్రబంధములు, లే నేలేవని చెప్ప వచ్చును. నానాభాషా శబ్దశాస్త్ర విషయపరిశోధన మొక యెత్తయిన, నెక్కడెక్కడనే యే శబ్దము ఏసందర్భమున నేభావముతో నేవిధముగాఁ బ్రయోగింపఁబడినదో యది పూర్తిగా గ్రహించి, జ్ఞాపకముంచుకొనుట యొకయెత్తు. అట్టి ధారణాశక్తి సామాన్యము నందఱికిని లభింపదు. గొప్పగొప్ప విద్వాంసులుకూడ నాతనివాదమును కాదనలేకపోయిరి. ఆయన దినములలో— వేంకటరాయశాస్త్రి, తిరుపతివేంకటకవులవంటివారే యాతని పేరెత్తిన నొక నమస్కారబాణమును ప్రయోగించి గుడ్లప్పగించి చూచుచుండువారు. ఆ నాఁ డాతని వాదమును సమర్థించువారు లేకపోవుట, సంఖ్యాబలములో గ్రాంథికవాదులదే పైచేయియగుటవలన విశ్వవిద్యాలయములలో వ్యావహారిక భాష స్థానము సంపాదించుకొనలేకపోయినది. ఈనాఁటివఱకాయన జీవించియుండిన, సారస్వతములోఁ బెద్దవిప్లవము వచ్చి రామమూర్తిపంతుల పక్షము బలపడి వ్యవహార భాషకే యగ్రాసనస్థానము లభించునది. ఇప్పుడును కాకున్నను ఇఁకఁ గొంతకాలమునకైన సహజముగా భాషావిధానము రామమూర్తిపంతుల యభిప్రాయములకు ననుగుణముగ మాఱు నవకాశము లేకపోలేదు.

ఇఁక రెండవయతఁడు (వే. వేం. శాస్త్రి) పాత్రోచిత భాషాప్రయోగమునకు దారిచూపి, తత్తజ్జాతి సహజసిద్ధమైన వ్యావహారిక భాషా సముద్రమును మథించి, నిగ్గు తేల్చినాఁడు. కాని, శ్రీపంతులవారివలె సర్వే సర్వత్ర వ్యావహారికాని కిచ్చు ప్రాధాన్యమును ససేమిరా సమ్మతింపఁడు. ఇది చాలమంది లాక్షణికులయిన పండితులు సమ్మతించినారు. దాని ననుసరించియే రూపకములలో సంస్కృతమునకు గ్రాంథికమును, ప్రాకృతమునకు వ్యావహారికమును చాలమంది వాడిరి.

1. రావుసాహెబు, గిడుగు వేంకటరామమూర్తిపంతులు.
2. కళాప్రపూర్ణ, వేదము వేంకటరాయశాస్త్రి.
3. వడ్డాది సుబ్బరాయకవి.

వసురాయకవికి గ్రాంథికభాషోద్ధరణమే జీవితపరమావధి. సారస్వత ప్రపంచములో కృషిచేయు నెంతటి పండితుఁడైనను తన కవితావిలాసమునకుఁ జాలునని తోఁచినప్పుడు అతఁడిఁక శబ్దశాస్త్రవిషయమే పట్టించుకొనఁడు. వసురాయకవి యెఱుఁగని, ప్రయోగింపని శబ్దమని లేదు. "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వం" అనునది యాంధ్రబాణకవి వసురాయని విషయములో నక్షరాలా ఋజువగుచున్నది.

ఇతని యనువాదముల కేమిగాని, స్వతంత్రరచనలలో నితఁడు వాడని తెలుఁగుపదము లేదు. ఇంత యెందులకు. కవిత్రయము వెనుక శాబ్దదక్షత నలవఱచుకొనిన వసురాయకవి సర్వవిధముల ధన్యుఁడు.

వసురాయని భగవద్భక్తి యతివేలము. ప్రకృతిపరిశీలన యసదృశము. కవితాశక్తి యనర్ఘము. పదగుంఫన మనన్యసామాన్యము. ఇతఁడు వ్రాసిన నాలుగుశతకములును ఇతని ధార్మికమయిన యాస్తిక బుద్ధికి సౌజన్యమునకు నికషప్రాయములు. అందులో సూక్తివసుప్రకాశముమాత్రము నైతికాంశాబోధకము. తక్కినవి దైవస్తోత్ర సముంచితములు.

ప్రకృతము మనకుఁ బ్రసక్తమయినది "భక్తచింతామణి". ఇందులో దాదాపు మూఁడునాలుగువందల పద్యములున్నను మకుటాది శతక లక్షణములనుబట్టి శతకమనఁదగినదే! ఇందలి పద్యములన్నియు మత్తేభశార్దూలములు. నందనందనశతకములోఁ బంచపాదులుకూడఁ గొన్ని యున్నవి. కాని యిందులో కవి, తన భావములను నాలుగు పాదములలోనే ఇమిడ్చినాఁడు. "భక్తచింతామణీ" యనునది మకుటము. గాలించి వెదకినను చిత్తపదములు, ఊఁతపదములు దొరకక పోవుట యట్లుండఁగాఁ బ్రతిపద్యములోను భావపరిపూర్ణతకు కావలసినన్ని శబ్దములు చిక్కనగా చేర్చి యద్భుతముగా, ధారావాహికగా, లలితముగా కవిత్వము సాగించినాఁడు. ఆంధ్రదేశములో ప్రచారములో నుండు సుబ్బారాయకవి విరచిత "భక్తచింతామణి"కి గల ప్రశస్తి మఱిదేనికిని రాలేదనుట యతిశయోక్తి కాదు.

భక్తచింతామణియైన యీ "భక్తచింతామణి"లోని కొన్ని పద్యములు పాఠకలోకమున కుపాయనముగా నిచ్చుటకంటె నిందుఁ బరామర్శ చేయవలసిన యంశములు లేవనియు, నుండినను (వసురాయని పాదరేణువును బోలని) నాకు అంతటి యోగ్యత లేదని మనవి.

భక్తచింతామణిలోని కొన్ని మణులు :—

"నీసంకల్పమె సృష్టి, నీవు కనుఁగొంటే రక్ష, నీవూరకుం
టే సంహారముసూ, మహాత్మ! యటుగాకీభూమి యీసాగరం
బీసర్వాద్భుత భూతకోటి యిఁక వేఱేలాగు సర్గంబుగా
నీ సంరక్షణగాని చేయఁదరమా నే? భక్తచింతామణీ ॥"

పడుచుల్ వేడుక బొమ్మరిండ్లిసుకలో బాగొప్ప నిర్మించి, చొ
ప్పడ ముగ్గుల్ పచరించి, యాడుకొని, యాపై నాటగొల్లంచుఁ గ
ట్టడముల్ పాడొనరించి పోవుగతి వేడ్కల్ నీకు, నీవిశ్వముల్
పాడమంజేసి, భరించి మాపుటలు నెప్డుం, భక్తచింతామణీ ॥"

"మునిమా పాటలు మాని బిడ్డఁడు గృహంబుం జేర, మైనిండ నం
టిన పెంధూళికిఁ దల్లి యేవపడి వానిం, బోరుకాడింపదే?
దినమెల్లం, గలుషంబులే సలిపితిన్, దేవా! మహాపాతకిన్
నను ధౌతాత్మునిఁ జేయవే? కనికరానన్ భక్తచింతామణీ ॥"

"ఎదుటన్ భూతపిశాచముల్ నిలుచునట్లే, ఘోరదుష్కృత్యముల్
హృదయాదర్శమునందు బింబితములై యీరేయి నాకంటికిన్
నిదురంబాపెడు నంచు బెగ్గిలుచు, నే నీనామమంత్రంబు ముం
దిడె, యుచ్చాటనకై జపించెదను, తండ్రీ భక్తచింతామణీ ॥"

"తెలివిన్, వీనిని వాడుకొమ్మనుచుఁ బ్రీతి న్నీవు నాకిచ్చు వ
స్తుల నే నిద్దురవోవుచు న్మరల నిచ్చో నీకు నర్పించితిన్,
వెల హెచ్చైనవి పాడుచేసితని వాని న్నీవె కైకొందొ?, వ
త్సలతన్ వెండియు బాగుచేసి యిడుదో, సద్భక్తచింతామణీ ॥"

భక్తచింతామణిశతకములో దాదాపు 270 పద్యములున్నవి. అవన్నియు నేకేశ్వరోపాసకులకుఁ గుల మత వివక్షత లేకుండ కంఠస్థములు కాఁదగిన పద్యములు. నాదగ్గఱ నుండు "భక్తచింతామణి" క్రీ॥ శ॥ 1926 లో 19 వ కూర్పుగా ముద్రింపఁబడినది. మొదటికూర్పు క్రీ॥ శ॥ 1893 వ సం॥మున ప్రచురింపఁబడినది. దీనినిబట్టి యీగ్రంథము ముప్పది మూఁడేండ్లలో 19 కూర్పులు జరిగినవి. ఈగ్రంథ ప్రాశస్త్య మెటువంటిదో, ఇది యెటువంటి ప్రచారములో నున్నదో, యెట్టి ప్రఖ్యాతి గడించినదో పైకూర్పులవలన సులభముగా గ్రహింపవచ్చును.

ఇఁక సూక్తివసుప్రకాశమునుగూర్చి :—కవి తన పీఠికలో దీని రచనాకారణమును నీక్రిందివిధముగాఁ దెలిపినాఁడు :—

"లోకదృష్టాంత సమన్వితంబుగా నుండు నీతిబోధక గ్రంథ మొకటి మన యాంధ్రభాషలో నుండిన, విద్యార్థుల కత్యంతోపయుక్తముగా నుండునుగదా—యని యూహించి, మదీయసామర్థ్యం బంతకుఁ జాలకున్నను—సర్వేశ్వరుఁడు నిర్మించిన ప్రపంచమను మహాగ్రంథము విస్పష్టముగాఁ గన్నులయెదురఁ బొడకట్టుటంబట్టి—దాని సాహాయ్యమున నామనోరథంబు నెఱవేఱవచ్చునని యుత్సహించి, పరమాత్మునిపయి భారమువయిచి, యేతద్గ్రంథరచన కారంభించితిని."—

అంతియగాక :—ఈకవి ప్రతిజ్ఞ వినుఁడు :—

తే॥ గీ॥ సకలపద్యోత్తరార్థలౌకిక నిదర్శనములు పూర్వార్థములకుఁ
జంపకోత్పలములను బుస్తకమొనర్తు జగతి సూక్తివసుప్రకాశక మనంగ॥

ఈ సూక్తివసుప్రకాశము మిత్రున కంకితము. ఇక్కడ మిత్రశబ్దము సూర్యపరముగను హితునిపరముగను శ్లేషించి చెప్పఁబడినది. చూడుఁడు :—

ఈ గ్రంథము ప్రథమ ద్వితీయ భాగములుగా విభజింపఁబడినది. మొదటిదానిలో 191 పద్యములును రెండవదానిలో 211 పద్యములు, మొత్తము 402 పద్యములున్నవి. "మిత్రుఁడా" యను మకుటముతో—నిది చతుశ్శతి.

"భువనజాతంబు లామోదపూర్ణంబుగా దినము తప్పక ప్రోచు దేవుఁడెవఁడు
సకల స్థలములందు సర్వజీవులు జీవనం బొందు ఘనకారణం బెవండు,
దా నిశ్చలుండయి మానితాజాండ భాండములకుఁ జలనంబొనర్చు నెవఁడు
గురుతమోవృత జంతుకోటికి వెండి చైతన్యమిచ్చెడు జగద్బంధుఁ డెవఁడు
పరమ తేజస్స్వరూపుఁడై ప్రబలు నెవ్వఁ డురువిపద్ధ్వాంత మడఁచు నేర్పరి యెవండు
పతిత మఖిల జగచ్చక్ర హితుఁ డతండె యగుట నమ్మిత్రున కొనర్తు నంకితంబు"

నాయొద్ద క్రీ॥ శ॥ 1884 సం॥ములో ముద్రితమయిన ప్రతియు, క్రీ॥ శ॥ 1917 సం॥లో ముద్రితప్రతియు నున్నవి. రెండవది యైదవ కూర్పు. అనఁగా 1884 నుండి 1917 వఱకు ముప్పదిమూఁడు సంవత్సరములలో నైదుకూర్పు లయినవి.

ప్రథమ ద్వితీయ భాగము లొక్కొక్కదానిలో నిరువదిరెండు విషయవిభాగము లున్నవి. అన్ని పద్యములును జక్కని దృష్టాంతము

లతోఁ గూడిన మంచినీతులు. ఇట్టి దృష్టాంతాలంకారములతోఁ గూడిన నీతిశతకము లన్నిటికి భాస్కరశతకము మార్గదర్శక మయినది. తరువాత నట్టివి మఱి రెండు వెలువడినవి. (1) జగన్నాయశతకము, (2) సర్వమంగళాశతకము, (3) ఇప్పు డీసూక్తివసుప్రకాశము. ఈశతాబ్దములోఁ బుట్టినది.

సూక్తివసుప్రకాశములోని ప్రథమభాగమున :—

(1) గురుశిక్ష, (2) వినయము, (3) గుణవంతుఁడు, (4) శ్రద్ధ, (5) బుద్ధి, (6) కాలము, (7) ఉద్యోగము, (8) విద్య, (9) విమర్శనము. (10) హితోపదేశము, (11) వివేకము, (12) సంభాషణము, (13) కొండెము, (14) అతిపరిచయము, (15) స్నేహము, (16) ఐకమత్యము, (17) స్నేహితుఁడు, (18) పరోపకారము, (19) భూతదయ, (20) బాంధవము, (21) మాతృవాత్సల్యము, (22) సంతానము.—

ద్వితీయభాగములో :—(1) ప్రయోజకత్వము, (2) కామము, (3) క్రోధము, (4) ఆశ, (5) జుగుప్స, (6) ఈర్ష్య (7) తొందర, (8) శాంతత్వము, (9) ధైర్యము, (10) ప్రతాపము, (11) ఘనుఁడు, (12) దుర్జనుఁడు, (13) ఆపత్సంపదలు, (14) ధనము, (15) దాతృత్వము, (16) ఋణము, (17) లోభిత్వము, (18) ఆశ్రయము, (19) రాజు, (20) నియంత, (21) సేవకుఁడు, (22) వివిధాంశములు—అని విషయవిభాగములు చేయఁబడినవి.

ఈ గ్రంథములో దృష్టాంతములు సామెతలు చాల పొందికగా నిముడ్పఁబడినవి. వానిలోని తేలిక పదములు ఏమూఁడవఫారము చదువు పిల్లవానికైనను సులభముగా నర్థమగును. మచ్చునకుఁ గొన్ని :-

(1) కజ్జలంబు వూలుండిన నేమగు న్నయనయుగ్మము తెప్పలఁ బాయ ?, (2) మేఁకలమందమీఁద తోఁడేలికిఁ బెత్తనంబిడ, వడిందిగ మ్రింగకయున్నె ?, (3) ఓలి తక్కువని గ్రుడ్డిపడంతుకఁ బెండ్లియాడినన్ నెలకొక కుమ్మరావ మవనిం బగిలింపకయున్నె ?, (4) చిలుకలు గోరువంకలు వసింపఁగఁ గట్టిన పంజగంబులో నిడినను గాకము న్నగుదురు. (ఈపద్యములో—'ల'—'డ'—లకు ప్రాసమైత్రి), (5) ఒసంగుచోటికిం బూనిక నడ్డమూ తనదుపుట్టి మునింగియుట్టు లోభి, (6) వడ్డికి చేబగా, కసలు వట్టముగూడను సంభవించెడుక్, (7) సుక్షేత్రమునందుఁ జల్లు

నొక చేరఁడు విత్తులు గోనెఁడయ్యెదుర్, (8) దొంగను బట్టికొంట కొక దొంగయ కావలె, (9) ఎందును వలకేలుమన్ననఁ గనుర్, బెఱకేలవమానమొందు, (10) చేవదూలములను బుట్టునే వెదుళులంబలె ఘోర రవంబు, (11) రాజ్యము వీరభోజ్యము, (12) నిట్టతాడఁలును నీఁతలు గూపఱు, (13) పనఁటి నూఁదరగొట్టిన యంటిపండ్లకున్ బాగుగవచ్చునే, ముదిరి పండినపండుల తీపి?—(14) తీయఁగా చెఱకున రిత్త వెన్నొడఁబుచెందిన మాధురిమాపు, (15) కడుపునఁ గన్న కానుపునకన్నను గన్నులఁగన్న కానుపే గడితము, (16) తల్లి భరింపఁజాలుఁ జుమి తండ్రికిఁ గిట్టనియట్టి బిడ్డలన్, (17) కన్న మోహమునకన్నను బెంచినమోహ మెచ్చుఁగా, (18) పచ్చగనున్న నందఱును బందుగులే కడుపార సాపడన్, (19) మనసున దుఃఖముండిన సమస్తమసహ్యాను (అనాశ్వాసిత దుఃఖితే మనసి సర్వమసహ్యామ్)—(20) నాలుగు వస్తువుల్ గృహమునం బెనుదీపము వెల్గునప్పుడే మేలగుఁ జక్కఁబెట్టుకొన, మీఁదను విఘ్నములెన్ని?

కొన్ని అచ్చతెలుఁగుజాతీయలు, నానుడులు :—

(1) మతిమఱపు, (2) అగచాట్లు, (3) నగుబాట్లు, (4) చిల్లరవారు (సామాన్యజనులు), (5) ఉప్పరి, (6) గునపం, (7) వెట్టిపనులు, (8) రౌతు, (9) స్వారి, (10) కంటఁబంటబెదరించు, (11) అఱసచ్చ (12) గుమ్మలు, (13) కొఱ్ఱులుగొట్టు, (14) కక్కుఱితి, (15) ఉచ్చపోయు, (16) మెడకొంకొలు, (17) జనపకాఁడలు, (18) బందగుట, (19) టెంకతొక్కలు, (20) బూజుగట్టు, (21) కప్పురపుదండ, (22) బండెలదొడ్డి, (23) పొదుపరులు, (24) దూఁబఱులు, (25) మిడిమిడియెండ, (26) కాగితపుబుట్ట, (27) జరబాజు పోఁగులు, (28) బావురుగాఁడు. (29) గుల్లముత్తెములు, (30) చెడమాసిన, (31) పాఱుఁబోఁతు, (32) దుడ్డుకఱ్ఱ, (33) ముక్కునవాడి గల్గ (తిక్కసభాయ), (34) ప్రాణగొడ్డము, (నన్నయధోరణి),—(35) పచ్చికుండ, (36) దీపపుమొగ్గ, (37) తడిపట్టి వేళ్ల తడక, (38) అసడ్డ, (39) చిగిలింత (చిగిరింత?), (40) ఎంగిలికూడు, (41) జొచ్చుగుంట, (42) పెంటగోతులు, (43) భగ్గున మండెడు నగ్గిపుల్ల, (44) కాళ్లువచ్చినట్లు, (45) పిలికుచ్చు, (46) గత్తరకుళ్లుగుడ్డ, (47) దొంగగడ్డి, (48) లంకెవేయు, (49) ఏటికొకరు కోటకొకరు లాగుట, (50) మాలిమికాఁడు, (51) తయారుపడు, (52) నాగవాసము, (53) పులి

గాపు—ఇట్టి శబ్దప్రయోగము లీ సూక్తివసుప్రకాశములోనే కాక తక్కినవానిలోను విశేషముగా నున్నవి. కవితలో నుచితశబ్దము లీ కవికి (ఈతనికాలములో) కుదిరినట్లు మఱెవరికి కుదరలేదనుట యతిశయోక్తి కాదు. (సలక్షణశబ్దములు).

పండితరాయల పోకడలు భర్తృహరి యనుకరణములుకూడ నెందు లేకపోలేదు.

"మాగర్వ ముద్వహ బిడాల, మహీపతీనాం అంతర్గృహం మణిమయం నిలయం మమేతి
పట్టాభిషేక సమయే మహీపతీనాం బాహ్యస్థితస్య కలభస్యహి మండనశ్రీ"—

అను పండితరాయల 'భామినీవిలాస' శ్లోకమునకు :—

"ఒడయనిపాల, నెంతచనవుండిన, నీవు మహాత్మకన్న నె
క్కుడగునె? వాఁడు గర్వపడఁగూడదు వారలయొద్ద, బిల్లి యె
ప్పుడు నవరోధసౌధమునఁ బొందుగ నుండిన యంతమాత్ర, నె
వ్వడువున నెక్కుడౌను బురబాహ్య గజేంద్రముకంటె మిత్రుడా"

ఇది ఛాయానుకరణము :—

"క్రిమికులచితం, లాలాక్లిన్నం విగంధి జుగుప్సితం
నిరుపమరసప్రీత్యా ఖాదన్ ఖరాస్థి నిరామిషం
సురపతిమపి శ్వా పార్శ్వస్థం విలోక్య నశంకతే
నహిగణయతి క్షుద్రో జంతు పరిగ్రహ ఫల్గుతాం"

ఈ భర్తృహరిశ్లోకచ్ఛాయ ననుసరించిన పద్యము క్రిందిది :—

"సారవిహీనమై బహుళశంకటముల్ కలిగించు హేయమగం
ధారము పామరుల్ ప్రియమశముంబుగ నెంచి, చరింతు రెట్లనన్
ధారుణి మాంసశూన్యమును దంతవిఖాతముఁ, బూతి గంధమా
ఘోరపుటెమ్ముకం గని కుతూహల మొందదె కుక్క? మిత్రుఁడా?"

మఱి యింతకంటె ప్రత్యేకముగా నీ సూక్తిసుధానిధిలోని పద్యము లుదాహరించుట యనవసరమని, కవిత్వ గౌరవమునుగూర్చి కవిచెప్పిన "కవనమనన్ వచోరచన గావున నయ్యది చేతఁగాని వారెవరును లేరుగాని, రసమే యుదయించుట కష్టమందులో" నను ముక్కను చెప్పి చాలించి భక్తచింతామణిలోనే ప్రచురింపఁబడిన "ఆపదుద్ధారక శతకము" (నాకిది పూర్తిగా దొరకలేదు) పద్యములను రెండింటిని క్రిందఁ నుదహరించుచున్నాను. "భక్తచింతామణి" పద్యములధోరణి లోనే యిదికూడ నడచినది. దీనిని కవి క్రీ॥ శ॥ 1907 లో రచించెను.

"అనలస్పర్శముఁ, జందనాచలసమాయాతానిలస్పర్శమున్
దనువల్లే మనసెంచు, మన్మృతసుతజ్ఞప్తిన్, ద్వదంఘ్రి స్మృతిన్
గన దుఃఖం బవిచారమూలక మసత్కార్యంబు గాఁ దోఁచి, లో
ననుసంధింతు సుఖస్వరూపు నినుఁ గృష్ణా! యాపద్ధారకా!"

"కాళిందీనది నల్పు, బింబితమహాకాశంబున, ల్వందులోఁ
గూలంబందుఁ దమాలరాజినలు, పాఘోరాహియు న్నల్పు, తి;
న్మాత్రిన్ నత్తిలు నివునల్పు, నలుపుల్ ధ్యానింపఁగా నిన్నియున్
మాలో నల్పుదోలంగుఁ జిత్రమిది, కృష్ణా, యాపదుద్ధారకా"

ఈశతకము "సుతస్మృతి" యను మృతపుత్రునిగూర్చి వ్రాసిన పద్యములకుఁ గడపట ఆత్మశాంతికొఱకు శ్రీకృష్ణుని స్మరించుచు చెప్పినవి.

వీరి సాంసారికజీవనములో మానసికముగా ననేక కష్టములు తటస్థపడినవి. వీరికి వరుసగా నైదుగురు భార్యలు గతించిరి. ఆఱవ భార్యకొక కొమరుఁడు, నొక కుమార్తె జన్మించిరి. మూఁడవభార్యకు ప్రహ్లాదమూర్తి యనునతఁడు పుట్టి 18 ఏండ్లు పెరిఁగి పెండ్లి జరిగి యా తరువాత నతఁడు గతించెను. ఆఱవభార్యవలనఁ గలిగిన సంతానము సుఖమున్నది. ఈకవి లోకకంఠీరవుఁడు క్రీ॥ శ॥ 1938 సం॥మున మార్చి 2 వ తారీఖున స్వర్గస్థుఁడయ్యెను. ఆయన రసవత్కృతు లాంధ్రలోకమునఁ జిరస్థాయిగ నుండఁగల నిధానములు.

# కాకర్ల సుబ్బయ్యపంతులు

క్రీ॥ శ॥ 1855—1915.

ఇతఁడు రచించిన సంజీవరాయశతకము క్రీ॥ శ॥ 1901 సం॥ములో ముద్రణమయినది. ఇది ఏకైక శతపద్య పరిమితముగాఁ గాకుండ ద్విశత సమాయుక్తమయినది. కారణము కవియే "యవతారిక"లో నిట్లు చెప్పినాఁడు.

"శతకము చేయుచుండఁగా దానియందుఁ గొన్ని పద్యము లధికముగ నుండుటం బట్టి—శ్రీభగవద్గీతోపన్యాసకులగు బ్రహ్మశ్రీ శ్రీమాన్ లక్ష్మణాచార్యులవారు, శతకము శతకయుగముగ రచియింప ననుగ్రహించిరి. నేనట్లుచేసి నూటయెనిమిది పద్యములు పూర్వభాగముగాను, అన్ని పద్యము లుత్తరభాగముగాను విభజించి యచ్చు వేయింపవలసి వచ్చెను."

తన శతకరచనకుఁగూడ కారణము నీవిధముగా తెలిపినాఁడు.

"శ్రీమచ్చెన్నపురరాజధానియం దంతటను పెక్కు కైంకర్యములు చేసి కలియుగ ప్రహ్లాదులని ప్రసిద్ధికెక్కిన శ్రీమదల్లూరి—వెంకటాద్రిస్వాములుగారికి అంతరంగభక్తులును శ్రీభద్రాచల రామభద్రపాదపద్మ సేవాధురీణులై నిత్యాన్నదానరతులైన శ్రీ మత్పైఁడిగంటము—వేంకట సుబ్బరామదాసుగారికి సోదరులునైన పైఁడిగంటము—ఆదినారాయణదాసుగారు, సైదాపేఁటలో జేరిన శ్రీమాంబళ్లమను పుణ్యక్షేత్రమున ప్రతి సంవత్సరము చైత్రవైశాఖ మాసములందు శ్రీరామోత్సవ, నృసింహోత్సవములను మహావైభవముతో నేత్రోత్సవముగ జరిపించుచు ఉత్సవకాలమునందు వచ్చునట్టి చాతుర్వర్ణ్యమునకు నవారిగ నన్నదానముచేయుచు ప్రతిదినమువచ్చు నభ్యాగతులను సద్భక్తితో పూజించుచు శ్రీరామభజనానందులై యున్న సంగతి సకలజనులకు సుప్రసిద్ధమేకదా—అట్టిభాగవతోత్తములకు పుత్రులగు పైఁడిగంటము వేంకటవరదదాసుగారు తమతండ్రిగారి యనుమతిప్రకారము తండ్రిశకమునకు వెనుక వారికైంకర్యములన్నింటిని పూనుకొని తండ్రికంటె మేలిమిగ ఆలయప్రతిష్ఠలను ఉత్సవాదికములను జరిపించుచువచ్చుటయు ప్రసిద్ధము. వీరు సుమారు పదిసంవత్సరములకు ముందు తా ముపదేశముపొందిన శ్రీహనుమన్మంత్రసిద్ధికై మహాపుణ్యక్షేత్రమగు ఘటికాచలమునకు (చోళంగిపురమునకు) బయలుదేరిపోయి యచ్చట కొంతకాల మాహారనియతితో యోగాసనాసీనుఁడైయుండు నరసింహదేవుని అతనిసేవార్థము చెంతనేయుండు చిన్నకొండపై నెలకొనియుండు శ్రీ యోగాంజనేయులను గొలుచుచు మంత్రసిద్ధియైన తరువాత స్వస్థానమగు మాంబళమునకు వచ్చిచేరి కైంకర్యమును జరిపించుచు నొకనాఁడు నన్నుఁ గనుఁగొని శ్రీమాంబళమున నెలకొనియుండు సంజీవరాయనిపేర నొకశతకము రచియింప నాజ్ఞయొసంగిరి. *

---

* ఈకవికి శతకరచన కాజ్ఞ యిచ్చిన వేంకటవరదదాసుగారు ఆదినారాయణదాసుగారి కుమారులు. ఈ ఆదినారాయణదాసుగారిది గుంటూరుజిల్లా, ఒంగోలు తాలూకాలోని "అనమనమూరు" అగ్రహారము. వీరు ఆంధ్ర నియోగిబ్రాహ్మణులు.

ఈ సుబ్బయ్యపంతులు ఆంజనేయోపాసిగా కనఁబడుచున్నాఁడు. ఇతనిశతకములో నానా క్షేత్రములయందు నెలకొనిన "సంజీవరాయ"ని శతకారంభమునఁ గొనియాడినాఁడు :—

(1) శ్రీమాంబళనిలయుఁడు, (2) భద్రగిరీంద్రోపరిభాగనివాసి,—(3) చెన్నపురి వెలయువాఁడు, (4) కరిగిరి (కాంచీపుర) వరదుని సేవాపరతంత్రుఁడు, (5) వేంకటగిరిపై నెలకొన్నవాఁడు, (6) తిరుపతి పతి నుతి గతి యను సరసుఁడు, (7) తిరుమలక్రిందనె గోవిందరాజు కృపఁగనువాఁడు, (8) ఘటికాచల నరహరి యోగమురీతి చూచి యానందించు

వీరే మాంబలమున మఠము స్థాపించిన మొట్టమొదటి హరిదాసులు. వీరు 25-10-1891 లో శ్రీహరిసాన్నిధ్యమును జేరిరి. అప్పటికీ వేంకటదాసుగారికి 34 ఏండ్లు నిండినవి. అనఁగా, రాక్షస సం॥ము జ్యేష్ఠ (1855 జూన్) మాసమున సైదాపేట సమీపమందలి వేళచ్చేరిలో జన్మించిరి. వీరు రెండవహరిదాసులయి మాంబలమఠమున కోదండరామసేవ చేయుచు 60 ఏండ్లు జీవించి, కడచిన రాక్షస అనఁగా 1915 (ఆగస్టు 4) న కైవల్యమందిరి.

ఈ శతకముద్రణ కాలమునకు (1901) కవిని వ్రాయ ప్రోత్సహించిన యీదాసుగారికి 45 ఏండ్లప్రాయము. కనుక కవికూడ నతనివయస్సు అనఁగా 40—50 సం॥రముల మధ్య యీడు గలవాఁడుగా నుండియుండును. ఇతఁడు మదరాసు పచ్చయప్పకళాశాలలోఁ బండితుఁడుగా నుండినాఁడను విషయము తప్ప మఱేమియు విశేషములు తెలియకున్నవి. ఇఁక నితని శతకమునుగూర్చి తెలిసికొనుటకు ముందు మాంబలమఠమునుగూర్చి యింకొకమాట :—

పై వేంకటవరదదాసుగారికి సంతానము లేనందున నాతనిబావమఱఁది (భార్య తమ్ముఁడు) ధేనువకొండ వేంకటరంగయ్యగారు మూఁడవ హరిదాసులయి మఠమును చాల అభివృద్ధికిఁ దెచ్చిరి. మాంబలము కోదండరామస్వామి దేవాలయ నిర్మాణాదులు వీరు యాచించి తెచ్చిన ద్రవ్యముతోఁ గొనసాగినవి. కొంతధనము దేవునికైంకర్యార్థము నిధిగాకూడ వీరు సమకూర్చిరి. మండపములు వాహనములు పూజాపరికరములు మున్నగునవి నిర్మించిరి. వీరిసేవ యీదేవాలయమున నత్యంత మమూల్యము. శ్లాఘనీయము.

వీరు 19-9-1943 నాఁడు మోక్షసామ్రాజ్యము చూఱగొనిరి. వీరి జీవితకాలముననే మాంబలము మఠ దేవాలయ పరిపాలనార్థ మొక ధర్మకర్తల సంఘమును (Trust Board) నియమించిరి. ఇప్పటికిని భక్తిశ్రద్ధలతో నీసంఘము నిత్యపూజా నైవేద్యాదికములు బ్రహ్మోత్సవములు జరుపుచున్నవి. ఇప్పటి ట్రస్టు బోర్డు పక్షమున కార్యములు నిర్వహించు సుగుణసంపన్నులు శ్రీ యిలపావులూరు వేంకటసుబ్బయ్యగారు.

ఎక్కడి నెల్లూరు మండలము? ఎక్కడిమాంబలము? ఆంధ్రభక్తిఁ డీయఱవసీమలో నింత ప్రసిద్ధి గనిన మఠము దేవాలయము నాస్తిపాస్తులతో నన్నిహంగులతో నెలకొల్పుట యపూర్వవిషయము.

వాఁడు, (9) రంగనాథుని (శ్రీరంగవాసుని) చరణ కమలయుగళి షట్పదుఁడు, (10) తోతాద్రి నివాసుఁడు, (11) యదుగిరి నెలకొన్నవాఁడు, (12) కేరళ పద్మనాభుని భక్తుఁడు, (13) కర్ణాటకజనములచేఁ గొలువఁబడువాఁడు, (14) ఉడిపిని వసించువాఁడు, (15) సింగరాయకొండ నెలవుగా నుండువాఁడు, (16) మాలాద్రినివాసి, (17) నీలగిరీంద్ర శిఖరావాసము గలవాఁడు, (18) వేంకటవిఠలుని శ్రీపద భక్తుఁడు, (19) కేసరిగిరి నుండువాఁడు, (20) ప్రయాగమాధవ సమ్మానితుఁడు, (21) నెల్లూరి రంగనాయకుఁ బూజించి నుతి గన్నవాఁడు.

శతకములోని 28, 29 పద్యములలో నాంజనేయుని బాల్యక్రీడలు వర్ణింపఁబడినవి. 30 వ పద్యమునుండి 73 వ పద్యమువఱకు సుందరకాండములోని హనుమత్సంబంధమైన వీరవిహారమంతయు వివరింపఁబడినది. తక్కిన పద్యములన్నింటిలో హనుమంతునిపై కవికిఁగల యత్యంతభక్తి ప్రపత్తులు విశదమగుచున్నవి.

కందములు రచించుటలో నితఁడు కృష్ణ శతకకర్తతోను కవిచౌడప్పతోను బోల్పఁదగినవాఁడు. కవి తనకందపద్యములనుగూర్చి యిట్లు చెప్పుకొనినాఁడు.

"కందమొకటైన లోకుల కందముగాఁజెప్పి, మెప్పఁగని యెఱుఁగని నా
కందములం దందుమాటల చందము సంజీవరాయ, సన్మానిగేయా"

ఇతఁడు లాక్షణికుఁడఁట !

"లక్షణముల, వేదస్వర లక్షణముల నంచు తెలియఁగు లాక్షణికుఁడ, నీ
వీక్షణము నాకు లక్ష్య, విచక్షణ సంజీవరాయ, సన్మానిగేయా"

ఇది యొకవిధమయిన యాత్మస్తుతిగాఁ గనఁబడుచున్నను నసత్యమని చెప్పుటకుమాత్రము వీలుపడదు.

నిర్దుష్టమయిన యీతని కవనములోఁ గంటువెట్టుకొని వెదకినను లక్షణవిరుద్ధములైన ప్రయోగములు మందునకుఁగూడ కానరావు. పైఁగా యమక గమకము, ద్విప్రాస పదబంధనము, అర్థాంతరన్యాసాది యర్థాలంకారములు విస్తారముగా నున్నవి.

భక్తిలేనివారి మతాభిమానము వ్యర్థమని యీకవి యభిప్రాయము :—

"ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతములందుఁ దారతమ్యము తెలియఁగం,
గాఁతలిడి భక్తిమఱతురు చాతురి సంజీవరాయ సన్మానిగేయా"

అద్భుతములయిన తెలుఁగుఁ బలుకుబళ్లు కొన్ని యీశతకమునకు సొంపు గూర్చుచున్నవి :—

(1) వేలాంవెఱ్ఱి, (2) మేలుబంతి, (3) తెగబలియు, (4) వేలవము, (5) టక్కరి, (6) చట్టము, (7) పెద్దపేరు, (8) తెగఁబెంచు, (9) తెరువాఁగు—ఇట్టివింకను పెక్కులున్నవి.

ఈ శతకములోని కొన్ని సామెతలకు జాతీయములకు నుదాహరణములు :—

(1) వాచాకైంకర్యముచేయు, (2) కలికమునకుఁ గానరారు. (3) మొగమున నీళ్లను జల్లవు, (4) మాటలతోఁ బందిళ్లనుబెట్టు, (5) అరోచకము జనించు, (6) రోఁతపుట్టు.

ఈక్రింది వాక్యములు గమనింపఁదగిన నాజూకుదన మలవఱచుకొన్నవి.

(1) నల్లనికాకికి దులపక తెల్లనిమెదుకులను, తానె తిని మనునరుఁడు. (2) ఇలనమ్మి చెడినవారలు కలికమునకుఁ గానరారు, (3) నీతోడు గలుగ నెవ్వరిచేతిని నేనెదురు చూడను, (4) ఇంద్రియ సేవకులను గొట్టకొఱకు సేవింపను, (5) నీదయఁగోరిన నాపై రాదాయె నదేమి నెత్తిఁవ్రాఁతఫలంబో, (6) నీచులసేవలు చేసి యరోచకము జనించె, (7) దండిగ నోసఁగెడి బంగరుకొండవు, (8) ఫలము గోరంతయె? నేఁగొండంతకొలువుఁ గొలిచిన, (9) తనవాఁడని నావాఁడని, కనికరమున నొక్కకంటఁ గనిపెట్టవు, (10) పోయినపని బాగాయెఁగదా యని మధువాని రీతిఁ దప్పు టెఱుఁగవో ?, (11) జారిణి తా వలచిన ప్రియజారునిఁ దన యింటిపనులసందడిలో నేమారనిగతి, (12) దొరకుఁ దగినబంటవు, నీవరయఁగ, బంటునకు దొరకె వైపుగ దొర, మీయిరువుర జంటించిన విధి సరసుఁడు.

"యత్రయత్రరఘునాథ కీర్తనం, తత్రతత్ర కృతమస్తకాంజలిమ్"

అను శ్లోకభావముగల పద్యము.

"ఎక్కడ రఘురామునికథ లక్కఱతోఁ జెప్పుచుంద్రు, లలినంజలితో
నక్కడ మక్కువవినుచు, నాచక్కని సంజీవరాయ, సన్మునిగేయా"

ఇఁక ఇందలి కవి చాతుర్యమును తెలుపు పద్యములను గొన్నింటిని పాఠకుల కుపాయనముచేయుచు ఇది ముగింతును :—

"గురు గురుతర గురుతమములు వరుసలుగా లఘు లఘుతర లఘుతమములుగా
సరగున రూపములెత్తెడి సరసుఁడ సంజీవరాయ, సన్ముని గేయా"

(ఈపద్యమున ద్వితీయపాదములో యతిభంగము 'గురుతమము ల్వరుసలుగా' అన్నచో,—ఆదోషము తొలఁగును).

"నిరతము నినుఁ బూజించెడి కరములు సంపూర్ణసౌఖ్యకరములు, సంప
త్కరములు, విజయోత్కరములు, సరసుఁడ! సంజీవరాయ, సన్ముని గేయా"

"నిరతము నినుఁ బూజింపని కరములు సంసారదుఃఖకరము లలక్ష్మీ
కరములు పాపనికరములు సరసుఁడ, సంజీవరాయ సన్ముని గేయా"

(పై రెండు పద్యములలో అంత్యప్రాసనియమము).

"అనయము నను రక్షించెడి ధనమా, నాపూజలందఁదలఁచు గృహారా
ధనమా, మానసయోగా సనమా సంజీవరాయ, సన్ముని గేయా"

(ఇది ద్విప్రాసాలంకారము).

"చక్కెరలను, నుక్కెరలను జక్కెరపొంగలిని ఫలరసంబుల నెల్లన్
మక్కువఁ జవిఁగొనియెడి నాచక్కని సంజీవరాయ, సన్ముని గేయా"

"ఇమ్ముగ భక్తులొసంగెడి కమ్మని పానకము, దోరగాయలఁ బండ్లం
గమ్మని కొబ్బెర గొనుమా సమ్మతి సంజీవరాయ, సన్ముని గేయా"

(ఇందు భోగాంజనేయుని వర్ణన 'కమ్మని'—పునరుక్తి).

సండీనోడ్డీనంబు, లఖండప్రడీనాది చిత్రఖగగతులను నీ
భండనమున రూపించెడి చండుఁడ, సంజీవరాయ, సన్ముని గేయా"

(ఆంజనేయుని లంఘనగతులు పైపద్యమునఁ దెలుపఁబడినవి. అందు రెండవపాదములో గణభంగము).

"గాలము సోఁకులమీలకు, జాల మరిఖగాళి, కింద్రజాలము గన నీ
వాలము, రిపుమూషిక మార్జాలము, సంజీవరాయ, సన్ముని గేయా"

(హనుమద్వాల ప్రభావ మిందు వర్ణితము).

"మునిదాసుండై, వడి రామునిదాసుండగుచు మునులు పొగడఁగ శ్రీరా
ముని దాసుండనఁబడు సజ్జనసుత సంజీవరాయ సన్ముని గేయా"

"హనుమా, నావెతలను గనుఁగొనుమా, నావిన్నపములు గొనకొని ప్రీతి
న్వినుమా, జయమిడ, ముందుగఁ జనుమా, సంజీవరాయ సన్ముని గేయా"

ఈ శతకము కడపటి 196-205 పద్యములవఱకు ప్రతిపద్యము మొదటిచరణము "వందనమునీకు" అని పూర్ణబిందుపూర్వక 'ద' కారముతో ప్రారంభమగుచున్నది.

సరసమైన శైలిగల యీశతకము కందపద్యశతకములలో నగ్రశ్రేణి నందుకొనఁదగినది.

—:o:—

# జానపాటి కామశాస్త్రి

క్రీ॥ శ॥ 1855—60 ప్రాంతము.

ఇక్కవిపూర్వులు నరసారావుపేట తాలూకాలోని తూబాడు గ్రామనివాసులు. ఇతనితండ్రి స్వగ్రామమువదలి, గుంటూరుమండలమునకు వలసవచ్చి, తెనాలితాలూకాలోని పెదరావూరిలో వసించుచు, నందే మరణించెను. అనంతరము, కామశాస్త్రి తనయభిజనమును విడిచి విద్యార్జనాభిలాషతో నాంధ్రదేశములోని యనేకప్రదేశములు తిరిగి, పెక్కురుపండితుల నాశ్రయించి, సంస్కృతాంధ్రభాషలలో మంచివిజ్ఞానము నలవఱచుకొనెను. ఇతఁడు విజయవాడలోని యున్నతపాఠశాలలో అంత్యదశలోఁ గొన్నేండ్లాంధ్రాధ్యాపకత్వము వహించెను.

ఇతఁడు నిరంతర సారస్వతోపాసకుఁడు. వ్యాకరణశాస్త్రపారంగతుఁడు. పెక్కుగ్రంథములకుఁ గర్త. కాదంబరీసంగ్రహము, మహిమ్నాస్తోత్రము, (అనువాదము). మానినీశతకము, నీతిశతకము మున్నగు కృతుల నీతఁడు రచించెను. ఇందుఁ గడపటి రెండుతప్పఁ దక్కినవి యముద్రితములు. ప్రకృతము మనకుఁ బ్రసక్తమగు 'మానినీశతకము'—వావిళ్లవారి నీతిశతకసంపుటములోఁ బునర్ముద్రితమయి యున్నది. ఇందులో సరిగా నూఱు చంపకోత్పలవృత్తములు గలవు, కవి తుదను దన్నుఁగూర్చియు, శతకరచనాకాలమును గూర్చియుఁ జెప్పుకొన్న యుత్పలము పైసంఖ్యలోఁ జేరలేదు. ఆపద్యమిది:—

"ఈరితమైఁ జెలంగు పదునెన్మిదినూఱుల తొంబదింటిపై
నాఱవయేట హాణశకమందున స్త్రీజననీతిబోధినిన్
వారిక పుణ్యభూ విజయవాటిక నుండెడు కామశాస్త్రియన్
వాఁడుఁ దొనర్చె స్త్రీలువడు పాట్లను జూడఁగ లేక మానినీ!"

దీనింబట్టి, ఈకవి శతకరచనాకాలమునకు నలువదియేండ్లకించుక పైఁబడిన ప్రాయముగలవాఁడయి యుండునని యూహించుచో, దాదాపు ఇతఁడు క్రీ॥ శ॥ 1855 ప్రాంతమున జనించి 1915—'20 ఏండ్లమధ్య కాలగతి నొందియుండవలెననుట నిశ్చయము.

ఇతని మానినీశతకము మృదుమధురశబ్దజాలసమలంకృతమై, సులలితధారాధోరణీవిలసితమై, ఆంధ్రదేశీయపదసముదయవిరాజితమై, చదువఁజదువఁ జవులూఱుచుండును. గృహిణీరత్నముల కిందలి

నీతు లత్యంతసులభగ్రాహ్యములగు శైలిలో సంతరింపఁజాలిన యిక్కవి నైపుణ్యమనన్యసామాన్యము. అట్లయ్యు నీతని వినమ్రభావము కడుం గడు శ్లాఘ్యము. ఈక్రిందిపద్యముం గనుఁడు :—

"కయితముఁ జెప్పువాఁడ నను గర్వముచేఁ దలపెట్టలేదు; నా
పయి దయచేసి లోపములు పద్యముల న్వరికించి దిద్ది, శ్రీ
దయితుఁ డొసంగినట్టి మతిదార్ఢ్యము వీనికి నింతెయంచు, లో
సయిపు మహానుభావులను సన్నుతిసేయుదు నాత్మ నిచ్చలున్"

శకటరేఫ వర్తులరేఫ మైత్రి తానొనర్చినందు కితని సమర్థన మీాదిగువ పద్యమునఁ దెలియును.

"శకటరేఫమునకు సరియౌను వర్తుల రేఫమనుచు వ్రాయలేదు నేనె,
యతులఁ బ్రాసలందు నక్కడనక్కడఁ బూర్వకవులె వ్రాయఁబూనినారు"

(ఇందు రెండవపాదమువ 'ర—ల'—లకు యతిమైత్రికలదు. లాక్షణికులు పెక్కుర కిది సమ్మతముగాదు).

అపూర్వజాతీయ ప్రయోగముల యం దితఁ డందెవైచినచేయి.

(1) కంచంతటిబలఁగము, (2) అసురుసురగు, (3) గగ్గోలుగ నేడుచు. (4) చేబదులురొక్కము, (5) వట్టిపలుగాకులు, (6) గయ్యాళులు, (7) కంటవత్తిడుకొను, (8) రేపుమాపులు, (9) ఉక్కిరిబిక్కిరి, (10) కక్కసమెల్లఁజూపు, (11) పగలిఁటినిద్ర, (12) జాతరజాతరౌను, (13) ఊఁచముట్టుగాఁగొను, (14) నెఱజాణనంచు, (15) మూఁతులునాకు, (16) పూసినతంగెడు, (17) పాడియుఁబంటయు,—(18) బొట్టనవ్రేలి సున్నము, (19) ఎగాదిగఁ జూచు, (20) వెకిలితనంపుఁ గోడిగము, (21) ఎకసక్కెములాడు, (22) మిట్టిపడు, (23) చిందరవందర జేయు. (24) నవ్వులమాట.

ఈక్రిందివి కొన్ని లోకోక్తులు :—

(1) లోయనుమాయ శక్యమగు లోకముమాయఁ దరంబె?, (2) ఉప్పులేక ముప్పందుముఁ ద్రాగుదాన, (3) మంటిదైనను తనయెద్దు గెల్చునను నవ్వులమాటకుఁ గాకు, (4) ఇంటగెల్చి కద రచ్చను గెల్చుట, (5) బొట్టనవ్రేలిసున్నమున బోరగిలంబడు, (6) ఆశయలేని కూటికిఁ గాకలియును లేదు, (7) పోరున నష్టమా నెపుడు పొందిక లాభముగాదె, (8) కడవెడు పాలలోఁ బడిన కల్లుకబొట్టు పవిత్రమౌనె? (9) ఇల్లలు

కఁగఁ బంధువుగాదె?, (10) మూలలనుండు వారలను ముంగిళులం బడఁ జేయు, (11) ఎలుకలకోర్వ లేక తనయింటికిఁ జిచ్చిడుకొంట, (12) సాన క్రింది దీపముగతి నుంద్రు, (13) తల్లులగు నావులు చేలను మేయ, దూడలుఁ గడ్డికిమాత్రమై చనునె గట్లను మేయఁగ, (14) ఆఁడుకానుపే కూడదు కూడదన్న నొనఁగూడదు పుత్రులుగూడ. (15) అయ్యకు విద్యయెంతో, తిగ నమ్మకు గారవమంతె, (16) బండిల రెండుచక్రములు బాగుగనుండినఁ బాఱుఁగాని, కాకుండిన బాఱునే, (17) వడ్లతోడఁ దట్టెండెడిరీతి నుండవలె, (18) గాలిలో దీపము వెట్టి నీమహిమ దేవుఁడ చూపుమనంగ నాతఁడుఁ గాఁపుగ నుండి దీపమును గాచునె?, (19) కాని దికానెకాదు, పని కాఁగలదెప్పుడు కాకమానదు, (20) ఈలోకము ధర్మమున్నఁ బరలోకము బంధువుగాదె?

ఉపమానములు, దృష్టాంతములుగూడ సందర్భశుద్ధి ననుసరించి ప్రయోగింపఁబడినవి :—

(1) హస్తి మదించినకొద్ది, పిచ్చిదై, యేమియుఁ గాన కట్టె పరుగెత్తును ద్రోవను దప్పి, (2) పుట్టను బుట్టు పాముచలెఁ బుట్టిన గిట్టిన నేమి?, (3) పున్నమనాఁడు చంద్రునకుఁ బూర్ణకళ ల్వెలసిల్లుఁ గాని, యావన్నె యమాసనాఁటి కొకవంతయినం గలదోటు, (4) చెఱువున నీర మెంతగను జేరిన నీరముమీఁదఁ దామరా కురువుగఁ దేలియుండు నటు లుండును, (5) ముకురంబునఁ నొసటి నాణెము గన్పడుఁగాక యేరికిం గననగునే తమంతట నెగాదిగఁ జూచిన సౌరు, (6) వలువలు మాయఁగా, మడి యవశ్యము మాయ దదెట్లు?, (7) అయ్యసురేంద్రుని చేతఁ జిక్కి, పెక్కిడుముల నొంది, భూమిసుత యింతకు మూలము కైకయత్త, యేర్పడెనని దూఱెనే?, (8) ఉన్నత భూధరస్థలుల నుద్భవమైన నదుల్ చెలంగుచుఁ, దిన్నఁగ వచ్చి నాథు జలధిం జొరుఁ గాకల తగ్గు నెంచునే?, (9) నర్తకుఁ డెన్ని వేసములు నాటకమందు ధరించి యాడినన్, గుర్తెఱుఁగంగ లేక, యనుకోఁడు తను న్మటి లాఁతి వానిఁగా, (10) ముండ్లదా చెట్టయినన్ లతల్ తమకు జెంగటఁ బోషకు లల్లు వెట్టుదుర్, గట్టిగ దాని నల్లుకొని కన్నులఁ కింపగుఁ గాదె?

ఇక్కవి యీ శతక పద్యములను ఈ క్రింది రీతిని విషయ విభాగములక్రింద విభజించి చూపినాఁడు :—

(1) గ్రంథారంభసమర్థనము—3 పద్యములు; (2) ఈశ్వర స్తుతి—4 పద్యములు; (3) ఆత్మస్వతంత్రము—2 పద్యములు;—4 ధర్మతత్త్వము—18 పద్యములు; (5) శిశుపోషణ—11 పద్యములు; (6) విద్యాలాభము— 10 పద్యములు; (7) దుర్జనత్యాగము—3 పద్యములు; (8) అత్తగోడండ్రు—8 పద్యములు; (9) ఆరోగ్యము—8 పద్యములు; (10) వివిధాంశములు—36 పద్యములు; (11) మంగళాచరణము—1 పద్యము; (12) శతకాంతపద్యము 1.

బాల్యవివాహాలను ఈ కవి యీసడించినాఁడు :—

"బొమ్మలపెండ్లి మాదిరిగఁ బుత్రులకుం బసినాఁడె పెండ్లి, నా
కొమ్మని, భర్త రోజుచును నేర్పులు నేరని పిన్నకన్నెలన్
దెమ్మని వారిగొంతు కురిఁ దేఁకువతో నిడి వియ్యమందినన్
బిమ్మట వచ్చు నాపదలు బిడ్డలకేగద చూడ మానినీ!"

"కన్నులు వీడనట్టి పసికన్నెల గొంతులఁ గోసి, పెండ్లియుం
చున్న ధనంబు లొక్కపరి యూడిచి, బంధుజనంబుతోడఁ బ
ప్పన్నము మెక్కి తుట్టతుద కష్టలపాలయి, కన్యాసౌఖ్యమున్
సున్నగఁజేసి, యాకడుపుఁ జుమ్మల నెట్లు భరింతో, మానినీ!"

ఈ క్రిందిపద్యము 'విద్యాలాభ'—మను విభాగములోనిది. ఇది భర్తృహరి సుభాషిత పద్యానికి ఒకవిధముగా అనుకరణము :—

"విద్య వివేకసాధనము, విద్యయె చక్కఁదనంబు కాంతకున్
విద్య సుభూషణమ్ము, వెయివేలవిధమ్ములఁ జూడ, నీడుగా
విద్యకు లేదు వేఱొకటి, విద్య హరింపఁగరాని సొత్తు, నా
పద్యము పూర్తికై యిటులఁ బల్కుటగాదు నిజమ్ము మానినీ!"

గయ్యాళిగంపల నిరసనము :—

"మూలల నుండు వారలను ముంగిళులం బడఁజేయఁ బూని, క
య్యాలకుఁ గాలుదువ్వుచు, భయ మొక్కయించుక లేక, పెద్దద
య్యాలను బోలి యూర నవయమ్మను ద్రిమ్మరుచుండ్రు తాము, గ
య్యాళులు, వారిజోలి కెప్పుడైనను బోవఁగరాదు మానినీ!"

ఉత్తమ గృహిణీజన లక్షణము :—

"అత్తను దూలనాడిన లతాంగియు, భర్తను దిట్టినట్టి దు
శ్చిత్తయుఁ బోవుపాపమునఁ బోదను ముచ్చిలుదాననేని, కం
చిత్తు నెఱుంగనంచు సభఁ జెప్పె నరుంధతి యొట్టువెట్టి, నీ
యత్తను భర్త దూఱకు, యథార్థము సుమ్మిది నమ్ము, మానినీ!"

"నలుపలు హాయనీకు, చెలువమ్ముఁ గోలంగఁగనీకు, మేనియం
దలవడనీకు సోముగాల తూగదపుం బనిపాట లెంతయున్
దలఁపునఁ బుట్టనీకు, పెనుదాయుల కీడ్పు తలంపు లెయ్యెడన్
బిలిచినఁ బోకుమీ, తులువ చేలతనంబున నమ్మి మానినీ!"

"ఎగుఫ్ఫుగఁ దెచ్చి సొమ్ము, నిలువెల్ల ధరించిన నేమిభాగ్యమా,
విఱిగినఁ బోయిన్, బిదప వేయినుడుంగుల నిచ్చుకోవలెన్
గోరికన సంతయం, బ్రదిరియె నొద్దని యందుకు పోయెనేని, నీ
పనుఫ్ను జూడ కెంతయినఁ బల్కుదు రమ్మలు హెచ్చి మానినీ"

"వల్లభుఁ డింపు లేని తతి వన్నెలచీరలు గట్టి, పూలు ధ
మ్మిల్లమునందుఁ గూర్చుకొని మెల్లఁగఁజేరిన వీథివాకిటన్
జల్లని గాలికై తిరుగసాగిన నల్లరిబానవంచు, నీ
యుల్లము గానలేక, పెనునూహలు సేయుదురట్టె మానినీ!"



# అల్లమరాజు రంగశాయికవి

క్రీ॥ శ॥ 1860 ప్రాంతము.

"అల్లమరాజు" వంశమువారు పారంపర్యముగా పండితకవులుగాఁ గనఁబడుచున్నారు. క్రీ॥ శ॥ 1735 సం॥ ప్రాంతమువాఁడగు అల్లమరాజు బాపయకవి "గౌతమీమాహాత్మ్యము" అను గ్రంథమును రచించినాఁడు. ఇతని మనుమఁడు రంగధామకవి. (ఇతనికి రంగశాయికవి యను నామాంతరము గలదు.) "నారాయణాచల మాహాత్మ్య"మును నిర్మించి విజయనగర చినబాపభూపుని కంకిత మిచ్చినాఁడు. ఇతని కొడుకులిద్దఱు. (1) రామకృష్ణయకవి, (2) సుబ్రహ్మణ్యకవి.* సుబ్రహ్మణ్యకవి యుద్దండుఁడు. ఇంచుమించు పదిగ్రంథములకర్త. అందు శతకములుగూడ మూఁడున్నవి. ఇతనియన్న యయిన రామకృష్ణకవి "కవిచకోరచంద్రోదయము — సత్యభామావిలాసము" మొదలగు కావ్యములు రచించెను.

సుబ్రహ్మణ్యకవి సంస్థానప్రభువులను దర్శించి, వారిని మెప్పించి, యనేక బహుమతుల నందినవాఁడు. మాడుగుల సంస్థాన ప్రభువులైన

---

* అల్లమరాజు సుబ్రహ్మణ్యకవింగూర్చియు, నతని శతకములనుగూర్చియు "శతకకవులచరిత్రలో" నుండుటచేత, మరల చరిత్రచర్వణముగా వ్రాయుట యొందులకని మానితిని గాని, శ్రీవంగూరు సుబ్బారావుగారు వారియలవాటు ననుసరించి, సాహిత్యవిమర్శనకు సంబంధించిన పరిశోధనకు పూనుకొనకపోవుట యట్లుండ, "సుబ్రహ్మణ్యకవి వైదిక పక్షపాతముతో నియోగులను నిందించె" ననియు, నతఁడు కాణాద పెద్దన రచించిన "ముకుందవిలాసమును అపహరించి, యవతారికా పద్యములు మార్చి పీఠికాపుర ప్రభువైన శ్రీగంగాధరరామారాయనింగారిని మోసగించి యతని కది యంకితము చేసిన దొంగ కవి" యని యాతనిని తీవ్రముగా విమర్శించుట యుక్తము కాదని నాభావము. శ్రీవంగూరి వారి వాక్యములు గమనింపుఁడు :—

"భూతలంబున నియోగి కవిత్వముతోడ సాటి రాదందురు, బెట్టిదంబుగ నటంచురు కొందఱు మూఢమానవుల్" (సుబ్రహ్మణ్య కవి).

"సాటిరాదందురు ?"—ఎవరు ?—ఎవరైనను వారు "మూఢమానవు"లఁట ! తనకే యీతిట్టనుకొని సుబ్రహ్మణ్యకవి, పుచ్చకాయలదొంగ యనఁగనే బుజములు తడుముకొని పాప మట్లనుకొనువారిని మూఢులని తిట్టుటలో వింతలేదు. కాణాదన పెద్దన సోమయాజి ముకుందవిలాసమును సంపూర్ణముగ దొంగిలించి, యవతారికా కృత్యా

శ్రీకృష్ణభూపతిమీఁద "శ్రీకృష్ణభూపతిలలామశతకము" వ్రాసి, యాతని వలన వార్షికమును బొందుచుండినాఁడు. అంతియకాక "భద్రాపరిణయము"ను శ్రీగంగాధరరామాయణింగారి కంకితముచేసి ఆయనవలన బహుమానములు పొందినట్లు :—

"గావుగంగాధర రామరాయక్ష్మాధవుఁడు సుబ్రహ్మణ్యకవివరునకుఁ
గీసపురదుర్గ సౌధంపుఁ బెద్దకోలువునందు భద్రాపరిణయ కావ్యంబు నంది
యధికతర మాన్యభూమి, వెయ్యాలులును, సువర్ణవలయంబులును సేలువలు నొసంగె"

అని కవి తానే చెప్పుకొనినాఁడు. ఆనాఁడాసంస్థానములో, మాస వేతనముకూడ పొందుచుండెను.

"సింహాద్రిరామాధిపశతకము" చెప్పి సింహాద్రిరామందొర కంకితము చేసినాఁడు, ఆవిషయమును :—

"బ్రాహ్మీ భవ్య కృపానులబ్ధ కవితా ప్రాగల్భ్యునిన్, నన్ను, సు
బ్రహ్మణ్యాంగని, వెంకటాద్రి నగర గ్రామంబున, న్మాన్య, మా
బ్రహ్మస్థాయిగ నిచ్చి హేమకటకద్వంద్వంబు వస్త్రాళి ని
ర్జిహ్మస్వాంతతఁ గొంతిసొమ్ము నిడితౌ సింహాద్రిరామాధిపా !"

అను శతకపద్యమువలన గ్రహింపవచ్చును.

ఈవిధముగనే పాపయమంత్రి యను నమాత్యునిపై నొకశతకము కందపద్యములలో వ్రాసి సన్మానము పొందినాఁడు. ఆ మంత్రిశిఖామణి లింగపర్తిగ్రామములో మాన్యమునుగూడ నిచ్చినాఁడఁట !

"ఘన లింగపర్తిపురిం। బున సుక్షేత్రముగ రెండుపుట్లగు భూమిన్
గనకాంబరాభరణములు । నరుసగ నాకొసఁగితివి పాపయమంత్రీ!"

---

గని తగిలించి, ప్రభువును మోసగించిన సుబ్రహ్మణ్యకవిపై మాట లనఁగలఁడా? విచార్యము.

శ్రీ సుబ్బారావుగారి శ్రీప్రవిమర్శకు గురియయి "చోరకవి" యనిపించుకొనిన సుబ్రహ్మణ్యకవినిగూర్చి మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు "ఆంధ్రరచయితల"లో నుటంకించిన యీక్రిందిపంక్తులుగూడ సహృదయులు చిత్తగించుట మంచిది.

"ముకుందవిలాసములోని కవితారీతు లీసుబ్రహ్మణ్యకవి కొన్ని సంగ్రహించెను. అందలి పద్యములు పద్యములుగాఁ గొన్ని యిందున్నవి. కథలోఁగూడఁ బెద్దమార్పు లేదు. భావములు చాలవఱకు దానిని బోలినవే.... ఆకవి కవితపైఁగల యభిమానమున నీసుబ్రహ్మణ్యకవి యిటుల చేసినాఁడని సమర్థించుకొనవలయును.—సుబ్రహ్మణ్యకవి సాధారణకవి కాఁడనుట కతనిఁగూర్చిన కథలు చాలగలవు. పెద్ద పెద్ద సంస్థానములకుఁ బోయి యతఁడు చూపిన విచిత్రాశుకవితాదు లందులకుఁ దార్కాణములు." "శతక

ఈవిధముగా సంస్థానములు కొల్లగొట్టిన మహాకవి యయిన యల్లమరాజు సుబ్రహ్మణ్యకవిని "దొంగకవి"యని యెవఁడో "కశ్చన" నిందించిననే వచ్చిన యప్రతిష్ఠ లేదు.

పై సుబ్రహ్మణ్యకవిపుత్రులలోఁ బెద్దవాఁడైన రంగశాయికవి తనతండ్రియొక్కయుఁ బెదతండ్రియొక్కయు, విద్వత్కవితా ప్రతిభలను గూర్చి తాను వ్రాసిన శ్రీమదాంధ్రచంపూరామాయణములో నీరీతిగా చెప్పినాఁడు—(రామకృష్ణకవినిగూర్చి).

"రామకృష్ణకవీంద్రుఁ డాంధ్రంబునందు సంస్కృతమునందు సాహిత్యసరణిఁ దెలిసి కవిచకోరచంద్రోదయ గ్రంథముఖ్యములగు గ్రంథంబుల ననేకముల రచించె"

ఈ రామకృష్ణకవి సుబ్రహ్మణ్యకవికి విభిన్నోదరుఁడు. ఇతని కొడుకు లిరువురు :—

"రామకృష్ణకవికి సుతుల్ ప్రథితగుణులు, రంగశాయియు, రామచంద్రకవి యనఁగఁ గలిగి రిరువురు హరిభక్తికలితులగుచుఁ గీర్తినొందిరి యుచితప్రవర్తనమున!"

ఇఁకఁ దనతండ్రి యైన సుబ్రహ్మణ్యకవినిగూర్చి :—

"ఏమేటి మాద్గులకృష్ణభూపాలుని సభయందుఁ గవులచే శ్లాఘనొందె,
నేసూరి శేషధర్మేతిహాసగ్రంథమును దెనుఁగొనరించె బుధులు పొగడ
నేమనీషి రసంబులెల్ల వర్తిల్లఁగ భద్రాపరిణయ కావ్యంబుఁ జెప్పె
నేకవీంద్రుండు శ్రీకృష్ణకల్యాణ ప్రబంధంబు రచియించె భాసురముగ,
నట్టిగుణశాలి యుభయభాషానవద్య వివిధ కవితావిరచనా ప్రవీణుఁ డధిక
నృపతి సంస్థాన సన్మానహృష్టుఁడు నయి భువిని బ్రబలె సుబ్రహ్మణ్యకవివరుండు"

---

కవులచరిత్ర' కారుని విమర్శ యెంతతీవ్రమో, "యాంధ్రరచయితల" కర్తది యంత మార్దవముగాఁ గనఁబడుచున్నది.

ఇక్కడ మన మొకవిషయము గమనించుట ముఖ్యమనుకొందును. సుబ్రహ్మణ్యకవి "సాధారణకవి" కాఁడనియు నతఁడు "విచిత్రాశుకవితా" ప్రవీణుఁడనియు మధునాపంతులవారి మాటలవలనఁ దెలియుటచేత "ముకుందవిలాసము" వంటి గ్రంథము నతఁడు సృష్టించునంత శక్తిలేని 'దొంగకవి' యని యెట్లు చెప్పఁగలము? అయిన నవతారికలోని పద్యములుతప్ప, తక్కిన తాను వ్రాసిన "భద్రాపరిణయ" కావ్యమంతయు "ముకుందవిలాసము"నకు నకలగుటకు నాకొక్కటె కారణ మగపడుచున్నది. ఆకాలమునఁ బ్రభువులు తమ యాస్థానకవులను "ఇన్నినాళ్లలో నీకావ్యము పూర్తికావలయును" అని యాదేశించువారు. ఆరీతిగా, మనసుబ్రహ్మణ్యకవిగారిచతుర్విధ కవితా ప్రాగల్భ్యము నాకళించిన శ్రీగంగాధర రామారాయణింగారు ఏదో యొకదినముననో, కొన్నిగంటలలోనో యొకకావ్యము వ్రాసి తన కంకితము చేయుమని కోరగా నాగడువులోపల నంతరసవత్తరముగా కావ్యము సృష్టించుట సులభసాధ్యము కాకపోయి తన

దీనినిబట్టి సుబ్రహ్మణ్యకవి యెంతటి పాండితీసంపన్నుఁడో యెఱుకపడుటయే కాక, కాణాద పెద్దనసోమయాజిదని ప్రఖ్యాతమైన ముకుందవిలాస నామాంతర భద్రాపరిణయము తనతండ్రి దేనని యితఁడు సూక్షిగాఁ జెప్పుచున్నాఁడు.

సుబ్రహ్మణ్యకవి క్రీ॥ శ॥ 1831 నుండి 1892 వఱకు జీవించి యుండెను. అతని పెద్దకుమారుఁడయిన యారంగశాయికవి క్రీ॥ శ॥ 1860 అనఁగా రౌద్రిసం॥ము నిజాశ్వయుజ శుక్ల తృతీయా సౌమ్య వాసరమున జన్మించెనని యాంధ్రరచయితలు” చెప్పుచున్నది. ఈ గ్రంథ మీకవినిగూర్చి యితని వంశమునుగూర్చి వివరించుచు “వీరివంశమునఁ దరమున కొకకవి చొప్పున వచ్చుచున్నారు” అని తెలిపినది. “తరమునకొకరు” కాదు. “తరమున నుద్భవించిన వారందఱు” అనుట సమంజసము. సుబ్రహ్మణ్యకవి యెంతటి విద్వత్కవీంద్రుఁడో యతని జ్యేష్ఠ సోదరుఁడగు “రామకృష్ణకవి”యు నంతటి కవీంద్రుఁడే! అతఁడు కూడ తనవంతునకు, ఇదివఱకుఁ బేర్కొన్న రెండుకృతులనేకాక, మదాలసా పరిణయము, శంతనువిలాసము, అధ్యాత్మరామాయణము, అచ్చ తెనుఁగు భాగవతము, రామకృష్ణీయము (ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానము) అను గ్రంథములనుగూడ వ్రాసినట్లు “ఆంధ్రకవుల చరిత్ర” వలనఁ దెలియుచున్నది.

సుబ్రహ్మణ్యకవికి రంగశాయికవియే కాక, మఱి ముగ్గుఱు కుమారులుకూడ కలరు :—

“ఘనతఁ గనిన సుబ్రహ్మణ్యకవికిఁ జిన్నమాంబకును గల్గిరి నలుగు రాత్మభవులు,
రంగశాయియు, వేంకటరాయుఁడనఁగ మఱియు బంగారయయును సోమకవి యనఁగ”

(చంపూరామాయణము)

---

పదవు నిలఁబెట్టుకొనుటకై తఁడీపని చేసి యుండవచ్చును. అంతమాత్రముచేత ‘దొంగకవి’ యనిన ననవచ్చునేమో కాని, యది దూషణముగను కవి కుండు ప్రతిష్ఠను బోఁగొట్టునది గను తోఁచదు. పైఁగా నీకాలమువలె గ్రంథప్రచారములకుఁ దగిన ముద్రణ ప్రకటనాది సౌకర్యము లాకాలములో లేకపోవుటచేత, రాజసభలో కృతిభర్తగాని, తక్కినకవులుగాని “ముకుందవిలాసము” సంగతి యెఱిఁగియుండరు. కనుక ప్రభువు ప్రాపకము సంపాదించుకొని, ధనము, యశస్సు నార్జించవలయునని యుబలాటము కలిగిన సుబ్రహ్మణ్యకవివంటివాని కది యవసరమునుబట్టి యుపయోగించుకొనుటకుఁ జక్కని యవకాశ మిచ్చియుండవచ్చును. అంతమాత్రముచేత కవితావీథిలో విశృంఖలముగాఁ దన విచిత్రశుకవితాప్రతిభలను వెలిఁగించిన యీసుబ్రహ్మణ్యకవికి వచ్చిన యగౌరవము లేకపోఁగా

దీనిని బట్టి (1) రంగశాయికవి, (2) వేంకటరాయఁడు, (3) బంగారయ్య, (4) సోమకవి. వీరిలో మొదటియతఁడును గడపటి యతఁడును మాత్రమే కవీశ్వరులయి గ్రంథములు వ్రాసినవారుగాఁ గనఁబడుచున్నారు. ఈవిధముగా 'నల్లమరాజు' వంశము విద్వత్కవితలకు నిత్యనివాసమయినది.

అల్లమరాజు వంశస్థులారామద్రావిడశాఖా బ్రాహ్మణులు. హారితసగోత్రులు. ఆపస్తంబసూత్రులు, పిఠాపుర సమీపమందలి చేబ్రోలు గ్రామవాస్తవ్యులు. ఈరంగశాయికవి తన తండ్రివలె ద్రవ్యార్జనా లంపటుఁడు గాఁడు. యదృచ్ఛాలాభ సంతుష్టుఁడు. ఆచారప్రియుఁడు. నిష్ఠాగరిష్ఠుఁడు. సత్యవ్రతావలంబకుఁడు.

ఇతడు—(1) శ్రీమదాంధ్ర చంపూభారతము, (2) రామాయణ చంపువు, (3) రఘురామశతకము, (4) పరమాత్మశతకము, (5) సర్వేశ్వరశతకము, (6) గోవిందశతకము, (7) లక్ష్మీశశతకము, (8) మాధవ శతకము, (9) కుక్కుటలింగశతకము, (10) గోపాలస్వామిశతకము (11) మల్లికార్జునశతకము—అను గ్రంథములను తెనుఁగున రచించినాఁడు. రెండు మూఁడు సంస్కృతకృతులనుగూడ వ్రాసినాఁడు.

వీనిలో భారత చంపువు క్రీ॥ శ॥ 1913 సం॥ము ముద్రింపఁ బడినది. చంపూరామాయణముగూడ పూర్తియయి యందలి మొదటి మూఁడుకాండములను క్రీ. శ. 1926 లో క్రీ. శే. శ్రీచెలికాని లచ్చారావుగారు తమ "ఆంధ్రభాషావిలాసిని"యను మాసపత్రికలో ముద్రించి,

---

సమయస్ఫూర్తి బాగుగా నున్నదని యభినందించక తప్పదు. ఈసందర్భములోఁ దనకపఖ్యాతి వచ్చునని యతఁడు యోచింపలేదా, యనిన—నది వేఱువిషయము. ఆతనికి కృతికర్తృత్వముకంటె ధనాదాయమే ముఖ్యముగాఁ దోఁచినదని యొప్పుకొనక తప్పదు. ఆతని కవితాధోరణిని చాటుటకు అతఁడు రచించిన "శేషధర్మాత్మబోధమణిధ్వజా"ది గ్రంథములు పెక్కులున్నవి. కాని "భద్రాపరిణయము" మాత్రము కేవలము డబ్బుకొఱకే. లేకుండిన, భావికాలములో నెప్పుడో యొకప్పుడు తన గుట్టు బట్టబయలు కాకపోదని సుబ్రహ్మణ్యకవివంటి ప్రజ్ఞావంతుఁడు తెలిసికొనియుండఁ డనుకొనరాదు.

ఇతనివలె కావ్యచౌర్యములకుఁ బాలుపడినకవులు—ఇతరుల పద్యములు ముక్కకిమక్కగా తమకృతులలోనికి దిగుమతి చేసికొనిన కవులు, కృతికన్యాకరచరణములను మాత్రము తాము సృష్టించుకొని యిఁకఁ దక్కిన భాగమునంతియు నన్యుల గ్రంథముల నుండి సంగ్రహించుకొనిన కవులు, పదములను మాత్రము కొంచెము మార్చి, భావములను

తరువాత మొదటిభాగముగ పుస్తకరూపము నొందించిరి. (ఈగ్రంథము నాయొద్ద నున్నది). విషయ మిట్లుండ "ఆధునిక రచయితలు" అను గ్రంథమును సంతరించిన శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు "భోజరాజు "రామాయణచంపువు" కూడఁ దెనిఁగింప మొదలిడి బాలకాండముదాఁక రచించెనని వారి కుమారులవలన నేను విన్న విషయము" అని తమగ్రంథమున వ్రాసిరి. బహుశః శాస్త్రిగారు పొరపాటున నయిన వినియుండవలెను. లేదా రంగశాయికవి కుమారులయిన ప్రమాదపడియుండవలెను.

ప్రకృతము రంగశాయికవినిగూర్చియు, నతనిశతకములనుగూర్చియు విమర్శించుటకు పూనుకొంటిని. కాని యన్ని శతకములు లభించినవి కావు. రఘురామ, మాధవ శతకములు మాత్రము దొరికినవి. ఈరెంటిని, నాకు దొరికిన సాధనాంతరములతోను, నాధార కతిపయములతోను, కొంతవఱకు సమీక్షింతును. ఇతని నమ్రభావము మెచ్చదగినది. ప్రాచీన కవీంద్రుల ధోరణి యం దితనికి ఆసక్తి మిక్కుటము. చంపూరామాయణము అరణ్యకాండములోని యాశ్వాసాంత పద్యములు చిత్రబంధకవితానిధులు. ఇతని వినీతభావ మెట్టిదో క్రింది పద్యము చూడుఁడు.

ఇది లక్ష్మీశశతకములోనిది "ఆంధ్రరచయితల"లో నున్నది.

"కాణాదర్షి వరప్రణీతమగు తర్కం బేనెఱుంగంజుమీ!
పాణిన్యాంచితంబు వ్యాకరణ మొప్పం గొంచె మీక్షించితిన్,
వాణీనైపుణి లేదు, రాజసభలన్ వాదింపలేనమ్మ, యే
వాణిజ్యంబును నేనెఱుంగ నిఁక నంబా! లక్ష్మి! రక్షింపుమా!"

---

వర్ణనలను బూర్తిగాఁ దక్కిన కవుల కృతులలోనుండి యపహరించుకొనిన కవులు మన సాగస్వతములో లెక్కకు మిక్కిలిగాఁ గనఁబడుచున్నారు.

సాహిత్య విమర్శకులలోఁ జాలమంది యట్టివారిని, వారికావ్యములను నిదివఱకే వెల్లడించియున్నారు. కవులను దృఢముగా బంధించు లక్షణసూత్రములను వారేమాత్రము మీఱరాదను శాసనముకూడ నందులకుఁ జాలవఱకుఁ గారణ మగుచున్నది.

కవితాలక్షణములు ధీరోదాత్తాది నాయకస్వభావములు, అష్టాదశవర్ణనలు, కవిసమయములు మొదలయినవి "నిరంకుశాః కవయః" అను ప్రథను నేతిబీరకాయ పాటమునకుఁ దెచ్చినవి.

నేటి వాఙ్మయ ప్రపంచములో నట్టివానికి విలువ లేకపోయినను పందొమ్మిదవ శతాబ్దాంతమువఱకు వానిని కవులు 'తూ—చా' తప్పక పాటించుచు వచ్చినారు.

ఆ కాలములో నాశుకవులమని దేశముమీఁదికి పొట్టపోసికొనుటకు దండెత్తు చిల్లర కవినామధారుల చర్యలనుగూర్చి యితఁడు తన శ్రీమదాంధ్రచంపూరామాయణావతారికలో "కవితాప్రశంస" యను శీర్షికక్రింద నద్భుతముగ ఖండించినాఁడు. అవి తప్పక పఠితవ్యములు:—

"ఘంటకు నూఱుపద్యములు గా రచియింతుమటంచుఁ గొందఱున్
ఘంటకు నాల్గువందలుగఁ గల్పనఁజేయుదుమంచుఁ గొందఱున్
దొంటివొ, యిప్డుచెప్పినవొ, తోఁచినయట్లుగఁ గూర్తు, రూఁకదం,
పంటకు సందియంబు లవమైనను లే దవి యెంచి చూడఁగన్"

"కవితాప్రౌఢిమయున్ రసజ్ఞుఁడె యెఱుంగంజాలు, సామాన్యమా
నవులెల్లన్ దెలియంగఁజాల, రెటులన్నన్, బద్మమాధ్వీకమం
దవు మాధుర్యము షట్పదం బెఱుఁగుగా, కచ్చెంత నెల్లప్పుడున్
నివసింపంబడు వాశ్చరంబు లెఱుఁగన్నేర్చునంట వించుండరే?"

"వ్యాకరణముఁ జదువనివాఁడై, కవితరచించె నేని యది యపశబ్దా
నీకమునకు నాకరమై వాకొన నర్హంబుగాక వర్తిలుచుండున్"

"రసము లలంకృతు ల్గలిగి రాజిలుచుండెడు పద్యమొక్కటే
యొసఁగు రసజ్ఞచిత్తమున కెంతయు మోదము సంఘటింపగన్
బసగల మౌక్తికం బొకటె భామిని మోము నలంకరింపఁగా
వెసఁ దగు గ్రుడ్డిగవ్వ లొకవేయయినన్ గయిసేయఁ జాలునే?"

"పరు లపహాస్యమున్ బొనరుపందగు శబ్దము సోఁకనీక వా
విరి విరిదండశోభ నొదవింపఁగఁ జాలిన శబ్దపంక్తి వి
స్ఫురణము గల్గి తేనియల సోనలఁ బైకొనఁజేయు నర్థడం
బరమున నొప్పుచుండెడు ప్రబంధమె పేర్కొనఁ నా బుధాళికిన్"

---

సమాజములోని మానవజీవితరంగము లన్నింటిలోను మార్పులు చేయుటకు బద్ధకంకణులై పాటుపడిన శ్రీ వీరేశలింగకవివర్యులు సైతము "భాషాసంస్కరణ" మనునప్పటికి "నన్ను ముట్టుకోకు నామాలకాకి" యను విధముగా మడిగట్టుకొని కూర్చుండినారు.

ఇంతకును జెప్పవచ్చిన దేమనఁగా, "అప్పకవ్యాదులు కవితారంగములో నడుగడుగునకుఁ బ్రతి స్వల్ప విషయములోను, లక్షణనియమములను గల్పించి, శాస్త్రకర్త లనిపించుకొని నారని. అంతవఱకు బాగుగనే యున్నది. కాని యవన్నియు నమలులోఁ బెట్టవలయుననినఁ గవుల స్వాతంత్ర్యమే చంపుట యగును. తన్మూలమునఁ గవులు తా ముద్దేశించిన ప్రకారము—అనుకొనిన గడువునకు గ్రంథము పూర్తి చేయలేకపోవుటయు జరుగుచుండెడిది. మాటవరుసకుఁ బ్రబంధముల సంగతి గమనింతము. ప్రతిప్రబంధకర్తయు "గతానుగతికో లోకః" అను ధోరణిలోనే ప్రవర్తించినాఁడు :—

(1) ఒకకవికిఁ గలిగిన స్వప్నదైవసాక్షాత్కారము—అందటి కంటూజాడ్యమై వ్యాపి (2) షష్ఠ్యంతగా, నిష్టదేవతాస్తుతి, సుకవిప్రశంస, కుకవినింద, ప్రతిప్రబంధములోఁ

"చతురతలేమి వేఁగవులు సంస్కృతముఁ దెనిఁగింపఁ బూన, సం
స్కృతి యొకరీతి నుండుఁ, దెలిఁగించినయట్టి తెనుంగు దానికిన్
బ్రతి గనరాక యుండు, నిది బాగగునే యని సంస్కృతాఖ్యప
ద్ధతి విడనాడకుండ విశదంబగునట్లు తెనుంగొనర్చెదన్"

"ఆశుకవనంబుఁ జెప్పిన యంతమాత్రఁ దాము విద్వత్కవులమంచుఁ దలఁపగాదు,
శబ్దశాస్త్ర మలంకారశాస్త్ర మెఱిఁగి తగుకవితఁ జెప్పువాఁడు విద్వత్కవి యగు"

"పదలాలిత్యము లేనిదై కఠినశబ్దస్ఫూర్తి వర్తించినన్
జమువంబూచిన వారి కాకవిత లేశంబైన హృద్యత్వమొం
దమ, యంచద్వినయప్రపత్తి గుణశూన్యంబైనచో, సత్సుఖా
స్పదధాన్యామల నొప్పుసంపద ప్రశస్తంబౌచుఁ బెంపొందునే?"

"అచ్చతెనుంగు శబ్దములు నచ్చటనచ్చటఁ దత్సమంబులున్
వచ్చుచునున్నయట్లు నుడువంబడి ముత్యములుం బ్రవాళముల్
గ్రుచ్చిన పేరుతీరుగను గూర్చి సమంజసశైలితోడ వా
క్రుచ్చినకైత మంచి దనుకొంచును మెచ్చుచు నుందురు కోవిదుల్"

"సరసమైనట్టి కవితను జదువుచుండ్రు విరసమైనట్టి కవితను వినఁగరారు,
పంచదారకుఁ జీమలు పట్టుఁగాని, యుప్పునకుఁ బట్టునే చీమ యొకటియైన?"

"ఒక్కపదంబు ధాతువున నొప్పుగ సాధువుఁ జేయుచుంచనన్
బక్కన నన్య సంస్కృతి సమాసముఁ జెప్పుమనంగ, వెక్కసన్
ద్రొక్కుచుఁ, జెప్పఁజాలని నరుం డిఁక నచ్చతెనుంగుబాస *
చక్కఁగఁ గైతఁ గూర్చుటది సమ్మతమందురు పండితోత్తముల్"

---

దప్పనివయినవి, (3) పురవర్ణనాదికములు మొదలు పుష్పలావికా వర్ణనాదులవఱకుఁ ప్రబంధములలో నానువాయితీగా స్థిరపడినది, (4) నాయికా నాయక వర్ణనలు; సమావేశములు; విరహములు; సామాన్య కావ్యలక్షణము లైనవి, (5) వనవిహారములు; మలయమారుతమన్మథదూషణాదికములు, నాయికానాయక మన్మథావస్థలు. శిశిరోపచారములు అందఱుకవులకుఁ బొడిచెల్ల మయినది, (6) శుక పిక శారికా హంస విదూషకాదులు, చెలికత్తెలు మొదలగువారిలోఁ గవి కిష్టమయినవారు రాయబారములు నడపుట—పునస్సమాగమము. తప్పనిసరి యయినది, (7) శృంగార, గాంధర్వవివాహ, ప్రథమసురత వర్ణనాదులు ప్రతికావ్యమున కాయువుపట్టు లయినవి.

పెద్దననాటినుండి వీరేశలింగముకవికాలమువఱకు నిరాఘాటముగా నీపక్కిలోనే ప్రబంధ కవితారచనలు సాగినవి. ఈ సందర్భమున పింగళిసూరన కళాపూర్ణోదయ మొక విలక్షణ మార్గమును ద్రొక్కినను ప్రబంధనియమముల వాసన కొంతవఱ కున్నది. కాని ప్రబంధరీతిలో విప్లవము తెచ్చిన నూతన గతులపోకడల కాలవాలమయిన కళాపూర్ణోదయ మొక్కటే యాకాలమున వెలయఁగలిగినది; వెలసి ప్రబంధ లక్షణములకు వెదు రొడ్డి నిలువఁగలిగినది. దీనినిగురించి చాలఁపరిశోధన చేసి కీ॥ శే॥ శ్రీ కట్టమంచి రామ

"లౌకికశబ్దమర్మము నలంకృతిశాస్త్ర మెఱింగి సంస్కృత
వ్యాకరణంబునుం దెనుఁగు వ్యాకరణంబుఁ బఠించినట్టి వాఁ
డై, కవితన్ రచింపవలె నన్నను లక్షణశాస్త్రపద్ధతిన్
గైకొని చెప్పినట్టిదగు కైతను మెత్తురు సర్వసత్కవుల్"

"శరవేగంబున వ్రాయు లేఖకులకున్ శక్యంబుగాకుండఁ దొం
దరతోఁ బద్యములన్ రచింప మఱలన్ వానిన్ వినంగోరి చూ
పఱులెల్లం బఠియింపుమన్నను బునః పాఠార్హముల్గాక వి
స్తరమై తప్పులు దోఁచెనేని యపహాస్యంబుం బుధుల్సల్పరే?॥"

"అతిశీఘ్రంబుగఁ బద్యముల్ నుడివి తామత్యంతము న్విద్య నే
ర్చితిమంచున్ మది గర్వమొందుదురు వారిం జెప్పఁగానేల? పం
డితు లా పద్యము లెంచి చూచినను రూఢిన్నిల్చునే? పొల్లు వి
స్తృతి నా వడ్లను జేఁటలం జెఱఁగ నెంతేఁ దూలిపోకుండునే?"

"వ్యాకరణవిధి విరుద్ధముగాకున్న పదాళితోడఁ గవిత రచింపన్
లోకమునందున్న బుధానీకం బా కవివరేణ్యునిన్ గడు మెచ్చున్"

"ఒక యర్థంబును జెప్పుచున్నతఱి వేఱొక్కర్థమున్ దెల్పుచు
న్న కవిత్వంబు రసజ్ఞబృందమున కానందంబు సంధించి జీ
వకళన్ శోభిలుచుండు శబ్దముల శేవన్ మాఁడ్రు స్వార్థైక న
ప్రకృతార్థంబు లమర్చి చెప్పుటది సత్ప్రాగల్భ్యముం జూపదే"

---

లింగారెడ్డిగారు "కవిత్వతత్త్వవిచారము"లోఁ జర్చించుటనుబట్టి యిక్కడ నింతకంటె నెక్కువగాఁ దెలుపవలసిన యవసరము లేదు.

ఇఁక నిరువదియవ శతాబ్ది ప్రథమపాదారంభమునుండి బయలుదేరిన నవకవులు ప్రాఁతపుంతకు స్వస్తిచెప్పి, పాశ్చాత్యకవితారీతులను, కావ్యతత్త్వములను గ్రహించి, నానావిధములుగా, ఖండకావ్యములు, గేయరచనలు, భావకవిత్వములు, అభ్యుదయ గ్రంథములు వెలువరింప మొదలుపెట్టిరి.

అయినను ప్రాచీన కావ్యప్రబంధమార్గములను ద్రోసిరాజనుట మహాపచారమను పిచ్చి కొందఱి నింకను బీడించుచునే యున్నది. ఆ కారణముననే, సింహమునకుఁ గల తెల్లఁదనము, ఆకాశమునకుఁ గల నల్లఁదనము, విద్యుత్తునకుఁ గల యెఱ్ఱఁదనము, జడలకుఁగల పచ్చఁదనము, మూషికమునకుఁ గల హారిద్వర్ణము, ఇంకను మాఱలేదు. ఇప్పటికిని వారిరచనలలోఁ జకోరములు వెన్నెలపానము చేయుచుండును. స్త్రీల కాలితాఁపుల కశోకములు పూచుచున్నవి. పులినజఘనలు, పర్వతస్తన లుండినగాని వారి ప్రబంధములు సర్వసంపన్నములు కావు. అయిన నిట్టివంటి చాదస్తపు రచనల కీకాలములోఁ బూనుకొనువారు నూటికేపదుగురో యుందురు. అది యంత గణింపఁదగినది కాదు. కాని నేఁటి యువకవులు కావ్యజగత్తులో నొక తీవ్రమయిన విప్లవమునకు దారి తీసిన వేషప్పు డూ వెఱ్ఱిమొఱ్ఱి వర్ణనలు, తలతిక్క భావములు, నవకతళుకకవిత్వములు,

"శ్లేషపదయమకంబు సారెకును వచ్చుచు నున్నటుగా రచించిన
ట్టిది, యగు కైత యందఱకు డెందములందు నమందహర్షముల్
గదియఁగఁ జేయు, నర్థముల, గల్గు నలంక్రియలైన సమ్మదం
బొదవఁగఁ జేయు రెండు నవి యొక్కెడఁ గల్గిన శోభ మెండగున్"

"జనరంజనాళికి విన్నమాత్రముననే సంతోషముం గూర్పఁజా
లిన శృంగారరసంబు కల్పనరుచు ల్గీలించుచున్ మార్దవం
బున సంఫుల్లశిరీషపుష్పములతోఁ బోలింపనౌ సూక్తులన్
బొనరింపంబడినట్టి కైత సుకవుల్ భూషింప నర్హంబగున్"

ఇతని మాధవ రఘురామ శతకములలోని కడపటి పద్యము లీవిధముగా నున్నవి.

మాధవశతకములో :—

"భువిలో నల్లమరాజవంశ కలశాంభోరాశి పూర్ణేందుఁ, డా
ర్యవర శ్లాఘిత సచ్చరిత్రుఁడగు సుబ్రహ్మణ్యసంజ్ఞాక స
త్కవికిన్, జిన్నమకు న్సుతుండ, నమరంగన్ రంగశాయ్యాఖ్య నౌ
కవి, చేసి శతకంబు నీకొసఁగితిన్ గైకొమ్ము, శ్రీమాధవా!"

అనియు, రఘురామశతకములో :—

"అవనీమండలి శాలివాహన శతాబ్దానీకముల్, భారతీ
ధవ షట్భ్రాంశు గజేందు సంఖ్యలను జెందన్ హేవిలంబ్యబ్దమౌ

---

సూఁకదంపుఱ్లు వణఁగారదు; తెలుఁగుభాషాదేవి స్వతస్సిద్ధమయిన సౌందర్యముతోఁ బ్రకాశించుటకు వీలు కలుఁగదు.

ఇఁకఁ బ్రకృతమనుసరామః :—కావ్యచౌర్యములు చేయుటకుఁగూడ, (ఒక వేళ) పూర్వగ్రంథరచనా నియమములు కొంతవఱకు కడ్డు తగులును. అట్టిచౌర్యము లనేక రకములు.

(1) కావ్యచౌర్యము, (2) భావచౌర్యము, (3) శబ్దచౌర్యము, (4) అలంకార చౌర్యము, (5) విషయచౌర్యము.

భాషాస్వరూప మేర్పడినప్పటినుండి యీ పైఁ జెప్పఁబడ్డ యయిదింటిలో నేదో యొక రకమయిన చౌర్యమునకుఁ బ్రతిగ్రంథకర్త ప్రబంధకర్త పాలుపడక, కవి యనిపించుకొనలేదు. అది యసాధ్యము. అనువాదములుకూడ నొక విధముగఁ జౌర్యమే యగును. ఈక్రింద నుదాహరించునవి చౌర్యములగునో కావో పాఠకులే నిర్ణయించుట మంచిది.

1. ఎఱ్ఱాప్రెగడహరివంశములోని ప్రహ్లాదచరిత్ర, బమ్మెరపోతన "ప్రహ్లాద చరిత్ర"కుఁ గొంతవఱకైనను నాధారము కాదని యెవరైన ననఁగలరా?

2. శ్రీనాథుని (గమికర్మీకృతనైకనీవృతుఁడనై) "కంటిన్ విదర్భంబునన్ రమణీం బల్లవపాణి" యనుపద్యమును దరువాతి ప్రబంధకవులందఱు ననుకరించినవారే కదా!

3. పెద్దన మనుచరిత్రలోని "వరూధినీప్రవరాఖ్యులు;" వసుచరిత్రలోని "గిరికావసురాజులు" ఘటనావేశమయినప్పుడు జరిగిన వృత్తాంతమును దెలుపుపద్యములు భావ

ప్పు, వరుం డల్లమరాజవంశ్యమణి సుబ్రహ్మణ్యసంజ్ఞాక స
త్కవికిం బుత్రుఁడు రంగశాయికవి వేడ్కం జెప్పె నీపద్యముల్"—

అనియుఁ దన్నుఁ గూర్చియు, దనజననీజనకులఁగూర్చియుఁ జెప్పుకొనినాఁడు. పైఁగా రఘురామశతకములోఁ దద్రచనా కాలము శా॥ శ॥ 1819 అనఁగా క్రీ॥ శ॥ 1893 హేవిళంబిసంవత్సరమని కవి తెలిపినాఁడు. మాధవశతకమునఁగూడ దానిని వ్రాసిన కాలము నీక్రింది విధముగఁ దెలిపినాఁడు :—

"ధరణీమండలి శాలివాహన శకాబ్దంబుల్ మహీధ్రాగ్నికుం
జరశీతాంశులసంఖ్యచేఁ బరఁగఁ జం చద్రాక్షసాఖ్యాక వ
త్సరమందుజ్జ్వ దగు జ్యేష్ఠపుం బహుళపక్షంబందునౌ సప్తమీ
స్థిరవారంబున నెల్ల నీశతక మొందెం బూర్తి శ్రీమాధవా !"

అనఁగా, శా॥ శ॥ 1837 క్రీ॥ శ॥ 1916 రాక్షస సంవత్సర మన్నమాట. పైఁ బేర్కొన్న రెండుశతకములకు మధ్యకాలము 18 సంవత్సరములగును. దీనిని బట్టి రంగశాయికవి తన 38 ఏట రఘురామశతకమును 56 ఏట మాధవశతకమును రచించినాఁడు.

ఇతఁడు శతకములనేకాక, "చంపూభారతము"ను, "చంపూరామాయణము"ను గూడ ననువదించినట్లు పైనఁ దెలిపితినిగదా! ఇతని

---

సాన్నిహిత్యము కలిగినవి కావా ? చంద్రికాపరిణయములోని నాయికానాయకుల సందర్భములోనివి కూడ నంతేకదా !

4. ఉత్తరరామాయణములోని "అఖిల రాజాధిరాజాస్థాన జనహృద్య విద్యా విహారు లార్వేలవారు" అను పద్యమును దక్కినతెలుఁగుకవులలోఁ బెక్కురు అనుకరింపలేదా ?

5. సోమశిల ప్రాంతములోని రామావధ్యుల కొండుభట్టుగారి "వామనపురాణము"లోని పద్యములు చాలవఱకు బమ్మెరపోతన "వామనావతార" ఘట్టములోని వనుటకు సందేహమున్నదా ?

6. శ్రీవీరేశలింగముగారి యభిజ్ఞాన శాకుంతలములోని "కొందలమందె డెందము" అను ప్రాసకు ముగ్ధుఁడైన మహాకవి "కుందుజనించె నేఁడిదె" — యని లంకించుకొనినాఁడు గదా !

ఇవన్నియుఁ జోరత్వములనుఁడు, లేక యనుకరణము లనుఁడు. ఏమనినను, గవి సహజమయిన స్వభావముగనే కనఁబడుచున్నది.

1. ఒకానొకకవి (ఆధునికుఁడు) :—

"పెట్టనికోట రామునకు భీమబలుండగు సూర్యసూతి, దా
నొట్టిన మంట లక్ష్మణుఁడు యుద్ధతలంబున యోధవర్యులై

దరకుంద హీరఫణిరాడ్ఘనసార వియన్నదీ శరన్మందిర సుధారస ద్యుషదనోకహ తార శతార హార పారద సదృశత్వము.

ఇట్టివి పెక్కులు. నూతన శబ్దము ఇతఁడంతగా ప్రయోగించుట కిష్టపడని వాఁడని తోఁచుచున్నది. అక్కడక్కడ మచ్చునకో యన్నట్లు కనఁబడుచున్నవి.

(1) పడవాలు, (2) డాలు, (3) అరదాలు, (4) సిడాలు, (5) భేరీలు, (6) దర్బారు, (7) హోన్ను, (8) నెంజెలి, (9) రప్పు, ఉపమానములు చాల అందముగా ఉండును.

(1) సత్ఫలదపు నేల విత్తినము వైచిన వర్ధిలు, నూషరోర్విఁ జేరల నిడ నెట్లు మొల్చు?, (2) బకబృందములున్న సరోవరంబు రాజిల్లదు హంసయొండు నివసించిన శోభిలు, (3) గట్ల నిదాఘదాహమెల్లను నణఁగింపఁ జేయఁగ బలాహకముల్ తిగుఁగాని యట్లొనర్ప నదులుగావు. (4) దుగ్ధపు భాండము శౌండికీగతంబై చనినం జనంబులకు నాత్మల లోపల మద్యమట్లుగాఁ బ్రాచురి నొందురీతి, (5) అరణ్యమునం బటీర

గింతియగాక నీవెఱుఁగ వే మరుఁడిచ్చిన దారి చొప్పు, నీ
వింత భయంబుపై నడుగ నెల్లిదమాదువు, దాపనేటికిన్ ||”
“నిక్కడు దోఁపనేల? తరుణీకులరత్నమ! యింక నీపయిన్
జిక్కె ఘనంబు నాకు; విను చిత్తజుదండముఁ జప్పరించెదో!
చొక్క బరాంది (Brandy) మద్యముల చూరలఁ బాటిలు వేఁడిచేత, బెం
పెక్కఁగఁ జేసి—మరునింటను దూరిచి యాదరింతువో?||”

ఈపద్యములు భావచౌర్యములయినను గావు; ఫణితిచౌర్యములు. కనుక చౌర్యములనునవి సాహిత్యప్రపంచములో నేవిధముగను లేవని సమర్థించుటయే సమంజసము. ఈవిషయములో శ్రీమధునాపంతులవారివాక్యములతో నేకీభవించుట యుక్తము. శతకముల సందర్భమునఁగూడ ఈ “కాపీలు” అనుకరణములు విశేషముగా నున్నవి. వంకాయలపాటి వేంకటకవి “కోలంకమదనగోపాలశతకము”లోని పద్యములు చాల వఱకు (మకుటముమినహా) శేషప్పకవి “నరసింహశతకము”లోని వని చెప్పవచ్చును. ఇంతెందుకు—వేణుగోపాల, కుక్కుటేశ్వర రామలింగేశ శతకము లొక్క కోవలోనివే.

లౌక్యుఁడయిన సుబ్రహ్మణ్యకవి కీవిషయములన్నియు నవగతములే. కనుక నతఁడు “ముకుందవిలాసము”ను భద్రాపరిణయముగా మార్చు గారడీకి కారకుఁడయినాఁడు. అతని శతకములు విమర్శింపనందులకుఁ గారణము మొదటనే నివేదించితిని. శతకవిమర్శనకంటె నతని కాపాదింపఁబడిన నిందను దొలగించుట ప్రధానమని యింత వఱకు వ్రాసితిని.

వృష్టిమృష్టి జనించి చేసిన ఘనసౌరభ మవ్వనమందు నెల్లెడం గ్రమ్మినరీతి, (6) కోకిల రచియించు నాదము లాగి న్విని వాయసపాళి దాని నిర్ధళనము సేయఁబూను, (7) ఆవుమూత్రము పడినంతమాత్రమునఁ దప్పక పాల్చెడుఁ గాని యుప్పు తక్రము చెడిపోదు సూవె, (8) పెనుపగు శ్రద్ధ నెల్లప్పు వేమున కళకురసంబు వోసి పెంచినను దదీయ తిక్తత నశించునె?

ఈశతకములోని పద్యములు చాలవఱకు "నీతిశాస్త్రము" మనఁ బడు నూఱుశ్లోకములు గల చిన్నసంస్కృతగ్రంథములోని వాని యనువాదములు :—

1. ఉత్తమం స్వార్జితం విత్తం । మధ్యమం పితురార్జితం ।
అధమం భ్రాతృవిత్తంచ । స్త్రీవిత్త మధమాధమమ్ ॥

"నిజభుజశక్తిచేతను గడించు ధనంబు భుజించు టుత్తమం
బు, జనకునార్జితంపు ధనముం భుజియించుట మధ్యమంబు, భ్రా
తృజనుల విత్తముం దినుటయే యధమంబగు, నంగనా ధన
వ్రజ మధమాధమంబు రఘురామ! దయాహృదయా! శుభోదయా!"

2. రాజవ త్పంచవర్షాణి । దశవర్షాణి దాసవత్ ।
ప్రాప్తేతు షోడశేవర్షే । పుత్రం మిత్రవ దాచరేత్ ॥

"తనయునిఁ బంచవర్షములు దాఁకఁ గనందగు రాజపుత్రుచా
డ్పునఁ, బిదపం దశాబ్దములు బొందిన దాఁకను భృత్యురీతిగాఁ
గనఁదగు షోడశాబ్దములు గాంచిన మీఁదట మిత్రధర్మవ
ర్తనమునఁ జూడనొప్పు రఘు॥"

3. పుస్తకం వనితా విత్తం । పరహస్తం గతం గతః ।
అథవా పునరాయాతే । జీర్ణం భ్రష్టాచ ఖండశః ॥

"రమణియుఁ బుస్తకంబు ధనరాశియు నా నివి మూఁడు నన్యహ
స్తమున గతంబులైనను గతంబులెయౌ, నవి క్రమ్మఱంగఁ బ్రా
ప్తములగునట్టి కాలమున భ్రష్టయు, జీర్ణము, నల్పమైనవై
క్రమమునఁ జేరు నమ్ము, రఘు॥"

4. విద్వానేవ విజానాతి । విద్వజ్జన పరిశ్రమమ్ ।
నహి వంధ్యా విజానాతి । గుర్వీం ప్రసవ వేదనా ॥

"శ్రీలలితోక్తులం గృతిరచించు తఱిం ఘనమౌ కవిశ్రమల్
బాలిశుఁ డేమెఱుంగుఁ, గవివర్యుఁడె గాక, మహాళిఁ గన్న యి
ల్లాలె యెఱుంగుఁ గాక, ప్రసవాగత గర్భవతిశ్రమంబు గొ
డ్డా లది యేమెఱుంగు రఘు॥"

అంత్యప్రాస నియమములు :—

1. "లాభము దెచ్చునోడ, పదిలంబుగఁ గట్టినమేడ, త్రోవలో
శోభిలం జెట్లనీడ, సరసుల్ గల వాడ, సమానురాగలీ
లాభృతమైన క్రీడ, పతిలాలసయై యిలు దిద్దు ప్రౌఢయుం,
బ్రాభవ మొందుజాడ రఘు ॥"

2. "అక్షపదాఖ్యమౌని వనితా స్వభిరక్షణ దక్ష, ఘోరదై
త్యక్షయ కారి భూరి భయ దాహావదీక్ష, యశేషదైవతా
ధ్యక్ష, వలక్ష జీవన రుహాక్ష, జితాక్ష విపక్ష హాస్తి హ
ర్యక్ష, కృపాకటాక్ష, రఘు ॥"

"కామ్యములందు రోసి, కినుకం బెడఁబాసి, మదంబుఁ ద్రోసి, స
త్సామ్యత దాసి, భూతహిత సమ్మతభావనఁ జేసి, దుష్క్రియా
గమ్యపథంబు మాసి, నిజకర్మములం దెగఁగోసినట్టి శ్రీ
రమ్యుఁడె సుమ్ము యోగి, రఘు ॥"

తక్కిన శతకములలోని పద్యములకును క్వాచిత్కముగా నక్క
డక్కడ ననుకరణములు కనఁబడుచున్నవి.

1. మానవున కభ్యాసమున రానివి, పుట్టుకతో వచ్చునవి విద్యలు నాలుగఁట!

"క్షితి మనుజాళికెల్లఁ బరికింపఁగ నాలుగువిద్యలేసుమీ
చతురత నభ్యసించినఁ బోసంగవు, పుట్టుకతోన రానగున్
వితరణకౌశలంబు సుకవిత్వపటుత్వ మవార్యమైన శూ
రితయును గానశక్తి రఘు ॥"

2. నరునికి వచ్చిన పోనివి రెండు, వచ్చుచుఁ బోవుచు నుండునవి రెండు, పోయిన రానివి రెండు :—

"పోనివి రెండు, నింద యశమున్ నరుఁ బొందినపిమ్మటన్ ; సదా
పూనిక రెండు వచ్చుచును బోవుచు నుండును గల్మి లేములే ;
మానక, పోయినన్ మరల మానముఁ బ్రాణము మానవాళికిన్
రానివి రెండుసుమ్ము రఘు ॥"

దృష్టాంతాలంకారములు :—

1. "వితరణశాలికీర్తి కవిబృందముచేతఁ బ్రసిద్ధిఁ బొందిన
ట్లితరులచేత నొందదు, దది యెట్లనినన్, సుమసౌరభంబు మా
రుతమున వ్యాప్తమై మధువుఁ గ్రోలి చరించెడు మత్తబంభర
ప్రతతులచేత నౌనె? రఘు ॥"

2. బాలకుఁ డెంత తెల్విఁ గలవాఁడయినన్ గురువాదరించి, సు
శ్రీ లలరంగ శిక్ష నొనరింపుచు నేర్పకయున్న, విద్య రాఁ

జాల, దదెట్టులన్న, మణి శాణవిలీఢము గాక కాంతిధా
గాళత నెట్టు గాంచు విఘు॥"

ఇఁక మాధవశతకమునుగూర్చి :—నీతిశతకమైన రఘురామశత
కమునకు "రఘురామ, దయాహృదయా శుభోదయా" యని మకుటము
పెట్టుకొనినందునఁ గడపటి పాదమునఁ దప్పక రేఫయతి కనుగుణమైన
యక్షరము పాదాదిని (ప్రతిపద్యమునకు) నియమితముగా నుండవల
యును. కాని మాధవశతకములో నట్టిబాధ కలుగ లేదు. ప్రతిపద్యము
నకుఁ జిట్టచివర 'మాధవా' అనిమాత్రమే మకుటము :—

ఇందులోని మొదటిపద్య మీక్రిందిది :—

"శ్రీపీఠాపురమందు భక్తులను రక్షింపం దలంపూని, త
ద్వ్యాపారంబులఁ జక్కఁజేయుచుఁ గిరీటాద్యుత్తమాలంక్రియల్
దీపింపం జెలువప్పమోము దగఁ గుంతీదేవి చేతం బ్రతి
ష్ఠాపూజల్ గనియున్న నిన్ గొలిచెదన్ స్వామీ, హరీ, మాధవా"

దీనినిబట్టి పీఠికాపురములో పూర్వము కుంతీదేవిచేత నీమాధవ
స్వామి ప్రతిష్ఠింపఁబడిన దైవమని తేలుచున్నది. ఈశతకము మత్తేభ
శార్దూల వృత్తములు గలది. (రఘురామశతకము చంపకోత్పలపద్యము
లతో కూర్పఁబడినది.) వృత్తములన్న నీకవి చెవికోసికొనువాఁడుగాఁ
దోఁచుచున్నాఁడు. ఇది భక్తిశతకమైనందున విష్ణులీలలు, ముఖ్యముగా
కృష్ణభగవానుని చర్యలు విశేషముగా వివరింపఁబడినవి. భక్తిశతకము
వ్రాసిన యితరకవులవలెనే యితఁడును 51 వ పద్యమునుండి 60 వ
పద్యమువఱకు విష్ణుమూర్తియొక్క దశావతారములు వర్ణించినాఁడు.
ఇందులో నలంకారయుతములైన పద్యములు కావలసినన్ని యున్నవి.
ఎంత దుష్కరప్రాసముతోనైన నవలీలగా మనోహరముగా నితఁడు
పద్యములు సాగింపఁగల నేర్పరి. క్రింద నొండు రెండు పద్యము లుదహ
రింతును :—

"అఘవీరుత్తతిదాత్ర, దాత్రలఘుబల్యస్తోకసన్మందిర
ప్రఘణార్చావిధిపాత్ర, పాత్రనిశభా స్వర్ణగోత్ర, గోత్రాసకృ
న్నిఘసాపాదకగాత్ర, గాత్రమరమానిశ్లాఘ్యదోశ్శక్తిభా
జ్మఘవత్పుత్రకమిత్ర, మిత్రశశిశుంభన్నేత్ర శ్రీమాధవా !"

"శ్రీవత్సాంచమరఃకవాట, జలరాశిస్త్రాయమానప్రభా
వా, వార్యాశుగఝూట, యధ్యుషితరమ్యద్వారకావాట, పా

దావిష్టాష్టదిగీడ్జలాట్య, మణిదీవ్యత్కుండలద్వంద్వశో
భావిష్కారికిరీట, సంస్తువద శేషాభ్రాట శ్రీమాధవా !॥

ఇందులోను కొన్ని అనుకరణములు అగపడుచున్నవి :—

"ఈవే తండ్రివి, తల్లివీవె, చెలివీవే, ప్రాణమిత్రుండవున్
నీవే నాకిల సద్గురుండవయిరన్ నీవే సహాయుండవున్
నీవే యాపదలందు రక్షకుఁడవున్నీవే సంబా భ్రాతవున్
నీవే గాళ్లన నిన్ను భక్తిఁ గొలుతున్ నిక్కంబుగా మాధవా !"

ఇది కృష్ణశతకములోని :—

"నీవేతల్లివి తండ్రివి నీవే నాతోడునీడ, నీవే సఖుఁడౌ,
నీవే గురుఁడవు దైవము, నీవే నాపతియు గతియు, నిజముగఁ గృష్ణా"

అను పద్యమునకు అనుకరణము :—

"వినిన నీచరితంబులే వినవలె న్విశ్రాంతిమై నెప్పుడున్"

అనుపద్యము—దాశరథి శతకములోని :—

"మ్రొక్కిన నీకె మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవ యీవలెన్"

అను పద్యమునకు ఛాయ :—

ఈ యుదాహరణములు చాలు ననుకొందును. మొత్తమునకు, కర్మిష్ఠి, ధర్మిష్ఠి, భగవద్భక్తుఁడు, సత్యరక్తుఁడు అయిన రంగశాయికవి త్వమున నవ్యత లేకున్నను, మనోజ్ఞకళాలాలిత్యము పాఠకుని చదువుట కువ్విళ్లూరునట్లు చేయుట యొకవిశిష్టత.

ఈరంగశాయికవి సూర్యారాయాంధ్ర నిఘంటు కార్యాలయ ములోఁ గూడ గొంతకాలము పని చేసినాఁడు. అంతకుఁ బూర్వము గోషే గజపతిరాయప్రభువునొద్ద మూప్పదియేండ్లాస్థానకవిగా నుండి నాఁడు. తరువాత నతఁడు ఏయుద్యోగము లేక యున్నదానితోడనే తృప్తిపడి కవితావ్యాసంగము చేయుచు సుమారు డెబ్బదియైదేండ్లు జీవించి క్రీ॥ శ॥ 1936 సం॥ము కీర్తిశేషుఁడయినాఁడు.



# గండబోయిన బాలకృష్ణదాసు

క్రీ॥ శ॥ 1860 ప్రాంతము.

మదరాసులోని "యానందచంద్రికా" సంఘమువారు కొన్ని శతకములను 1914—15 సంవత్సరములలోఁ బ్రకటించిరి. అందులోని కవికృతమయిన "వీరయోగీంద్రశతక" మొకటి

దీనిని "గండబోయిన బాలకృష్ణదాసు" అను వేదాంతి రచించినాఁడు. ఇతని గురువు శ్రీముండూరి వీరయోగీంద్రుఁడు. ఈశతకమును రామతీర్థాల రామలింగయ్య ప్రకటించినాఁడు. అతఁ డీశతకపీఠికగా వ్రాసిన "సంగతి" యను వివరణములో "ఇది చిరకాలముక్రిందట నే ముద్రింపఁదలఁచితిని"—అని చెప్పుటవలన—కనీస మిది 1910 ప్రాంతములలో వ్రాయఁబడి యుండవచ్చును. అనఁగా నిప్పటికి దాదాపు 45 ఏండ్ల క్రిందట నన్నమాట. కవి వేదాంతి. అతనికి శిష్యులుకూడ నున్నట్లు తెలియుచున్నది. ఆపక్షమున శతకరచనాకాలమున కవికి 50 ఏండ్ల ప్రాయమునకుఁ దక్కువ యుండదు. పైఁగా నంత ప్రాయమైనను లేకున్న వేదాంతము ఒంటఁబట్టదు. శిష్యుల సందేహములఁ దీర్చుటకూడ నసాధ్యమే. కనుక నీకవి 19 వ శతాబ్దము ఉత్తరార్థ ప్రారంభములో జనించినవాఁడుగా నుండును.

ఈశతకము తనగురువునకే యంకితము చేసినాఁడు. ఇది యచ్చగు నాఁటికి గ్రంథకర్త జీవించియున్నాఁడనియు. రామతీర్థాల రామలింగయ్య (ప్రకటనకర్త) ఇతనికిఁ బరిచితుఁడనియు నీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

"అరయ మద్గురునాథున కంకితముగ నొనరఁజెప్పిన శతక మిదొప్పుచుండు
నవని నాచంద్రతారార్క మగుచు నెపుడు ॥"

"మేలిమిగ దీని రామతీర్థాల రామలింగయాఖ్యుండు ప్రేమ నాలించి యిట్టు
లచ్చువేయించి ప్రకటించె నందకొఱుఁగ ॥"

ఇందులో 104 గీతములున్నవి. "వీరయోగీంద్ర! విమల వివేక సాంద్ర" యని నాలుగవ పాదము పూర్తిగా మకుటము. కర్త తన కవితా ప్రాగల్భ్యమును బ్రకటించునంత 'సరకు' గలవాఁడుగాఁ గనఁబడఁడు. కవిత్వములోఁ గటుశబ్దములుకూడ లేవు. నడక ధారాళము

గను, భావములు సుగమములుగను, భాష నిర్దుష్టముగ నుండుట యీ శతకములో నెన్నఁదగిన విశేషము. కొన్ని పద్యములు గమనింపుఁడు :—

"నీటఁ బొడమిన లవణంబు నీటఁగలియు లీలఁ గనఁబడు నీదృశ్యజాల మెల్ల
నెందుఁ జెందక, తనయందె డిందుఁజూవె" ॥వీ॥

"దాఁప నేటికి ? నిలలోన ధర్మమిదియ పరుల నిందింపఁ దా ముందె పరువులెత్తుఁ
దన్ను నితరులు నిందింపఁ దాళలేఁడు" ॥వీ॥

"ధరణి నెన్నెని వేషముల్ దాల్పవచ్చు, నిరశనవ్రతదీక్షచే నెగడవచ్చు,
నాత్మవిజ్ఞాన మందుటే యరుదుసుమ్ము" ॥వీ॥

"తన్నుఁ గనకున్న మోక్షంబు తనకుఁగలదె ? తన్నుఁ గనకున్న కర్మముల్ దగ్ధ
మగునె ? తన్నుఁ దాఁ గన్నవాఁడెపో తత్త్వవిదుఁడు" ॥వీ॥

"కొండపాడవున నర్థంబుఁ గూర్చి దాత యాచకులకిచ్చి కీర్తిచే నలరుఁ బుడమిఁ
గాని, మోక్షంబు దానిచేఁ గలుగదయ్య" ॥వీ॥

ఈకవి యొక సీసమాలికకూడఁ జెప్పియున్నాఁడు. అందు 43 సీస పాదము లున్నవి. కడపట (ఈమాలికలో) కవి తన్నుఁగూర్చి యీవిధముగా వ్రాసికొనినాఁడు :—

"శ్రీ వీరయోగీంద్ర శ్రీపాదవనజాత మధుపాయమాన సన్మానసుండ
శ్రీయాదవాన్వయ క్షీరాబ్ధిచంద్రుఁడై భాసిల్లుచున్నట్టి భగవదాఖ్య
పుత్రుండ, బుధజనమిత్రుండఁ దత్త్వార్థ భావ సంయుక్త ప్రభావయుతుఁడ,
బాలకృష్ణుండనెడి పేరఁ బరగువాఁడ"

ఈశతకమును పురాణము సూర్యనారాయణతీర్థులు పరిష్కరించిన ట్లంతమునఁ జెప్పఁబడినది.



# శ్రీమత్తిరుమల వేదాంతము శ్రీనివాస దీక్షితయ్యంగారు

క్రీ॥ శ॥ 1860 ప్రాంతము.

ముద్రితమైన యితని రంగశతకమునకుఁ బై కాగితములు చినిఁగి పోయినవి. అచ్చు దాదాపు డెబ్బదియేండ్ల నాఁటిది. ఇందు 108 కంద పద్యము లున్నవి. 'రంగా' యని సర్వసామాన్యమకుటము. ఇది కావేరీ తీరములో శ్రీరంగనాథస్వామిమీఁదఁ జెప్పఁబడినది. కొన్ని పద్యముల మకుటములు. 'కస్తురిరంగా'—'పరిమళరంగా', 'మన్నరురంగా' యని కూడ నున్నవి.

కవి యెవఁడో, అతని కాలమేదో తెలిసికొనుటకు ఆధారము లేవియు నీశతకములో దొరకలేదు. కాని దీనిని నాకు పంపినవారు "శ్రీమత్తిరుమల వేదాంతము శ్రీనివాసదీక్షిత అయ్యంగా" రని పుస్తకములోని మొదటిపుటలో వ్రాసినారు. దానినిబట్టి యతఁడు ఆంధ్ర శ్రీవైష్ణవుఁడని స్పష్టమగుచున్నది. క్రీ॥ శ॥ 1860 ప్రాంతమువాఁడుగా శతకముద్రణమును బట్టి యూహించుచున్నాను.

ఇతఁ డుభయభాషలలోను ప్రౌఢుఁడయిన యుత్తమకవి యని శతకశైలినిబట్టి తెలియుచున్నది. ఇతని లోకానుభవము, భక్తి యద్వితీయములు. చక్కని, చిక్కని జాను తెనుఁగు పదములకూర్పు సందర్భానుసారముగా లోకోక్తుల ప్రయోగము, ద్రావిడ సంప్రదాయ సాంకేతికముల వాడకము, ఈశతకములోని ప్రతిపదమునఁ గనఁబడును. ద్రైవత, తురుష్క భాషాపూరితములు, శబ్దాలంకార సంకలితములు నయిన పద్యములు హృదయంగమములు. శయ్యాలాలిత్యములో పూర్వము శతకములువ్రాసిన ధూర్జటి, సూరన, తిమ్మనకవుల నితనికుద్దిగాఁ జెప్పఁదగును :—

౧. ఈక్రిందివి తెలుఁగునాఁటి వాడుకలు లోకోక్తులు :—

(1) ఒరులసొమ్ము తెచ్చుక మ్రింగే గురుఁడు గురుఁడా ?— పెద్దల తరమప్పులవాఁడుగాక, (2) మాపరువే యమభటులు చేయుపరి

భవ? మది మున్నరసి యుపేక్షించుట నీపరువే? (3) వల్లభుఁడు విడిచి పెట్టిన యిల్లాలికి దిక్కు కలదటే? (4) తలి దాఁగినిసెనని శిశువు తన జనని పదంబులను విడువఁజాలునె?, (5) అజీర్ణరోగికి పరమాన్నము నేయి గుడుపుభాతి, (6) పురిటింటిలోని శిశువుకు పెరుగన్నము కల్పి నోటఁబెట్టుట. (7) జాత్యంధునకు హిమాంశు నుదయమట్టులు, (8) కాంచవు, కొంచక నెవ్వరి, లంచము పెట్టనిదె, మాటలా? యది?, (9) యత్యాశ్రమంబు నొందుట, ప్రత్యహా మొకరింటి కూటిపద్దో?, (10) చేతం గత్తినిఁ వేసిన యాతనియెడ దివ్యచందనాదులు మేనం బూతలిడు వినులచిత్తుఁడు, (11) నీకై చాచిన నాకేలుదోయిఁ జాచి యొరుల నేయాచించఁజాల. (12) నేఁజేయు పయఃపానమున కఖిలసాగర పానీయంబైన నడ్డుపడునే.

౨. వైష్ణవసంప్రదాయ పారిభాషికములు :—

(1) దేవర తిరువుళ్ళము (శ్రీవారి అభిప్రాయము), (2) ఆళ్వారులు, (3) తిరువరంగము, (శ్రీరంగము), (4) అడివారము, (5) వడపడువు, (6) ఎడనీరు, (7) మిళహు బెరుంగాయావయు బుళిహోరం బొసఁగునూనె, (8) తిరుపణ్ణేరములు, (9) నెళిపుళితైరు.

3. సాంస్కృతికశబ్ద సంకలిత పద్యములు :—ఇందు ద్విప్రాసలు త్రిప్రాసలుకూడ ఉన్నవి) :—

"సారంగమదాంచితముఖ! సారంగసమానచికుర సారంగధరా!
సారంగహస్తవందిత! సారంగత్రాణమానసా, శ్రీరంగా!॥"

"శాంతం, శ్రీమద్రంగనిశాంతం, కీర్త్యంగనా విసారిత నిఖిలా
శాంతం, దానవచోరవరశాంతం, త్వాం త్వంభజామి సౌరభరంగా"

"సంతత మహంభజే శ్రీ, కాంతం, భక్తావనైక కరుణామయ సు
స్వాంతం, ప్రణవార్థం ప్రపదంతం, నిఖిలార్థకోవిదం శ్రీరంగా"

"అపరాధశతసహస్రా ణ్యపగత భీత్యాకృతా న్యహాన్యహాని మయా
వపశమయా ర్తియుతో క్తిం, కృపయైవాకర్ణ్య మామకీం శ్రీరంగా"

"త్వత్పదరూపక్షిప్రశతజిత్పద రామానుజార్య శేవధి రాజ
త్సత్పద యుగ్వర వరభాస్వత్పద హృదయాస్మదార్యసఖ శ్రీరంగా"

ర. తురుష్కభాషా పద పూరితములు :—

"సైరే, శ్రీరంగజమీందారు, బరాబర్, నవాబు, తాఖత్ భిర్ పా
చ్ఛారే బహదర్ ఖాబుసవారు సలామనిరి తురకవారలు రంగా"

"తీరు కమాన్దస్తా తరవారు జమాయించి కట్టి బరమా. తరహా
దారీతాంగన్ మీదన్ స్వారివెడల నిన్నుఁ గంటి, సామీ, రంగా"

౫. శబ్దార్థాలంకారములకు వినూత్నభావములకు క్రింది పద్యము లుదాహరణములు :—

వేదండవరద, మా కీవేదండ వటంచు చూపి వేట్లోకపనిగా
కోదండపాణి చనె, నిదిగో, దండము, మమ్ము నేలుకొనుమా రంగా"

"అన్నా, నీమోమున కల పున్నమ చందురుని సాటి బోలుపదగు, తా
నెన్నడు కళలం దఱుఁగకయున్నను, గమలారి గాకయున్నను రంగా"

"నీమేనిసొగసు జూడగ నీమనుజులు వేయుగన్ను లిమ్మనఁగా సు
త్రాముండు కోటికన్నులు కామించును సంతతంబు కస్తురిరంగా"

"సింగారిమొప్ప ముత్తెపుటంగి పయిన్ సాల్వగప్పు టది చలిభయమో
వెంగలుల దృష్టిభయమో, దొంగలభయమో, తలంప తోఁచదు రంగా"

"పాంచాలి శాపమిడెనని, చెంచిత పండ్లొసఁగెననియు, శ్రీచందన మ
ర్పించెను కుబ్జాంగనయని లంచము గైకొంట కీర్తిలాభమె రంగా"

"మెల్లన ఒరయూరికి వల్ల జనిభ కుంగర మొసంగి, వరసతి యడుగన్
కొల్లడములోనఁ బడెనని చల్లించితి విసుక నెంతజమపో రంగా"

"దోసెలును, సుకియ, లేలకి వాసనగల యతిరసములు, వడ లప్పంబుల్,
రాసులుగద, నీసన్నిధి, దాసులకట భుక్తిముక్తి తక్కువె? రంగా"

"తలపెంచి, జడలుదాల్చి, చలినీటన్మునిఁగి తిండిచాలించి, బిలం
బుల నున్న మోక్షమబ్బునె? ఘనముగ నీదాససేవ కలుగక రంగా"

కడపటి మంగళాచరణపద్యము పూర్తిగా సంస్కృతమే :—

"జయమంగళాని, లక్ష్మీమ్రప్రియ, తే, సతతం, భవంతు, పీనోధ్నగో
చయమధ్య దుగ్ధశీకర మయ ముక్తాకవచలక్ష్యమానస, రంగా !"



# ఆసూరి రామానుజులు

క్రీ॥ శ॥ 1860—70 ప్రాంతము.

ఇతఁడు రచించిన శ్రీరంగరంగేశ్వరశతకము క్రీ॥ శ॥ 1903 సం॥న శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది. ఇందు 101 మత్తేభ శార్దూలవృత్తము లున్నవి "శ్రీరంగరంగేశ్వరా" యనునది మకుటము. అచ్చుతప్పులు మిక్కుటముగా నున్నవి.

దీనిలోని కడపటి పద్యమువలనఁ దాండవ కృష్ణదాసను నామాంతరము గల ఆసూరి రామానుజులు దీనికిఁ గర్తయనియు, నితఁడు వేంకట కృష్ణభట్టను శిష్యుఁడనియుఁ దెలియుచున్నది. ఈకవి లోకానుభవము, ఉపజ్ఞ కలిగిన ప్రతిభావంతుఁడని యీ శతకము చూచినవారికి బోధపడును. అక్కడక్కడ లోకోక్తులు, ఉపమానములు సందర్భానుసారముగాఁ బొందించుటలో నీతడు ప్రజ్ఞావంతుఁడు. కొన్నిచోట్ల సంస్కృత వాక్యములుకూడ పద్యములలో సొంపుగా నిమిడ్చినాఁడు. చాలవఱకుఁ గవిత్వమున స్వాతంత్రి మవలంబించినాఁడు. అట్లని లక్షణ విరుద్ధ ప్రయోగములు ఎక్కువగా లేవు :—

సాంస్కృతిక ప్రయోగములకు కొన్ని యుదాహరణములు:—

(1) ఏకోనారాయణోద్వితీయ, (2) యద్భావం తద్భవతి, (3) శతం భస్మక—?

సామెతలు నానుడులు :—

(1) నిప్పులం జెదలెట్లంటును గాఢసంఘముక్రియన్, (2) కాదన్న నాచే మీఁగడ్డము బట్టుకొంటిని, (3) కొండంత దేవరఁ గొండంతయుఁ బత్రి దెచ్చి మహినెవ్వారైనఁ బూజింతురే, (4) నలినశ్రేణి దివాకర ద్యుతుల విన్నాణంబగుంగాని యగ్నిరుచిం జెన్ను వహింప నేర్చునే?, (5) చొరదంతి నెక్కినవాఁడుం ధననాథుఁడౌనే?, (6) చేతికంకణ మీక్షించుట కేల దర్పణము? (7) పూసలలో దారము, పాలలో ఘృతము పుష్పవ్రాతముం దేనె, నువ్వులలో నూనియ, (8) చందనంపుఁదరుఁ జేరంబోయి, పూఁదీఁగె పెంపెసలార న్వేసఁజుట్టి పట్టినగతిన్, (9) యోగివరుఁ డెందుంగాఁడు, వేషంబు భాసిలుఁగాని యుళిక్కిలోనితలఁపుల్, (10) హాస్తతలా

మల్కాములీల, (11) తల్లికుక్షికి సూర్యాత్మజుమందిరంబునకు నిచ్చలిక్కి యంగా రాకపోకకుఁ బాలైతి, (12) నాసలు భక్తి నోర్వరు తోఁడేలనక్, (13) స్వాతిమేల్వానం గాక మతెన్ని మేఘములు పైవర్షించినక్ శుక్తులక్ శ్రీనవ్యామలమౌక్తికంబు లగునే, (14) మేఘబిందువుల కాంతా లోకనం జేయు చాతకపక్షింబలె, (15) చెలకుంగాష్ఠము కీటకంబు బొదువం జేద్రైన చందంబుగా, (16) కడునల్పామిష లేశముం గొనుటకై గాలంబుమీనంబు తాఁ గళముం జిక్కఁగ మ్రింగినట్లు, (17) ఇక్షుభక్షణరుచిం జెన్నొందు వక్త్రంబు సుస్థిరతంగట్టిల కాసఁజేయునటవే, (18) పెనుగాలి నడి దీవి పెల్లగిలి తెప్పిర్లక్ సమర్థంబు దక్కినవాఁ డంబుధిలోన నొడ్డిగిలుమాడ్కిక్, (19) చంపవచ్చిన కుంభియేనియు నమస్కారంబుఁ గావించినం జంపంజూడదు, (20) పిచ్చుకుంటుపయి మేల్భాగీరథీ దేవిపాతెములీలక్.

వైష్ణవసంప్రదాయాన్ని అనుసరించిన ప్రయోగాలు :—

(1) తిరుతోమాలికలు, (2) అడియేక్ దాసక్.

ఇతఁడు ప్రత్యేకముగా పదిపద్యములలో దశావతారములను వర్ణించుటయేకాక, 100 వ పద్యములో (ఒకదానిలోనే) అవి వచ్చునట్లు స్తుతించినాఁడు :—

(వసురాయకవియు నిట్టిదొండు వ్రాసినాఁడు).

"ఒకపద్యంబున మీదశాకృతులు నే నూహించెదక్ మత్స్య, కూర్మ, కిటి, స్తంభజ, కుబ్జ, రామ, రఘురామా, రామ, నీలాద్రినాయక, కల్కి యనుచుక్ మనోహరముగా నస్మచ్ఛరణ్యాగ్రదేశికులౌ వేంకటకృష్ణభట్టరు కృపక్ శ్రీరంగరంగేశ్వరా !"

ఇతని కవితాప్రావీణ్యమును బ్రదర్శించు కొన్ని పద్యములు తెలుపుచు, నీశతక విమర్శనము ముగింతును.

"వినికన్నప్పుడె, చూపులున్నపుడె తెల్వక్ జిత్తమున్నప్పుడే,
తనువుక్ శక్తిగలప్పుడే, మనుమలుక్ దాతానున్నప్పుడే,
నినుఁజింతించినఁగాక, యేమగుఁదుదిక్ నిన్గేర, గోమాయుని
ల్చినచో లెక్కడ, దేవలోక మెంచటో శ్రీరంగరంగేశ్వరా !"

(రలలకుయతి).

"నాకన్దోయి నివాళిదీపములుగా, నావక్త్రమేగంటగా,
నాకక్ తెప్పలు చామరద్వయముగా, నాడెందమజ్జంబుగా,

నాకన్నాబప్పము లక్ష్మిత్రోయములుగా నాచేయుమీపాదపూ
జాకాలంబిదిగాఁ దలంతుమది లెస్సన్ రంగరంగేశ్వరా"

"అటుకుల్లంచము, పండ్లలంచమును, బల్మానకై వవలంచంబు బె
ట్టుటలేదంచును గోపగింపకు మదెట్లున్ బూజ్యాలంగేరి దూ
ఱంటరయే దాసరితప్పదండమునదీఱుం దీనులంబ్రోవఁ జూ
చెటి హస్తాబ్జము నాకుఁ జూపఁగదవే శ్రీరంగరంగేశ్వరా!"

("చూ చెటి" :—అసాధువు).

"నను జన్మింపఁగఁజేసి యింద్రియముల న్నాయందుఁ గల్పించి, యా
పనులందుందిగిగించి, పాపములు నాపైఁజుట్టి, నే, తేరకాఁ
డనుచుంబోయెదు, సూత్రధారుఁడవు నీవాడించినట్లే నటిం
చిన బొమ్మన్, దమచిత్తమెట్లునిచినన్ శ్రీరంగరంగేశ్వరా!"

"ఏపాదంబజలోకమేఁగె భృగుతా నేపాదమర్చించె, దా
యేపాదంబునఁ గాంతయయ్యో బలితా నేపాదమొందెందలన్
ఏపాదంబున గంగపుట్టె, మదినూహింపంగ నాకట్టి మీ
శ్రీపాదాబ్జములంకరించుఁ దలపై శ్రీరంగరంగేశ్వరా!"

ఈశతకము 1900 సం॥ ప్రాంతముల రచింపఁబడినదని యూహింప వచ్చును (అచ్చయినది 1903 లో) ఆపక్షమున, కవికి 30—35 ఏండ్ల ప్రాయము తప్పక యుండితీరును. కనుక అతఁడు 1860—70 సంవత్సరముల మధ్య జన్మించినవాఁడని నాయభిప్రాయము :—

కవి వీరవైష్ణవుఁడైనను పేరి తుదను ఆచార్యశబ్దముకూడ లేక పోవుటవలన, గోత్రసూత్రములేవియు చెప్పకొనక పోవుటవలన విశిష్టాద్వైతము ననుసరించి మహావిష్ణుభక్తుఁడయిన బ్రాహ్మణేతరుఁడుగా కనఁబడుచున్నాఁడు. చాత్తాదవైష్ణవుఁడని యూహించుటకు నవకాశముకలదు.

# ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రి

క్రీ॥ శ॥ 1860—1916.

గతశతాబ్ద యుత్తరార్ధమున నుద్భవమందిన యుద్దండవిద్వత్కవులలో ఈ వ్యాసమూర్తిశాస్త్రి యద్వితీయుఁడు. ఈ మహనీయునిం గూర్చి "ఆంధ్రరచయితలలో వ్రాయఁబడిన యీక్రిందివాక్యములు పండితలోకప్రసిద్ధములు :—

"ఆదివ్యతేజస్వి (వ్యాసమూర్తిశాస్త్రి), సారస్వతపీఠమునఁ గూరుచుండి సాహిత్యగోష్ఠి సలుపునపుడు సరస్వతి పుంభావమును బడసినటులు కనులపండువయ్యెడిది. ఆయన మహామహోపాధ్యాయులు కారు. కళాప్రపూర్ణులును గారు. ఈ మహాబిరుదములను దాఁటి యన్వర్థనాముఁడయిన పండిత మూర్ధరత్నమాయన. సంస్కృతాంధ్రములలో నఖండపాండిత్యము. కవితారచనలో నసమానమైన వేగము. భాష్యత్రయమునకుఁ బాఠము సెప్పినారు. ఆఱు శాస్త్రములలోఁ దగిన పరిచయము. వారినాఁట సంస్కృతాంధ్రములలో నెవరికేసందేహము వచ్చినను, వీరు తీర్చుచుండెడివారు. ప్రమాణములు గావలసినను ప్రయోగములు గావలసినను నిఘంటువులు తిరుగవేయ నక్కఱలేదు. ఆయన దర్శనమునకుఁ బోయినఁ జాలును."

విద్వత్కవులపతులగుటచే వీరి కవిత్వమునఁ బాండిత్యప్రకర్ష యెక్కుడుగఁ గన్పట్టును. అలవోకగాఁ జెప్పుపద్యముసయిత మితసి మహత్తర సారస్వతాపార పారీణతను స్ఫురింపఁజేయుచుండును. కవితలో శుచిఎక్కువ ; రుచితక్కువ. సరసులుగోరుసర కిందు దొరకక పోవచ్చును ; కాని, వాఙ్మయ వరివస్యా నిరతులగు పరిశోధకులకుఁ బరితుష్టింగూర్చుట మాత్రము నిక్కము. చెళ్లపిళ్లవారి కీశాస్త్రిగారి కయిత వెగటు గలిగించెడిది—కళాప్రపూర్ణులు వేంకటరాయశాస్త్రి కవిత్వము సహిత మట్టిదేయని యాంధ్రజనప్రతీతి. 'లోకోభిన్నరుచి'—కదా!—మొత్తముమీఁద ఈయిరువురును బ్రజాసాహిత్యదూరగులని యనుకొనవలసియున్నది. సాధుశీలుఁడగు వ్యాసమూర్తి శాస్త్రి తన కృతులనుగూర్చి యెవరేమనుకొన్నను గణించినవాఁడు కాఁడు. కళాప్రపూర్ణుఁడన్ననో — "వేంకటరాయశాస్త్రి కృతి వెంగలిమూఁక

కెఱుంగ శక్యమే''—యని, తన కవితను మెచ్చనివారిం గూర్చి వచించినాఁడు.

ఈవిషయమింతతోఁ జాలించి, యిఁకఁ బ్రకృతాంశమునకు వత్తము.

వ్యాసమూర్తిశాస్త్రి ఖండవిల్లి గ్రామమున వేంకటశాస్త్రికి వేంకటాంబయందు క్రీ॥ శ॥ 1860 సం॥మున జన్మించినాఁడు. వీరినివాసస్థానము కాకరపఱ్ఱు. ఆరామద్రావిడులు ; ఆత్రేయసగోత్రులు ; ఆశ్వలాయనసూత్రులు. వ్యాసమూర్తిశాస్త్రి, వేదుల సోమనాథశాస్త్రులవారికడ తర్కాలంకారములను. ఉపనిషద్భాష్యములను ఆదిభట్టరామమూర్తి శాస్త్రులవారియొద్దను అభ్యసించిరి. ఖండవిల్లి, క్రొత్తపేట లలోని పాఠశాలలలో నుపాధ్యాయులుగఁ బనిచేసిరి. తరువాత 1880 నుండి 1915 వఱకు రాజమహేంద్రవరమందలి బోధనాభ్యసన పాఠశాలా కళాశాలలలో సంస్కృతోపన్యాసకులుగ నుండిరి.

ఇతని కృతులు :—(1) శ్రీమహాభారతనవనీతము (పదుమూఁడు పర్వములు) ; (2) ప్రబోధచంద్రోదయము, (3) అనర్ఘరాఘవము ; (4) శుద్ధాంధ్రఋతుసంహారము ; (5) గంగాలహరీస్తోత్రము ; (6) భామినీవిలాసము ; (7) అధ్యాత్మరామాయణము ; (8) సూర్యశతకము ; (9) భారతపక్కి ; (10) పరాశరస్మృతి ; (11) కృష్ణాపుష్కరమాహాత్మ్యము.

ఇందిపుడు సూర్యశతకమునుగూర్చి యించుక పరిశీలింతము :—

పూర్వకవులలో నొకరిద్దఱు సూర్యశతకములు రచియించిరి. కాని, అవి స్వతంత్రములు. ఇది క్రీ॥ శ॥ 600—630లో హర్షవర్ధన నరేంద్రుని సభ నలంకరించిన దిగ్దంతులవంటి కవీంద్రులలోఁ బ్రసిద్ధినొందిన మయూరకవి కృత సూర్యశతకమున కనువాదము. మూలగ్రంథము స్రగ్ధరా వృత్త సంకలితము. తెలుఁగుసేఁత మత్తేభ శార్దూలోత్పల చంపకములలో నడచినది. ఇందలి వృత్తములు నూటొక్కటి. కడపటిదగు నూటరెండవదానిలో మయూరుఁడు ఫలశ్రుతియు స్వవిషయమును దెలిపినాఁడు. ఆంధ్రీకర్త మఱొక్కపద్య మధికముగా వ్రాసి యుందును, ఆతరువాతి సాంస్కృతిక గద్యయందును దన వృత్తముం జాటుకొనినాఁడు. ఆపద్యమిది :—

“భవదుపమానతా రుచిర భాస్కరవర్ణ్య మయూర సిద్ధకా
వ్య వరమనోహరార్థ పరిభావన జాత కుతూహలోల్లస
న్నవచపలత్వపూర్ణ, నధునాతన కర్ణ సుఖైషితా కృతాం
ధవివృతిపద్య, పద్యనజ దాసుని వ్యాసమునీశ, తన్నుమా”

ఈశతకమున సూర్య మహిమావబోధకములగు వర్ణనము లా ఉన్నవి :—(1) ప్రభావర్ణనము (1—43) ; (2) అశ్వవర్ణనము (44—49) ; (3) అనూరువర్ణనము (50—61) ; (4) రథవర్ణనము (62—72) ; (5) మండలవర్ణనము (73—80) ; (6) రవివర్ణనము (81—101).

ఆంధ్రీకర్త తెనుఁగుసేఁతలోఁ జూపిన నైపుణ్యమునుగూర్చి—యీశతకమునకు ‘ఉపోద్ఘాతము’—వ్రాసిన శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారి యభిప్రాయముం దెలుపు ఈదిగువ వాక్యములు గమనింపఁ దగినవి :—

“వ్యాసమూర్తిశాస్త్రిగారు సంస్కృతమున నిష్కృష్ట పాండిత్యము గలవారనుట మూలానుసరణమే వేఁథంగులఁ జాటుచున్నది. తెనుఁగున సంచుక క్లిష్టపాకమునకు, మూలార్థదోషము, వృత్తవిశేష గ్రహణమును గారణములని పునరుక్తిగా వచింపెదము. కొన్ని శ్లోకముల హీఁగు మిక్కిలి సుందరముగాఁ దెనిఁగించిరి.

“పసివాశ్వోదు విసాధమంచు దయునో వాతాశిలోకంబు పే
ర్ పదుర్ఘంబగునంచు శేషాము లోకాలోకభూభృత్తటిన్
జేప నూర్ధ్వ... భాండవ ఖండన వశనా వేగంబునన్ దోర్బద్ధనలిన్
బోసఁగినగాఁ ... కొండు నేఁగు నవిరుచ్ఛారంబు మేల్మికిదున్”

వీరు మహాప్రయత్నము లేకయే లాఘవముగలుగఁ దెనిఁగించిరి.

“బిభ్రాణా శక్తి మాశు ప్రశమిత బలవత్తారకౌర్జిత్య గుర్వీం,
కుర్వాణో నీలగూఢః శిఖి నమపి లస చ్చంద్రకాంతావభాసమ్,
ఆదధ్యా దంధకారే రతిమతిశయినీ మావహన్ వీక్షణానాం,
బాలో లక్ష్మీ ముపారా ముపర ఇవ గుహో హార్యతేరాతపో వః”

ఇందు బాలాతపము కుమారస్వామివలె నున్నదని సామాన్య ధర్మము శ్లేషలోఁ గూర్పఁబడియె. శక్తి తారకాధః శిఖి చంద్రకాంతాంధకారాది పదములు నేర్పుగాఁ దెనుఁగునఁ దేఁబడియె.

"బలవత్తారక మంత్రము సంక్షపణ శుంభచ్ఛక్తి సచ్చంద్రకాం
త లసద్ద్యోత శిఖి త్వరాక్రమిత యుద్దామాంధకారాతి పు
ష్కల నేత్రోత్సవ కారి బాలదివసేశజ్యోతి విద్యోతి ల
క్ష్ములు మీకిచ్చు ద్వితీయపావక తనూజుండో యనం జయ్యెనన్॥"

ఇందు 'అంధకారే రతిమతిశయినీం'—'చంద్రక + అంతావభాసం'—అనుప్రాసలములు సుందరముగా నాంధ్రీకరింపఁబడియె. ఇట్టి వెన్నియేని యుల్లేఖింపవచ్చును. ముక్తక గ్రంథము సీసములుగా గీతములుగా వృత్తమాలికలుగాఁ గాక, నియతవృత్తములలో న్యూనాధికతలు లేక యర్థము నుపపాదించుచుఁ దెనిఁగించిన యుత్కృష్ట కృతులలో నిది యొకటి యని కంఠోక్తిగఁ జెప్పఁదగు. మూలము సైత మించుక కఠినపాకమునఁ బడినందున నాంధ్రీకృతియుఁ గొంత కాఠిన్యము వహించెను.

ఇంతకంటె, ఈ యాంధ్రానువాదముంగూర్చి యెక్కుడుగఁ జెప్పఁదగిన దించుకయు లేదు.—మూలమునందువలెనే యిందును మకుటము గూర్పఁబడలేదు, మచ్చునకుఁ గొన్ని పద్యములు :—

"కులదైవంబో, గురుండో, తండ్రి, చెలియొకో, యయ్యఁ డాచార్యుఁడో,
వెలుఁగో, చుట్టమొ, రక్ష, దివ్వె, బ్రతుకో, బీజంబొ, నేత్రంబొ, వే
వెలుఁ, గిట్లేమని నిర్ణయింపనగు, నేవేళన్ సమస్తంబు లో
కుల కెల్లన్, సమకూర్పుఁ గోరికలు, మీకున్ దేవుఁ డాతం డిడున్॥"

"అమరస్త్రీలు త్రిసంధ్య మేరథము సమ్యగ్భక్తితో మ్రొక్కి, య
క్షమునన్ రత్నయమర్చి, కాడికొన సక్చక్రమ్ములం గూర్చి, ధూ
పము ధూస్తంభమునందు గూబరమునం బద్మమ్ము లర్పించి, చ
క్రమునం గందములంది, కొల్తు, రది దుష్కర్మమ్ముల ద్దున్మెడున్॥"

"పొగలాగగ్గికిఁ, దూర్పుగాలివలె మబ్బుం గారుకున్, బావనం
బగు నోంకారముపోలికన్ శ్రుతికి, సంధ్యానర్తనాభ్యుద్యతా
జగవేష్వానికి నంది నాందిగతి, సూక్ష్మంబున్నరెన్ సృష్టి క
గ్రగుఁ డాదిత్యుని తేరి, కిచ్చు గరుడాగ్రప్రోద్భవుం డిష్టముల్॥"

"సురబృందమ్ము మరాద్రిదారి దరులం జోతె ల్నుతుల్సేయఁ, గం
ధరవక్త్రిమ్ముల హ్రీమదశ్వముఖ కాన్తావక్త్రిము లాస్సి చే

సరిఁజ సాఁగెఁ, ద్రిప్పుచు న్మెడల నీ మన్మందతం బ్బౌలు వా
సగి కృద్వ్యాజులు మీయఘమ్ములు సముత్సారించు సువ్వేత్తుగన్ ||”

“ప్రాచిని దోఁచి, శుభ్రరుచి ప్రాభవమాఁచి, కుసుంభదంభముం
ద్రోచుచు నేచి, బూచుచు సరోజిని మించఁగ, లోకలోచనా
సేచనక త్రిలోక గృహ చిత్రవిభూషణమై, సువిభ్రమ
శ్రీచయ రాజితం, బిను మరీచి యనీచత దాఁచ నేచెడున్ ||”

ఇమ్మహాకవి ప్రణీత “భారత నవనీతము”న నిప్పటివఱ కాది పర్వ మొక్కటియే ముద్రితమని తెలియుచున్నది. తక్కినవానినిగూడ వారి కుమారులును, తిరుపతిలో నుపాధ్యాయవృత్తి నెఱపుచున్న వారును, మన్మిత్రులు నగు, శ్రీ వేంకటశాస్త్రిగారు వెలివఱచుట కుద్యమించిరేని—తప్పక నెఱవేఱఁగలదు. తన్మూలమున వారు పితౄణము నుండి పూర్తిగ విముక్తులగుదురుగాక, యని నాయభ్యర్థనము.

## నా కీపరిశోధనాకార్యమున కుపకరించిన గ్రంథములు, సంచికలు.



1. ఆంధ్రకవులచరిత్ర (శ్రీ కం. వీ. పంతులు).
2. ఆంధ్రకవుల జీవితము (శ్రీ గు. రా. పంతులు.)
3. ఆంధ్రరచయితలు (శ్రీ మ. సత్యనారాయణశాస్త్రి.)
4. సాహిత్యవీథులు (శ్రీ పి. వేం. హ. రావు.) (నాలుగు భాగములు.)
5. ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము (శ్రీ కే. వేం. రావు.)
6. చాటుపద్యమణిమంజరి (శ్రీ వే. ప్రభాకరశాస్త్రి) (రెండు భాగములు.)
7. కొన్ని ప్రాచీన శతకసంపుటములు (శ్రీ కో. రామమూర్తి.)
8. శతకకవులచరిత్ర-రెండుభాగములు (శ్రీ వం. సుబ్బారావు.)
9. శ్రీ చెలికాని లచ్చారావుగారి శతకసంపుటము.
10. శ్రీకాశీనాథునివారి శతకసంపుటము.
11. శతకసంపుటము (విజయవాడ శ్రీ వీరరాఘవశాస్త్రిగారి ప్రచురణము.)
12. శ్రీ వావిళ్లవారి (భక్తిరస శతకసంపుటములు 3 ; నీతి 1.)
13. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమువారి — శతక సముచ్చయములు. రెండు సంపుటములు.
14. మద్రాసు ప్రభుత్వమువారి లిఖితభాండాగార త్రైవార్షిక గ్రంథపట్టికలు.
15. యూనివర్సిటీ లైబ్రరీలోనివియు, రికార్డుఆఫీసులోనివియు నగు శతకసంబంధి ముఖ్యాంశములు.
16. శ్రీ రాజరాజనరేంద్రుని పట్టాభిషేక సంచిక.
17. శ్రీ పిఠాపురమురాజాగారి షష్ట్యబ్దపూర్తిసంచిక.
18. శ్రీ "త్రిలిఙ్గ"—రజతోత్సవ సంచిక.
19. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్ట్యబ్దపూర్తి సంచిక.